# మాటల మూటలు

బూదరాజు రాధాకృష్ణ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# మాటల మూటలు

బూదరాజు రాధాకృష్ణ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# నా మాట

దశాబ్దం కిందట చేస్తున్న ఉద్యోగం మానాలనే సంకల్పం కలిగింది. తెలుగు అకాడమిలో భాషాసామాజిక పరిశోధన కుంటుపడ్డది. శబ్దసాగరనిర్మాణం నెరవేరదని తేలిపోయింది. వ్యక్తిగతంగా తప్ప సంస్థాగతంగా కార్యనిర్వహణ అసాధ్యమనిపించింది. బయటపడ్డ తరవాత ఏం చేద్దామనే ఆలోచనలు ముసురుతున్నాయి. ఆ సమయంలో తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర విద్యాలయంలోని తెలుగు శాఖాధిపతి ఆచార్య జి.ఎన్.రెడ్డి పర్యాయపదనిఘంటునిర్మాణం ఆరంభించాడని తెలిసింది. ఏ భాషలోనూ ఏ రెండుమాటలూ పర్యాయపదాలుగా అన్ని సందర్భాల్లోనూ పనికిరావన్న భాషాశాస్త్ర సిద్ధాంతం గుర్తుకు వచ్చింది. అప్పటికి నేను కూడా అపనే చేయాలని కొంత శ్రమించిన మాట వాస్తవం. అయినా ఆ పని అంతటితో ఆపివేసి, భిన్నపదాలు ఎందుకు పర్యాయపదాలు కావో నిరూపించే పని చేపట్టాను.

వ్యుత్పత్తులనుబట్టి, కావ్యప్రయోగాలనుబట్టి, వ్యవహారభేదాలనుబట్టి కొన్నిమాటలు స్థూలదృష్టికి పర్యాయపదా లనిపించినా అవి సమీపపదాలో సంబంధిపదాలో కాగలవు. ఈ అభిప్రాయానికి సంబంధించిన సిద్ధాంతచర్చ చేస్తూ ఇంగ్లీషులో తెలుగులో అప్పటికే కొన్ని వ్యాసాలు రాసివున్నాను. ఆ వివరాలను నా భాషాశాస్త్ర వ్యాసాల్లో 'తెలుగు వాఙ్మయం: సంబంధిపదకోశాలు' అనే వ్యాసంలో చూడవచ్చు. ఆచరణరూపంలో ఆ సిద్ధాంతాన్ని చర్చిద్దా మనిపించింది. ఫలితం ఈ గ్రంథరూపంలోని వ్యాసపరంపర. ఇదే శీర్షికతో ఆ వ్యాసాలు 'ఈనాడు' దినపత్రిక ఆదివారం సంచికల్లో 19–6–1988 నుంచి 16–9–1990 దాకా ధారావాహికంగా వెలువడ్డాయి. రచనాకాలానికి తెలుగు వ్యుత్పత్తి కోశం కూడా నాకు అందుబాటులో లేదు. శాస్త్రచర్చలు చేయటంకన్నా చేతనైనంత సులభభాషలో సాధారణ పాఠకుల నుద్దేశించి రచించటం ప్రయోజనకర మనిపించింది. ఆ వ్యాసాలను ఇలా గ్రంథరూపంలో ప్రచురించుకోడానికి అనుమతించిన ఈనాడు అధిపతి రామోజీరావుగారికి కృతజ్ఞతలు చెప్పటం నా కనీస కర్తవ్యం.

ఆచార్య జి.ఎన్.రెడ్డిగారి తెలుగు పర్యాయపద నిఘంటువులో రమారమి 14,000 పదాలున్నాయి. వాటిని 4,336 ఆరోపాలుగా వర్గీకరించారు. అందులోని మాటలన్నిటినీ పరీక్షించి 'పర్యాయపదా'లనే మాటల మధ్యగల అర్థచ్ఛాయాభేదాలన్నిటినీ చర్చించటం నా అభిమతంకాదు. అష్టోత్తరశతనామాలూ సహస్రనామాలూ ఉన్న దేవీదేవుల పేర్లలో అనేకం మార్పులేకుండా చాలామందికి అన్వయించేవి. నేను వాటిజోలికి పోదలచలేదు. అందుబాటులో ఉన్న నిఘంటువులు పర్యాయపదాలుగా భావించిన పదాల్లో ఎక్కువ వ్యాప్తిగల వాటినిగురించే ఆలోచించాను. వ్యుత్పత్తి నిర్ణయంలో అభిప్రాయ భేదాలు సహజం. ఆర్యద్రవిడభాషావాదాలవల్ల అది తీవ్రతరంకూడా కొన్ని

సందర్భాల్లో. ఆ వ్యాసాలు వెలువడుతున్నప్పుడు కొందరు పెద్దలు ప్రతిపదానికీ సంస్కృత వ్యుత్పత్తులు చెప్తూ తెలుసుకొమ్మని నన్ను హెచ్చరించారు. కొందరు తమ పేరైనా చెప్పకుండా బండబూతులతో ఉత్తరాలు రాశారు. తాముగా తమ భావాలను వ్యక్తీకరించ(లే)క, ఎవరైనా ఆ పని చేస్తే దూషించి సంతృప్తిపడటం వారికే చెల్లు. అందుకు విచారం లేదు. మా గురువుగారు పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులవారు "ఈ వెక్కిరిపించు నయ్యల వివేకము తామటు వ్రాసినప్డెకా" అన్నమాటలు గుర్తుకువచ్చాయి. సరిపెట్టుకొన్నాను – 'పుర్రెకో బుద్ధి' అని.

ఈ గ్రంథంలో ప్రమాణాలను పేర్కొంటూ పూర్వుల వ్యాఖ్యానాలను ఉద్ధరించనందువల్ల అవేవీ చూడకుండా నాకు తోచినట్లు కల్పించి వివరించలేదని గమనించగోర్తాను. చర్చలకు నేను సిద్ధమే. దినపత్రికలో శాస్త్రప్రసంగాలకు రాసి పాఠకులను బాధించదలచుకోలేదు. భాషాధ్యయనం ద్వారా పూర్వ సంస్కృతిని, చరిత్రను పునర్నిర్మించాలనే సంకల్పమూ, ఏమాటను ఏ సందర్భంలో ఏ నిర్దిష్టార్థంలో ప్రయోగించటం మంచిదో తెలుసుకోవాలనే ఆరాటమూ యువలోకంలో కలగాలని, వారిలో భాషాసాహిత్యాలమీద అభిరుచినీ అభిమానాన్నీ కలిగించాలనే తాపత్రయపడ్డాను. అందుకని కొన్ని సమయాల్లో అక్కడక్కడ కొన్ని విసుర్లు వదిలినమాట వాస్తవం. ఆపాటి విసుర్లనుకూడా సహించలేని కేవల 'సహృదయ' పాఠకులకు నమస్కారాలు. శాస్త్రవిరుద్ధంగాని సరసప్రసంగాలను నేను బహిష్కరించలేను.

ఈ గ్రంథాన్ని కీర్తిశేషులు చండ్ర రాజేశ్వరరావుగారికి అంకితం చేస్తున్నాను. శ్రీశ్రీ మహాకవి అని మొదటిసారి గుర్తించిన మేధాశాలి ఆయన. మహానాయకుడుగా ఎదిగినా వినయమర్యాదలు మరిచిపోని విజ్ఞు డాయన. ఆయన పేరిట స్థాపించిన "సి.ఆర్. ఫౌండేషన్ ఫర్ సోషియల్ ప్రోగ్రెస్"కు నా చిరుకానుకగా ఈ గ్రంథవిక్రయం ద్వారా లభించే సొమ్మును అర్పిస్తున్నాను. నా రచనాస్వామ్యాన్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి శాశ్వతంగా దత్తం చేస్తున్నాను.

గ్రంథప్రచురణలో సహకరించిన పెద్దలందరికీ, విశేషించి రామోజీరావుగారికీ మరోసారి నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. గ్రంథముఖపత్రరచయితా వ్యంగ్య చిత్రకారుడూ అయిన చిరంజీవి పి. శ్రీధరుకు నా కృతజ్ఞతలు. భాషాభిమానులు నా యీ రచనను ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

– బూదరాజు రాధాకృష్ణ

# విషయసూచిక

# మాటల మూటలు

మన అభిప్రాయాలను ఇతరులకు తెల్పటానికి వాడేవీ ఉపయోగపడేవీ మాటలు. మన ఆలోచనలున్నంత స్పష్టంగా మాటలూ వాటి అర్థాలూ ఉంటే ఎదుటి వ్యక్తికి మన భావాలు సరిగా తెలుస్తాయి. సగటు మనిషికీ మహాకవికీ మధ్య గల భేదాన్ని వాళ్లు వాడిన మాటలను బట్టీ, వాటి అర్థాల స్పష్టతను బట్టీ గుర్తించవచ్చు. ఒకే అభిప్రాయాన్ని తెలియబరచటానికి కొన్ని సమయాల్లో వేరు వేరు మాటలు వాడ్తుంటాం. వాటిని 'పర్యాయపదా'లని పిలుస్తుంటాం. కానీ నిజానికి ఏ భాషలోనూ పర్యాయపదాలని అన్నివిధాలా సమానమైన అర్థాలుండే మాటలుండవు – వేరువేరు భాషల్లో ఉండవచ్చు. అయితే సామాన్య వ్యవహారంలో పర్యాయపదాలని పిలిచే మాటల మధ్య సూక్ష్మమైన అర్థభేదా లుంటాయి. వాటిని గుర్తించి సరైన అర్థవిశేషంలో అర్థచ్ఛాయల్లో వాడటంలోనే పాండిత్య నైపుణ్యాలు బయటపడ్తాయి. వాటి ద్వారానే సగటు మనిషికీ మహాకవికీ మహాపండితుడికీ మధ్యగల అంతరం, తారతమ్యం తెలుస్తాయి. దురదృష్టవశాత్తూ మన తెలుగు నిఘంటువుల్లో పర్యాయపదాలుగా సమీపపదాలుగా పరిగణించే మాటల మధ్యగల అర్థచ్ఛాయా భేదాల వివరణ దొరకదు. వాటిని వ్యుత్పత్తిశాస్త్రం ద్వారా, కవి ప్రయోగవిశేషాలను గుర్తించటం ద్వారా, వ్యవహారంనుంచీ మనమే తెలుసుకోవాలి.

మన సమాజాన్ని ప్రభావితం చేసే శక్తులు రెండు రకాలు, రాజకీయవాదులూ ప్రచార సాధనాలూ అని. తెలిసిగాని, తెలియకగాని, కావాలనిగాని, పక్కదారి పట్టించడానికిగాని మన రాజకీయవాదులు ఉపన్యాసాల్లో వాడి జనాన్ని ఉర్రూతలూగించే కొన్ని మాటలకు సహజంగా ఉన్న అర్థాలు వేరు – వాళ్ళు వాడుకనుబట్టి మనం గ్రహించే అర్థాలు వేరు. ఉదాహరణకు 'విన్నపం, విజ్ఞప్తి, విజ్ఞాపన' మొదలైన పర్యాయార్థాలున్న ఈ మాట రాజకీయోపన్యాసాల్లో అర్థరహితంగా ప్రయుక్తమవుతున్నది. 'ఈ లంచగొండి అవినీతి ప్రభుత్వాన్ని కూకటివేళ్లతోసహా పెకలించేదాకా నేనూ నా పార్టీ విశ్రమించమని మనవిచేస్తున్నా'నని గర్జిస్తుంటారు వక్తలు. వాక్యగత సందర్భం ప్రకారమయితే ఇక్కడ ఈ మాటకు 'హెచ్చరిక/బెదిరింపు' అనే అర్థమేగాని 'విన్నప'మనే అర్థం పొసగదు. అలాగే ప్రసారసాధనాలయిన పత్రికల్లో రేడియోలో తరచుగా కనిపించే వినిపించే సమాసం "జాతివివక్ష/వర్ణవివక్ష" అనేది. దాన్ని సరిగా "జాతివిచక్షణ" అని వాడినవాళ్ళు లేకపోలేదు. "వివక్ష" అంటే "చెప్పాలనే కోరిక". పదిమాటలలో భావాలలో ఉంటే వాటినుంచి ఒకదాన్ని వేరుచేసి "చెప్పా"లనే కోరిక వివక్ష; ఒకరినుంచి మరొకర్ని వేరుచేసి "చూడటం" విచక్షణ. జాత్యహంకారవాదులు ప్రదర్శిస్తున్నది ఇందువల్ల విచక్షణేగాని వివక్షకాదు. వాళ్లు కోరిక దగ్గరే ఆగిపోలేదు.

వేరుగా చూస్తున్నారు. కొన్ని సమయాల్లో పెద్ద కవులు కూడా నిర్లక్ష్యం వల్ల తొందరపాటువల్ల ఇలాంటి ప్రయోగాలు చేస్తుంటారు. మచ్చుకు 'పలనాటి వీరచరిత్ర'లో "జననితో సమమైన జంతువులే"దని బాలచంద్రుడంటాడు. ఆశుకవిత్వంలో యతికోసం తల్లిని 'జంతు'వన్నాడు! వేదాంతుల దృష్టిలో మనమంతా 'పశువు'లమే కావచ్చు. శివుడొక్కడే 'పశుపతి' కావచ్చు. కానీ ఆ ప్రయోగం బాగున్నదనగలమా?

మాటలను అచితూచి మాట్లాడటంలో నేర్పుతోబాటు విజాయితీ కూడా కావాలి. వాటికన్నా ముఖ్యంగా అర్థజ్ఞానం, శబ్దజ్ఞానం కావాలి. ఈ దృష్టితోనే పూర్వ మోపండితుడు తన కొడుకుతో "యద్యపి బహునాఽధీషే తథాఽపి పఠపుత్ర! వ్యాకరణమ్, స్వగణః శ్వగణో మాభూత్" అని చెప్పాడంటారు. అనేక విషయాలు సరిగా తెలుసుకుందామంటే వ్యాకరణం నేర్చుకొమ్మన్నాడు. అందువల్ల 'స్వగణం' అనేది 'శ్వగణం' కాదన్నాడు. స్వగణమంటే మనవాళ్లు, బంధువులన్నమాట. శ్వగణమంటే కుక్కలగుంపు! ఉచ్చారణ భేదంవల్ల, రాయటంలోని పొరపాటువల్ల అర్థాలు మారిపోతాయి. వీటిని నేర్చుకోవటం ప్రాథమికం. రాతకూతలు సరిగా నేర్చినవాళ్లు కూడా పొరపాటు పడేది ఏ సమయంలో ఏ అర్థ విశేషంలో ఏ మాట మాట్లాడాలో రాయాలో తెలియక. అందువల్ల మామూలుగా మనం మాట్లాడే, రాసే మాటల మధ్యనున్న విస్పష్టమైన అర్థభేదాలు గుర్తించి ప్రయోగించటం మంచిది.

మాటలకు అర్థాలను నిర్ణయించేది వాక్యంలోని సందర్భం. తక్కిన మాటలతో ఒక మాటకున్న పరస్పర సంబంధం ద్వారా అర్థం తెలుస్తుంది. అర్థాలు ప్రధానంగా రెండురకాలు: యౌగికార్థం, రూఢ్యర్థం అని. పదంలోని ధ్వనిభాగాలకున్న విడివిడి అర్థాలను బట్టి చెప్పే వ్యుత్పత్త్యర్థాన్ని యౌగికార్థ మంటారు. ఇది కేవలం కల్పితం. వాడుకనుబట్టి నిర్ణయించుకొనేది రూఢ్యర్థం. ఇదే పరమప్రమాణం. వ్యుత్పత్తికి విరుద్ధమయినా వాడుకలో నిలిచిన అర్థమే ప్రబలమయింది. ఈ రెంటినీ గుర్తిస్తూ పదాలమధ్య ముఖ్యంగా పర్యాయపదాలనే సమీప పదాల మధ్య – కనిపించే వినిపించే అర్థవిశేషాలను పరిశీలిద్దాం. విడివిడి మాటల అర్థ విశేషాలనుగాక దగ్గరి సంబంధమున్న మాటలకుగల అర్థచ్ఛాయలు గుర్తిద్దాం.

★ ★ ★

# నమస్కారాలు

నిత్యవ్యవహారంలో మనం మాట్లాడే మాటల్లో మర్యాద ప్రదర్శనగా 'నమస్కారం' లాంటి మాటలు వాడుతుంటాం. పసిపిల్లలని తాతగారికి 'నమస్తే చెప్పు' అని ప్రోత్సహించి అలవాటు చేస్తాం. ఇది నమస్కారంలాగా నామవాచకంకాదు. "నమః-తే" (తే-నీకు, నమః-దండం) అనే చిన్న సంస్కృత వాక్యం. పూజలు చేసేటప్పుడు 'నమస్తుభ్యం' (తుభ్యం-మీకు, నమః-దండం) అని దేవతలకు చెప్తాం. మనుషులకేమో ఏకవచనరూపమైన 'తే' వాడుతున్నామన్నమాట. ఈ నమస్కారం అనేక విధాలు. దణ్ణం పెట్టే పద్ధతుల్లో గాక వాడే మాటల్లో కూడా అర్థభేదాలున్నాయి.

'నమస్కారం, నమస్సు, నమస్య, నమస్కృతి, నమోవాకం' మొదలైన పదాలన్నీ ఇంచుమించు సమానార్థంగల సంస్కృతపదాలు. వీటన్నిటిలోనూ 'నమ్' అనే ధ్వని వినిపిస్తుంది. వంగిపెట్టే దణ్ణమని వీటికి సామాన్యార్థం. 'నమస్-కారం, నమస్-కృతి' అనే మాటల్లోని 'కారం, కృతి' అనే భాగాలు 'పని' అనే అర్థంగలవి. నమోవాకమన్నప్పుడు దండం పెడుతున్నామని నోటితోచెప్తూ ఆ పని చేయటమనే విలక్షణార్థం కూడా ఉంది. 'వాకం' అనేది 'మాట' అనే ప్రత్యేకార్థమిచ్చే భాగం. నమస్య-అనే మాటకు పూజ, సేవ-అనే అర్థాలు కూడా ఉన్నాయి. కొందరు నిఘంటుకారులు 'నతి, నమ్రత' అనే మాటలను కూడా సమానార్థకాలుగా పరిగణించారు. నతికి వంగటమనే అర్థం, నమ్రతకు వినయమనే అర్థం అదనంగా ఉన్నాయి. ఒళ్లంతా కాకపోయినా కనీసం తలయినా వంచిపెట్టే దణ్ణాలకు మాత్రమే ఈ మాటలు అర్థవంతంగా సరిపోతాయి. ఇవేకాక "అభినుతి, ప్రణతి, ప్రణామం, ప్రతిపత్తి, వందనం, వందారు(వు)" మొదలైన సంస్కృతపదాలు ఇంచుమించు నమస్కారమనే అర్థంలోనే వాడుకలో ఉన్నా 'వందనం' అనేది బహుళ వ్యాప్తిలో, 'వందారు(వు)' అనేది వైష్ణవుల వాడుకలో ఉన్నాయి. నమోవాకంలాగానే వందనం, వందారు(వు)లు తమ గోత్రనామాలు కూడా చెప్తూ 'కాళ్ళు తాకుతూ' చేసే నమస్కారాలన్నమాట. ప్రణిపాతం, ప్రణిపత్తి, అభివాదనం – అనే మాటలు కూడా ఇలాంటివే. ఇప్పుడు అభివాదనం చెప్తున్నామేగాని వంగటమూలేదు-కాళ్ళు తాకటమూలేదు! ప్రతిపత్తి అనేది వైష్ణవులకు ప్రత్యేకమయిన మాట. ఇక 'సాష్టాంగ (నమస్కారం)' సంగతి చెప్పనక్కరలేదు. మొహమూ, రొమ్మూ, రెండుచేతులూ, రెండు మోకాళ్ళూ, రెండు కళ్ళూ-వెరసి ఎనిమిది శరీరభాగాలూ నేలను తాకేటట్లు బోర్లాపడిపెట్టే దణ్ణమిది! ఇంతశ్రమా పడకుండానే నోటిమాటగా 'సాష్టాంగం' అనే వినయవంతులు లేకపోలేదు. "సాష్టాంగ దండ ప్రణామా"లని నోటితో పలికేవాళ్ళూ ఉన్నారు. దండం (కర్ర)లాగా బిర్రబిగిసి బొక్కబోర్లాపడి పెట్టే దణ్ణాన్ని ఈ పేరుతో పిలుస్తారు. ఇంత పొడుగు మాటెందుకని సూక్ష్మంలో మోక్షంగా 'వందే' అనే వాళ్ళున్నారు. 'అహం(నేను) వందే (నమస్కరిస్తున్నా)' అనే వాక్యానికిది సంక్షిప్తరూపం. వందే అనేది

నామవాచకంకాదు; క్రియారూపమే. ఇవన్నీ సంస్కృత పదాలే. వీటన్నిటిలోనూ వాడుకలో ఎక్కువగా వినిపించేవి 'నమస్కారం, వందనం, అభివాదం' అనేవి.

తెలుగులో ఇలా ప్రత్యేకార్థాలుగల మాటలున్నాయి. వీటిలో ఎక్కువ వాడుకలో ఉన్నవి "దండం/దణ్ణం, (రాజకీయవాదుల పుణ్యమా అని) జోహారు, (ఆడపిల్లల వాడుకలో అర్థం గుర్తించిగాని లేకుండాగాని) గొబ్బిళ్ళు" అనేవి మూడే. దండం అంటే నమస్కారం – తెలుగులో దణ్ణమని, దాన్నే మరోవిధంగా పలుకుతుంటాం. గొబ్బిళ్లంటే చుట్టూ తిరుగుతూ (ప్రదక్షిణం చేస్తూ) పెట్టే దండాలు. జోహారు అనే మాట వ్యుత్పత్తి ఏమిటో స్పష్టంగా తెలియదుగాని దాని వాలకం చూస్తే అది 'అచ్చ తెలుగు' కాదనే అనుమానం పుడ్తుంది. దానికి 'జొహారు, జొహారువు, జోహారువు' అనే రూపాంతరాలు నిఘంటువుల్లో కనిపించటం అందుకు ప్రధాన కారణం. ఈమాట ఏ ప్రాకృత భాషాభేదం నుంచో దిగుమతి అయిందని అనుమానించవచ్చు. పెద్దరికం ప్రత్యేకతలను గుర్తించి పూర్వం కీర్తిశేషులకు మాత్రమే 'జోహార్లు' చెప్పేవాళ్ళు. ఇప్పుడు బతికున్న వాళ్లక్కూడా చెప్తున్నారు! ఏం చేస్తాంమరి? అలాగే దేవతలకు 'జేజే'లు చెప్పేవాళ్ళు పూర్వం. రెండెందుకని ఒకే 'జే'తో సరిపెట్టుకున్న కవులు కూడా ఉన్నారు మనకు. ఈ మాట(ల)కు 'దేవుడు, దీవన' అనే అర్థాలు కూడా ఉన్నాయి. నిజానికిది సంస్కృతంలోని 'జయ' (ఇప్పటి 'జై') అనే పదానికి మారురూపం. ఇలాంటివే 'జోత, జోతం, జోతాం' అనేవి. ఎరువు మాటలుగా వచ్చి తెలుగు పుస్తకాల్లో చోటు సంపాదించుకొని 'అచ్చ తెలు'గయిపోయిన మాటలివి. వీటన్నిటికీ 'దండం' అనే అర్థం. దండంమటుకు నిక్కచ్చిగా తెలుగు మాటే (సంస్కృతంలో దండమంటే 'కర్ర'!)

'దోసిలిపట్టి పెట్టిన దండం' అనే ప్రత్యేకార్థంలో కొన్ని తెలుగు మాటలున్నాయి; 'కయిమోడ్పు/కైమోడ్పు, కేలుమోడ్పు, చేమోడుపు, చేమోడ్పు' అనేవి. కానీ ఇవి పుస్తకాల్లో మాత్రమే నిలిచిపోతున్నాయి. ఏ భజన సమయంలోనో ఎగురుతూ పెట్టే దండాలకు 'గిడిగిడి/గిడిగిళ్ళు, చెంగనాలు' అనే మాటలున్నాయి. అయితే మన ఇప్పటి వాడుకలో చెంగనాలు పెట్టేవి దూడలు మాత్రమే! గోత్ర ప్రవరలు చెప్తూ పెట్టే తెలుగు దండాలకు 'ఏటికోళ్ళు' అని పేరు. శ్రీనాథుడు ఎప్పుడూ వీటిని 'సమర్పించేవాడు' దేవుళ్లకు! బోర్లాపడి పెట్టే తెలుగు దండం పేరు 'జాగిలి'. ఈ మాటను ఎవరూ వాడుతున్నట్లు లేదు. 'టెంకణం' అనే మాటకూడా ఉందిగాని దాని వివరం తెలియటం లేదు. వాలకం చూస్తే అది ఎరువుమాటే అయివుండాలి. 'దీవెనకోల' అంటే దండం అని నిఘంటువులు చెప్తాయిగాని అర్థం సరిపడినట్లు లేదు.

అచ్చం తెలుగు మాట మొక్కు. (పూర్వభాషలో మ్రొక్కు). 'మ్రొక్కుడు' అనే రూపాంతరం కోశాల్లో కనిపిస్తుంది కాని వాడుకలో లేదు – ఉంటే దాన్ని 'మొక్కుట'మంటాం. ఈ మాట దేవతలను కోరికలు తీర్చమని కోరుతూ బతిమాలటానికీ, ముడుపులు కట్టడానికీ, సంబంధం లేకుండా వాడం. ఇక 'పొర్లు దండాలు, దొంగదణ్ణాలు' వంటి మాటల సంగతి చెప్పనక్కర్లేదు. మొదటిది భక్తి

తీవ్రత ప్రదర్శించేదయితే రెండోది 'నటన'కు పరిమితమయింది! 'హలో', హాయ్' వగైరా అతినవీనాంగ్లపదాలు పలకరింపులేగాని దండాలు కానేకావు. బహుశా 'బావ్పుమ దొరా, నీకాల్మొక్కుతా' నన్నవాడే నిజంగా దణ్ణం పెడ్తున్నవాడేమో మరి! అన్నట్లు 'రాం రాం' అన్నా నమస్కారమేనా?

నమస్కారమనేది అన్ని సమయాల్లోనూ గౌరవ మర్యాదలు చూపటానికి వాడేమాటేనా? మరి 'సలాం' అనేదో? ముస్లిం పద్ధతిలో తలవంచి పెట్టే దండం సలాం. తదితరులు ఆ మాటను వాడరని చెప్పలేం. కానీ వాక్యగతంగా ఈ నామవాచకాలను ప్రయోగించినప్పుడు అర్థంలో కొన్నిసార్లు మార్పు వినిపిస్తుంది. 'సలాం పెట్టు, సలాంకొట్టు' అనే రెండు చిన్నవాక్యాలు తీసుకోండి. మొదటి వాక్యం గౌరవం సూచిస్తే, రెండోది ఈసడింపును, విసుగును, విరక్తిని ప్రదర్శిస్తుంది. "నీకూ నీ పెద్దలకూ ఒక దండం/వెయ్యి దణ్ణాలు" అన్నా, "ఆ పనికి ఒక్క దణ్ణంపెట్టి బయటపడ్డాను. నీకూ నీ సాయానికీ ఓ నమస్కారం" మొదలుగా పలికినా సలాం కొట్టడంవంటి అర్థమే వస్తుంది. ఈ అర్థవిశేషం అసలు మాటకు లేదు; సందర్భాన్నిబట్టి, ఆ మాటలు పలికేటప్పటి ముఖకళవళికలనుబట్టి, కంఠస్వరంలో ప్రదర్శించిన భేదాన్నిబట్టి, వాక్యరచనవల్ల వస్తుంది. ఈ భేదాలను అనుభవం నేర్పుతుంది; వ్యవహారం తెలుపుతుంది.

'వందే, నమస్తే' వంటివి క్రియారూపాలనుకున్నాం. 'నమస్కరించు, ప్రణమిల్లు, అభివాదించు, నమించు' వంటి సాంస్కృతిక క్రియాపదాలున్నాయి. 'కేలుమోడ్చు, కేల్మొగుచు, కైమోడ్చు, కొలుచు, మొక్కు, మోకరిల్లు, మొగ్గతిల్లు, మొగ్గు, కైవాల్చు, కొలుచు, ఎరగు, కాల్మొక్కు, సాగిలపడు, మోకరిల్లబడు, చేవిప్పు, కైవాల్చు, అయిదు పదిసేయు, దణ్ణం/దండం పెట్టు, దోసిలిఒగ్గు' వంటి క్రియారూపాలున్నాయి. 'చేతులు ముకుళించు' వంటి మిశ్రపదాలూ లేకపోలేదు. 'కేలు, కై, చే' అనే మాటలకు చేయి అని అర్థం. భక్తి గౌరవాలను ప్రదర్శించేటప్పుడు చేతులచేత చేయించే పనిని సూచించేమాటలవి. 'మోడ్చు, మొగుచు, ముకుళించు, వాల్చు, ఒగ్గు' అనేవి దోసిలిపట్టి దణ్ణం పెట్టడాన్ని సూచిస్తాయి. రెండు చేతులకూ కలిసి మొత్తంమీద ఉన్న పదివేళ్లనూ దోసిలిపట్టి ఒకచోటకు చేర్చినా (అయిదు పది చేసినా) అదోవిధంగా నమస్కరించటమే. దోసిలి గుండె దగ్గర ఉంటే పెద్దలకూ, తలమీద ఉంటే దేవతలకూ నమస్కరించినట్లు. 'సలాం' పద్ధతే వేరనుకోండి. 'సలాం చేయట'మూ 'సలాం పెట్టడ'మూ కొంచెం భేదం కలవే. సలాం చేసేటప్పుడు తల కొద్దిగా వాల్చి అరచేతిని గడ్డందాకా తెస్తే, సలాం పెట్టేప్పుడు వ్యక్తిగూడా వంగాలి. ఎంతవంగితే అంత గౌరవం చూపినట్లు, ఎన్నిసార్లు వంగితే అంత ఎక్కువ గౌరవమున్నట్లు. అందుకే వంగి వంగి సలాం పెట్టాడంటాం.

వంగటం ఇస్లాం పద్ధతి మాత్రమే కాదు. 'ఎరగు, మోకరిల్లు, మొగ్గతిల్లు, మొగ్గబడు, మోకరిల్లబడు, సాగిలబడు' అనేవన్నీ నమస్కరించే వ్యక్తి వంగాలని సూచిస్తాయి. 'మోకరిల్లు, మోకరిల్లబడు' అనేవాటికీ మోకాలు/మోకాళ్లు మడిచి దణ్ణం పెట్టడానికీ ఏదో సంబంధముంది. రాజులదగ్గర అలా మోకాళ్లువంచి ఆయుధం పాదాల దగ్గర పెట్టి భక్తి తాత్పర్యాలు ప్రదర్శించటం అన్ని సమాజాల్లోనూ సంస్కృతుల్లోనూ

కనిపిస్తుంది. 'సాగిలపడు' అనే సాష్టాంగపడి నమస్కరించాలని సూచిస్తుంది. మొగ్గతిల్లు వంటివి వంగి దణ్ణంపెట్టడానికి గుర్తులు. మొక్కుకూ మొక్కుబడికీ ఏదో సంబంధముందనుకోనక్కరలేదు. అమాట ద్వారా ఎలా నమస్కరించాలో తెలీదు. కానీ వంగాలనే సూచన తప్పకుండా ఉంది. 'ఎరగు' అంటే 'వాలు' అని. అర్థం కాళ్లమీద పడి దణ్ణం పెట్టడమన్నమాట.

మొత్తంమీద మనకున్న గౌరవాన్ని చూపటానికి నమస్కరిస్తాం. కనీసం తలయినా వాల్చటం, చేతులు దోసిళ్లు పట్టడం తప్పదు. మోకాళ్లు మడిచి నమస్కరించటం రాజులు, సేనాపతులూ అపేక్షిస్తే దేవుడికిపెట్టే దండంలో దోసిలిపట్టి గుండెదగ్గర చేతులుంచటం కనీసమర్యాద. చేతులు పైకెత్తి – అంటే తలమీద వీలయినంత ఎత్తుకుపెట్టి – నమస్కరించటం పెద్ద మర్యాద – శ్రీకృష్ణుడికి గోపికలు పెట్టినట్లు. సాగిలబడటం మరో తీరు. పొర్లు దణ్ణాలు నేలమీద సాగిలబడి పక్కలకు దొర్లుతూ పెట్టేవి. సాధారణంగా మొక్కుకున్నవాళ్లే ఈ విధంగా నమస్కరిస్తారు.

# భక్తిప్రపత్తులు

ఇలా పెట్టే దణ్ణాలవల్ల మన 'భక్తిప్రపత్తులు' బయటపడ్తాయి. 'భక్తి' అనే మాటకు "భాగం, విడలీత, సేవ, దేవుడిమీద అనురాగం" వగైరా అర్థాలున్నాయి. మొదటి రెండు అర్థాలూ నమస్కరించేటప్పుడు మనం వ్యక్తపరిచే భావాలకు సంబంధించినవికావు. ఇది సంస్కృత పదం. దీన్నుంచే 'బత్తి, బగితి' అనే రూపాలు వచ్చాయి తెలుగులోకి. కొందరు 'భయంతో కూడిన స్నేహ'మే 'భక్తి' అని చెప్తారు. దేవుడు లేడనేవాళ్లక్కూడా భయముంటుంది – మరో విధంగా; స్నేహభావమూ ఉంటుంది – ఇతరుల విషయంలో. వాళ్లకు 'భక్తి' ఉండదా అనేది తేలని ప్రశ్న. గౌరవం లేకుండా భక్తి పుట్టదు. గౌరవమంటే గురుభావం. గురువంటే 'పెద్ద, గొప్ప' వగైరా అర్థాలున్నాయి. భక్తి అనేది ఆస్తికుల భావాల ప్రకారం లేకపోయినా సదరు వ్యక్తులకు పెద్దల మీదా పెద్దరికం మీదా గురివుండవచ్చు. అదికూడా భక్తేనంటారు మరికొందరు. భక్తికీ భజనకూ ఒకే మూలధాతు వుంది. 'భజించు, కొలుచు, పూజించు, గౌరవించు' మొదలయిన అర్థాలు భజనకూ భక్తికీ సమానమే. అయినా భక్తికీ భయానికీ ఉన్న సంబంధాన్ని మరిచిపోకుండా 'భయభక్తు'లని జంటగా వాడుతుంటాం. 'ప్రపత్తి' అనేది వైష్ణవుల వాడుకలో సర్వసాధారణం. భగవంతుడికి పూర్తిగా లొంగిపోవటం (= శరణాగతి) ప్రపత్తి. శైవుల్లో దేవుడికన్నా భక్తుడే గొప్ప; వైష్ణవుల్లో భక్తులందరిలోకీ భక్తుడే చిన్న! దేవుడే మిన్న. ఉభయులూ భజిస్తారు, పూజిస్తారు. 'పూజ' అనేది ఆర్యులెరగరనీ, ద్రావిడ భాషల నుంచే వాళ్లీమాట నేర్చుకున్నారనీ వాదించినవాళ్లున్నారు. 'పూ(వు)లతో' చేసేందే పూజ. పూజకు అలంకారం, నగిషీ అనే అర్థాలు కూడా కొన్ని ప్రాంతాల్లో వాడుకలోకి వచ్చాయి. పూలున్నా లేకపోయినా చేసే సేవ అర్చ(న). అందులో అభిషేకం వంటివి చేర్తాయి.

అన్నట్లు అభిషేకమంటే 'బాగా తడపట'మని అర్థం. సేకం (=తడుపు) అనే పదానికి ముందు 'అభి' అనే ఉపసర్గ చేర్చారన్నమాట. ఇది రాజులకూ దేవతలకూ సమానం. కాకపోతే నీళ్లేగాక పాలు, పెరుగు, తేనె వంటివి కూడా దేవుడికి అభిషేకంలో వాడ్తాం. రాజులు బహుశా కోప్పడతారని కాబోలు నీళ్లు (తీర్థజలం) మాత్రమే వాళ్ల నెత్తిన పోసేవాళ్లు. ఇకపోయం. మనకు రాజుల్లేరు కదా!

ఎక్కడున్నాం మనం? భజనలో కదూ! 'భజన, అర్చ(న), సేవ, పూజనం, వరివస్య, ఉపాసన, ఆరాధన, కొలువు , కొలుపు, శుశ్రూష, మన్నన, ఆదరం, ఇచ్చకం, తిరునాళ్లు, దాస్యం, సబళం, నివేదన(ం), కీర్తనం, స్మరణం, శ్రవణం, అనుమోదం, అదంభం, అభినుతి, సపర్య, స్తుతి, స్తోత్రం, నుతి, స్తవం, తాత్పర్యం, తత్పరత' వగైరాలన్నీ భక్తితోచేసే పనులే. పూజ చేయటాన్ని పూజనమంటారు. మనసులో ధ్యానించినా, వ్రతాలవంటివి చేసినా, జపతపాదులతో స్మరించినా ఆ పనికి ఉపాసన అనేపేరు. కదలకుండా స్తిమితంగా కూర్చొని చేసేది ఉపాసన. తపమనేది 'తపన'తో చేసేది. అనుకొన్నది నెరవేర్చుకోవాలనేది పట్టుదల లేనిదే తపంకాదు. జపం అనేకసార్లు తలుచుకోవటం. దేవుణ్నో అవతారపురుషుణ్నో మహాభక్తుణ్నో వ్యక్తినో సంతోషపెట్టాలనీ తృప్తిపరచాలనీ చేసేసేవ ఆరాధన. పరివారదేవతలను (అంటే చిల్లర దేవుళ్లను) ఎదుట ఉంచి చేసే పూజ కొలువు. కొలువంటే సభ అనే అర్థముంది. బొమ్మల కొలువులో కూడా చాలా బొమ్మలుంచుతాం. కాకపోతే ఆ కొలువును కొందరు దసరా పండగరోజుల్లో చేస్తే మరికొందరు సంక్రాంతికి తీరుస్తారు. కొలుపు పదిమందిచేరి (దైవప్రీతికోసం) చేసేవేడుక. ఈ కాలానికి గ్రామ దేవతలకూ క్షుద్రదేవతలకూ చేసే సేవనే కొలుపు అంటున్నాం. 'కొలుపులు' అని బహువచనంలో కూడా ప్రస్తావిస్తుంటాం – రకరకాలుగా చేస్తుంటాం – కొన్నిరోజులు చేస్తుంటాం.

కొలువులకూ జాతరలకూ, తిరునాళ్లకూ కొద్దిపాటి భేదముంది. కొలుపు ఒకే గ్రామస్థులు చేసేది. 'జాతర/జాత్ర' అనేది పొరుగూళ్లనుంచి కూడ జనం 'యాత్ర'కు వచ్చి పాలుపంచుకొని చేసే కొలుపు. కొలుపులకూ జాతర్లకూ ప్రత్యేకతిథి అక్కరలేదు. ఊళ్లో అంటువ్యాధులు ప్రబలినా, అనావృష్టివంటి ఇబ్బందులు వచ్చినా కొలుపులు చేస్తారు. పూర్వం 'బలి' ఇవ్వటం ప్రధాన భాగంగా ఉండేది కొలుపుల్లో. లేదా 'సిడివేయటం' జరిగేది. సిడిమానుకు జుట్టుకట్టుకొని వేలాడటం, తలకిందులుగా వేలాడటం, బుగ్గల్లో నారసాలు గుచ్చుకోవటం (నారసమంటే బాణం–నిఘంటువుల ప్రకారమయితే), గుండాలు తొక్కటం, కొరడాలతో కొట్టుకోవడం వంటి కార్య క్రమాలు కొలుపుల్లో సర్వసాధారణం. జాత్రల్లోకాదు. జాతర పదివూళ్లనుంచి వచ్చిన వాళ్లు చేసే వేడుక కాబట్టి 'రంకుల రాట్నాలు', హరికథలూ, పురాణ పఠనాలూ, నాట్య ప్రదర్శనలూ వగైరా ఉల్లాసకర విషయాలే దాంట్లో ప్రధానం. 'రంగులు' కాస్తా 'రంకు'లయిపోవటానికి కారణం ఇలాంటి సందర్భాల్లో జనం 'విచ్చలవిడిగా' ప్రవర్తించటమే. అందుకే భరతమహర్షి ఇలాంటి సందర్భాల్లో ఆడవాళ్లను ఓ కంట కనిపెట్టి కట్టుబాటులో ఉంచుకొమ్మన్నాడు– మొగవాళ్లు కట్టుతప్పినా ఇబ్బందిలేదు

కాబట్టి. జాతర్ల సమయంలో 'సంత'లు కూడా వెలుస్తుంటాయి. తిరునాళ్ళ/తిరణాల అలాకాదు: ఏదో నిశ్చితమైన పుణ్యదినంలో మాత్రమే చేసే వేడుక అది. 'తిరు' అంటే పవిత్రం. 'నాడు' అంటే రోజు. 'మహానాడు'లోని నాడు తెలుగర్థంలోని మాటకాదు. అరవంలో దానికర్థం 'సభ, సమావేశం' ఈనాటికి అన్ని భాషలూ తెలుగేనన్న లెక్కన మనవాళ్ళు దాన్ని తెలుగుకింద జమకట్టారు!

శుశ్రూష అనేది చిత్రమయిన మాట. 'వినాలనే కోరిక'ను సంస్కృతంలో శుశ్రూష అనేవాళ్ళు. పాతకాలపు గురుకులాల్లో తిండీ గుడ్డా ఇచ్చి చదువు చెప్పేవాళ్ళు. తిండి పెట్టున్నాడు కాబట్టి గురువు పని చేయించుకొనేవాడు – కాళ్ళు పిసగటం మంచి గొడ్లమేత తెచ్చేదాకా. లోకానికి కనిపించేది ఈ సేవేగాని చెప్పిన చదువుకాదు కాబట్టి శుశ్రూషకు సేవ అనే అర్థం వచ్చింది – మన మొత్తుకోళ్ళ తాను వినాల్సిందేగాని తన బోధలు మనం వినకపోయినా. చివరికి దైవసేవ అనే అర్థంలో కూడా కొందరీ మాటను ప్రయోగిస్తున్నారు! బహుశా వాళ్లకు మనకు వినపడకుండా దేవుడేమో చెప్పి ఉంటాడు. దాస్యం అంటే దాసుడు (సేవకుడు) చేసే పని. వైష్ణవ సంప్రదాయంలో దీని వాడుక ఎక్కువ. 'దాసానుదాసప్రపత్తి' అనేది వాళ్లకి చాలా ముఖ్యం. అనుదాసుడంటే దాసుడికి దాసుడని అర్థం. దేవుడి దాసుడికి చిట్టచివరి దాసుడికి కట్టకడపటి దాసుణ్నని చెప్పకోవటం ఆ సంప్రదాయంలో చాలా ముఖ్యం. అదీ చాలక పదరు కట్టకడపటి దాసుడి 'కాలిధూళి'నని చెప్పకోవటం మరీ ముఖ్యం. 'తొండ రడిప్పొడి యాళ్వార్' అంటే 'తొండ (భక్తుడి) అడి (కాళ్లకింది) పొడి (దుమ్ము)' అన్నమాట! ఆ 'ఆళ్వార్' (భక్తులుంగారు) భక్తులందరికీ మా గొప్పవాడని తాత్పర్యం. తాత్పర్యమంటే గుర్తుకు వస్తుంది. తత్ (దానికి), పరంగా (లోబడి) ఉండటం తాత్పర్యం. దాన్నే తత్పరత అనవచ్చు. ఏకబిగిని ఒకే ధ్యాసగా గౌరవాదరాలు చూపటం తాత్పర్యం. (ఒక పద్యానికో విషయానికో ఉన్న క్లుప్తమయిన/ప్రధానమైన భావం కూడా తాత్పర్యమేగాని అది వేరు.)

స్మరణమంటే తలచుకోవటం – దేవుణ్నన్నమాట! (ప్రియుణ్నో ప్రేయసినో తలచుకోవటం కూడా స్మరణమేననుకోండి. ఆ అర్థం ఇక్కడ అతకదు). శ్రవణమంటే వినటం. దేవుడు మన మొరవింటాడో లేదో తెలీదుగాని మనం దేవుడి లీలలు చెప్పించుకొని వినటమే శ్రవణం. సపర్యకూ సేవకూ పెద్ద భేదం లేదు. గౌరవభావంతో చేసే సేవను సపర్య అంటారు. ఎలా చేసినా సేవ సేవే. చాకిరీ అన్నమాట. మళ్లీ 'అరవచాకిరీ' వేరు. అరవ్వాళ్లు చేసేదని నిందార్థం వాడుకలోకి వచ్చిందిగాని అది అసలర్థంకాదు. 'అరవం'గా– అంటే నోరెత్తకుండా, చప్పుడు చేయకుండా చేసే సేవ అది. ఇక 'స్తుతి, స్తోత్రం, స్తవం, నుతి, అభినుతి' అనేవి 'పొగడ్త' అనే అర్థంలో వాడే మాటలు. నివేదన అంటే చెప్పకోవటం, ఇవ్వటం. నైవేద్యమనేది ఈ మాటనుంచే ఏర్పడింది. ఇవ్వటం అనే అర్థంలో అలా నివేదించి (ఇచ్చినట్లు విగ్రహానికి చూపి) మనమే తీసుకొని తినేదయితే ప్రసాదం. తాగేదయితే తీర్థం. తీర్థానికి నీళ్లు అనే అర్థమయినా ఈ నీళ్లను పవిత్ర జలమని చెప్పాలి. నదుల్లో సముద్రంలో ఉండే నీళ్లు పవిత్రం. వాటిని తీర్థజలమని నెత్తిన చల్లుకుంటాం –

దేవుడికీ రాజుకీ నెత్తిన చల్లుతాం. వరివస్య అనేది మారుమూలమాట. దానిక్కూడా వైష్ణవ సంప్రదాయంలోనే వాడుక ఎక్కువ. సేవ అనే అర్థంలో కీర్తన అంటే పొగడ్తేగాని పాట రూపంలో ఉండేదని రూఢిలో నిలిచింది. సఖ్యమంటే స్నేహం, మైత్రి. దానికి సాధారణార్థాలూ సమాన పదాలూ ఉన్నాయి.

# స్నేహసంబంధాలు

సఖుడంటే స్నేహితుడు, మిత్రుడు అని సామాన్యార్థం. పూజా విధానంలో అదోతీరు. మామూలుగా కూడా ఆ మాటను వాడ్తాం. "ప్రేమ, అనురక్తి, అనురాగం, అభిమానం, ప్రణయం, రాగం, వాత్సల్యం, ప్రియం, అపేక్ష, ఆప్యాయత, మైత్రి, స్నేహం, సౌహార్దం, ఆబంధం, మిత్రత, మిత్రత్వం, స్నిగ్ధత, మోహం, మమత, మమకారం, మమత్వం, అనుబంధం, వత్సలత, ప్రీణనం, ప్రీతి, ప్రసాద(న)ం, ఇష్టం, ఆసత్తి, ఆసక్తి, ఆసంగం, సంగం, అనురతి, అభిముఖత, అభిముఖ్యం, ఆప్యాయనం" వగైరా సంస్కృత పదాలను గురికి బెత్తెడెడంగా ఒకే అర్థంలో వాడుతుంటాం. అలాగే "నెయ్యం, నెయ్యమి, నెమ్మి, నేస్తం, నెనరు, ఎలమి, మేలు, కూరిమి, చెలిమి, అరితి, బాళి, ప్రేముడి, మచ్చిక, మక్కువ, మరులు, వలపు, అర్మిలి, అరులు, అర్లు, తగులం, సంగడి, పొందు, సంగాతం, మచ్చిగ, అలిమి, అరిమిలి, ముసిమి, గాదిరి, గారం, గారాం" మొదలైన తెలుగు మాటలను కూడా అలాగే ప్రయోగిస్తుంటాం. వీటన్నిటిలో 'ప్రేమ, అనురాగం, అభిమానం, ప్రణయం, ప్రియం, అపేక్ష, ఆప్యాయత, మైత్రి, స్నేహం, సౌహార్దం, మోహం, మమత, మమకారం, నేస్తం, మచ్చిక, మక్కువ, మరులు, వలపు, పొందు, గారాం' అనేవి ఎక్కువ వాడుకలో ఉన్నాయి. ముందువాటి సంగతి చర్చిద్దాం. పనిలో పనిగా తక్కిన మాటలను సందర్భోచితంగా తలుచుకుందాం.

ప్రేమ ప్రతిఫల మపేక్షించనిది. గుడ్డిదని కూడా చెప్తారు. ఎక్కువ తక్కువలు, పెద్దాచిన్నా భేదాలు, లాభనష్టాలు మొదలయిన వాటితో సంబంధంలేని 'మక్కువ'ను ప్రేమ అంటారు. ప్రేముడి అనే మాట అచ్చతెలుగని నిఘంటువులు చెప్తాయి గాని నమ్మటం కష్టం. సజాతీయ భాషల్లో అటువంటి రూపంగల శబ్దం లేదు. 'మాతృప్రేమ' వంటి సమాసాలను ఎటుబడితే అటు వివరించవచ్చు. తల్లికున్న ప్రేమ, తల్లిమీది ప్రేమ అని చెప్పవచ్చు. కానీ తల్లికి బిడ్డమీద ఉన్న భావానికి (మాలిమికి) 'వాత్సల్య'మనే మరోమాట ప్రత్యేకంగా ఉంది. వత్స అంటే సంతు, బిడ్డ. బిడ్డమీది ప్రేమ వాత్సల్యం. అయితే బిడ్డకు తల్లిమీదగల భక్తి గౌరవాలను ప్రేమ అనగూడదని చెప్పలేం. ప్రేమకన్నా ప్రణయం ధొడ్డది. అందులో 'లొంగుబాటు' కూడా ఉంది. 'నమ్మకం' కూడాను. ప్రేమకు 'స్నేహం, సంతోషం, పరియాచకం, గాలి' మొదలైన ఇతరార్థాలూ, 'ప్రేమము' అనే రూపాంతరమూ ఉన్నాయి. ప్రేమ అస్థిరం. ప్రణయం స్థిరమైనది. 'ప్రేముడి'కి 'పిన్నలమీద, చిన్నవాళ్లమీద ఉన్నకూరిమి'

అవి కొందరు అర్థం చెప్పారు. అంటే ప్రేముడిని వాత్సల్యంతో సమానంగా పరిగణించాలన్నమాట. 'ప్రియం, ఇష్టం, ప్రీతి' అనేవి ఇంచుమించు దగ్గరమాటలు. ఇతరులకుగాని తనకుగాని సంతోషం కలిగించటం, ఇచ్ఛకం పుట్టించటం అనేవి ఈ మాటల్లోని సమాన లక్షణాలు. తృప్తిని, సంతోషాన్నీ, ఉల్లాసాన్ని కలిగించటంతోబాటు మనసులోని కలకతీర్చినప్పుడు ఈ మాటలను అర్థస్పష్టతకోసం వాడవచ్చు. ప్రియం అనే మాటకు 'హెచ్చుధర, అనుగ్రహం'లాంటి వేరే అర్థాలున్నాయి. ప్రీతికి దగ్గరిమాటలు ప్రీణనం, ప్రసాదనం అనేవి. నచ్చటం నచ్చిక అనుకుంటే, ప్రీణనం అనేది ఆ నచ్చికను కల్పించటం. తృప్తికీ సంతోషానికీ ప్రమేయం లేనిచోట ప్రీతి, ప్రీణనం, ప్రసాదనం వాడితే నప్పవు.

మమత, మమత్వం, మమకారం అనేవి తనదనే భావమున్నప్పుడే వాడవలసిన మాటలు. 'మమ' అనేదానికి 'నా(ది)' అనే అర్థం. సొంతం (చేసుకోవాలి) అనే అభిప్రాయమున్నప్పుడే వీటికీ వాడుక. అనురక్తి, అనురాగం అనేవి 'రాగం' (=ఇష్టం, ఆసక్తి, అపేక్ష)తో వెంబడించే కోరికలను తెలిపే మాటలు. ప్రేమ, ప్రణయాల్లాగాకాక ఇవి ఏకపక్షమయిన స్నేహాన్ని చెప్పటానికి పనికి వస్తాయి. అనురతి, ఆసంగం అనే పదాల్లో 'శరీర సంబంధానికి' ఎక్కువ ప్రాధాన్యముంది. రతి, సంగం – అనే మాటలకు 'సంభోగ'మనే అర్థం కూడా ఉంది. ఆసత్తి అంటే పొందిక, సరిపెట్టుకోగలగటం. ఆసక్తి అంటే కోరిక. ఈ రెండూ ఒకటికాదు. ఆసత్తికి దగ్గరిసంబంధమనే అర్థంకూడా ఉంది. అపేక్షకు అనుసరించటం/వెంబడించటమనే అర్థం లేకపోలేదు. అపేక్షను 'ఆపేక్ష' అంటారు కొందరు. అది సరికాదు. ఆప్యాయనం అంటే తనివి, తృప్తి. ఆప్యాయత ఈ మాటకే మరో రూపం. సంతోషపెట్టడం లేని ఆప్యాయతలేదు. అభిమానం అర్థం చేసుకున్నప్పుడు కలిగే గౌరవం. ఈ మాటకు ఆత్మగౌరవం, గర్వం, అజ్ఞానం, అహంకారం అనే విడివిడి అర్థాలు కూడా ఉన్నాయి. అభిముఖత అనే మాటను అవతలి వ్యక్తికి అనుకూలంగా నచ్చేటట్లు ప్రవర్తిస్తున్నప్పుడు వాడాలి. 'సుముఖత' అని కూడా దీనికి అర్థముంది. అభిముఖతకు మరోరూపం ఆభిముఖ్యం. దీనికి అర్థంలో మరేమీ తేడాలేదు. మోహంలో ప్రేమలో లేని తీవ్రత, మొండితనం ఉంటాయి.

మైత్రీ, స్నేహం ఒక్కటికాదు. 'మైత్రి/మిత్రత/మిత్రత్వం' అనే మాటలో 'చెలిమి' తోపాటు 'జాలి, దయ' కూడా ఉన్నవని చెప్పాలి. మైత్రికన్నా స్నేహం గొప్పది. స్నేహం అనే పదానికి 'చనువుతోబాటు విడరానిబంధం కూడా ఉన్నభావ'మని అర్థం. నిజానికి స్నేహ పదానికి 'నూనె, జిడ్డు' అనే అర్థాలు కూడా ఉన్నాయి. వదలని మైత్రి స్నేహం. అది విడదీయరానిది, విడిపోనిది. మైత్రి తాత్కాలికం కావచ్చు. స్నేహం మాత్రం శాశ్వతమయినది. సౌహార్దమనే మాట 'సుహృత్' అనే శబ్ద లక్షణాన్ని చెప్పేది. మంచిమనసుతో ప్రవర్తించటం సౌహార్దం. కొందరు తప్పుగా ఈ మాటను 'సౌహార్ద్రి'మని వాడుతుంటారు. కానీ ఈ మాటకూ 'ఆర్ద్రత'కూ సంబంధమేలేదు. స్నిగ్ధత అంటే చల్లని, చిక్కని మైత్రి. ఉన్నంతకాలం ఆహ్లాదకరంగా ఉండే మైత్రి అన్నమాట. స్నేహమంత గాఢమయిందికాదు స్నిగ్ధత. శాశ్వతమూకాదు.

ఈ మాటలన్నీ సంస్కృత పదాలు, తెలుగులో ఇటువంటి మాటలు చాలా ఉన్నాయి. అందులో కొన్ని తమాషా అయినవి.

ఇంచుమించు స్నేహంవంటి అర్థమిచ్చే తెలుగుమాట 'నెయ్యం'. దీనికి నెయ్యమి, నెమ్మి అనే రూపాంతరాలున్నాయి. అసలు స్నేహశబ్దం నుంచే నెయ్యం పుట్టిందంటారు చాలా మంది. నేస్తమనే మాట కొన్ని ప్రాంతాల్లో బాగా చలామణిలో ఉంది. 'నేస్తం కట్టడం' అనేది కళింగ ప్రాంతంలో (విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల్లో) ఓ పెద్ద క్రతువులాగా జరిగేపని. రెండు కుటుంబాలు నేస్తం కట్టాయంటే జీవితాంతం విడని చెలిమితో ఉంటాయి. ఒకేకుటుంబంలాగా ప్రవర్తిస్తారు అలా నేస్తం కట్టినవాళ్లు. నేస్తానికి మిత్రుడనే అర్థంకూడా ఉంది. నేస్తం నెయ్యం కన్నాగొప్ప అనుబంధం. చిన్నయసూరి అభిమానించి ప్రయోగించిన మరోమాట సంగాతం. ఇది సంస్కృతంలోని 'సంగతం' నుంచి వచ్చిందంటారు. కలిసి మెలిసి ఉండటమని ఈ మాటకు అర్థం. సంగడి అనే మరోమాటుంది – 'కలిసి పనిచేయుట' మనే అర్థంలో. 'చెలిమి' అనేది మైత్రికి సమానమైన పదం. చాలా దగ్గరిచెలిమిని 'పొత్తు' అనవచ్చు. ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకొనేవారి మధ్యగల సంబంధం పొత్తు. ఇది స్త్రీ పురుషుల మధ్యనుండే శరీరసంబంధానికి కూడా అన్వయిస్తుంది.

ప్రేమకు బదులుగా పాతకాలపు కావ్యాల్లో వినిపించే కనిపించే తెలుగుమాట 'ఎలమి'. ఎలము – అనే క్రియాపదానికి 'చిగిరించు, వికసించు' అనే అర్థాలున్నాయి. ఎలమి సుకుమారంగా ఉంటే 'నెనరు' అవుతుంది. నెనరులో జాలి, దయ కూడా ఉంటాయి. పూర్వ కావ్యాల్లో బాగా వాడుకలో ఉన్న మరోమాట నెమ్మి. ఇంచుమించుగా ప్రేమకు సమానమైన పదమిది. ప్రేమ – ఎలమి తీవ్రంగా ఉన్నప్పటి స్థితిని చెప్పటానికి వాడదగిన మాటలు తగులం, తవులం, తగులు అనేవి. ఒక పట్టాన వదలని, వదిలించుకోలేని సంబంధం తగులం. ఇది మంచిదీకావచ్చు, చెడుదీకావచ్చు. తగులాటం – తగులాయం అనేవి ఈ మాటకే రూపాంతరాలు. అయితే కొందరు తగులాయమంటే 'కావలసిన వాడు, అయినవాడు, సంబంధి' అనే అర్థాలు చెప్తున్నారు – మహద్వాచకం చేసి! తగులుకోలు అనే పదాన్ని సాధారణంగా చెడు విషయాలకు, అక్రమసంబంధాలకు అన్వయిస్తుంటాం కానీ ఆ మాటకా అర్థవిశేషం స్వతహాగాలేదు. తీరని ప్రేమని సూచించటానికీ, తీవ్రమయిన ప్రేమను వ్యక్తీకరించటానికీ 'మరులు' అనే మాటను వాడవచ్చు. ఇంచుమించు 'మోహ'మనే సంస్కృత పదాని కిది సమానం. ఇటీవలికాలంలో ప్రేమకు పర్యాయపదంగా ఎక్కువ వాడుకలోకి వచ్చిన తెలుగుమాట వలపు. సినిమాలవల్లా, నవలాసాహిత్యంవల్లా ఈ మాటకు వ్యాప్తి పెరిగిపోతున్నది.

పెద్దవాళ్లకు చిన్నవాళ్లమీదవుండే వాత్సల్యానికి బదులు మాటలు తెలుగులో అర్మిలి, అరులు, అలిమి, అరిమిలి, అరితి – అనేవి. కానీ వీటికి నేటి సాహిత్యంలో కూడా ఎక్కడో తప్ప ప్రయోగంలేకుండా పోయింది. ప్రాచీన పద్ధతిలో గణబద్ధరచనలు చేసేవాళ్లు పాదపూరణకు వాడుతున్నారనిపిస్తుంది. అయితే మచ్చిక, మక్కువ అనే పదాలు ఇప్పటి వాడుకలో కనిపిస్తాయి. మచ్చిక శబ్దాన్ని పెంపుడు జంతువులను

దయతో దగ్గరికి తీసుకోవటంలో కూడా వాడుతున్నారు. గారం/గారాం అనే మాటలను చిన్నపిల్లలను ముద్దుచేయటంలో మచ్చికకు బదులు వాడటం కనిపిస్తుంది. మక్కువ, కూరిమి/కూర్మి అనేవాటిని ఎంతో 'ఇష్ట'మనే అర్థంలో వాడుతున్నారు గాని కూరిమి శబ్దానికి కావ్య ప్రయోగమున్నంతగా వ్యవహారంలో వాడుకలేదు. 'మచ్చిగ' అనేపదం నిఘంటువుల్లో కనిపిస్తుంది.

ప్రేమఫలితంగా సమకూడేవి పొందు, పొత్తు అనేవి. పొందిక – అంటే కుదురుబాటు. ఈ మాట పొందు అనే క్రియారూపంనుంచి ఏర్పడ్డ నామవాచక రూపం. 'పొంతన' కుదిరిన పొత్తును పొందు – అంటాం. పొంతనతో నిమిత్తంలేని కలయిక పొత్తు. ఈ పొందువల్లగాని పొత్తువల్లగాని వ్యక్తిపొందే సుఖాన్ని సంతోషాన్ని చొక్కు, సొమ్ము, బాళి అనే మాటలద్వారా వ్యక్తీకరించవచ్చు. ఈ పొందో పొత్తో కలిగేదాకా ప్రేయసీప్రియులు ఒకర్నొకరు వెంటతిప్పుకోటాన్ని 'ఎలయింపు' అంటారు. కళాపూర్ణోదయంతో అభినవకౌముది శల్యాసురుణ్ణి ఆశపెట్టి అలా ఎలయించుకొని శ్రీశైల శిఖరమెక్కిస్తుంది. పొత్తుకు ఇంచుమించు సమానార్థంలో 'మరుగు' అనే మాట పుస్తకాల్లో కనిపిస్తుంది. మరుగు శబ్దానికి ఇప్పటి అర్థం చాటు/రహస్యం అని మాత్రమే. బయటికి పొక్కని ప్రేమానుబంధాన్ని సూచించటానికి తెలుగులో చక్కటి మాటవుంది – 'ముసిమి' అని. 'ముసిముసినవ్వులు' వంటి పదబంధాల్లో 'కొద్దిపాటి, కనిపించీ కనిపించని, అంత బహిరంగంకాని' అనే అర్థాల్లో ఈ మాట మూలార్థం మరుగుపడి ముసిముసిగానే నిలిచిందిగాని నేటి వ్యవహారంలో ఇది ఎక్కడా వినిపించదు.

పూర్వ కావ్యాల్లో బహుళవ్యాప్తిలో ఉన్న మరో తెలుగుమాట 'గాదిలి'. 'ఇష్టమైన, నచ్చిన, నమ్మిన' అనే అర్థాల్లో ఈ మాటను వాడేవారు. పెద్దలకు నచ్చిన పిన్నల విషయంలో గాదిలి శబ్దం వాడవచ్చు. ఇప్పుడు ఈ మాటకు వాడుక ఉన్నట్లు లేదు; లేనట్లుందన్నా తప్పుకాదేమో! పిన్నలకు పెద్దలవద్ద మారాంచేసిగాని చేయకగాని సాధించుకోగల శక్తిని 'చనువు' అనవచ్చు. దీనికి సరైన మరో సంస్కృతపదం 'సామంతం' సాహిత్యంలోనేగాని సాధారణ వ్యవహారంలో వినిపించదు. ఈ రోజుల్లో 'చనువు (పూర్వం చనవు)' శబ్దాన్ని స్త్రీపురుషుల అన్యోన్యతను సూచించడానికూడా వాడుతున్నారు.

సంస్కృతంలోని 'ఇష్ట' శబ్దానికి సరయిన తెలుగుమాట ఇంపు. అయితే ఈ మాటను ఇప్పుడెవరూ అంతగా వాడటంలేదు. ఇంపును చక్కదనమనే అర్థంలో కూడా కొందరు వాడారు. 'మేలిమి' అనే మాటకు 'ప్రేమ, మరులు' అనే అర్థముందని కొన్ని నిఘంటువులు చెప్పినా 'ఉత్తమమైన, విలువైన, ఎత్తయిన' మొదలయిన అర్థాల్లో మాత్రమే దానికిప్పుడు వాడుక. 'తృప్తి'కి సరిగా దీటయిన తెలుగుమాట 'తనివి'. 'తనివి తీర్చుకొని' మొదలయిన పదబంధాల్లో దీనికి వాడుక ఎక్కువ; విడిగా ఇప్పటి వాడుకలో వ్యాప్తి తక్కువ. 'ఇష్టపడు' అనే క్రియాపదానికి సమానంగా 'నచ్చు' అనే క్రియను వాడుతుంటాంగాని, 'ఇష్టం' అనే నామ పదానికి సమానమైన 'నచ్చిక' అనే మాటను వాడుతున్నామని చెప్పలేం. భాషాభాగాలతో

నిమిత్తంలేకుండా సమానార్థకత ఉంటుందనడానికి, ఉన్నా ఒకప్పుడు వాడుకలో ఉండదనటానికీ ఇదో నిదర్శనం.

స్నేహం, ప్రేమ వగైరాలను తలచుకొన్నప్పుడు అవి ఉన్నవాళ్లను కూడా స్మరించాలిగదా. నిఘంటువుల్లోనయితే చాలా మాటలుంటాయి గాని ఎక్కువ వ్యాప్తిలో ఉన్న పదాల గురించే మనమాలోచిద్దాం – ఇది పరిచయమేగాని నిఘంటువుగాని శాస్త్రచర్చగాని కాదుకాబట్టి. స్నేహం కలవాడు స్నేహితుడు – ఎల్లకాలం మనవెంట వదలకుండా ఉండేవాడన్నమాట. మిత్రుడు, సఖుడు, సుహృత్తులాంటివి దీనికి సమానపదాలు. మిత్ర శబ్దానికి సూర్యుడు వగైరా ఇతరార్థాలున్నాయి. సంస్కృతంలో మిత్రశబ్దం ఎప్పుడూ నపుంసకలింగంలోనే ఉంటుంది. అందువల్లనే కొందరు సనాతన పండితులు 'అతడు మిత్రము, ఆమె మిత్రము, అది మిత్రము'లాంటి ప్రయోగాలు చేస్తుంటారు. తెలుగులో మిత్రుడు, మిత్రురాలు అనే మాటలకే స్నేహితుడు, స్నేహితురాలు అనే వాటికన్నా వాడుక తక్కువ. అయితే 'మిత్రమా' అని పిలవటం పరిపాటి. 'మిత్రా' అని పిలిచేవాళ్ళున్నట్లు తెలీదు. ఇంకా 'నేస్తం' అని పిలిచేవాళ్ళున్నారు చాలామంది. సుహృత్తు అంటే 'మంచి మనసుకలవా'డని అర్థం. అతడు స్నేహితుడు కాకపోవచ్చుగాని శత్రువెన్నటికీ కాడు. సఖుడు – అనే మాటలకు కావ్యాల్లోనే ప్రయోగం. సంబోధనలో 'సఖా' అనే రూపం. 'సఖీ!' అని చెలికత్తెలను పిలవటం సినిమాల పుణ్యమా అని వాడుకలో నిలిచింది.

స్నేహితుడనే సంస్కృత పదానికి చాలా దగ్గరైన తెలుగుమాట నెయ్యుడు. సంగాతి, సంగాతకాడు, సంగడికాడు, సంగడీడు, నేస్తగాడు అనే తెలుగు మాటలక్కూడా వాడుక తక్కువ. నేస్తం అనేది వ్యాప్తిలో ఉన్నమాట. చెలి(మి)కాడు, చెలి(మి)కత్తె అనే మాటలు పుస్తకాల్లో సినిమాల్లో కనిపించేవి, వినిపించేవి. ఈ రెంటిలోనూ సమానంగా ఉన్న 'చెలి' శబ్దాన్ని ఇటీవలికాలంలో స్త్రీలకు మాత్రమే అన్వయించి వాడుతున్నారుగాని పూర్వం ఆ మాట స్త్రీపురుషులిద్దరికీ అన్వయించేది. అన్నట్టు 'నెచ్చెలి' అనేమాట ఉందికదూ! "ఎక్కువ స్నేహంకల" వ్యక్తి అని ఆ మాటకర్థం – ప్రాణస్నేహితుడన్నట్లు, ఆప్తమిత్రుడన్నట్లు. ఇలాంటిదే మరో తెలుగుమాట 'అనుగు/అనుంగు' అనేది పూర్వం వాడుకలో ఉండేది – స్త్రీపురుషభేదం లేకుండా. 'అనుంగు నెచ్చెలి' మొదలైన తిక్కన ప్రయోగా లనేకమున్నాయి – చాలా దగ్గరివాడైన పరమస్నేహితుడనే అర్థంలో. కొన్ని శాసనాల్లో ఫలానా రాజుగారి 'అనుంగు'నని చెప్పుకొన్న వాళ్ళుండేవారు. ఇప్పుడీమాట వాడుకనుంచి చాలావరకు తప్పిపోయింది. ఎక్కడో ఒకరు 'అనుగుబిడ్డ' లాంటి ప్రయోగాలు చేస్తున్నమాట నిజమేగాని అది 'పదుగురాడుమాట' కాదన్నమాట.

స్నేహ మనటానికి దోస్తీ, స్నేహితుడనటానికి దోస్తు అనే మాటలు ఉరుదూనుంచి తెలుగులో ప్రవేశించి బాగా నిలదొక్కుకున్నాయి. ఇంగ్లీషు నుంచి ఫ్రెండు, ఫ్రెండ్‌షిప్పూ కూడా బడిపిల్లల్లో అలవాటయి పెద్దలక్కూడా వ్యాపించింది. అయితే చిన్నపిల్లల వాడుకలలో 'సావాసం' అనేది మైత్రికో స్నేహానికో సమానార్థకంగా నిలిచింది. ఈమాట సంస్కృతంలోని 'సహవాసం' (=కలిసి బతకటం/కాపురముండటం) నుంచి

వచ్చింది. నిజానికి కొంతకాలం కలిసిమెలిసి చదువుకుంటారు కాబట్టి (అప్పుడప్పుడు పోట్లాడుకున్నా చిన్నపిల్లలు వెంటనే మరిచిపోయి మళ్ళీ కలసిపోతారు కాబట్టి) సావాసం అనేమాటకు కలిసి ఉండటమనే అర్థం చెప్పవచ్చు. దీనికి కొంచెమించుగా 'చెలికారం' అనే మాట దగ్గరిది, చెలిమితో ఉండటమనే అర్థంలో సౌహార్దం, సౌహృదం అనేమాటలు రెండూ 'సుహృత్తు గుణాలు' సూచించేవి. వాటిలో మంచితనానికున్న ప్రాముఖ్యం మరిదేనికీలేదు. సఖుడి/సఖి లక్షణం సఖ్యం.

స్నేహం ముదిరి ప్రేమగా పరిణమించవచ్చు – కొన్ని సందర్భాల్లోనయినా. ప్రేమించేవాడు ప్రేమికుడు. ప్రేమించిన స్త్రీ ప్రేమికురాలు. ప్రతి ప్రేమికుడూ ప్రియుడు కాడు. ప్రియుడంటే ఇష్టమైనవాడు. అలాగే ప్రతిప్రేమికురాలూ ప్రియురాలు కాదు. ప్రేమ ఫలించిన తరువాత ప్రియుడో ప్రియురాలో కావచ్చు. ప్రేమ భగ్నమయినా ప్రేమికుడుగా, ప్రేమికురాలుగా నిలిచిపోవచ్చు. అయితే ప్రేమ ఫలించిన పురుషుణ్ణి ప్రియుడన్నట్లు అటువంటి దశలోనే ఉన్న ప్రేమికురాలిని ప్రేయసి అంటారేగాని ప్రియురాలనే వాళ్ళ సంఖ్య చాలా తక్కువ. 'ప్రేయసీ ప్రియు'ల వంటి పదబంధాల వాడుక ఇందుకు కారణం. ప్రేమా వలపూ సమానార్థకాలని ప్రేయసీ ప్రియుల స్థానంలో 'వలపుకాడు, వలపుకత్తె'లను నిలపటం కష్టం. ఆ మాటలకు సహజంగా అపార్థం లేకపోయినా మోహపరవశులయిన జంటనే ఈ తెలుగు మాటలతో పలకరిస్తుంటారు. ప్రయోగ సందర్భాలనుబట్టి ఇలా ఊహించగలమేగాని శబ్దగతంగా అలాంటి అర్థంలేదు. ప్రేమికుడనే అర్థంలో వాడే 'అరితికాడు, మేలువాడు'లాంటి తెలుగుమాటలు పుస్తకాల్లో మాత్రమే ఎక్కడో కనిపించే మాటలే. మేలువాడనే మాటకు 'ఉత్తముడు, పైవాడు, ఎక్కువవాడు'లాంటి ఇతరార్థాలు కూడా ఉన్నాయి. మేలు శబ్దానికి 'ఎత్తు, పైభాగం' అనే అర్థవిశేషాలూ ఉన్నాయి. (ఉదాహరణకు మేలు దూలం, మేలుమిద్దె వంటి ప్రయోగాలు వాడుకలో వినిపిస్తాయి). 'ప్రియ' శబ్దానికి 'ఖరీదయిన' అనే అర్థవిశేషం వాడుకలో వచ్చింది. (ఈయేడు ధాన్యం ప్రియమయింది. ప్రతిదీ 'పిరియ' మయితే బతికేదెలా? – లాంటి ప్రయోగాలు చూడండి). మేలునుంచి కూడా ఇదే మూలార్థంతో 'మేలిమి (బంగారం), మేలు (కట్టు)' వంటి పదబంధాలేర్పడ్డాయి.

ప్రేమికుల మధ్య, ప్రేయసీ ప్రియులమధ్య ఎప్పుడయినా గొడవలు రావటం కద్దు. రాకపోతే ఆశ్చర్యపడాలేమో! సంస్కృతంలో 'ప్రణయకలహ' మనేమాట ఈ పరిస్థితిని వర్ణించటానికి పుట్టింది. తెలుగులో 'పొలయలుక/పొలయల్క, వెడమోడి' అనే మాటలున్నాయి. అలుక/అల్క అంటే కోపం. మోడి అంటే కోపం వచ్చినప్పుడు ప్రదర్శించే చిరాకు, విసురు వగైరాలు. కొన్ని నిఘంటువుల్లో 'పొల' శబ్దానికిచ్చిన అర్థాలకూ ఈ సమాసానికీ పొంతన కుదరటంలేదు. 'వ్యాపించు, వీచు, పుట్టు, విసరు' మొదలైన అర్థాలున్న 'పొలయు' అనే క్రియకూ ఈ విశేషణానికీ సంబంధముందని చెప్పవచ్చు. ప్రేమామృతంలోనయినా మునిగితేలటం ఎల్లప్పుడూ సాధ్యం కాదు.

★ ★ ★

# శత్రువు-శత్రుత్వం

మైత్రిని గురించి ప్రస్తావించినప్పుడు దానికి వ్యతిరేకమయిన శత్రుత్వం గురించి రెండుమాటలు తెలుసుకోవటం న్యాయం. వైరం, విరోధం అనే రెండు సంస్కృతపదాలు శత్రుత్వంలాగా వాడుకలో ఉన్నాయి. వీర శబ్దానికీ వైరానికీ సంబంధముంది. వైరం బహిరంగమయింది, కనబడేది. శత్రుత్వం ఎన్నివిధాలనయినా ఉండవచ్చు. అందుకే అనుకూల శత్రుత్వం, ప్రతికూల శత్రుత్వంలాంటి మాటలు పుట్టాయి. శత్రుత్వంలో మోసం, వెన్నుపోటు, నటన వంటివి ఉండవచ్చు. వైరం బాహాటమయింది. విరోధం ఈ రెంటికన్నా విలక్షణమయింది. అది తాత్కాలికం కావచ్చు; దీర్ఘకాలికం కావచ్చు. కానీ అభిప్రాయాల్లో నడవడిలో ఆలోచనల్లో 'విరుద్ధత'వల్ల పుట్టేది విరోధమే. తన దారికి అడ్డువచ్చినప్పుడు పుట్టేభావం విరోధం. శత్రుత్వం, వైరమంత తీవ్రమయిందికాదు విరోధం. వైరుధ్యమనేది మరోమాట. ఇటువంటి అభిప్రాయభేదాలవల్ల, అడ్డంకులవల్ల వైరుధ్యం కలుగుతుంది. వైరానికీ శత్రుత్వానికీ ఇంతచిన్న కారణాలక్కరలేదు. వాటికి 'పగ' ప్రధానం. విరోధంలో పగ పాలు తక్కువ, కోపమెక్కువ.

తెలుగువాళ్ళకు మాతృభాషలో శత్రుత్వాదులకు దగ్గరగా ఉండే మాటలు చాలా ఉన్నాయి – కోపదారివాళ్ళు కనుక. "ఒంటమి, ఒప్పమి, కంటు, కొట్లాట, గొడవ, దెబ్బలాట, జగడం, పగ, పోట్లాట, వేరం, మచ్చరం, సూడు"లాంటి మాటలింకా ఉన్నాయి. ఒంటమి తనమార్గం నచ్చని, తనకు అనుకూలంగా ఉండనివాళ్ళ మీద పుట్టేభావం. 'ఒంటిగంటం రామలింగం' అంటారే అతడి లక్షణమన్నమాట. ఒంటమిలో తీవ్రతలేదు – తిరుగుబాటులేదు. తనగొడవే తనదిగా ఇతరులకు దూరంగా ఉండటం ఒంటమి. ఒప్పమి అంటే ఒకరు చెప్పింది ఒప్పుకోకపోవటం – తనకు విరుద్ధంగా చెప్పినమాటనూ చేసిన పనినీ సహించక దూరంగా ఉండటమే ఒప్పమి. ఒంటమి కలవాడు తనకుతాను దూరంగా ఉండి బాధపడతాడేగాని ఆ బాధనుకూడా వ్యక్తీకరించడు. ఒప్పమి కలవాడు తన భావాలు చెప్పొవచ్చు – మానావచ్చు. అంతే భేదం. తక్కిన లక్షణాలు ఒంటమికీ ఒప్పమికీ సమానమే. ఈ రెంటికీ ఇప్పుడు వాడుక ఉన్నట్లులేదు. కొద్దిమంది ఇంకా అక్కడక్కడ 'ఆయిన నిష్కారణంగా కంటువెట్టుకున్నాడు'లాంటి వాక్యాలు వాడుతున్నారు. భారతంలో "మొగమున గంటు వెట్టుకొని' అనే ప్రయోగం చాలాచోట్ల కనిపిస్తుంది. ఇంచుమించు 'కోపం, పగ' వంటి అర్థాలున్న ఈ మాటకు వాడుక తక్కువ.

కొట్లాట, దెబ్బలాట, పోట్లాట అనే మాటలు విచిత్రమైనవి. పదంలో 'ఆట' ఉన్నా అవి ఆటలుకావు. ఏదో కదలికగల శత్రుత్వాలన్నమాట. కొట్టు, దెబ్బ, పోటు – అనేవాటిలో మొదటిదానికన్నా రెండోదీ, దానికన్నా మూడోది తీవ్రమైనవి. వీటిలో సమాన లక్షణం చేతికన్నా ఎక్కువగా నోరు పారేసుకోవటం. చాలా

సందర్భాల్లో చెయ్యిచేసుకోవటం జరక్కపోయినా మాటల స్వరూపం మటుకు మారలేదు! శరీరానికి జరిగే కొట్లు, పోటులాంటి ప్రమాదం ఏమీలేకుండా నిర్వహించే శత్రుత్వం జగడం. అది సాధారణపదం. పై మూడూ అందులో భాగాలు. వాడుకలో 'వాళ్ళిద్దరూ జుట్టూ జుట్టూ పట్టుకున్నా'రంటాం కాని నిజంగా ఒకరిజుట్టు మరొకరు పీకారని అర్థం కాదు. జగడం వైరంలాంటిది. బహిరంగమయింది. ఎవరూ జగడాన్ని మనస్సులో పెట్టుకోలేరు – శత్రుత్వాన్ని లాగా. ఈ లక్షణంలో ఇది 'పగ'కన్నా వేరయినది. పగ మనసులో ఉండే శత్రుత్వం; సాధారణంగా దీర్ఘకాలికం. తరతరాలుగా కూడా ఒకప్పుడది అలాగే రాజుకుంటూ ఉంటుంది. అందుకే 'తాచుపగ, పాముపగ'లాంటి మాటలు పుట్టాయి. కోపతాపాల తీవ్రత తగ్గినా పగ తగ్గదు. కొన్ని ప్రాంతాల్లో శత్రుత్వం వచ్చిందనడానికి 'జట్టీ వచ్చింది, గొడవ(లు) వచ్చాయి' అంటారు. జట్టీ నిజానికి ముఠాలాంటిది. కొందరొకవైపూ మరికొందరు ఇంకోవైపూ ఉండి తగాదాపడితే అది జట్టీ రావటం. చిన్నచిన్న కారణాలకే పుట్టి, అంత తీవ్రంగా ఉండక, తొందరగా సమసిపోయే శత్రుత్వమే గొడవ. వైరుధ్యం లాంటిదది. కొన్ని నిఘంటువులు శత్రుత్వానికి 'మచ్చరం' పర్యాయపదమని చెప్తాయిగాని అది 'మాత్సర్య'మనే సంస్కృత పదం నుంచి పుట్టినమాట. ఈర్ష్య, అసూయలతో పుట్టిన శత్రుత్వం మచ్చరం. ఇప్పుడు వాడుకలో లేదనిపించే మరో తెలుగుమాట 'సూడు'. ఈ శబ్దానికి క్రియార్థంలో 'కాల్చు, తగలబెట్టు' అనే అర్థ విశేషాలున్నాయి. తీవ్రమయిన క్షణికమైన శత్రుత్వం సూడు.

వైరానికీ శత్రుత్వానికీ ఉన్న అంతరమే వైరికీ శత్రువుకూ మధ్యకూడా ఉంది. వైరి అనేమాటకిప్పుడు వాడుక చాలా తక్కువ. 'విరోధి' అనేమాట ఎక్కువ వ్యాప్తిలో ఉంది. విరోధం కలవాడూ, కల్పించినవాడూ విరోధి. పరిపంథి లాంటి పదాలు పుస్తకాల్లో తప్ప కనిపించవు. అచ్చతెలుగులో "పగ, పగతుడు, పగవాడు, మార్తుడు" అనే మాటలున్నాయి. పగతుడు కావ్యాల్లోనే కనిపిస్తాడు. పగవా డనేమాటను విరోధి, శత్రువు, వైరి అనే మూడార్థాల్లోనూ సమానంగా వాడుతున్నాం. పూర్వకావ్యాల్లో "పగ" అంటే పగవాడనే పదానికి సంక్షిప్తరూపంగా (నిజానికి పగవాడనేదే విస్తృత రూపం) కనిపిస్తుంది. ఇప్పుడటువంటి ప్రయోగం సాహితీ గ్రంథాల్లో కూడా అరుదైపోయింది. బహువచనంలో 'పగరు' అని ప్రాచీన గ్రంథాల్లో ప్రయోగముందిగాని వాడుకలో అమాట లేదిప్పుడు. మార్తుడు – అంటే ఎదుర్కొన్నవాడు, తిరగబడినవాడు, కయ్యానికి కాలుదువ్వినవాడు అని అర్థం చెప్పవచ్చు. పగవాడు ఇలా బయటపడనక్కరలేదు. అదే వారిద్దరికీ భేదం.

శత్రుత్వానికి కారణాలనేకం. కొన్ని సమయాల్లో భయంవల్లకూడా శత్రుత్వం రావచ్చు. క్రూర జంతువులు మనిషికి భయపడి తిరగబడితే, మనిషి అవి చంపుతాయేమోనన్న భయంతో ముందుగా తానే చంపటంకద్దు. భయం, భీతి అనే రెండు సంస్కృతపదాల్లో రెండోదానికి వాడుక తక్కువ. భయభీతులని ద్వంద్వసమాసం చేసేవాళ్ళూ ఉన్నారు. భయానికి సరైన తెలుగుమాట వెరపు; భీతికి సరిపొయ్యే తెలుగు పదం జంకు. ఇప్పటివాడుకలో భయం, జంకు రెండే

ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాటలు. వెర, వెరగు – అనే తెలుగుమాటలు 'వెరపు' శబ్దానికి పర్యాయపదాలని కొందరు కోశకర్తలు చెప్పారు. కానీ 'వెరగు' అనేమాటకు ఆశ్చర్యమనే అర్థంకూడా ఉంది. జంకులో పిరికితనముంది; అది వెరపులోలేదా? అనుమానమే. నిర్భయంగా నిర్భీకంగా అనే మాటలున్నాయి. ఆ సందర్భంలో 'జంకులేకుండా' అనే అర్థం చెప్పుకోవాలి. వ్యుత్పత్తులను గాలించి మూలార్థం కనిపెట్టినా కాలక్రమంలో వాడుకలో నిలిచిన అర్థమే మిగులుతుంది నిజానికి.

# నిజానిజాలు

చాలా సందర్భాల్లో నిజానిజాలు తెలియక, తెలుసుకోక, తెలియజెప్పక శత్రుత్వాలు వస్తుంటాయి. మామూలుగా నిజం, అబద్ధం అనేవి వ్యతిరేకార్థక శబ్దాలుగా వాడుకలో ఉన్నాయి. నిజం, అనిజం అనే వాటిలోని రెండోమాట ఈ సమాసంలో తప్ప విడిగా కనిపించదు. ముందు నిజంసంగతి చూద్దాం – దానిలాగానే దాని పర్యాయపదాల సంఖ్య కూడా తక్కువే కాబట్టి. సత్యం, ఋతం, సూనృతం, సమ్యక్, తథ్యం వంటి సంస్కృతపదాలూ, 'నిక్కం, నిక్కువం, నిక్కం, నెటు' వంటి తెలుగుపదాలూ సమీపార్థంలో ఉన్నమాటలు. నిజం సంస్కృతమో తెలుగో ఉచ్చారణనుబట్టి చెప్తారు సంప్రదాయపండితులు! దాని వ్యుత్పత్తి కూడా సందిగ్ధమన్నమాట. నిజంనుంచి 'నైజం' అనే మాట పుట్టింది. దానికర్థం 'స్వభావం, పుట్టుకతో వచ్చిన గుణ'మని. ఓ పెద్దపండితుడు 'జని' (అంటే పుట్టుక) తిరగబడి 'నిజ' శబ్దం పుట్టిందన్నాడు! అదేమయ్యా అంటే 'సింహం'లోంచి 'హింస', 'హింస' లోంచి 'సింహం' పుట్టిందని యాస్కాచార్యుడంతటివాడు చెప్పగాలేంది జని–నిజాలు ఒకదాన్నుంచి మరొకటి పుట్టాయంటే తప్పా అని రెట్టించాడు. కాబోలు. పేచీ ఎందుకు?

నిజం, సత్యం అన్నివిధాలా సమానమైనవి కావు. సత్యం ఖచ్చితమైనది. తిరుగులేనిది. ఒకరు నిజ మనుకొన్నది మరొకరికి నచ్చకపోవచ్చు. స్వభావం మీద ఆధారపడ్డది నిజమయితే, నిత్యత్వం మీద ఆధారపడిన తాత్వికమైన నిజమే సత్యం. ఋతమనేది పుస్తకాల్లో మాత్రమే కనిపించేమాట. దాన్ని నొక్కిచెప్పే మరోమాట సూనృతం. ఋతం (రుతమనిరాస్తే నేటి భాషలో తప్పేంకాదు) ఋజువయింది – అంటే తిన్నగా ఉండేది, వంకరలేనిది. స్పష్టంగా కనిపించే వినిపించే నిజమన్నమాట. తెలుగు వాడుకలో 'ఋజువు, రుజువు' రెండూ ఉన్నాయి. మొదటిదానికి 'సూటిఅయిన' అనే అర్థముంటే రెండోదానికి 'నిరూపణ, సాక్ష్యం, దృష్టాంతం' అనే అర్థాలున్నాయి. 'బ'కు రెండు కొమ్ములిచ్చినమాట సంస్కృతం నుంచీ, 'ర'కు ఒక్కకొమ్మిచ్చింది ఉర్దూద్వారా పర్షియన్‌భాష నుంచీ తెలుగులోకి వచ్చినమాటలు (రెంటినీ 'రుజు'వనే రాయవచ్చుగాని సందర్భాన్నిబట్టి అర్థం గుర్తించవలసి వుంటుంది). సూనృతమంటే చాలా సూటిగా ఉండేది. స్పష్టమైనమాట అన్నమాట. వీటన్నిటిలోకీ సత్యమనేది

పెద్దమాట. దానికి వేదాంతంలో తర్కశాస్త్రంలో ప్రత్యేకమయిన అర్థాలున్నాయి. అబద్ధంకానిదనే అర్థంలో 'నిబద్ధి' అనే సమీపపద మొకటుంది. దానికిప్పుడు వాడుక తక్కువ. కట్టుబాటులేనిమాట అని అర్థం. మాటకు కట్టుబాటుంటే నిబద్ధి. సత్యం దైవానికి తప్ప మరిదేనికీ కట్టుబడి ఉండదంటారు కొందరు. దైవమే సత్యానికి కట్టుబడి ఉంటుందని మరికొందరు చెప్తారు. నిబద్ధి మాటకూ నిజం పుట్టుకకూ/స్వభావానికీ కట్టుబడి ఉంటుంది. తథ్యమన్నా సత్యమేనని కొందరు. దానికి తప్పనిది, తప్పకుండా జరిగేది అనే అర్థాలు కూడా ఉన్నాయి. నిజమనే అర్థంలో వాడుక చాలా తక్కువ.

నిక్కం, నిక్కువం, నిక్కెం అనే తెలుగుమాటలు ఒకదానికొకటి రూపాంతరాలు. మూలమొక్కటే. మరి గతిలేదుకాబట్టి దీన్నే/వీటినే సత్యాదులన్నిటికీ పర్యాయపదాలుగా భావించాలి. నేటు శబ్దానికి వ్యుత్పత్తి తెలియదు. పైగా దానికి ప్రయోగం చాలా తక్కువ. అది మారుమూలమాటకిందే లెక్క.

నిజానికన్నా అబద్ధానికే వ్యాప్తి ఎక్కువ. అందుకేనేమో సంబంధిపదాలుకూడా ఎక్కువే. "అసత్యం, కపటం, కైతవం, ఛద్మం, దంభం, మృష, అబద్ధి, అనర్థక"మనేవి సమీపార్థంగల సంస్కృతపదాల్లో ఎక్కువ వ్యాప్తికలవి. వాటినే తీసుకుందాం. అబద్ధమంటే కట్టుబాటులేనిదని చెప్పాలి. ఈమాటకే తెలుగులో వాడుక ఎక్కువ. దాని తరువాత బాగా వాడుకలో ఉన్నది అసత్యం. కపటంలో మోసముంది. కావాలని చెప్పే అబద్ధమే కపటం. కైతవ మనేది 'కితవ' శబ్దం నుంచి వచ్చింది. కితవు డంటే జూదగాడు. జూదంలో చేసేమోసమే కైతవం. ఆటనియమాలకు కట్టుబడకుండా ఉండటం కాబట్టి అదోరకం అబద్ధమన్నమాట – సంకుచితార్థంలో. ఛద్మశబ్దానికి మారు (వేషం), రహస్యం, దాపరికం అనే అర్థాలున్నాయి. నిజాన్ని దాచింది ఛద్మం; నిజానికి వ్యతిరేకం అబద్ధం. అనర్థకమనేమాటకు 'పొసగనిమాట' అని అర్థం. ఇప్పటివాడుకలో 'ప్రమాద'మనే భావం కూడా ఉంది. 'అర్థంలేని'దని, 'అర్థంకాని' దని కూడా వివరించవచ్చు. ఇంకా 'నికృతి' (తప్పుపని) వంటి మాటలను కూడా పర్యాయ/సమీపపదాలుగా పరిగణించే వారున్నారు. కాని ఆ బాపతు మాటలకు ప్రయోగాలు చాలా తక్కువ.

అనృతమనే మాటకు 'సేద్యం, కృషి' అనే అర్థాలు సంస్కృతనిఘంటువుల్లో కనిపిస్తాయి! ఈ అర్థాలెందుకు వచ్చాయో తెలీదు. అంతకన్నా ఘోరం, సంస్కృతంలో 'సత్యానృత' మనే మరోమాటుంది. మాటనుబట్టి 'సగం నిజం, నిజమైన అబద్ధం, నిజంగా కనిపించే అబద్ధం' వగైరా అర్థాలను ఊహిస్తే పప్పులో కాలువేశామన్నమాటే. నిఘంటువుల ప్రకారం ఆ మాటకు "బేరం, బేరమాడట"మని అర్థంట! వ్యాపారంలో, బేరంలో నిజానిజాలు రెండూ కలగాపులగ మైపోతాయనుకొని ఈ అర్థం కల్పించారేమో తెలీదు.

అచ్చతెలుగులో అబద్ధానికి పర్యాయపదాలని చెప్పేమాటలు చాలా ఉన్నాయి. "కల్ల, కొడిమె, దబ్బర, ఉల్లసం, బూతు, బూమె, బూక, బూటకం, బద్దు, బొంకు, వేడబం, హుళిక్కి (వాడుకలో హుళక్కి అనే రూపమే ప్రచురం)" మొదలైనమాటలున్నా, 'కల్ల, బొంకు' అనేవాటికే ప్రయోగబాహుళ్యం కనిపిస్తుంది.

కలకూ కల్లకూ వ్యుత్పత్తిరీత్యా చాలా దగ్గరి సంబంధముంది. లేనిది ఉందని చెప్తే కల్ల. ఉన్నది లేదంటే బహుశా బొంకేమో! 'దబ్బర'కు అబద్ధమనే అర్థంలో కావ్యప్రయోగాలు మెండు. హుళిక్కి/హుళక్కి అంటే శూన్యం, లేనిదన్నమాట. ఈ పదం కన్నడం మంచి దిగుమతి అయింది. అన్నట్లు తెలుగులో భాస్కరరామాయణం రాసిన కవిని హుళక్కి భాస్కరుడని వ్యవహరిస్తారుగాని అది పొరపాటు. ఆమాట 'హుళకి' – అంటే తాంబూలం. ఈ గ్రంథం రాయడానికి రాజుదగ్గర 'తాంబూలం పుచ్చుకొన్నాడన్నమాట' (–అంటే అంగీకరించాడని అర్థం). బూతుకు 'తిట్టు, తప్పుమాట, పదిమందిలో పలకరానిపదం' అన్న అర్థాలతోబాటు 'పొగిడేవాడు, భట్రాజు' అనే అర్థాలు కూడా ఉన్నాయి. బూతు అతిశయోక్తి కావచ్చుగాని అంతా అబద్ధం కాదు. కల్లను పెంచిచెప్తే బూతవుతుంది.

బూక అనే మాటకిప్పుడు వాడుకలేదుగాని దాన్నుంచి పుట్టిన 'బూకరింపు' దబాయింపనే అర్థంలో ప్రయుక్తమవుతున్నది. లేనిది ఉందని గట్టిగా చెప్పటం బూకరింపు. అదే పూర్వం బూక. బూమె శబ్దం 'భ్రమ' నుంచి పుట్టిందనేవాళ్ళున్నారు. నిజానికి దాని వ్యుత్పత్తి తెలీదు. బూటకం ముమ్మూర్తులా కపటంతో సమానమయిన తెలుగుమాట. మోసంతో కూడిన అబద్ధమని వివరించవచ్చు. ఉల్లసమనేమాటకు "ఎత్తిపొడుపు" అనే అర్థంకూడా ఉంది. వేడబం పుస్తకాల్లోమాత్రమే కనిపిస్తుంది. వాడుకలో వినిపించదు.

## కష్టసుఖాలు

నిజానిజాలే కష్టసుఖాలకు . కారణమవుతాయి. మనదో చిత్రమయిన భాష. తెలుగులో కష్టాలకున్నన్ని పర్యాయపదాలు సుఖాలకు కనిపించవు. 'సంకటం, బాధ, సంబాధ, ఆధి, వ్యాధి, విపత్తు, ఆపత్తు, ఆపద' మొదలైన సంస్కృతపదాలు కష్టానికి పర్యాయపదాలు. తెలుగు మాటలు 'ఇడుమ, బెడద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆత్రం, అంగలార్పు, గోరం, దొసగు, వెత, కస్తి, అంగద, కడగండ్లు, అగచాటు, అగబాటు, బాము, చోద, పల్లటం, మల్లట, చోడుమ, బడవ'లాంటి వనేక మున్నాయి.

కష్టమనేది (బహుశా కష్టాలనే బహువచనరూపంలో) చాలా ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట. శరీరానికిగాని మనసుకుగాని ఒత్తిడి కలిగించి అలసటపెట్టేది కష్టం. బాధ అలాంటిదేగాని వ్యక్తిని కట్టిపడేసి ఎటూ తోచని పరిస్థితి కలిగించేదికూడా. సంబాధ(ం) అంటే తీవ్రమయిన బాధ. ఆధి అనేది మనసుకు మాత్రమే కలిగిన కష్టమయితే వ్యాధి శరీరానికి వచ్చిన కష్టం. కష్టంకన్నా బాధ, దానికన్నా సంబాధ తీవ్రమయినవి. ఆధి వ్యాధులు విడివిడిగా ప్రత్యేక కష్టాలు; కలిసికట్టుగా మనిషిని పూర్తిగా బాధించేవి. ఆపద ఆపత్తులకు రూపభేదమేగాని అర్థభేదంలేదు. విపత్తు విశేషమయిన ప్రమాదమయితే ఆపత్తు/ఆపద సాధారణ ప్రమాదం. అనుకోని సంఘటన ద్వారా మామూలుగానో ప్రత్యేక పద్ధతిలోనో వచ్చే కష్టం ఆపద;

తీవ్రంగా ఉంటే విపత్తు. ఈ రెంటిలోనూ 'ప్రమాద' వశాన వచ్చిన కష్టముండటం సమానధర్మం; అవి రెండూ అనుకోని కష్టాలన్నమాట. సంకట శబ్దానికి ఇబ్బంది, ఇరుకు అనే అర్థాలున్నాయి.

తెలుగు కావ్యాల్లో అనేక పదాలు కష్టపర్యాయాలుగా కనిపించినా 'ఇడుమ, కడగండ్లు, అగచాటు, బాము' అనేవే బహుళ వ్యాప్తిలో ఉన్నాయి. ఇడుమకూ ఇబ్బందికీ పెద్ద అంతరమున్నట్లు తోచదు. తమంత వచ్చిపడ్డ ఇబ్బందులు ఇడుమలు. వాటిని అనుభవించక తప్పదు. కడగండ్లు శబ్దానికి ఏకవచన రూపం ప్రయోగాల్లో కనిపించదు; అది నిత్యబహువచన మన్నమాట – కడదాకా అంటే జీవితాంతం నిలిచే కష్టాలవి. అగచాటు, అగబాటు అనేవి కనిపించే కష్టాలు, లోకానికి తెలీకుండా తమలో తామే బాధపడేవి కావవి. బహిరంగకష్టా లన్నమాట. బాము శబ్దం 'భ్రమ' నుంచి వచ్చిందంటారు కొందరు. నిజానికి కష్టాలు కాకపోయినా కష్టాలనిపించేవి బాములు. తిక్కనాదులు ఈ శబ్దాలను ఎంతో మెలకువతో ప్రత్యేకార్థాల్లో ప్రయోగించారు. మామూలు కవులు ఈ అర్థవిశేషాలను పాటించకుండా గణయతిప్రాసలు సరిపోతేసరి అని అన్నింటినీ ఒకేవిధంగా ప్రయోగిస్తుంటారు.

బెడద అంటే భయం పుట్టించే కష్టం; తీవ్రమయిందన్నమాట. బెడదకు ప్రమాదం, ఆశ్చర్యకర కష్టమనే విశేషార్థాలు కూడా కనిపిస్తాయి. దెస అనేది నిఘంటువులు పొరపాటున పర్యాయపద పట్టికల్లో చేర్చిన మాటేమో! అది దిశ/ దిక్కు అనే శబ్దం నుంచి పుట్టిందనవచ్చు. చేటు శబ్దానికి నష్టమనే అర్థంకూడా ఉంది. చెడిపోవటం చేడ్పాటు. కష్టాలకు ఫలితంగా వచ్చే ప్రమాదం చేడ్పాటు. దీనికి క్రియారూపం చేడ్పడు. గొడవకు 'గోల, అల్లరి, శత్రుత్వం, పొరపొచ్చెం, అభిప్రాయభేదం'లాంటి అర్థవిశేషాలుకూడా ఉన్నాయి. ఆత్రం బహుశా సంస్కృతంలోని అతురత అనే శబ్దం నుంచి పుట్టింది కావచ్చు. 'తొందరపాటు' అనే ప్రత్యేకార్థం దానికుంది. అంగలార్పు అనేది తీవ్రబాధా సూచకం. బాధ(లు) భరించలేక ఏడవటం అనేది అంగలార్పు ప్రత్యేక లక్షణం. దుఃఖపూరితంగాని కష్టం అంగలార్పు కాదు. గోరం అనేది కేవలం ప్రాంతీయ వ్యవహారంలో ఉన్నమాట. అది 'ఘోర' శబ్దభవమని కొందరంటారుగాని 'రోగ' శబ్దంలోని వర్ణవ్యత్యయం వల్ల ఏర్పడ్డదనటమే సమంజసతరంగా ఉంటుంది. కొన్ని ప్రాంతాల్లో – గుంటూరు, ప్రకాశం ప్రాంతాల్లో – పెద్దింటివాళ్లు కష్టాల్లో ఉన్నా, రోగగ్రస్తులై ఉన్నా, 'అమ్మగారి 'గోరం' తగ్గిందా?' అని ఓదార్పుగా అడగటం కద్దు. రోగశబ్దం వాడటం బాగుండదని (రోగం కుదిరింది – వంటి ప్రయోగాల్లో ఆక్షేపణ పాలెక్కువ కాబట్టి) గోరం అనే రూపాన్ని వాడటం వినిపిస్తుంది.

దొసగు అంటే నిజానికి తప్పనే అర్థం. 'వెత' సంస్కృతంలోని 'వ్యథా' శబ్దం నుంచి ఏర్పడింది. 'వెతలుకుడుచు' వంటి ప్రయోగాలు 'బాధలు అనుభవించు' అనే అర్థంలో పూర్వకావ్యాల్లో కనిపిస్తాయి. విశేషమైన బాధనే వ్యథ/వెత అనవచ్చు. కుమిలిపోవటం వంటి మానసిక కష్టాలే వెతలు. కస్తి అనేది చిన్న కష్టాలకూ, పెద్ద ఇబ్బందులకూ సూచకం. ఇప్పటికీ ఈ మాటకు వాడుక లేకపోలేదు. 'చోద, పల్లటం, మల్లటం, చోడుమ, బడవ'ల అర్థం స్పష్టంగా తెలియదు – వ్యుత్పత్తులంతకన్నా అస్పష్టం. వీటికి ఇప్పటి కావ్యాల్లో కూడా వాడుక చాలా తక్కువ.

సుఖం తెలుగువాళ్లకు దొరకని వస్తువేమో! 'సుకం, సుగం' అనే తద్భవరూపాలే గానీ మరే అచ్చతెలుగు మాటలూ నిఘంటువుల కెక్కినట్లు లేదు. సంస్కృతంలో 'అబాధ, మోదం, ఆమోదం, ప్రమోదం, సమ్మోదం, ఆనందం, శర్మ, శాతం, సాతం, ప్రీతి, ప్రసాదం, హర్షం' వంటివి సుఖ శబ్దానికి పర్యాయాలని నిఘంటువులు ఘోషిస్తున్నాయి. బాధకు కేవలం వ్యతిరేకమైనది అబాధ. మోదమంటే సంతోషం. ప్రమోదం మరీ ఎక్కువ సంతోషం. సమ్మోదం పూర్తి సంతోషం. హర్షం అంటే మనస్సుకు కలిగే ఆనందం, తృప్తి. శర్మ శబ్దానికి శాంత లక్షణం గల ఆనందమని విశేషార్థం. ప్రీతి అంటే ఇష్టం, నచ్చిక. ఇలా చూస్తుంటే సంస్కృతంలో కూడా సుఖం తక్కువే నవిపిస్తుంది!

## తెలివితేటలు

నిజానిజాలూ కష్టసుఖాలూలాంటి భావాలను నిరూపించేది 'బుద్ధి'. ఇలాంటి అమూర్త వస్తువులను (అంటే కంటికి కనిపించని రూపంలేని మాటలను) సూచించే పదాలు తెలుగులో చాలా తక్కువ సంస్కృతంతోపోలిస్తే. అమరకోశంలో కనిపించే మాటలను తీసుకున్నా బుద్ధివిశేషాన్ని వివరించే పదాలు సంస్కృతంలో చాలా వున్నాయి – 'మనీష, ధిషణ, ధీ, ప్రజ్ఞ, శేముషి, మతి, ప్రేక్ష, ఉపలబ్ధి, చిత్తు, సంవిత్తు, ప్రతిపత్తు, జ్ఞప్తి, చేతన, మేధ, సంకల్పం, అవధానం' మొదలైనవి.

బుద్ధిశబ్దానికి 'తెలివి, ఎరుక, తలపోత'వంటి తెలుగు మాటలు సమీపపదాలు. ఎరుక శబ్దానికి జ్ఞానం అనే అర్థం వుండగా తలపోతకు ఆలోచన, ఊహ అనే అర్థవిశేషాలున్నాయి. 'వాడికి బుద్ధీ జ్ఞానమూ లేవ'నే మాటలు వింటుంటాం. సహజంగా ఉండే పుట్టుకతో వచ్చిన తెలివి బుద్ధి. లోకాన్ని చూసి, అనుభవాలు పొంది గడించిన ఎరుక జ్ఞానం. ఈ రెండూ లేవనేది ఆక్షేపణ. తెలుగులో మరో చిత్రమైన నానుడి వుంది. 'తెలివి ఎక్కువయితే బుద్ధి తక్కువవుతుంది' అనేది! అంటే సొంతంగా తెలివితేటలున్న వ్యక్తి ఇతరులు చెప్పేదాన్ని వేదప్రమాణంగా ఒప్పుకోడని. బుద్ధికీ 'బోధ'కూ సంబంధముంది. బోధ అంటే తెలివిడి – తెలుసుకోవటం. ఈ బోధ తనంత తానుగా స్వీయానుభవాలవల్ల కలిగేది. దాన్ని ప్రయత్నపూర్వకంగా కలిగించటమే బోధన. స్వయాన తెలుసుకున్నవాడు బుద్ధుడు. ఒకరు తెలియజేస్తే తెలుసుకున్నవాడు బోధితుడు; అలా తెలియజెప్పేవాడు బోధకుడు.

'మనీష' అంటే ఆలోచనద్వారా వచ్చిన జ్ఞానం. అటువంటి జ్ఞానంగల వ్యక్తి మనీషి. ఇటీవల చమత్కారంకోసం 'మనీ(డబ్బు), షి(స్త్రీ)' – ఈ రెండూ ఉన్నవాడే మనీషి అని కొందరు నిర్వచిస్తున్నారనుకోండి! 'మన్' అంటే ఆలోచన. ఆలోచనాపరుడు మనీషి. ఆలోచనవల్ల కలిగిన తెలివి మనీష. మతి అన్నా 'తెలివి, ఆలోచన' అనే చెప్పవచ్చు. 'వాడికి మతిలేదు, బుద్ధి లేదు' అనే వాక్యాల్లో 'సక్రమమైన'

ఆలోచన, 'సరయిన' తెలివి లేవనే ఆక్షేపణ వుందన్నమాట. ప్రజ్ఞ అంటే గొప్ప తెలివిడి. ప్రేక్ష అంటే బాగా 'చూసి' తెలుసుకోగల శక్తి. అన్నీ గమనించగల శక్తి ప్రేక్ష. ఉపలబ్ధి అంటే సహజంగా జన్మసిద్ధంగా వచ్చిన తెలివి. లబ్ధి అంటేనే 'వచ్చిపడ్డది' అని అర్థం. జ్ఞప్తి అంటే గుర్తు. మంచిచెడ్డలూ నిజానిజాలు వగైరాలను గుర్తించగలగటం జ్ఞప్తి. ఇవన్నీ అర్థం చేసుకోగల సామర్థ్యాన్ని సూచించే మాటలు.

ఒకసారి గుర్తించిన, తెలుసుకున్న విషయాన్ని మనసులో నిలుపుకోగలగడం మేధ. ఈ శక్తిని 'మేధాశక్తి' అంటారు. చాలామంది 'మేదశ్శక్తి' అని పొరపాటుగా వాడుతుంటారు. మేదస్సు అంటే మెదడు. మేధ అంటే తెలివితేటలు. ఇవి రెండూ ఒకదానిమీద మరొకటి ఆధారపడ్డవే కాబట్టి ఈ పొరపాటు ప్రయోగం వచ్చిందన్నమాట. మనస్సు చేసేపని – ఆలోచన, ఊహ మొదలైనవి – సంకల్పం. ఖచ్చితంగా చెప్పితే 'అనుకొన్నది' అని తెలుగుచేయాలి. దీనికి విరుద్ధమయింది 'వికల్పం'. అనుకొన్నదానికి పూర్తిగా వ్యతిరేకమైనది వికల్పం. అవధానమంటే ఒకవిషయంగాని అనేక విషయాలుగాని మనస్సులో నిలిపి వుంచటం. దృష్టిని కేంద్రీకరించి, ఏకరంధిగా, ఒకేపట్టుగా చేసే ఆలోచన అవధానం. అవధానంలో గుర్తు, పట్టుదల కూడా ఉంటాయి. దీన్నే 'మనస్కార'మని కూడా అంటారు. అంటే 'మనను చేసేపని' అన్నమాట.

చర్చ అనేది కూడా బుద్ధికి దగ్గరిమాటే. ఒక విషయంలోని మంచిచెడ్డలను జాగ్రత్తగా పరిశీలించటం చర్చ. ఈ కాలంలో ప్రతిపనికీ ఒక చర్చాగోష్ఠిని ఏర్పాటుచేసి ఎవరి ఉపన్యాసం వారు చెప్పిపోవటంకూడా చర్చకిందే చలామణి అయిపోతున్నది. భావికాలంలో ఈమాటకు ఈ కారణంగా 'చెప్పింది వినట' మనో, 'సభ చేయుట' మనో, మైకులూ పూలదండలూ ఫోటోగ్రాఫులూ వగైరాలు ఏర్పాటుచేయుటమనో అర్థం రావచ్చు! 'తర్కం' బుద్ధి చేసేపని. ఊహ లేనిదాన్ని ఆలోచనద్వారా చర్చద్వారా కల్పించటం. ఇలాంటి భేదాలెన్నో!

తెలివి, ఎరుక అన్నవి అన్నివిధాలా ఒకటి కావు. తెలివి సహజం. ఎరుక సంపాదించినది – తరవాతి కాలంలో వచ్చేది. ఎరుకకు మరో రూపం 'ఎరకువ' అనేదుంది. అలాగే తెలివికి 'తెలివిడి' అనే సమీప పదముంది. తెలివిడి అనేది నిజానికి జ్ఞానం. తెలుగు మాటలకు సంస్కృతంలోనో, నాలెడ్జ్ అని ఇంగ్లీషులోనో అర్థం చెప్తే స్పష్టంగా వుండవచ్చు.

బుద్ధికి వ్యతిరేకపదాలేవనే అనుమానం వస్తే తప్పేంలేదు. అబుద్ధి, అజ్ఞానం వంటి మాటలేగాని, ఇలా సమాసాలుగాని వ్యస్తపదాలున్నట్లు లేదు. ఉన్నాయని గిట్టించినా వాటికి వాడుక ఉన్నట్లు లేదు. తెలుగులో కూడా 'తెలివి ఎక్కువ, తెలివిలేమి' వంటివే వ్యతిరేకార్థకాలుగా స్ఫురిస్తాయి. 'మొద్దు' వంటి మాటలున్నా అవి 'కదలికలేని, చెట్టుబోదె' వంటి విశేషణ విశేష్యార్థాలు కలవే! అయినా కావలసింది తెలివితేటలేగాని అవి లేకపోవటం కాదు కాబట్టి మనవాళ్లు బండెడు పర్యాయపదాలనో సమీపపదాలనో సృష్టించుకొని వుండకపోవచ్చు. 'మొద్దూ మొకరం' అనే ప్రయోగం తెలుగులో తెలివితక్కువ వాళ్లను ఆక్షేపిస్తూ వాడుకలో వుంది. అక్కడకూడా మొద్దంటే కొమ్మలూ రెమ్మలూ లేని చెట్టుబోదెలాంటి వ్యక్తి

అనే అర్థం. మొకరం/మొగరం అనేమాటకు 'స్తంభం' అని అర్థం. ఓ బండలాగా, మొండిచెట్టులాగా, గుంజిలాగా, రాటలాగా ఏ ఆలోచనా ఏపాటి జ్ఞానమూలేని వ్యక్తి అనే నిందే ఇందులో వినిపిస్తుంది. మొత్తానికి మన 'బుద్ధుల'వల్లనే మానావమానాలు వస్తాయి. శుభాశుభాలు కలుగుతాయి.

# మానావమానాలు

మానవజాతిలో సంఘర్షణలకు దారితీసే మానసిక లక్షణాల్లో మానావమానాలు ముఖ్యమైనవి. ఒకరి మానంవల్ల మరొకరికి అవమానం జరిగినప్పుడు పరిణామాలు తీవ్రంగా ఉంటాయి. భారత రామాయణాదుల్లోని మహాయుద్ధాలకు దారితీసిన సంఘటనలన్నీ ఆయాపాత్రల మానావమానాలమీదే ఆధారపడ్డవి. మొదట మానం సంగతి తెలుసుకుందాం. కొద్దిపాటి అర్థభేదాలతో మాన శబ్దానికి సన్నిహితంగా ఉండేమాటలు చాలా ఉన్నాయి! "గౌరవం, ఆదరం, గర్వం, అహంకారం, అభిమానం, దర్పం, అవలేపం, అవష్టంభం, స్మయం, మదం" అనే సంస్కృత పదాలూ 'మన్నన, మన్నిక, మన్నింపు, ఈలువు' వంటి తెలుగుశబ్దాలూ ఈ కోవకు చెందినవి.

మానమంటే తన ఘనతనే గుర్తించే స్వభావం. సహజంగా ఈ భావమున్న వ్యక్తికి ఇతరులమీద చిన్నచూపుంటుంది. ఈ స్వభావం మరింత ఎక్కువై ఇతరులు తన ఘనతను గుర్తించలేదనే బాధతో కుమిలిపోవటాన్ని 'మానరోష' మంటారు. తనకు పారిజాత పుష్పం ముందుగా ఇవ్వలేదనుకున్న సత్యభామ ప్రకటించిన లక్షణం మానరోషం. దాంతోనే కృష్ణుణ్ణి ఎడమకాలితో తన్నిందంటారు. ఎదుటి వ్యక్తిమీద తనకున్న మానం – అంటే గౌరవభావం అభిమానం. స్పష్టతకోసం తనమీద తనకున్న అభిమానాన్ని ఆత్మాభిమాన మంటారు. 'మాన్యత, మాన్యుడు, మాననీయుడు' మొదలైన మాటల అర్థాలకూ మాన శబ్దార్థానికీ సన్నిహిత సంబంధముంది. గౌరవశబ్దం గురువనే విశేషణం నుంచి పుట్టింది. పెద్దతనాన్నీ పెద్దరికాన్నీ గుర్తించి ప్రవర్తించటం గౌరవం చూపటం. ఆదరం ప్రేమతో కూడిన గౌరవభావం. అది విడిగా అంత స్పష్టంగా అర్థవంతంగా ఉండదని కాబోలు 'గౌరవాదరాలు, ప్రేమాభిమానాలు' మొదలైన సమాసాలు వాడుతుంటాం. గౌరవం చూపదగిన వ్యక్తి 'గౌరవనీయు'డని మంత్రులు వగైరాలను అలా సంబోధిస్తుంటాంగాని వ్యాకరణం ప్రకారం అది తప్పుశబ్దం. మాననీయుడనో మాన్యుడనో అనాలి. అన్నట్లు 'మంత్రి' శబ్దంకూడా ప్రాంతీయంగా గౌరవంలేని మాటే. కళింగప్రాంతంలో (విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల్లో) మంగలిపని చేసేవాళ్ళని 'మంత్రు'లనీ, నేతపనివాళ్లని 'సేనాపతు'లనీ పిలుస్తారు! మన మంత్రులు దేశానికీ దేశసంపదకూ అలాంటిపని చేయగూడదనుకున్నవాళ్లు 'అమాత్యు'లనీ, 'సచివు'లనీ వాళ్లని పిలుస్తుంటారు. కార్యదర్శులను 'సచివు'లంటారు ఉత్తర హిందూస్థానంలో. మన రాష్ట్రంలో కూడా వాళ్లంతా ఉండేచోటును 'సచివాలయ'మంటున్నామని గుర్తించండి – సెక్రటేరియట్‌కు తెలుగు అనువాదంగా).

మావ శబ్దానికి సమీప పదాల్లో ఎక్కువ వాడుకలో ఉన్నమాట 'గర్వం'. ఈ అర్థంలోనే ప్రాంతీయంగా 'అతిశయ' మనేమాట వాడుకలో వినిపిస్తుంది. తన్ను తాను గొప్పగా భావించటం అతిశయం. ఇది సంస్కృత పదమేగాని సంస్కృతంలో ఈ అర్థ విశేషం కనిపించదు. 'ఎక్కువ' అనే అర్థమే ఆ భాషలోని సహజార్థం. గర్వమున్న వ్యక్తికి తప్పకుండా ఉండే మరో లక్షణం 'అహంకారం'. అహమంటే నేను. అహంకారమంటే నేనే ప్రయోజకుణ్ణనీ, అంతా నాకే తెలుసని, అన్నీ నేనే చేయగలననీ మిడిసిపడటం – విర్రవీగటం. అహంకారమున్న వ్యక్తికి తప్పకుండా ఉండేది దర్పం. గర్వంవల్ల అహంకారం, దానివల్ల దర్పం పుట్టుకొస్తాయి. 'మింగమెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగనూనె రాసే' మనస్తత్వానికి దర్పమని పేరు. డాబు, డాబుసరి, (కొన్ని సందర్భాల్లో బడాయి) దర్పానికి సమానమయిన తెలుగు (?) మాటలు. బడాయి హిందీనుంచి వచ్చినమాట. మూలార్థంలో నేనే గొప్ప/పెద్ద అనే భావమది. దీనికి సమంగా గోదావరిజిల్లాల్లో వినిపించే మరోమాట 'గీర'. ఎక్కువవాడుకలో ఉన్న మరో సమీప పదం 'మదం'. ఈ భావమున్న వ్యక్తి మత్తులోపడ్డట్లు వ్యవహరిస్తాడు. 'స్వాతిశయ' భావంతో విర్రవీగటమే మదం. ఇక 'అవష్టంభం, స్మయం, అవలేపం' అనే పదాలు కావ్యభాషలో మాత్రమే కనిపిస్తాయి. వాటి వాడుక లేనిదానితోనే సమానం.

ఎక్కువగా ప్రదర్శించే మానం 'బహుమానం'. నిజానికి ఆ మాటకు అర్థం మారిపోయింది. నేటివాడుకలో ఇప్పుడు 'బహుమతి, పురస్కారం, బహూకృతి, ప్రెయిజ్' వగైరా అర్థాల్లోనే బహుమాన శబ్దం వాడుతున్నాం. బహుమానితుడంటే కావ్యభాషలో పెద్దగా గౌరవం పొందిన వ్యక్తి అనే అర్థమే ఉంది. వాస్తవంలో బహుమతి శబ్దానిక్కూడా అటువంటి అర్థమే ఉండేది. గొప్పవాడని భావించటం బహుమతి; ఆ దృష్టితో గౌరవించటం బహుమానం; అలా పెంచి పెద్దచేయటం బహూకృతి. ఈ అర్థాలు మారి వ్యక్తినీ వ్యక్తిత్వాన్నీ గుర్తిస్తూ ఏదైనా వస్తువునో పతకాన్నో సొమ్మునో (చివరికి కాణీ ఖర్చులేని బిరుదాన్నో) ఇవ్వటాన్ని బహుమానించటమనీ, ఇచ్చినదాన్ని బహుమానం/బహుమతి/బహూకృతి అని పిలుస్తున్నాం. 'మీకీవస్తువును బహూకరిస్తున్నామం'టే ఇస్తున్నామనేగాని మిమ్ము గౌరవిస్తున్నామన్న అర్థం ఈ కాలానికి మరుగుపడిపోయింది.

తెలుగులో 'పొగరు, మిడిసిపాటు, డాబు(సరి), గీర, విర్రవీగటం, తలతిరుగుడు, కళ్ళు నెత్తికెక్కటం, అదిరిపాటు' వగైరా మాటలున్నాయి. పొగరు అహంకారానికి, మిడిసిపాటు మదానికి ఇంచుమించు సమానమైన పదాలు. గర్వంనుంచి 'గరువం' అనే తెలుగుమాట పుట్టింది. నిఘంటువులు అభిమానానికి సమానపదమని 'ఈలువు' అనే తెలుగుమాటను పేర్కొంటాయి. ఇది 'నీలుగు' అనే మాటకు రూపాంతరం. నీలుగు అనేదానికే వాడుక ఎక్కువ. మొండితనంతో గూడిన గర్వమది. ఇక బహుమాన శబ్దంతోబాటు అర్థంమారిన తెలుగుమాట మన్నన. తిక్కన వాడుకలో దీనికి వ్యాప్తి ఎక్కువ. మన్నింపు అనేది మన్నించు (=గౌరవించు, ఆదరించు) అనే క్రియారూపంనుంచి ఏర్పడ్డ నామవాచకం. 'మన్నిక' అనేదీ అటువంటిదేగాని ఈ కాలానికి దాని అర్థంమారి 'చాలాకాలం చెడకుండా మారకుండా ఉండే'దనే

అర్థవిశేషం సంపాదించుకున్నది. బహుమాన శబ్దానికి ఇప్పుడున్న అర్థంలో కావ్యాల్లోనే కనిపించే తెలుగుమాట 'ఉడుగర'; వాడుకలో కూడా వినిపించేది 'కానుక' (కాన్కి, కానిక – వంటి రూపాలు పుస్తకాల్లో ఉంటాయి).

అవమానమన్న సంస్కృత పదానికే తెలుగులో వాడుక ఎక్కువ. దానిసమీప పదాల్లో 'పరాభవం, తిరస్కారం, పరిభవం' అనే వున్నాయని చెప్పవచ్చు. అగౌరవమనే వ్యతిరేకరూపం కూడా బాగా వాడుకలో ఉంది. 'అనాదరం, పరీభావం, తిరస్క్రియ, తిరస్కృతి, అవమాననం, రీఢ, అవజ్ఞ, (అవ)హేళనం, నికారం, న్యక్కారం, అభీభావం, అవగణన, అవమతం, అసూక్షణం, అసుక్షణం' వంటి సమీపపదాలు కావ్యభాషలో కనిపిస్తాయి. ఆదరం చూపకపోవటం అనాదరమయితే మానం గుర్తించకపోవటం అవమానం. ఉన్నగౌరవాన్ని తగ్గించిచూడటం అవమానం. ఉన్నగౌరవాన్ని తగ్గించి చూడటం, తక్కువగా చూడటం అవమానం. నిర్లక్ష్యం చేయటం తిరస్కారం. సదరువ్యక్తికున్న గౌరవం చూపకపోగా, అసలావ్యక్తే లేనట్లు భావించటం తిరస్కారం. ఎదుటివ్యక్తిని లేనివాడితో సమంగాభావించటమేగాక తక్కువ చేయటం తిరస్క్రియ. ఈ మాటకు 'మాయంకావటం, కనిపించకపోవటం, అదృశ్యంకావట'మనే అర్థవిశేషాలు కూడా ఉన్నాయి. కనిపించకుండా చేయటమనే అర్థంలోనే తెరగుడ్డకు 'తిరస్కరిణి' అనేపేరు వచ్చింది. పరదా అనే అర్థంలోనేగాక, మాయమయ్యే, లేదా ఎదుటివాళ్లకు కనిపించకుండాపోయే విద్యకు పేరుగాకూడా తిరస్కరిణీ శబ్దానికి ప్రయోగముంది. అవమానంచేయటం అవమాననం. పరిభవం, పరీభావమనేవి 'రూపాంతరాలు'. పరాభవ శబ్దానికీ వీటికీ సన్నిహిత సంబంధముంది. 'దూరంచేయటం, విసిరికొట్టటం' వగైరా అర్థవిశేషాల్లో పరాభవాదులకు ప్రయోగాలు కనిపిస్తాయి. అవమానించటం మాటలరూపంలో ఉంటే పరాభవం క్రియారూపంలో ఉంటుందికాబట్టి అది తీవ్రతరమయింది. అనాదరానికి 'అనాదృతి' అనే రూపాంతరముంది.

అవజ్ఞ అనేది సుకుమారమయిన అవమానం. తక్కువవాడని తెలుసుకోవటం అవజ్ఞ. తెలుసుకొని లేదా గుర్తించి భావించి ఏంచేస్తారనేది తరవాతి విషయం. హేళన, అవహేళన, వహేళన అనేవి వెక్కిరింతలు. మాటలద్వారాగాని చేష్టలద్వారాగాని 'వేళాకోళం' చేయటం హేళన. హేళనలో అవతలివ్యక్తిని కించపరచటం లేకపోవచ్చు. కానీ (అ)వహేళనలో కించపాటు, తక్కువచేయటం ముఖ్యం. అవగణనమంటే తక్కువచేయటం. గణనశబ్దానికి లెక్కించటం, గుర్తించటం మొదలైన అర్థాలున్నాయి. అవగణన తక్కువ వ్యక్తి/వస్తువని పరిగణించటం/చూడటం. అవమతశబ్దానికి తక్కువ వ్యక్తి వస్తువని 'భావించట'మని అర్థం. అవగణనం క్రియారూపమయితే అవమతం కేవలం మానసికమైన భావన. అన్నట్లు పరాభవ శబ్దానికి పండితభాషలో ఓగమ్మత్తయిన తెలుగు పర్యాయపదముంది. అది 'నలభై'. అరవై సంవత్సరాల చక్రంలో 'పరాభవ' నలభయ్యోదికాబట్టి అతడికి పరాభవం జరిగిందనటానికి 'నలభై అయిం'దంటారు (స్పష్టంగా నోటితో చెప్పకుండా).

తక్కిన సంస్కృత పదాలకు కావ్యభాషలో మారుమూల ప్రయోగాలున్నాయని కూడా వెంటనే చెప్పలేనివి 'అసూక్షణం, అసుక్షణం, అభీభావం' అనే శబ్దాలు. నికారమనేపదానికి అక్కడక్కడ కావ్యప్రయోగాలు లభిస్తాయి. న్యక్కారమనే మాటకు

'ఛీఅనట'మని అర్థం చెప్పవచ్చు. దీనికి కావ్యప్రయోగాలేగాని వ్యవహార ప్రయోగమున్నట్లు లేదు. కానీ 'ధిక్కారమును సైతునా, కుటిలజన ధిక్కారమును సైతునా' అన్నపాట తెలుగునేల నాలుగుచెరగులా మారుమోగిపోయింది. ధిక్కారాన్ని 'ఛీకొట్టడ'మని అనువదించవచ్చు. క్రియాపదమైన ధిక్కరించుకు 'ఎదురుతిరుగు, తిరుగుబాటుచేయు' మొదలైన అర్థాలువచ్చి 'ఛీకొట్టు' అనే సగంతెలుగు, సగం సంస్కృతం క్రియాపదముంది. దానికి అవమానించు అనే అర్థం. అవమానం పొందాలంటే భంగపడాలి; అవమానం చేయాలంటే భంగపరచవచ్చు కూడా.

తెలుగు 'బన్న'మనే మాటకు భంగమని అర్థమంటారు. అది భగ్నశబ్దభవమని కొందరంటే మరికొందరు భంగ శబ్దంనుంచే వచ్చిందంటారు. ఏమయితేనేం? అది అచ్చతెలుగనే లెక్కిద్దాం – వ్యాకర్తల ననుసరించి. బన్నమనేమాటకు కష్టమనే అర్థభేదం కూడా ఉంది. తెలుగులో అవమానపర్యాయాలని నిఘంటువులు పరిగణించినమాటలు 'ఒచ్చెం, ఎల్లిదం, చౌక, నలుచు' అనేవి. ఎల్లిదానికి ఏలిదమనే రూపాంతరముంది. దీనికి 'తేలిక, తక్కువ, ఎగతాళి, వేళాకోళం' మొదలైన అర్థాలున్నాయి. ఈ మాట నేటివాడుకలో ఉన్నట్లు తెలీదు; తిక్కన భాషలో చాలాచోట్ల కనిపిస్తుంది. ఒచ్చెం అనేమాట వ్యుత్పత్తి సరిగాతేలదు కానీ అక్కడక్కడ పాతకాలపు మనుషులవాడుకలో ఇంకా వినిపిస్తుంది – పల్లెటూళ్లలో. 'చౌక'కు గిరాకీ ఎక్కువ. '(వెల)తక్కువ' అనే అర్థవిశేషంలో ఈ మాటకు బహుళవ్యాప్తి ఉంది. 'కించపాటు' అనే నామరూపం, 'కించపరుచు' అనే క్రియాపదం కొద్దిమంది వాడుకలో ఉన్నాయి.

మానావమానాలను గురించి మామూలు మనుషులు పట్టించుకోవాల్సిందేగాని పండితులు గుర్తించనక్కరలేదంటారు. 'భారతసావిత్రి'లో 'మానావమానంబులు దేహంబునకేగానిఆత్మకుం జెందనేర'వని సాక్షాత్తుశ్రీకృష్ణపరమాత్మ విదురుడంతటి విద్వాంసుడికి బోధిస్తాడు! చిత్రమేమంటే – కాదు, విచారకర విషయమేమంటే – అచ్చతెలుగులో 'పండితుడు, కవి' అనే మాటలకు సరైన పర్యాయపదాలు లేకపోవటం. గతిలేక 'కవి'ని తెలుగుకవులు 'కయి' అని పిలిచారు. 'కయి/కై' అనేమాటకు 'చేయి' అని అర్థం! అదేవిధంగా కవిత మనకు 'కయిత' అయిపోయింది. వికటకవి రామలింగడు 'ఏమి తిని సెపితివి కపితము' అని అల్లసాని పెద్దన్ననే వెక్కిరిస్తూ 'కపితము' అనేమాటను 'కవిత్వ' శబ్దానికి తెలుగుపర్యాయం చేసిపారేశాడు. ఖర్మ!

## పండితపామరులు

కవులను స్మరించినమీదట పండితులను ప్రస్తావించక తప్పదు. "విద్వాంసుడు, విపశ్చిత్తు, దోషజ్ఞుడు, సుధి, కోవిదుడు, బుధుడు, మనీషి, విజ్ఞుడు, సంఖ్యావంతుడు, కవి, ధీమంతుడు, సూరి, కృతి, కృష్టి, విచక్షణుడు, లబ్ధవర్ణుడు, దూరదర్శి, దీర్ఘదర్శి" వగైరాలు పండితశబ్దానికి పర్యాయపదాలంటారు. ఇవన్నీ సంస్కృతపదాలే. ఒకప్పుడు వేదవిద్య తెలిసిన వ్యక్తినే పండితుడనేవారు. సంప్రదాయబద్ధంగా చదువుకొన్నవాళ్లని

పండితులనేవాళ్లు. బ్రిటిష్‌హయాంలో ప్రాచ్యవిద్యా సంస్థలు స్థాపించి అందులోని ఉపాధ్యాయులను పండితులని (పండిట్స్) పిలిచారు. దరిమిలా తెలుగుసంస్కృతం వగైరా దేశభాషలు బోధించేవాళ్లని పండితులన్నారు. కళాశాలల్లో విశ్వవిద్యాలయాల్లో దేశభాషలను బోధించే ఇంగ్లీషువిద్యలు రాని ఉపాధ్యాయులను పండితులని పిలుస్తున్నారు. రామరామ వాళ్ల పాండిత్యం సంగతి అలావుంచి చిన్న ఉద్యోగాలు చేసే, ఇంగ్లీషు వచ్చినా అంతగారాని ఉద్యోగులను (ఉపాధ్యాయులను) పండితులనటం పరిపాటయింది. బోధన వృత్తిలో ఉన్నవాళ్లు తమనెవరయినా అధికారులు 'పండితు'లని వ్యవహరిస్తే జీతం తగ్గుతుందవో, తగ్గిస్తారనో భయపడుతుంటారు. పండిత శబ్దం బిరుదుగా కాక ఉద్యోగంగా పరిణమిస్తున్నదన్నమాట!

విద్వాంసుడంటే 'తెలిసిన'వాడని అర్థం. ఏమి తెలిసినవాడన్నది వేరే ప్రశ్నగాని సాధారణంగా ప్రాచీనశాస్త్రాలు నేర్చినవాడనే భావం మిగిలినట్లుంది. అందుకే దీని మరో రూపమైన 'విద్వాన్' అనేది ప్రాచ్యవిద్యాజ్ఞాన సూచకమైన ఓ డిగ్రీ పేరయిపోయింది. అపట్టా ఉన్న వ్యక్తికి ఇంగ్లీషు భాషా జ్ఞానం తక్కువనీ, అందువల్ల తెలుగు/సంస్కృతం నేర్పే ఉపాధ్యాయపదవికి తప్ప మరెందుకూ పనికిరాని వ్యక్తి అనీ కొన్ని దుర్భావాలు పుట్టాయి. పూర్వావసరాలు గుర్తించగలిగిన పండితుణ్ణి విపశ్చిత్తు అంటారు. ఈ మాట పుస్తకాల్లోనే మిగిలిపోయింది. వాడుకకు ఎక్కినట్లు లేదు. **"పండితః పండితం దృష్ట్వా శ్వానవత్ ఘుర్ఘురాయతే"** అనే సామెత పుట్టింది సంస్కృతంలో. కుక్కలకులాగా పండితులక్కూడా జ్ఞాతివైరం సహజమనీ, అందువల్ల ఇద్దరు పండితులు సమీపిస్తే ఒకరివైపు మరొకరు గుర్రుపెట్టూచూస్తుంటారనీ అప్రతిష్ఠ వచ్చిపడింది. అందుకు విద్యాస్పర్ధ – అంటే చదువుల్లో పోటీ – ప్రధానకారణం. ఈ లక్షణంవల్ల పండితులకు దోషజ్ఞులు – అంటే తప్పులు తెలిసినవాళ్లు – అనే పేరు వచ్చింది. తప్పులు వెతికేవాళ్లనేది దానివెంటనే వచ్చిన అపప్రథ అనుకోండి. ఈ మాటకు వాడుక చాలా తక్కువ. వాడవలసినవాళ్లు పండితులే కాబట్టి తమకు తప్పులే తెలుసుగాని ఒప్పులు తెలీవనే సూచ్యార్థంగల ఈ మాటను అంతగా వాడటంలేదన్నమాట.

సుధి అంటే మంచి తెలివిగలవాడని అర్థం. ఆ తెలివినే 'ప్రతిభ' అంటారు. ప్రతిభావంతుడనే అర్థంగల ఈ మాటకు గ్రంథప్రయోగం ఎక్కువ. కోవిదుడు అనేపదం కొన్ని పరీక్షలకు పేరయిపోయింది. (ముఖ్యంగా హిందీ సంస్కృతాల్లో 'కోవిద' పరీక్షలున్నాయి). ఆ పరీక్షల్లో నెగ్గినా నెగ్గకపోయినా 'బాగాతెలిసిన వ్యక్తి' అనే అర్థంగల మాట ఇది. బుధుడంటే మంచివాడని (బుధగ్రహంలాగా) అసమర్థుడని దురర్థాలు వచ్చాయిగాని తెలిసినవాడనే సహజార్థం దానికుంది. బుద్ధ శబ్దానికీ బుధ శబ్దానికీ అర్థగతమైన సంబంధముంది. 'పెద్దమనిషి' అనే అర్థం పండితవ్యవహారంలో ఉంది. మనీషి అంటే మేధావి – తెలివిగలవాడు. ఇంతమంచి మాటకు ఈకాలంలో జరుగుతున్న దుశ్చర్యల ప్రభావంతో 'పెడర్థాలు' పుట్టాయి. కొందరు 'మనీ+షి' (అంటే ధనం+స్త్రీ) అని పదాన్ని విరిచి 'కాంతాకనకాలు' అనే వికటార్థం సృష్టించారు. 'మనీ' ఇంగ్లీషుమాట, షీలాగానే. ఈ శబ్దమేమో సంస్కృతపదం. ఇది చమత్కారానికి చేసిన కసరత్తేగాని శబ్దార్థం కానేకాదు.

ఈ మాటకు కొంతవ్యాప్తి ఉంది. 'ప్రాజ్ఞుడు' గొప్పగా తెలిసినవాడయితే 'విజ్ఞుడు' విశేషంగా తెలిసినవాడు. అర్థాలయితే ఇలా ఉన్నాయిగాని పండితులకు లోకజ్ఞానం తక్కువ అని నూటికి తొంభయ్యమంది వాదిస్తారు. అంటే పుస్తక ప్రపంచమేగాని వాస్తవ జగత్తు తెలియనివాళ్లని తేల్చిచెప్పటమన్నమాట. సంఖ్యావంతుడనే మాటకు 'అంకెలు తెలిసినవాడు' అని అర్థం. మంచిలెక్కగాడని, గణితశాస్త్రజ్ఞుడనీ భావం. పూర్వం జోస్యులకూ (జాతకాలు చెప్పేవాళ్లకీ), గణకులకూ (లెక్కలు వేసేవాళ్లకీ) ఈ పదం అన్వయిస్తుండేది. పుస్తకాల్లో తప్ప దీనికి వాడుకలేదు. 'కవి' అనేది కవిత్వం చెప్పేవాడనే అర్థంలోకన్నా 'శుక్రాచార్యుడు' (రాక్షసగురువు) అనే భావంతోనో, మొదటి కవి 'వాల్మీకి' అనే భావంతోనో పర్యాయపదమవుతుంది పండితశబ్దానికి. పండితకవుల సంఖ్య చాలా తక్కువ – వేళ్ళమీద లెక్కించవచ్చు. కేవలం పండితులూ కేవల కవులూ అసంఖ్యాకులు. పండితులు కవిత్వం చెప్పలేరనీ, కవులకు పాండిత్యం తక్కువనీ లోకప్రవాదం.

ధీమంతుడంటే తెలివితేటలున్నవాడు. ఒప్పచెప్పే/బట్టీపెట్టే పండితుడు ధీమంతుడు కాడు నిజానికి. సూరి అంటే పండితుడు – చదువుకున్నవాడని అర్థం. కృతి అంటే పుణ్యవంతుడనే అర్థంకూడా ఉంది. కావ్యాలనూ పాటలనూ కృతులని కూడా పిలుస్తారు.. పండితుడనే అర్థంలో ఈ శబ్దానికి కావ్యప్రయోగాలేగాని వాడుకలేదు. కృష్టి అంటే శ్రమించేవాడని అర్థం. 'కృషి' చేసేవాడన్నమాట. ఎంతో అవస్థపడి చదివికూడా చదువు ఒంటబట్టని వ్యక్తిని ఈ పేరుతో పిలిస్తే అతికిపోతుంది. కానీ ఈ మాటను వాడినవాళ్లే చాలాతక్కువ. లబ్ధవర్ణుడనేమాట ఒకనాటి సమాజధర్మాన్ని తెలుపుతుంది. 'రంగుకు వచ్చిన వా'డని 'ముక్కస్య ముక్కార్థం' చెప్పవచ్చు. ఆర్యసమాజంలో పుట్టకపోయినా చదువుసంధ్యలవల్ల వన్నెవాసీ సంపాదించిన పండితుడని వివరించవచ్చు. అమరకోశం పర్యాయపదాలని పేర్కొన్నా నిజజీవితంలో పండితుడనే వాడికి లేని, ఉండని లక్షణాలతో వాళ్లకి 'దూరదర్శి, దీర్ఘదర్శి' అనే పేర్లు పెట్టినట్లుంది – వెక్కిరింతగా! ముందుచూపుగలవాడు దూరదర్శి. ఆలోచించి తెలుసుకొనేవాడు దీర్ఘదర్శి. నీతిచంద్రికలోని చేపలపేర్లలాంటి ఈ బిరుదులు పండితులకు వచ్చాయన్నమాట. ఇప్పటి వాడుకలో 'విద్యావంతు'డనే మాట పండిత శబ్దానికి సరయిన పర్యాయపదం. 'చదువరి' అనే తెలుగుమాట సమీపపదం. ఈ కాలానికి 'చదువుకొన్నవాడు' అనే అర్థం మారి 'చదువుతున్నవాడు/పాఠకుడు' అనే అర్థం వచ్చి పడింది చదువరి శబ్దానికి! తెలుగులో ఇటువంటి శబ్దాలకు పర్యాయ/సమీప. పదాలు చాలా తక్కువ.

పండితుడన్నప్పుడు అపండితు డుండక తప్పదు – అక్షరాస్యు డున్నప్పుడు నిరక్షరాస్యుడిలాగా. అన్నట్లు అక్షరాస్యుడన్నది విచిత్రమైన మాట. ఆస్యంలో – నోటిలో, అక్షరాలున్నవాడనీ, లేనివాడనీ ఎవరు ఎప్పుడు ఈ మాటలను సృష్టించారోగాని అవి భాషలో నిలిచిపోయాయి. తెలుగువాళ్ల సంస్కృతంలో తప్ప ఈ జంట మరెక్కడా కనిపించదు – వినిపించదు. అపండిత శబ్దానికికూడా సమీపపదాలూ పర్యాయ పదాలూ ఉన్నాయి. 'అజ్ఞుడు, మూఢుడు, యథాజాతుడు, మూర్ఖుడు, వైధేయుడు, బాలిశుడు' అనే పదాలను అమరకోశం పేర్కొంటున్నది.

జ్ఞానం (=ఎరుక) లేనివాడు అజ్ఞుడు. మూఢుడంటే ఏమీ తెలియనివాడనీ, మూర్ఖుడంటే తెలిసీ తెలియనివాడనీ వివరిస్తుంటారు. ఇలాంటివాడే జడుడు ఒకడున్నాడుగాని అమరంలో ఆయనకు స్థానం దొరకలేదు. జడశబ్దానికి సరైన తెలుగుమాట 'మొద్దు'. కానీ సంస్కృత సాహిత్యంలో జడభరతుడనే మహావేదాంతి ఒకడున్నాడు. తమాషా ఏమంటే సంస్కృత పండితులు – ముఖ్యంగా వ్యాకరణ పండితులు – "దేవానాం ప్రియు"డనేవాణ్ణి కనిపెట్టారు. ఆ మాటకు మూర్ఖుడని అర్థం చెప్పారు. అయితే అశోకచక్రవర్తి తన బిరుదంగా ఈ శబ్దాన్నే వాడుకున్నాడు. 'దేవతలకు ఇష్టుడు' అని మాటకర్థం. బహుశా అశోకుడు బౌద్ధమతం పుచ్చుకున్నందువల్ల అర్షవిద్వాంసులు అతణ్ణి మూర్ఖుడని తిట్టడానికి ఈ విశేషార్థం కల్పించారేమో తెలీదు! ఇలాంటి చమత్కారాలు మన పండితులకు కొట్టినపిండి. కాబట్టే రామాయణంలోని 'సుందరకాండ'కు ఆ పేరెందుకు వచ్చిందంటే 'సుందరో హనుమాన్ జ్ఞేయః' అని ఒక నిఘంటువును సృష్టించి సుందరుడంటే హనుమంతుడేనని తెలుసుకోండన్నారని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు విస్మయచకితులైనారు!

యథాజాతుడన్నది సరసమైన కల్పన. 'పుట్టినప్పటిలాగే ఉన్నవా'డని ఆ మాటకు స్పష్టార్థం. ఎన్నాళ్లుబతికినా ఏమీ జ్ఞానం సంపాదించనివాడనే వెక్కిరింపుతో ఈ మాట పుట్టింది. వైధేయుడు, బాలిశుడు అనేవి భిన్నప్రాంతాల వ్యక్తులను నిందిస్తూ పుట్టించిన ఆర్యభాషా పదాలు. వాటికి వాడుక లేదనలేం – రెండోమాట ఇంకా అర్థంతో నిమిత్తం లేకుండా నిందార్థకంగా వాడుకలో ఉంది కాబట్టే. అపండితుడికి తెలుగులో సమానుడు 'మొరకు' అంటారుగాని అది మూర్ఖశబ్దం నుంచి వచ్చింది. మన మొద్దుకు తిరుగులేదన్నమాట.

పండితాపండితుల మధ్యగల భేదం జ్ఞానాజ్ఞానాలకు సంబంధించింది. ఈ రెండు మాటలకూ తిరుగులేని వాడుక ఉంది. జ్ఞానశబ్దానికి సంబంధించిన మాటలు జ్ఞాతం, జ్ఞేయం అనేవి తార్కికుల వాడుకలో ఉన్నాయి. జ్ఞాతమంటే నిజానికి 'తెలిసినది'; జ్ఞేయమంటే 'తెలుసుకోదగింది, తెలుసుకోవలసింది'. జ్ఞానం ఎక్కువైతే విజ్ఞానమవుతుంది. ఆంగ్లవిద్యద్వారా మనకు సంక్రమించిన 'సైన్స్' అనే పదానికి పర్యాయంగా విజ్ఞానశబ్దం రూఢిలోకి వచ్చింది. విజ్ఞానసర్వస్వం వంటి సమాసాల్లో అన్ని రకాల 'ఎరుకలకూ' విజ్ఞానమనే పదాన్నే వాడుతున్నాం. తెలుగుమాట 'ఎరుక'; దానికి తోడుబోయింది 'తెలివిడి'. విజ్ఞాన శబ్దంనుంచి 'విన్నాణ'మనే తెలుగుమాట పుట్టింది. అయితే కాలక్రమాన దానికి 'నేర్పు, కుశలత, కౌశల్యం, నిపుణత, నైపుణ్యం' అనే అర్థాలు వచ్చిచేరాయి. అజ్ఞానాన్ని 'అవిద్య, అహంమతి' అనికూడా గురికిబెత్తెడెడంగా వ్యవహరిస్తుంటారని ఇంతకుముందే అనుకున్నాం. అవిద్యాశబ్దాన్ని వేదాంతులెక్కువగా వాడుతుంటారు. వేదం, వేదాంతం తెలుసుకోకపోవటాన్ని వాళ్లు అవిద్యగా భావిస్తుంటారు – తక్కినవెన్ని మనం తెలుసుకున్నా! అజ్ఞానానికి సంబంధించి 'అజ్ఞాతం, అజ్ఞేయం' అనే మరి రెండు మాటలున్నాయి. అజ్ఞాతం అంటే 'తెలియనిది'. అజ్ఞేయం అంటే 'తెలుసుకోనిది, తెలుసుకోవలసింది'. అజ్ఞానశబ్దానికి తెలుగుమాటల్లో అర్థం చెప్పాలంటే 'తెలియమి, ఎరుగమి, ఎరుకలేమి' అని చెప్పుకోవాల్సిందే. "తెలియనివా డజ్ఞుండగు, తెలిసిన సదసద్వివేక చతురతగలుగున్" అనే పద్యాన్ని

పూర్వం ఆటవిడుపు పద్యంగా ఒప్పచెప్పించేవాళ్లు. ఇప్పుడా గొడవలేదుకదా. 'జ్ఞ' అనే ధ్వనిని 'గ్న' తో సమంగా ఉచ్చరించటం/పలకటం, ఆ ధ్వని ఉన్న సంస్కృతపదాలను వెతికివెతికి ఈ ఉచ్చారణతో తెలుగు చేయటం, మనకు మనప్రియతమ తెలుగు ముఖ్యమంత్రిగారిస్తున్న మహాప్రసాదం. స్వీకరించండి!

# గురుశిష్యులు

అజ్ఞానం పోగొట్టుకొని జ్ఞానం సంపాదించాలంటే గురుశుశ్రూష చేయాలి. శుశ్రూష సంగతి ఇంతకుముందే తెలుసుకున్నాం కాబట్టి మిగిలింది గురువే. ఈ సంస్కృత శబ్దానికి సమీపపదాలు 'శ్రోత్రియుడు, ఛాందసుడు, ఉపాధ్యాయుడు, అధ్యాపకుడు, ఆచార్యుడు, ఆదేష్ట' అనేవి. అమరం చెప్పని 'దేశికుడు, ఉపదేశికుడు' లేకపోలేదు. 'శ్రుతి' అంటే వినేదీ వినిపించేదీ. వేదాలను శ్రుతులంటారు. ఆ శ్రుతులను/వేదాలను చదివినవాడూ చదివించేవాడూ శ్రోత్రియుడు. తాను చదువుతూ విద్యార్థులచేత వేదం చదివించేవాడన్నమాట. ఛందస్సంటే వేదమంత్రం, పద్యం రాసే పద్ధతి వగైరా. ఛందస్సును బోధించేవాడు, నేర్చినవాడు ఛాందసుడు. ఈ అసలర్థాలు మరుగునపడి ఈ కాలానికి ఈ రెండుమాటలకూ 'లోకజ్ఞానంలేనివా'డనే అర్థాలు వచ్చాయి. ఉపాధ్యాయుడనే మాటకు వాడుకహెచ్చు. అధ్యాపకుడన్నా ఉపాధ్యాయుడన్నా నేర్పేవాడని అర్థం. అధ్యాపకుడు గొప్పవిషయాలు నేర్పితే ఉపాధ్యాయుడు చిన్న విషయాలు బోధిస్తాడన్నమాట. పూర్వం ఈ రెండు పేర్లూ వేదం బోధించే వ్యక్తికే అన్వయించేవి. గురువంటే పెద్దవాడని సామాన్యార్థం. కుటుంబ యజమానిగా కర్మలుచేసే/చేయించే వ్యక్తినే గురువనేవాళ్లు ఒకప్పుడు. రానురాను 'ఏంగురూ!' అని సమానులూ సన్నిహితులూ వాడే పలకరింపు మాటగా మారిపోయిందది! ఆచార్యుడు కూడా వేదాన్ని బోధించేవాడే – అందులోనూ మంత్రాలకు వ్యాఖ్యానం చెప్పేవాడట అప్పుడు. ఇప్పుడది కుల మత వయోభేదంతో పనిలేని 'ప్రొఫెసర్' పదవికి పేరయిపోయింది! యజ్ఞం చేసేవిధానం నేర్పే వ్యక్తి ఆదేష్ట. దేశికుడు మతవిద్యను బోధించేవాడు. ఒకవిధంగా మతప్రచారకుడో ప్రవక్తోనని చెప్పవచ్చు. ఉపదేశకుడు సాధారణంగా మంత్రవిద్య నేర్పేవాడు. ఈ అర్థాలుమారి కన్యాశుల్కంలో 'ఉపదేశం' అంటే 'మందుకొట్టడం/కొట్టించడం' అనే కొత్త అర్థంతో ప్రయోగం లభిస్తుంది. వ్యభిచార ప్రసంగం కూడా ఉపదేశమేనట! (కన్యాశుల్కంలో మున్సిబునాయుడు యోగిని ఈరేశకు 'ఉప్పదేశం' చేస్తున్నదని గోలపెట్టాడు). గురువుకు తెలుగుమాట పంతులేనా? అది పండితశబ్దం నుంచి వచ్చినమాట. మరోమాట తెలుగులో ఉన్నట్లు తెలీదు.

గురువులను స్మరించినప్పుడు శిష్యుల సంగతి ప్రస్తావించకతప్పదు. ఇటీవలి 'విద్యార్థు'ల్లో కొందరు తాము 'శిశువుల'మని చెప్పకోవటం కద్దు! సంస్కృతంలో ఆర్షసంప్రదాయం ప్రకారం గురుకులవాసం చేసిన శిష్యులు అనేకవిధాలుగా ఉండేవారు

కాబట్టి రకరకాల సంబంధిపదాలు పుట్టాయి. వేదవేదాంగాలను ఒకే గురువుదగ్గర నేర్చిన శిష్యుణ్ణి 'అనూచాను'డనేవారు. 'అనూచానంగా' వచ్చేదంటే గురువునుంచి శిష్యుడికి ఆ పరంపరలో వచ్చిందన్నమాట. ఈ కాలానికి ఆచారంగా గతానుగతికంగా పారంపర్యంగా సంక్రమించిన వాటిని అనూచానంగా వచ్చినవని చెప్పాలి. ఖచ్చితంగా చెప్పాలంటే 'ఒకరు చెప్పగా అనుకరించి తెలుసుకున్నవాడ'ని అనూచాన శబ్దానికి అర్థం. వేదం తాను వల్లెవేస్తూ శిష్యుడిచేత బట్టీపెట్టించే వాళ్ళు కాబట్టి ఈ మాట సరైన అర్థమిస్తుంది. గురువుదగ్గర వేదాలను నేర్చుకొని ఆయన అనుమతితో గృహస్థాశ్రమం స్వీకరించే శిష్యుడికి 'సమావృత్తు'డని పేరు. వేదం చదివికూడా బ్రహ్మచర్యంవదలక తీర్థయాత్రలు చేస్తూ ఉండే శిష్యుణ్ణి 'స్నాతకు'డంటారు. అలా తీర్థయాత్రలకు బయలుదేరుతున్న బ్రహ్మచారిని నిర్బంధించి గృహస్థుణ్ణి చేసే తతంగానికి 'స్నాతక(వ్రత)ం' అని నేటికీ వివాహాల్లో పేరుంది. కానీ 'విశ్వవిద్యాలయాల్లో'ని మహావిద్వాంసులు 'స్నాతకస్థాయి' అంటే మొదటిడిగ్రీ (బి.ఎ., బి.కాం., బి.ఎస్సి. వంటివి) అనే వ్యవహారం మొదలుపెట్టి ఇంగ్లీషులోని 'పోస్ట్-గ్రాజుయేట్' కోర్సుకు 'స్నాతకోత్తరస్థాయి' అని నామకరణం చేశారు. స్నాతక శబ్దంలో ప్రధానమైన భాగం 'స్నానంచేయుట'మనేది. దాన్తో నిమిత్తం లేకుండానే ఇప్పుడు స్నాతకులు కావచ్చు. తీర్థయాత్రలూ చేయనక్కరలేదు.

పూర్వం శిష్యుణ్ని 'ఛాత్రుడు, అంతేవాసి, శైక్షుడు, సమావృత్తుడు, బ్రహ్మచారి' అని పిలిచేవాళ్ళు. ఇప్పుడు 'విద్యార్థి' అనే పదంకూడా ఈ పట్టికలో చేరింది. అంతేవాసి అంటే 'దగ్గరగా ఉండేవా'డని అర్థం. పూర్వం గురుకులాల్లో గురుశిష్యులు ఒకేచోట ఉండేవాళ్ళు. గురువే తిండిపెట్టి పోషించేవాడు. శిష్యుడు సేవలు చేసేవాడు. ఇప్పుడుకూడా 'గురుకుల పాఠశాల'లని, 'ఆశ్రమ పాఠశాల'లని ఏర్పడ్డాయికాని వాటిలో గురువులూ (అంటే ఉపాధ్యాయులూ) శిష్యులూ (అంటే విద్యార్థులూ) 'కలిసిమెలిసి' ఉంటున్నారని బల్లగుద్ది చెప్పలేం. ఉభయపక్షాలనూ ప్రభుత్వమో యాజమాన్యమో ఒకచోట చేర్చింది. కానీ ఏ విద్యార్థీ గురువును 'వరించి' ఫలానావ్యక్తిదగ్గర చదవాలనుకోవటంలేదు. ఎంపిక ప్రశ్నేలేదు. శైక్షుడంటే 'శిక్ష' పొందేవాడు. శిక్ష అనేది అప్పటిలెక్కన వేదాంగాలనే షడంగాలలో ఒకటి. 'శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిషం, నిరుక్తం, కల్పం' అనే ఆరుశాస్త్రాలను షడంగాలనీ వేదాంగాలనీ (వేదాల్లో భాగాలనీ) అనేవారు. శిక్షకు ఈ కాలానికి అర్థం పూర్తిగా మారిపోయింది. (ఇప్పటికీ హిందీలో శిక్ష అంటే బోధనే). అందుకే మనవాళ్ళు చదువు నేర్పటాన్ని 'శిక్షణ' అని పిలుస్తున్నారు. అప్పట్లో రకరకాల 'శిక్ష'లుండేవి. (ఆపిశలీయశిక్ష, పాణినీయశిక్ష మొదలైనవి). ఆమాట మన 'పెదబాలశిక్ష'లో ఇంకా మిగిలిఉంది. బాలశిక్షలు వాడుకనుంచి పోయినా పేరుమాత్రం మిగిలిందన్నమాట. బ్రహ్మచారి శబ్దానికి భగవంతుణ్ణి గురించిన ధ్యానంలో ఉండేవాడని అర్థం. ఇప్పుడు 'అవివాహితు'డనే అర్థంలోనే దానికి వాడుక. ఛాత్రుడంటే సీదాసాదా శిష్యుడు. శిష్యుణ్ణి 'శిశువు'డని పిలిచేవాళ్ళు కూడా ఉన్నారు! అచ్చతెలుగులో చెప్పాలంటే 'చదువుకొనేవాడు, నేర్చుకొనేవాడు' మొదలైన కొత్తసమాసాలను కల్పించుకోవాల్సిందే. ఈ సంప్రదాయం సంబంధం తొలితరం తెలుగువాళ్ళకు లేదని మాటల్లేకపోవటాన్నిబట్టి చెప్పవచ్చు.

గురుశిష్యులను గురించి ఎంతసేపూ సంస్కృతాంధ్రపదాలనుబట్టే చర్చించటం ఈకాలంలో న్యాయంకాకపోవచ్చు. ఇంగ్లీషుబళ్ళు వచ్చినతర్వాత 'టీచర'నేమాట బాగా తెలుగువారి వాడుకలోకి వచ్చింది. (బడి) పంతులనే పేరు గురువుకూ 'విద్యార్థి' అనేపేరు శిష్యుడికీ సంక్రమించాయి. సమాజంలో జీవనస్థాయిలో తక్కువగా ఉన్న (బడి) పంతులు 'బతకలేనితనానికి' చిహ్నంగా నిలిచాడు. (పంతులు నిఘానికి పండితశబ్దం మంచి వచ్చింది. అది లౌక్యవృత్తుల్లో బతికే బ్రాహ్మణ కులస్థులక్కూడా పేరయిపోయింది). అందుకేనేమో 'టీచర్' అనే ఇంగ్లీషుమాట వాడుకలోకి వచ్చింది. అయితే కాన్వెంటు చదువులూ 'పంతులమ్మలూ' వ్యాప్తిలోకి రాగానే ఆ మాటకు 'పాఠాలు చెప్పే స్త్రీ' అనే అర్థం వచ్చిపడింది. మొగపంతులికి పర్యాయంగా మరోమాట వెతుక్కొని ఇంగ్లీషునుంచి 'సార్' అనేమాటను దిగుమతిచేసుకున్నాం. ఇంగ్లీషులో మర్యాదావాచకంగా, కొన్ని సందర్భాల్లో పెద్దరాజోద్యోగికి గౌరవవాచకంగా ఉన్నమాట తెలుగులోకి వచ్చి బడిపంతులికి పర్యాయపద మయిపోయింది! (సర్ అనేది బ్రిటిష్‌వారి హయాంలో గొప్పబిరుదుకూడా). సరే. శిష్యులు చదువునేర్చినా నేర్వకపోయినా గురువులను పొగడకతప్పదు.

# పాపపుణ్యాలు

పాతకాలపు గురుశిష్యులకు పాపపుణ్య నిరూపణచేసే వేదవిద్యే ప్రధానం. అన్నట్లు పాపపుణ్యాలు రెండూ సంస్కృతపదాలే. 'ధర్మం, వృషం, శ్రేయం, సుకృతం' అనేవి పుణ్యానికీ, 'కిల్బిషం, పాప్మ, కల్మషం, కలుషం, వృజినం, ఏనం, అఘం, అంహం, దురితం, పాతకం' వగైరాలు పాపానికీ పర్యాయపదాలంటారు. సంఖ్యాబలంకూడా పాపానికే ఎక్కువ వ్యాప్తిఉందని సూచిస్తుంది. మన దౌర్భాగ్యమేమోకాని తెలుగులో పుణ్యానికి 'పున్నెం' తప్ప మరోమాట ఉన్నట్లులేదు. పాపానికి అలా ఒక్కమాట యినా లేదు. (మనకు పాపం లేదుకాబోలు!) పుణ్యం, ధర్మం సమానపదాలంటే తలదిరిగిపోతుంది. ధర్మం అంటే 'ధరించింది, నిలిచింది'. దేశకాలపాత్రలనుబట్టి అది మారిపోతుంటుంది. పుణ్యంగూడా అలా మారిపోతే ఇంకేమయినా ఉందా? వృషమంటే ఎద్దనికూడా ఓ అర్థముంది. ధర్మం నాలుగుపాదాలా నడుస్తుందంటారు కాబట్టి ఈ మాట పుట్టిందేమో! శ్రేయమంటే మేలు. పుణ్యం చేస్తే, పుణ్యకార్యాలు చేస్తే (బహుశా వచ్చేజన్మలో) మేలు కలుగుతుందని చెప్పటానికి ఈ మాటను పుణ్యపర్యాయమన్నారు కాబోలు. సుకృతమంటే 'మంచిపని'. ఫలితార్థంలో 'మంచి'నే పుణ్యమనుకున్నారన్నా తప్పులేదు.

పాపం, పాప్మ రెండూ మాండలికోచ్చారణభేదా లనిపిస్తుంది. కిల్బిషం అనేమాటకు 'చెడు, చెరుపు, తప్పు' అనే అర్థాలున్నాయి. కల్మషానికి 'కల్మాష'మనే రూపాంతరముంది. కలుషం, కల్మషం రెండూ 'మురికి' అనే అర్థవిశేషమున్నవే.

వృజినం, ఏనం, అంహం అనేమాటలు పుస్తకాల్లో మారుమూల ప్రయోగాలుగా మాత్రమే కనిపిస్తాయి. అఘమనేది ఎక్కువ వాడుకలో ఉంది. అంతకన్నా బహుళవ్యాప్తిలో 'అనఘ' శబ్దం వినిపిస్తుంది. అనఘా! 'అనగా పాపం చేయనివాడా!' అని బళ్ళల్లో చెప్తుంటారు. (బహుశా పుణ్యం చేయటంకన్నా పాపం చేయకపోవటమే గొప్ప అని మన పెద్దలు భావించిఉంటారు). పాపం తరవాత అంత వాడుకలోనూ వినిపించే పదం పాతకం. మనకు పంచమహాపాతకా లున్నాయి! దురితం, దుష్కృతం అనేవాటికి గ్రంథప్రయోగ మెక్కువ. దుష్కృతం అంటే 'చెడ్డపని'. దురితమంటే 'చెడ్డ ఆలోచన'. మొత్తంమీద పాపపుణ్యాలు వ్యతిరేకక్రమంలో మంచిచెడ్డలకు మారుపేర్లని చెప్పవచ్చు. ఏది పుణ్యం ఏదిపాప మనేది దేశ కాలపాత్రలతో మారే ధర్మాధర్మాల నిర్ణయమని చెప్పవచ్చు.

గురువులు శిష్యులను తప్పుబట్టడం, శిష్యులు గురువులను గౌరవించటం సహజకర్మలే. తప్పు పట్టేవ్యక్తి తిట్టవచ్చు, వెక్కిరించవచ్చు, ఈసడించవచ్చు. గౌరవించేవ్యక్తి పొగడవచ్చు. మెచ్చవచ్చు. ఎదటపొగడి వెనకతిట్టవచ్చు. పాతకాలంలో కూడా గురుశిష్యసంబంధాలు ప్రేమాభిమానాలతోనేగాక నిందాస్తుతులతో కూడా పెనవేసుకొని ఉండేవి. ఇప్పుడయితే మొహంమీద ప్రత్యక్షంగా జరిగేవన్నీ ఆ కాలంలో చాటుమాటున జరగలేదనటానికి దాఖలాలు దొరకవు. స్తుతించటంకన్నా నిందించటం తేలిక. కాబట్టి మొదట నిందాసంబంధి పదాలను పరిశీలిద్దాం.

## నిందాస్తుతులు

నింద అనేకవిధాలు. నిందించటం బహువిధాలు. "అవర్ణం, ఆక్షేపం, అధిక్షేపం, పరిహాసం, పరీహాసం, నిర్వాదం, పరివాదం, పరీవాదం, అపవాదం, (అవ)హేళన(ం), ఉపక్రోశం, జుగుప్స, కుత్స, గర్హణ(ం), దూషణ(ం), పారుష్యం, అతివాదం, భర్త్సనం, పరిభాషణం, ఉపాలంభం, విప్రలాపం, నిహ్నవం, అవాచ్యం" వంటి అనేక సంబంధిపదాలు సంస్కృతం నుంచి వచ్చినవి. "ఆడిక, ఏవం, ఈసడం, ఈసడింపు, తెగడు, తెగడిక, ఆరడి, అవసడి, అగడు, ఔరు, దూరు, దిసంతు, సడి, రోయి, రోత, రొచ్చు, సేగింపు, సెగ్గెం, సెగ్గి, ఏవగింపు, రట్టు, తిట్టు, రట్టడి, రవ్వ, రద్ది, రద్దు, ఉప్పత, రంతు, గోహేరు" మొదలైనవి తెలుగుమాటలు. 'పరిహాస' శబ్దానికి పర్యాయాలుగా 'క్రేణి, కేరడం, దచ్చన, గేలి, మేలం, మందెమేలం, ఆట, త్రస్తరి, హేళి, వేళాకోళం, వెక్కిరింత, కొక్కిరింత, ఎగతాళి' మొదలయిన తెలుగుమాటలను ప్రస్తావించవచ్చు. ఈ పట్టికలను చూస్తే తెలుగుభాష కూడా ఈ విషయంలో సంస్కృతంకన్నా ఏమీ తక్కువ తినలేదని తెలుస్తుంది.

అవర్ణ శబ్దానికి సరైన ధ్వనులుగాని అక్షరాలుగాని లేనిదని అర్థం. ఏదో అనగూడని, వినగూడని, చెప్పగూడనిమాట అని వివరించవచ్చు. లేదా సంస్కారంలేని మాట అని వ్యాఖ్యానించవచ్చు. ఆక్షేపం ఎదుటివ్యక్తి చేతలనూ కూతలనూ 'ఎత్తిపొడవటం'. దీనికి

సరైన తెలుగుమాట 'ఎత్తిపొడుపు'. అధిక్షేపం ఇటువంటిదే. ఆక్షేప శబ్దానికి తర్క శాస్త్రంలో సాంకేతికమైన అర్థాలూ ప్రయోగమూ ఉండగా, అధిక్షేపానికి సాహిత్యంలో స్థానముంది. పరిహాసం 'వెక్కిరింతకు' సంస్కృత పర్యాయమనవచ్చు. ఈ శబ్దానికి పరీహాసమనే రూపాంతరముంది. నిర్వాదమంటే చర్చతో సంభాషణతో నిమిత్తంలేని నింద. పరివాదం/పరీవాదం అనే శబ్దాన్ని ఒకవిధంగా అప్రతిష్ఠపాలుచేసే 'నీలాపనింద'తో సరిపోల్చవచ్చు. అపవాదానికి నియమవిరుద్ధమైనదనే పారిభాషికార్థముంది. 'తక్కువచేసి' మాట్లాడటమనే అర్థంచెప్పవచ్చు. హేళన వెక్కిరింతే. అవహేళన(ం) మరింత ఘాటుగా మోటుగా చేసిన వెక్కిరింత. ఉపక్రోశమంటే నిజానికి 'ఏడిపించటం' లాంటిది. జుగుప్స అంటే 'అసహ్యం, రోత, ఏవం' అనే అర్థాలున్నాయిగాని కొందరు నిఘంటుకారులెందుకో దాన్ని నిందకు పర్యాయపదంగా పరిగణించారు. కుత్స అంటే 'బూతు'. గర్హణ(ం) తేలికగా భావించటం, అసహ్యించుకోవటం. దూషణ(ం) అక్షరాలా తెలుగు 'తిట్టు'కు సంస్కృతంపేరన్నమాట. పారుష్యం అంటే 'కఠినమైన, బాధకలిగించే మాట!'. అతివాద శబ్దానికి అవసరంకన్నా మించి మాట్లాడటమనే అర్థముంది గాని అది కేవలం మన 'అతివాగుడు' వంటిదికాదు. భర్త్సనం 'ఛీ కొట్టడం'లాంటిది; అందులో 'బెదిరింపు' కూడా ఉంటుంది. మనస్సు బాధపడేటట్లు ఎత్తిపొడవటం పరిభాషణం. కించపరచటాన్ని కూడా పరిభాషణమనవచ్చు. ఉపాలంభ శబ్దానికి కావ్యాల్లో వాడుక ఎక్కువ. మన ప్రబంధనాయికలు విరహబాధలో పడ్డప్పుడల్లా మన్మథుణ్ణీ, చంద్రుణ్ణీ, వసంతుణ్ణీ, మలయమారుతాన్ని ఉపాలంభిస్తుంటారు – అంటే తిడ్తుంటారు. ఎత్తిపొడుపునూ, తిట్టునూ వెక్కిరింతనూ ఈసడింపునూ రంగరిస్తే ఉపాలంభ మవుతుంది. విప్రలాప మంటే తీవ్రభాషలో దూషించటం. ప్రలాపమంటే 'వదరటం'. సందర్భశుద్ధిలేని వాగుడు విప్రలాప మన్నమాట. నిహ్నవం కడుపులో ఏమోపెట్టుకొని అరచాటుగా తిట్టడం. అవాచ్యమంటే సభ్యసమాజంలో మాట్లాడరాని మాటల్తో తిట్టడం. ఇన్నింటిలోనూ 'నింద, హేళన, ఆక్షేపం, దూషణ, పరిహాసం' అనే మాటలే వాడుకలో ఎక్కువగా దొర్లుతుంటాయి. తక్కినవాటికి కావ్యభాషలోనే ప్రయోగాలెక్కువ.

అడిక అనే తెలుగుమాటకు 'అనట' మనే అర్థం. చెడుగా అన్నప్పుడే/మాట్లాడినప్పుడే అది అడిక అవుతుంది. ఏవమంటే అసహ్యమని కూడా అర్థముంది. ఏవగింపు ఈ భావంనుంచి వచ్చింది. తెగడు, తెగడికలకు 'తిట్టడం, ఖండించడం, కాదనటం, తప్పుబట్టడ'మనే అర్థాలున్నాయి. ఈసడమన్నా ఈసడింపన్నా తక్కువచేసి మాట్లాడటం. చులకనగా చూడటమని చెప్పవచ్చు. తెగడు, తెగడికలు రూపాంతరాలు. వాటికి 'నిందించు, తిట్టు' అని సామాన్యార్థాలు. తెగడ్త అనే మాటకూడా ఉంది. దాన్ని సాధారణంగా 'పొగడ్త'కు వ్యతిరేకపదంగా వాడుతుంటారు. ఆరడి బాధపెట్టడమనే అర్థంలోనే ఇప్పుడు వాడుకలో ఉంది. అత్తలు కోడళ్లను పెట్టేబాధలను ఆరళ్లంటారు. అవసడి, సడి అనే రెండూ ఒకదానితో ఒకటి సంబంధించినవి. సడి అనేమాటకు 'పుకారు, అబద్ధవార్త, తప్పుడుప్రచారం' వగైరా అర్థాలున్నాయి. అవసడి మరింత తీవ్రమయిన సడికావచ్చు. అగడు శబ్దానికి 'కష్టం, బాధ' అనే అర్థంలో కావ్యప్రయోగాలున్నా కొందరు కోశకర్తలు దాన్ని నిందకూ తిట్టుకూ పర్యాయపదాలుగా

పరిగణించారు. ఔారు అనేమాట మారుమూలపదం. వాడుకలో లేనిమాట అది. దూఱు కావ్యభాషలో తిట్టుకూ నిందకూ పర్యాయంగా ప్రయుక్తమయింది. ఇది చాలదన్నట్లు 'అపదూఱు' అనే మాటకూడా వ్యాకరణాలను ఖాతరుచేయకుండా వాడుకలోకి వచ్చిపడింది. దిసంతుకన్నా 'దిసంతులు కొట్టడ' మనే పదబంధానికే కావ్యప్రయోగా లెక్కువ. "కేకలూ బొబ్బలూ పెట్టడం, అరవటం, బొబ్బరింత, గర్జించటం" వగైరా అర్థాలు ఈ మాటకున్నాయిగాని నేటివాడుకలో ఇది వినిపించదు. రోయికి పుస్తకాల్లోనే ప్రయోగం. ఇదిగాక సంస్కృతంలోని రై శబ్దంనుంచి పుట్టిన 'రో' శబ్దానికి రూపాంతరంగా దీనికి 'వెల, డబ్బు' వంటి అర్థవిశేషాలున్నాయి. బహుశా అందుకేనేమో ఇది వాడుక నుంచి తొలగిపోయింది. రోత అసహ్యమనే అర్థంలో స్థిరపడింది – రొచ్చు 'బురద' అనే భావంలో కూరుకుపోయినట్లు. సేగింపు, సెగ్గెం, సెగ్గి అనేమాటలు "సేగి=చెడు, తప్పు" అనే మాటకు సంబంధించినవి. రట్టు అంటే 'గుట్టు బయటపెట్టడం'. రట్టడి దీనికి రూపాంతరం. (నేటి రెడ్డి శబ్దానికి పూర్వకాలపు శాసనాల్లో రడ్డి, రట్టడి అనే రూపాలు కనిపిస్తాయి). రవ్వ అంటే 'ఆగడం, ఆకతాయితనం'. పోతన కృష్ణలీలావర్ణనలో ఈ మాటను జోరుగా వాడాడు. రద్ది, రద్దు అనే మాటలు ఇప్పటి వాడుకలో లేవు. రద్దీ అంటే 'చెత్తాచెదారం' అనీ, రద్దు అంటే 'తొలగించటం, తీసివేయటం' అనీ అర్థాంతరాలు వచ్చాయి. ఉప్పత నేటి వాడుకలో ఉన్నట్లులేదుగాని 'ఉప్పతనం' అనేమాట నేటి 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్/ఆత్మన్యూనతాభావం' అనే అర్థంలో ప్రజావ్యవహారంలో ఉంది – శాస్త్రగ్రంథాల్లో చేరకపోయినా. గొహారు అంటే ఏమిటో నిఘంటుకారులకే తెలియాలి. ఈ మాటలన్నిటిలో 'తిట్టు, రట్టు, ఈసడింపు, రోత, ఏవగింపు' లకే వాడుక ఎక్కువ.

వెక్కిరింతకు తెలుగులో చాలా సంబంధి పదాలున్నాయి – "కొక్కిరింత, ఎగతాళి, ఎద్దేవ, ఈసడింపు, వేళాకోళం, క్రేణి, కేరడం, దచ్చన, గేలి, మేలం, మందెమేలం, ఆట, త్రస్తరి, హేళి, ఎల్లిదం" మొదలైనవి. వెక్కిరింత కోతిపని. కొక్కిరింతలో కొంత విమర్శకూడా ఉంది. కొక్కిరించే వ్యక్తికీ "కొక్కిరాయి"కీ సంబంధమేమో తెలీదుగానీ, తన నాటి జాతీయనాయకులందర్నీ వెక్కిరించి కొక్కిరించి వేళాకోళమాడిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య తనను గురించి చెప్తూ "గోపాలకిష్టాయి కొక్కిరాయి" అని వర్ణించుకొన్నాడు. వెక్కిరింత అవతలి వ్యక్తిని అనుకరిస్తూ ఆటపట్టించటం. కొక్కిరింత రెచ్చగొట్టే వెక్కిరింత. వేళాకోళం నోటిమాటలతో వెక్కిరించటం. వెక్కిరింత కొక్కిరింతల్లో 'చేష్టలు' ప్రధానం; వేళాకోళంలో మాటలు ముఖ్యం. సరసమాడటమని కూడా అర్థం చెప్పవచ్చు. వరసకాని వాళ్ళతో వేళాకోళం పనికిరాదు – పెద్దలతో కుదరదు. ఎగతాళికి వయసుతోగాని, వావితోగాని నిమిత్తంలేదు. హాస్యపూరితంగా ఉండటం ప్రధానలక్షణం. ఎద్దేవ తెలుగేకాదంటారు కొందరు. ఇది ఆక్షేపణ వంటిది; లోపాన్నో తప్పునో ఎత్తి చూపటం వంటిది. ఈసడింపు తక్కువ చేయటం, చులకనగా చూడటం. క్రేణి అనేమాట కావ్యాల్లోనే కనిపిస్తుంది. కేరడం పేర్లు పెట్టడం. కేరడానికి పసిపిల్లలు పెట్టే కేరింతలకూ కొంత సంబంధముంది. ఉద్దేశరహితంగా ఆనందప్రదర్శన

చేయటం కేరడం. కేరడంలో ఉత్తరకుమార ప్రజ్ఞలు 'కోతలు కోయటం' లాంటివి ఉండవచ్చు. 'దచ్చన, త్రస్తరి' గ్రంథాల్లో మాత్రమే కనిపించే మాటలు. మేలం అంటే సరసంతోకూడిన పరిహాసం; ఒక్కోసారి శృంగారపూర్వం కూడా కావచ్చు. 'నర్మ' అని ఇంతకుముందు ప్రస్తావించిన మాటకూ మేలానికీ సంబంధముంది. హాళి కావ్యభాషాపదం. ప్రబంధసుందరులు 'విరాళి' (విరహం)లో ఉన్నప్పుడు మన్మథుడూ చంద్రుడూ వగైరాలతో హేళిదేలటం అలవాటు. అధిక్షేపశబ్దాని కిది దగ్గరిమాట. ఎల్లిదమంటే తేలికవటం, చిన్నబుచ్చటం. తిక్కనకు ఈ పదం చాలా ఇష్టమనిపిస్తుంది.

గురువుల పరిహాసాలకు నిందలకూ తలఒగ్గి చదువునేర్చిన పాతకాలపు విద్యార్థులు కవులో పండితులో అయిపోయేవారు – చాలావరకు. ఈకాలంలోలాగా అప్పుడు రకరకాల విద్యావిషయకోద్యోగాలు లేవుకదా. భిక్షావృత్తి, పౌరోహిత్యం వగైరాలు సర్వసాధారణం. ఎక్కువమందికి గురుకులాలు వదిలిపెట్టిన తరువాత జీవనోపాధి మార్గాలవే అనాడు. దానికి పర్యాయపదాలని చెప్పదగ్గవి "ఆజీవం, జీవిక, వార్త, వృత్తివర్తనం, జీవనం" అనే సంస్కృత పదాలు. ఆజీవమనేమాటకు 'జీవితాంతం – అంటే జీవించినంతకాలం' అనే అర్థంకూడా ఉంది. జీవితాంతం ఉండే/ఉండవలసిన 'బతుకుతెరువు'ను ఆజీవిక అంటారు. జీవనం, జీవిక – అనేవి తాత్కాలికంకూడా కావచ్చు. అవి ఉద్యోగం (అంటే పాతకాలపు అర్థంలో యత్నం, కృషి) ద్వారా దొరికేవన్నమాట. జీవన శబ్దానికి 'నీరు' అనే అర్థంకూడా ఉండేది. అలాగే 'జీవిక' అనేమాటకు (ఇప్పటి) 'జీత' మనే అర్థవిశేషముంది. అన్నట్లు మనమిప్పుడు జీతమనేదాన్ని మన పాతశాసనాల్లో కూడా "జీవితం" అని పిలిచేవాళ్ళు! జీవితం అంటే బతుకు. అంతేకాదు బతుకుతెరువనికూడా భావించారన్నమాట. అప్పట్లో 'వృత్తి' ప్రధానంగా రెండు రకాలుగా ఉండేది కాబట్టి (ముఖ్యంగా బ్రాహ్మణులకూ వేదాది విద్యలు నేర్చిన వాళ్ళకీ) అమరకోశంలో రెండు భేదాలను పేర్లతో పిలిచాడు. 'ఉంఛ' అనే వృత్తి ఉండేది. ఊళ్ళో తిరుగుతూ రోళ్ళపక్కరాలిపడ్డ ధాన్యపు గింజలు ఏరుకుంటూ బతకట మన్నమాట. రెండోది 'శిలం': ఊరి బయట పొలాల్లో పరిగలేరుకొని బతకటం. బిచ్చమెత్తుకోవటం సరేసరి. కానీ అది 'వృత్తి'కాదు ఆ కాలంలో!

'వార్త' అనేమాట సంస్కృతంలో చిక్కులుబెట్టే పదం. వృత్తికి పర్యాయపదం గానేకాక 'కృషివాణిజ్యాలు వార్త' అనే నిర్వచనంకూడా ఉంది దానికి. అంటే వ్యవసాయం, వ్యాపారం అనే రెంటికీ కలిపి 'వార్త' అనే పేరుండేదన్నమాట. భారతంలోని "వార్తయందు జగతి వర్ధిల్లుచున్నది" అనే పద్యపాదానికి ఇటీవలి వాళ్ళు కొందరు మానవసమాజ వృత్తాంతం/సంగతి తెలుసుకోవటమో తెలియజెప్పటమోనన్న వ్యాఖ్యానం చేస్తున్నారు. కానీ నిజానికి పాతకాలపు భారతదేశంలో వ్యవసాయం వల్లా వ్యాపారంవల్లా ప్రపంచం నడుస్తున్నదన్న విశ్వాసమే ఉండేది. ఇప్పటి అర్థంలో వార్తఅంటే వృత్తాంతం. వాటిని అందించేవి 'వార్తాపత్రికలు'. 'వర్తన' మన్నమాటకు 'నడవడి(క)' అనే అర్థంకూడా ఉంది. 'జీవనం, వృత్తి' అనేవాటికే నేటి వ్యవహారంలో బతుకుతెరువనే అర్థముంది. ఉద్యోగాన్ని తెలంగాణాలో 'కొలువు' అంటారు.

ప్రాచీన భారతదేశంలో జీవనోపాధి మార్గం శరీరశ్రమచేయని, చేయలేని వ్యక్తులకు. స్తుతించి బతకటమే – గ్రామాధికారులనుంచి చక్రవర్తులదాకా. "స్తుతి, ప్రస్తుతి, ప్రణుతి, అభాషణం, ఆలాపం, సల్లాపం, సంలాపం, సుప్రలాపం, సురచనం, స్తవం, స్తోత్రం, నుతి, భూషణం" మొదలైనవి పొగడ్తకు సంబంధించిన సంస్కృత పదాలు. స్తుతి అంటేనే పొగడటం. ప్రస్తుతి అంటే 'తెగపొగడటం'. నుతి అంటే మెచ్చుకోవటం. ప్రణుతి అంటే విపరీతంగా మెచ్చుకోవటం. 'అభాషణ'మంటే మంచిగా మాట్లాడటం, నచ్చేటట్లు పలకటం. ఆలాపం అంటే సాగదీసి/పెంచిచెప్పటం. అందుకే సంగీతంలోని అకారసాధనకు – అంటే రాగంతీయటానికి – ఆలాప(న)ం అనే పేరువచ్చింది. 'ఏదో ఆలాపనగాఉంది' లాంటి వాక్యాల్లో దీర్ఘాలోచన జరుగుతున్న/చేస్తున్న సూచన వుంది. సల్లాపం, సంలాపం అనేవి ఒకదానికొకటి రూపాంతరాలు. 'సరసం'గా మాట్లాడిన మాటను సల్లాపమంటారు. అదిచాలక 'సరససల్లాపా' లని రెంటినీ జమాయించి చెప్పటమూ కద్దు. సురచనమనేది కవిత్వ సంబంధమైన మాట. 'బాగా రాసింది' అనేది దాని సామాన్యార్థం. స్తవం అనేమాటకు పొగడ్త అనే అర్థం. సాధారణంగా దేవీదేవతలను తలచుకొంటూ చెప్పిన మాటలనే స్తవాలంటారు. స్తోత్రం అనేది స్తుతికి సంబంధించిన పదమే. దేవమనుష్య భేదంలేకుండా ఎవర్నయినా స్తోత్రం చేయవచ్చు. అభాషణం, ఆలాపం, సురచనం, సుప్రలాపం అనే మాటలకు కావ్యప్రయోగమే గతి. భూషణ శబ్దానికి అలంకారమనే అర్థంకూడా ఉంది. దూషణభూషణ తిరస్కారాలకు అతీతంగా ఉండటం గొప్పతనమని నమ్మకం. సుప్రలాప శబ్దాన్ని ఎవరో కల్పించివుంటారనిపిస్తుంది. ప్రలాపమంటే తెగవాగుడు, వదరటం, పేలటం. బాగా/మంచిగా పేలితే అది పొగడ్త అని భావించిన మహాత్ములు నేటి రాజకీయ కార్యకర్తల్లోనే గాక ప్రాచీన భారతదేశంలో కూడా ఉన్నారంటే గర్వించాలేమో మనం. దానమిచ్చిన 'కృతిపతు'లను పొగడుతూ రాసి బతకటం కూడా ఒకవిధమైన జీవనోపాధే కాబట్టి స్తుతించగలగటాన్ని జీవనోపాధి లక్షణంగా భావించవచ్చు. నిర్జీవపదార్థాలకు దైవత్వ మారోపించే దేశంలో బతికున్న వ్యక్తులను పొగడి బతకటం తప్పుకాదని చెప్పవచ్చు.

పొగడ్తకు "పొగడు, పొగడిత, పొగడిక, మెప్పు, కైవారం, మెచ్చుకోలు, కొండాట, అగ్గింపు, కొనియాట" అనే తెలుగు మాటలను పర్యాయపదాలనవచ్చు. పొగడ్త, పొగడిత, పొగడిక, పొగడు రూపాంతరాలు. మెప్పుకన్నా పొగడ్త గొప్పది. మెచ్చుకోలు (మెచ్చుకొను – అనే క్రియాపదానికి నామరూపం) అనేమాటకు సాధారణంగా ఉన్న విషయంలోని మంచిచెప్పటమనే అర్థం. మెప్పు అనేది 'మెచ్చు' క్రియకు సంబంధించిన నామవాచక రూపం. పూర్వభాషలో 'మెచ్చు' నామవాచకంగా కూడా ప్రయుక్తమయింది. పొగడ్తకు మెచ్చు మెప్పులకన్న పరిమితులు లేవు. ఒంటికంటిరాజు చక్కదనాన్ని పొగడ్తూ తెనాలిరామలింగడు "అన్నాతిగూడ హరుడవు, అన్నాతిని కూడకున్న అసురగురుండౌ, దన్నా 'తిరుమలరాయా!', కన్నొక్కటి లేదుగాని కంతుడవయ్యా!" అన్నాడట. భార్యరెండుకళ్లనూ రాజుగారి ఒంటికంటినీ కలిపితే (భార్య 'అర్థాంగి' కాబట్టి ఆమెకళ్లుకూడా అయన సొంతంకిందనే లెక్కించవచ్చుకాబట్టి) శివుడంతవాడట. కలవకపోతే శుక్రాచార్యుడంతమేధావి. కన్నులేకపోతేనే మన్మథుడంతటివాడయితే ఉంటే రెండురెట్లు చక్కనివాడేకదా? ఇలాంటివి మెప్పులుకాదు – పొగడ్తలే.

కైవారం అనేది సామాన్యంగా రాజాస్థానాల్లో రాజుగారిని నిద్రలేపటానికీ, సభలో ప్రవేశించేముందు ఆయనగారి బిరుదులూ వగైరాలను వర్ణించడానికి నియుక్తులయిన ఉద్యోగులు చేసేపని. ప్రత్యేకపద్ధతి పొగడ్త అన్నమాట. అభిమన్యుడిచావు తెలియని అర్జునుడు శిబిరానికి తిరిగివస్తూ "వంది మాగధులు కైవారంబు చేయకున్నారేల నీరజనాభ! నేడు?" అని అడిగిన పద్యం ఒకప్పుడు తెలుగునేలమీద మోగిపోయింది. 'కొండాడు' అన్న క్రియకు నామరూపం కొండాట. దీనికి కావ్యభాషలోనే ప్రయోగం. అగ్గించు అనే ప్రక్రియకు విశేష్యరూపం అగ్గింపు – పెంచిచెప్పటమనే అర్థంగల ఈమాటకు. జనవ్యవహారంలో ప్రయోగం కనిపించే కొనియాడు అనే క్రియాపదాన్ని ఇప్పుడూ కొందరు వాడుతున్నారుగాని దాని నామరూపానికి అంత విస్తృతమయిన వాడుక లేనట్లుంది.

పొగడ్తలకు ఉబ్బి పోషించేవాడు దాత. అతడు చేసేపని దానం. అదేంకర్మమోగాని 'దాత'కు సమానమైన ఒంటి తెలుగుమాట కనిపించదు – 'ఈవికాడు' వంటి డొంకతిరుగుడు మాటతప్ప. "వదన్యుడు, వదాన్యుడు, స్థూల లక్షుడు, దానశౌండుడు, బహుప్రదుడు" అనే పదాలేగాక "వరదుడు, సమర్థకుడు, సుకలుడు" అనే సంస్కృత పదాలు కూడా దాతృ శబ్దానికి పర్యాయపదాలకింద లెక్క. వదాన్యుడు, దాత – అనే రెంటికే వ్యవహారంలో బహుళవ్యాప్తి ఉంది. ఇచ్చేవాడని అర్థం దాతకు. మరీ ఎక్కువఇస్తే 'ప్రదాత'; అంతకన్నా గొప్పవాడు మహాదాత. 'విశ్వదాత' వగైరాలు బిరుదులు. స్థూలాక్షుడు/స్థూలలక్ష్యుడు అనేశబ్దానికి 'బాగాఉన్నవా'డనే అర్థముంది. ఉన్నదికాబట్టి ఇస్తాడని దాతకు పర్యాయమనుకున్నారేమో తెలీదు. దానశౌండుడనేది సమాసం. 'దానవీరు'డని అర్థం. గొప్పగా దానాలు చేసినవాడన్నమాట. బహుప్రదుడు బహుశా కల్పిత శబ్దం కావచ్చు; 'చాలా ఇచ్చేవా'డని ఆ మాటకు అర్థం. వరద శబ్దాన్ని సాధారణంగా వ్యక్తులకుగాక దేవతలకు అన్వయిస్తుంటాం. సమర్థకుడు అనే మాటను ఇప్పటిభాషలో దాత అనే అర్థంలో వాడలేం. 'సమర్థించేవాడు' (అంటే ఒకరు చెప్పినదానికి నిజమేనని తల ఊపేవాడు) అనే అర్థం వచ్చిందిప్పుడు. బాగా డబ్బున్నవాడనే అర్థం పూర్వం ఉండేదేమో (అర్థం అంటే సొమ్ముకూడా). సుకలుడు అనేది విశేష శబ్దం; త్యాగభోగాలు రెండూ ఉన్నవాడన్నమాట.

దాత ఇచ్చిందీ ఇచ్చేదీ దానం. ఈమాట త్యాగంతో కలగాపులగ మైపోయింది. "దానం, త్యాగం, విహాయితం, ఉత్సర్జనం, విసర్జన(ం), విశ్రాణనం, వితరణ(ం), స్పర్శనం, ప్రతిపాదనం, ప్రాదేశనం, నిర్వపనం, అపవర్జనం, అపసర్జనం, అంహతి" అనే సంస్కృతపదాలు ఒకదానికొకటి పర్యాయపదాలు. వీటిలో దానం, త్యాగం, వితరణ(ం) అనే మూటికే వాడుక ఎక్కువ. తక్కినవి పుస్తకాల్లో కనిపించేమాటలు. దానమంటే 'ఇచ్చింది'. త్యాగమంటే 'వదిలిపెట్టింది' (త్యజించిందన్నమాట). త్యాగం విధిలేక చేసినా చేయవచ్చు. దానం మనస్ఫూర్తిగా ఇవ్వట మనాలి. సర్జనం, వర్జనం అనేవాటికి 'వదలటం, విడవటం' అనేవి క్రమంగా సామాన్యార్థాలు. ధనరూపంలోనో ద్రవ్యరూపంలోనో ఇతరులకోసం వదులుకున్నా, విడిచిపెట్టినా ఈ మాటలను వాడవచ్చు. ఉత్సర్జనమంటే 'ఎక్కువగా' వదులుకోవటం; విసర్జనమంటే 'విశేషం/ఘనం గా వదులుకోవటం'.

ఈమాట ఒకప్పుడు సాహితీలోకంలో విచారణకు వచ్చింది. రవీంద్రనాథ్ ఠాకుర్ "విసర్జన" అని బెంగాలీభాషలో రాసిన గ్రంథాన్ని డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అదేపేరుతో తెలుగుచేశారు! మరి మన ఇప్పటివాడుకలో 'మలవిసర్జన, మూత్రవిసర్జన' వంటి సమాసాల్లోనే ఆ మాటకు ప్రయోగం. బెంగాలీలో దానికి 'త్యాగ'మనే అర్థం - సంస్కృతంలోలాగా. చర్చఎందుకు జరిగిందో ఊహించటం సులభమే. విశ్రాణనమంటే ఒకవిధంగా వర్షించటం/కురవటం. గొప్పగా చేసిన దానం విశ్రాణనం. స్పర్శనం అంటే 'తాకటం' అనేది సామాన్యార్థం. పెద్దలు ఒకసారి తమచేత్తో తాకి మరెవరిచేతనైనా ఇప్పించిన దానం స్పర్శనం అన్నమాట. బహుశా ఇది 'స్వయంపాకం' లాంటిది కావచ్చు. ఈ మాట తలచుకొంటే మరోటి గుర్తుకువస్తుంది. ఆంధ్రప్రాంతంలో తమయింట తిండి తినరనుకున్నవాళ్లు వంటచేసుకొని తినడానికి కావలసిన వస్తువులనిస్తే వాటిని 'స్వయంపాక'మంటారు (అంటే సొంతగా వండుకోడానికిచ్చిన వస్తువులని అర్థం). తెలంగాణాలో దీనికి పర్యాయపదం 'సాహిత్యం' (సాధారణంగా కవిపండితులే ఇలాంటి ఘరానా బిచ్చం తీసుకుంటుంటారుకాబట్టి, వారికి ప్రత్యేకత అయిన సాహిత్యం వారు స్వీకరించే స్వయంపాకానికి పేరయింది!). స్వయంపాకంకూడా నిజానికో వ్రతం. స్వకుటుంబంలోకూడా భార్యచేతివంటకాకుండా తామేవండుకొని తినటమే వ్రతంగా పెట్టుకొన్న 'స్వయంపాకులవారు' పూర్వం ఉండేవారు. ఇప్పుడున్నారో లేదో తెలీదు.

ప్రతిపాదన శబ్దానికిప్పటి అర్థంవేరు. మిగిలినవి పుస్తకాల్లో ఉండేవేగాని వాడుకలో లేనివి. తెలుగులో "ఉజ్జనం, ఉజ్జగింపు, విడి, విడుపు, విడుదల, విడటం, మానటం, వీడుకోలు, ఎదుడు, తక్కు, వదలటం, అరటం, తొరగటం, పెట్టుడు, ఇచ్చుడు, ఈవి, ఈగి, పుడుకు, పెట్టు, తేగం, చాగం" వంటి మాటలు దానార్థంలో కనిపిస్తాయి. ఉజ్జన శబ్దం వర్జనమనే సంస్కృతపదం నుంచి పుట్టింది. ఉజ్జగించు అనేక్రియాపదంకూడా 'వర్జించు' అనే తత్సమ క్రియనుంచే పుట్టిందనీ, అందువల్ల ఉజ్జగింపు అనేమాట కూడా అచ్చతెలుగుకాదనీ వాదించేవారున్నారు. తేగం, చాగం అనే రెండుమాటలూ సంస్కృతంలోని 'త్యాగ' శబ్దంనుంచి వచ్చినవేనని వాటిరూపమే చెప్తుంది. తక్కిన తెలుగుమాటల్లో 'ఈవి'కి మాత్రమే నేటికీ వాడుకఉంది.

దానశబ్ద పర్యాయాలైన కొన్ని తెలుగుమాటలు ఏ ప్రత్యేకార్థాలిస్తాయో చూద్దాం. 'విడి' అనే పుస్తకాల్లోని మాట ఈ కాలానికి విశేష్యత్వం నుంచి విశేషణత్వం పొంది భాషాభాగమే మారిపోయిందనాలి. విడుపు, విడుదల, విడటం అనేవాటికిప్పుడు దానమనే అర్థం పోయినట్లే. 'ఆటవిడుపు, పట్టువిడుపులు' మొదలైన సమాసాల్లో కేవలం 'వదిలిపెట్టడం' అనే అర్థమే మిగిలింది. మానటం చేసినపని చేయకపోవటమనే అర్థంలో నిలిచిపోయింది. వీడుకోలు అనేది 'బంధుమిత్రాదులను వదిలిపెట్టి వెళ్లటం, వెళ్తున్నవారికి టాటా చెప్పటం' లాంటి అర్థాల్లో మాత్రమే వాడుకలో ఉంది. 'వీడుకోలు సమావేశం' లాంటి ప్రయోగాలవల్ల ఇది మామూలు విషయంగా కాక ఏదో ప్రత్యేకత ఉన్న కార్య(క్రమ)ంగా వాడుకలోకి వచ్చింది. 'ఎదుడు, తక్కు, అరటం, తొరగటం' అనేవి చాలా పాతకాలపు మాటలు; 'తప్పుకొను, తప్పించు' మొదలైన అర్థాల్లో కూడా వీటికి కావ్యభాషలో ప్రయోగాలు దొరుకుతున్నాయి.

'పెట్టుడు, ఇచ్చుడు' అనేవి మాండలికంగా మాత్రమే వినిపిస్తాయి. 'ఈవి' ఒక్కటే (దాని రూపాంతరం 'ఈగి' కూడా కాదు) దానార్థకంగా వాడుతున్నాంగాని దాన శబ్దానికున్న వ్యాప్తి ఈతెలుగుమాటకు లేదనే చెప్పాలి. 'పుడుకు' అనే మాట ఇప్పుడెక్కడా కనిపించదు – వినిపించదు. 'పెట్టుపోత'లనే పదబంధానికున్న వ్యాప్తి 'పెట్టు'కు లేదు. పెట్టుపోతలనేవి కూడా పరాయివారికిచ్చే దానమనే అర్థాన్ని ఏనాడో పోగొట్టుకొన్నాయి. సాంసారికధర్మంగా ఇచ్చేవాటినే పెట్టుపోతలంటారు.

## ఇష్టానిష్టాలు

దానధర్మాలూ పెట్టుపోతలూ ఇష్టానిష్టాలమీద ఆధారపడి చేసేవి, జరిగేవి. ఎందుచేతనో తెలీదుగాని ఇష్టం, అంగీకారం అనే రెంటినీ ఒకేగాటను గట్టి పర్యాయపదాలుగా పరిగణించారు కోశకారులు. "సంవిత్తు, ఆగువు, ప్రతిజ్ఞానం, నియమం, ఆశ్రవం, అభ్యుపగమం, ప్రతిశ్రవం, సమాధి, అంగీకారం, ఇష్టం" అనేవి ఇంచుమించు సమానార్థకాలన్నారు. వీటన్నింటిలో 'ఇష్టం, అంగీకార' మనేవే వాడుకలో ఉన్న మాటలు. 'అంగీకృతి' అనేది అంగీకారానికి రూపాంతరం. సంవిత్తంటే 'బాగా తెలిసింది' (కాబట్టి నచ్చినది, ఇష్టమైనది అని చెప్పుకోవాలి). ఆగువంటే అసలర్థమేమిటో తెలీదు. ప్రతి జ్ఞానమంటే తెలిసినట్లున్నది. నియమమంటే 'కట్టుబాటు'. అందరూ ఒప్పుకొని చేసుకొన్న ఏర్పాటు కాబట్టి అదికూడా ఇష్టమైనదే, 'సమ్మత' మయినదేనని భావించాలి. ఈ కాలంలో నియమ శబ్దాన్ని ఇష్టాంగీకారాలకు సమానార్థమని చెప్పలేం. సమ్మతి, సమ్మతం అనేవి కూడా సంస్కృత పదాలే – 'మనసుకు నచ్చినవి' అనే అర్థంలో. ఆశ్రవం, సంశ్రవం, ప్రతిశ్రవ మనే మూడు మాటలకూ దగ్గర సంబంధముంది. 'చెవికింపయినవి' అని చెప్పవచ్చు. అభ్యుపగమ శబ్దానికి తర్కవ్యాకరణాల్లో సాంకేతికమయిన అర్థాలున్నాయి. వాటిని మామూలు వ్యవహారంలో వాడటం మంచిదికాదు. 'సమాధి'కి సాహిత్యాలంకార శాస్త్రాల్లో ఉన్న అర్థానికీ, ఇప్పటి వాడుకలో ఉన్న అర్థానికీ, కోశకారుల పరిగణనకూ పొంతనలేదు. 'మంచిమనస్థితి' అని ఆ మాటకు అర్థం చెప్పుకోవాలి.

తెలుగులోని సంబంధి పదాలను లెక్కిస్తే 'ఇయ్యకోలు, ఒప్పుకోలు, మైకోలు, మేకోలు, సనుకోలు, ఒడంబడి(క), ఒడబాటు, ఒల్లబాటు, ఒప్పు, నప్పు, వల్లె, మంచి' మొదలయినవి కనిపిస్తాయి. వీటిలో ఒప్పు, నప్పు, ఒడంబడిక శబ్దాలు తప్ప తక్కినవి మన భాషాపదాలేనా అన్నంత అనుమానం పుడుతుంది. ఇయ్యకోలు, ఈకోలు శబ్దాలూ మేకోలు, మైకోలు శబ్దాలూ పరస్పరం రూపాంతరాలు. 'ఇయ్యకొను, మైకొను/మేకొను' అని క్రియారూపాలనుంచి ఏర్పడ్డ నామవాచకాలన్నమాట. ఒప్పుకొను అనే క్రియాపదం నేటికీ మంచివాడుకలో ఉంది. దానిమీద నామరూపం ఒప్పుకోలు. ఇయ్యకొను అనే క్రియారూపానికి పాతపుస్తకాల్లో కావలసినన్ని ప్రయోగాలు

దొరుకుతాయి. ఒడబడు/ఒడంబడు అనే క్రియాపదం నుంచి వచ్చిన విశేష్యం ఒడబాటు. ఒడంబడిక అనే శబ్దంలో ఈ క్రియార్థముంది. ఈశబ్దం 'సంధి' అనే అర్థంలోనే నేటి వాడుకలో వినిపిస్తుంది. ఏర్పాటు అనే అర్థవిశేషం లేకపోలేదు దీనికి. మైకొను, మైకోలు, మేకొను, మేకోలు అనేవి పూర్వ కావ్యాల్లోనే కనిపిస్తాయి. 'మేకొను' అంటే 'మేకుకొను (తీసుకొను)' అనే అర్థంలో "మేకులవంటి డోకులను మేకొని కొట్టెద నెల్లవేళలన్" అని ఓ చమత్కారి చాటువు చెప్పాడు. 'ఒప్పు' అనే రూపంకన్నా 'ఒప్పుకొను' అనే రూపమే ఎక్కువ వాడుకలో ఉంది. నప్పు శబ్దానికి క్రియారూపంలో ప్రాంతీయవ్యవహారముంది. 'నచ్చు' అనే క్రియా నామరూపాలకు రెంటికీ ఇది రూపాంతరం.

ఒల్లబాటు అనే రూపం 'వల్లె' అనే శబ్దం చాలాదగ్గర సంబంధం కలవి. ఈ కాలంలో "ఎస్" అనే ఇంగ్లీషు మాటలాంటిది వల్లె. తెలంగాణాలోని 'అవ్(మల్లా)' లాంటిది. 'ఒప్పుదలను' సూచించే పాతమాట వల్లె. దీనికి వ్యతిరేకార్థంలో 'ఒల్లమి' అనే రూపముంది. అలాగే అవ్యతిరేకంలో 'ఒల్లబాటు' అనే మరో రూపాంతరముంది. ఒల్లబాటు అంటే 'అవుననటం, సరే అనటం' అని అర్థం చెప్పవచ్చు. తెలంగాణాలో 'మంచిది' అనేమాటను ఎటుబడితే అటు తిప్పికొట్టడానికి వాడ్తారు. స్వరాన్నిబట్టి తప్ప అవునన్నారో కాదన్నారో ఆక్షేపిస్తున్నారో తెలుసుకోవటం కష్టం. కళింగప్రాంతంలోని "అc అc" అనే ధ్వని వంటిది కూడాను. ఈకాలానికి "ఒప్పందం, కట్టుబాటు" వంటి మరికొన్ని మాటలు ఇంచుమించు సమానార్థకాల స్థాయిలో వాడుకకు వచ్చాయి. తెలుగు నిఘంటువు ఒకటి 'కాని' అనే శబ్దాన్ని అంగీకారానికి తెలుగుమాటగా చెప్పింది 'కాని' అదేమిటో ఎలాగో అంతుపట్టడం లేదు.

ఇష్టమున్నప్పుడు అనిష్టమూ, అంగీకారముంటే అనంగీకారమూ ఉండకతప్పదు. 'కాదు, లేదు' శబ్దాలతో పనిగడుపుకొనే తెలుగువాళ్లు అనంగీకారానికి వేరే పర్యాయపదాల అవసరముం దనుకోకపోవచ్చు. కానీ సంస్కృతకోశకారులు అనంగీకారానికి పర్యాయపదాల నెందుకు చెప్పలేదో చెప్పలేం. అనిష్ట శబ్దానికి మన వాడుకలో 'అయిష్టం' అనే రూపం ఏర్పడింది. కావ్యభాషలో అచ్చ తెలుగులో చెప్పాలంటే 'ఒల్లమి, ఒప్పమి, నచ్చమి, నప్పమి' అంటూ 'అమి' చేరిన పదాలను వాడవలసి ఉంటుంది. ఎందుచేతనో 'అమి' ప్రత్యయంచేరిన మాటలిప్పటి వాడుకనుంచి తొలగిపోయాయి.

ఇష్టానిష్టాల్లాగానే న్యాయాన్యాయాల విషయంలో కూడా కోశకర్తలు తప్పొప్పులతో అనుసంధించి పర్యాయ పదాలనో సంబంధి పదాలనో సమీప పదాలనో పేర్కొన్నారు. తప్పొప్పులూ న్యాయాన్యాయాలూ ధర్మాధర్మాలూ దేశకాల పాత్రలనుబట్టి మారేవికాబట్టి వాటిని ఒకదానితో ఒకటి ముడివేసి పరిగణించారేమో.

★ ★ ★

# న్యాయాన్యాయ, ధర్మాధర్మాలు

న్యాయాన్యాయాలకూ తప్పొప్పులకూ అవినాభావ సంబంధముంది. న్యాయం ఒప్పనీ, ఒప్పే న్యాయమనీ మన పెద్దలు భావించారన్నమాట. మరోవైపు ధర్మాధర్మాలకూ న్యాయాన్యాయాలకూ దగ్గరి చుట్టరికముంది. దేశ కాల పరిస్థితులనుబట్టి ఇవి మారుతుంటాయి. ఇంకోవైపు పుణ్యాపాపాలకూ వీటికీ సంబంధం కనిపిస్తుంది. "ధర్మం, సుకృతం, పుణ్యం, శ్రేయం, యుక్తం, ఔపయికం, లభ్యం, భజమానం, అభినీతం, అభ్రేషం, సమంజసం, దేశరూపం" అనేవి న్యాయానికీ, "అగం, అపరాధం, మస్తువు" అనేవి అన్యాయానికీ పర్యాయ పదాలంటారు. ఇవన్నీ సంస్కృతపదాలు. 'ఒప్పు' అనే తెలుగుమాట ఒక్కటే ·న్యాయపర్యాయం. "తప్పు, సేగి, తప్పిదం, అగడం, దుడుకు, నేరం, నేరమి, దుండగం" అనేవి అన్యాయ పర్యాయాలయిన తెలుగుమాటలు.

ధర్మం అంటే సమాజం ఒప్పుకొని గౌరవించేది. 'ధరించేది/భరించేది' అని కొందరు వివరిస్తారు. సుకృతం అంటే 'మంచిపని'. దీన్నే పుణ్యమని కూడా భావిస్తుంటాం. పుణ్యమంటే పవిత్రమయినదని అర్థం. శ్రేయమంటే మేలుచేసేది. యుక్తమంటే తగింది. లభ్యమంటే దొరికింది, తటస్థపడ్డది అన్నమాట. ఔపయికం అంటే నిజానికి ఉపయోగపడేది. భజమానం అంటే గౌరవం పొందినది; పొగడ్తకెక్కింది. అభినీతమంటే మంచిదని గుర్తించి ఆదరించిందన్నమాట. సమంజసమంటే తగింది. అభ్రేష శబ్దానికి బాగా కోరింది, అభిమానించింది అని అర్థం. దేశరూప మనేది దివ్యమైనమాట. ఆయాదేశాల్లో (ఆసమయంలో) ప్రత్యేకంగా ఉండేదని చెప్పాలి. న్యాయమనే మాటకు అనుసరించేదని అర్థం. ఈ మాటలన్నిటిలోను సామాన్యంగా కనిపించే అర్థవిశేషం సమాజం అంగీకరించిందనేది. ఆచారాలు, ధర్మసూత్రాలు, చట్టాలు మారుతుంటాయి. ఒకప్పటి న్యాయం మరోకాలంలో చెల్లదు. ఒకచోటి ధర్మం మరోచోట అధర్మం కావచ్చు. ఉదాహరణకు ద్రౌపదిలాగా పంచభర్తృకగా ఉండటం ఈ కాలంలో అన్యాయం, అధర్మం – మనసమాజంలో. కులూవేలీలో (ఉత్తరప్రదేశ్ ఉత్తరభాగంలో) నేటికీ ఇది తప్పుకాదు – ఆచారమే. హిందూ సమాజంలో అన్న కూతురిని పెండ్లాడటం అధర్మం. ముస్లిం సమాజంలో అది ఒప్పే. ఈ మాటల్లో 'ఔపయికం, భజమానం, అభినీతం, అభ్రేషం, దేశరూపం' అనేవి కేవలం పుస్తకాల్లో మాత్రమే కనిపించే శబ్దాలు. ధర్మం, న్యాయం, పుణ్యం, యుక్తమనేవి నేటి వాడుకలో నిలిచిన మాటలేగాని న్యాయం ధర్మం ఒకటికాదు. న్యాయం చట్టరీత్యా అమల్లో ఉన్న సాంఘిక నిబంధన. ధర్మం చట్టం అంగీకరించినా లేకపోయినా సమాజం గౌరవించే నియమాలు.

న్యాయస్థానాలని కింది కోర్టులనూ, ధర్మాసనాలని హైకోర్టు సుప్రీంకోర్టులనూ (ముఖ్యంగా 'బెంచ్' అనేమాటకు పర్యాయంగా) కొందరు వాడుతున్నారు. ఒకవిధంగా ఇది సరైనదే. న్యాయస్థానాలు చట్టప్రకారం తప్పో ఒప్పో తేలుస్తాయి. చట్టం

ఒప్పోతప్పో తేల్చగల అధికారం (రాజ్యాంగంప్రకారం) హైకోర్టులకు మాత్రమే ఉంది. కాబట్టి ఈరకంగా ప్రాధాన్యవివక్ష చేయటం సరైనదనిపిస్తుంది. న్యాయానికి కళ్ళు లేవు. అంటే స్వయంగా చూసిగాక, చూసినవాళ్ళు చెప్పేమాటల విశ్వసనీయతమీద ఆధారపడిమాత్రమే న్యాయమూర్తులు నిర్ణయించగలరు. అందువల్ల ఏ తప్పు(డు) సాక్ష్యాలో తప్పు(డు) వాదనలో కారణంగా ఒక్కొక్కప్పుడు తప్పునిర్ణయాలు తీసుకోవచ్చు. అలాంటి పొరపాటుక్కూడా అవకాశంలేని న్యాయమే ధర్మం. ధర్మం న్యాయంకన్నా సమున్నతమైనది. సుకృతంకన్నా పుణ్యం పెద్దమాట – మంచిపనికన్నా మహనీయమైనది పవిత్రతరం కాబట్టి. యుక్తమనేది మరీ మామూలుమాట. ఆ కాలానికో ఆ దేశానికో ఆ వ్యక్తికో తగినదన్నమాట.

తప్పు అనేమాటకు 'తప్పిద'మనేది రూపాంతం. ఆగడం అనేమాట అల్లరిలాంటి చిన్నతప్పును సూచించేమాట. దుడుకు అంటే పొగరుతో చేసేతప్పుపని. 'దుందుడుకు/తుందుడుకు' అనే మరో శబ్ద పల్లవముంది. దానికి తొందరపాటు అనే అర్థంవచ్చింది. నేరం పెద్దతప్పు. నేరమి దీనికి రూపాంతరమేగాని 'చేతగానితనం, అసమర్థత, అసహాయత' అనే అర్థాలు కూడా ఉన్నాయి దానికి. దుండగం బాధించేతప్పు. సేగి అనేది ప్రమాదకరమైన తప్పు; 'చెట్ట, చెడ్డ' శబ్దాలకూ దానికీ దూరసంబంధముంది. ఈ తెలుగుమాటలకు బదులు మాటలుగా అపరాధమనే సంస్కృత పదమొకటుంది. తప్పుశబ్దానికిది సరైనమాట. ఆగం సంస్కృత శబ్దమంటే నమ్మటంకష్టం – ఆగడానికి చాలాదగ్గరి మాటలాగుంది, కాబట్టి. అన్యాయం, అయుక్తం, అధర్మం లాంటి పదాలు వ్యతిరేకార్థకాలుగా వచ్చాయి. న్యాయం కానిదనే లేనిదనే అర్థంలో న్యాయంకానిది అన్యాయమయితీరాలని తర్కశాస్త్రం ఒప్పుకోదు! మస్తువనేమాట పుస్తకాల్లో మిగిలిపోయింది.

## శుభాశుభాలు

న్యాయపర్యాయాల్లో శ్రేయముందికదా. దానికీ శుభానికీ ఎంతో దగ్గరి సంబంధముంది. "శ్వం, శివం, భద్రం, కల్యాణం, మంగళం, భవికం, భావికం, భవ్యం, కుశలం, క్షేమ"మనే సంస్కృత శబ్దాలు శుభ శబ్దానికి పర్యాయపదాలంటారు. శ్వమంటే శుభమనే అర్థం. శ్రేయమంటే మేలు. శివమంటే మేలనే అర్థమేగాని 'శివమెక్కింది, శివాలు తొక్కుతున్నాడు' మొదలైన ప్రయోగాల్లో 'వీరావేశ'మనే అర్థవిశేషం కూడా వచ్చిపడింది. భద్ర శబ్దానికి క్షేమమనే అర్థం. భవ్యమనే మాటకు పవిత్రమని కూడా అర్థముంది. కల్యాణ శబ్దానికి 'పెళ్ళి' అనే అర్థంవచ్చింది. చిత్రం ఏమంటే 'క్షౌరకల్యాణం, కల్యాణకట్ట' వంటి పదబంధాల్లో ఈ మాటకు 'గొరుగుడు' అనే అర్థంకూడా రావటం. పూర్వం 'ముండనం మండనం పుంసాం' అనే సూక్తి వాడుకలో ఉండేది. తలమీద వెంట్రుక లేకుండా గొరిగిస్తే అది మగవాడికి అలంకారమన్నారు! అప్పట్లో అది ఫ్యాషన్ అన్నమాట! (ఇప్పుడు

కూడా 'బాల్డీస్, రెడ్ హెడ్స్' వగైరాపేర్లతో కొందరు పాశ్చాత్యయువకులు చలిమిడి ముద్దలాంటి గుండుతో తిరగటం అతి నవీనాలంకారంకింద పరిగణిస్తున్నారు!). కుశలశబ్దం మద్రాసు తెలుగులో, తమిళప్రభావంగల తెలుగులో బాగా వాడుకకెక్కింది. సంస్కృతంలో 'అమంగళం, అకుశలం' అనేవి అశుభానికి పర్యాయపదాలు.

తెలుగుమాటల్లో "లగ్గు, లెస్స, మేలు, సేమం, మంచి, బాగు" అనేవి శుభానికీ "చేటు. చేద్పాటు, కీడ్పాటు, చెట్ట, సేగి, కీడు, చెడిది, సిలుగు, చెడు, చెరుపు" లాంటివి అశుభానికీ పర్యాయపదాలంటారు కోశకారులు. లగ్గు శబ్దం పుస్తకాల్లో మాత్రమే "ఎగ్గు"(=ప్రమాదం) శబ్దానికి వ్యతిరేకపదంగా కనిపిస్తుంది. 'దేశభాషలందు తెలుగులెస్స' అనే పద్యంలో మాత్రం నిలిచింది లెస్స. సేమం క్షేమ శబ్దభవం. మేలు శబ్దానికి 'ఎత్తయిన' అనే విశేషణార్థం కూడా ఉంది. (ఉదాహరణకు 'మేలుదూలం'లాంటి మాటల్లో). మంచి, బాగు అవేవే బాగా వాడుకలో ఉన్నమాటలు. చేటు శబ్దానికి 'ప్రమాదం, కష్టం' అనే అర్థాలు. నేడు చెడు, చెరుపులు తప్ప తక్కిన అశుభార్థక శబ్దాలు కావ్యాల్లో మాత్రమే దొరుకుతాయి. మంచి, బాగులు విశేషణాలుగా కూడా ప్రయోగంలో కనిపిస్తాయి.

## మూర్తామూర్తపదాలు

భాషలోని పదాలను ప్రధానంగా రెండు రకాలుగా విభజింపవచ్చు. మన ఊహల్లో, ఆలోచనల్లో ఉండి అవి సూచించే వస్తువులుండనిమాట లొకరకం. వాటిని అమూర్త పదాలంటాం. మంచి చెడు ఆ బాపతు శబ్దాలు. రెండోరకానికి చెందినవి మూర్త పదాలు. అవి రూపంగల వస్తువుల పేర్లన్నమాట. కంటికి కనిపించే పదార్థాలకు భాషల్లో ఉన్న పేర్లుకూడా మూర్త పదాలే. చీకటి, వెలుగు, ఇలాంటివి. చెట్టు, పుట్టలాంటి ద్రవ్యాల పేర్లన్నీ మూర్తాలే. తెలుగువంటి భాషల్లో మూర్తపదాలు సమృద్ధిగా ఉంటాయి. పాపం, పుణ్యం, కవిత్వం, ఆనందంలాంటి అమూర్త పదాలు సంస్కృతంలాంటి భాషల్లో కొల్లలు, తెలుగులో తక్కువ. తెలుగులో శబ్దసంపదను గుర్తించాలంటే మూర్తపదాలను పరిశీలించాలి. అలాగని అలాంటి మాటలు సంస్కృతం వంటి భాషల్లో తక్కువనుకోరాదు. ఏదో కొంత మార్పుకోసం నిత్యజీవితంలో ఎదురయ్యే వస్తువుల పేర్లనూ వాటికి సంబంధించిన మాటలనూ పరీక్షిస్తూ ఆయా వస్తువుల్లో మన సమాజం ఎంత వైవిధ్యం చూపుతుందో గమనిద్దాం. ముందు సాధారణ పదాలను చర్చించి తరవాత ఆ మూర్త పదాలద్వారా మన సంస్కృతి వికాసాన్ని గుర్తిద్దాం.

మాటల్లో మరోచిత్రం కూడా ఉంది. భాషలోని మాటలన్నిటినీ ఎవరూ వాడరు – వాడలేరు కూడా. ఆయా సందర్భాల్లో అవసరానికి కావలసిన మాటలు మాట్లాడ్తాం. కొన్నిటిని మాట్లాడక తప్పదు. వాటి వాడుక చాలా ఎక్కువ. వాడూ వీడూ వచ్చాడు వెళ్లాడు లాంటి 'ప్రాథమిక పదాలను' వాడకుండా

భాషనుపయోగించలేం. ఈ మాటలు అనుక్షణ అనుదిన వ్యవహారంలో ఉంటాయి. కాబట్టి అనుకోకుండా ఆలోచించకుండా వీటిని వాడగలం – వాడ్తాం కూడా. కొన్నిటిని ఎప్పుడోగాని వాడం. ఎవరైనా వాడినప్పుడు వాటి అర్థం తెలుసుకోగలం. గుర్తించగలం. మనమూ అవసరపడ్డప్పుడు వాడ్తాం. మరికొన్ని మాటలు ఎక్కడో విన్నట్లు గుర్తుకువస్తాయి; ఎప్పుడూ రావు. ఇంకా కొన్ని మాటలను సందర్భంబట్టి అర్థం చేసుకుంటాం. గురికి బెత్తెడెడంగా నిఘంటు నిర్మాతలు కూడా ఏ సందర్భంలో ఏ ప్రకరణంలో ఏ వాక్యంలో ఆమాట వాడారో సరిచూసి అర్థం నిర్ణయిస్తారు. ఈ సరిచూడటంలో ఆయా వ్యక్తుల అనుభవభేదాలనుబట్టి అర్థభేదాలు స్ఫురిస్తుంటాయి. ఈమాట కీఅర్థమని చెప్పవలసివప్పుడు పండితుల్లో కూడా అభిప్రాయభేదాలు వచ్చేది ఈ అనుభవ తారతమ్యాన్ని బట్టే. అన్ని సమయాల్లోనూ ఈ మాటకిది అర్థమని నిష్కర్షగా చెప్పలేకపోతే అది ఎప్పుడోగాని ఎవరోగాని వాడని పదమని సరిపెట్టుకోవాలి. అలాంటివి మారుమూల మాటలంటాం. దేశకాల పరిస్థితుల్లోని మార్పులవల్ల మాటల రూపంతోబాటు అర్థాలు కూడా మారిపోతుంటాయి. ఒకమాటకు వాడుక మరీ ఎక్కువయినా ఈ మార్పు వస్తుంది – చాలా తక్కువయినా ఈ మార్పు తప్పదు. అర్థంలో రూపంలో వచ్చిన మార్పునుబట్టి ఆయా పదాల చరిత్రను తెలుసుకోవచ్చు. ఆ చరిత్రే భాషాచరిత్ర. అదే సంస్కృతి చరిత్ర. అదే నాగరకతా చరిత్ర.

ఒక్కొ మాటను పట్టుకొని దాని చరిత్రంతా నేర్చుకోవటం మరోసారి చూద్దాం. ప్రస్తుతానికి పూర్వంలోలాగానే ఒక వస్తువును భిన్నకోణాల నుంచి చూసి ఎన్నెన్ని పేర్లు పెట్టామో దానికి మాత్రమే పరిమితంగా పరిశీలనకు దిగుదాం. మొదట ఈ రకం పర్యాయ పదాలను గుర్తించి తరువాత ఆ పర్యాయపదాల్లో ఏభావం ప్రధానంగా ఏ రకంమాట వాడుతున్నామో గమనిద్దాం – కొంతకాలం.

## ఇళ్ళు: రకాలు

ఈ పద్ధతిలో మొదట 'ఇల్లు' అనే సర్వసాధారణ వస్తువు సంగతి చూద్దాం. (అంటే తెలుగువాళ్లందరికీ ఇళ్ళున్నాయనే భ్రాంతితోకాక ఇళ్ళు అందరికీ ఉండాలనే సదుద్దేశంతోనే ఉపక్రమిద్దాం). తెలుగులో ఇల్లు శబ్దానికి పర్యాయంగా "ఇక్క, ఇరవు, ఇమ్ము, ఉనికి(పట్టు), కొంప, టెంకి, తావు, తావు, నట్టు, సెలవు, గీము, తెంకి, బిడారు, విడిది, మనికి(పట్టు)" మొదలైన మాటలున్నాయి. సంస్కృతపదాల్లో "గృహం, గేహం, వేశ్మ(ం), సద్మం, నికేతనం, నిశాంతం, సదనం, భవనం, అగారం, మందిరం, నిలయం, ఆలయం, వాసం, ఉదవసితం, సాల, సభ, వస్త్య, నికాయ్యం" లాంటి మాటలేకాక "ఓకం, స్థానం, వాస్తు, ఉటజం, ధామం, నివేశం, శరణం, క్షయం, ధిష్ణ్యం, సంస్త్యాయం, నివసనం, అవసథం" లాంటివి కూడా పర్యాయ ప్రయోగంలో ఉన్నాయి. వీటిలో కొన్ని మారుమూల మాటలయితే, మరికొన్ని రోజూ మనం వినే, వాడే మాటలే. ఇవన్నీ సాధారణ పదాలు. మొదట వీటి విషయం.

సొంతదయితే ఇల్లని, ఇతరులదయితే కొంపని వ్యాఖ్యానించేవాళ్ళున్నారు! నిజానికి ఇల్లూ కొంపల మధ్య ఇంగ్లీషులోని 'హౌస్, హోమ్'ల మధ్య ఉన్న అంతరముంది. ఇల్లు ప్రేమాస్పదం; కొంపకాదు. విసుగులో నిరసనలో కొంప శబ్దానికి వాడుక ఎక్కువ. ఇక్క, ఇరవు, తావు శబ్దాలకు 'ఉండే స్థాన' మని అర్థం. అది ఇల్లే కానక్కరలేదు. ఇల్లు శాశ్వత నివాసస్థలమయితే ఇవి తాత్కాలికాలు. తావుకు ఠావు అనే మరో రూపాంతరముందంటారు కొందరు. అది ప్రాకృతం నుంచి తెలుగులోకి వచ్చిన మరో పదమంటారు మరికొందరు. 'ఉనికి, మనికి' అనే మాటలకు క్రమంగా 'ఉండటం, బతకటం' అని అర్థాలు. ఆ దశలకు 'పట్టు'గా ఉండే నిర్మాణాలను ఉనికిపట్టు, మనికిపట్టు అంటారు. తలదాచుకొనే చోటు ఉనికిపట్టు. బతికేచోటు మనికిపట్టు. తెంకి, టెంకి శబ్దాలు రూపాంతరాలు. వీటికూ్కడా తాత్కాలిక నివాసస్థలమనే అర్థం. నెలవు అంటే ఉండేచోటు. ఉనికిపట్టు అనే పదబంధానికి సమానమైన ఒక్కమాట ఇది. నట్టు అనేది 'నడిచేచోటు' అనే అర్థంగల మాట. నడయాడే ప్రదేశమన్నమాట. గీము అనేది సంస్కృతంలోని గృహ శబ్దంనుంచి పుట్టింది. బిడారు శబ్దాన్ని అచ్చతెలుగు కవులు కొందరు 'ఇల్లు' అనే సామాన్యార్థంలోనే వాడారుగాని అమ్మకం సామగ్రితో వ్యాపారస్థులు తండాలుగా ప్రయాణిస్తూ తాత్కాలికంగా నిలిచేచోటు అని దానిఅర్థం. అలాగని ఈ మాటకు 'గుడారం, డేరా' అని అర్థంలేదు. తనది కాని స్థలంలో నిర్మించుకొన్న తాత్కాలిక వాసగృహమన్నమాట బిడారు. విడిది అనేది తాను కొంతకాలం మాత్రం నివసించే ఇతరుల గృహం. ఇల్లు తనది; విడిది పరాయివాళ్లది. కొంతసేపు మజిలీచేసేచోటు విడిది.

పై తెలుగుమాటల్లో అభిమానంతో చెప్పే ఇల్లు, ఈసడింపుగా వాడే కొంప అనే శబ్దాలకే ఈ కాలంలో ఎక్కువ వాడుక వుంది. తావు శబ్దానికి ఏ ప్రదేశమయినా అర్థం కావచ్చు. ఇప్పుడా మాటకు ఇల్లనే అర్థంలేదు. కాకపోతే 'తావున' అనే విభక్త్యంతరూపం కొన్ని ప్రాంతాల్లో 'తన'గా మారి ఫలానావస్తువు 'నాతాన' లేదనేలాంటి ప్రయోగాల్లో వినిపిస్తుంది – 'నాదగ్గర' అనే అర్థవిశేషంలో. ఇమ్ము శబ్దానికి 'ఇష్టమైనది, నచ్చినది' అనే అర్థాలు కూడా ఉన్నాయి గాని దానికీకాలంలో వాడుక లేదు. మిగిలినమాటలేవీ నేటి వాడుకలో వినిపించేవి కావు – 'పుస్తకాల్లోని' మాటలన్నమాట.

సంస్కృతపదాల్లో కొన్ని – 'గృహం, సదనం, భవనం, నిలయం, నికేతనం' అనేవి – ఎక్కువ వాడుకలో ఉన్నమాటలు. వీటిలో మొదటిది తప్ప తక్కిన వాటిని ఇంటికి పెట్టుకొనేపేర్లకు వాడటమెక్కువ. మొదటిమాట సాధారణ పదం. కుటుంబం నివసించే నిర్మాణానికి గృహమని పేరు. గేహమంటే ఇల్లేగాని ఈ మాటకు గ్రంథప్రయోగమేగాని నిత్యవ్యవహారంలో వాడుక తక్కువ. తెలుగుదేశంలో లేదుగాని మరాఠీ ప్రాంతంలో 'గృహ' శబ్దాన్ని హోటలనే అర్థంలో కూడా వాడుతుంటారు. మరాఠీ ప్రభావమున్న సరిహద్దు పట్టణాల్లో తెలుగువాళ్ళు కూడా కదాచిత్తుగా ఈ ప్రయోగం చేస్తుంటారు. నిలయమనేది సంస్కృతపదం కాదనీ అది ద్రావిడభాషల

నుంచి ఎరువుగా తెచ్చుకొన్న మాటేనని కొందరు వాదిస్తారు. మూలమేదయినా అది సంస్కృతభాషలో వాడుకకెక్కిన మాటే. తెలుగులోని 'నిలు(చు)'లోని 'నిలు' అనే భాగమే నిలయ శబ్దంలోనూ ఉందని చెప్తారు. ఈ పదం దక్షిణోత్తర భాషాకుటుంబాలకు రెంటికీ చెందిందనే భావంతోనే "రాష్ట్రపతి నిలయ"మనీ ఆ భవనానికి పేరు పెట్టారు. వేశ్మ శబ్దానికి (వ్యక్తులు) విశ్రాంతిగా ఉండే తావని అర్థం. సద్మం మంచి యిల్లు. నికేతనం పెద్దఇల్లు. అన్ని కాలాల్లోనూ సుఖంగా ఉండటానికి వీలయిన గృహాన్ని నిశాంతమంటారు. పదనం, సద్మం రెండూ ఒకదానికొక్కటి దగ్గరగా ఉండేమాటలు. భవనం అంటే పెద్దఇల్లు. విశాలమైనదని అర్థవిశేషం.

ఆలయం, మందిరమనేవి గృహ పర్యాయాలేగాని వాటికి దేవతలు నివసించే ఇళ్లనే విశేషార్థం వచ్చింది. తెలుగుదేశంలో ఆలయ శబ్దం 'గుడి'కి పర్యాయంగానే ప్రయుక్తమవుతుంది. మందిర శబ్దం ఉత్తరాది వారి ప్రభావంవల్ల తెలంగాణాలో దేవాలయార్థంలో వాడుకకెక్కింది. ఇతర ప్రాంతాల్లో రాజులూ, జమీందార్లూ, సంపన్నులూ నివసించే ఇళ్లనే మందిరాలని పిలుస్తారు. అగార శబ్దానికి విడిగా వాడుక తక్కువ. కానీ 'ధనాగారం, కోశాగారం, కారాగారం' వంటి పదబంధాల్లో సమాసాల్లో దానికి ఎక్కువ వ్యాప్తి ఉంది. 'దాచేచోటు' అనే ప్రత్యేకార్థంలో అగార శబ్దానికి వాడుక ఎక్కువ. వాసమంటే కాపురముండే తావని అర్థం. దీనిక్కూడా 'జనావాసం, వాసస్థలం' మొదలైన సమాసాల్లోనే వాడుక అధికం. సభా శబ్దానికి ఇప్పటికి అర్థమే మారిపోయింది. పదిమంది ఒకచోట చేరిన సమావేశానికే సభ అనిపేరుగాని కేవలం గృహార్థంలో దీనికి వాడుకలేదు. సభలో ఉండేవాళ్లు సభ్యులు. సభ్యులనే అర్థంలో ఈ కాలంలో సభికులనేమాటనే ఎక్కువమంది వాడుతున్నారు. ఒకప్పుడు జూదమాడేచోటును మాత్రమే సభ అనిపిలిచేవాళ్లు. జూదరులనూ జూదమాడించే వాళ్లనూ సభికులనేవాళ్లు. జీవితమే జూదమైన ఈ కాలంలో సభ్యులకూ సభికులకూ మధ్య భేదం అంతరించిందన్నమాట! సాలా శబ్దాన్ని కోశకారులు గృహపర్యాయమని చెప్తారుగాని దీనికీ 'శాల'కూ సంబంధముందేమోనన్న అనుమానం కలుగుతుంది. ఉదవసితం, వస్త్యం, నికాయ్యం అనే మాటలకు సంస్కృత కావ్యాల్లో కూడా ప్రయోగాలు దొరకటం కష్టం.

ఓక శబ్దం విడిగాకాక సమాసాల్లో వినిపించేమాట. 'నాకౌకసులు, జలౌకం' మొదలైన సమాసాల్లో ఓక శబ్దానికి 'నివాసం, స్థానం, స్థలం' అనే అర్థాలున్నాయి. స్థానశబ్దాన్ని గృహశబ్ద పర్యాయమని అంగీకరించటం కష్టమే. 'ప్రదేశం, తావు, ప్రాంతం' అనే అర్థాల్లోనే దానికి బహుళవ్యాప్తి కనిపిస్తుంది. వాస్తు శబ్దానికి గృహమనే అర్థం 'వాస్తుశాస్త్రం, వాస్తుపురుషుడు' వంటి సమాసాల్లో కనిపిస్తుంది. వస్తువులున్నది, వస్తువులకు సంబంధించిందీ వాస్తు. ఉటజ శబ్దానికి 'తౌర' అనే అర్థంకూడా ఉంది. ధామ శబ్దానికి ఉండేచోటనే అర్థం. ఈ మాట నివాసస్థలమనే అర్థంలో విడిగానూ సమాసాల్లోనూ వాడుకకెక్కింది. నివేశమంటే ఉండేతావు. ఈ మాటకు ఈ అర్థంలో వాడుక తక్కువేగాని దీని రూపాంతరమైన 'నివేశన' శబ్దానికి ముఖ్యంగా దస్తావేజుల భాషలో మంచి వాడుక ఉంది. 'ఇల్లు కట్టుకోదగినచోటు' అనే

అర్థంలో నివేశనస్థలమనే మాటను ధారాళంగా వాడుతుంటారు. తక్కినమాటలకు – ధిష్ణ్యం, సంస్త్యాయం, నివసనం, అవసథ'మనే వాటికి – వాడుక చాలా చాలా తక్కువ, సంస్కృతంలోకూడా.

కొన్ని అర్థ విశేషాల్లో మరికొన్ని సంస్కృత పదాలు గృహశబ్దపర్యాయాలని చెప్పదగినవి ఉన్నాయి. నలుచదరంగా ఉండే, నాలుగు చావళ్లుండే ఇంటిని 'చతుశ్శాల' అనీ, 'సంజవన'మనీ పిలుస్తారు. పైన పేర్కొన్న ఉటజ శబ్దంతోపాటు 'పర్ణశాల' అనే మాటను మునులు నివసించే పూరిళ్లనే అర్థంలో వాడేవారు. యజ్ఞం చేసే శాలను 'ఆయతనం, చైత్యం' అని పిలిచేవాళ్ళు. ఈ రెండు మాటలనూ యజ్ఞవిధులను వ్యతిరేకించే బౌద్ధులు సొంతం చేసుకొని బౌద్ధసన్యాసులూ భిక్షుకులూ నివసించే చోట్లనే అర్థవిశేషం కల్పించారు! అచ్చ తెలుగులో 'లాయ'మనిపిల్చే గుర్రాలసావడిని సంస్కృతంలో 'వాజశాల, మందుర' అంటారు. సన్యాసులూ వారి శిష్యులూ నివసించే ఇళ్లను మఠమని, వారికి ఉచిత నివాసంతోపాటు భోజన వసతి కూడా కల్పించేచోటును సత్రం అనీ అంటారు. 'సత్రేభోజనం మఠేనిద్రా' అనేమాట అందుకే పుట్టింది. మహారాజుల ఇళ్లలో తాగడంతో తృప్తిపడక ప్రత్యేకించి తాగుడుకోసం వేరే ఇళ్లు కట్టించుకొనేవాళ్లు. అటువంటి గృహాన్ని 'గంజ, మదిరాగృహం' అని పిలుస్తారు. పడకటింటిని 'గర్భాగారం, వాసగృహం' అంటారు. దేవాలయాలకు సంబంధించి గర్భగృహం, గర్భాగారం అనేవాటి స్థానంలో దేవుడుండే ప్రత్యేక స్థలానికి 'గర్భగుడి' అనే అర్థం వచ్చింది. గర్భగృహం, గర్భాగారం అనే సమాసాల్లోని గర్భ శబ్దానికీ గర్భాదానానికీ సంబంధముందిగాని 'గర్భగుడి'లోని గర్భ శబ్దానికి కడుపనే అర్థంకాక 'లోపలి భాగం' అనే ప్రత్యేకార్థం వచ్చింది. పురుటింటిని సంస్కృతంలో 'అరిష్టం, సూతికాగృహం' అని పిలిచేవాళ్లు. అరిష్టం అంటే ప్రమాధమనీ, కాకి అనీ ఇతరార్థాలు కూడా ఉన్నాయి. ఇళ్లలోని భాగాలను ఇలాపిలుస్తుంటే ప్రత్యేక గృహాలకు వేరే పేర్లున్నాయి.

రాతి కట్టడాలను కుట్టిమాలంటారు. పై మేడను చంద్రశాల అనీ, శిరోగృహమనీ పిలుస్తారు. రాజులుండే పెద్దఇళ్లను రాజగృహాలనేకాక ప్రాసాదాలనికూడా చెప్తారు. డబ్బున్నవాడి ఇంటిని హర్మ్యమంటారు. సౌధమంటే సున్నంకొట్టిన/వెల్లవేసిన ఇల్లు. ఈ మాటనుబట్టి పూర్వం అందరి ఇళ్లకూ అన్ని ఇళ్లకూ సున్నం కొట్టేవారుకాదని తేల్చవచ్చేమో! రాజ సదనమని కూడా సౌధ శబ్దానికి పర్యాయపదమొకటుంది. బహుశా ఏదో ఒకకాలంలో రాజుల ఇళ్లకేగాని ఇతరుల కొంపలకు సున్నం కొట్టించరాదనే నిషేధముందేమోనన్న సంశయం కలుగుతుంది.

తెలుగు మాటల్లో ఉండే, ఉండదగ్గ స్థలానికి 'వేలం, పాళెం, వీడు' మొదలైన పర్యాయపదాలుండేవి. కాలక్రమాన అవి ఊళ్లపేర్లకు చివరి ప్రత్యయాలుగా మారిపోయాయి. ఇక ఈనాటి తెలుగుదేశంలో ఎన్నిరకాల ఇళ్లున్నవో శాస్త్రం ప్రకారం కాక వాస్తవ వ్యవహారాన్నిబట్టి తెలుసుకొందాం.

ఎన్ని రకాల ఇళ్లున్నాయని ఏ తెలుగు విద్యార్థినడిగినా ముఖ్యంగా మూడురకాలు పేర్కొంటాడు: పూరిల్లు, పెంకుటిల్లు, మేడ – అని. 'పూరి' అంటే గడ్డి. గడ్డికప్పున్న ఇల్లు పూరిల్లు. తెలంగాణాలో ఇళ్లు రెండు రకాలంటారు. గుడిసె,

బంగ్లా అని. రాయలసీమలోనయితే మేడ బదులు మిద్దె శబ్దాన్ని ఎక్కువగా వాడ్తారు. ఇతర పదాలు లేవని కాదు. ఎక్కువ వాడుకలో ఉన్నవాటి విషయం ప్రస్తావిస్తున్నాం.

నిజానికి అత్యధిక సంఖ్యలో ఉన్న తెలుగిళ్లు గుడిసెలే. గుడుసు అంటే గుండ్రం. గుండ్రంగా ఉండే ఇళ్లు గుడిసె అనేది సామాన్యార్థం. దాన్నే కొన్ని ప్రాంతాల్లో చుట్టిల్లు అని పిలుస్తారు. మరికొన్ని ప్రాంతాల్లో కైవారమి ల్లంటారు. మరికొన్నిచోట్ల 'సేరు' అని పిలుస్తారు. సేరు శబ్దానికి చక్కదనమనే అర్థంకూడా ఉంది. గుడిసె అంటేనే గుండ్రటిదని అర్థమైనా దాన్ని 'చుట్టుగుడిసె' అంటేగాని కొందరికి తృప్తిగా ఉండదు. దాన్నే 'గుండుకొట్టం, గుండుగుడిసె, చుట్టిల్లు గుడిసె, బుడిమి, బొడ్డుగుడిసె' వగైరా రకరకాల పేర్లతో భిన్నప్రాంతాల్లో పిలుస్తుంటారు. నిజానికి బుడిమి పూర్తిగా గుండ్రంగా ఉండదు. అర్థచంద్రాకారంలో ఉంటుంది. వెదురుబొంగుల్ని వంచి రెండువైపులా నేలలో పాతి ఆ చట్రానికి చాపకప్పు వేస్తే అది బుడిమి అవుతుందన్నమాట. గుడిసెలన్నీ పూరిళ్లేగాని అవి గుండ్రంగా ఉంటాయి కాబట్టి గుడిసెలన్నారు; వాటి కప్పుమీద గడ్డి (పూరి) ఉంది కాబట్టి పూరిల్లన్నారు. కాశె గడ్డి కప్పున్న పూరిల్లు కాశె గుడిసె. ఈతాకులుగాని కప్పువేయడానికి వాడ్తే అది కమ్మరిల్లు. తాటి కొబ్బరి మట్టలను (ముఖ్యంగా) కళింగ ప్రాంతంలో కమ్మలని పిలుస్తారు. తెలుగు గుడిసెలకు కప్పుగా ఎక్కువ వాడుకలో కనిపించేవి తాటాకులు. కొన్నిచోట్ల మాత్రం కొబ్బరాకులు. కొబ్బరాకు కప్పే పూరిళ్లను సాధారణంగా గుండ్రంగా కాక చతురస్రంగానో పొడుగ్గానో కట్తారు. దాన్ని కొన్నిచోట్ల 'వాసిల్లు' అని పిలిస్తే, మరికొన్నిచోట్ల 'బారాకజు' అంటారు. బారాకజు అనేది 'బారెక్స్' అనే ఇంగ్లీషు మాటనుంచి వచ్చిన మాట. ఆ పూరింటి కప్పుమీద ఆకు/గడ్డి గాలికి ఎగిరిపోకుండా కొమరలు (గెలవాసాలు) బిగిస్తే దాన్ని కొమరిల్లు అని పిలుస్తారు. దాన్ని మరికొన్నిచోట్ల 'కోరిల్లు' అనికూడా పిలుస్తారు.

చాలా లక్షణాల్లో గుడిసెలా ఉన్నా గుండ్రంగా ఉండని, చదరంగంగా ఉండే పూరింటిని చౌకపిల్లు అని పిలుస్తారు. చౌక మనేది చతుష్కమనే సంస్కృత పదం నుంచి పుట్టిన మాట. ఈ రకాల ఇంటినే భిన్నప్రాంతాల్లో "చదరపిల్లు, చుట్టుచౌకం, చౌకంకొట్టం, సవిరిల్లు, సేకండిల్లు" వగైరా పేర్లతో పిలుస్తున్నారు. చుట్టూ గోడలుంటే ఇల్లు. గోడల్లేకపోతే 'పాక'. చివరకు వీ వెదురుబద్దల 'దడి' అయినా ఒకవైపుంటే ఆ పూరింటిని 'గోవిల్లు' అని పిలుస్తారు. పాకల్లోకూడా రకాలున్నాయి. వాటికి వేరువేరు పేర్లున్నాయి. గుండ్రంగా ఉండే పాకను 'చుట్టుపాక' అంటారు. పొడుగాటి పాకను 'దోనిపాక' అంటారు. వాలుకప్పున్న పాకను 'వారపాక' అంటారు. నిజానికిది 'ఒర'పాక. దీన్నే 'మొరపాక, సాయిబాన్' వగైరా పేర్లతో భిన్నప్రాంతాల్లో పిలుస్తుంటారు. ఇళ్లు మనుషులకు, పాకలు పశువులకు. గతిలేనప్పుడు పాకలనే ఇళ్లుగా భావించి తలదాచుకొనే వాళ్లున్నారు. అలాగే ఇంట్లోనే పశువులను కట్టివేసుకొనే వాళ్లూ ఉన్నారు. ఈ పరిస్థితులకు 'అవసరం' ప్రధానకారణం.

గడ్డికప్పు స్థానంలో పెంకులను వాడితే పెంకుటిల్లు తయారవుతుంది. పెంకును కొన్ని ప్రాంతాల్లో 'పెంక, పెంకి, పెంకె' అనికూడా పలుకుతుంటారు. 'పెంకిల్లు, బిళ్లిల్లు, కవేవిల్లు' అనే పేర్లు ప్రాంత భేదాలనుబట్టి పెంకుటింటికి వాడుకలో ఉన్నాయి.

ఆయా ఇళ్ల ఆకారంలోని భేదాలనుబట్టి రకరకాల పెంకుటిళ్లకు రకరకాల పేర్లు పెట్టారు. ఒకవైపు వంపుతో రెండు దిమ్మలకు బదులు నాలుగువైపులనుంచీ గాలీవెలుతురూ వచ్చేందుకు వీలుగా కట్టిన పెంకుటింటిని 'ఒకసంకిల్లు' అని కొందరు పిలుస్తారు. ఇక్కడి 'సంక' శబ్దం 'చంక' శబ్దానికి రూపాంతరం. మరికొందరు ఈ రకం కట్టడాన్ని 'ఒంటిలొద్దిల్లు' అని వ్యవహరిస్తారు. 'లొద్ది' అంటే 'మూల'. రెండువైపులకు బదులు మూడువైపులా గదులుండేట్లు కట్టిన పెంకుటింటిని 'చాటాకుల్లారి' అని తెలుగువాళ్లు పిలుస్తారు. ఇంగ్లీషులోని యూ అనే అక్షరం రూపంలో, 'చేట'లాగా మూడువైపులా ఎత్తుగా ఉండేది కాబట్టి ఈ పేరు వచ్చింది. దీన్నే కొందరు సంస్కృతంలో 'త్రిశాల' అంటారు – మూడు సావళ్లున్న ఇల్లనే అర్థంలో. నాలుగువైపులా కట్టుబడిచేసి మధ్యలో ఖాళీ జాగా ఉంచిన పెంకుటింటిని 'లోగిలిల్లు' అని పిలుస్తారు. ఈ రకం ఇంటికి అనేక ప్రాంతాల్లో రకరకాల పేర్లున్నాయి – మాండలికంగా. కాస్త చదువు – అదే సంస్కృతం (!) – ఒంటపట్టినవాళ్లు 'చతుర్భవంతి, చతుశ్శాల' అని పిలిచేది లోగిలింటినే. కొంచెం ఉర్దూగాని మరాఠీగాని అలవాటైనవాళ్లు 'చౌబార(భవంతి), చౌభవంతి' అని దీన్నే పిలుస్తారు. అటూఇటూ గాని చదువులవారయితే 'చుట్టు భవంతి, నాలుగిళ్ల భవంతి, నాలుగుసారల భవంతి' అంటారు దీన్నే. సీదాసాదాజనం ఈ లోగిలింటినే 'చుట్టుగులారపిల్లు, మండువా (ఇల్లు)' అంటారు. పేర్లు భిన్నమేగాని వస్తువొక్కటే.

భవన శబ్దానికి రూపాంతరంగా వాడుకకెక్కిన 'భవంతి' చిత్రమైన మాట. పెద్ద ఇంటిని భవంతి అని వ్యవహరిస్తున్నారు. తెలంగాణాలోనయితే సామాన్య జన వ్యవహారంలో గుడిసె (పూరిల్లు) కానిదేదయినాసరే 'బంగ్లా' కిందనే లెక్క. ఇది బెంగాలీ నుంచి ఇంగ్లీషులోకి వలసపోయి తిరిగి మన భాషలోకి దిగుమతయిన మాట. ఎక్కువ గదులున్న పెంకుటింటిని భవంతి అంటారు. రెండు గోడలమధ్య అడ్డంగా ఉన్న దూరం 'అంకణ'మని కొందరు, 'గది' అని మరికొందరు, 'అర'ని ఇంకా కొందరు వాడుతున్నారు. ఈ అంకణాల సంఖ్యనుబట్టి కూడా ఇళ్లకు పేర్లు మార్తాయి. ఒకే అంకణం ఉంటే దాన్ని 'ఏకేరిల్లు, ఏకారిల్లు, రోకుటిల్లు' అని భిన్నప్రాంతాల్లో పిలుస్తారు. భాగాలుగా కట్టిన పెంకుటింటిని కొందరు 'సందులిల్లు' అని పిలుస్తారు. ఒక ఇంటికి ఆనించి రెండోది కట్టినట్లు కప్పునుబట్టి కనిపిస్తుందిగాని ఒక్క ఇల్లుగానే ఉంటుంది ఈ సందులిల్లు. పక్కన పంచలు దించిన పెంకుటింటిని కొందరు 'కురుమాడిల్లు' అంటారు. కొన్నిచోట్ల ఇటువంటి ఇళ్లకు 'పై అంతస్తు' కూడా ఉంటుంది. అంతస్తు ప్రధానం కాదుగాని ఈ పేరు రావటానికి 'పంచ'దించటమే ముఖ్యకారణం. 'కురుమాడి' అంటే 'చిన్నమేడ' అని అర్థం చెప్పవచ్చు.

తెలంగాణా వ్యవహారంలో 'గుడిసె, బంగళా' అని ఇళ్ళు రెండురకాలు. చిన్నదయితే గుడిసె, పెద్దదయితే బంగళా. ఇది సాధారణ విశ్లేషణ. ఇళ్ళ రకాలను వాళ్ళు గుర్తించలేదని కాదు. చాలా రకాలు చెప్తారు. మరో రకం సులభ విభజన 'ఇల్లు, మేడ' అనేది. అంతస్తులున్నది మేడ; లేనిది ఇల్లు. అంతస్తుకు అంతరమనే పర్యాయపదముంది. మేడను భిన్న ప్రాంతాల్లో భిన్న విధాలుగా పిలుస్తారు – 'మేడి, మాడి, మాడిగ, మాలె, బంగళా' అని. మాట భేదమేగాని వస్తువొకటే. కొందరు

అంతస్తులున్న ఇంటిని 'మంజిల్' అని కూడా పిలుస్తారు. సంస్కృత కావ్యాల్లో 'చంద్రశాల, శిరోగృహం' అని పై మేడకు పేరు. 'పై మేడ' అంటే ఇంటిమీది అంతస్తు ఇల్లు. దీన్నే భిన్నప్రదేశాల్లో 'పై భవంతు, పై మిద్దె, మాడి, మేలు, మేల్మాలు' అని కూడా పిలుస్తుంటారు. 'మేల్మిద్దె, మేల్మాడి, మేల్మాలె' వంటి పేర్లు లేకపోలేదు. మేలు శబ్దానికి 'పై (నుండే)' అనే అర్థంకూడా ఉంది.

ఇటిక/రాతి కప్పున్న ఇంటికి అంతస్తులు లేకపోతే డాబా అని పేరు. దీన్నే 'దాబా, దావ' అనికూడా ఒక్కోచోట పిలుస్తారు. 'డాబ్‌నా' అనే హిందీ ధాతువునుంచి ఏర్పడ్డ మాట డాబా. తెలుగుమాటగా మిద్దె అనేది దీనికి పర్యాయపదం. మిద్దెకు 'మిద్ది, నిద్ది' అనే రూపాంతరాలూ భవంతులాంటి పర్యాయపదాలు ఉన్నాయి. ఆకారాన్నిబట్టి, కప్పునుబట్టి, హంగులనుబట్టి రకరకాల పేర్లున్నాయి ఇళ్లకు. గడ్డికప్పుగాని, ఆకుకప్పుగాని ఉన్న ఇంటి మామూలుపేరు పూరిల్లు/గుడిసె. దీన్ని సంస్కృతంలో (పర్ణ)కుటి, కుటీరం అని పిలుస్తారు. చిత్రమేమంటే మహాభవనాలు కట్టి వాటికి 'కుటి, పర్ణకుటి, (పర్ణ)కుటీరం' అనిపేర్లు పెట్టినవాళ్లుండటం. మహాభవనాలను సంస్కృతంలో హర్మ్యాలంటారు. దాన్ని సున్నంతో కట్టే సౌధమని పిలుస్తారు. సుధ అనేది గమ్మత్తు మాట. దానికి సున్నమనీ అమృతమనీ రెండర్థాలూ ఉన్నాయి. అలాగే ఓ మోస్తరు ఇల్లుకట్టి దాన్ని 'మంజిల్' అనే ఉర్దూ మాటతోగాని 'మేన్షన్' అనే ఇంగ్లీషు మాటతోగాని వ్యవహరించే వాళ్లూ ఉన్నారు! పూరికప్పుల్లో కూడా రకాలున్నాయి. వాడే ఆకులనుబట్టి గడ్డి రకాలనుబట్టి కొన్ని పేర్లు వస్తే కప్పు స్వభావాన్ని బట్టి పేరు మారుతుందికూడా. గుండ్రటి ఆకు కప్పును బోడికప్పంటారు. ఎక్కువ వాలుగా ఉన్న పూరికప్పును కోరాటం కప్పంటారు. దీన్నే 'మేలాటం, మేలువాటు' అనికూడా పిలుస్తారు. మేలంటే ఇక్కడ ఎక్కువ అని అర్థం. వాటు/వాటం అనేవి 'వాలు' అనే అర్థమిస్తాయి.

మట్టికప్పు సాధారణంగా మిద్దెలకుంటుంది. చౌడుమట్టి కప్పున్న మిద్దెను చౌడుమిద్దె అంటారు. కొందరు దీన్నే అటకమిద్దె అనికూడా పిలుస్తారు. రాతిదూలాల మిద్దెను కొందరు తీర్లమిద్దె అని పిలుస్తారు. చెక్క కప్పున్న మిద్దెను డొల్లు మిద్దె/మిద్ది అని వ్యవహరిస్తారు. మట్టికప్పు దించిన పంచలూ ఉన్న మిద్దెను పరాన మిద్ది అని పిలుస్తారు. రాతిగోడల మీద చెక్కకూర్పుతో కప్పువేసి దానిపైన మట్టిమేగితే 'దద్దలం' అనిపించుకుంటుంది నేటివ్యవహారంలో. కావ్యభాషలో 'దద్దడం, దద్దళం' అని దీన్నే పిలిచేవాళ్లు. ఈ మాటకు సూర్యరాయాంధ్ర నిఘంటువులో "బోడిమిద్దె, చిన్న రాతికప్పుగల గుడిసె, చిన్నగుడి, యుద్ధసాధనాలు నిలుపు రాతిమిద్దె" అనే అర్థాలిచ్చారు. వారిచ్చిన ప్రయోగంలో 'రాతిదద్దడము' అనేమాట ఉంది. అది నిజంగా రాతికట్టడమే అయితే 'రాతిదద్దడం' అని ఎందుకు చెప్పవలసి వచ్చిందో మరి! ఇప్పటివాడుకలో బోడి మిద్దె అనే మాటకు రెండర్థాలున్నాయి. ఒకటేమో పిట్టగోడల్లేని మిద్దె అనేది; రెండోది గుండ్రంగా ఉండే మిద్దె అని. గుడిసెకు రాతి కప్పేమో నిఘంటుకారులు వివరించలేదు. సాధారణంగా కోటల ముఖద్వారం మీద ఈ చెక్కకూర్పు గదులు వేసి అందులో యుద్ధసాధనాలుంచేవాళ్ళు. 'వంకదారకు చేరి వాకిట దద్దడంబులు చేర్చి...' అనే లాంటి పద్యాల ద్వారా ఈ విషయం

గుర్తించవచ్చు. గుళ్లకు రాతికప్పు సాధారణం. చెక్కకూర్పు గుళ్ళున్నవేమో తెలీదు. ఈ మిద్ది శబ్దాన్ని 'అంచ, తంతె, మెట్టు' అనే అర్థంలో కూడా కొందరు కొన్ని చోట్ల వాడుతున్నారు. చెక్కకప్పు స్థానంలో ఏ తడికనో పరిచి దానిమీద మట్టి మేగిన డాబాను/మిద్దెను 'సరంబ' అని పిలుస్తారు. మిద్దె శబ్దాన్ని నిఘంటుకారులు మేడకు పర్యాయ పదంగానే పరిగణించారు! వాళ్ళలెక్కన 'మేడ, మిద్దె, మాడుగు, మాడుపు, మచ్చు, ఉప్పరిగ'లు పర్యాయపదాలు. కావ్య భాషలోని మాడుగు, మాడువు–లకు నేటి సమానరూపాలు 'మాడి(గ), మాళిగ' అనేవి. మచ్చుకు ఇప్పుడు ఆయాప్రాంతాల్లో 'అటక, మంచె, మచ్చె' అనే అర్థాలున్నాయి. ఉప్పరం అంటే ఆకాశం. ఉప్పరిగ అంటే ఎత్తుగా ఉన్నఇల్లు అని చెప్పవచ్చు.

పెంకు కప్పున్న ఇంటిని 'పెంకుటిల్లు' అంటాం. దాన్నే 'కవేలిల్లు, బిళ్ళిల్లు' అనే వాళ్ళున్నారు. పెద్ద పెంకుల కప్పంటే 'కూనిల్లు, గూనిల్లు' అనికూడా పిలుస్తుంటారు. కప్పుల ఆకారాన్ని బట్టి వాటికి రకరకాల పేర్లున్నాయి. వెన్ను దగ్గర వెడల్పు తక్కువగా ఉండి క్రమంగా పక్కలకు విశాలంగా పరచుకొన్న పెంకు కప్పును 'బాలంగిరి' కప్పు అంటారు. దాన్నే భిన్న ప్రాంతాల్లో 'బాలంగి, బాలంకిరి, బాదాంగిరి, బారంకి' కప్పులని పిలుస్తారు. కప్పు నల్చదరంగా ఉంటే దాన్ని పాకకప్పు అని పేర్కొంటారు. ఇంటికప్పు పైనచిన్నగా ఉండి దూరంనుంచి చూస్తే త్రిభుజాకారంగా పక్కలకు వ్యాపించి ఉంటే దాన్ని 'కురుమాడు, కురువాటం' కప్పని పిలుస్తారు. 'కురు' అంటే చిన్న. 'మాడు' అంటే పైభాగం. ఈ రకం కప్పును మరికొందరు 'చిప్పపెంక' అని వ్యవహరిస్తారు. వెడల్పూ వాలూ తక్కువగా ఉండే పెంకు కప్పును 'పడకకప్పు' అని పిలుస్తారు. పాత, కొత్త పెంకులతో కప్పు 'నేత'ను రకరకాల నమూనాల్లో డిజైన్లలో నేసేవాళ్ళు పూర్వం. ఇప్పుడు ఆ విద్య ఇంచుమించు పూర్తిగా అంతరించిందనే చెప్పాలి. బంగళా అనేది 'బెంగుళూరు/మంగుళూరు/బంగళా' పెంకులతో – పెద్ద పెంకులతోఉన్న ఇంటికి పేరు. అసలది బెంగాల్ నుంచి వచ్చింది. ఇంగ్లీషువాళ్ళు అనేక ప్రభుత్వ భవనాలను ఆపెంకుల కప్పులతో ఎత్తయిన గోడలతో కట్టి దేశవ్యాప్తంగా అలవాటు చేశారు. ఈ పెంకును సీమపెంకని పిలవటానికి ఇంగ్లీషువాళ్ళ ప్రమేయం కారణం.

కొంత మేడ, కొంత పెంకుటిల్లు ఉన్న కట్టడాన్ని 'మాడిల్లు' అని పిలుస్తారు. నేలలో కట్టిన ఇల్లు 'మాళిగ'. నేలమాళిగ అనికూడా వ్యవహారం. ఆయా కాలాల్లో ఆయా ప్రాంతాల్లో ఇలా రకరకాల పేర్లతో ఇల్లు కట్టే దానికి పేరు పెట్టడం అలవాటయింది.

ఇల్లు కట్టే స్థలాన్ని నివేశమంటారు. దానికి తెలుగులో 'వేలం, పాళెం, వీడు, పట్టు, బిడారు, విడిది' అనేవి పర్యాయపదాలని నిఘంటుకారులు చెప్పారు. ఇప్పటిభాషలో 'వేలం' అనేమాట అర్థం పూర్తిగా మారింది. ఇప్పటి 'వేలం (పాట)' అనేమాట పోర్చుగీసుపదం 'వేలియో' నుంచి వచ్చింది. 'ఏలం' అంటేనే సరైనరూపం. వేలం అనాలని పెద్దలు తప్పుగా దిద్దుతుంటారు. (కొందరికి పోర్చుగీసువారిని బుడతకీచులంటేనే గాని తృప్తికలగదు). పాళెం అనేది సరిహద్దులోఉన్న ఊరు, సైనికులు నిలిచే ఊరు అనే అర్థంలోనూ, ఊళ్ళపేర్లకు చివరప్రత్యయంగానూ

ఎక్కువవాడుకలో ఉంది. 'వీడు' అనేమాటకు పట్టణమనే అర్థమే ఎక్కువ వ్యాప్తిగలది. పట్టు సాధారణంగా నీటివసతి బాగా ఉన్న ఊరు. ఈ అర్థంలో ఇది ఊళ్ళపేర్ల చివర ప్రత్యయంగా చేరింది. బిడారు శబ్దానికి వ్యాపారుల స్థావరమనే అర్థమే ఎక్కువ వ్యాప్తిలో ఉంది. విడిదికి తాత్కాలిక నివాసమనే అర్థంలోనే ఎక్కువ వాడుక.

# భార్యాభర్తలు

ఇల్లు గుర్తుకురాగానే ఇల్లాలు జ్ఞప్తికి వస్తుంది. ఆలు అంటే భార్య. ఇల్లాలంటే ఇంటియజమాని భార్య. ఇంగ్లీషులోని 'హౌస్‌వైఫ్' అనే మాటవంటిది. ఈ కాలంలో ఈ ఇంగ్లీషుమాటకు ఇల్లాలనే అర్థంకన్నా ఉద్యోగంగాని వృత్తిగాని లేక ఇంటిపనులే చేసుకొనే స్త్రీ అనే అర్థం ప్రచురమయింది. ఆలు శబ్దాన్ని ఈ కాలంలో విడిగా వాడటం చాలా తక్కువ. ఒకప్పుడు 'ఇంటిది' అని పిలిచేవాళ్ళు! ఇప్పుడామాటకన్నా 'పెండ్లాం/పెళ్ళాం' అనే మాటకే ప్రాచుర్యమెక్కువ. చదువుకొన్నవాళ్ళు 'వైఫ్' అంటున్నారనుకోండి – ఇంగ్లీషుమాట వాడి. తెలుగు నిఘంటుకారులు 'రాణి, గేస్తురాలు' అనే మాటలను పర్యాయపదాలన్నారు. రాణి సంస్కృతంలోని రాజ్ఞీ శబ్దభవం. అలాంటిదే సాని శబ్దమొకటుంది. అది స్వామినీ శబ్దంనుంచి వచ్చింది. పూర్వం అందర్నీ సానులని వ్యవహరించేవాళ్ళు. కాలక్రమాన అది వేశ్యావాచకం కావటంతో వాడుక ఇంచుమించు పూర్తిగా మానేశారు. 'దొరసాని, రెడ్డిసాని' వంటి సమాసప్రయోగాలు తెలంగాణాలోనే ఇంకా వినిపిస్తున్నాయి.

సంస్కృతంలో ఇల్లాలు శబ్దానికి సమానార్థకాలుగా "పత్ని, ద్వితీయ, పాణిగృహీతి, సహధర్మిణి, సహధర్మచారిణి, కుటుంబిని, పురంధ్రి, కులస్త్రీ, కులపాలిక, దార, జాయ" లాంటి మాటలెన్నిఉన్నా భార్యాశబ్దమే ఎక్కువ వ్యాప్తిలో ఉంది తెలుగులో కూడా. పత్ని అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య. ద్వితీయాశబ్దం ఒకనాటి భారతీయ సంస్కృతికి చిహ్నం. ముఖ్యంగా రాజులకు భూమి/రాజ్యం భార్యకింద లెక్క; పెళ్ళాడిన వ్యక్తి ఆ కారణంగా ద్వితీయ (అంటే 'రెండోది') అయిపోయిందన్నమాట. పాణిగ్రహీతి అంటే పాణిగ్రహణం చేసుకొన్న స్త్రీ. అలాకాక ఉంచుకొన్నస్త్రీనయితే 'పాణిగ్రహీత' అంటారు! చివరి అచ్చును జాగ్రత్తగా వాడకపోతే ప్రమాదం. సహధర్మిణి, సహధర్మచారిణి అనే మాటలకు యజ్ఞాల్లో, యాగాల్లో మంత్రపూతమైన విధులనూ కర్మలనూ కలిసిచేసేదని అర్థం. పట్టపురాణి, పెద్దభార్య వంటివాళ్ళకే ఈ అధికారం. ఈ 'అధికారం' కోసం సత్యవతి పట్టుబట్టి భారతకథ నడిపించింది. (ఎందుకంటే ఆమె కడుపున పుట్టినవాళ్ళకే రాజ్యాధికారం సంక్రమిస్తుంది). శకుంతల అందుకే పట్టుబట్టింది. బంగారుసీత లేకపోతే యజ్ఞం సాగేదికాదు. కుటుంబిని అంటే పిల్లాజెల్లా ఉన్న ఇల్లాలు–పిల్లలకోడి అనుకోండి. పురంధ్రి అనేది పట్టపురాణి వంటిమాట. పతివ్రత అనే అర్థంలోకూడా ఈ పదం వాడుతుంటారు. కులస్త్రీ అంటే ఇంటావిడ.

కులపాలిక ఇల్లుచూసే ఆమె. దార, భార్య, జాయ మామూలు మాటలు. వీటిలో మధ్యదానికే విడిగా ఎక్కువ వాడుక. దారపుత్రుల వంటి సమాసాల్లో 'దార'కు వాడుక ఎక్కువ. జాయా శబ్దం పుస్తకాల్లోని మాట. పోషణ పొందేది భార్య. 'చిన్నిల్లు' ఉన్నా 'న్యాయశాస్త్రరీత్యా' పోషించవలసినది భార్యనే.

భర్త అనేది ఎక్కువవాడుకలో ఉన్నమాట. పెండ్లాడిన పురుష వ్యక్తి అనే అర్థంలోనే ఈ మాటకు వాడుక ఎక్కువ. తెలుగు నిఘంటువులు ఇంటి యజమాని, 'కుటుంబ పెద్ద' అనే అర్థాల్లో 'గేస్తు, ఇలురేడు, మనికిరేడు, ఇంటివాడు' అనే మాటలనేగాక 'ఆలుబిడ్డలుగల యతడు' (!) అనే సమాసాన్ని కూడా గృహయజమాని అనే అర్థంలో పర్యాయపదాలని పేర్కొంటున్నాయి. గేస్తు శబ్దం 'గృహస్థ(డు)' అనే సంస్కృత పదం నుంచి వచ్చినమాట. 'ఇంటివాడు' అనేదొక్కటే 'ఇల్లాలు'లాంటి సమాసం. అయితే ఇంటివాడయినాడంటే పెళ్ళాడాడనే అర్థం. ఇలు, మనికి అనే శబ్దాలపక్కన రేడు (=రాజు) అనే మాటచేర్చి తెలుగుకవులు గృహయజమానికి పర్యాయపదాలు సృష్టించారన్నమాట – ఎవరింటికివారే ప్రభువులనే భావంతో. ఆలుబిడ్డలుగలయతడనేది కేవలం కృత్రిమశబ్దం. ఒక ఇంటికి యజమానిగా ఉండి ఒకప్పుడు భార్యలేకుండా, ఒకప్పుడు సంతానంలేకుండా ఉండరాదని ఎక్కడుంది? నిస్సంతుగా ఉన్న గృహస్థులులేరా? ఇప్పటి వాడుకలో 'ఇంటాయన, ఇల్లుగలాయన' అని రెండురకాల మాటలు పుట్టాయి. ఇంటాయన భర్తకావచ్చు, ఇంటికి యజమానీకావచ్చు. ఇల్లుగలాయన అనే సమానం 'తమకు అద్దెకిచ్చిన ఇంటి సొంతదారు' అనే అర్థంలో వచ్చింది – అద్దెకొంపల విషయంలో వాటి యజమానినీ తనభర్తనూ స్పష్టంగా వేరుచేసి చెప్పడంకోసం. ఎవరిజాగ్రత్తలు వారివే అయినా మారిన పరిస్థితుల్లో తప్పర్థం రాకుండా ఈ నూతనసమాసకల్పన జరిగింది.

పుస్తకాల్లో ఏ తెలుగుమాటమ వాడినా వ్యవహారంలో 'యజమాని' అని కొందరూ, 'సంసారి' అని చాలామందీ గృహాధిపతిని పేర్కొంటున్నారు. కొన్నిప్రాంతాల్లో 'సంసారి' శబ్దానికి 'రైతు, సేద్యగాడు' అనే అర్థం వచ్చిందికాబట్టి 'ఖామందు' అనే ఉర్దూ మాటను పర్యాయంగా వాడుతున్నారు. 'ఓనర్' అనే ఇంగ్లీషుమాటను 'ఇల్లుగలాయన' అనే అర్థంలో వాడుతున్నా ఇల్లాలు శబ్దానికి పోటీగా ఇంటియజమాని అనే అర్థమిచ్చే ఒక్కమాట వాడుకలో వినిపించటంలేదు. మగడు/మొగుడు అంటే భర్తేగాని యజమానికాడు. ఇల్లాలు తన భర్తనుగురించి ప్రస్తావించేటప్పుడు 'తాను, (మా)ఇంటాయన' లాంటి మాటలు వాడుతుండేది పూర్వం. ఇప్పుడు పుస్తకాల, సినిమాల ప్రభావం వల్ల 'శ్రీమతి, శ్రీవారు' అనే కొత్త జంట వెలసింది తెలుగువాడుకలో. ఇంకా 'హబ్బీ' (హజ్బెండుకు సంక్షేపరూపం) అంతగా వాడుకలోకి వచ్చినట్లు లేదు.

సంస్కృతాంధ్ర కవుల్లో ఒక సంప్రదాయముంది. ఇల్లాలుకు పర్యాయాలుగా భార్య, స్త్రీశబ్ద పర్యాయాలనూ, గృహయజమానికి పర్యాయంగా భర్తృశబ్ద పర్యాయపదాలనూ వాడటమది. బహుశా తక్కిన భారతీయ భాషాకవులు కూడా ఇదే పద్ధతి అవలంబించి ఉండవచ్చు. తెలుగుభాషలో సహజంగానూ, సంస్కృత పదాలను ఎరువు తెచ్చుకున్నందువల్లనూ స్త్రీశబ్ద పర్యాయపదాలు చాలా ఉన్నాయి. వాటి సంగతి

దరిమిలా పట్టించుకుందాం. ప్రస్తుతానికి వద్దు – వాటి సంఖ్య చాలా తక్కువ కాబట్టి. ఇల్లాలు విషయంలోలాగానే ఇంటి యజమాని సంగతి ఇప్పుడాలోచిద్దాం.

'స్వామి, ఈశ్వరుడు, పతి, అధిభువు, నాయకుడు, నేత, ప్రభువు, పరివృఢుడు, అధిపుడు, రమణుడు, యజమాని, యజమానుడు, భర్త, రమణుడు, కుటుంబవ్యాపృతుడు, ఈశిత, అభ్యాగారికుడు, గృహమేధి' వగైరా సంస్కృత పదాలు ఇంటాయనకు పర్యాయపదాలంటారు. అల్లసాని పెద్దన మనుచరిత్రలో "కెలకులనున్న తంగెటిజున్ను గృహమేధి, యజమాను డంకస్థితార్థపేటి" అనే పద్యంలో ప్రవరుడి సంగతితోబాటు పర్యాయపద పట్టిక విషయంకూడా చూశాడు. తెలుగు మాటల సంగతి ఇంతకు ముందే చూశాం కాబట్టి ఇప్పుడీ పట్టికను పరిశీలిద్దాం. కోస్తా ప్రాంతంలో 'ఖామందు' అనే ఉర్దూమాట కూడా వాడుకలో వినిపిస్తుంది. ఆస్తిపాస్తులుండి ఆదాయప్పన్ను పోటుతోబాటు కోర్టు గొడవలు కూడా ఉన్న కుటుంబాల్లో (అన్నట్లు 'కుటుంబికు'డనే మాట కూడా ఓ పర్యాయపదమే – 'సంసారి' అనేమాట లాగా) 'కర్త' అనేమాట వినిపిస్తుంది – అవిభక్త హిందూ కుటుంబ వ్యవహారాలుచూసే న్యాయాధికారంగల వ్యక్తి అన్న సాంకేతికార్థంలో.

పై పట్టికను చూస్తే స్థూలంగా మూడు రకాల మాటలున్నాయని తెలుస్తుంది. 'రాజ' శబ్దానికీ 'భర్తృ' శబ్దానికీ ముడి వేసినవి ఒకరకం. రెండోరకం సంపాదించి పెట్టేవాడనే అర్థం కలవి. మూడోరకం ఇంటికి వచ్చినవాడికి ఇంత పెట్టించేవాడనే మాట. 'రాజు'తోబాటు 'దేవుడి'తో కూడా ముడిగల మాటల సంగతి ముందు చూద్దాం. 'స్వామి, ఈశ్వరుడు, పతి, అధిభువు, నాయకుడు, నేత, ప్రభువు, అధిపుడు, రమణుడు, ఈశిత' అనేవి అటు దేవుడికీ, ఇటు రాజుకూ చాలక ఇంటి యజమానిక్కూడా అన్వయిస్తాయని గుర్తించగలరు. రాజు విష్ణ్వంశ సంభూతుడనే భావం, యజమాని పితృస్వామిక వ్యవస్థలోని అవిభక్త కుటుంబానికి సర్వాధికారి అనే భావం ఇవి పర్యాయపదాలని పరిగణించడానికి దారి తీశాయి. సంస్కృత నాటకాల్లో స్త్రీపాత్రలు కూడా "యద్ భర్తా ఆజ్ఞాపయిష్యతి" (రాజుగారు ఆజ్ఞాపించినట్లు) అనే మాటలు వింటే రాజుకూ మొగుడికీ భేదం లేదా అని గాభరాపడక తప్పదు. భర్తకు భర్త కాబట్టి – అంటే తనను భరించేవాడని భరించేవాడు కాబట్టి – ఆనాటి స్త్రీలు రాజును కూడా భర్తకిందే లెక్కించినట్లుంది. 'రాజును చూసిన కళ్లతో మొగుణ్ణి చూస్తే మొత్తబుద్ధిపుట్టిం'దనే సామెతకూ దీనికి లంకె వేస్తే అర్థం స్పష్టమవుతుందా? ఇప్పటికీ ఉద్యోగాలు చేసే మగవాళ్లు తనపై అధికారిని మొగుడుగానో మిండమొగుడుగానో చెప్పుకోవటం లేకపోలేదు – పెత్తందారనే అర్థంలో.

'స్వం' అంటే సొమ్ము. స్వామి దానికి అధికారి. మనమంతా దేవుడి 'సొమ్ము'లమే కాబట్టి దేవుడు మనకు స్వామి. సొమ్ములంటే పశువులని ఇప్పటికీ కళింగ ప్రాంతంలో వ్యవహారముంది. ఇనపసొమ్ములంటే నల్లగొడ్డు– బర్రెలూ దున్నలూ. వాటికి పశువనేది సంస్కృత పర్యాయపదం. మన దేవుడు 'పశుపతి' (శంకరుడు). మనం పశువులం కాకపోతే మన దేవుడికీ పశుపతిత్వం కుదరదు. క్రైస్తవులు కూడా ప్రజలను గొర్రెలనీ, జీసస్ గొర్రెలకాపరనీ వ్యవహరిస్తారు. ఒకప్పుడు ప్రాచీన

కాలంలో ఇంకా వ్యవసాయం స్థిరవృత్తిగా ఏర్పడక ఆర్యులు గొడ్లమందలతో సంచార జాతులుగా తిరుగుతున్న కాలంలో – పశువులే సొమ్ముకింద లెక్కించేవాళ్లు. ఇప్పటి 'పైసా' శబ్దం అప్పటి 'పశు' శబ్దం నుంచే పుట్టిందని పెద్దలంటారు. ఈశుడు, ఈశ్వరుడు, ఈశిత, అధిపుడు, అధిభువు మొదలైన మాటలన్నీ 'పాలించేవాడు, పెత్తనం చేసేవాడు, నెత్తిన ఎక్కినవాడు' మొదలైన అర్థాల్లో వచ్చినమాటలే.

గృహమేధి, కుటుంబికుడు అనే మాటలు ఖచ్చితంగా సమానం కావు. అశ్వమేధం, నరమేధం వంటి మాటల్లో చివరఉన్న 'మేధం' చేసే వ్యక్తి గృహమేధి. వేద విహితంగా తన ఇంట్లో 'అగ్ని కార్యాలు' నెరవేర్చేవాడు గృహమేధి. అందరూ కాదన్నమాట. కుటుంబికుడు అనేదే సామాన్యపదం. రమణి–రమణుడు అనేవి పరస్పరం వ్యతిరేక పదాలు. రమణి అంటే చక్కని స్త్రీ. రమణుడు అంటే పురుషుడు. దంపతుల్లో ఏ ఒక్కరైనా చక్కనివాళ్లు కాకపోతే ఈ మాటలు వాడవచ్చునో లేదో తెలియదు. అయినా వాళ్లిద్దరూ ఒకరి దృష్టిలో మరొకరు చక్కనివాళ్లేనని సరిపెట్టుకొంటే ఇబ్బంది లేదు. సరిపెట్టుకోనప్పుడు జరిగేదేమిటో పాఠకుల ఊహాశక్తికి వదిలిపెట్టడం మంచిదేమో. 'కుటుంబ వ్యాపృతుడు' వంటి మాటలు కవులు గణపూరణ పాదపూరణల కోసం కల్పించుకొన్న సమాసాలేగాని ఏనాటి వాడుకలోనూ ఉన్న సాధారణ శబ్దాలు కావు.

అభ్యాగారికుడంటే బహుశా మంచి ఇల్లున్నవాడని చెప్పాలేమో. ఆతిథేయుడు లాంటివి మూడోరకం మాటలు. తన ఇంటికి వచ్చిన వ్యక్తికి ఆతిథ్యమిచ్చి – అన్నపానాదులు ఏర్పాటు చేసి, మర్యాద చేసేవాడని ఆమాటలకర్థం. పిల్లికయినా బిచ్చం పెట్టని వాళ్ల విషయంలో ఈమాటలు పనికిరావు. భార్యాభర్తలున్నది ఇల్లు.

ఇల్లాలు, ఇంటాయన శబ్దాలకు విడివిడిగా పర్యాయపదాలు పరిశీలించలేంగాని వారిద్దరినీ కలిపి చెప్పేమాటలసంగతి చెప్పటం కుదరలేదు. తెలుగులో రెండుగాని, అంతకుమించిన వాటిని గురించిగాని చెప్తే బహువచనమవుతుంది. సంస్కృతంలో ఏక, ద్వి, బహువచనాలని మూడు వచనాలున్నాయి. ఎప్పుడూ కలిసి ఉండే రెండేసి వస్తువులనూ, ఇద్దరేసి వ్యక్తులనూ చెప్పటానికి ద్వివచనం వాడటం సంస్కృతసంప్రదాయం – వేదకాలం నుంచీ. ఇంద్రావరుణులు, అశ్వినేయులు మొదలైన దేవతలనూ, తల్లిదండ్రులు భార్యాభర్తలు మొదలైన వ్యక్తులనూ ద్వివచనంలో చెప్తారు. అవి కూడా తెలుగు లెక్కనయితే బహువచనాలే. ఇప్పుడు భార్యాభర్తల విషయానికి వద్దాం.

'మిథునం, ద్వంద్వం, యుగ్మం, యుగలం, యుగం' వంటి ఏకవచనరూపాలూ, 'స్త్రీపుంసే, దంపతీ, జంపతీ, జాయాపతీ, భార్యాపతీ' వంటి ద్వివచనరూపాలూ సంస్కృతంలో భార్యాభర్తలను సూచించటానికి వాడేమాటలు. మిథునం అంటే (ఒకరితోఒకరు) కలిసిఉండే జంట అని అర్థం. ద్వంద్వమంటే రెండు – కలిసివున్న ఇద్దరనే అర్థం. 'యుగ్మం, యుగలం, యుగం' అనే మాటలకు 'జోడా, జోడీ' అనే హిందీ మాటలూ 'జంట' అనే తెలుగుమాటా సమానార్థకాలు. ఈ మాటలకు తెలుగుగ్రంథాల్లో ఈ అర్థంలో వాడుక తక్కువ. యుగ శబ్దానికి కాలభాగం మొదలైన ఇతరార్థాలుకూడా ఉన్నాయి. ఒక్క మిథున శబ్దం మాత్రం కొంచెమెక్కువ వాడుకగలమాట. 'స్త్రీపుంసే, భార్యాపతీ' శబ్దాలకు తెలుగుకావ్యాల్లో కూడా

వాడుక దొరకదు – ద్వివచనం తెలుగులో లేదుకాబట్టి. దంపతీ, జంపతీ శబ్దాలు రూపాంతరాలు. 'దంపతులు' అనే అనువాదంతో బహువచనరూపంలో ఈ మాట తెలుగులో అత్యధికవ్యాప్తిలో ఉన్నది. దాని రూపాంతరానికి కావ్యప్రయోగమేగాని వ్యవహారప్రయోగం లేదనేచెప్పాలి. జాయాపతులనే మాట పుస్తకాల్లో కనిపిస్తుంది.

తెలుగువారి దైనందిన వ్యవహారంలో "ఆలుమగలు" అనే సమాసం చదువుకొన్న వాళ్లలోనూ 'మొగుడూపెళ్ళాలూ' అనేది తదితరుల వాడుకలోనూ వినిపిస్తాయి. భార్యాభర్తలనే మాటకున్నంతవాడుక ఈ రెంటికీ లేదేమో చదువుకున్నవాళ్ళ వాడుకలో. 'జంట' శబ్దం కూడా అప్పుడప్పుడు వినిపిస్తుంది. 'జోడా, జోడీ' అనేవి హిందీ/ఉర్దూ పదాలయినా తెలుగులో కలిసిపోయాయి. జంట శబ్దం స్త్రీపురుష వ్యక్తులను సూచించడానికేకాక వస్తువులను పేర్కొనటంలో కూడా వాడుతుంటాం. అది మరో నామవాచకానికి ముందున్నప్పుడు విశేషణంగా కూడా ప్రయుక్తమవుతుంది. జంటపిట్టలంటే రెండు పక్షులు; పిట్ట(ల) జంట అంటే పక్షులు రెండున్న జోడీ.

దంపతులుంటే చాలు – పిల్లలున్నా లేకపోయినా అది కుటుంబమవుతుంది. సంసారమవుతుంది. వంశమవుతుంది. 'కులం' కూడా అవుతుంది. కుటుంబం తెలుగువారి వాడుకలో చేరినమాట. తెలుగురచయితలు సామూహికంగా సృష్టించిన పాత్రపేరు కుటుంబరావు – అంటే చాలామంది పిల్లలున్నవాడనే అర్థంలో. విడివిడిగా కొందరు మహారచయితలు 'గిరీశం, పార్వతీశం, కాంతం, ఎంకి' వంటి ప్రత్యేక పాత్రలు సృష్టిస్తే, కలివిడిగా చాలామంది తెలుగురచయితలు కుచేలుడివంటి 'కుటుంబరావు' లనూ, గుమాస్తాగా బతుకుతూ ఆడపిల్లల పెళ్ళిళ్ళకోసం అష్టకష్టాలు పడుతుంటే 'పరంధామయ్య'లనూ సృష్టించారని నవలాసాహిత్యంతో పరిచయమున్నవాళ్ళు సులభంగా గుర్తించగలరు. కుటుంబ శబ్దంలాగానే సంసారం, వంశం, కులం అనే మూడుపదాలూ సంస్కృతంలోవే. తెలుగుసినిమాల్లో 'కుటుంబగౌరవం, వంశగౌరవం' అనే మాటలు జోరుగా వినిపిస్తాయి. వంశ శబ్దానికి 'వెదురు' అనే అర్థంకూడా ఉంది. బహుశా వెదురుపొదలాగా విస్తరించాలనే భావంతో ఈ మాటపుట్టిందేమో! కుటుంబ శబ్దానికి 'సమూహం, గుంపు' అనే అర్థవిశేషాలున్నాయి. కుల శబ్దానికి ఈ కాలానికి అర్థం మారిపోయింది. పూర్వకాలంలో, 'అష్టపుత్ర బహుధనావాప్తిరస్తు' అని దీవించేకాలంలో, ఈ మాటలకు వాడుకా విలువా ఉండేవి. కాలంమారి ఇప్పుడది శాపంగా పరిణమిస్తున్నదనుకోండి. అది వేరేసంగతి.

తెలుగుమాటల్లో చెప్పాలంటే 'కొలం, వంగడం, వంగసం, సంతు, పదుగు' అనే ఉన్నాయి. వీటిలో మొదటిది కులశబ్దం నుంచి పుట్టింది. చదువుకోనివాళ్ళ వాడుకలోనే ఈ మాట వినిపిస్తుందిగాని 'కుల' శబ్దానికి వచ్చిన అర్థవ్యాకోచం ఈ తద్భవపదానికి వచ్చినట్లులేదు. వంగడం, వంగసం రూపాంతరాలు. వీటిని వంశశబ్దం నుంచి పుట్టిన మాటలని చెప్పేవారు లేకపోలేదు – సంస్కృతాభిమానులు. కానీ నిజానికివి అచ్చ తెలుగుమాటలే. ఇప్పటివాడుకలో 'వంగడం' ఉందిగాని 'వంగసం' లేదు. ఉన్నమాటను జంతువృక్ష 'సంతతి'ని వర్ణించేటప్పుడే ఎక్కువగా వాడుతున్నాం. ఉదాహరణకు వరివంగడం లాంటి సమాసాల్లో – వరి 'జాతులు/రకాలు'

అనే అర్థవిశేషంలో. సంతుశబ్దం 'సంతతి' నుంచిపుట్టిందో, 'సంతానం' నుంచే పుట్టిందో తేల్చటం కష్టం. ఆరెండు మూలశబ్దాలూ సంస్కృతంలోవి. సంతు తద్భవపద మంటారు. 'పదుగు' అనేది నిక్కచ్చిగా తెలుగుమాట – పదిమందిగల కుటుంబమనే అర్థం దానికుంది. ఈమాటకు తెలుగుకావ్యాల్లో గూడా మారుమూల ప్రయోగాలున్నాయేమోకాని నోటిమాట వాడుక ఉన్నట్లు చెప్పలేం. ఈ కుటుంబం ఒకనాటికి పెరిగేటప్పటికి అలుమగలు తల్లిదండ్రులవుతారు.

సంస్కృతంలో తల్లిదండ్రులనే జంటను చెప్పటానికి ద్వివచనంలో 'మాతాపితరౌ, మాతరపితరౌ, ప్రసూజనయితారౌ' అనే మాటలున్నాయి. మూడోదానికి ఆ భాషలోనే వాడుక చాలా తక్కువ – పిల్లలను కన్నవాళ్ళనే డొంకతిరుగుడు సమాసార్థంకలమాట అది. తెలుగు పుస్తకాల్లో 'మాతాపితలు, మాతాపితరులు' వంటి ప్రయోగాలు కనిపిస్తాయి. 'తల్లిదండ్రులు/తలిదండ్రులు' అనే ద్వంద్వసమాసమొక్కటే తెలుగువారి మాటల్లో చాలా తరుచుగా వినిపిస్తుంది.

## సంతానం

దంపతుల కడుపున ఒక 'కాయ' కాచిందంటే వంశాభివృద్ధి జరిగినట్లు. అయితే ఈలాంటి వాక్యాల్లో తప్ప, 'సంతు' ను 'కాయ' అని విడిగా చెప్పరు; బిడ్డ అంటారు. మగబిడ్డ, ఆడబిడ్డ – అని విశేషణాలు చేర్చి చెప్పకపోతే బిడ్డ స్త్రీ పురుషుల్లో ఎవరయినా కావచ్చు. కానీ తెలంగాణా మాండలికంలో 'బిడ్డ' ఎప్పుడూ స్త్రీ వాచకమే. రాయలసీమలో కూడా చాలావరకు వ్యవహారం ఇలాగే ఉంటుంది. సంస్కృతంలో కూతురో కొడుకో తేల్చకుండా ఇద్దరికీ సరిపొయ్యే మాటలు రెండున్నాయి – అపత్యం, తోకం అని. తోకశబ్దం తరవాతికాలంలో వంశం, అన్వయం, అన్వవాయం, అభిజనం, గోత్రం, సంతతి, సంతాన శబ్దాలకు పర్యాయపద మైపోయింది. అలాగే వంశానికి పర్యాయమైన 'సంతాన' శబ్దం నేటివాడుకలో 'కొడుకులూ కూతుళ్లూ' అనే అర్థంలో స్థిరపడిపోతున్నది. మీకు సంతాన మెంతమంది? మీకు పిల్లలెందరు? అనే రెండు వాక్యాలకూ ఈకాలంలో ఒకే అర్థం. బిడ్డ శబ్దంలాగా పిల్ల శబ్దం కూడా స్త్రీ పురుషసామాన్యమేగాని 'ఆడపిల్ల, మగపిల్లవాడు' అని వివరంగా చెప్పనప్పుడు కూతురనే అర్థంలోనే స్థిరపడింది. కొన్నిప్రాంతాల్లో 'పిల్లా' అని వయసు వచ్చిన స్త్రీని గురించి సంబోధించటం తప్పుకింద లెక్క. 'పిల్లలు'అని బహువచనంలో చెప్తే ఆమాట లింగభేదంలేని సంతానంవంటి మాట – ఆడ మగ పిల్లలిద్దరికీ సరిపోయే దన్నమాట.

'బిడ, బిడ్డ, పూప, పాప, కుర్ర, చిరుత, కందు, కూన, నిసువు, నిసుగు, పిసువు, బొట్టె, బుడత, పిన్న, చిన్న, చోర, చొర, పడుచు' అనే మాటలు స్త్రీ పురుషభేదం లేకుండా ఆడమగపిల్లల కిద్దరికీ అన్వయించేవి. అంటే సంస్కృతంలో 'శిశువు,

కిశోరం' లాంటివన్నమాట. చిత్రమేమంటే అచ్చతెలుగు నిఘంటువులు నిత్యం మనం మాట్లాడే 'అమ్మాయి, అబ్బాయి, గుంట, గుంటడు, పోరి, పోరడు, పసిపాప, పసిబిడ్డ, చంటి(పాప)' లాంటి మాటలను గ్రంథస్థం చేయలేదుగాని 'పాలబుడత, కొండికవాడు, చిన్నవాడు, పసివాడు(!)' లాంటి పదాలను కోశస్థంచేశాయి. ఈ మాటల్లోని 'బిడ-బిడ్డ, పిన్న-పిన, చిన్న-చిన, చౌర-చోర, నిసుగు-నిసువు' అనేవి అన్యోన్యం రూపాంతరాలు. 'చిన్ని, బుజ్జి, బుల్లి' వంటి విశేషణాలను కూడా పసిపిల్లలను ప్రస్తావిస్తూ ఉపయోగిస్తారు. పాలుతాగే బిడ్డను 'చంటిపాప' అంటామేగాని 'పాలబుడుత' అని ఎవరైనా ఏకాలంలోనైనా నోటిమాటగా వాడారనటానికి ఆధారాలు లేవు. నిజానికి 'పూప, కుర్ర, చిరుత, కందు, బుడత, పడుచు' అనేవి విశేషణాలూ విశేష్యాలూ అయిన మాటలు.

పూప శబ్దాన్ని 'మొగ్గ' అనే అర్థంలో కూడా వాడ్తాం. ఇప్పుడు బిడ్డ అనే అర్థంలో దానికి వాడుక పూర్తిగా తగ్గిపోయింది. పాప సర్వసాధారణంగా ఆడపిల్లే నేటి వ్యవహారంలో. కుర్రకు విడిగా ప్రయోగంలేదిప్పుడు. 'కుర్రది, కుర్రవాడు, కుర్రకారు' అనే మాటలకు యౌవనంలోని ఆడపిల్లలకు, మొగపిల్లవాడికి, యువతీయువకుల సమూహానికి క్రమంగా పర్యాయపదా లయినాయిప్పుడు. కందు శబ్దానికి 'మచ్చ' అనే అర్థవిశేషంకూడా ఉంది. 'చిన్ని జాబిలికందు' వంటి ప్రయోగాలున్నాయి. కూన శబ్దానికి శిశుపర్యాయంగా సాహిత్యంలోని ప్రయోగం – వ్యస్తంగానూ, 'ముద్దుకూన'వంటి సమాసాల్లోనూ. నిసువు/నిసుగు అనేవే నిజానికి శిశుబోధకాలయిన తెలుగు మాటలు. వాటిలో 'నిసుగు' అనేదానికి కావ్యప్రయోగాలు మాత్రమే లభిస్తాయి. 'ఏం? నీవేమంత బొట్టివా? ఏమీ తెలీదనడానికి?'లాంటి ఈసడింపుమాటల్లో మాత్రమే బొట్టెకు నేటి వాడుక నిలిచింది. పడుచు శబ్దం యౌవనంలో ఉన్న స్త్రీ అనే అర్థంలోనే వాడుకలో ఉంది. సమాసంలో దాన్ని పురుషవాచకంగానూ వాడ్తాం – పడుచువాడు మొదలైనవి పదబంధాల్లో.

గుంట, గుంటడు అనేమాటలు క్రమంగా స్త్రీపురుషబాల పర్యాయంగా కళింగ ప్రాంతంలో, కొంతవరకు ఉభయగోదావరి జిల్లాల్లో ఎక్కువ వాడుకలో ఉన్నాయి. గోదావరికి దక్షిణాన వాటివాడుక నిందార్థంలోనే. పోరి, పోరడు/పోరగాడు శబ్దాలు తెలంగాణా వాడుకలో చాలా ఎక్కువ. నేటికి పన్నెండువందల సంవత్సరాలకిందట రాయలసీమ శాసనాల్లో 'వసన్తపోటి మహాదేవులు' వగైరా ప్రయోగాలున్నాయి. అప్పట్లో ఆ మాటలో బండిరా వాడేవా రన్నమాట. నాటి 'పోటి' శబ్దానికి 'పాటేటి' అనే రూపాంతరంకూడా ఉండేది, 'గోవిందపాటేటి మన్మరాళు' వంటి ప్రయోగాల్లో ఎందువల్లనో ఈనాటి వ్యవహారంలో వాడుకలేకుండా పోయింది. మొత్తం రాష్ట్రంలో అమ్మాయి, అబ్బాయి శబ్దాలకు తిరుగులేని వ్యాప్తి ఉంది. అయితే ఇవి కేవలం శిశువు అనే అర్థంలోనేకాక వయసుతో నిమిత్తంలేకుండా కూతురు, కొడుకు అనే అర్థంలో వాడుకకెక్కాయి. కృష్ణాజిల్లా వ్యవహారంలో నేటికీ ఎంత పెద్దామెను గురించి ప్రస్తావించేటప్పుడయినా 'అమ్మాయి' శబ్దం ప్రయోగించడం కద్దు. ఎందుచేతనో తెలీదుగాని శిశు శబ్దంనుంచి 'సృష్టించిన' శిశువుడనే మాట 'శిష్యుడు' అనే అర్థంలో

కొన్నిప్రాంతాల్లో వినిపిస్తుంది. అచ్చతెలుగు నిఘంటువులు 'శిశువు' నుంచి 'సిసువు' అనే రూపాన్ని సృష్టించి కోశస్థం చేశాయిగానీ కావ్యప్రయోగాలున్నట్లు లేదు దానికి. ఒకవేళ 'నిసువు'ను 'సిసువు' అని చదివి పొరపాటుపడ్డా ఆశ్చర్యపడనక్కరలేదు. లేఖన సంప్రదాయంవల్ల ఇలాంటి పొరపాట్లుచేసిన మహాకవులూ ఉన్నారు. వారిని సమర్థిస్తూ 'శాస్త్రం' చెప్పిన మహాపండితులూ ఉన్నారు. ఉదాహరణకు "సప్పంబు పడగనీడను, కప్పవసించిన విధంబుగదరా సుమతీ" అనే పద్యభాగం చాలామందికి తెలుసుకదా. 'సర్పంబు' అనేమాటను నిన్నమొన్నటిదాకా 'వలపలగిలక'తో 'సప్పంబు' అనిరాసేవాళ్లు. కవిగారు 'ప్ప'కు పక్కన రాసిన వలపల గిలకను చూడక 'కప్ప'తో ప్రాసలో బిగించినా విస్తుపోనక్కరలేదు. ఒకవేళ "సప్ప"మనే తద్భవం అంతకుముందే వాడుకకెక్కినా ఎక్కి ఉండవచ్చు. ఇలాంటి అనుమానం కూడా 'సిసువు' విషయంలో రానక్కరలేదేమో.

'అడ్డాలనాటి బిడ్డ, అడ్డాలపాప' అన్నట్లు సంస్కృతంలో 'ఉత్తానశాయి' అనే శబ్దముంది – 'వెల్లకిలా పడుకున్నపాప' అన్న అర్థంలో. 'చంటిపాప'కు సమమైన సంస్కృత శబ్దం 'స్తనపాయి'. పసిబిడ్డను 'డింభక' శబ్దంతో, కొంచెం పెద్దపిల్లలను 'డింభ' శబ్దంతో వ్యవహరించేవాళ్ళు సంస్కృతంలో. సినిమా పుణ్యమా అని డింభక శబ్దం ఇటీవల వాడుకలోకి వచ్చినట్లుంది.

ఇంతకుముందు ప్రస్తావించిన 'అబ్బాయి, పోరడు, పోరగాడు, గుంటడు' అనే మాటలేకాక కొడుకు శబ్దానికి 'కొమరుడు, బుడుతడు, పట్టి' అనే తెలుగు మాటలూ, 'కుమారుడు, కుమారకుడు, పుత్రుడు, పుత్రకుడు, ఆత్మజుడు, తనయుడు, సూనుడు, సుతుడు, మాణవకుడు' అనే సంస్కృతపదాలూ పర్యాయపదాలంటారు. కొమరుడు అనేది కుమార శబ్దంనుంచి పుట్టిన తద్భవరూపం. బుడుత అనే విశేషణానికి పురుషవాచకమైన డు ప్రత్యయంచేరి కొడుకనే అర్థంలో వాడారు. పట్టి అసలుసిసలు తెలుగుమాట (అసలుసిసలు మాత్రం అచ్చతెలుగుకాదు). ముద్దులపట్టి, అనుంగుపట్టివంటి ప్రయోగాలు తెలుగు కావ్యాలన్నింటిలో కనిపిస్తాయి. కాని నేటి వాడుకలో ఈ మాట ఎందుచేతనో వినిపించటంలేదు. కొడుకు అనే అర్థంలో ప్రాచీనశాసనాల్లో వాడిన మరోమాట 'మగడు'(!). ఇప్పుడది భర్త అనే అర్థంలోనే స్థిరపడిపోయింది. 'మకన్రు, మగన్రు' అనే రూపాల్లో ఈ శబ్దం ప్రాచీనశాసనాల్లో కొడుకనే అర్థంలోనే కనిపిస్తుంది. తమిళ మలయాళాది ద్రవిడభాషలన్నింటిలో ఈ శబ్దం ఈ అర్థంలోనే పూర్వముండేది. 'మగపిల్లవాడు' అనే ఈనాటికీ పిలుస్తున్నాం కదా. పోతన్నగారు భాగవతంలో 'మన యశోద చిన్నమగవాని కనెనట, చూచివత్తమమ్మ? సుదతులార!' అనిపిస్తాడు. మగపిల్లవాడికీ సంక్షేపరూపం మగవాడు; దానికి మరీ సంక్షిప్తరూపం మగడు. కాలం మారింది. దాంతోబాటు అర్థం మారింది! కొడుకన్నమాటకే బహుళప్రచారముంది.

సంస్కృతపదాల్లో 'పుత్రు'డనేదీ 'కుమారు'డనేదీ తెలుగువారి వాడుకలో ఎక్కువగా వినిపించే మాటలు. పుత్రకు డనేది పుత్ర శబ్దానికి రూపాంతరమేగాని మరీ చిన్నవాడైన కొడుకనే అర్థంలో దాన్ని వాడాలి. కుమారకుడని కుమార శబ్దానికి చివర 'క' చేర్చి వాడే మాటొకటి వుంది. దాన్నికూడా ఈవిధంగానే అర్థం

చేసుకోవాలి. 'పుత్' అనే నరకముందనీ, పిల్లలు – అందునా మగపిల్లలు – లేనివాళ్లకీ నరకం తప్పదనీ శాస్త్రాలు ఘోషించాయట. ఆ నరకబాధను తప్పించేవాడు కాబట్టి పుత్రుడని పెద్దలు వ్యాఖ్యానిస్తుంటారు. మరి కుమారాదులు – వాళ్లూ కొడుకులే అయినా ఈవిధంగా నరకబాధ పోగొట్టగలరో లేరో తెలీదు! ఆత్మజుడనే మాటకు 'తనకే పుట్టినవా'డని అర్థం. ప్రాచీన భారతీయ ధర్మశాస్త్రాలు చాలారకాల కొడుకులను పేర్కొన్నాయి. వారందరిలో 'సరైన, సొంతమైన' కుమారుడే ఆత్మజుడు. (ఇతరవిధాల వాళ్లసంగతి కొంచెమాగి మాట్లాడుకుందాం). తనయు డంటే తనువుమంచి – అంటే (తన) శరీరంనుంచి – ఏర్పడ్డవాడని ప్రత్యేకార్థం. ఆలెక్కన తల్లులే కొడుకులను తనయులని పిలవటానికి అర్హులని చెప్పాలి. సూనుడు 'ప్రసవఫలితంగా' పుట్టినవాడు. అందరూ అలాంటివాళ్లుకారా? అనే ప్రశ్న మనకు వద్దు. ఎందుకంటే మన పురాణకథల్లో నానావిధాలుగా పుట్టిన మహాత్ములున్నారు! 'కౌండిన్యుడు ముండకొడుకు, మాండవ్యుడు కప్పకపుడు మహిలో పుట్టెన్...' వగైరా విదర్శనాలు చాలా వున్నాయి. ఒక్క భారతంలోనే రకరకాలుగా పుట్టినవాళ్ళ కథలున్నాయని అందరికీ తెలుసు. సుతుడు, ప్రసూతుడు అలాగే – అంటే సూనుడిలాగే – కొడుకులన్నమాట. మాణవకుడనే మాటకు సంస్కృతరూపకాల్లో వాడుక ఎక్కువ. ఇతర కావ్యాల్లో కూడా ఆమాట అంతగా కనిపించదు – వినిపించదు.

రకరకాలు కొడుకులను గురించి ఇక్కడ విపులంగా చర్చించటం సాధ్యపడదు. స్థూలంగా విచారిద్దాం. మామూలు వ్యవహారంలో జనకపుత్రుడు, దత్తపుత్రుడని కొడుకులు ప్రధానంగా రెండురకాలు. జనకపుత్రుణ్నే 'ఔరసు' డంటారు స్వచ్ఛమైన సంస్కృతంలో. తన ఊరువునుంచి పుట్టాడు కాబట్టి ఔరసుడని వివరిస్తారు. అంటే తండ్రికి తన భార్యద్వారా సహజమార్గాన పుట్టిన వాడన్నమాట. అంటే సక్రమసంతానమని భాష్యం. ఆస్తిపాస్తులు ఇతడికి సంక్రమిస్తాయి న్యాయశాస్త్రప్రకారం సహజాధికారంవల్ల. తండ్రి స్వార్జితంలో అతడికి అధికారమున్నా లేకపోయినా పిత్రార్జితంలో – అంటే వంశపారంపర్యంగా వచ్చిన ఆస్తిలో – ఈరకం కొడుక్కి సర్వాధికారాలూ వుంటాయి. ఇటీవల వాడుకలోకి వచ్చిన మాట 'వారసు(డు)' అనేది. ఇదో సంకరపదం. పర్షియన్ భాషనుంచి ఉర్దూద్వారా తెలుగులోకి వచ్చినమాట ఇది. అసలుమాట 'వారిస్'. ఈ శబ్దానికీ సంస్కృతపదమైన 'ఔరస' శబ్దానికీ చాలా పాతకాలంలో బంధుత్వం వుండేది. అవి సజాతీయపదా లన్నమాట. ఈ సంకర శబ్దంనుంచి 'వారసత్వం' అనే కొత్త మిశ్రపదం సృష్టించుకొన్నాం అంతటితో ఆగక అలాంటి మరో మాటను సామ్యంమీద ఆధారపడి సృష్టించాం. అది 'పౌరసత్వం'. పురంలో వున్నవాడు పౌరుడు. పౌరుడి లక్షణమూ అధికారమూ 'పౌరత్వ'మేగాని 'పౌరసత్వం' కాదు. అయినా వారసత్వంలాగా పౌరసత్వం కల్పించామన్నమాట – అసల్లో లేని సకారాన్ని అదనంగా చేర్చి!

ఇక కర్ణుణ్ణి కానీనుడంటారుకదా. కన్యకు – అవివాహిత స్త్రీకి – పుట్టినవాడు కానీనుడు. 'సొంత' తండ్రికికాక తదితర వ్యక్తికి జన్మించినవాడన్నమాట. 'సొంత' భార్యకుకాక ఇతరుడి భార్యకు తనవల్ల కొడుకు పుట్టితే ఆ కొడుకునేమనాలో సంస్కృతపండితులు ఆలోచించిపెట్టారు. అతగాడు 'పారస్త్రైణేయుడు'. పరస్త్రీకి

జంటపదాలు. జననీ జనకులు, మాతాపితలు అనేవి అలాంటివే. తండ్రి పచ్చి తెలుగుమాటయితే అయ్య అచ్చ తెలుగుపదం. ఇది ఆర్యశబ్దభవమని చెప్తారు. సంస్కృతంలోవి ఆర్యశబ్దానికి తండ్రి అనే అర్థముందని అంగీకరించటం కష్టం. తెలుగులోకి వచ్చేటప్పటికి అర్థం మారిందని చెప్పాలి. అబ్బ అనేమాటను నిందించే సమయంలోనే వాడుతాం – 'నీ అబ్బకు చెప్పుకో!' లాంటి వాక్యాల్లో, సందర్భాల్లో. నాన్న, నాయన శబ్దాలు రూపాంతరాలు. 'నా–అన్న' అనే రెండు మాటలు కలిపి 'నాయన' అనే రూపం ఏర్పడిందనీ అన్న శబ్దానికి అయ్య అనే అర్థం కూడా ఉండేదనీ కొందరి వాదన. ఉమ్మడి కుటుంబాల్లో అన్న, తండ్రి తరువాత తండ్రి అంతటివాడనీ, తండ్రితో సమానుడనీ భావించేవాళ్లు. ఇప్పుడా వ్యవస్థ శిథిలమైపోయినట్లే. కాబట్టి ఆ అర్థం కూడా నప్పదు. అప్ప శబ్దం తండ్రి అనే అర్థంలో రాయలసీమలో అత్యంత వ్యాప్తిగలమాట. ఆ మాటకి 'అక్క' అనే అర్థం ఇతర ప్రాంతాల్లో ఎక్కువ వాడుకలో ఉంది. కన్నయ్య అంటే కన్నతండ్రి. ఆ మాటకు కృష్ణుడనే అర్థంకూడా ఉంది. ఆ అర్థంలో అది హిందీలోని 'కన్హయ్య'లోంచి ఎరువుగా వచ్చిందని చెప్పాలి. జనకుడంటే కన్నవాడు. తాత శబ్దం ఈ అర్థంలో తెలుగులో వాడుకలో నిలవదు – తండ్రి తండ్రిని తాత అంటాం కాబట్టి. 'జనకతండ్రి' వంటి మిశ్రసమాసాలు 'వ్యవహారార్థం' పుట్టినవి. దత్తుపోయిన వ్యక్తిని కన్న తండ్రి అనే అర్థంలోనే ఈ మాటకు వాడుక.

## అన్నదమ్ములు – అక్కాచెల్లెళ్ళు

దంపతులకు పుట్టే పిల్లలు 'కవల'లయినాకూడా వారిలో ఒకరు పెద్దా, మరొకరు చిన్నా కాకతప్పదు. కవల పిల్లలను అమడలని కూడా అంటారు తెలుగులో. 'కవ' అంటే జంట. జంటగా పుట్టిన పిల్లలు కవ–లు. మరి కాన్పుకు ముగ్గురూ నలుగురూ పుట్తే ఏమంటారో తెలీదు. మనుష్యజాతిలో ఇలా ముగ్గురు నలుగురు ఒకే కాన్పులో పుట్టడం అరుదైనా జంతువుల్లో మామూలే – ముఖ్యంగా పిల్లులూకుక్కలూ పందులూ వగైరాల్లో. ఈ 'ఈత'కు ఇన్ని 'పిల్లలుపెట్టిం'దంటామేగాని సంఖ్యను బట్టి ప్రత్యేక పదాలున్నట్లుగా వాడుతున్నట్లూ తెలీదు. సరి. పుట్టిన పిల్లల్లో ఒకరు పెద్ద, తరువాతవారు చిన్న, బుల్లి, బుజ్జి, వగైరాలు కావచ్చు. సంస్కృతంలోనయినా ఒక తల్లికి/తండ్రికి పుట్టిన పిల్లలూ ఆడయినా, మగయినా, కొందరు ఆడపిల్లలూ కొందరు మగపిల్లలయినా 'భ్రాతరౌ' అనే మాటతో చెప్పవచ్చు. వారంతా పరస్పరం సోదరులు; సోదరీ శబ్దానికిగాని, సోదర శబ్దానికిగాని బహువచనంలో ఇదొక్కటే రూపం. ఈ సోదరులు తెలుగులో అన్న–తమ్ముడు, అక్క–చెల్లెలు అనే విధంగానూ, అన్న–చెల్లెలు, అక్క–తమ్ముడు అన్నట్లూ ఇలా మరి రెండు పద్ధతుల్లో ఉండవచ్చు.

'అన్న' అనే తెలుగు మాటకు 'తో(డ)బుట్టు(వు)' అనే పర్యాయపదమున్నా

రెండో మాట లింగభేదాన్ని స్పష్టంగా సూచించదు. అన్న శబ్దానికి 'తండ్రి, పెద్దమనిషి, ఎరగనివ్యక్తి' అనే అర్థవిశేషాల్లో ప్రయోగాలున్నాయి. సంస్కృతంలోవి 'భ్రాత, సహజుడు, సగర్భ్యుడు, సోదర్యుడు, సమానోదర్యుడు' వంటివి అన్నకు పర్యాయాలు. వాటిలో భ్రాతృశబ్దమొక్కటే ఎక్కువ వాడుకలో ఉంది. 'అగ్రజు'డనేది తరవాత వ్యాప్తిలో ఉన్నమాట. తక్కినవాటికి కావ్య ప్రయోగాలేగాని వ్యవహారంలో వాడుక తక్కువ. 'తమ్ముడు' చిన్నవాడు. అతణ్నీ 'భ్రాత' అనవచ్చు-సంస్కృతంలో సోదరుడన్నట్లు. 'అనుజు'డనేది స్పష్టంగా వయస్సును సూచించే పదం. పెద్దవాడి 'తరవాత' పుట్టి వాడు అనుజుడు. కళింగ ప్రాంతంలో అన్నో తమ్ముడో స్పష్టంగా సూచించకుండా 'ఆయనాండి! ఆయన మా అన్నదమ్ముడాండీ!' అంటారు! అలాగే 'అప్పచెల్లె'లనే మాటను కూడా వాడ్తారు.

'అక్క'కు తెలుగులో 'అప్ప, అత్త' అనే పర్యాయపదాలున్నాయి. మేనరికం సంఘధర్మంగా ఉన్నందున అక్కను అత్త అని పిలిచేవాళ్లు. అప్ప శబ్దం తండ్రి, (పలకరింపులో) కొత్తవ్యక్తి, అనే అర్థవిశేషాల్లో కూడా వాడుకలో ఉంది. సందర్భమే ఎవర్ని గురించి ప్రస్తావిస్తున్నామో నిర్ణయిస్తుంది. అక్కకు సంస్కృతంలో 'సోదరి' అనే అస్పష్టశబ్దమూ, 'అగ్రజ' అనే స్పష్ట పదమూ పర్యాయపదాలు. సోదరీ శబ్దానికి పర్యాయాలుగా 'భగినీ, స్వసా' అనే శబ్దాలు కూడా సంస్కృతంలో ఉన్నాయి. చెల్లెలయితే 'అనుజ' అనాలి. చెల్లెలు అనే తెలుగు మాటకు 'చెల్లి, చెల్లె, చెల్లమ్మ' లాంటి రూపాంతరాలున్నాయి. తెలుగు నిఘంటువులు 'తోడు, సైదోడు, తో(డ)బుట్టువు' శబ్దాలను కూడా పర్యాయపదాలుగా పరిగణిస్తాయి.. 'చెలి' శబ్దానికి 'స్నేహితుడు/స్నేహితురాలు' అనే అర్థవిశేషాలున్నాయి. పురుషవాచకంగా చెలి శబ్దానికి శాసన భాషలోనే ప్రయోగమెక్కువ. బహుశా ఆ కారణంచేతనే 'సైదోడు' శబ్దాన్ని చెల్లి శబ్దానికి పర్యాయపదంగా భావించి ఉంటారు. 'చేతోడు, వాతోడు' అంటామే – వాటిలోని మొదట మాటకూ 'సైదోడు'కూ దూరబంధుత్వముంది.

## అల్లుళ్ళు - కోడళ్ళు

ఈ అన్నదమ్ములూ అక్కచెల్లెళ్లూ పెరిగి పెద్దవారైన తర్వాత ఏదో ఒకింటికి అల్లుళ్లో, కోడళ్లో అవుతారు. కాక తప్పదు. అల్లుణ్ని పూర్వకావ్యాల్లో 'అల్లుగుర్ర' అని కూడా వ్యవహరించేవారు. అంటే 'కుర్రవాడైన' అల్లుడన్నమాట. (అల్లిక–అనే అర్థంలో తెలంగాణాలోని కొన్ని ప్రాంతాల్లో అల్లుడు శబ్దం వినిపిస్తుంది! దానికీ దీనికీ సంబంధం లేదు). 'అళియ' అనే కన్నడపదం ఒకప్పుడు వాడుకలో ఉండేది ఈ అర్థంలో. అళియరామరాజు అనే విజయనగర ప్రభువుండేవాడని చరిత్రలో చదివిన వాళ్లకు ఈ అర్థం ఎంత అతుకుతుందో తెలుస్తుంది. సంస్కృతంలో అల్లుణ్ణే 'జామాత' అంటారు. దాని వ్యుత్పత్తి సరిగా తెలీదుగాని 'జామాతా దశమో గ్రహః'

అన్న వాక్యం తెలుసు. అంటే నవగ్రహాల తరవాత పదో గ్రహం అల్లుడని అర్థం! తాను 'మామ'గా ఉన్నప్పుడు మాత్రమే అల్లుణ్ణి పదోగ్రహమంటారని తెలుసుగదా! తెలుగులో రెండురకాల అల్లుళ్లున్నారు. పిల్లను పెళ్లాడిన అల్లుడు (ఈతడే దశమ గ్రహం) ఒకడయితే, 'మేనల్లుడు' మరొకడు. ఈ మేనరికమనేది దక్షిణాదినేగాని ఉత్తర భారతదేశంలో లేదు. అక్కడి వాళ్లు ఇది చాలా తప్పుపని అని భావిస్తారు కూడా! మనకు మేనరికం (పెళ్లిళ్లు) అలవాటే కాబట్టి 'మేనవదినె, మేనబావ, మేనమరిది, మేనమరదలు' వంటి మాటలున్నాయి మన భాషలో. సాధారణంగా మేనరికం మేనమామ/మేనత్త కూతుర్ని వివాహమాడటమైతే మేనమామ/మేనత్త కొడుకును పెండ్లాడటం 'ఎదురు మేనరికం'. ఇంగ్లీషువాళ్లకు ఈ సంబంధబాంధవ్యాలను వివరించటం కష్టం. ఇంగ్లీషులోకి వీటిని అనువదించటం (అర్థమయ్యేటట్లు) ఇంకా కష్టం. ఉత్తర హిందూస్థానంలో ఈ ఆచారం లేకపోయినా మేనల్లుడికి పర్యాయపదాలుగా 'భాగినేయుడు, స్వస్రీయుడు' అన్న మాటలున్నాయి. భగిని అంటే సోదరి; ఆమె పుత్రుడు భాగినేయుడు. స్వసా అన్నా సోదరే. ఆమె కొడుకు స్వస్రీయుడు. ఈ రెండు మాటలూ ఆ భాషలో సహజ శబ్దాలనిపించవు – అవసరార్థం కల్పించుకొన్నవయివుంటాయి.

కోడలు శబ్దానికి సంస్కృత పర్యాయపదం స్నుష. 'కుర్రతనంలో', 'కోడె' వయసులో ఉన్న 'అలు' కోడలని వ్యుత్పత్తి. మనకు లేదుగాని ఉత్తర హిందూస్థానంలో ఇప్పటికీ ఇంటి కోడలు మామ బావల ఎదుట ముఖం చూపకూడదు; ముసుగు వేసుకోవాల్సిందే – హిందూ కుటుంబాల్లోనయినా! వాళ్లు ఆమెను 'బహూ' (=వధువు, పెండ్లికూతురు) అని పిలిచి శాశ్వతంగా పరదాలోనే బంధిస్తుంటారు. ఒక ఇంట్లో ఇద్దరుగాని, అంతకన్నా ఎక్కువమందిగాని కోడళ్ళంటే ఒకరికొకరు తోడికోడళ్లవుతారు. సంస్కృతంలో తోడికోడలును 'యాత, యాతర' అంటారు. వాళ్ల ఉచ్చారణ ప్రకారం 'జాత(ర)' అవుతుంది కూడా! కోడలికి తాను మెట్టినింటి ఆడపిల్ల/ ఆడబడుచు ఆడబిడ్డ అవుతుంది. సంస్కృతంలో ఆడబిడ్డను 'ననంద, ననాంద' అంటారు. రెండోమాటకు వాడుక చాలా తక్కువ. ఆమెవల్ల కోడలి 'నంద'త్వం సన్నగిల్లుతుందనేమో 'ననంద' (సంతోషం లేనిది) అనే మాట వచ్చిందని ఓ పండితుడు చమత్కరించాడు. 'ఆడబిడ్డ అర్ధమొగు'డనే సామెత తెలుగులో ఉంది. కొందరు ఆమెచేత కూడా 'మంగళసూత్రానికి' మరోముడి వేయిస్తారు – పెండ్లి సమయంలో, ఆచారంలో భాగంగా (!).

## అత్తమామలూ వారిసంతూ

అల్లుడూ కోడలూ ఏర్పడగానే దంపతులు అత్తమామ లయిపోతారు. అత్త శబ్దం, మామ శబ్దం తెలుగో, సంస్కృతమో తేలక నేటికీ పండితులు గిజాటుపడుతున్నారు.

అవి ఆర్య, ద్రవిడ భాషలు రెంటిలోనూ వినిపించే ప్రాథమిక శబ్దాలు. ప్రాథమిక శబ్దాలు ఆధారంగా భాషలను కుటుంబాలుగా వర్గీకరించి శాస్త్రంచెప్పేవాళ్ళకి తలనొప్పి కలిగించేమాటలివి. అత్త శబ్దానికి (మేనరికం పుణ్యమా అని) 'అక్క' అనే అర్థంకూడా ఉంది. 'అత్తికా' అనే రూపాంతరముంది. బావను 'అక్క భర్తను' 'అత్తికాభర్త' అని వ్యవహరించాడు తెనాలిరామకృష్ణుడు. 'ఏదిక్కూ లేకపోతే అక్క మొగుడే దిక్కు' అనే సామెతకూడా పుట్టింది తెలుగులో ! అత్తను శుద్ధ సంస్కృతంలో 'శ్వశ్రువు' అనే రెండొత్తులున్న మాటతో పిలుస్తారు. అత్తకన్నా ముఖ్యం 'అత్తగారిల్లు'. మామగారిల్లని తెలుగువాళ్ళం ఎందుకనమో తెలీదు! తెలుగత్తకూ, ఇంగ్లీషత్తకూ పొంతనాలేదు–పోలికాలేదు. అత్తకు భయపడేది – భయపడటమంటూ జరిగితే – కోడలేగాని అల్లుడెన్నడూకాదు. (ఇల్లిటపల్లుడికి భార్య అన్నా, మామ అన్నా భయమంటారు. అనుభవంలేక తేల్చిచెప్పలేకపోతున్నా!). ఇది రివాజు తెలుగుదేశంలో. ఇంగ్లీషుమొగవాళ్ళు అత్తంటే గజగజలాడ్తారు. 'మదరిన్లాస్ మెనేస్' అనే పదబంధం పుట్టింది ఇంగ్లీషులో. (అంతమాత్రాన తెలుగుకోడలు ఇంగ్లీషు అల్లుడితో సమానమని తేల్చిపారేయకండి!). అత్తకన్నా మేనత్తంటే ఇష్టంమనకు.

మామలు రెండు రకాలు – కాదు – మూడు! 'పిల్లనిచ్చిన మామ, మేనమామ, భర్త/ప్రియుడు' అని మూడురకాలన్నమాట. మేనరికం కారణంగా మూడో అర్థం పుట్టిందనాలి. 'మేనత్త మొగుడు మేనమామాకాడు, మేనమామ భార్య మేనత్తాకాదు' అనే సామెత బాంధవ్యంలోని ఆప్యాయతనుబట్టి పుట్టిందని తెలుగువాళ్ళందరూ గుర్తిస్తారు. 'మేనమామ'ను సంస్కృతంలో 'మాతులు' డంటారు. పెద్దబాలశిక్ష చదివినవాళ్ళు 'కంసుడు మేనమామ' అని చదివే ఉంటారు. సంస్కృతం నేర్చినవాడు 'సర్వనాశాయ మాతులః' (మేనమామ సర్వనాశనంచేస్తాడు) అని చదివి ఉంటారు – 'శకుని' అనే మహాత్ముడివల్ల ఈ సూక్తి పుట్టిందంటారు. నిజానికి మేనమామలందరూ కంసుళ్ళూ, శకునులూ అయితే జాతి ఏనాడో అంతరించేది. మేనమామ భార్యను 'మాతులీ, మాతులానీ' అంటారు సంస్కృతంలో. మేనత్త భర్తను సంస్కృతంలో ఏమంటారో సరిగా తెలీదు. మేనత్తను 'పితృష్వస' (అంటే 'తండ్రితోబుట్టువు') అంటారుకానీ ఆమె భర్తనేమనాలో చెప్పలేం. మేనరికం మొహమే ఎరగని భాషలో ఏమంటేమటుకేమని సరిపెట్టుకున్నా–నామటుకు నేను.

కోడలికి ఆడబిడ్డా, ఆడబిడ్డకు కోడలూ వదినో మరదలో అవుతారు తెలుగులో (ఆడబిడ్డ ఇప్పటిరూపం. 'ఆడుబిడ్డ' అనేది పూర్వరూపం. 'ఆడ' అంటే అక్కడ. అంటే మరో ఇంట్లో ఉండవలసిందికాబట్టి 'ఆడబిడ్డ' అని వ్యాఖ్యానించినవాళ్ళు లేకపోలేదు! నిజానికి ఆడదైన బిడ్డ–మొగబిడ్డకానిది–అనేదే సరైన అర్థం. ఈ వివరణ సరికాకపోతే 'ఇల్లటపల్లుణ్ణి' తెచ్చుకొన్న ఇంటి సంగతినెలాచెప్పాలనేది పెద్ద అనుమానం!). 'వధూనీ' అనే సంస్కృత శబ్దంనుంచి తెలుగు 'వదినె' పుట్టిందంటారు. అలా పుట్టని రూపం మరొకటి తెలుగులోలేదుకాబట్టి తెలుగుమాటకు అదే సంస్కృతీకరణమన్నవాళ్ళూ లేకపోలేదు. రెండోదే సరైన వాదమేమో! ఎందుకంటే పెద్దదైన వదినెకు చిన్నదైన మరదలంటూ ఒకామె ఉంటుంది. మరదలు శబ్దానికి సంస్కృతంలో మరో పేరుందా? 'మరది–మరదలు' అనే మాటలకు ప్రాచీనకావ్యాల్లో శాసనాల్లో బండిరా

ఉండేది. ఇప్పుడు 'మరిది' అంటున్నమాటను అప్పుడు 'మఱది, మఱంది' అనే రూపాన్ని తయారుచేసుకొన్నది తెలుగువాళ్ళు. ఇలాంటి కట్టుదిట్టమైన ఏర్పాట్లు లేని సంస్కృతంనుంచి మనమాటలన్నీ ఏర్పడ్డాయనటం అంతబాగాలేదనేవాళ్ళూ ఉన్నారు. సంస్కృతంలో 'వధూనీ/వధూనికా' శబ్దానికి 'భ్రాతృజాయా, ప్రజావతీ' అన్న శబ్దాలు పర్యాయపదాలని అమరకోశం చెప్తుంది. 'సోదరుడి భార్య' అన్నది మొదటిమాటకు అర్థం. రెండోదానికి 'పిల్లలతల్లి' అని అర్థం. వదినలందరికీ పిల్లలుండితీరాలనే నియమంలేదు. ఉత్తర హిందూస్థానంలో అన్న చనిపోతే -- తనను చిన్నతనంలో తల్లిలాగా పెంచినాసరే – వదినను పెండ్లాడాలనే ఒక దురాచారముంది. కొంచెం శ్రమించి ప్రేమ్‌చంద్ రచనలు గాలిస్తే ఇలాంటి నిదర్శనాలు లభిస్తాయి! భార్యపోతే ఆమె చెల్లెలిని పెండ్లాడిన తెలుగువాళ్ళున్నారుగాని పైన చెప్పిన అనాచారం తెలుగుజాతిలో లేదు.

పెద్దవాణ్ణి బావ అనీ, చిన్నవాణ్ణి మరిది అనీ పిలవటం మన ఆచారం. అలాగే వదిన, మరదలు అనే విషయంలోనూ. మన 'బావ'లు రెండురకాలు సాధారణంగా; 'మేనబావ, (మామూలు)బావ' అని. వాడవదినెలు 'బావా!' అని ఎవర్నయినా పిలవచ్చనేది వేరేవిషయం. సంస్కృతంలో భర్త సోదరుణ్ణి (బావను/మరిదిని) 'దేవ, దేవర' శబ్దాలతోనూ, భార్య సోదరుణ్ణి 'శ్యాల, శాలక' శబ్దాలతోనూ పిలుస్తారు. 'దేవరన్యాయం' సంగతీ, వ్యాసుడు ధృతరాష్ట్రాదులను 'కన్న' సంగతీ ఇటీవల టీ.వీ. పుణ్యమా అని అందరికీ తెలిసిఉండాలి. శ్యాలకుల విషయం సంస్కృతసాహిత్యంలో రెండు రకాలుగా తెలుస్తుంది. 'రాజశ్యాలకుడూ', 'రాజ్యశ్యాలకుడూ' అని రెండురకాల బావమరుదులు (రాజుగారికే అనుకోండి) ఉండవచ్చు. రాజశ్యాలకుడంటే రాజుగారి బావమరిది. అంత ప్రమాదకరమైన వ్యక్తికాదు. రాజుగారి ఉంపుడుగత్తెగారి సోదరుణ్ణి 'రాజ్యశ్యాలకు'డంటారు. ఆయన రాజుగారికేకాక మొత్తం రాజ్యానిక్కూడా బావమరిదినమకొని విర్రవీగుతుంటాడు. భాసుడి 'చారుదత్త' కథనుగాని, శూద్రకుడి 'మృచ్ఛకటిక' కథనుగాని విన్నవాళ్ళకి రాజ్యశ్యాలకుడి పరాక్రమం తెలుస్తుంది. మొత్తానికి మాతులుడి విషయంలోలాగా, శ్యాలకుడి విషయంలోనూ ఓ సూక్తి పుట్టింది సంస్కృతంలో – 'శ్యాలకో గృహనాశాయ' అని. అంటే బావమరిదిని కొంపలో చేరిస్తే ఇల్లుగుల్లవుతుందని అర్థం! రాజుకన్నా రాజశ్యాలకుడే ఎక్కువ ప్రమాదకరమైన వ్యక్తి. ఇప్పుడు రాజులు లేరుకాబట్టి బతికిపోయామనుకోకండి. వారి స్థానంలో వచ్చిన మంత్రులు తక్కువతిన్నారనటం న్యాయంకాదు–పైపెచ్చు వాళ్ళు మన ప్రతినిధులేకాక మన సేవకులుకూడా! వాళ్లని తక్కువచేయటం భావ్యంకాదు.

## చుట్టరికాలు

చుట్టరికమనే తెలుగు మాటకు ఎక్కువ వాడుకలో ఉన్న సంస్కృత పర్యాయపదం బంధుత్వం. ఆమాటకు బంధుత అనే రూపాంతరం, జ్ఞాతేయమనే పర్యాయపదం ఉన్నాయి. జ్ఞాతులంటే దాయాదులు. అంటే దగ్గరి చుట్టాలు. జ్ఞాతులంటే (బాగా)

తెలిసిన వాళ్లని వ్యుత్పత్తి చెప్పవచ్చు. వాళ్లని సనాభయులని కూడా అంటారు. ఏడు తరాలకు చెందినదగ్గిరి చుట్టాలను ఆ పేరుతో పిలుస్తారు. ఆస్తిపాస్తుల పంపకంలో భారతయుద్ధాలు చేయగలవాళ్లు కాబట్టి సంస్కృతంలో 'జ్ఞాతిశ్చే దనలేన కిమ్?' అనే ప్రశ్న పుట్టింది. జ్ఞాతి ఉంటే వేరుగా నిప్పు అక్కరలేదని భావం. దూరపు చుట్టాలను సంస్కృతంలో 'సగోత్రు'లని, 'బంధువు'లని, 'బాంధవు'లని, 'స్వజను'లనీ పిలుస్తారు. ఒకే గోత్రానికి చెందిన (శాఖలకూ శాఖాంతరాలకూ చెందినప్పటికీ) వారంతా సగోత్రులు. స్వజన శబ్దానికి సరయిన తెలుగుమాట 'అయినవాళ్లు' అనేది. 'కావలసిన' చుట్టాలను–ముఖ్యంగా వియ్యాలవారిని– 'రాజబంధువు'లంటారు. రాజుగారి బంధువులని కాదు దానికర్థం – ముఖ్య బంధువులని. కంచంపొత్తేకాక మంచం పొత్తుకూడా ఉన్నవాళ్లు రాజబంధువులు. తక్కినవాళ్లతో కేవలం 'కంచంపొత్తు' మాత్రమే ఉంటుందన్నమాట. బంధు శబ్దం నుంచి పుట్టినమాట 'బందుగు'. 'చుట్టం, విందు' అనేవి పచ్చి తెలుగుమాటలు. బహువచనంలో 'చుట్టాలు' అనేమాటకు పాత తెలుగులో 'చుట్ట'లనే పర్యాయపదముండేది. ఇప్పుడు చుట్టలంటే అర్థం మారింది. మరీ దగ్గిరి చుట్టాలను 'సపిండు'లంటారు సంస్కృతంలో. తద్దినం పెట్టినప్పుడు పిండాలందుకోదగిన వాళ్లన్నమాట. సాధారణంగా తాత ముత్తాతలవుతారు. వంశపారంపర్యంగా సంబంధంచేసే వాళ్లని తెలుగు నిఘంటువుల ప్రకారం 'అంతల పొంతలవారు, అంది పొందినవారు' అనాలి కానీ ఆ మాటలను నిఘంటుకారులు తప్ప ఇతరులు వాడినట్లు లేదు. సగోత్రుడనే శబ్దానికి సరైన తెలుగు మాట 'దాయ'. ఈ మాటకు 'శత్రు'వనే మరో అర్థంకూడా ఉండటమే విశేషం.

తరతరాలుగా ఉండే తండ్రి, తాత వంటి మాటలను గురించి ఇంతకుముందు కొంత తెలుసుకున్నాం. తెలుగులో మాండలికంగా ఇంతకుముందు చెప్పని పర్యాయ పదాలెన్నో వాడుకలో ఉన్నాయి. నిజానికన్నీ తెలీదు. నిఘంటువుల్లోనూ కనిపించవు. తెలిసినంతలో క్లుప్తంగా పేర్కొన్నా అన్నిమాటలనూ స్థూలంగా పర్యాయపదాలని చెప్పవలసిందేగాని ఏ భాషనుంచి ఎరువు తెచ్చుకొన్నామో, ఏ కారణాలవల్ల ఇలాంటి మాటలు వాడుకలోకి వచ్చాయో ఇక్కడ ప్రస్తావించటం కష్టం. కొన్ని చుట్టరికాలను మాత్రం పర్యాయపదాలతో సహా పరిశీలిద్దాం.

'తండ్రి'ని భిన్నప్రాంతాల్లో 'నాన్న, అయ్య, అప్ప, బాపు, బాబు, అన్న, అన్నయ్య, అన్నాజీ, బప్ప, అప్పడు' వగైరా పేర్లలో పిలుస్తారు. (ఒకే మాట భిన్నబంధుత్వాల్లో వాడుకలో ఉంటే ఆశ్చర్యపోకండి. అన్నిటికీ కారణాలుంటాయి. కానీ వాటినిక్కడ చర్చించడం వీలుపడదు. ఏప్రాంతంలో ఏకులం వారు వీటిలో ఏమాటనుపయోగిస్తారో వివరించటంకూడా సాధ్యంకాదు.) 'తల్లి'ని 'అమ్మ, అవ్వ, అక్క, ఆయి, తాయి' అని రకరకాలుగా పిలిచేవాళ్ళున్నారు. 'తాత'లు రెండురకాలు – తల్లితండ్రి, తండ్రితండ్రి అని. తల్లితండ్రిని సంస్కృతంలో మాతామహుడంటారు. తండ్రితండ్రిని పితామహుడంటారు. పితృపిత అనేవాళ్లు కూడా ఉన్నారంటారు కోశకర్తలు. తెలుగులో ఈభేదం పాటించకుండా ఉభయులనూ 'తాతయ్య, అబ్బ, జేజయ్య, జేజినాయన, జేజబ్బ' అనేవాళ్లున్నారు. 'అవ్వ'లు కూడా రెండు రకాలు – తల్లితల్లి, తండ్రితల్లి అని. తల్లితల్లిని 'అవ్వ, అమ్మమ్మ, అమ్మగారవ్వ, ఆయమ్మ,

మామ్మ, నాన్నమ్మ, జేజి, జేజమ్మ, బొవమ్మ, అమ్మ, అవ్వతల్లి, మామాయి' అని పిలుస్తారు. తండ్రితల్లిని 'నాయనమ్మ, బామ్మ, బొవమ్మ, అన్నవ్వ, నాన్నవ్వ, అమ్మ, అమ్ము, బాపాయి' అని వివిధ విధాలుగా పిలుస్తారు.

**తాత**తండ్రిని కొందరు '**పెత్తాత**' అనీ, మరికొందరు '**ముత్తాత**' అనీ పిలుస్తారు. సంస్కృతంలో ప్రపితామహుడనీ, ప్రమాతామహుడనీ సందర్భాన్ని బట్టి వ్యవహరిస్తారు. అలాగే 'ముత్తవ్వ'ను ప్రపితామహి అనీ, ప్రమాతామహి అనీ పిలుస్తారు. **వాళ్ల తలిదండ్రులను** (చూడటం అరుదు, తలుచుకోవటం అంతకన్నా అరుదు) సంస్కృతంలోనయితే 'వృద్ధప్రపితామహు'డనీ, 'వృద్ధప్రపితామహి' అనీ పిలవవచ్చు. **అలాగే** వృద్ధప్రమాతామహి, వృద్ధప్రమాతామహుడనీ అనవచ్చు. తెలుగులో కొద్దిమంది **మాత్రం** 'తాతమ్మ, మిత్తాతమ్మ' అనేవాళ్లున్నారని విన్నాం. మామూలుగానయితే 'మాముత్తాత తండ్రిగారు/ తాతగారు, ముత్తవ్వ తలిదండ్రులు' అనవలసిందే. మూడు **తరాలకు** పైగా ముందున్న వాళ్లను గురించి వినాలంటే మహాభారతం చదవాలి! **పోటీకి తరవాతితరాల** సంగతి చూద్దాం.

కొడుకు/కూతురి కొడుకు మనవడవుతాడు. కొడుకు కొడుకును సంస్కృతంలో **పౌత్రుడనీ**, నప్త అనీ అంటారు. అదే కూతురు కొడకయితే దౌహిత్రుడవుతాడు. కొడుకు కూతురు మనమరాలు. ఆమెను సంస్కృతంలో 'పౌత్రి/నప్త్రి' అంటారు. అందులో మొదటి **మాటకే** వ్యవహార బలమెక్కువ – ఒత్తులు తక్కువ! కూతురి కూతురు '**దౌహిత్రి/నప్త్రి**'. '**సుతాత్మజ**' అనవచ్చని కోశకారులు చెప్తారుగాని, సంధి విషయంలో లేని గొడవ విడదీసినప్పుడు వస్తుంది. ('సుత–ఆత్మజ' అని విభజిస్తే కూతురి కూతురవుతుంది). మనమడి/మనమరాలి కొడుకును/కూతురిని ఏమని పిలిచేవాళ్లో సంస్కృతంలో చెప్పలేం. తెలుగులో 'ముదిమనమడు, మునిమనమడు, ముత్తోమనమ'డనే పురుషవాచకశబ్దాలూ, 'ముదిమనమరాలు, ముదుమనుమరాలు' అనే మాటలున్నాయని విన్నాం. వారి పిల్లలను 'ఇనిమనమడు, ఇనిమనమరాలు' అంటారని విన్నాంగాని ప్రయోగాలు దొరకలేదు – నిఘంటువులూ చూపినట్లులేదు. అంతలావు సూర్యరాయాంధ్ర నిఘంటువులోనే 'ఇనుమనుమడు' అంటే 'మునిమనుమడి కొడుకు, ప్రపౌత్రుని కొడుకు' అని అర్థమిచ్చారేగాని ప్రయోగమివ్వలేదు. 'ఇను–ఇరు'లు రూపాంతరాలు. రెండోతరం మనుమడని అర్థం కాబోలు. కొడుకు కొడుకైన మనమడి కొడుకయిన మునిమనమడిని చూడగలిగితే సదరు ముత్తాతగారు నేరుగా స్వర్గలోకానికి పోతారని మనవాళ్ల విశ్వాసం. అయితే ఈ పరంపర కూతురి విషయంలో స్వర్గప్రాప్తి కలిగించదట. పురుష ప్రపంచంలో, అందులోనూ దక్షిణాదిలో ఇలాంటి నమ్మకాలుండటంలో ఆశ్చర్యంలేదు. చివరికి చితిపేర్చటానికి, నిప్పు ముట్టించటానికీ కాకపోయినా, శ్మశానానికి పోవటానికైనా నోచని స్త్రీలకు ఇంతకన్నా గొప్ప మర్యాద ఏముంటుందని ఊహించగలం?

ఇంతకుముందు పేర్కొన్నవాళ్ళుకాక మిగిలిన ముఖ్యబంధువులను ఎన్నిరకాలుగా **తెలుగువాళ్ళం** పిలుస్తుంటామో ఇప్పుడు గుర్తిద్దాం. తండ్రికన్నా పెద్దవాడయిన **ఆయన** అన్నను 'పెదతండ్రి, పెదనాయన, పెదబాపు, పెద్దన్న, బడ్‌దాద, పెదనాన్న, బాబు, బావాజీ, బావయ్య, బాబయ్య, కాకా, పెదకాకా, పెద్దయ్య, బాపు' అని

అనేకవిధాల పిలుస్తారు. పినతండ్రిని 'చిన్నాయన, చినబాపు, కాక, చిన్నన్న, చిన్నయ్య, అబ్బయ్య, పిన్నప్ప, బాబాయి, చిన్నాన్న, పిన్నయ్య, అప్పయ్య, చినకాక' అని వేరువేరు ప్రాంతాల్లో పిలుస్తున్నారు. అలాగే తల్లి అక్కగారిని 'పెత్తల్లి, పెద్దమ్మ, పెద్దవ్వ' అనీ, ఆమె చెల్లెల్ని 'పిన్ని, చిన్నాయి, చిన్నమ్మ, చిన్నవ్వ, చిన్ని, కాకి, తాయి, మౌసి' వగైరాపేర్లతోనూ పిలుస్తారు.

అన్నదమ్ముల కొడుకులను శ్రీకాకుళంజిల్లాలో 'పుత్రాకొడుకు' అనీ, కూతుళ్ళను 'పుత్రాకూతుళ్ళు' అనీ విచిత్రంగా వ్యవహరిస్తారు కొందరు. మేనత్తను 'అత్త, బాయి, బాప్ప, అక్క, బువ్వ' అని పిల్చేవాళ్ళున్నారు. అత్తను–ఆమె భార్య తల్లిఅయితే – 'అత్తమ్మ, మాయి, అత్తెబాయి' అనీ, భర్తతల్లి అయితే 'అత్తాయి, అత్తమ్మ, మాయి, సానుబాయి' అనీ రకరకాలుగా వ్యవహరిస్తారు. భార్యతండ్రిని 'మామ(గారు)' అనటం మామూలేగాని, భర్తతండ్రిని 'మాము' అనికూడా పిలవటం కద్దు. అక్కను 'అక్కయ్య, అక్కాయి, జీజీ' అని పిలుస్తారు. అలాగే చెల్లెల్ని 'చెల్లి, చెల్లమ్మ, అమ్మాయి' అని అంటారు. ఆడబిడ్డను 'ఆడబొట్టి, అలబొట్టె' అని పిలిచేవాళ్ళున్నారు. కొంతమంది 'వదినమరదలు' అని రెండు 'వరస'లనూ 'ఏకవరస'లో కలిసి చెప్తే, మరికొంతమంది 'పుట్టింటిబిడ్డ' అని వ్యాఖ్యానరూపంలో పలకరిస్తారు! తోడికోడలును సంస్కృతంలో 'యాత' అంటారని ఇంతకుముందు చెప్పాం. ఆమెనే 'ఏరాలు, జాదువ' అనికూడా పిలిచేవాళ్ళు లేకపోలేదు. తోడల్లుళ్ళను సంస్కృతంలో షడ్డకులంటారు. అక్కడికి ఆగక, 'షడ్డక షడ్డకశ్చైవ, ముష్టియుద్ధం పునఃపునః' అని ఓమాటనుకూడా విసిరారు. దానర్థం తోడల్లుళ్ళు (ఎందుకయితే మనకెందుకుగాని) గుద్దులాడుకుంటారని! తోడల్లుణ్ణి 'జగిలిగా'డని పిలిచేవాళ్ళున్నారు – ఏకవచనంలో. బహువచనంలో 'తోటన్న'లనేవాళ్ళు కొందరయితే, మరికొందరు 'అన్నదమ్ము' లని పిలుస్తారు! తెలుగు సంస్కృతాల సంగతెలా ఉన్నా మనమీ చుట్టరికాన్ని ఇంగ్లీషులోకి 'కోసవిన్లా' అని అనువదిస్తాంకదూ – ఆమాట అసలింగ్లీషువాడికి చచ్చినా బోధపడదు!

భర్త అన్నగారిని చాలామంది 'బావ(గారు)' అన్నా కొద్దిమందయినా 'భవజీ' అనే వాళ్ళున్నారు. మేనమామ భార్యను (ఆమె మేనత్తంత సన్నిహితురాలు కాకపోయినా) 'అత్త'కిందే లెక్కిస్తారు చాలామంది. అత్తనెన్నివిధాల పిలుస్తారో ఆమెనూ అన్నిరకాలుగా పిలుస్తారు. కొందరేమో 'మామి' అంటారు–బహుశా మార్పుకోసం. మేనరికం మనువాడినవాళ్ళు మగవాడిని 'మేనోడు' అనీ, ఆడదాన్ని 'మేనది' అనికూడా పిలుస్తారు. బహుశా అందుకేనేమో – అతి పరిచయంవల్ల తీసేసినట్లు మర్యాదలేకుండా మాట్లాడ్తారనేమో 'మేనబావ మొగుడూకాదు, మేనమరదలు పెండ్లామూకాదు' అనే సామెత పుట్టింది. 'చనువు'వల్ల వచ్చిన ఇబ్బంది ఇది. అన్న భార్యను చాలామంది 'వదిన' అంటుంటే కొందరయినా 'అత్తిగ' అని పిలుస్తున్నారు.

వియ్యమంటే సంబంధం, తమపిల్లలకు వివాహబంధం కల్పించే సంబంధం. వియ్యమందిన మగవాడు 'వియ్యంకుడు'. ఆయన్ను కొన్ని ప్రాంతాల్లో 'వియ్యంపు' డంటారు. మరికొందరు 'వీరకా'డంటారు. ఇంకాకొందరు 'బీగుడు' అని పిలుస్తారు. ఆయన భార్య 'వియ్యపురాలు'. ఆమెను 'వియ్యంపురాలు, వియ్యంకురాలు, వీరకత్తె, బీగురాలు, బీగరాలు, వియ్యాలకాపు, వియ్యాలసాని' అని రకరకాలుగా పిలుస్తారు.

కొద్దిమంది 'బీదరాలు' అంటారు(!) – పేదరాలన్నట్లు. వియ్యమందేసరికి పేదరికం వచ్చి పడుతుందేమో తెలీదు! శ్రీకాకుళం జిల్లాలో కొందరు 'ఏరాలు'ను – అంటే తోడికోడలును – 'సవతి' అని పిలుస్తారు(!). సంస్కృతంలోని 'సపత్నీ' శబ్దంనుంచి పుట్టిన 'సవతి' మరొకామె ఉండనేఉంది – తన భర్తను తనతోబాటు పంచుకొన్న మరో ఇల్లాలు. మరి ఈ రెండుమాటలూ ఇలా ఎలాకలిశాయో చెప్పలేం.

వివాహాన్ని 'మనువాడటం, పెండ్లాడటం' మొదలైన తెలుగుమాటలతో చెప్పవచ్చు. పెణ్–అంటే స్త్రీ. పెండ్లి అంటే మొదట్లో తన ఇంటికో స్త్రీని తెచ్చుకోవటమే కావచ్చు. 'ఇల్లరికం/ఇల్లిటం'గా పురుషుడిని తెచ్చుకొన్నా అది పెండ్లే అయింది తరవాత తరవాత! "ఓలి" (దాన్నే కన్యాశుల్కమంటారు) ఇచ్చి పెండ్లాడేవాళ్ళు పూర్వం. పురుషుడే డబ్బుఖర్చుపెట్టి భార్యను సంపాదించుకొనే ఆచారం ఇంకా 'తక్కువ కులాలవా'ళ్ళని ఆక్షేపానికి గురయ్యేవాళ్ళలోనూ గిరిజన సంస్కృతిలోనూ నిలిచేఉంది. 'కట్నం' (దాన్నే వరశుల్కమంటారు) ఈ కాలంలో జోరయిపోయింది. స్త్రీ పురుషుణ్ణి కొనుక్కునే సంప్రదాయం ఇప్పుడు వెర్రితలలు వేస్తున్నదన్నమాట. 'ఉద్వాహం, పాణిగ్రహణం, పాణిపీడనం' లాంటి సంస్కృతపదాలు మన 'పెండ్లి'కి పర్యాయపదాలు. పాణిగ్రహణమంటే 'చేయిపట్టుకోవడం', 'పాణిపీడనం' అంటే 'చెయ్యిలాగటం/గుంజటం', ఫలితంలో పెండ్లాడటమే. ఇప్పటికీ గోండులనే గిరిజనుల్లో స్త్రీ పురుషులెవరైనా ఒకరి దండచేతిని మరొకరు పట్టుకొంటే నిర్బంధించయినా కులపెద్దలు పెళ్ళిచేసే ఆచారముంది! 'ఆర్యు'లకు ఈ పాణిపీడనమనే ఆచారం ఈ 'అనార్యద్రవిడులనుంచి' సంక్రమించిందేమో పరిశోధక పరబ్రహ్మలు తేల్చాలి.

తెలుగులో 'మారుమనువు' అనేమాట ఉంది. దానికి సరిపోయే సంస్కృతపదం 'పునర్వివాహం'. 'అగ్ర' వర్ణాలవారు అనాదరం చూపే ఈ విధానం చాలాకులాల్లో ఉంది. రెండుమార్లు పెళ్ళాడిన యువతిని సంస్కృతంలో 'పునర్భువు' అంటారు. మక్కికిమక్కిగా అర్థంచెప్తే 'మళ్ళీ పుట్టింది' అని చెప్పాలి. ఆమెను 'దిధిషువు' అనికూడా పిలుస్తారాభాషలో. ఆమె భర్తను 'దిధిషుడు' అంటారు. విధవా వివాహం గొడవ పెట్టుకోకుండా గిరీశం ఇలాంటి వ్యవహారంలో దిగితే ఏ ఆర్గ్యుమెంట్లు చెప్పేవాడో ఊహించాలి.

## ఆకాశమార్గంలో

నేల విడిచిన సాము మేలుకాదు కాబట్టి. భూమ్మీద నిలిచి పైనున్న ప్రపంచంచూస్తూ మనశబ్దసంపద ఎంతలో ఉందో ఓసారి పారజూద్దాం. తలఎత్తగానే కనిపించే ఆకాశం దగ్గర మొదలుపెట్టి క్రమంగా కిందికి దిగి తరవాతి పరిసరాలను పరిశీలిద్దాం. భూమినీ ఆకాశాన్నీ చెట్లనూ పుట్టలనూ దేవతలని భావిస్తాంకాబట్టి మనభాషలో రెండురకాల పదజాలం తప్పదు. ఒకరకం సహజపదాలయితే రెండోరకం

భక్తితాత్పర్యపూరితమైన కవితామయ శబ్దజాలం. అంటే రెండోరకం మాటలు కవులూ పండితులూ భావస్పష్టత కోసం కల్పించుకొన్న సమాసాలన్నమాట. ఈ ద్వైవిధ్యం అన్ని భాషల్లోనూ కనిపిస్తుంది. మనం తెలుగు సంస్కృతాలకు పరిమితంగా ఈ విశేషాలు గమనిద్దాం.

ఆకాశాన్ని అచ్చతెలుగులో విడిమాటల్లో చెప్పాలంటే "నింగి, చదలు, ఉప్పరం, విన్ను, మిన్ను, బయలు" అనే శబ్దాలతో సూచించవచ్చు. మనకవులూ నిఘంటుకారులూ "ఆకసం, మబ్బుత్రోవ, వెన్నునడుగు, రిక్కదారి, వేలుపుల్రతోవ, ఉప్పరవీధి, మొయిలుదారి, చుక్కలతెరువు, గాడ్పుతండ్రి, చుక్కలత్రోవ, వేల్పుదెరువు, గాలితండ్రి, మొగిలుతెన్ను" వంటి అనేక సమాసాలు కల్పించారు అదనంగా. ఇవి గ్రంథాల్లోనేగాని నిత్యవ్యవహారంలో వినిపించేవికావు.

చదలు అనేమాటకు దిక్కు అనే అర్థంకూడా ఉంది. అన్నివైపులకూ వ్యాపించింది కాబట్టి ఆపేరు వచ్చివుండవచ్చు. నింగి అనేమాటకు కావ్యప్రయోగా లనేకం. ఒకప్పుడు భీమసేనుడు 'నేలయు నింగియు తాళమున్ వాయింప'దలచాడట! నిగ్గు(ప్రకాశం)కల ప్రదేశంకాబట్టి 'నింగి' అనేపేరు వచ్చిందంటారు కొందరు. ఉప్పరమంటే ఎత్తయినదని అర్థం. అందుకే మేడలనూ అంతస్తులనూ 'ఉప్పరిగ'లని పిలిచేవాళ్ళు పూర్వం. విన్నుమిన్నులకు వినుమిను లనే రూపాంతరాలున్నాయి. విన్ను అంటే వెలిగే తావని అర్థం. మిన్ను అలాంటిదే. 'మినుకుమినుక్కు'మనే నక్షత్రాదులున్న తావు అనే అర్థంతో ఈ మాటపుట్టింది. అంతా బహిరంగంగా, అడ్డంలేకుండా వ్యాపించింది కాబట్టి ఆకాశానికి 'బయలు' అనే పేరుకూడా వచ్చింది. 'నేలా నింగీ, మన్నూమిన్నూ' అనేవి ఎక్కువ వాడుకలో ఉన్న జంటపదాలు. 'భూమ్యాకాశాలు' అనే ద్వంద్వసమాసానికివి సరైన తెలుగుమాటలు. ఆకసమనేది ఆకాశ శబ్దం నుంచి పుట్టినమాట.

నక్షత్రాలూ, మేఘాలూ ఆకాశంలో తిరుగుతున్నట్లు కనిపిస్తాయికాబట్టి 'రిక్కత్రోవ, చుక్కలతెరువు, మబ్బుత్రోవ, రిక్కదారి, మొయిలుదారి, మొగిలుతెన్ను' వంటి మాటలు పుట్టాయి. అలాగే దేవతలు ఆకాశంలో విమానాల్లో తిరుగుతుంటారనే పురాణగాథలను పురస్కరించుకొని 'వేలుపులత్రోవ, వేల్పుదెరువు' వంటి సమాసాలు కల్పించారు. గాలి ఆకాశంలో పుట్టిందనుకున్నారుకాబట్టి 'గాడ్పుతండ్రి, గాలితండ్రి' అనే మాటలు వచ్చాయి. విష్ణుమూర్తి అడుగే ఆకాశమని, అక్కడ ఆకాశగంగానది పుట్టిందనీ ఒక ఐతిహ్యముంది. అందువల్ల 'వెన్నునడుగు' అనే సమాసాన్ని అచ్చతెలుగు కవులు కల్పించారు. పాలపుంత ఓ రాజమార్గంలాగా కనిపిస్తుందికాబట్టి 'ఉప్పరవీధి' అనే మాట పుట్టింది. ఈ భావాలకు అనుగుణంగా ఎన్నెన్ని కొత్తసమాసాలు పుట్టించినా అచ్చతెలుగులో ఆకాశపర్యాయపదాలుగా ఉన్నవి 'నింగి, మిన్ను, విన్ను' అనేవే. బయలు శబ్దానికి ఇతరార్థాలుకూడా ఉన్నాయని మనకు తెలుసు. కల్పనల్లో కొంత గజిబిజి తప్పదేమో. నింగి వంటి మాటలు తెలుగులో అమహత్తులు. అంటే మగవాణ్ణి గురించి చెప్పేవికావు. అయినా మన తెలుగుకవులు 'గాడ్పుతండ్రి, గాలితండ్రి' వంటి మాటలు సృష్టించి ఆకాశాన్ని మగవాణ్ణి చేశారు! 'గాడ్పుతల్లి' అని ఎందుకు అమహత్తుగానే వ్యవహరించలేదో ఈ కృత్రిమభాషాసృష్టికర్తలే చెప్పాలి.

సంస్కృతంలోకూడా తెలుగులోలాగే రెండురకాల పర్యాయపదాలున్నాయి ఆకాశానికి. విడిమాటలని చెప్పదగ్గవి 'దివం, అభ్రం, వ్యోమం, పుష్కరం, అంబరం, నభం, గగనం, ఖం, అనంతం, వియత్తు, విహాయ(స)ం, నాకం, ద్యువు' మొదలైనవీ; 'అంతరిక్షం, సురవర్త్మ, విష్ణుపదం, తారాపథం, శబ్దగుణం, మేఘద్వారం, మహాబిలం'మొదలైనవీ. దివ మనే మాటకు స్వర్గమనే అర్థంకూడా ఉంది. స్వర్గం పైనా, నరకం కిందా ఉంటాయన్న మనవిశ్వాసానికి అనుగుణంగా ఆకాశ స్వర్గాలు రెంటికీ ఒకేమాటను వాడివుంటారు. ఆకాశం అంటే బాగా వెలుగుతున్నది, ప్రకాశిస్తున్నది అని అర్థం. ఆ–కాశం, ప్ర–కాశం అనే మాటల్లోని మొదటి అక్షరాలను ఉపసర్గలంటారు. కాశం అంటేనే వెలుగు. 'మంచి వెలుగునిచ్చేది' అనే అర్థంలో ఆకాశశబ్దం వాడుతున్నారన్నమాట. అభ్ర శబ్దానికి మబ్బు అనే మరో అర్థంకూడా ఉంది. ఆ మాటను వాడినప్పుడు సందర్భాన్నిబట్టి అది నింగో మబ్బో తెలుసుకోవాలి. వ్యోమపదం అటు ఆకాశానికి ఇటు స్వర్గానికీ, మళ్ళీ మాట్లాడితే వాటి పైభాగానికీ సమానంగా పనికివస్తుంది. పుష్కర శబ్దానికి అనేకార్థాలున్నాయి. ప్రళయకాలంలో వచ్చే ఒకరకం మేఘాన్నీ కొంతకాలపరిధినీ కూడా పుష్కరమని పిలుస్తారు. అంబరం అంటే ఆకాశం, వస్త్రం మొదలైన అర్థాలున్నాయి. ఆకాశానికి అంతులేదుకాబట్టి దాన్ని అనంతమన్నారు. గగనమనేది ఆకాశ శబ్దం తరవాత ఎక్కువ వ్యాప్తిగల శబ్దం–తెలుగువారి వాడుకలో కూడా. అందుకే ఆధునిక శాస్త్రవిజ్ఞానం ప్రసాదించిన 'గగనసఖులూ' (air-hostesses), 'వ్యోమగాములూ' (astro-nauts) మనకేర్పడ్డారు! ద్యు శబ్దంనుంచి పుట్టిన ద్యువు వెలుగనే అర్థంగలమాట. నాకం స్వర్గాకాశాలు రెంటికీ అన్వయించే మాట. వియత్తు, విహాయ(స)ం అనేవి ఆకాశపర్యాయపదాలే. వాటి వ్యుత్పత్తులు ప్రాచీనులు చెప్పేవి అంతగా నప్పవు. అయితే వాటికి కావ్యప్రపంచంలో తప్ప వాడుక లేదు. 'ఆకాశం గగనం శూన్య'మని ఏమీలేని దానికింద చెప్పినవాళ్ళున్నారు!

ఇక అంతరిక్షం నిఘంటువులు ఆకాశ శబ్దానికి పర్యాయపదమనిచెప్పినా, ఇప్పటి వాడుకలో దాని అర్థం మారిపోయింది. ఆకాశంలో కనిపించే నక్షత్రమండలాల మధ్య ప్రదేశాన్ని అంతరిక్షం (space) అంటున్నాం. సువర్త్మ కవులు కల్పించిన శబ్దం. 'దేవతలు పోయేదారి' అని దానికర్థం. 'ఆకాశహర్మ్యం/గాలిమేడ' అనేవి లేనివాటిని గురించి ప్రస్తావించేటప్పుడు వాడేమాటలు. దేవతలు మాత్రమే అక్కడ నివసిస్తారని నమ్మినా ఇబ్బందిలేదు. ఆ ఉండేది మనం కానంతకాలం ఇబ్బందీ లేదు. విష్ణుపదం అనే సమాసం 'వెన్నునడుగు' అనే తెలుగుసమాసానికి మూలమని చెప్పాలి. తారాపథం అంటే నక్షత్రాల దారి. ఇదీ కవితాత్మకంగా పెట్టినపేరే. మేఘద్వారం అనేదీ అలాంటిదే. శబ్దగుణమనే పర్యాయపదమే చిత్రమయింది. తర్కశాస్త్రంలోని ఒక భావన ఆధారంగా ఈపేరు పెట్టారు ఆకాశానికి. 'అన్నీ మనవేదాల్లో ఉన్నాయిష!' అని సంతోషించటానికి పనికివచ్చే మాట మహాబిలమనేది. బిలమంటే రంధ్రం, గుహ వగైరా. ఇదో పెద్ద రంధ్రమనుకోగానే కన్యాశుల్కం గుర్తుకువస్తుంది – 'ఆకాశానికి బొక్కడ్డదంటారే' అనే ప్రసంగం – కల్లుపాక సీనులోది. అయితే ఈ మాటకు వ్యవహారంలో స్థానంలేదు.

# సూర్యచంద్రాదులు

ఆకాశంలో సూర్యుణ్ణి చూడగానే ఓనమస్కారం పెడ్దామనుకున్నా పేచీ తప్పదు. పొద్దుటి సూర్యుడు, సాయం సూర్యుడు, మధ్యాహ్న సూర్యుడూ అని మూడుగా విభజించి త్రిమూర్తులతో ఆయన్ను అభేదంగా భావించాలంటారు. బ్రహ్మకు నమస్కారం పనికిరాదు. భూమ్మీద మానవుల మనుగడకు ఆధారభూతమైన సూర్యనక్షత్రాన్ని దేవుడుగా భావిస్తారు. కాబట్టి దేవతలందరికిలాగానే ఆయనకూ అష్టోత్తర సహస్రనామా లుంటాయి. అవన్నీ పర్యాయపదా లనుకుంటే ప్రమాదం. అందులో చాలాభాగం ఇతర దేవుళ్ళక్కూడా సరిపోతాయి. అదలాఉంచి సూర్యపర్యాయాలు కూడా మన సాధారణసూత్రం ప్రకారం రెండు రకాలనీ, ప్రాథమికపదాలు వేరుగా వర్ణనాత్మక శబ్దాలు వేరుగా ఉంటాయనీ గమనించాలి.

తెలుగు నిఘంటువులన్నీ గాలించినా అచ్చమైన తెలుగుపేరు 'ప్రొద్దు' (ఇప్పటి వాడుకలో 'పొద్దు') ఒక్కటే సూర్యశబ్ద పర్యాయంగా దొరుకుతుంది. ఈమాటకు ఇంకా రాయలసీమలోనే వాడుక మిగిలింది. పొద్దుకు 'సమయం' అనే అర్థవిశేషంకూడా ఉంది. పల్లెటూళ్ళలో కాలాన్ని 'అంబటిపొద్దు, బారెడుపొద్దు'లాంటి మాటల్తోనే విభజిస్తున్నారిప్పటికీ. ఇతర ప్రాంతాల్లోనూ విద్యావంతుల వాడుకలోనూ సూర్యుడే మిగిలాడు తెలుగువాళ్ళకు. కొందరు రచయితలు 'సూరీడు' అనే తద్భవరూపం సృష్టించారు. తక్కిన 'అచ్చతెలుగు' మాటలన్నీ కవిపండితులు పురాణైతిహ్యాలమీద ఆధారపడి సృష్టించిన సమాసాలే. అవెన్నడూ ప్రజల వాడుకలో ఉన్నవీకావు నిలిచినవీ కావు. 'చాయపెనిమిటి' అని ఒకరంటే 'జముతండ్రి' అని మరొకరన్నారు. సూర్యుడికి ఛాయాదేవి (నీడగారు!) భార్యట. ఆమెభర్తట ఆయన. యముడాయన కొడుకుకాబట్టి సూర్యుణ్ణి జముతండ్రి అన్నారు. తండ్రినిబట్టి కొడుక్కుగాక కొడుకునుబట్టి తండ్రికి పేరువచ్చిందన్నమాట! అలాగే ఫలానా అమ్మగారి భర్త అనికూడా! 'జగముకన్ను' అని ఒక కవి పిలిస్తే, 'మిను రతనమ్ము' (ఆకాశరత్నం) అని మరోకవి వర్ణించాడు సూర్యుణ్ణి. ఆయన 'తమ్మిచుట్టం' (పద్మాలకు బంధువు) అన్నారు కొందరు. ఇదో (మూఢ) విశ్వాసం. పద్మాలు సూర్యోదయంతో వికసించి సూర్యాస్తమయంతో ముకుళిస్తాయనేది 'కవిసమయ' మంటారు. రాత్రిళ్ళు తామరపువ్వులు వికసించి – కనిపించినా, పగలు కలువపూలు విచ్చి కంటబడ్డా కవులు మాత్రం అంగీకరించరు. ఆయన రథానికి ఏడు పచ్చగుర్రా లుంటాయట. అందుకని 'పచ్చగుర్రముల రాతు' అని మరో కవి కీర్తించాడు. మరో పండితుడాయన్ని 'ప్రాబలుకుటెంకి' అన్నాడు. ప్రాబలుకులు అంటే పాతకాలపుమాటలు – అంటే వేదాలు. వాటికి ఆధారమైనవాడట సూర్యుడు. కొందరాయన్ను చంద్రుడు వుర్ఫ్ 'రేవెలుగు'కు పోటీగా 'వేవెలుగు' అని పిలుస్తారు. ఇలాంటి కల్పనలెన్నిఉన్నా తెలుగులో అసలుసిసలైన మాట 'పొద్దు' అనేదే. అదికూడా వాడుకలోనుంచి తప్పుకొంటున్నది చాలాచోట్ల.

సంస్కృతంలోనుంచి 'సూరుడు, శూరుడు, సూర్యుడు, అర్యముడు, అర్కుడు,

మిహిరుడు, అరుణుడు, పూష, తరణి, మిత్రుడు, తపనుడు, సవిత, రవి, హరి, ఇనుడు, భగుడు, భానుడు, హంసుడు, బ్రధ్నుడు, భాస్కరుడు' వంటి విడి మాటలు చాలా ఉన్నాయి. సూరుడంటే పండితుడు. ఆయన హనుమంతుడికి పాఠాలు చెప్పినవాడుకదా మరి. శూరుడంటే నిజానికి తేరి చూడటానికి వీలుకానివాడు. అర్యముడంటే ఆర్యుడు, పెద్దవాడు, ఉత్తముడు. అర్కుడంటే ఋక్కుల్లో (వేదమంత్రాల్లో) వినిపించేవాడు. వేదకాలంనుంచీ సూర్యారాధన ఉందికాబట్టి ఈ మాట వచ్చింది. మిహిరుడనేమాట సంస్కృతంకాదని, గ్రీకు పదమనీ చెప్తారు. ఉదయాస్తమయ సమయాల్లో అరుణంగా–ఎర్రగా–కనిపిస్తాడు కాబట్టి అరుణుడు. దిక్చక్రాన్ని ఇటునుంచి అటు ప్రతిదినం తరిస్తుండే–దాటే–వాడు కాబట్టి తరణి. ప్రాణిరాశులు అతడి స్పర్శలేనిదే జీవించలేదు. అందువల్ల సూర్యుడు ప్రాణులందరికీ మిత్రుడు–స్నేహితుడు–అయినాడు. తాపం, తపన పుట్టిస్తాడుకాబట్టి తపనుడని పిలిచారు. ప్రకాశవంతుడు కాబట్టి రవి, సవిత, ఇనుడు అనే పేర్లు వచ్చాయి. హరి అనేపేరు అనేక దేవతలకూ – జంతువులకూ ఉంది – నిఘంటువుల ప్రకారం. హరించేవాడు హరి. సూర్యమండల మధ్యంలో విష్ణుమూర్తి ఉంటాడట. అదే వికుంఠమని చెప్తారు కొందరు. విష్ణుస్థానంకాబట్టి హరి అనేపేరుకూడా వచ్చిందన్నమాట. భగవచ్ఛబ్దానికున్న అనేకార్థాలమాట అటుంచి దేవుణ్ణి భగవంతుడంటాంకదా. ప్రత్యక్షదైవమనుకుంటున్నాం కాబట్టి సూర్యుణ్ణి భగుడనికూడా పిలుస్తారు. భా, బ్రధ్న శబ్దాలకు వెలుగనే అర్థముంది. కిరణాలు కలవాడని భానుడు, బ్రధ్నుడు అంటున్నాం. ప్రకాశం కలిగించే, వెలుతురు కల్పించేవాడు కాబట్టి భాస్కరుడన్నారు.

కవితాత్మకమైన పేర్లుకూడా సూర్యుడికి చాలా ఉన్నాయి. అందులో కొన్ని వర్ణనాత్మకాలు. మరికొన్ని లక్షణ సూచకాలు. ఆదిత్యుడు, దివాకరుడు, ద్వాదశాత్మ, అహస్కరుడు, ప్రభాకరుడు, విభాకరుడు, భాస్వంతుడు, వివస్వంతుడు, సప్తాశ్వుడు, హరిదశ్వుడు, ఉష్ణరశ్మి, వికర్తనుడు, మార్తాండుడు, ద్యుమణి, చిత్రభానువు, విరోచనుడు, విభానువు, గ్రహపతి, త్విషాంపతి, అహర్పతి, సహస్రాంశుడు, కర్మసాక్షి, జగచ్చక్షువు, అంశుమాలి, త్రయీతనువు, ప్రద్యోతనుడు, దినమణి, ఖద్యోతుడు, లోకబాంధవుడు, ధామనిధి, పద్మినీవల్లభుడు, పద్మాక్షుడు, తేజోరాశి, ఛాయానాథుడు, తమిస్రహుడు వగైరా చాలాపేర్లు పెట్టారు సూర్యుడికి. అదితి కుమారుడుకాబట్టి ఆదిత్యుడన్నారు. దివాకర, అహస్కర, అహర్పతి శబ్దాలకు పగలింటిని కల్పించే, దానికి అధిపత్యం వహించేవాడని అర్థం. ప్రభాకర, విభాకర, భాస్వంత, అంశుమాలి, ప్రద్యోతన, తేజోరాశి శబ్దాలకు వెలుగునిచ్చేవాడని, కిరణాలు ప్రసరించేవాడని అర్థాలు. ఏడుగుర్రాల రౌతుకాబట్టి సప్తాశ్వుడంటే, పచ్చగుర్రాలరౌతని హరిదశ్వుడన్నారు. చీకటిని పోగొట్టుతాడని తమిస్రహుడన్నారు. నీడమ్మగారి భర్త కాబట్టి ఛాయానాథుడన్నారు. వెయ్యి కిరణాలున్నాయిట – అందుకు సహస్రాంశువు అన్నారు. ఆకాశంలో వెలిగిపోతుంటాడు కాబట్టి ఖద్యోతుడనే పేరు వచ్చింది. పైనుండి కింద ఎవరెవరు ఏయే పుణ్యపాపాలు చేస్తున్నారో చూస్తుంటాడని కర్మసాక్షి, జగచ్చక్షువు (లోకానికి కన్నువంటివాడు) అని పిలిచారు. త్రిమూర్త్యాత్మకుడని త్రయీతను డన్నారు. పన్నెండు రూపాలున్నాయని (ద్వాదశాదిత్యులు కాబట్టి) ద్వాదశాత్మ అన్నారు. అప్పుడప్పుడు రంగురంగుల

కిరణాలు విరజిమ్ముతాడు కాబట్టే చిత్రభానుడని పిలిచారు. వేడి ఇస్తాడు కాబట్టే ఉష్ణరశ్మి అని పిలిచారు. ఆయన లేకపోతే లోకం సుఖంగా బతకదు కాబట్టే లోకబాంధవుడన్నారు. ఆకాశంలో వెలుగుతుంటాడు కాబట్టే ద్యుమణి అని, పగలే వెలిగేవాడుకాబట్టే దినమణి అని అన్నారు. మనపూర్వులు సూర్యుణ్ణి నక్షత్రంగాకాక గ్రహంగా లెక్కించారు. ఆ (నవ) గ్రహాలకూ ఆయనే అధిపతికాబట్టే గ్రహపతి అని సూర్యుడికి పేరు పెట్టారు. దేవుడు కాబట్టే సహస్రనామాలున్నా ఆశ్చర్యంలేదు. ఇన్నిమాటల్లోనూ తెలుగువారి వాడుకలో సూర్యశబ్దానికున్నవ్యాప్తి మరి దేనికీ లేదు.

గ్రహంగాని సూర్యుణ్ని గ్రహమని అన్నవాళ్లే ఉపగ్రహమైన చంద్రుణ్నీ గ్రహంగా పరిగణించారు. సూర్యుడికి అందువల్ల గౌరవభంగం కలిగిందో లేదోగాని చంద్రుడి ప్రతిష్ఠ పెరిగిందని చెప్పకతప్పదు. పాశ్చాత్యులు స్త్రీగా భావించే 'మూన్' మనవాళ్ల లెక్కన మొగవాడై, గురుభార్యతో సరసం వెలిగించి, ఒకానొక క్షత్రియ వంశానికీ సూర్యుడికీ పోటీగా తనపరంపరను కూడా ప్రసాదించాడు. నిన్నమొన్నటి శ్రీకృష్ణదేవరాయలుకూడా చంద్రవంశంవాడేనట.

అచ్చతెలుగులో 'నెల' అన్నదొక్కటే నిస్సంశయంగా చంద్రుడిపేరని చెప్పదగిన మాట. ఆమాటకు మాసం అనే అర్థవిశేషంకూడా ఉంది. 'నెలవంక, నెలపొడుపు' వంటి సమాసాల్లోనూ 'నెలతప్పటం' వంటి సంబంధాల్లోనూ తప్ప ఈ కాలంలో చంద్రుడనే అర్థంలో నెలశబ్దానికి వాడుక ఉన్నట్లు లేదు. బాగా వాడుకలో ఉన్నమాట 'చందమామ' చిత్రమయింది. సంస్కృతంలో 'చంద్రమా' అనే శబ్దం నుంచి ఇది ఏర్పడ్డదేగాని అచ్చతెలుగుపదం కాదిది. ఆ మాటచివరి 'మామ'కు నానార్థాలూ వివరాలూ చెప్తారు పండితులు. మరోమాట జాబిలి/జాబిల్లి. ఇది సంస్కృతపదం కాదని బల్లగుద్ది చెప్పవచ్చుగాని తెలుగుమాట అని వ్యుత్పత్తి చెప్పటం సులభంకాదు. పసిబిడ్డలను అలరిస్తూ పాడే 'చందమామ రావే! జాబిల్లి రావే' అనేపాటలోని జాబిల్లి మహ త్తనిపించదు. అంటే పురుషవాచక మనిపించదు నెలశబ్దంలాగానే. తొలిదినాల్లో తెలుగువారి చంద్రుడు అమహత్తుగా ఉండి సంస్కృత ప్రభావంతో పురాణగాథల పుణ్యమా అని మొగవాడైపోయాడేమో!

అచ్చతెలుగు కవులూ నిఘంటుకారులూ సృష్టించిన చంద్రపర్యాయపదాలను గమనిస్తే కొన్నిట మహత్తుగా, కొన్నిట అమహత్తుగా చంద్రుడుండటాన్నిబట్టి పై అనుమానం మరింత బలపడుతున్నది. 'రేయివెల్గు, రేవెలుగు, వెన్నెలగుత్తి, చందు, వేలుపులబోనం, పుట్టుకచల్వజోతి, లచ్చిరేనెడమకన్ను' వంటి సమాసాల్లో అతగాడు అమహత్తే. మరి 'చందురుడు, చందమామ, వెన్నెలరాయుడు, రేపొలతిమగండు, చుక్కలదొర' అనే మాటల్లో ఆయన స్పష్టంగా మహత్తే. 'చెంగలువ నెచ్చెలి' వంటి మాటల్లో ఎటయినా కావచ్చు. ఆ సందిగ్ధతకు కారణం 'నెచ్చెలి' శబ్దమే గాని ఆయన కాకపోవచ్చు!

వేవెలుగయిన సూర్యుడికి పోటీ రేవెలుగు – అంటే రాత్రిళ్లు వెలిగిపొయ్యేవాడని చెప్పాలి. అన్నిరాత్రులూకాదుగదా అనే ఆక్షేపం ఉండనే ఉందనుకోండి. చంద్రుడిలో అమృతముందట. అమృతంతిన్న దేవతలు చంద్రుణ్నీ తిన్నట్టేగదా అని ఓ కవి

వేల్పులబోన మని పిలిచాడు! పుట్టినప్పటినుంచీ చల్లగా ఉండే వెలుగుకాబట్టి పుట్టుక చల్వజోతి అన్నారు. లక్ష్మీదేవి భర్త విష్ణుమూర్తి (లచ్చిరేడన్నమాట). ఆయనకోకన్ను సూర్యుడున్నూ మరోకన్ను చంద్రుడున్నూ అని పురాణాలు ఘోషిస్తున్నాయి. అయితే చంద్రుడు ఎడమకన్నేనని తేల్చిన మహాకవి 'లచ్చిరే నెడమకన్న'ని చంద్రుణ్ణి వర్ణించాడు. ఈ ఎడమకన్నుగారే 'రేపాలతి' – అంటే రాత్రి అనే స్త్రీకి భర్తకూడానట. అందుకని రేపాలతిమగం డన్నారు. ఆయన 27 నక్షత్రాలనే స్త్రీలకూ భర్తే కాబట్టి (దేవతల్లోనూ గొప్పవాళ్లలోనూ బహుభార్యాత్వ నిషేధశాసనానికి ప్రవృత్తిలేదు) చుక్కలదొర అయినాడు. చల్లగా వెలుగుతాడు కాబట్టి చలివెలుగన్నారు. ఆయన్ను చూడగానే కలవపూలు విచ్చుకుంటాయని 'చెంగలువ నెచ్చెలి' అన్ననోటితోనే, ఇంతకు ముందు చెప్పని 'తామరలగొంగ' (తామరలు ముడుచుకుంటాయని) తామరపూలకు శత్రువన్నారు మనవాళ్లు. ఇది కవిసమయం అంటారు. కవులకు సమయాసమయాల పట్టింపులేనట్లే కవిసమయాలక్కూడా తర్కబాధలేదు. వాస్తవంతో నిమిత్తమూ లేదు. అందుకే 'వెన్నెలగుత్తి' అనే చిత్రమయిన పేరుకూడా పెట్టారు చంద్రుడికి! ఇన్ని పేర్లలోనూ చందమామ, జాబిల్లి, చంద్రుడనేవాటికే వ్యవహారంలో వ్యాప్తి ఉంది.

సంస్కృత శబ్దాల్లో కూడా వర్ణనాత్మక నామధేయాలూ, మామూలు మాటలూ ఉన్నాయి. విడిమాటలని చెప్పదగిన పేర్లు 'చంద్రుడు, ఇందుడు, విధుడు, గ్లౌ' అనేవి. చివరిమాటను తెలుగుకవులుకూడా వ్యస్తంగా వాడినట్లులేదు. ఆనందకరుడనే అర్థంలో ఇందు శబ్దం వచ్చింది. కవుల వాడుకలో 'హిమాంశుడు, కుముదబాంధవుడు, సుధాంశుడు, సుధాకరుడు, శుభ్రాంశువు, ఓషధీశుడు, నిశాపతి, అబ్జుడు, జైవాతృకుడు, సోముడు, మృగాంకుడు, కలానిధి, ద్విజరాజు, శశధరుడు, నక్షత్రేశుడు, ఉడుపతి, క్షపాకరుడు' వగైరా చాలా పేర్లున్నాయి. చల్లని కిరణాలు కలవాడు కాబట్టి హిమాంశుడన్నారు. కలువపూలకు చుట్టం(!) కాబట్టి కుముదబాంధవుడు. సుధ – అంటే అమృతం–వంటి చల్లని కిరణాలున్నాయి కాబట్టి సుధాంశుడు. సుధా శబ్దానికి సున్నమనే అర్థంకూడా ఉంది కాని దాన్నిక్కడ చెప్పగూడదు. అమృతం (సుధను) తయారుచేస్తాడు కాబట్టి సుధాకరుడు. శుభ్రంగా తెల్లగా ఉండే కిరణాలు చిమ్ముతాడు కాబట్టి శుభ్రాంశువు. ఆయుర్వేదవైద్యులు వాడే మూలికలను (ఓషధులను) వెన్నెలరాత్రుల్లో సేకరిస్తే వాటి శక్తి బాగా ఉంటుందన్న నమ్మకముంది. ఆ మూలికలకు చంద్రుడే రాజట. అందుకని ఓషధీశు డన్నారు. నిశ అంటే రాత్రి. దానికి భర్త(!) కాబట్టి ఆయన నిశాపతి. ఇదేవిధంగా రజనీపతి, రజనీకాంతుడు వగైరా పేర్లూ పెట్టారు. ఆయన క్రమంగా పెరుగుతూ తరుగుతూ తన 'కళ'లు ప్రదర్శిస్తుంటాడు కాబట్టి కలానాథుడు, కలానిధి లాంటి పేర్లతో పిలుస్తారు. నక్షత్రాలకు భర్త కాబట్టి (దక్ష ప్రజాపతి తన 27గురు ఆడపిల్లలనూ – అశ్వని నుంచి రేవతి దాకా ఉన్నవాళ్లందర్నీ మూకుమ్మడిగా ఈయనకు కట్టబెట్టి కట్నాల సమస్యను తగ్గించుకున్నట్లుంది!) ఉడుపతి, నక్షత్రేశుడు అనే పేర్లు ఆయన నక్షత్రాలకు రాజో భర్తో అయినందువల్ల వచ్చినవి. ఆ మాటకు వస్తే ఆయనకు 'రాజు' అనే బిరుదనామం కూడా ఉంది.

ఇన్ని శుభలక్షణాలున్న చంద్రుడికి మచ్చలున్నాయి. అందుకే ఆయనకు మృగాంకుడు (లేడిలాగా కనిపించే మచ్చగలవాడు) అనే పేరు వచ్చింది. కొందరామచ్చను

కుందేలంటారు. అందు కాయనకు 'శశధరు'డనే పేరు పెట్టారు. ఓ కవి అది పుట్టుమచ్చ అన్నాట్ట. మరోకవి సముద్రంలో పుట్టాడు కాబట్టి అక్కడి బురద అంటుకొని అలా కనిపిస్తున్నా డన్నాడు. అది లేడి గుర్తేనన్నాడు మరొకడు. భూమి నీడపడి అలా మచ్చలాగా కనిపిస్తున్నదన్నాట్ట ఓ శాస్త్రవేత్త. అవేమీకాదు. ఆయన రాత్రిపూట గాఢాంధకారాన్నంతా తాగి కడుపులో నిల్వచేసుకొన్నందున అదలా నల్లగా మచ్చలాగా కనిపిస్తున్నదని మరో పెద్దకవి దబాయించాడు! మనం తెలుగువాళ్లం అక్కడో రేగుచెట్టున్నదనీ, దానికింద ఓ ముసలమ్మ ఉందని చెప్తుంటాం. అక్కడ రాళ్లూరప్పలూ గుంటలూ గోతులూ తప్ప మరేంలేవనీ, అది గ్రహంకాదనీ, భూమికి అదో ఉపగ్రహమనీ ఇప్పటి శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. ఎవరెన్నివిధాల చెప్పినా చంద్రగ్రహంవల్ల సముద్రంలో అలలూ మనుషుల్లో వెర్రీ ('ప్రేమపిచ్చి'తో సహా) పుట్టుకొస్తాయన్నది అనుభవం చెప్పే పాఠం.

సూర్యచంద్రులిద్దర్నీ కలిపి (ద్వివచనంలో) ఒకేమాటగా చెప్పే సంప్రదాయం సంస్కృత భాషలో ఉంది. మనభాషలో ఆ వచనమూ లేదు, ఆ పద్ధతీ లేదు.

సూర్యచంద్రుల తరువాత ఆకాశానికి శోభనిచ్చేవి నక్షత్రాలు. కాళిదాసు 'నక్షత్ర తారాగ్రహసంకుల'మైన ఆకాశాన్ని స్మరించాడు. అంటే ఈ మూడూ ఒక్కటి కాదన్నమాట. అశ్వని, భరణి వగైరా మనం పేర్కొనే ఇరవైయేడు నక్షత్రాలూ నిజానికి ఒంటరిక్కలు కావు. కొన్ని చుక్కల సమూహమన్నమాట. నక్షత్రమండలమనేకన్నా వాటిని తారామండలా లనటమే నయం. మినుకుమినుకుమనే చుక్కలు తారలు. ఆ మినుకులేని చుక్కలు గ్రహాలు. అయితే మామూలు వ్యవహారంలోనే కాక జ్యోతిషంలో కూడా సూర్యచంద్రుల్ని గ్రహాలంటున్నాం. సూర్యుడో తార. చంద్రుడు ఉపగ్రహం; అంటే ఒక గ్రహం చుట్టూ తిరిగే మరో గోళం. గ్రహాలక్కూడా స్వయం ప్రకాశంలేదు. తారలు సొంతంగా వెలుగిస్తాయి. అలాంటివి కొన్ని కలిసినప్పుడు అగుంపునే నక్షత్రమంటున్నాం. రాహుకేతువులకు ఛాయాగ్రహాలనే పేరు పెట్టారు జ్యోతిషులు. అదే పేరు నిజానికి చంద్రుడికిక్కూడా సరిపోతుంది. గ్రహాన్ని అచ్చతెలుగులో 'గాము' అంటారు, సంస్కృతపదాన్ని కొంత మార్చి.

పైన పేర్కొన్న సూక్ష్మభేదాలతో నిమిత్తం లేకుండా 'ఋక్షం, భం, తార, తారక, ఉడువు' అనే మాటలను నక్షత్రపర్యాయాలుగా పరిగణిస్తున్నారు. చిన్నతారను తారక అంటారు. భమ్మనే శబ్దానికి విడిగా వాడుకలేదు. 'ఉడుపతి, ఉడుగణం లాంటి సమాసాల్లోనే ఉడుశబ్దాన్ని తెలుగు కవులు ప్రయోగించారు – సర్వసాధారణంగా. ఋక్ష శబ్దానికి వేదప్రయోగాలెక్కువ. దాన్నుంచే 'రిక్క' అనే తెలుగు మాట పుట్టింది. 'చుక్క' అన్నదొక్కటే అసలుసిసలు తెలుగుమాట. ఋక్ష శబ్దానికి ఎలుగ్గొడ్డు అనే అర్థవిశేషం కూడా ఉంది. బహుశా ఇంగ్లీషు వాళ్లు 'గ్రేట్ బేర్' అనిపిలిచే సప్తర్షి మండలాన్ని బట్టి అదే అర్థంగల ఋక్షశబ్దం ఆర్యసంస్కృతిలో నక్షత్రపర్యాయంగా నిలిచి వుండవచ్చు. చుక్కశబ్దానికి 'బొట్టు' అనే అర్థం కూడా ఉంది తెలుగులో. అయితే 'చక్కనిచుక్క'లోని చుక్కకున్న ప్రత్యేకార్థాన్ని ఎలా చెప్పాలో తెలీటంలేదు!

సూర్యచంద్రులకూ నక్షత్రతారకలకూ కిరణాలున్నాయి. సూర్యుణ్ని సహస్ర కిరణుడంటారని కూడా ఇంతకుముందు ప్రస్తావించాం. కిరణం, మెరుపు, వెలుగు

అనేవాటికి చాలా దగ్గరి సంబంధాలున్నందువల్ల వాటి వాటి పర్యాయపదాల్లో కొన్ని సమానంగా ఉంటాయి. అయినా ఆయాపదాల పర్యాయపదాలను స్మరిద్దాం విడివిడిగా.

కిరణ శబ్దానికి సంస్కృతంలో 'ఉస్రం, మయూఖం, అంశువు, గభస్తి, ఘృణి, ధృష్ణి, వృష్ణి, భానువు, కరం, మరీచి, దీధితి, ప్రభ, రుక్కు, రుచి, త్విట్టు, భా, భవి, ద్యుతి, దీప్తి, రోచి(స్సు), శోచిస్సు' వగైరా పర్యాయపదాలున్నాయి. వీటిలోని భా శబ్దానికి తెలుగులో విడిగా ప్రయోగంలేదు. భానువు దీని రూపాంతరం. ఇవి ఉన్నవాడు కాబట్టే సూర్యుణ్ని 'భానుమూర్తి, భానుమంతుడు' మొదలైన పేర్లతో పిలుస్తారు. కిరణాలు మనచేతుల వంటివని కర శబ్దంతో వ్యవహరించటం కద్దు. ఆ దృష్టితోనే వేడిగా ఉండే సూర్యుణ్ని 'ఖరకరుడు' (తీక్ష్ణమయిన చేతులు/కిరణాలు కలవాడు) అని వ్యవహరిస్తున్నారు. అంశువంటే మినుకు/వెలుగు. దీన్నే కిరణంతో సమానంగా భావిస్తున్నారు. ప్రభా శబ్దానికి ప్రకాశమనే అర్థం కూడా ఉంది. ప్రకాశం/వెలుగు ఇచ్చేది కాబట్టే కిరణాన్ని ప్రభ అంటున్నారు. ఘృణి, ధృష్ణి, రుక్కు, త్విట్టు శబ్దాలకు సమాసాల్లో తప్ప తెలుగులో ప్రయోగాలు దొరకటం కష్టం. సంస్కృతంలోనయినా వీటికి పర్యాప్తప్రయోగాలులేవు. మరీచి, గభస్తి, శోచిస్సు అనేవి కేవలం కావ్యప్రయోగబాహుళ్యం కలవి. భవి, ద్యుతి, దీప్తి, రోచి(స్సు) కిరణార్థంలో ఎక్కువ వ్యాప్తికల మాటలు. ద్యుతికి ప్రకాశమని, దీప్తికి అధికప్రకాశమని, భవికి వెలుగనీ అర్థవిశేషాలున్నాయి.

'మినుకు, తళుకు, నిగ్గు, మించు, కళుకు' అనేవి కిరణార్థంలోవాడే తెలుగుమాటలు. ఇవన్నీ వెలుగు, ప్రకాశం, తళతళ వంటి అర్థాలిచ్చే మాటలే. తళుకుతోబాటు అదే అర్థంగల మరోమాట బెళుకును కలిపి వాడుతుంటాం. బెళుకు కన్నడం నుంచి వచ్చిన ఎరువుమాట అని కొందరంటారు. సిగ్గు బిడియం లాంటి జంటపదంగా వీటిని వాడుతుంటాం. బెళుకు శబ్దం తెలుపు, తెల్లదనం, వెల్లదనం వంటి అర్థాలు కూడా ఉన్నమాట. తెలుపు, వెలుగులాంటి శబ్దాల పరస్పర సంబంధం గురించి తరవాత ఆలోచిద్దాం. నిగ్గు శబ్దానికి సారం, మెరుగులాంటి అర్థ విశేషాలు కూడా ఉన్నాయి. మించు శబ్దానికి కూడా తెల్లదనం, వెలుగులాంటి అర్థాలు కూడా ఉన్నాయి.

## వెలుగు చీకట్లు

సూర్యచంద్రుల వల్ల వెలుగువస్తుంది. అది లేనప్పుడు చీకటే ఉంటుంది. వెలుగుకు తెలుపుతో, చీకటికి నలుపుతో దగ్గరి సంబంధముంది. మొదట కిరణాల వల్ల వచ్చే వెలుగూ దానికి దగ్గరయిన తెలుపును గురించీ తెలుసుకుందాం. 'శోభ, కాంతి, కాశం, ప్రకాశం, సుషమ, ద్యుతి, భవి' లాంటి పదాలు వెలుగుకు పర్యాయాలైన సంస్కృతశబ్దాలు. శోభా శబ్దానికి 'చక్కదనం, మంచి' మొదలైన అర్థవిశేషాలు కూడా ఉన్నాయి. కాంతి అనేది సర్వసాధారణ పదం. ద్యుతి, భవి

అనేవి కిరణ శబ్దానికూ్కడా పర్యాయపదాలని ఇంతకుముందే గమనించాం. కళ్లు జిగేలుమనిపించే వెలుగును 'సుషమ' అంటారు. దీనికి సరైన అచ్చతెలుగుమాట 'జిగ్గు'.

అచ్చతెలుగులో 'కాంతి'కి పర్యాయాలుగా 'వెలుగు, వెలుతురు, జోతి, జిగ్గు, నిగ్గు, డాలు, మినుకు, మిన్కు, మిసి, మించు, నిగ, తళుకు, తళ్కు, మెరుగు, మెరుపు, చికిలి, కళుకు, రంగు' లాంటివి చాలా ఉన్నాయి. వెలుగు వెలుతురులు రూపాంతరాలని చెప్పవచ్చు. జోతి అనేది సంస్కృతంలోని 'జ్యోతి' నుంచి పుట్టినమాట. జిగ్గునిగ్గులను కలిపి జంటమాటగా అల్లసాని పెద్దన వాడాడు. నిగ్గు, మినుకు, తళుకు, కళుకు, శబ్దాలకు కిరణమనే అర్థముందని ఇంతకు ముందే గుర్తించాం. తళుకు, తళ్కు, మినుకు, మిన్కులు రూపాంతరాలు. మెరుగు, నిగ్గులకు తళతళ అనే అర్థం కూడా ఉంది. నిగ శబ్దం నిగ్గు శబ్దానికి దగ్గరిమాట. 'నిగనిగలాడు' అనేమాటలో దీనికి ప్రయోగం ఎక్కువ. మెరపు శబ్దానికీ మెరుపు/మెరుము శబ్దానికీ చాలా దగ్గరి సంబంధముంది. మెరుపులాగా చప్పున జిగేలుమనేట్లు వెలగటాన్ని ఈ పదం సూచిస్తుంది. డాలు, రంగులకు 'వన్నె' అనే అర్థవిశేషముంది. చికిలి శబ్దానికి 'పదును' అనే అర్థం కూడా కనిపిస్తుంది – 'చిరుసానపట్టించి చికిలి సేయించిన గండ్రగొడ్డలి నిశాగహనలతకు'లాంటి శ్రీనాథ ప్రయోగాల్లో.

తెలుపునూ తెల్లదనాన్నీ సూచించే సంస్కృతశబ్దాలు చాలావున్నాయి – 'శుక్లం, శుభ్రం, శుచి, శ్వేతం, విశదం, పాండురం, అవదాతం, సితం, గౌరం, వలక్షం, అవలక్షం, ధవళం, అర్జునం' వంటివి. శుక్లపక్షం, శుక్లాంబరధరం... లాంటి సమాసాల్లో వినిపించే శుక్ల శబ్దానికి తెలుపనే అర్థం. కళ్ళమీద వచ్చే తెల్లపొరలను కూడా శుక్లా లంటారు. శుభ్ర శబ్దానికి 'మలినంలేని'దనే అర్థవిశేషం కూడా ఉంది. అలాగే శుచి శబ్దానికి కూడా. శుచికి 'మడి' అనే అర్థమూ ఉంది. శుచీశుభ్రమని రెంటినీ జంటగా వాడే సందర్భాలెన్నో. శ్వేతం, పాండురం అనేవాటికి తెలుపనే అర్థంతోబాటు కొన్నిరకాల జబ్బుల పేర్లకు కూడా సంబంధించినవి. అవదాతం అంటే మంచి తెలుపు – తెల్లటి తెలుపన్నమాట. వలక్షం, అవలక్షం రూపాంతరాలు. వీటికి గ్రంథాల్లోనే వ్యాప్తి. ధవళం తెల్లదనానికేకాక ఒకరకం పాటకూ్కడా పేరు. అర్జునానికి తెలుపు, తెల్లమద్ది (చెట్టు) వగైరా అర్థాలున్నాయి. అయితే విజయవిలాసంలో మరికొన్ని తెలుగు కావ్యాల్లో పాండవుడైన అర్జునుడు నల్లటివాడనే వర్ణనలున్నాయి! పైమాటల్లోని శుక్లం, శ్వేతం, సితం అనేవాటికి వాడుక ఎక్కువ.

'తెలి, తెల్లని, తెల్ల, తెలుపు, వెలి, వెల్ల, వెల్లన' అనేవి అచ్చతెలుగు మాటలు. ఇన్నింటిలోనూ ప్రాతిపదికగా ఉన్నవి 'తెల్, వెల్' అనే భాగాలే. తెల్లం వంటి మాటలకున్న 'స్పష్టత' అనే అర్థం విశేషం తెలి రూపాంతరాలకూ, వెలుతురు, వెలుగు మొదలైన మాటలకున్న 'ప్రకాశం, కాంతి' అనే ప్రత్యేకార్థం వెలిరూపాంతరాలకూ ఉన్నాయి. మరీ స్వచ్ఛతనో స్పష్టతనో చెప్పాలంటే తెల్లటి తెలుపు వంటి పదబంధాలను ప్రయోగిస్తాం. అలాంటి ప్రయోగం వెలి రూపాంతరాల విషయంలో కనిపించదు. వెల్లకు 'సున్నం' అనే అర్థం కూడా ప్రాంతీయంగా ఉంది.

ఇక చీకటి సంగతికి వద్దాం. 'అంధకారం, ధ్వాంతం, తమిస్రం, తిమిరం, తమస్సు' అనేవి చీకటికి పర్యాయపదాలయిన సంస్కృత శబ్దాలు. అంధ శబ్దానికి 'గుడ్డి'

అనే అర్థముంది. గుడ్డితనం లాంటి అశక్తతను కల్పించేది కాబట్టి అంధకారమనే మాట పుట్టింది. ధ్వాంత శబ్దానికి ధ్మాంతమనే రూపాంతరముంది. వాడుక తక్కువ. తమిస్రం, తమస్సు అనేవి దగ్గరి మాటలు. తమశ్శబ్దానికి దురహంకారం, దుర్లక్షణంవంటి అర్థాంతరాలున్నాయి. చెడుకు చీకటిని సంకేతంగా భావించే ఆచారముంది. మరీ దట్టమయిన చీకటిని అంధతమస మంటారు. దీనికి సరైన తెలుగు మాటలు 'చిమ్మచీకటి, కటిక చీకటి' అనేవి. గాఢాంధకారమనే దీని సంస్కృత పర్యాయపదానికే తెలుగులో వాడుక ఎక్కువ. చీకటి బాగా వ్యాపిస్తే దాన్ని సంతమసమంటారు సంస్కృతంలో. చీకటి అంతగా లేకపోతే అవతమసమంటారు సంస్కృతంలో. దీనికి సరైన తెలుగు మాటలు 'గుడ్డి చీకటి, మసక చీకటి, ముని చీకటి, మురి చీకటి' వగైరాలు. తెలుగుమాటలు రెండే వినిపిస్తాయి – చీకటి, ఇరులు అనేవి. ఇరులు శబ్దం పూర్వకావ్యాల్లో మాత్రమే కనిపిస్తుంది – వినిపిస్తుంది. దీనికి 'ఇనుము, రేయి' వంటి మాటలకూ సంబంధముందంటారు వ్యుత్పత్తిశాస్త్రజ్ఞులు. ఇనుము శబ్దానికి ఈ కాలంలో చీకటి అనే అర్థంలేదుగాని, నల్లగొడ్లను, 'ఇనుప సామాను, ఇనపగొడ్లు, ఎనుము' వగైరా పేర్లతో ప్రాంతీయంగా వ్యవహరించే సందర్భాల్లో 'నలుపు, చీకటి' అనే అర్థాలే ఉన్న తెలుగుమాట. 'చీకువాలు' అనే మాట ఒకటి మాత్రం ఈ అర్థంలో పాత పుస్తకాల్లో కనిపిస్తుంది. ఒకప్పుడు చీకటి శబ్దంలోని మొదటిరెండు అక్షరాల మధ్య అరసున్నా ఉందని కొందరూ లేదని కొందరూ పోరాడుకున్నారు! మరికొందరు ఉన్నా చీకట్లో కనిపించదని అసలు విషయం దాటవేశారు!

చీకట్లో నుంచి బయటపడ్డా నలుపు తప్పేటట్లు లేదు – ఈ రెంటినీ కలిపి మాట్లాడుకుందా మనుకున్నాం కాబట్టి. సంస్కృతంలో 'కృష్ణం, నీలం, అసితం, శ్యామం, కాలం, శ్యామలం, మేచకం' వంటి పదాలున్నాయి నలుపనే అర్థంలో. కృష్ణశబ్దానికి 'ఆకర్షించేది' అనే అర్థవిశేషం కూడా ఉంది. ఆ అర్థంలోనే కృష్ణ (ద్రౌపది), కృష్ణుడు వగైరా మాటలు పుట్టాయి. పూర్వకాలపు ఆర్యులంతా తెల్లటివాళ్ళు కాబట్టి వాళ్ళకి నలుపే ఆకర్షణకరంగా ఉండేమో తెలీదు. తెల్లవాళ్ళకు నీగ్రోల మీద ఇందుకే మోజని చెప్పేవాళ్ళున్నారు! నీలం, నీలిమ అనేవి పూర్తి నలుపు కావనీ ఇంగ్లీషులోని 'బ్లూ'తో సమానమనీ వాదించే వాళ్ళూ లేకపోలేదు. అసిత మనేదానికి 'తెలుపు' కానిదని అర్థం. శ్యామం, శ్యామలం అనేవి నలు పనరాదనీ తెలుగులోని 'చామనచాయ'కు సమానమనీ చెప్పాలి. ఇంగ్లీషులోని 'Gray/Grey' శబ్దాన్నీ తెలుగులోని 'చామనచాయ'నూ నిర్వచించటం సాధ్యమా అనేది ప్రశ్న.

అచ్చతెలుగులోని 'కర, కరి, కర్రి, కారియ, కరియ, నల్ల, నల్లన, నలుపు, నల్పు, కప్పు, కందు' అనేవి నల్లదాన్ని సూచించే మాటలని నిఘంటువులు పేర్కొంటున్నాయి. 'కర' నుంచి 'కరియ' దాకా ఉన్న మాటలన్నీ ఒకదానికొకటి పర్యాయపదమనే చెప్పాలి. అర్జునుణ్ణి (తెల్లటి వాణ్ణే!) తెలుగులో 'కర్రి' అనికూడా కవులు వ్యవహరించారు. 'కర్రి విక్రమంబు కాళ్ళ గః వంటి ప్రయోగాలు ఇందుకు నిదర్శనాలు. ఇంకా అక్కడక్కడ నల్లావును 'కర్రా' ' అని పిలవటం కద్దు. కారియ శబ్దానికి 'కష్టం' అనే అర్థం కూడా ఉంది. నల్ల అనేదానికి 'నెత్తురు' అనే అర్థమెందుకు వచ్చిందో చెప్పలేం. ఈ కాలంలో నల్ల శబ్దం విశేషణమే గాని నన్నయకాలంలో దానికి

విశేష్యంగా/నామవాచకంగాకూడా వాడుక ఉండేది. 'ఉల్ల జవనాశ్వపుం దోక నల్ల చూడు' మనే ప్రసంగం కద్రూ వినతల పందెం సందర్భంలో నన్నయభారతంలో కనిపిస్తుంది. కందు, కప్పు శబ్దాలకు 'మచ్చ' అనే అర్థవిశేషంగా కూడా ఉంది. ఇక మరీ నల్లగా ఉన్నవాటిని చెప్పేటప్పుడు 'నల్లటి నలుపు, కారునలుపు' అంటుంటాం. 'కారుమబ్బు'ల వంటి పదబంధాల్లో కూడా కారు శబ్దానికి 'చిక్కని, ఎక్కువ' అనే విశేషణార్థా లున్నాయి.

# మబ్బులు: రంగులు

రంగు లనగానే – తెలుగు నలుపులు కూడా రంగులే కాబట్టి – ఒక విషయం గుర్తుకు వస్తుంది. ఒక్కో భాషలో కొన్నిరంగులు పేర్లు మాత్రమే ప్రాథమికంగా ఉంటాయి. తెలుగువాళ్ళం 'నలుపు, తెలుపు, ఎరుపు, పసుపు' అనే నాలుగు రంగుల్ని మాత్రమే వివక్షిస్తాం. పసుపు అనేది 'పసుప్పచ్చ' కావచ్చు – 'ఆకుపచ్చ' కావచ్చు. తక్కిన రంగులపేర్లను ఎరువుమాటలతోగాని (ఉదా. నీలి), పదబంధాల్తోగాని (ఉదా. కావిరంగు, వంగరంగు, పుల్ల ఎరుపు వగైరా) సూచిస్తాం.

ఆకాశంలో రకరకాల రూపాలతో కనిపించేవాటిలో ప్రధానమైనవి మబ్బులు. 'మొయిలు/మొగులు' అనే రూపాంతరాలు 'మబ్బు'కు పర్యాయపదాలు. ఇవి తెలుగుమాటలు. మొయిలు శబ్దానికి కావ్య ప్రయోగమేగాని జనవ్యవహారంలో ఈ కాలంలో వాడుకఉన్నట్లు తెలియదు. మబ్బు అనేమాటకు 'మసక, మాంద్యం' అనే అర్థవిశేషాలు ముఖ్యంగా తెలంగాణా వ్యవహారంలో వినిపిస్తాయి. 'మత్తు' అనే అర్థవిశేషం కోస్తావారి వాడుకలోవుంది. సూర్యరశ్మికి అడ్డుపడి మసకచీకట్లు వ్యాపింపచేస్తాయి కాబట్టి, మబ్బు పట్టినప్పుడు కొంత మాంద్యం వస్తుంది కాబట్టి ఈ వ్యావహారికార్థాలు సకారణంగానే వచ్చాయని చెప్పాలి. సంస్కృతంలో చాలా మాటలున్నాయి ఈ అర్థంలో.

'అభ్రం, మేఘం, వారివాహం, బలాహకం, ధారాధరం, జలధరం, తటిత్వంతం, వారిదం, జలదం, అంబుభృత్తు, ఘనం, జీమూతం, ముదిరం, జలముక్కు, ధూమయోని, స్తనయిత్నువు'లాంటివి మబ్బుకు పర్యాయపదాలని చెప్పదగిన సంస్కృత పదాలు. వీటన్నిటిలో మేఘమన్నదే అత్యంత వ్యాప్తిలో (తెలుగులో కూడా) ఉన్న పదం. అభ్ర శబ్దానికి ఆకాశమనే అర్థంలో కూడా ఉంది. ఘనమంటే 'గట్టిది, గడ్డకట్టినది'. ముదిర శబ్దానికి విస్పష్టర్థమేదో తెలీదు. పైన పేర్కొన్నవాటిలో ఈ మూడు శబ్దాలే ప్రాథమికాలు. తక్కినవన్నీ వర్ణనాత్మకాలు.

వారి అంటే నీరు. వాహం అంటే మోసేది. నీటిని మోసేది కాబట్టి వారివాహ మన్నారు. ధార అంటే నీటి బిందువుల గుంపు. వాటిని ధరించేది కాబట్టి – మోసేది కాబట్టి – ధారాధర మనే పేరుపెట్టారు. జలధరం అనేది కూడా అటువంటిమాటే. తటిత్తంటే మెరుపు. తటిత్వంతమంటే మెరుపులున్నది.

నిజానికి మెరుపులతో కూడిన మబ్బునే ఈ పేరుతో పిలవాలి. వారిదం అంటే నీటినిచ్చేది. వానకురవని మబ్బు నీపేరుతో పిలవటం అన్యాయం. అంబుభృత్తంటే నీటిని భరించేది. వానమబ్బులనే ఈలా పిలవటం సమంజసం. జీమూత శబ్ద వ్యుత్పత్తి తెలీదు. అలాగే ముదిరం విషయంలోనూ. జలముక్ శబ్దానికి నీటిని వదిలేది అని అర్థం. ధూమయోని అనే పేరెవరు పెట్టారో తెలీదుగాని అచ్చం గిరీశం పట్టులో నామకరణం చేశారని చెప్పాలి. ధూమం అంటే పొగ. దానికి ఆధారం/మూలం అయినది ధూమయోని. లేదా ధూమం పుట్టడానికి కారణమయింది ధూమయోని. పొగపైకిలేచి మబ్బయి వానకురుస్తుందని కదా గిరీశం పరిశోధించి కనుక్కొన్నది! స్తనయిత్నువు అనేది తమాషామాట. ఎవరో కవి సృష్టించిన మాట అయివుండాలి. స్తనమంటే చన్ను. చన్నుగలది అని స్తనయిత్ను శబ్దానికర్థం. అంటే తల్లిపాలు చేపినట్లు – బహుశా ముసురువాన – కురిపించేదని అర్థం కావచ్చు. రకరకాల మబ్బులు గుంపులు కట్టివుంటే దాన్ని 'కాదంబిని' అంటారు. దాన్నే 'మేఘమాల' అంటారు. ఎప్పుడయినా తెల్లమబ్బులుగాని పీచు మబ్బులుగాని ఆకాశంలో చిన్న చిన్న ముక్కలుగా కనిపిస్తే వాటిని 'అగడప'లంటారు తెలుగులో. దానికి సరయిన సంస్కృత పర్యాయపదమేమో తెలీదు. ఎవరైనా చెప్తే బాగుండు.

మబ్బులున్నప్పుడు మెరుపులు కూడా కొన్ని సమయాల్లోనయినా కనిపిస్తాయి. కొందరు మెరుపును 'మెరుము, మెరుగు' అనికూడా పిలుస్తారు. తెలుగు నిఘంటువులు 'మించు, డాలు' శబ్దాలు మెరుపు శబ్దానికి పర్యాయపదాలని చెప్తున్నాయి. కళ్లు చెదిరేట్లు మెరిసిన మెరుపును 'మిరిమిడి' అంటారు. 'మిరుమిట్లు' అన్నమాటకూ ఈ శబ్దానికీ దగ్గరి సంబంధ ముందనిపించటంలేదా? మించు, డాలు అనేది వెలుతురుకూ వెలుగుకూ కూడా పర్యాయపదాలే. అంటే ఈ మాటకిదే పర్యాయపదమని నిష్కర్షగా విభజించి చెప్పటం అన్ని సందర్భాల్లోనూ సాధ్యంకాదని గుర్తించాలి. 'గురికి బెత్తెడు ఎడంగా' మాత్రమే చెప్పగలం. అందుకే ఖచ్చితంగా చెప్పాలంటే ఏ మాటా మరోమాటకు అన్నివిధాలా పర్యాయపదం కాదని భాషాశాస్త్రజ్ఞులంటారు.

మెరుపు శబ్దానికి పర్యాయపదాలని చెప్పే సంస్కృతపదాలు చాలా ఉన్నాయి. 'శంప, సంప, శతహ్రాద, హ్రాదిని, ఐరావతి, క్షణప్రభ, తటిత్తు, విద్యుత్తు, చంచల, చపల, సౌదామని, సౌదామిని' అనేవి అలాంటివే. శంపా/సంపా శబ్దాల వ్యుత్పత్తి విస్పష్టంగా చెప్పలేంగాని అవే సంస్కృత భాషలోని ప్రాథమిక శబ్దాలనీ అవి ఒకదానికొకటి రూపాంతరమనీ బల్లగుద్ది చెప్పవచ్చు. తక్కినవన్నీ వర్ణనాత్మక శబ్దాలు. శతహ్రాద అంటే నూరు (శత) గుంటలు మెలికలు (హ్రాదాలు) కలదని అర్థం. (నూరు/చాలా) మెలికలు తిరుగుతుంటుంది కాబట్టి మెరుపును ఆ పేరుతో పిలిచారు. హ్రాదిని అంటే భయం పుట్టించేది. ఈ శబ్దానికి 'పిడుగు' అనే అర్థం కూడా ఉంది. అంటే ఈ పేర్లు పెట్టినవాళ్ళు ఎవరయినాగాని పిడుగుకూ మెరుపు అనే దానికీ సంబంధముందని గ్రహించారని చెప్పాలి. కాంతివేగంకన్నా ధ్వనివేగం తక్కువకాబట్టి మెరుపు మెరిసిన చాలా సమయం తరువాత పిడుగులు పడ్తాయని వాళ్లక్కూడా తెలుసనుకొంటే 'అన్నీ వేదాల్లో ఉన్నాయిష' అని సంతోషించటంతో తప్పలేదు. ఐరావతి అనేది పురాణైతిహ్యంతో ముడిపడ్డది. ఇంద్రుడెక్కే తెల్ల ఏనుగు పేరు ఐరావతమని గుర్తుంటే తక్కిన విషయం ఊహించటం తేలికే!

క్షణప్రభ అంటే కొద్దికాలం మాత్రం వెలిగిపోయేది. మెరుపు స్వభావాన్ని సూచించేమాట ఇది. ప్రభా శబ్దానికి కాంతి, వెలుగు అనే అర్థాలున్నాయని ఇంతకుముందే గమనించాం కదూ! తటిత్, విద్యుత్ అనే శబ్దాల్లోని చివరిభాగాలు తొందరపాటున సూచిస్తాయి. ద్యుత్ – అంటే వెలుగు, తొందర. చాలా తొందరగా వెలిగి ఆరిపోయేది కాబట్టి విద్యుత్తు అనే పేరువచ్చింది. ఇంగ్లీషులోని 'ఎలక్ట్రిసిటీ'కి పర్యాయంగా ప్రస్తుతం 'విద్యుత్' శబ్దం వాడుతున్నాం కాబట్టి మనవాళ్లు చాలా వేల సంవత్సరాల క్రితమే దాన్ని కనిపెట్టారంటే చరిత్ర అంగీకరించదనటంకన్నా చేయగలిగిందేమీ లేదు. దీనికి పర్యాయపదంగా వాడుతున్న 'కరెంటు' (ప్రవాహమని అర్థం) అనే ఇంగ్లీషు మాటకున్నాడా 'ఎలెక్ట్రిసిటీ' అనే అర్థం లేదు పూర్వం! చంచల అంటే స్థిరంగా ఉండనిది. చపల అంటే స్థిమితంగా ఉండనిది. ఈ రెండు పేర్లూ అటుమెరుపు అనే అర్థంలోనూ ఇటు 'లక్ష్మి/సంపద' అనే అర్థంలోనూ వాడుకలో ఉండటమే విశేషం. డబ్బున్నప్పుడు వెలిగి ఆ తరవాత ఆరిపోతారనే భావం రెంటికీ సమంగా ఉంది – 'వెలుగు' అనే అర్థవిశేషం వల్ల! సౌదామనీ, సౌదామినీ శబ్దాలు రూపాంతరాలు. వీటిని 'సుదామ' శబ్దంనుంచి కూడా సాధించవచ్చు. ఆకాశానికి కాకపోతే మబ్బులకయినా ఇవి హారాల/దండల వంటి వన్నమాట.

ప్రకృతిలో రాత్రింబవళ్లకు నలుపుతెలుపులు ప్రతీకలయినా దానిశోభకు రంగులే నిదర్శనాలు. ఈనాటి శాస్త్రజ్ఞులుచెప్పే సప్తవర్ణప్రణాళికనూ సూర్యుడి సప్తాశ్వవర్ణాలనూ సమన్వయించేవాళ్లున్నారు. కాంతితరంగాల దైర్ఘ్యంలోని మార్పులే రకరకాలరంగులు భాసించటానికి కారణమంటారు. మన అనుభవంలో కంటికి కనిపించే వింతరంగులన్నిటికీ పేర్లులేవు – అంటే పేర్లు పెట్టలేక పోతున్నామన్నమాట – కవితా భాషలో కూడా. మరో విశేషం ప్రాథమికవర్ణాలు ఒక్కో భాషకు ఒక్కో జాతికి ఒక్కో విధంగా కనిపించటం. ఇంకో ప్రత్యేకత స్త్రీలు గుర్తించగలిన్ని ఛాయాభేదాలను పురుషపుంగవులు గమనించలేకపోవటం. మరో విశిష్టత ఒకే విధ్వారపు వన్నెను నలుగురు నాలుగురకాల పేర్లతో పిలవటం. ఈ విచిత్రాలనిక్కడ చర్చించలేంగాని కొన్ని 'ప్రధాన' వర్ణాల పర్యాయపదాలను తెలుసుకొనిగాని సంధ్యాశోభవంటి అద్భుతాలను గమనించలేం.

జంతువులనూ మానవులనూ సమంగా ఆకర్షించే వన్నె ఎరుపు. కుక్కలు ఈ రంగునే సరిగా గుర్తించగలవంటారు. పశువు లీవన్నెను చూసి బెదురుతాయంటారు. కానీ ఎందుచేతనో ఎరుపువన్నెకూ చక్కదనానికీ లంకెఉంది – చాలాభాషల్లో. మాటవరసకు తెలుగులోనే 'చెన్ను' శబ్దానికి విడిగా చక్కదనమనే అర్థం; సమాసంలో 'ఎరుపు' (ఉదాహరణకు 'చెందొవ' అంటే ఎఱ్ఱగలువ). సంస్కృతంలో 'లోహితం, రోహితం, రక్త'మనేవి ఎరుపనే అర్థమిచ్చే పర్యాయపదాలు. రక్త శబ్దానికి నెత్తురనే అర్థవిశేషం కూడా ఉంది. మరోమాట 'శోణం'. దీనికి ఎఱ్ఱకలువరంగు అనేది విస్పష్టార్థం. శోణితం అంటే రక్తం అనే అర్థం. సంస్కృతంలో అరుణం అంటే ముదురెరుపురంగు. అలా ఎఱ్ఱగాఉన్న సూర్యుణ్నే అరుణుడంటారు. తెలుపూ ఎరుపూ కలిసిన రంగును పాటల మంటారు. పసుపూ ఎరుపూ రంగులు

కలిసిఉంటే 'తామ్రం, నిపీతరక్తం, పింజరం' అనే పేర్లతో పిలుస్తారు. నలుపూ ఎరుపూ కలిసిన 'ఊదా' రంగును సంస్కృతంలో 'నీలలోహిత'మనే సమాసంలో చెప్పాల్సిందే.

తెలుగులో ఎరుపు, ఎర్రని అనేమాటలకు 'కెంజాయ, కెంపు, తొగరు, తొవరు' అనే పర్యాయ పదాలున్నాయి. కెంపుచాయనే కెంజాయ అనే చిన్నిసమాసంలో మలుచుకున్నాం. తొగ/తొగరు అనే మాటలకు కలువపూవనే అర్థముంది. వాటి చివరి 'రు' ఏదో ప్రత్యయమన్నమాట (పాద–పాదరు అనే జంటలోలాగ). కెంపురంగని సమాసంగా కూడా వ్యవహరిస్తాం. అంటే ఎరుపు శబ్దమొక్కటే తెలుగులో ప్రాథమికమైన ఆ రంగుపేరని చెప్పాలి.

పసుపురంగు తెలుగులో 'పసుపుపచ్చ, ఆకుపచ్చ' అనే రెండు వన్నెలకూ సాధారణమైన మాట అని ఇంతకుముందే గుర్తించాం. పసుపుపచ్చకు మరో పర్యాయపదం పుస్తకాల్లో కనిపించేమాట 'అలిది'. దానికి 'హాలిది' అనే రూపాంతరం కూడా ఉంది. ఇది 'హరిద్రా' అనే సంస్కృతశబ్దభవమని కొందరంటారు. సంస్కృతంలోని 'పీతం, గౌరం' అనే శబ్దాలు పర్యాయపదాలంటారు నిఘంటుకారులు. అయితే గౌరశబ్దానికి తెలుపనే అర్థంకూడా ఉందని ఇంతకు పూర్వం గమనించాం. అంటే పీతమొక్కటే ఆ భాషలో మౌలికపద మన్నమాట. హరిద్ర అంటే పసుపుకొమ్ము కూడా.

ఆకుపచ్చ తెలుగులో సమాసం. 'పైరు' శబ్దమూ పచ్చ శబ్దమూ ఒకప్పుడు ఒకేమాటగా ఉండేవంటారు. దీన్నే 'పసరుచాయ' అనే సమాసంతో కూడా వ్యక్తీకరిస్తాం. సంస్కృతంలోని 'ఫలాశం/పాలాశం, హరిత'మనేవి ఇందుకు పర్యాయపదాలు. పలాశ శబ్దానికి 'ఆకు' అనే అర్థంకూడా ఉంది. కాబట్టి 'హరిత'మొక్కటే ఆ భాషలో మౌలికపదం. సూర్యుణ్ణి హరిదశ్వుడంటారు. ఆయన గుర్రాలు ఆకుపచ్చగా ఉంటాయట!

నలుపుపాలు ఎక్కువగా ఉన్న ఎరుపుతో కూడిన రంగును సంస్కృతంలో 'ధూమ్రం, ధూమలం' అంటారు. తెలుగులో 'బూడిదరం'గంటాం. ధూమ శబ్దానికి 'పొగ' అనే అర్థముంది. పొగరం గన్నమాట. గోధుమరంగును సంస్కృతంలో 'శ్యావ' మంటారు. కపిశ మనేది మరోపేరు. కపి అంటే కోతి. కోతి రంగువంటిదని కపిశ శబ్దాని కర్థం. 'గోరోజనం' రంగును – అంటే తెలుగులో చెప్తే 'పుల్లావు' రంగును సంస్కృతంలో 'కడాశం, కపిలం, పింగలం, పిశంగం, కద్రువు, పింగం' అనే పేర్లతో పిలుస్తారు. కపిల అంటే పుల్లావుకూడా. నన్నయ 'కపిల' అనిదాన్ని తెలుగుచేసినట్లుంది. వ్యాసుడి గడ్డమూ కళ్ళూ జుట్టూ కవిలవన్నెలో ఉన్నాయని నన్నయ వర్ణించాడు. ఊహించండి ఆకారాన్ని!

రకరకాల రంగులు కలిపివుంటే అచ్చతెలుగులో ఒక్కమాటలో చెప్పలేం – వన్నెల, వన్నెచిన్నెల, రంగురంగుల అని తప్ప. సంస్కృతంలో 'చిత్రం, కిర్మీరం, కల్మాషం, శబలం, ఏతం, కర్బురం' అనేమాటల్లో ఏదైనా వాడవచ్చు. ఈ అర్థంలో చిత్రశబ్దానికి ఆశ్చర్యకరంలాంటి అర్థాంతరాలున్నాయి. కల్మాషం అంటే 'కలగాపులగం,

మలినం' అనే అర్థభేదా లున్నాయి. కర్బుర శబ్దాన్ని కాళిదాసు 'కపోత కర్బుర'మనే సమాసంలో వాడి కాలిన మన్మథుడి బూడిదను వర్ణించాడు! కిర్మీరమంటేనే రంగురంగులయినా 'చిత్రవర్ణకిర్మీరిత'మని రాసిన కవులున్నారు!

ఇంతకూ 'VIBGYOR' అనే ఏడురంగులకూ సంస్కృతాంధ్రాల్లో మౌలిక పదాలులేవు! వయొలెట్టును 'ఊదా' రంగని, ఇండిగోను 'నీలి' రంగని, బ్రౌన్‌ను 'గోధుమరంగని', గ్రీన్ను 'ఆకుపచ్చ' అనీ, ఎల్లోను 'పసుప్పచ్చ' అనీ, ఆరంజిని 'నారింజ' రంగని, రెడ్‌ను 'ఎరుప'నీ పిలుస్తున్నాం – గురికిబెత్తెడు ఎడంగా సరిపెట్టుకొని. చేనేత, వాస్తుపదకోశాల్లో చూస్తే ఒకే 'వన్నె'ను భిన్నప్రాంతాల్లో రకరకాల పేర్లతో పిలుస్తున్నారనీ, శకుంతల మేనకలాంటి పేర్లతోబాటు 'పంతులమ్మ, అంజలి' రంగుల్లాంటివి కూడా భాషలో అవతరించాయనీ తెలుస్తుంది.

## రాత్రింబవళ్ళు

సూర్యోదయంతో తెల్లవారుతుంది. అంటే ప్రపంచం వెలుగువల్ల తెల్లబడుతుంది. ఆ సమయాన్ని 'వేకువ, వేగు, వేవి' అనే మాటల్లో పిలుస్తాం తెలుగువాళ్లం. ఈ మూడూ దగ్గరి సంబంధమున్న మాటలే – రూపాంతరాలే. పూర్వం 'వేంగు' అనే రూపంకూడా ఉండేది. 'వేగి, వేగినాడు' మొదలైన మాటలు సూర్యోదయాన్ని సూచించే 'తూర్పు' (సూర్యుడు తూరి/దూరి వచ్చే దిక్కు)తో సంబంధం గలవే.

సంస్కృతంలో 'ప్రత్యూషం, అహర్ముఖం, కల్యం, ఉషస్సు, ప్రత్యుషస్సు, ప్రభాతం, ప్రాతః(కాలం)' వంటి మాటలు తెల్లవారుజామును సూచిస్తాయి. ప్రత్యుషస్సు, ప్రత్యూషం, ఉషస్సు అనేవాటిలోని మొదటి రెండూ రూపాంతరాలు. వాటిలో మూడోమాట భాగంగా ఉంది. ఉష శ్శబ్దమే మౌలికపదం. ప్రతిదినం ఉండే ఉషస్సు ప్రత్యుషస్సు. అహస్సు అంటే పగలు. పగలు మొదలయ్యే సమయం కాబట్టి అహర్ముఖ మన్నారు. ప్రభ అంటే వెలుగు, కాంతి; అది మొదలయ్యే వేళ 'ప్రభాతం'. కల్య శబ్దానికి కాలానికి సంబంధముందో లేదో తెలీదు.

తెల్లవారగానే పగలు మొదలవుతుంది. ఈమాటకు 'పవలు' అనే రూపాంతరముంది – కావ్యభాషలో. దీనికి సంస్కృతంలోని 'దినం, అహం, దివసం, వాసరం, అహ్నం, అహస్సు, ప్రాహ్ణం' అనేమాటలు పర్యాయపదాలు. దినం, దివసం (దెవసం) అనే మాటలకు తెలుగులో అర్థాలు మారిపోయి 'చచ్చినవారిని తలుచుకొనే రోజ'నే అర్థ వ్యాప్తమయింది – కర్మకాండల ద్వారా. రోజు అనేది పర్షియన్ పదం. ఒక రాత్రీ ఒకపగలూ కలిసిన కాలాన్ని దినమని వ్యవహరిస్తున్నామిప్పుడు – రోజుకు పర్యాయంగా. ఆ అర్థంలో తెలుగుమాట 'పొద్దు' (పూర్వం 'ప్రొద్దు') ఒక్కటే సమానమయింది. పొద్దు శబ్దానికి సూర్యుడనే అర్థంకూడా ఉంది తెలుగులో. ఇలా మొత్తం 'రోజు'ను సంస్కృతంలో విభజించి 'పూర్వాహ్ణం/ప్రాహ్ణం' అని

పొద్దుటిపూటనూ, మధ్యాహ్నమని సూర్యుడు నడినెత్తిన ఉండే సమయాన్నీ, అప్పటినుంచీ రాత్రిదాకా ఉన్న సమయాన్ని 'అపరాహ్ణ'మనీ, కేవలం సాయంకాలాన్ని 'సాయాహ్న'మనీ పిలుస్తారు. మధ్యాహ్నశబ్దానికి సరైన తెలుగుమాట 'పట్టపగలు'.

'రాత్రి'ని చెప్పేమాటలు సంస్కృతంలో చాలా ఉన్నాయి. 'శర్వరి, నిశ, నిశీథిని, త్రియామ, క్షణద, క్షప, విభావరి, తమస్విని, రజని, యామిని, తమి, తమస్సు' వగైరా వీటిలో కొన్ని. 'రజని, యామిని' అనేవాటిని ఆడపిల్లలకు పేర్లుగా కూడా పెడ్తుంటాం. తమి, తమస్సు, తమస్విని – అనేవి చీకటిగా ఉండేవనే అర్థం కలవి. నిశ, నిశీథిని రూపాంతరాలు. త్రియామ అంటే మూడు జాముల సమయం. యామం అంటే 'జాము'. క్షణద అంటే 'క్షణ'మనే కాలవిభాగాన్ని కల్పించేదని అర్థం. విభా అంటే ప్రకాశం. విభావరి ప్రకాశవంతమైన (వెన్నెలగల) రాత్రి. అలాంటి రాత్రిని 'జ్యోత్స్న' అనికూడా పిలుస్తారు (జ్యోత్స్న – అంటే వెన్నెల). కారుచీకటి రాత్రిని తమిస్ర అంటారు. వీటిలో నిశ, రజని, యామిని అనే వాటికి వాడుక ఎక్కువ.

రాత్రి మొదలయ్యే సమయాన్ని 'ప్రదోష'మంటారు. దీన్నే 'రజనీముఖ'మని కూడా పిలుస్తారు. దీనికి సరైన తెలుగుమాట '(ముని)మాపు'. మాపంటే నల్లబడే సమయమన్నమాట. మధ్యరాత్రిని 'అర్ధరాత్రం, నిశీథం' అని పిలుస్తారు. నిశీథానికి నిశీథినికీ ఉన్న భేదం గమనించండి. ఈ అర్థంలో 'నడిరాతిరి, నడి(కి)రేయి, అద్దమరేయి, సరిప్రొద్దు' వగైరా తెలుగు సమాసాలు సమానమైనవి. 'కాందారి మాందారి ప్రొద్దు' అనే పేరుకూడా ఉంది. దీని అర్థవిశేషం తెలీదుకాని దానికి 'కాదారిప్రొద్దు' అనే మరోమాట ఉంది. 'కన్నేరు కాదారి ప్రొద్దున' అనే శ్రీనాథుడి ప్రయోగముంది. కంటికి బాధపుట్టించే వేళ అని అర్థం చెప్పుకోవాలి. తెలుగులోని 'రాతిరి, రేతిరి' అనేవి రాత్రి శబ్దభవాలు. అచ్చం తెలుగుమాట 'రెయి/రేయి' అనేది. దీనికీ 'ఇరులు, ఇనుము, ఎనుము' (అంటే నల్లని) అనే మాటలకూ దగ్గర సంబంధముందని ఇంతకు ముందు గమనించాం.

సాయంత్రం (కొందరు 'సాయంత్రి' అనికూడా పిలుస్తారు) అనేదానికి 'దినాంతం, అపరాహ్ణం, సాయాహ్నం, సాయం' అనే సంస్కృత పదాలూ, 'పూట, పుంట, పురంట' అనే తెలుగుమాటలూ పర్యాయపదాలు. 'సాయం' అన్నదే మూలరూపం. దినాంతమంటే పగటి చివరిభాగం. పూట శబ్దాన్ని 'రోజు'లో సగమనే అర్థంలోనే ఇప్పుడు వాడుతున్నాం. ఒకప్పుడీ మాటకు సాయంత్రమనే అర్థం. 'పుంట, పురంట'లకు కావ్యప్రయోగాలుకూడా తక్కువ.

పగలూ రాత్రీగాని, రాత్రీ పగలూగాని, మధ్యాహ్నం తదితరాలతోగాని కలిసే సమయాన్ని సంస్కృతంలో 'సంధ్య' అనే అంటారు. ప్రాతస్సంధ్య రాత్రికీ పగటికీ మధ్యకాలం. మధ్యాహ్నసంధ్య రెండుపూటలనూ కలిపే వేళ. పగలునూ రాత్రినీ కలిపే వేళ సాయంసంధ్య. వెలుతురు పూర్తిగా ఉండక, పూర్తిగా పోక ఉన్న సమయం సంధ్య. దీనికి సంస్కృతంలో 'పితృప్రసువు, విభాతం, వ్యుష్టం, గోసర్గం' అనే పేర్లుకూడా ఉన్నాయి. పెద్దలు గుర్తుకు వచ్చేవేళ పితృప్రసువు. 'తథాస్తుదేవత'లప్పుడు తిరుగుతుంటారనీ తప్పుమాటలు మాట్లాడకూడదనీ పెద్దవాళ్లు బెదిరిస్తుంటారు. ప్రభాతం తెల్లవారుజామయితే, విభాతం సందెవేళ అనే భేదం

గుర్తించాలి. సంధ్యకు తెలుగులో సరయిన మాటయితే 'మునిమాపు'. పంజ, సందె – అనేవి సంస్కృతభవరూపాలు. గోసర్గం అనేదాన్ని 'గోధూళివేళ' అనికూడా పిలుస్తారు. ఆవులు (నిజానికి పెంపుడు గొడ్లు) ఇంటికి చేరేవేళ అది.

రాత్రింబవళ్లని (మొదటిమాట సంస్కృతం రెండోది తెలుగు) కలిపి చెప్పటం అలవాటయింది తెలుగువాళ్లకు. ఈ రెంటినీ కలిపి 'అహోరాత్ర'మంటారు సంస్కృతంలో. ఇప్పుడు 'దినం, రోజు' అంటున్నాం దీన్నే. నాలుగురాత్రులూ రెండు పగళ్లూ కలిపిన కాలాన్ని సంస్కృతంలో 'పక్షిణి' అంటారు (ఆడపిట్టను కూడా పక్షిణి అంటారు). అనేక రాత్రులకాలాన్ని 'గణరాత్ర'మంటారు. గణమంటే గుంపు. పగలూ మధ్యాహ్నమూ రాత్రీ కలిసిన మొత్తం కాలాన్ని 'త్రిసంధ్య'మంటారు. వీటికి సమానమైన అచ్చతెలుగు మాటలున్నట్లు లేదు.

# ఎండవానలు

తెలుగులోని 'ఎండ' సంస్కృతంలోని 'ఆతపం' సమానార్థకాలు. తపన పుట్టించేది ఆతపం. దీనికి 'ప్రకాశం, ద్యోత' మనేవి పర్యాయపదాలని నిఘంటుకారులు చెప్తారుగానీ ఆ రెంటికీ వెలుగు, వెలుతురు అనే అర్థాలు కూడా ఉన్నాయి. కొద్దిపాటి ఎండకు, 'ఈరెండ, నీరెండ' అనే తెలుగుపేర్లున్నాయి. సంస్కృతంలో వీటికి ప్రత్యేక సమానార్థకాలున్నట్లు లేదు – కించిదాతపం వంటివితప్ప.

ఎండవల్ల పుట్టేది వేడి. దీనికి 'వెచ్చ, వెక్క, వెట్ట, బెట్ట, కరుకు, రుటం, చురుకు, తీండ్ర(ం), ఉడుకు, సెక, ఉబ్బ, ఉమ్మ(రం), ఆవి, ఉక్క, వేడిమి' వంటివి పర్యాయపదాలని కోశకర్తలు చెప్పారు. సెక అనేది శిఖా శబ్దభవం. ఆవి అనే మాటకు ఊపిరి అనే అర్థం కూడా ఉంది. 'ఆ సుయోధను ముక్కులో ఆవి కలుగ' సూదిమొన మోపినంత భూమిని కూడా ఇవ్వనన్నాట్ట. ఉక్క, ఉమ్మ(రం), ఉబ్బ, అనేవి రూపాంతరాలు. ఎండ వల్ల కలిగే తాపాన్ని సూచించే మాటలుగానే వీటిని వాడుతున్నాం. అలాంటివే బెట్ట, వెట్ట, ఉడుకు అనేవి కూడా. రుటమేమిటో తెలీకుండా ఉంది. చురుకు, తీండ్ర(ం), కరుకు అనేవి 'తీవ్రత'ను సూచించే విశేషణాలు కూడా.

తిగ్మం, తీక్ష్ణం, ఖరమనే సంస్కృతపదాలు వేడికి పర్యాయపదాలు. వీటిని విశేషణాలుగా కూడా వాడవచ్చు – 'తీవ్ర' మనే అర్థంలో. తెలుగులో కొద్దిపాటి వెచ్చదనాన్ని 'గోరువెచ్చన, నులివెచ్చన, తనివెచ్చన' అనే మాటలతో వివరించవచ్చు. గోరు శబ్దానికి 'కొద్దిపాటి, చిన్న' మొదలైన అర్థవిశేషాలు కూడా ఉన్నాయి (ఉదా: గోరుచిక్కుడు). వీటికి పర్యాయాలుగా 'కోష్ణం, కదుష్ణం, కవోష్ణం, మందోష్ణం' అనే సంస్కృతపదాలున్నాయి. గోరు, నులి, తని – అనే వాటిలాగానే 'మంద' అనేది కూడా విశేషణభాగం. ఉష్ణమనేదే ప్రధాన నామవాచక రూపం.

ఎండ సూర్యప్రసాదమైతే వెన్నెల చంద్రుడిచ్చేది. 'వెల్' అనే భాగానికి 'తెల్లని' అని అర్థమనీ నెల (చంద్రుడు) ఇచ్చే తెల్లటి వెలుగును వెన్నెల అంటారనీ పండితులు వివరిస్తుంటారు. నిజానికి ఇది తప్ప మరోమాట తెలుగులో ఈ అర్థంలోలేదు. కొందరు 'రేయెండ' (అంటే రాత్రికాసే ఎండ) అనేమాట ఉన్నదంటారుగానీ దానికి పూర్వకావ్యాల్లో 'ఎండ, కొద్దిపాటి ఎండ' అనే అర్థాల్లో కూడా ప్రయోగాలున్నాయని మరికొందరంటున్నారు. పూర్వం 'వెన్నెల' అనేమాటను వేశ్యాకులంలో పేరుగా పెట్టేవాళ్ళు. కానీ ఈ కాలంలో దీని సంస్కృత పర్యాయపదాలు మూటినీ ఆడపిల్లలపేర్లుగా పెడ్తున్నారు. అది చంద్రిక, జ్యోత్స్న, కౌముది – అనేవి. వీటిలో చివరిదానికి అలాంటి వాడుక తక్కువ. చంద్రుడిచ్చే వెలుగు కాబట్టి చంద్రిక అన్నారు. కుముదాలకు (నల్లకలువ పూలకు) ఆనందం కల్గించేది కాబట్టి కౌముది అనే పేరు వచ్చిందిట. చంద్రుడుదయిస్తే కలువలు వికసిస్తాయనే 'కవిసమయం' (కవులు వాడే సంకేతం) పూర్తిగా నిజంకాకపోయినా అలవాటు బలిమిని అపటం కష్టం కాబట్టి నమ్మకం పెరిగిపోతున్నది. జ్యోత్స్న శబ్దానికి వెలుగనే అర్థం. కొందరు కవులు సాగదీసి దీన్ని 'చంద్రాతపం' అనికూడా అంటున్నారు. ఆతపానికి ఎండ అనే అర్థమనుకొన్నాంకదూ!

తెలుగువారి వాడుకలో ఎండ, వెన్నెలలుకాక 'ఎండవానలు' వ్యతిరేకార్థకాలు. అసలు మబ్బుపడితేనే మనవాళ్ళు 'దుర్దిన'మని భావించేవాళ్ళు పూర్వం. 'వృష్టి, వర్షం' అనేమాటలు వానకు పర్యాయాలైన సంస్కృతపదాలు. వర్ష శబ్దానికి 'సంవత్సరం, దేశం' వగైరా విశేషార్థాలున్నాయి. (ఉదాహరణకు పదివర్షాల వయస్సు, భారతవర్షం). వృష్టి శబ్దానికి 'రాలేది, పడేది' అని అర్థం. తెలుగులో 'వాన' అన్నదే మౌలికపదం. ఎడతెరపిలేకుండా ఏనుగు తొండాంలాంటి ధారలతో పడ్డవానను 'జడి' అంటారు. అంతవానకు ఇంత చిన్నపేరా అని కొందరు 'జడివాన' అని పిలుస్తారు. దీనికి సమానార్థకమైన సంస్కృతపదం 'ఆసారం'.

వానల్లో చాలా రకాలున్నాయి. కొద్దిపాటి వర్షమయితే అచ్చతెలుగులో 'పసపస, ముసురు' అంటారు. మొదటిమాటకు వాడుక తక్కువ. 'ధార'గా వానకురుస్తుంటే దాన్ని 'సోన, తూర, జల్లు' అంటారు. వాననీటి చుక్కను 'చినుకు' అంటారు. తుప్పరగా మాత్రమే పడుతుంటే దాన్ని 'బొట్టు, తుంపర' అంటారు. పెద్దవానను సంస్కృతంలో 'కుంభవృష్టి' అనీ తెలుగులో 'కుండపోత(వాన)' అనీ పిలుస్తారు. పొగమంచు వ్యాపించినట్లు కురిసిన వానను 'తుట్ర, తూరవాన' అంటారు. వాన కురిసివెలిసిన తరువాత కారే చూరునీళ్ళను 'వంగుళ్ళు, నట్లొట్లు' అంటారు అచ్చ తెలుగులో. అయితే ఈ రెండు మాటలకు ఇప్పుడు వాడుకఉన్నట్లు లేదు.

తెలుగులో 'మంచు' శబ్దానికి 'ఇనం, ఇగం, ఈము' అనే రూపాంతరాలే పర్యాయపదాలని చెప్పాలి. సంస్కృతంలో 'తుషారం, హిమం, తుహినం, ప్రాలేయం, మిహిక, మహిక, నీహారం, ఉపశ్యాయం' వంటి మాటలున్నాయి పర్యాయార్థంలో. ఆర్యసమాజం తొలుత మంచుకొండల్లో బతికింది. కాబట్టి ఇన్నిపేర్లు పెట్టుకుందేమో! వీటి వ్యుత్పత్తులు స్పష్టంగా తెలీవుకాబట్టి, ఏ విశేషార్థంలో ఏ మాటను వాడాలో ఏది సరైనదో చెప్పటం కష్టం. తెలుగులో 'గూడమంచు, పొగమంచు' వంటి సమాసాలు

లేకపోలేదు. అయినా దక్షిణాదివాళ్లకి మంచు అంతగా అందుబాటులో లేదనేది వాస్తవం.

మంచువల్లగాని, గాలివల్లగాని వచ్చే చల్లదనాన్ని 'చలి' అంటాం. అందువల్ల వణుకుపుట్టవచ్చు. చలికి 'చలిమిడి, జలుబు, సీతు, చలువ, ఇవకం, ఇవతాలింపు' వంటి పర్యాయపదాలున్నాయి. చలి, చలిమిరి, చలువ/చలవ అనే వాటికి చాలా దగ్గరి సంబంధం వుంది. ఇవకానికి, ఇవాకానికి (హిమానికీ) పోలిక ఉంది. జలుబుకు ఇప్పటి అర్థం పరిమితం. పూర్వం చలినీ చల్లదనాన్నీ ఆమాటతోనే సూచించేవాళ్లు. సంస్కృతంలో 'శీతం, శీతలం, శైత్యం, సుశుమం, సుషిమం, శిశిరం, జడం, తుషారం' అనే పర్యాయపదాలున్నాయి. వీటిలో తుషారం మంచనే అర్థంలో కూడా వాడేది. సీతు అనే తెలుగుమాట శీతం నుంచి పుట్టింది. మంచుకు నీళ్ళు గడ్డగట్టాయి కాబట్టేమో 'జడ' మనే పేరు కూడా వచ్చింది చల్లదనానికి. మన రాష్ట్రంలో కొబ్బరిమానె గడ్డగట్టడమే విశేషం.

# చప్పుళ్లు

మబ్బులనూ మెరుపులనూ తలచుకొన్నప్పుడే ఉరుములనూ పిడుగులనూ ప్రస్తావించవలసింది. పోనీ ఇప్పుడుచూద్దాం. నిజానికి ఉరుముకు పర్యాయపదమైన మరో తెలుగుమాటే ఉన్నట్లు లేదు. పెద్దగా మాట్లాడినా అరిచినా కూడా ఉరిమినట్లే లెక్క తెలుగులో. గుడ్లురిమిచూడటం కూడా కద్దు. సంస్కృతంలో 'స్తనితం, గర్జ(న), గర్జితం, రసితం' అనే పర్యాయపదాలున్నాయి. గర్జ, గర్జన, గర్జితం అనేవి సింహోదులు పెట్టే కేకలక్కూడా వర్తిస్తాయి. స్తనితమొక్కటే ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట.

పిడుగుకూడా ఒంటిగంట రామలింగంలాంటి తెలుగుమాటే. దానికీ మరో పర్యాయపదం తెలుగులో కనిపించదు. సంస్కృతంలో రెండురకాల పర్యాయ పదాలున్నాయి: 'హ్రాదిని, స్వరువు, శంబం' అనే కేవలధ్వనిసూచకాలూ, ఇంద్రుడి ఆయుధమనే విశ్వాసానికి చిహ్నాలయిన 'వజ్రం, కులిశం, భిదురం, దంభోళి, అశని, పవి, శతకోటి' అనేవీ. హ్రాదం (భయం) పుట్టించేది కాబట్టి హ్రాదిని. చప్పుడుగా ఉండేదికాబట్టి స్వరువు. శంబ శబ్దానికీ శంపా శబ్దానికీ ధ్వనిసాదృశ్యముంది. బహుశా మెరిసిన తరువాత వినిపించే దనే మూలార్థముందేమో తెలీదు. బద్దలుకొట్టేదికాబట్టి భిదురమనేమాట పుట్టింది. నూరంచులున్న (ఆయుధం) కాబట్టి శతకోటి అనే పేరు వచ్చింది.

ఉరుములూ పిడుగులూ పెద్దచప్పుడు చేస్తాయి. ఆ చప్పుడుకు తెలుగులో 'మ్రోత, మోత, రవళి, నాదు, మ్రోగుడు, వాగుడు, సద్దు, ఉలివు, అలికిడి, అలుకుడు, కూత, రంపు, రంపి, రంత, క్రందు' మొదలైన పర్యాయపదాలున్నాయి. మ్రోత, మోత, మ్రోగుడు అనేవి మూడూ మోగు (చప్పుడు చేయు) అనే క్రియాపదం నుంచి పుట్టిన నామవాచకాలు. మోత సాధారణపదం. రవళి అనే

మాటను మామూలుగా 'అందెలరవళి' వంటి సమాసాల్లో వాడ్తుంటాం. గజ్జెల చప్పుడు, గాజుల చప్పుడు మొదలయిన సుకుమారధ్వనుల విషయంలో రవళి శబ్దాన్ని వాడ్తాం. నాదు అనేది సంస్కృతంలోని నాదశబ్దభవం. వాగుడు మామూలుగా ఎడతెరపిలేని నోటిమాటల చప్పుడుకే అన్వయిస్తుంది. సద్దు అనేది శబ్దమనే సంస్కృతపదం నుంచి పుట్టినమాట. పక్షులుచేసే చప్పుడును ఉలివు అంటారు. దీనికి పూర్వకావ్యాల్లో మాత్రమే ప్రయోగం కనిపిస్తుంది. అలికిడి, అలుకుడు రూపాంతరాలు. ఇవి అడుగుల చప్పుడు, ఏ పొదల్లోనో దాక్కుంటున్న జంతువులకదలిక వగైరాలను సూచించడానికి వాడే మాటలు. కూత సాధారణంగా పిట్టలకు అన్వయించి చెప్పేమాట – కొన్ని సమయాల్లో మనుషులక్కూడా. పోట్లాటల్లో పెద్దగా అరుస్తూ చేసే ధ్వనికి రంపి, రంపు అనే రూపాంతరాలూ, రంతు అనే మరోమాటా అన్వయిస్తారు.

అలుకుడు అనే మాటను 'ఏడ్పు' అనే అర్థంలోకూడా వాడుతారు. పక్షులుగాని, ఆడపిల్లలుగాని సన్నసన్నగా నవ్వుతూ చేసే కలకల ధ్వనికి తెలుగుమాటలు అలబలం, హాళాహాళి అనేవి సమానార్థకాలు. మద్దెలమోతను ప్రత్యేకించి 'దిముకు, గొలక, గొల్ల, గొల్లు' అనే మాటలతో సూచిస్తారు. రొద అనేది చెవికింపుగాని చప్పుడు. ఇలా ప్రత్యేకార్థాల్లో వాడేమాటలనేకమున్నాయి తెలుగులో. కాకపోతే అభ్యాసంగాని, వాటికి ప్రత్యేకమయిన అర్థాల్లోనే మాటలనువాడాలనే పట్టుదలగాని లేనందున 'సర్వం జగన్నాథ'మన్నట్లు ఏదో ఒక పదాన్ని వాడి అదే సరయిందని సంతోషిస్తుంటారు. అది మానవబలహీనత. మానవులను వదిలిపోదు.

మోతకు పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృతపదా లనేకమున్నాయి. 'శబ్దం, ధ్వని, నినదం, నినాదం, స్వనం, స్వానం, నిస్వనం, నిస్వానం, రవం, రావం, ఆరవం, ఆరావం, సంరావం, విరావం, ధ్వానం, నిర్ఘోషం, నిర్హ్రాదం, గర్జ(నం)' వగైరాలు. చాలా మాటల్లో 'న'కారం ఎందుకుందో, 'ర' ఎందుకుందో చెప్పలేం. శబ్దం, ధ్వని అనేవీ, రవం అనేదీ ఎక్కువవ్యాప్తిలో ఉన్నమాటలు. 'నినదం, నినాదం', 'స్వనం, స్వానం', 'నిస్వనం, నిస్వానం', 'రవం, రావం', 'ధ్వని, ధ్వానం' అనేవి అన్యోన్యం రూపాంతరాలు. 'ఆ, సం, వి' అనే ఉపసర్గలు చేర్చి 'రావ' శబ్దాన్ని పర్యాయరూపాలతో వాడుతున్నారనికూడా గమనించాలి. నిర్ఘోష శబ్దాన్ని ఉరుమునూ, పిడుగుపాటునూ వర్ణించేటప్పుడు కూడా వాడ్తారు – నిర్హ్రాదాన్ని లాగానే. స్వనం, స్వానం, నిస్వానంలాంటి మాటల్లో మృదుత్వంగల ధ్వని అనే సూచన ఉంది. ఆరావం, సంరావం, ఆరవం వంటి వాటిలో ధ్వనితీవ్రత సూచితం– మాధుర్యం లేదనేభావంతోబాటు.

గుడ్డలచప్పుడు, ఆకుల కదలిక వగైరా ధ్వనులను సూచించటానికి 'మర్మరం' అనే శబ్దాన్ని ప్రయోగిస్తారు. నగల చప్పుడును సూచించటానికి 'శింజ, శింజితం' అనే రూపాంతరాలను వాడ్తారు. వాద్యాల ధ్వనిని 'నిక్వణం, నిక్వాణం, క్వాణం, క్వణం, క్వణనం' అనే రూపాంతరాలతో సూచిస్తారు. వీణ, వాయులీనంవంటి వాటి ధ్వనులను 'ప్రక్వాణం, ప్రక్వణం' వంటి మాటలతో వర్ణిస్తారు. పదిమంది (జనం) చేరి గుసగుసలుగా మాట్లాడుకున్నా పుట్టేచప్పుడును 'కలకలం' అంటారు; అది కొంచెం

పెద్దగా ఉంటే 'కోలాహల'మంటారు. పశుపక్షులు చేసే చప్పుడును 'రుతం, వాశితం' అంటారు. కోకిలాదుల 'రుతి'ని 'కూజిత'మంటారు. ఎంతోమధురంగా ఉండి వినగానే పులకరింత పుట్టించే ధ్వని అయితే 'కాకలి' అంటారు. ఇవన్నీ సంస్కృతపదాలు. తెలుగులో వీటిని సొంతం చేసుకొన్నాం-ఏనాడో

# భూమి సముద్రాలు

తెలుగులో 'భూమి' శబ్దానికి స్పష్టమైన పర్యాయపదాలు రెండు–నేల, మన్ను–అనేవి. మనం, మనతోబాటు సమస్త చరాచర వస్తువులూ నిలవడానికి ఆధారమయింది కాబట్టి 'నేల' అన్నారు. నిలు(చు) అనే క్రియాపదానికీ దీనికీ చాలా దగ్గర సంబంధముంది. మను/మన్ను అనే క్రియకూ, మన్నిక అనే నామపదానికీ సంబంధించినమాట మన్ను. మన ఉనికికీ బతుక్కూ ఆధారభూతమైంది కాబట్టి 'మన్ను' అని భూమిని పిలుస్తున్నాం. మంటి, మట్టి అనేవి బహుశా దీని ఔపవిభక్తిక రూపాలయి వుండవచ్చు. పృథ్వీ అనే సంస్కృత శబ్దంనుంచి 'పుఢవీ' అనే ప్రాకృతరూపం ఏర్పడిందనీ, దాన్నుంచి పుట్టిన 'పుడమి' అనేది 'అచ్చ' తెలుగనే వ్యాకరణాలు చెప్తాయి. భూ శబ్దంనుంచి ఏర్పడ్డది బువి అనేమాట. కవులు సృష్టించుకొన్నమాట 'పంటవలంతి' – బాగా పంటలు పండే చోటనే అర్థంలో. పంటల్లేకపోయినా, అవి ఎండిపోయినా ఈ మాటను నిర్దాక్షిణ్యంగా వాడేస్తుంటారు కొందరు. ఇవి తెలుగుమాటలు.

సంస్కృతంలో చాలా పర్యాయపదాలున్నాయి. అవి రెండు రకాలు. ఏవో కొన్ని ప్రత్యయాల్లో మార్పులతో ఉన్న మూలపదాలు ఒకరకం. వర్ణనాత్మకంగా ఉండేవి మరోరకం. 'ఇల, భూమి, అచల, అనంత, రస, స్థిర, ధర, ధరణి, ధారణి, ధారుణి, ధరిత్రి, క్షోణి, జ్యా, క్షితి, ఉర్వి, గోత్ర, కు, పృథివి, పృథ్వి, క్ష్మా, క్షమ, అవని, మేదిని, మహి, విపుల, ధాత్రి, జగతి' అనేవి మొదటిరకం మాటలు. విశ్వంభర, రత్నగర్భ, వసుంధర, సర్వంసహ, వసుమతి, వసుధ, గహ్వరి, భూతధాత్రి, అబ్ధిమేఖల వగైరాలు రెండో రకానివి.

స్థిర, ధర, ధరణి, ధారుణి, ధరిత్రి – అనే మాటల్లోని ప్రధానార్థం కదలకుండా ఉండేది, 'జీవరాసులను ధరించేది/మోసేది' అనే భావం. ధారుణి అనే రూపం సంస్కృత కవుల వాడుకలో కనిపించదు గాని తెలుగు కవులు నన్నయ కాలంనుంచీ మార్చుడానికి వీల్లేని యతిస్థానాల్లో బిగించి వాడేశారు. భూమి అంటే చాలా పెద్దది అని అర్థం. భౌమం అనేమాటకు భూమికి సంబంధించిన, చాలా పెద్దదైన అనే రెండర్థాలూ ఉన్నాయి. భూమిని లాటిన్లో terra firma అంటారు స్థిరంగా ఉండేదనే అర్థంలో. పృథివి, పృథ్వి శబ్దాలు రూపాంతరాలు. వీటికి 'పృథు' (అంటే చాలా పెద్దదైన) అనే విశేషణంతో సంబంధమున్నా పురాణాలు 'పృథు' చక్రవర్తికీ భూమికీ ముడివేసి కథలల్లాయి. అలాగే 'ఉరు' (గొప్ప, పెద్ద) అనే విశేషణానికి 'ఉర్వి'కీ దగ్గరి చుట్టరికముంది. అచలమంటే కదలనిది. భూమి కదలదనీ సూర్యచంద్రాదులు

దానిచుట్టూ తిరుగుతుంటారనీ విశ్వసించిన కాలంలో ఈమాట పుట్టింది. కొండ అనే అర్థంకూడా ఈ మాటకుంది.

అనంతమంటే అంతులేనిది. చాలా విశాలమైనది అనే అర్థంలో ఈ పదం భూమికి పర్యాయపదమయింది. అవనమంటే రక్షణ. జనానికి నిలవనీడనిచ్చి రక్షించేది కాబట్టి అవని అన్నారు. మహత్తంటే గొప్పది. 'మహా' అనే అవ్యయానికీ మహీ శబ్దానికీ చుట్టరికముంది. విపుల అంటే విశాలమయింది. విపుల శబ్దాన్ని విశేషణంగా కూడా వాడుతారు. ధాత్రీ శబ్దానికి పోషించేది, ధరించేది అని అర్థం. పాలిచ్చే దాది అనే అర్థవిశేషం కూడా ఈ మాటకున్నది. జగత్తు, జగతి అనేవి రూపాంతరాలు. ఈ మాటలకు భూమి అనే అర్థంతోబాటు ప్రపంచమనే విశేషార్థంకూడా ఉంది. తిరిగేది అనే విశేషణార్థం లేకపోలేదు. మేదుడనే రాక్షసుడి మెదడు ఇలా భూమిగా మారిందనే పురాణగాథ ప్రకారం మేదిని అనే మాట పుట్టింది. క్షమ, క్ష్మా అనే శబ్దాలకు 'ఓర్పుకలది' అని అర్థం. భూదేవంత ఓర్పనే నానుడి ఉండనే ఉంది. ఏ భూకంపమో వచ్చినప్పుడు తప్ప ఈ మానవజాతిని ఓర్పుగా మోస్తున్నది కాబట్టి క్షమ అన్నారు. దాని రూపాంతరం క్ష్మా.

ఇలా శబ్దానికీ ద్రావిడ భాషల్లోని 'ఇల్, నిల్' అనే ధాతువులకూ సంబంధముందని కొందరంటారు. ఏడు అధోలోకాల్లోనూ ఒకటైన 'రసాతలానికీ' భూమికీ 'రస' అనే ఒకే పేరుండటం ఆశ్చర్యం. దీన్నిబట్టి రసాతలం కూడా భూమిలో ఒక ప్రాంతమేమోనన్న అనుమానం రావచ్చు. రస శబ్దానికి ఇంకా చాలా అర్థాలున్నాయి. అది వేరే విషయం. కుభృత్ వంటి శబ్దాలనుంచి విడదీసి ఏర్పరిచిన ఏకాక్షర శబ్దమేమో 'కు' అనేది. కొందరీమాటకూ ఇంగ్లీషులోని 'cow', సంస్కృతంలోని 'గౌః' అనే మాటలకూ ముడివేసి ఆర్య సంప్రదాయంలో భూమికీ ఆవుకూ ఉన్న అన్యోన్యసంబంధాన్ని గురించి ఉపన్యసించక పోలేదు. ఈ అర్థాల సంగతి ఎలాఉన్నా భూశబ్ద పర్యాయపదాలు తెలుగులో పద్యాలు రాసిన కవులకు పాదపూరణార్థం బాగా పనికి వచ్చేవని చెప్పాలి.

వసుధ, వసుంధర, వసుమతి అనే మాటలు భూమినుంచి వసువులు (రత్నాలు) దొరుకుతున్నాయని గ్రహించిన తరవాత పెట్టిన పేర్లు అని చెప్పవచ్చు. ఆడపిల్లలకు పేర్లుగా కూడా వీటి ఉపయోగం స్మరించదగ్గదే. రత్నగర్భ అంటే కడుపులో రత్నాలు దాచుకున్న స్త్రీ. భూమిని స్త్రీమూర్తిగా భావిస్తాం కాబట్టి భూమిని రత్నగర్భ అన్నాం. రత్నగర్భుడు అని పుంలింగరూపం చేశామో సముద్రుడయిపోతాడు. భూమిలో సముద్రంలో రత్నాలు దొరుకుతాయని తెలుసుకొని పెట్టిన పేర్లవి.

విశ్వంభర, సర్వంసహా అనేవి భూమి లక్షణాలనుబట్టి పెట్టిన పేర్లు. విశ్వాన్ని – ప్రపంచాన్ని భరించేది విశ్వంభర. సర్వం – అన్నిటినీ, అంతటినీ – సహించేది సర్వంసహా. గహ్వరమంటే గుహ, అడవి. కొండల్లో ఉండే గుహలనుబట్టి కాక భూమిపైనుండే అరణ్యాలనుబట్టి దానికి గహ్వరి అనే పేరు వచ్చిఉంటుంది. సమస్త చరాచర జీవరాశికీ భూతాలకూ – కన్నతల్లి వంటిది కాబట్టి భూమిని భూతధాత్రి అన్నారు. ఇవన్నీ వర్ణనాత్మక నామధేయాలు.

భూమిని తల్లిగా భావించటం మన సంప్రదాయం. జర్మనులు తండ్రిగా భావిస్తారు. అందుకే మనం mother land అంటుంటే వాళ్లు father land అని మాతృభూమిని అంటే స్వదేశాన్ని పిలుస్తారు. ఈ భూమినే కాళిదాసాదులు రాజులకు 'భార్య'గా పరిగణించారు. ఆలెక్కన చరిత్రగతిలో ఎందరు రాజులైనారో మన 'తల్లిభూమి' (రాయప్రోలువారి మహత్తర ప్రయోగం) అందరికీ భార్య అయింది. అది మన దౌర్భాగ్యం.

సముద్ర శబ్దానికి పర్యాయపదమని చెప్పదగిన ఒకేఒక అచ్చ తెలుగుమాట 'కడలి'. కడ అంటే చివర, అంచు. ఎంతో దూరందాకా ఉన్నదనే అర్థంలో బహుశా కడలి శబ్దం పుట్టివుండవచ్చు. సంద్రమనే తద్భవ పదం సముద్ర శబ్దం నుంచి పుట్టింది. తెలుగు కవులు సృష్టించుకొన్న ప్రాయేరు, మున్నీరు అనే సమాసాలను కూడా నిఘంటువులు కడలి పర్యాయాలుగా పరిగణిస్తాయి. ప్రా అనేది 'ప్రాత' శబ్దానికి సమాసాల్లో వచ్చే రూపాంతరం. 'పాతకాలపు ఏరని' పిండితార్థం. మున్ – అంటే మొదటి, తొలికాలపు. సృష్టికి మొదటిదనీ, సృష్టి అక్కడే (సముద్రంలోనే) మొదలయిందనీ భావించి కల్పించిన మాట మున్నీరు. ఎంతో విశాలమైన సాగరతీరమున్న తెలుగువాళ్లు కడలి అనే ఒక్కమాటతోనే సముద్రాన్ని పిలిచే వాళ్లన్నమాట. చిత్రమేమరి.

సంస్కృతంలో చాలా పేర్లున్నాయి. 'సముద్రం, అబ్ధి, అకూపారం, పారావారం, సరిత్పతి, ఉదన్వంతుడు, ఉదధి, సింధువు, సరస్వంతుడు, సాగరం, అర్ణవం, రత్నాకరం, జలనిధి, జడనిధి, యాదఃపతి, అపాంపతి' మొదలైనవి చాలావరకు వర్ణనాత్మకాలయిన పేర్లే. అప్ – అంటే నీరు. ఆ నీరు నిండినచోటు కాబట్టి అబ్ధి అన్నారు. పారం అంటే అవతలి ఒడ్డు. అవారం అంటే ఇవతలి ఒడ్డు. పారావారం అంటే రెండు ఒడ్ల మధ్యా ఉన్నదని అర్థంట. నిజానికి ఇటూ అటూ ఒడ్డు లేకుండా ఉండే ప్రవాహంగాని పడియగాని ఉండదు గాని ఎందుకుపెట్టారో సముద్రాని కీపేరు పెట్టారు. పారంగతుడు మొదలైన పదాల్లో అవతలి ఒడ్డు చేరినవాడనే అర్థం. అంటే అంతా తెలిసిన వాడని భావార్థం. అకూపార శబ్దానికి విష్ణుమూర్తి రెండో అవతారమైన తాబేలనే అర్థం కూడా ఉంది. సదరు తాబేలు మునిగి అడుగునుంచి వేదాలను బయటికి తెచ్చిందిట. ఇది పురాణగాథ. సముద్రం, తాబేలు అనే రెండర్థాలకూ ఒకేమాట ఎలా పొసగిందో ఆ పదాన్ని సృష్టించిన వాళ్లకే తెలియాలి.

## వ్యుత్పత్తులు

ఈ సందర్భంలో 'వ్యుత్పత్తు'లను గురించి రెండుమూడు మాటలు ప్రస్తావించటం సమంజసమనిపిస్తుంది. క్రీస్తుపూర్వం 1500 నాటి యాస్కాచార్యుడి నిరుక్తంలో చాలా మాటలకిచ్చిన వ్యుత్పత్తులు గమ్మత్తుగా ఉంటాయి. హింస చేస్తుంది కాబట్టి అక్షరాలు తిరగబడి సింహమయిందట. అంతకన్నా క్రూరమైన పెద్దపులి కెందుకీపేరు రాలేదో చెప్పలేం. 'నరః వా' మనిషేమో అనిపిస్తుంది కాబట్టే వానరం (అంటే

కోతి) అనే మాట పుట్టిందట. ఈ రకం పట్టు ల్యాటిన్ గ్రీకు పండితులు కూడా ప్రదర్శించారు. లిథోస్ అంటే రాయి. లిథ్ అంటే పరిగెత్తటం. రాయి పరిగెత్తదు కాబట్టి అలా పేరు వచ్చిందన్నారు! ఇలా ప్రతిమాటకూ 'వ్యుత్పత్తి' చెప్పటం పండితుల కోవినోదం అయింది. చెప్పే వ్యుత్పత్తులు పొసగుతాయో లేదో వారికి అక్కరలేదన్నమాట. తెలుగుమాటలకు సంస్కృత వ్యుత్పత్తులు చెప్పినవారున్నారు. వేంకట అనే తెలుగుమాట, వేంగడ అనే తమిళపదం 'పెద్దపులి' అనే మూలార్థం కలవి. ఆ మాట సంస్కృతమని 'వేం పాపాన్ కట తీతి వేంకటః' – అంటే 'పాపాలను (వేం) ఖండించే (కట)వాడ'ని వ్యుత్పత్తి చెప్పారు. రామాయణంలోని 'సుందరకాండ'కు ఆ పేరెందుకు వచ్చిందో ఆలోచించి ఎవరో 'సుందరో హనుమాన్ జ్ఞేయః' అనేనిఘంటువు(!) చెప్పి హనుమంతుడికి సుందరుడు (అనగా చక్కనివాడు) అనే పేరుండ కాబట్టి లంకాదహనం వగైరా కథాభాగమున్న ఆ కాండకు సుందరకాండ అనే పేరు వచ్చిందన్నారు! అవునంటారా?

ఇలా వ్యుత్పత్తి శాస్త్రం (Etymological Science) అనేది ప్రపంచ వ్యాప్తంగా వెర్రితలలు వేసిన మీదట వోల్తెయిర్ అనే ఫ్రెంచి విద్వాంసుడు ఆ శాస్త్రానికి చిత్రమైన నిర్వచనం చెప్పాడు. ఏమనంటే – "వ్యుత్పత్తులు చెప్పటం ఒక శాస్త్రం. అందులో అచ్చులకు విలువలేదు. హల్లులకు ఉన్నట్లూ లేదు" అని! ఈ రెండూ లేని మాటలుండవు కాబట్టి ఆ శాస్త్రానికే విలువలేదని ఆయన వెక్కిరింత. అందుచేతనే స్పష్టంగా అనుమానరహితంగా ఉన్న సందర్భాల్లో తప్ప కరాఖండిగా ఇదే వ్యుత్పత్త్యర్థమని చెప్పటానికి సాహసించటం లేదు. కొన్ని ఇంచుమించు సమానంగా ఉండే ధ్వనులున్న అర్థాలున్న మాటలను పోల్చి వాటిలో ఈ భాగానికి ఇది బహుశా అర్థమై ఉంటుందని ఊహించటం క్షేమం. పాఠకులు క్షమించాలి.

## నదులూ నీళ్ళు

సరిత్తంటే నది. నదులకు (అవి స్త్రీలు) సముద్రుడు (ఒకే ఒక మగవాడు) భర్త కాబట్టే సరిత్పతి అన్నారు. యాదఃపతి, అపాంపతి అనే మాటలీలాంటివే. ఉదన్వంతుడు, ఉదధి, జలనిధి, జడనిధి అనే మాటలకు నీళ్లు నిలవవున్నచోటు అని అర్థం. సింధు శబ్దానికి నది, సముద్రం అనే రెండర్థాలూ ఉన్నాయి. ఆర్యులెరిగిన చాలా పెద్దనది (సముద్రమంత నది!) కాబట్టే నదిని సముద్రంతో సమానమన్నారేమో! రత్నాలు దొరికేచోటు కాబట్టి రత్నాకరం (ఆకరం అంటే స్థానం) అన్నారు. సరస్వంతుడనే మాట కూడా నీరు నిండినవాడనే భావంతో పెట్టిన పేరే. సగరుడి కొడుకులు పాతాళందాకా తవ్వినీరు నింపిన చోటు కాబట్టి సాగరమనే పేరు వచ్చిందని పురాణాలు చెప్తాయి. అర్ణమంటే నీరు. అది నిండావున్నచోటు అర్ణవం. దాన్ని అర్ణోరాశి (అంటే నీటికుప్ప) అనికూడా పిలిచారు. ఏతావతా సముద్రమొక్కటే వర్ణనాత్మకంకాని పేరని చెప్పాలి.

పాలసముద్రం (క్షీరోదధి), పెరుగు సముద్రం (దధ్యోదధి), నెయ్యి సముద్రం (ఘృతోదధి), చెరుకు సముద్రం (ఇక్షూదధి), కల్లు సముద్రం (సురోదధి), మంచినీటి సముద్రం (స్వాదూదధి) అని సప్తసముద్రా లున్నాయట. ఇప్పటి 'అట్లాసు'ల్లో అవి కనిపించవు. కనీసం ఆ చివరి రెండూ బయటపడితే మన సమస్యలు చాలా తీరిపోతాయి!

నీటికి నీరు అన్న ఒక్కటే నిజమైన తెలుగుమాట. కొందరు దావి (నీళ్లు అనే) బహువచనరూపాన్నే వ్యవహరిస్తారు. ఇదే మాట సంస్కృతంలోకి 'నీరం' అనే రూపంలో ప్రవేశించింది. నీరాగారమని (అంటే నీటి ఇల్లు అని) సముద్రాన్ని పిలుస్తారు సంస్కృతంలో. మనకున్న ఒక్కమాటనూ సంస్కృతం సంగ్రహించినందుకు సంతోషదుఃఖాలు రెండూ అనుభవించాలేమో!

సంస్కృతంలో 'అప్, ఆపస్సు, వారి, సలిలం, జలం, కమలం, పయస్సు, కీలాలం, అర్ణం, అమృతం, జీవనం, భువనం, వనం, కబంధం, ఉదకం, పాథస్సు, పుష్కరం, సర్వతోముఖం, అంభస్సు, అంబువు, శంబరం, సంవరం, మేఘపుష్పం, ఘనరసం, రసం, కృపీటం, కాండం, జీవనీయం, కుశం, విషం' లాంటి (కొన్ని) పరస్పర విరుద్ధార్థాలున్న పర్యాయపదాలున్నాయి. వీటిలో 'సలిలం, జలం, ఉదకం' అనే మూడుమాటలే ఎక్కువ వాడుకలో ఉన్నవి. తక్కినవాటికి పుస్తకాలూ, కవులు ఆధారం.

నీరులేనిదే బతకటం దుర్ఘటం. మొదట గాలి, తరవాత నీరు మన ప్రాణాలు నిలుపుతాయి. ఆ మీదనే ఆహారం. ఈ సంగతి ఆదికాలం నుంచీ అందరికీ తెలుసు కాబట్టే నీటిని 'జీవనం, జీవనీయం, అమృతం' అని పిలిచారు. బతుకే నీటిమీద ఆధారపడ్డది కాబట్టి నీటిని జీవనం అన్నారు. బతికించేది కాబట్టి జీవనీయం. చావుతప్పించేది కాబట్టి (కొంతకాలమయినా) దాన్ని అమృతమన్నారు. బహుశా తియ్యనీటినే అమృత మనిఉంటారు. భువన శబ్దానికి లోకం, ప్రపంచమనే అర్థాలు కూడా ఉన్నాయి. ఈ సృష్టికే నీరు ప్రథమాధారం కాబట్టి నీటినే భువనమన్నారు. కాళిదాసు అభిజ్ఞానశాకుంతలం నాందీశ్లోకంలోనే 'యా సృష్టిః స్రష్టురాద్యా' అని స్మరించాడు ఈ దృష్టితోనే. అదే దృష్టితో రసమని కూడా పిలిచారు నీటిని. తియ్యనీరయితే పాలలాగా (కొబ్బరి పాలవంటి నీళ్లని ఇప్పటికీ పిలుస్తుంటాం కదా) ఆమోదకరంగా ఉంటాయని కాబోలు నీటికి పయస్సు అనికూడా పేరు పెట్టారు. పాథస్సు అనే మాటకు నీరు, అన్నం అనే రెండర్థాలూ ఉన్నాయి. నీరనే అర్థముంది కాబట్టి సముద్రాన్ని పాథోనిధి, పాథోధి అని కూడా పిలిచారు. అన్నమనే అర్థంలో పాథేయమని దారిబత్తేనికి పేరు పెట్టారు. అంటే నీటికి ఆహారమనే అర్థం కూడా కల్పించారని చెప్పాలి. మబ్బుల (ఘనం) నుంచి వచ్చే 'రసం' కాబట్టే ఘనరసమన్నారు.

ఇంతవరకూ బాగుంది కాని నీటిని 'కీలాలం, కబంధం, శంబరం, కుశం, విషం' అని ఎందుకు పిలిచారో చెప్పలేం. కీలాల శబ్దానికి నెత్తురనే అర్థమే మామూలిది. కబంధ శబ్దానికి (తలలేని) మొండెమనీ, సముద్రమనీ అర్థవిశేషా లున్నాయట. 'క' అంటే నీరనీ, దాన్ని బంధించి (కట్టిపడేసి) ఉంచేచోటుకాబట్టే సముద్రానికి కబంధమనే పేరువచ్చిందనీ కొందరు 'సాధిస్తారు' – అంటే సమర్థిస్తారు! సంస్కృతంలో

# మాటల మూటలు

బూదరాజు రాధాకృష్ణ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 ట్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# నా మాట

దశాబ్దం కిందట చేస్తున్న ఉద్యోగం మానాలనే సంకల్పం కలిగింది. తెలుగు అకాడమిలో భాషాసామాజిక పరిశోధన కుంటుపడ్డది. శబ్దసాగరనిర్మాణం నెరవేరదని తేలిపోయింది. వ్యక్తిగతంగా తప్ప సంస్థాగతంగా కార్యనిర్వహణ అసాధ్యమనిపించింది. బయటపడ్డ తరవాత ఏం చేద్దామనే ఆలోచనలు ముసురుతున్నాయి. ఆ సమయంలో తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర విద్యాలయంలోని తెలుగు శాఖాధిపతి ఆచార్య జి.ఎన్.రెడ్డి పర్యాయపదనిఘంటునిర్మాణం ఆరంభించాడని తెలిసింది. ఏ భాషలోనూ ఏ రెండుమాటలూ పర్యాయపదాలుగా అన్ని సందర్భాల్లోనూ పనికిరావన్న భాషాశాస్త్ర సిద్ధాంతం గుర్తుకు వచ్చింది. అప్పటికి నేను కూడా ఆపనే చేయాలని కొంత శ్రమించిన మాట వాస్తవం. అయినా ఆ పని అంతటితో ఆపివేసి, భిన్నపదాలు ఎందుకు పర్యాయపదాలు కావో నిరూపించే పని చేపట్టాను.

వ్యుత్పత్తులనుబట్టి, కావ్యప్రయోగాలనుబట్టి, వ్యవహారభేదాలనుబట్టి కొన్నిమాటలు స్థూలదృష్టికి పర్యాయపదా లనిపించినా అవి సమీపపదాలో సంబంధిపదాలో కాగలవు. ఈ అభిప్రాయానికి సంబంధించిన సిద్ధాంతచర్చ చేస్తూ ఇంగ్లీషులో తెలుగులో అప్పటికే కొన్ని వ్యాసాలు రాసివున్నాను. ఆ వివరాలను నా భాషాశాస్త్ర వ్యాసాల్లో 'తెలుగు వాఙ్మయం: సంబంధిపదకోశాలు' అనే వ్యాసంలో చూడవచ్చు. ఆచరణరూపంలో ఆ సిద్ధాంతాన్ని చర్చిద్దా మనిపించింది. ఫలితం ఈ గ్రంథరూపంలోని వ్యాసపరంపర. ఇదే శీర్షికతో ఆ వ్యాసాలు 'ఈనాడు' దినపత్రిక ఆదివారం సంచికల్లో 19–6–1988 నుంచి 16–9–1990 దాకా ధారావాహికంగా వెలువడ్డాయి. రచనాకాలానికి తెలుగు వ్యుత్పత్తి కోశం కూడా నాకు అందుబాటులో లేదు. శాస్త్రచర్చలు చేయటంకన్నా చేతనైనంత సులభభాషలో సాధారణ పాఠకుల నుద్దేశించి రచించటం ప్రయోజనకర మనిపించింది. ఆ వ్యాసాలను ఇలా గ్రంథరూపంలో ప్రచురించుకోడానికి అనుమతించిన ఈనాడు అధిపతి రామోజీరావుగారికి కృతజ్ఞతలు చెప్పటం నా కనీస కర్తవ్యం.

ఆచార్య జి.ఎన్.రెడ్డిగారి తెలుగు పర్యాయపద నిఘంటువులో రమారమి 14,000 పదాలున్నాయి. వాటిని 4,336 ఆరోపాలుగా వర్గీకరించారు. అందులోని మాటలన్నిటినీ పరీక్షించి 'పర్యాయపదా'లనే మాటల మధ్యగల అర్థచ్ఛాయాభేదాలన్నిటినీ చర్చించటం నా అభిమతంకాదు. అష్టోత్తరశతనామాలూ సహస్రనామాలూ ఉన్న దేవీదేవుల పేర్లలో అనేకం మార్పులేకుండా చాలామందికి అన్వయించేవి. నేను వాటిజోలికి పోదలచలేదు. అందుబాటులో ఉన్న నిఘంటువులు పర్యాయపదాలుగా భావించిన పదాల్లో ఎక్కువ వ్యాప్తిగల వాటినిగురించే ఆలోచించాను. వ్యుత్పత్తి నిర్ణయంలో అభిప్రాయ భేదాలు సహజం. ఆర్యద్రవిడభాషావాదాలవల్ల అది తీవ్రతరంకూడా కొన్ని

సందర్భాల్లో. ఆ వ్యాసాలు వెలువడుతున్నప్పుడు కొందరు పెద్దలు ప్రతిపదానికీ సంస్కృత వ్యుత్పత్తులు చెప్తూ తెలుసుకొమ్మని నన్ను హెచ్చరించారు. కొందరు తమ పేరైనా చెప్పకుండా బండబూతులతో ఉత్తరాలు రాశారు. తాముగా తమ భావాలను వ్యక్తీకరించ(లే)క, ఎవరైనా ఆ పని చేస్తే దూషించి సంతృప్తిపడటం వారికే చెల్లు. అందుకు విచారం లేదు. మా గురువుగారు పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులవారు "ఈ వెక్కిరిపించు నయ్యల వివేకము తామటు వ్రాసినపైకా" అన్నమాటలు గుర్తుకువచ్చాయి. సరిపెట్టుకొన్నాను – 'పుర్రెకో బుద్ధి' అని.

ఈ గ్రంథంలో ప్రమాణాలను పేర్కొంటూ పూర్వుల వ్యాఖ్యానాలను ఉద్ధరించనందువల్ల అవేవీ చూడకుండా నాకు తోచినట్లు కల్పించి వివరించలేదని గమనించగోర్తాను. చర్చలకు నేను సిద్ధమే. దినపత్రికలో శాస్త్రప్రసంగాలకు రాసి పాఠకులను బాధించదలచుకోలేదు. భాషాధ్యయనం ద్వారా పూర్వ సంస్కృతిని, చరిత్రను పునర్నిర్మించాలనే సంకల్పమూ, ఏమాటను ఏ సందర్భంలో ఏ నిర్దిష్టార్థంలో ప్రయోగించటం మంచిదో తెలుసుకోవాలనే ఆరాటమూ యువలోకంలో కలగాలని, వారిలో భాషాసాహిత్యాలమీద అభిరుచినీ అభిమానాన్నీ కలిగించాలనే తాపత్రయపడ్డాను. అందుకని కొన్ని సమయాల్లో అక్కడక్కడ కొన్ని విసుర్లు వదిలినమాట వాస్తవం. ఆపాటి విసుర్లనుకూడా సహించలేని కేవల 'సహృదయ' పాఠకులకు నమస్కారాలు. శాస్త్రవిరుద్ధంగాని సరసప్రసంగాలను నేను బహిష్కరించలేను.

ఈ గ్రంథాన్ని కీర్తిశేషులు చండ్ర రాజేశ్వరరావుగారికి అంకితం చేస్తున్నాను. శ్రీశ్రీ మహాకవి అని మొదటిసారి గుర్తించిన మేధాశాలి ఆయన. మహానాయకుడుగా ఎదిగినా వినయమర్యాదలు మరిచిపోని విజ్ఞుడాయన. ఆయన పేరిట స్థాపించిన "సి.ఆర్. ఫౌండేషన్ ఫర్ సోషియల్ ప్రోగ్రెస్"కు నా చిరుకానుకగా ఈ గ్రంథవిక్రయం ద్వారా లభించే సొమ్మును అర్పిస్తున్నాను. నా రచనాస్వామ్యాన్ని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారికి శాశ్వతంగా దత్తం చేస్తున్నాను.

గ్రంథప్రచురణతో సహకరించిన పెద్దలందరికీ, విశేషించి రామోజీరావుగారికి మరోసారి నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. గ్రంథముఖపత్రరచయితా వ్యంగ్య చిత్రకారుడూ అయిన చిరంజీవి పి. శ్రీధరుకు నా కృతజ్ఞతలు. భాషాభిమానులు నా యీ రచనను ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

– బూదరాజు రాధాకృష్ణ

# విషయసూచిక

# మాటల మూటలు

మన అభిప్రాయాలను ఇతరులకు తెల్పటానికి వాడేవీ ఉపయోగపడేవీ మాటలు. మన ఆలోచనలున్నంత స్పష్టంగా మాటలూ వాటి అర్థాలూ ఉంటే ఎదుటి వ్యక్తికి మన భావాలు సరిగా తెలుస్తాయి. సగటు మనిషికీ మహాకవికీ మధ్య గల భేదాన్ని వాళ్లు వాడిన మాటలను బట్టీ, వాటి అర్థాల స్పష్టతను బట్టీ గుర్తించవచ్చు. ఒకే అభిప్రాయాన్ని తెలియబరచటానికి కొన్ని సమయాల్లో వేరు వేరు మాటలు వాడ్తుంటాం. వాటిని 'పర్యాయపదా'లని పిలుస్తుంటాం. కానీ నిజానికి ఏ భాషలోనూ పర్యాయపదాలని అన్నివిధాలా సమానమైన అర్థాలుండే మాటలుండవు – వేరువేరు భాషల్లో ఉండవచ్చు. అయితే సామాన్య వ్యవహారంలో పర్యాయపదాలని పిలిచే మాటల మధ్య సూక్ష్మమైన అర్థభేదా లుంటాయి. వాటిని గుర్తించి సరైన అర్థవిశేషంలో అర్థచ్ఛాయల్లో వాడటంలోనే పాండిత్య నైపుణ్యాలు బయటపడ్తాయి. వాటి ద్వారానే సగటు మనిషికీ మహాకవికీ మహాపండితుడికీ మధ్యగల అంతరం, తారతమ్యం తెలుస్తాయి. దురదృష్టవశాత్తూ మన తెలుగు నిఘంటువుల్లో పర్యాయపదాలుగా సమీపపదాలుగా పరిగణించే మాటల మధ్యగల అర్థచ్ఛాయా భేదాల వివరణ దొరకదు. వాటిని వ్యుత్పత్తిశాస్త్రం ద్వారా, కవి ప్రయోగవిశేషాలను గుర్తించటం ద్వారా, వ్యవహారంనుంచీ మనమే తెలుసుకోవాలి.

మన సమాజాన్ని ప్రభావితం చేసే శక్తులు రెండు రకాలు, రాజకీయవాదులూ ప్రచార సాధనాలూ అని. తెలిసిగాని, తెలియకగాని, కావాలనిగాని, పక్కదారి పట్టించడానికిగాని మన రాజకీయవాదులు ఉపన్యాసాల్లో వాడి జనాన్ని ఉర్రూతలూగించే కొన్ని మాటలకు సహజంగా ఉన్న అర్థాలు వేరు – వాళ్ళు వాడుకనుబట్టి మనం గ్రహించే అర్థాలు వేరు. ఉదాహరణకు 'విన్నపం, విజ్ఞప్తి, విజ్ఞాపన' మొదలైన పర్యాయార్థాలున్న ఈ మాట రాజకీయోపన్యాసాల్లో అర్థరహితంగా ప్రయుక్తమవుతున్నది. 'ఈ లంచగొండి అవినీతి ప్రభుత్వాన్ని కూకటివేళ్లతోసహా పెకలించేదాకా నేనూ నా పార్టీ విశ్రమించమని మనవిచేస్తున్నా'నని గర్జిస్తుంటారు వక్తలు. వాక్యగత సందర్భం ప్రకారమయితే ఇక్కడ ఈ మాటకు 'హెచ్చరిక/బెదిరింపు' అనే అర్థమేగాని 'విన్నప'మనే అర్థం పొసగదు. అలాగే ప్రసారసాధనాలయిన పత్రికల్లో రేడియోలో తరచుగా కనిపించే వినిపించే సమాసం "జాతివివక్ష/వర్ణవివక్ష" అనేది. దాన్ని సరిగా "జాతివిచక్షణ" అని వాడినవాళ్ళు లేకపోలేదు. "వివక్ష" అంటే "చెప్పాలనే కోరిక". పదిమాటలలో భావాలో ఉంటే వాటినుంచి ఒకదాన్ని వేరుచేసి "చెప్పా"లనే కోరిక వివక్ష; ఒకరినుంచి మరొకర్ని వేరుచేసి "చూడటం" విచక్షణ. జాత్యహంకారవాదులు ప్రదర్శిస్తున్నది ఇందువల్ల విచక్షణేగాని వివక్షకాదు. వాళ్లు కోరిక దగ్గరే ఆగిపోలేదు.

వేరుగా చూస్తున్నారు. కొన్ని సమయాల్లో పెద్ద కవులు కూడా నిర్లక్ష్యం వల్ల తొందరపాటువల్ల ఇలాంటి ప్రయోగాలు చేస్తుంటారు. మచ్చుకు 'పలనాటి వీరచరిత్ర'లో "జననితో సమమైన జంతువులే"దని బాలచంద్రుడంటాడు. ఆశుకవిత్వంలో యతికోసం తల్లిని 'జంతు'వన్నాడు! వేదాంతుల దృష్టిలో మనమంతా 'పశువు'లమే కావచ్చు. శివుడొక్కడే 'పశుపతి' కావచ్చు. కానీ ఆ ప్రయోగం బాగున్నదనగలమా?

మాటలను అచితూచి మాట్లాడటంలో నేర్పుతోబాటు విజాయితీ కూడా కావాలి. వాటికన్నా ముఖ్యంగా అర్థజ్ఞానం, శబ్దజ్ఞానం కావాలి. ఈ దృష్టితోనే పూర్వ మోపండితుడు తన కొడుకుతో "యద్యపి బహునాఽధీషే తథాఽపి పఠపుత్ర! వ్యాకరణమ్, స్వగణః శ్వగణో మాభూత్" అని చెప్పాడంటారు. అనేక విషయాలు సరిగా తెలుసుకుందామంటే వ్యాకరణం నేర్చుకొమ్మన్నాడు. అందువల్ల 'స్వగణం' అనేది 'శ్వగణం' కాదన్నాడు. స్వగణమంటే మనవాళ్లు, బంధువులన్నమాట. శ్వగణమంటే కుక్కలగుంపు! ఉచ్చారణ భేదంవల్ల, రాయటంలోని పొరపాటువల్ల అర్థాలు మారిపోతాయి. వీటిని నేర్చుకోవటం ప్రాథమికం. రాతకూతలు సరిగా నేర్చినవాళ్లు కూడా పొరపాటు పడేది ఏ సమయంలో ఏ అర్థ విశేషంలో ఏ మాట మాట్లాడాలో రాయాలో తెలియక. అందువల్ల మామూలుగా మనం మాట్లాడే, రాసే మాటల మధ్యనున్న విస్పష్టమైన అర్థభేదాలు గుర్తించి ప్రయోగించటం మంచిది.

మాటలకు అర్థాలను నిర్ణయించేది వాక్యంలోని సందర్భం. తక్కిన మాటలతో ఒక మాటకున్న పరస్పర సంబంధం ద్వారా అర్థం తెలుస్తుంది. అర్థాలు ప్రధానంగా రెండురకాలు: యౌగికార్థం, రూఢ్యర్థం అని. పదంలోని ధ్వనిభాగాలకున్న విడివిడి అర్థాలను బట్టి చెప్పే వ్యుత్పత్త్యర్థాన్ని యౌగికార్థ మంటారు. ఇది కేవలం కల్పితం. వాడుకనుబట్టి నిర్ణయించుకొనేది రూఢ్యర్థం. ఇదే పరమప్రమాణం. వ్యుత్పత్తికి విరుద్ధమయినా వాడుకలో నిలిచిన అర్థమే ప్రబలమయింది. ఈ రెంటినీ గుర్తిస్తూ పదాలమధ్య ముఖ్యంగా పర్యాయపదాలనే సమీప పదాల మధ్య – కనిపించే వినిపించే అర్థవిశేషాలను పరిశీలిద్దాం. విడివిడి మాటల అర్థ విశేషాలనుగాక దగ్గరి సంబంధమున్న మాటలకుగల అర్థచ్ఛాయలు గుర్తిద్దాం.

★ ★ ★

# నమస్కారాలు

నిత్యవ్యవహారంలో మనం మాట్లాడే మాటల్లో మర్యాద ప్రదర్శనగా 'నమస్కారం' లాంటి మాటలు వాడుతుంటాం. పసిపిల్లలని తాతగారికి 'నమస్తే చెప్పు' అని ప్రోత్సహించి అలవాటు చేస్తాం. ఇది నమస్కారంలాగా నామవాచకంకాదు. "నమః-తే" (తే-నీకు, నమః-దండం) అనే చిన్న సంస్కృత వాక్యం. పూజలు చేసేటప్పుడు 'నమస్తుభ్యం' (తుభ్యం-మీకు, నమః-దండం) అని దేవతలకు చెప్తాం. మనుషులకేమో ఏకవచనరూపమైన 'తే' వాడుతున్నామన్నమాట. ఈ నమస్కారం అనేక విధాలు. దణ్ణం పెట్టే పద్ధతుల్లో గాక వాడే మాటల్లో కూడా అర్థభేదాలున్నాయి.

'నమస్కారం, నమస్సు, నమస్య, నమస్కృతి, నమోవాకం' మొదలైన పదాలన్నీ ఇంచుమించు సమానార్థంగల సంస్కృతపదాలు. వీటన్నిటిలోనూ 'నమ్' అనే ధ్వని వినిపిస్తుంది. వంగిపెట్టే దణ్ణమని వీటికి సామాన్యార్థం. 'నమస్-కారం, నమస్-కృతి' అనే మాటల్లోని 'కారం, కృతి' అనే భాగాలు 'పని' అనే అర్థంగలవి. నమోవాకమన్నప్పుడు దండం పెడుతున్నామని నోటితోచెప్తూ ఆ పని చేయటమనే విలక్షణార్థం కూడా ఉంది. 'వాకం' అనేది 'మాట' అనే ప్రత్యేకార్థమిచ్చే భాగం. నమస్య-అనే మాటకు పూజ, సేవ-అనే అర్థాలు కూడా ఉన్నాయి. కొందరు నిఘంటుకారులు 'నతి, నమ్రత' అనే మాటలను కూడా సమానార్థకాలుగా పరిగణించారు. నతికి వంగటమనే అర్థం, నమ్రతకు వినయమనే అర్థం అదనంగా ఉన్నాయి. ఒళ్లంతా కాకపోయినా కనీసం తలయినా వంచిపెట్టే దణ్ణాలకు మాత్రమే ఈ మాటలు అర్థవంతంగా సరిపోతాయి. ఇవేకాక "అభినుతి, ప్రణతి, ప్రణామం, ప్రతిపత్తి, వందనం, వందారు(వు)" మొదలైన సంస్కృతపదాలు ఇంచుమించు నమస్కారమనే అర్థంలోనే వాడుకలో ఉన్నా 'వందనం' అనేది బహుళ వ్యాప్తిలో, 'వందారు(వు)' అనేది వైష్ణవుల వాడుకలో ఉన్నాయి. నమోవాకంలాగానే వందనం, వందారు(వు)లు తమ గోత్రనామాలు కూడా చెప్తూ 'కాళ్ళు తాకుతూ' చేసే నమస్కారాలన్నమాట. ప్రణిపాతం, ప్రణిపత్తి, అభివాదనం – అనే మాటలు కూడా ఇలాంటివే. ఇప్పుడు అభివాదనం చెప్తున్నామేగాని వంగటమూలేదు-కాళ్ళు తాకటమూలేదు! ప్రతిపత్తి అనేది వైష్ణవులకు ప్రత్యేకమయిన మాట. ఇక 'సాష్టాంగ (నమస్కారం)' సంగతి చెప్పనక్కరలేదు. మొహమూ, రొమ్మూ, రెండుచేతులూ, రెండు మోకాళ్ళూ, రెండు కళ్ళూ-వెరసి ఎనిమిది శరీరభాగాలూ నేలను తాకేటట్లు బోర్లాపడిపెట్టే దణ్ణమిది! ఇంతశ్రమా పడకుండానే నోటిమాటగా 'సాష్టాంగం' అనే వినయవంతులు లేకపోలేదు. "సాష్టాంగ దండ ప్రణామా"లని నోటితో పలికేవాళ్ళూ ఉన్నారు. దండం (కర్ర)లాగా బిర్రబిగిసి బొక్కబోర్లాపడి పెట్టే దణ్ణాన్ని ఈ పేరుతో పిలుస్తారు. ఇంత పొడుగు మాటెందుకని సూక్ష్మంలో మోక్షంగా 'వందే' అనే వాళ్ళున్నారు. 'అహం(నేను) వందే (నమస్కరిస్తున్నా)' అనే వాక్యానికిది సంక్షిప్తరూపం. వందే అనేది

నామవాచకంకాదు; క్రియారూపమే. ఇవన్నీ సంస్కృత పదాలే. వీటన్నిటిలోనూ వాడుకలో ఎక్కువగా వినిపించేవి 'నమస్కారం, వందనం, అభివాదం' అనేవి.

తెలుగులో ఇలా ప్రత్యేకార్థాలుగల మాటలున్నాయి. వీటిలో ఎక్కువ వాడుకలో ఉన్నవి "దండం/దణ్ణం, (రాజకీయవాదుల పుణ్యమా అని) జోహారు, (ఆడపిల్లల వాడుకలో అర్థం గుర్తించిగాని లేకుండాగాని) గొబ్బిళ్ళు" అనేవి మూడే. దండం అంటే నమస్కారం – తెలుగులో దణ్ణమని, దాన్నే మరోవిధంగా పలుకుతుంటాం. గొబ్బిళ్లంటే చుట్టూ తిరుగుతూ (ప్రదక్షిణం చేస్తూ) పెట్టే దండాలు. జోహారు అనే మాట వ్యుత్పత్తి ఏమిటో స్పష్టంగా తెలియదుగాని దాని వాలకం చూస్తే అది 'అచ్చ తెలుగు' కాదనే అనుమానం పుడ్తుంది. దానికి 'జొహారు, జోహారువు, జోహరువు' అనే రూపాంతరాలు నిఘంటువుల్లో కనిపించటం అందుకు ప్రధాన కారణం. ఈమాట ఏ ప్రాకృత భాషాభేదం నుంచో దిగుమతి అయిందని అనుమానించవచ్చు. పెద్దరికం ప్రత్యేకతలను గుర్తించి పూర్వం కీర్తిశేషులకు మాత్రమే 'జోహార్లు' చెప్పేవాళ్ళు. ఇప్పుడు బతికున్న వాళ్లక్కూడా చెప్తున్నారు! ఏం చేస్తాంమరి? అలాగే దేవతలకు 'జేజే'లు చెప్పేవాళ్ళు పూర్వం. రెండెందుకని ఒకే 'జే'తో సరిపెట్టుకున్న కవులు కూడా ఉన్నారు మనకు. ఈ మాట(ల)కు 'దేవుడు, దీవన' అనే అర్థాలు కూడా ఉన్నాయి. నిజానికిది సంస్కృతంలోని 'జయ' (ఇప్పటి 'జై') అనే పదానికి మారురూపం. ఇలాంటివే 'జోత, జోతం, జోతాం' అనేవి. ఎరువు మాటలుగా వచ్చి తెలుగు పుస్తకాల్లో చోటు సంపాదించుకొని 'అచ్చ తెలు'గయిపోయిన మాటలివి. వీటన్నిటికీ 'దండం' అనే అర్థం. దండంమటుకు నిక్కచ్చిగా తెలుగు మాటే (సంస్కృతంలో దండమంటే 'కర్ర'!)

'దోసిలిపట్టి పెట్టిన దండం' అనే ప్రత్యేకార్థంలో కొన్ని తెలుగు మాటలున్నాయి; 'కయిమోడ్పు/కైమోడ్పు, కేలుమోడ్పు, చేమోడుపు, చేమోడ్పు' అనేవి. కానీ ఇవి పుస్తకాల్లో మాత్రమే నిలిచిపోతున్నాయి. ఏ భజన సమయంలోనో ఎగురుతూ పెట్టే దండాలకు 'గిడిగిడి/గిడిగిళ్ళు, చెంగనాలు' అనే మాటలున్నాయి. అయితే మన ఇప్పటి వాడుకలో చెంగనాలు పెట్టేవి దూడలు మాత్రమే! గోత్ర ప్రవరలు చెప్తూ పెట్టే తెలుగు దండాలకు 'ఏటికోళ్ళు' అని పేరు. శ్రీనాథుడు ఎప్పుడూ వీటిని 'సమర్పించేవాడు' దేవుళ్లకు! బోర్లాపడి పెట్టే తెలుగు దండం పేరు 'జాగిలి'. ఈ మాటను ఎవరూ వాడుతున్నట్లు లేదు. 'టెంకణం' అనే మాటకూడా ఉందిగాని దాని వివరం తెలియటం లేదు. వాలకం చూస్తే అది ఎరువుమాటే అయివుండాలి. 'దీవెనకోల' అంటే దండం అని నిఘంటువులు చెప్తాయిగాని అర్థం సరిపడినట్లు లేదు.

అచ్చం తెలుగు మాట మొక్కు. (పూర్వభాషలో మ్రొక్కు). 'మ్రొక్కుడు' అనే రూపాంతరం కోశాల్లో కనిపిస్తుంది కాని వాడుకలో లేదు – ఉంటే దాన్ని 'మొక్కుట'మంటాం. ఈ మాట దేవతలను కోరికలు తీర్చమని కోరుతూ బతిమాలటానికీ, ముడుపులు కట్టడానికీ, సంబంధం లేకుండా వాడం. ఇక 'పొర్లు దండాలు, దొంగదణ్ణాలు' వంటి మాటల సంగతి చెప్పనక్కర్లేదు. మొదటిది భక్తి

తీవ్రత ప్రదర్శించేదయితే రెండోది 'నటన'కు పరిమితమయింది! 'హలో', హాయ్' వగైరా అతినవీనాంగ్లపదాలు పలకరింపులేగాని దండాలు కావేకావు. బహుశా 'బావున్నావా దొరా, నీకాల్మొక్కుతా' నన్నవాడే నిజంగా దణ్ణం పెడ్తున్నవాడేమో మరి! అన్నట్లు 'రాం రాం' అన్నా నమస్కారమేనా?

నమస్కారమనేది అన్ని సమయాల్లోనూ గౌరవ మర్యాదలు చూపటానికి వాడేమాటేనా? మరి 'సలాం' అనేదో? ముస్లిం పద్ధతిలో తలవంచి పెట్టే దండం సలాం. తదితరులు ఆ మాటను వాడరనీ చెప్పలేం. కానీ వాక్యగతంగా ఈ నామవాచకాలను ప్రయోగించినప్పుడు అర్థంలో కొన్నిసార్లు మార్పు వినిపిస్తుంది. 'సలాం పెట్టు, సలాంకొట్టు' అనే రెండు చిన్నవాక్యాలు తీసుకోండి. మొదటి వాక్యం గౌరవం సూచిస్తే, రెండోది ఈసడింపును, విసుగును, విరక్తిని ప్రదర్శిస్తుంది. "నీకూ నీ పెద్దలకూ ఒక దండం/వెయ్యి దణ్ణాలు" అన్నా, "ఆ పనికి ఒక్క దణ్ణంపెట్టి బయటపడ్డాను. నీకూ నీ సాయానికీ ఓ నమస్కారం" మొదలుగా పలికినా సలాం కొట్టడంవంటి అర్థమే వస్తుంది. ఈ అర్థవిశేషం అసలు మాటకు లేదు; సందర్భాన్నిబట్టి, ఆ మాటలు పలికేటప్పటి ముఖకళవళికలనుబట్టి, కంఠస్వరంలో ప్రదర్శించిన భేదాన్నిబట్టి, వాక్యరచనవల్ల వస్తుంది. ఈ భేదాలను అనుభవం నేర్పుతుంది; వ్యవహారం తెలుపుతుంది.

'వందే, నమస్తే' వంటివి క్రియారూపాలమనుకున్నాం. 'నమస్కరించు, ప్రణమిల్లు, అభివాదించు, నమించు' వంటి సాంస్కృతిక క్రియాపదాలున్నాయి. 'కేలుమోడ్చు, కేల్మొగుచు, కైమోడ్చు, కొలుచు, మొక్కు, మోకరిల్లు, మొగ్గతిల్లు, మొగ్గు, కైవాల్చు, కొలుచు, ఎరగు, కాల్మొక్కు, సాగిలపడు, మోకరిల్లబడు, చేవిప్పు, కైవాల్చు, అయిదు పదిసేయు, దణ్ణం/దండం పెట్టు, దోసిలిఒగ్గు' వంటి క్రియారూపాలున్నాయి. 'చేతులు ముకుళించు' వంటి మిశ్రపదాలూ లేకపోలేదు. 'కేలు, కై, చే' అనే మాటలకు చేయి అని అర్థం. భక్తి గౌరవాలను ప్రదర్శించేటప్పుడు చేతులచేత చేయించే పనిని సూచించేమాటలవి. 'మోడ్చు, మొగుచు, ముకుళించు, వాల్చు, ఒగ్గు' అనేవి దోసిలిపట్టి దణ్ణం పెట్టడాన్ని సూచిస్తాయి. రెండు చేతులకూ కలిసి మొత్తంమీద ఉన్న పదివేళ్లనూ దోసిలిపట్టి ఒకచోటకు చేర్చినా (అయిదు పది చేసినా) అదోవిధంగా నమస్కరించటమే. దోసిలి గుండె దగ్గర ఉంటే పెద్దలకూ, తలమీద ఉంటే దేవతలకూ నమస్కరించినట్లు. 'సలాం' పద్ధతే వేరనుకోండి. 'సలాం చేయట'మూ 'సలాం పెట్టడ'మూ కొంచెం భేదం కలవే. సలాం చేసేటప్పుడు తల కొద్దిగా వాల్చి అరచేతిని గడ్డందాకా తెస్తే, సలాం పెట్టేప్పుడు వ్యక్తిగూడా వంగాలి. ఎంతవంగితే అంత గౌరవం చూపినట్లు, ఎన్నిసార్లు వంగితే అంత ఎక్కువ గౌరవమున్నట్లు. అందుకే వంగి వంగి సలాం పెట్టాడంటాం.

వంగటం ఇస్లాం పద్ధతి మాత్రమే కాదు. 'ఎరగు, మోకరిల్లు, మొగ్గతిల్లు, మొగ్గబడు, మోకరిల్లబడు, సాగిలబడు' అనేవన్నీ నమస్కరించే వ్యక్తి వంగాలని సూచిస్తాయి. 'మోకరిల్లు, మోకరిల్లబడు' అనేవాటికీ మోకాలు/మోకాళ్లు మడిచి దణ్ణం పెట్టడానికీ ఏదో సంబంధముంది. రాజులదగ్గర అలా మోకాళ్లువంచి ఆయుధం పాదాల దగ్గర పెట్టి భక్తి తాత్పర్యాలు ప్రదర్శించటం అన్ని సమాజాల్లోనూ సంస్కృతుల్లోనూ

కనిపిస్తుంది. 'సాగిలపడు' అనే సాష్టాంగపడి నమస్కరించాలని సూచిస్తుంది. మొగ్గతిల్లు వంటివి వంగి దణ్ణంపెట్టడానికి గుర్తులు. మొక్కుకూ మొక్కుబడికీ ఏదో సంబంధముందనుకోనక్కరలేదు. అమాట ద్వారా ఎలా నమస్కరించాలో తెలీదు. కానీ వంగాలనే సూచన తప్పకుండా ఉంది. 'ఎరగు' అంటే 'వాలు' అని. అర్థం కాళ్లమీద పడి దణ్ణం పెట్టడమన్నమాట.

మొత్తంమీద మనకున్న గౌరవాన్ని చూపటానికి నమస్కరిస్తాం. కనీసం తలయినా వాల్చటం, చేతులు దోసిళ్లు పట్టడం తప్పదు. మోకాళ్లు మడిచి నమస్కరించటం రాజులు, సేనాపతులూ అపేక్షిస్తే దేవుడికిపెట్టే దండంలో దోసిలిపట్టి గుండెదగ్గర చేతులుంచటం కనీసమర్యాద. చేతులు పైకెత్తి – అంటే తలమీద వీలయినంత ఎత్తుకుపెట్టి – నమస్కరించటం పెద్ద మర్యాద – శ్రీకృష్ణుడికి గోపికలు పెట్టినట్లు. సాగిలబడటం మరో తీరు. పొర్లు దణ్ణాలు నేలమీద సాగిలబడి పక్కలకు దొర్లుతూ పెట్టేవి. సాధారణంగా మొక్కుకున్నవాళ్లే ఈ విధంగా నమస్కరిస్తారు.

# భక్తిప్రపత్తులు

ఇలా పెట్టే దణ్ణాలవల్ల మన 'భక్తిప్రపత్తులు' బయటపడ్తాయి. 'భక్తి' అనే మాటకు "భాగం, విడలీత, సేవ, దేవుడిమీద అనురాగం" వగైరా అర్థాలున్నాయి. మొదటి రెండు అర్థాలూ నమస్కరించేటప్పుడు మనం వ్యక్తపరిచే భావాలకు సంబంధించినవికావు. ఇది సంస్కృత పదం. దీన్నుంచే 'బత్తి, బగితి' అనే రూపాలు వచ్చాయి తెలుగులోకి. కొందరు 'భయంతో కూడిన స్నేహ'మే 'భక్తి' అని చెప్తారు. దేవుడు లేడనేవాళ్లక్కూడా భయముంటుంది – మరో విధంగా; స్నేహభావమూ ఉంటుంది – ఇతరుల విషయంలో. వాళ్లకు 'భక్తి' ఉండదా అనేది తేలని ప్రశ్న. గౌరవం లేకుండా భక్తి పుట్టదు. గౌరవమంటే గురుభావం. గురువంటే 'పెద్ద, గొప్ప' వగైరా అర్థాలున్నాయి. భక్తి అనేది ఆస్తికుల భావాల ప్రకారం లేకపోయినా సదరు వ్యక్తులకు పెద్దల మీదా పెద్దరికం మీదా గురివుండవచ్చు. అదికూడా భక్తేనంటారు మరికొందరు. భక్తికీ భజనకూ ఒకే మూలధాతు వుంది. 'భజించు, కొలుచు, పూజించు, గౌరవించు' మొదలయిన అర్థాలు భజనకూ భక్తికీ సమానమే. అయినా భక్తికీ భయానికీ ఉన్న సంబంధాన్ని మరిచిపోకుండా 'భయభక్తు'లని జంటగా వాడుతుంటాం. 'ప్రపత్తి' అనేది వైష్ణవుల వాడుకలో సర్వసాధారణం. భగవంతుడికి పూర్తిగా లొంగిపోవటం (= శరణాగతి) ప్రపత్తి. శైవుల్లో దేవుడికన్నా భక్తుడే గొప్ప; వైష్ణవుల్లో భక్తులందరిలోకీ భక్తుడే చిన్న! దేవుడే మిన్న. ఉభయులూ భజిస్తారు, పూజిస్తారు. 'పూజ' అనేది ఆర్యులెరగరనీ, ద్రావిడ భాషల నుంచే వాళ్లీమాట నేర్చుకున్నారనీ వాదించినవాళ్లున్నారు. 'పూ(వు)లతో' చేసిందే పూజ. పూజకు అలంకారం, నగిషీ అనే అర్థాలు కూడా కొన్ని ప్రాంతాల్లో వాడుకలోకి వచ్చాయి. పూలున్నా లేకపోయినా చేసే సేవ అర్చ(న). అందులో అభిషేకం వంటివి చేర్తాయి.

అన్నట్లు అభిషేకమంటే 'బాగా తడపట'మని అర్థం. సేకం (=తడుపు) అనే పదానికి ముందు 'అభి' అనే ఉపసర్గ చేర్చారన్నమాట. ఇది రాజులకూ దేవతలకూ సమానం. కాకపోతే నీళ్లేగాక పాలు, పెరుగు, తేనె వంటివి కూడా దేవుడికి అభిషేకంలో వాడ్తాం. రాజులు బహుశా కోప్పడతారని కాబోలు నీళ్ల (తీర్థజలం) మాత్రమే వాళ్ల నెత్తిన పోసేవాళ్లు. ఇకపోయం. మనకు రాజుల్లేరు కదా!

ఎక్కడున్నాం మనం? భజనలో కదూ! 'భజన, అర్చ(న), సేవ, పూజనం, వరివస్య, ఉపాసన, ఆరాధన, కొలువు , కొలుపు, శుశ్రూష, మన్నన, ఆదరం, ఇచ్చకం, తిరునాళ్లు, దాస్యం, సబళం, నివేదన(ం), కీర్తనం, స్మరణం, శ్రవణం, అనుమోదం, అదంభం, అభినుతి, సపర్య, స్తుతి, స్తోత్రం, నుతి, స్తవం, తాత్పర్యం, తత్పరత' వగైరాలన్నీ భక్తితోచేసే పనులే. పూజ చేయటాన్ని పూజనమంటారు. మనసులో ధ్యానించినా, వ్రతాలవంటివి చేసినా, జపతపాదులతో స్మరించినా ఆ పనికి ఉపాసన అనేపేరు. కదలకుండా స్తిమితంగా కూర్చొని చేసేది ఉపాసన. తపమనేది 'తపన'తో చేసేది. అనుకొన్నది నెరవేర్చుకోవాలనేది పట్టుదల లేనిదే తపంకాదు. జపం అనేకసార్లు తలుచుకోవటం. దేవుణ్నో అవతారపురుషుణ్నో మహాభక్తుణ్నో వ్యక్తినో సంతోషపెట్టాలనీ తృప్తిపరచాలనీ చేసేసేవ ఆరాధన. పరివారదేవతలను (అంటే చిల్లర దేవుళ్లను) ఎదుట ఉంచి చేసే పూజ కొలువు. కొలువంటే సభ అనే అర్థముంది. బొమ్మల కొలువులో కూడా చాలా బొమ్మలుంచుతాం. కాకపోతే ఆ కొలువును కొందరు దసరా పండగరోజుల్లో చేస్తే మరికొందరు సంక్రాంతికి తీరుస్తారు. కొలుపు పదిమందిచేరి (దైవప్రీతికోసం) చేసేవేడుక. ఈ కాలానికి గ్రామ దేవతలకూ క్షుద్రదేవతలకూ చేసే సేవనే కొలుపు అంటున్నాం. 'కొలుపులు' అని బహువచనంలో కూడా ప్రస్తావిస్తుంటాం – రకరకాలుగా చేస్తుంటాం – కొన్నిరోజులు చేస్తుంటాం.

కొలువులకూ జాతరలకూ, తిరునాళ్లకూ కొద్దిపాటి భేదముంది. కొలువు ఒకే గ్రామస్థులు చేసేది. 'జాతర/జాత్ర' అనేది పొరుగూళ్లనుంచి కూడ జనం 'యాత్ర'కు వచ్చి పాలుపంచుకొని చేసే కొలుపు. కొలుపులకూ జాతర్లకూ ప్రత్యేకతిథి అక్కరలేదు. ఊళ్లో అంటువ్యాధులు ప్రబలినా, అనావృష్టివంటి ఇబ్బందులు వచ్చినా కొలుపులు చేస్తారు. పూర్వం 'బలి' ఇవ్వటం ప్రధాన భాగంగా ఉండేది కొలుపుల్లో. లేదా 'సిడివేయటం' జరిగేది. సిడిమానుకు జుట్టుకట్టుకొని వేలాడటం, తలకిందులుగా వేలాడటం, బుగ్గల్లో నారసాలు గుచ్చుకోవటం (నారసమంటే బాణం–నిఘంటువుల ప్రకారమయితే), గుండాలు తొక్కటం, కొరడాలతో కొట్టుకోవడం వంటి కార్య క్రమాలు కొలుపుల్లో సర్వసాధారణం. జాత్రల్లోకాదు. జాతర పదివూళ్లనుంచి వచ్చిన వాళ్లు చేసే వేడుక కాబట్టి 'రంకుల రాట్నాలు', హరికథలూ, పురాణ పఠనాలూ, నాట్య ప్రదర్శనలూ వగైరా ఉల్లాసకర విషయాలే దాంట్లో ప్రధానం. 'రంగులు' కాస్తా 'రంకు'లయిపోవటానికి కారణం ఇలాంటి సందర్భాల్లో జనం 'విచ్చలవిడిగా' ప్రవర్తించటమే. అందుకే భరతమహర్షి ఇలాంటి సందర్భాల్లో ఆడవాళ్లను ఓ కంట కనిపెట్టి కట్టుబాటులో ఉంచుకొమ్మన్నాడు– మొగవాళ్లు కట్టుతప్పినా ఇబ్బందిలేదు

కాబట్టి. జాతర్ల సమయంలో 'సంత'లు కూడా వెలుస్తుంటాయి. తిరునాళ్లు/తిరణాల అలాకాదు: ఏదో నిశ్చితమైన పుణ్యదినంలో మాత్రమే చేసే వేడుక అది. 'తిరు' అంటే పవిత్రం. 'నాడు' అంటే రోజు. 'మహానాడు'లోని నాడు తెలుగర్థంలోని మాటకాదు. అరవంలో దానికర్థం 'సభ, సమావేశం' ఈనాటికి అన్ని భాషలూ తెలుగేనన్న లెక్కన మనవాళ్లు దాన్ని తెలుగుకింద జమకట్టారు!

శుశ్రూష అనేది చిత్రమయిన మాట. 'వినాలనే కోరిక'ను సంస్కృతంలో శుశ్రూష అనేవాళ్లు. పాతకాలపు గురుకులాల్లో తిండీ గుడ్డా ఇచ్చి చదువు చెప్పేవాళ్ళు. తిండి పెట్టున్నాడు కాబట్టి గురువు పని చేయించుకొనేవాడు – కాళ్లు పిసగటం మంచి గొడ్లమేత తెచ్చేదాకా. లోకానికి కనిపించేది ఈ సేవేగాని చెప్పిన చదువుకాదు కాబట్టి శుశ్రూషకు సేవ అనే అర్థం వచ్చింది – మన మొత్తుకోళ్లు తాను వినాల్సిందేగాని తన బోధలు మనం వినకపోయినా. చివరికి దైవసేవ అనే అర్థంలో కూడా కొందరీ మాటను ప్రయోగిస్తున్నారు! బహుశా వాళ్లకు మనకు వినపడకుండా దేవుడేమో చెప్పి ఉంటాడు. దాస్యం అంటే దాసుడు (సేవకుడు) చేసే పని. వైష్ణవ సంప్రదాయంలో దీని వాడుక ఎక్కువ. 'దాసానుదాసప్రపత్తి' అనేది వాళ్లకి చాలా ముఖ్యం. అనుదాసుడంటే దాసుడికి దాసుడని అర్థం. దేవుడి దాసుడికి చిట్టచివరి దాసుడికి కట్టకడపటి దాసుణ్నని చెప్పుకోవటం ఆ సంప్రదాయంలో చాలా ముఖ్యం. అదీ చాలక పదరు కట్టకడపటి దాసుడి 'కాలిధూళి'నని చెప్పుకోవటం మరీ ముఖ్యం. 'తొండ రడిప్పొడి యాళ్వార్' అంటే 'తొండ (భక్తుడి) అడి (కాళ్లకింది) పొడి (దుమ్ము)' అన్నమాట! ఆ 'అళ్వార్' (భక్తులుంగారు) భక్తులందరికీ మా గొప్పవాడని తాత్పర్యం. తాత్పర్యమంటే గుర్తుకు వస్తుంది. తత్ (దానికి), పరంగా (లోబడి) ఉండటం తాత్పర్యం. దాన్నే తత్పరత అనవచ్చు. ఏకబిగిని ఒకే ధ్యాసగా గౌరవాదరాలు చూపటం తాత్పర్యం. (ఒక పద్యానికో విషయానికో ఉన్న క్లుప్తమయిన/ప్రధానమైన భావం కూడా తాత్పర్యమేగాని అది వేరు.)

స్మరణమంటే తలచుకోవటం – దేవుణ్నన్నమాట! (ప్రియుణ్నో ప్రేయసినో తలచుకోవటం కూడా స్మరణమేననుకోండి. ఆ అర్థం ఇక్కడ అతకదు). శ్రవణమంటే వినటం. దేవుడు మన మొరవింటాడో లేదో తెలీదుగాని మనం దేవుడి లీలలు చెప్పించుకొని వినటమే శ్రవణం. సపర్యకూ సేవకూ పెద్ద భేదం లేదు. గౌరవభావంతో చేసే సేవను సపర్య అంటారు. ఎలా చేసినా సేవ సేవే. చాకిరీ అన్నమాట. మళ్లీ 'అరవచాకిరీ' వేరు. అరవ్వాళ్లు చేసేదని నిందార్థం వాడుకలోకి వచ్చిందిగాని అది అసలర్థంకాదు. 'అరవం'గా– అంటే నోరెత్తకుండా, చప్పుడు చేయకుండా చేసే సేవ అది. ఇక 'స్తుతి, స్తోత్రం, స్తవం, నుతి, అభినుతి' అనేవి 'పొగడ్త' అనే అర్థంలో వాడే మాటలు. నివేదన అంటే చెప్పుకోవటం, ఇవ్వటం. నైవేద్యమనేది ఈ మాటనుంచే ఏర్పడింది. ఇవ్వటం అనే అర్థంలో అలా నివేదించి (ఇచ్చినట్లు విగ్రహానికి చూపి) మనమే తీసుకొని తినేదయితే ప్రసాదం. తాగేదయితే తీర్థం. తీర్థానికి నీళ్లు అనే అర్థమయినా ఈ నీళ్లను పవిత్ర జలమని చెప్పాలి. నదుల్లో సముద్రంలో ఉండే నీళ్లు పవిత్రం. వాటిని తీర్థజలమని నెత్తిన చల్లుకుంటాం –

దేవుడికీ రాజుకీ నెత్తిన చల్లుతాం. వరివస్య అనేది మారుమూలమాట. దానిక్కూడా వైష్ణవ సంప్రదాయంలోనే వాడుక ఎక్కువ. సేవ అనే అర్థంలో కీర్తన అంటే పొగడ్తేగాని పాట రూపంలో ఉండేదని రూఢిలో నిలిచింది. సఖ్యమంటే స్నేహం, మైత్రి. దానికి సాధారణార్థాలూ సమాన పదాలూ ఉన్నాయి.

# స్నేహసంబంధాలు

సఖుడంటే స్నేహితుడు, మిత్రుడు అని సామాన్యార్థం. పూజా విధానంలో అదోతీరు. మామూలుగా కూడా ఆ మాటను వాడ్తాం. "ప్రేమ, అనురక్తి, అనురాగం, అభిమానం, ప్రణయం, రాగం, వాత్సల్యం, ప్రియం, అపేక్ష ఆప్యాయత, మైత్రి, స్నేహం, సౌహార్దం, ఆబంధం, మిత్రత, మిత్రత్వం, స్నిగ్ధత, మోహం, మమత, మమకారం, మమత్వం, అనుబంధం, వత్సలత, ప్రీణనం, ప్రీతి, ప్రసాద(న)ం, ఇష్టం, ఆసత్తి, ఆసక్తి, ఆసంగం, సంగం, అనురతి, అభిముఖత, ఆభిముఖ్యం, అప్యాయనం" వగైరా సంస్కృత పదాలను గురికి బెత్తెడెడంగా ఒకే అర్థంలో వాడుతుంటాం. అలాగే "నెయ్యం, నెయ్యమి, నెమ్మి, నేస్తం, నెనరు, ఎలమి, మేలు, కూరిమి, చెలిమి, అరితి, బాళి, ప్రేముడి, మచ్చిక, మక్కువ, మరులు, వలపు, అర్మిలి, అరులు, అర్లు, తగులం, సంగడి, పొందు, సంగాతం, మచ్చిగ, అలిమి, అరిమిలి, ముసిమి, గాదిరి, గారం, గారాం" మొదలైన తెలుగు మాటలను కూడా అలాగే ప్రయోగిస్తుంటాం. వీటన్నిటిలో 'ప్రేమ, అనురాగం, అభిమానం, ప్రణయం, ప్రియం, అపేక్ష, ఆప్యాయత, మైత్రి, స్నేహం, సౌహార్దం, మోహం, మమత, మమకారం, నేస్తం, మచ్చిక, మక్కువ, మరులు, వలపు, పొందు, గారాం' అనేవి ఎక్కువ వాడుకలో ఉన్నాయి. ముందువాటి సంగతి చర్చిద్దాం. పనిలో పనిగా తక్కిన మాటలను సందర్భోచితంగా తలుచుకుందాం.

ప్రేమ ప్రతిఫల మపేక్షించనిది. గుడ్డిదని కూడా చెప్తారు. ఎక్కువ తక్కువలు, పెద్దాచిన్నా భేదాలు, లాభనష్టాలు మొదలయిన వాటితో సంబంధంలేని 'మక్కువ'ను ప్రేమ అంటారు. ప్రేముడి అనే మాట అచ్చతెలుగని నిఘంటువులు చెప్తాయి గాని నమ్మటం కష్టం. సజాతీయ భాషల్లో అటువంటి రూపంగల శబ్దం లేదు. 'మాతృప్రేమ' వంటి సమాసాలను ఎటుబడితే అటు వివరించవచ్చు. తల్లికున్న ప్రేమ, తల్లిమీది ప్రేమ అని చెప్పవచ్చు. కానీ తల్లికి బిడ్డమీద ఉన్న భావానికి (మాలిమికి) 'వాత్సల్య'మనే మరోమాట ప్రత్యేకంగా ఉంది. వత్స అంటే సంతు, బిడ్డ. బిడ్డమీది ప్రేమ వాత్సల్యం. అయితే బిడ్డకు తల్లిమీదగల భక్తి గౌరవాలను ప్రేమ అనగూడదని చెప్పలేం. ప్రేమకన్నా ప్రణయం ధొడ్డది. అందులో 'లొంగుబాటు' కూడా ఉంది. 'నమ్మకం' కూడాను. ప్రేమకు 'స్నేహం, సంతోషం, పరియాచకం, గాలి' మొదలైన ఇతరార్థాలూ, 'ప్రేమము' అనే రూపాంతరమూ ఉన్నాయి. ప్రేమ అస్థిరం. ప్రణయం స్థిరమైనది. 'ప్రేముడి'కి 'పిన్నలమీద, చిన్నవాళ్లమీద ఉన్నకూరిమి'

అని కొందరు అర్థం చెప్పారు. అంటే ప్రేముడిని వాత్సల్యంతో సమానంగా పరిగణించాలన్నమాట. 'ప్రియం, ఇష్టం, ప్రీతి' అనేవి ఇంచుమించు దగ్గరమాటలు. ఇతరులకుగాని తనకుగాని సంతోషం కలిగించటం, ఇచ్ఛకం పుట్టించటం అనేవి ఈ మాటల్లోని సమాన లక్షణాలు. తృప్తిని, సంతోషాన్నీ, ఉల్లాసాన్ని కలిగించటంతోబాటు మనసులోని కలకతీర్చినప్పుడు ఈ మాటలను అర్థస్పష్టతకోసం వాడవచ్చు. ప్రియం అనే మాటకు 'హెచ్చుధర, అనుగ్రహం'లాంటి వేరే అర్థాలున్నాయి. ప్రీతికి దగ్గరిమాటలు ప్రీణనం, ప్రసాదనం అనేవి. నచ్చటం నచ్చిక అనుకుంటే, ప్రీణనం అనేది ఆ నచ్చికను కల్పించటం. తృప్తికీ సంతోషానికీ ప్రమేయం లేనిచోట ప్రీతి, ప్రీణనం, ప్రసాదనం వాడితే నప్పవు.

మమత, మమత్వం, మమకారం అనేవి తనదనే భావమున్నప్పుడే వాడవలసిన మాటలు. 'మమ' అనేదానికి 'నా(ది)' అనే అర్థం. సొంతం (చేసుకోవాలి) అనే అభిప్రాయమున్నప్పుడే వీటికీ వాడుక. అనురక్తి, అనురాగం అనేవి 'రాగం' (=ఇష్టం, ఆసక్తి, అపేక్ష)తో వెంబడించే కోరికలను తెలిపే మాటలు. ప్రేమ, ప్రణయాల్లాగాకాక ఇవి ఏకపక్షమయిన స్నేహాన్ని చెప్పటానికి పనికి వస్తాయి. అనురతి, ఆసంగం అనే పదాల్లో 'శరీర సంబంధానికి' ఎక్కువ ప్రాధాన్యముంది. రతి, సంగం – అనే మాటలకు 'సంభోగ'మనే అర్థం కూడా ఉంది. ఆసత్తి అంటే పొందిక, సరిపెట్టుకోగలగటం. ఆసక్తి అంటే కోరిక. ఈ రెండూ ఒకటికాదు. ఆసత్తికి దగ్గరిసంబంధమనే అర్థంకూడా ఉంది. అపేక్షకు అనుసరించటం/వెంబడించటమనే అర్థం లేకపోలేదు. అపేక్షను 'అపేక్ష' అంటారు కొందరు. అది సరికాదు. ఆప్యాయనం అంటే తనివి, తృప్తి. ఆప్యాయత ఈ మాటకే మరో రూపం. సంతోషపెట్టడం లేని ఆప్యాయతలేదు. అభిమానం అర్థం చేసుకున్నప్పుడు కలిగే గౌరవం. ఈ మాటకు ఆత్మగౌరవం, గర్వం, అజ్ఞానం, అహంకారం అనే విడివిడి అర్థాలు కూడా ఉన్నాయి. అభిముఖత అనే మాటను అవతలి వ్యక్తికి అనుకూలంగా నచ్చేటట్లు ప్రవర్తిస్తున్నప్పుడు వాడాలి. 'సుముఖత' అని కూడా దీనికి అర్థముంది. అభిముఖతకు మరోరూపం ఆభిముఖ్యం. దీనికి అర్థంలో మరేమీ తేడాలేదు. మోహంలో ప్రేమలో లేని తీవ్రత, మొండితనం ఉంటాయి.

మైత్రీ, స్నేహం ఒక్కటికాదు. 'మైత్రి/మిత్రత/మిత్రత్వం' అనే మాటలో 'చెలిమి' తోపాటు 'జాలి, దయ' కూడా ఉన్నవని చెప్పాలి. మైత్రికన్నా స్నేహం గొప్పది. స్నేహం అనే పదానికి 'చనువుతోబాటు విడరానిబంధం కూడా ఉన్నభావ'మని అర్థం. నిజానికి స్నేహ పదానికి 'నూనె, జిడ్డు' అనే అర్థాలు కూడా ఉన్నాయి. వదలని మైత్రి స్నేహం. అది విడదీయరానిది, విడిపోనిది. మైత్రి తాత్కాలికం కావచ్చు. స్నేహం మాత్రం శాశ్వతమయినది. సౌహార్దమనే మాట 'సుహృత్' అనే శబ్ద లక్షణాన్ని చెప్పేది. మంచిమనసుతో ప్రవర్తించటం సౌహార్దం. కొందరు తప్పుగా ఈ మాటను 'సౌహార్ద్రి'మని వాడుతుంటారు. కానీ ఈ మాటకూ 'ఆర్ద్రత'కూ సంబంధమేలేదు. స్నిగ్ధత అంటే చల్లని, చిక్కని మైత్రి. ఉన్నంతకాలం ఆహ్లాదకరంగా ఉండే మైత్రి అన్నమాట. స్నేహమంత గాఢమయిందికాదు స్నిగ్ధత. శాశ్వతమూకాదు.

ఈ మాటలన్నీ సంస్కృత పదాలు, తెలుగులో ఇటువంటి మాటలు చాలా ఉన్నాయి. అందులో కొన్ని తమాషా అయినవి.

ఇంచుమించు స్నేహంవంటి అర్థమిచ్చే తెలుగుమాట 'నెయ్యం'. దీనికి నెయ్యమి, నెమ్మి అనే రూపాంతరాలున్నాయి. అసలు స్నేహశబ్దం నుంచే నెయ్యం పుట్టిందంటారు చాలా మంది. నేస్తమనే మాట కొన్ని ప్రాంతాల్లో బాగా చలామణీలో ఉంది. 'నేస్తం కట్టడం' అనేది కళింగ ప్రాంతంలో (విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల్లో) ఓ పెద్ద క్రతువులాగా జరిగేపని. రెండు కుటుంబాలు నేస్తం కట్టాయంటే జీవితాంతం విడని చెలిమితో ఉంటాయి. ఒకేకుటుంబంలాగా ప్రవర్తిస్తారు అలా నేస్తం కట్టినవాళ్లు. నేస్తానికి మిత్రుడనే అర్థంకూడా ఉంది. నేస్తం నెయ్యం కన్నాగొప్ప అనుబంధం. చిన్నయసూరి అభిమానించి ప్రయోగించిన మరోమాట సంగాతం. ఇది సంస్కృతంలోని 'సంగతం' నుంచి వచ్చిందంటారు. కలిసి మెలిసి ఉండటమని ఈ మాటకు అర్థం. సంగడి అనే మరోమాటుంది – 'కలిసి పనిచేయుట' మనే అర్థంలో. 'చెలిమి' అనేది మైత్రికి సమానమైన పదం. చాలా దగ్గరిచెలిమిని 'పొత్తు' అనవచ్చు. ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకొనేవారి మధ్యగల సంబంధం పొత్తు. ఇది స్త్రీ పురుషుల మధ్యనుండే శరీరసంబంధానికి కూడా అన్వయిస్తుంది.

ప్రేమకు బదులుగా పాతకాలపు కావ్యాల్లో వినిపించే కనిపించే తెలుగుమాట 'ఎలమి'. ఎలము – అనే క్రియాపదానికి 'చిగిరించు, వికసించు' అనే అర్థాలున్నాయి. ఎలమి సుకుమారంగా ఉంటే 'నెనరు' అవుతుంది. నెనరులో జాలి, దయ కూడా ఉంటాయి. పూర్వ కావ్యాల్లో బాగా వాడుకలో ఉన్న మరోమాట నెమ్మి. ఇంచుమించుగా ప్రేమకు సమానమైన పదమిది. ప్రేమ – ఎలమి తీవ్రంగా ఉన్నప్పటి స్థితిని చెప్పటానికి వాడదగిన మాటలు తగులం, తవులం, తగులు అనేవి. ఒక పట్టాన వదలని, వదిలించుకోలేని సంబంధం తగులం. ఇది మంచిదీకావచ్చు, చెడుదీకావచ్చు. తగులాటం – తగులాయం అనేవి ఈ మాటకే రూపాంతరాలు. అయితే కొందరు తగులాయమంటే 'కావలసిన వాడు, అయినవాడు, సంబంధి' అనే అర్థాలు చెప్తున్నారు – మహద్వాచకం చేసి! తగులుకోలు అనే పదాన్ని సాధారణంగా చెడు విషయాలకు, అక్రమసంబంధాలకు అన్వయిస్తుంటాం కానీ ఆ మాటకా అర్థవిశేషం స్వతహాగాలేదు. తీరని ప్రేమని సూచించటానికీ, తీవ్రమయిన ప్రేమను వ్యక్తీకరించటానికీ 'మరులు' అనే మాటను వాడవచ్చు. ఇంచుమించు 'మోహ'మనే సంస్కృత పదాని కిది సమానం. ఇటీవలికాలంలో ప్రేమకు పర్యాయపదంగా ఎక్కువ వాడుకలోకి వచ్చిన తెలుగుమాట వలపు. సినిమాలవల్లా, నవలాసాహిత్యంవల్లా ఈ మాటకు వ్యాప్తి పెరిగిపోతున్నది.

పెద్దవాళ్లకు చిన్నవాళ్లమీదవుండే వాత్సల్యానికి బదులు మాటలు తెలుగులో అర్మిలి, అరులు, అలిమి, అరిమిలి, అరితి – అనేవి. కానీ వీటికి నేటి సాహిత్యంలో కూడా ఎక్కడో తప్ప ప్రయోగంలేకుండా పోయింది. ప్రాచీన పద్ధతిలో గణబద్ధరచనలు చేసేవాళ్లు పాదపూరణకు వాడుతున్నారనిపిస్తుంది. అయితే మచ్చిక, మక్కువ అనే పదాలు ఇప్పటి వాడుకలో కనిపిస్తాయి. మచ్చిక శబ్దాన్ని పెంపుడు జంతువులను

దయతో దగ్గరికి తీసుకోవటంలో కూడా వాడుతున్నారు. గారం/గారాం అనే మాటలను చిన్నపిల్లలను ముద్దుచేయటంలో మచ్చికకు బదులు వాడటం కనిపిస్తుంది. మక్కువ, కూరిమి/కూర్మి అనేవాటిని ఎంతో 'ఇష్ట'మనే అర్థంలో వాడుతున్నారు గాని కూరిమి శబ్దానికి కావ్య ప్రయోగమున్నంతగా వ్యవహారంలో వాడుకలేదు. 'మచ్చిగ' అనేపదం నిఘంటువుల్లో కనిపిస్తుంది.

ప్రేమఫలితంగా సమకూడేవి పొందు, పొత్తు అనేవి. పొందిక – అంటే కుదురుబాటు. ఈ మాట పొందు అనే క్రియారూపంనుంచి ఏర్పడ్డ నామవాచక రూపం. 'పొంతన' కుదిరిన పొత్తును పొందు – అంటాం. పొంతనతో నిమిత్తంలేని కలయిక పొత్తు. ఈ పొందువల్లగాని పొత్తువల్లగాని వ్యక్తిపొందే సుఖాన్ని సంతోషాన్ని చొక్కు, సొమ్ము, బాళి అనే మాటలద్వారా వ్యక్తీకరించవచ్చు. ఈ పొందో పొత్తో కలిగేదాకా ప్రేయసీప్రియులు ఒకర్నొకరు వెంటతిప్పుకోటాన్ని 'ఎలయింపు' అంటారు. కళాపూర్ణోదయంలో అభినవకౌముది శల్యాసురుణ్ణి ఆశపెట్టి అలా ఎలయించుకొని శ్రీశైల శిఖరమెక్కిస్తుంది. పొత్తుకు ఇంచుమించు సమానార్థంలో 'మరుగు' అనే మాట పుస్తకాల్లో కనిపిస్తుంది. మరుగు శబ్దానికి ఇప్పటి అర్థం చాటు/రహస్యం అని మాత్రమే. బయటికి పొక్కని ప్రేమానుబంధాన్ని సూచించటానికి తెలుగులో చక్కటి మాటవుంది – 'ముసిమి' అని. 'ముసిముసినవ్వులు' వంటి పదబంధాల్లో 'కొద్దిపాటి, కనిపించీ కనిపించని, అంత బహిరంగంకాని' అనే అర్థాల్లో ఈ మాట మూలార్థం మరుగుపడి ముసిముసిగానే నిలిచిందిగాని నేటి వ్యవహారంలో ఇది ఎక్కడా వినిపించదు.

పూర్వ కావ్యాల్లో బహుళవ్యాప్తిలో ఉన్న మరో తెలుగుమాట 'గాదిలి'. 'ఇష్టమైన, నచ్చిన, నమ్మిన' అనే అర్థాల్లో ఈ మాటను వాడేవారు. పెద్దలకు నచ్చిన పిన్నల విషయంలో గాదిలి శబ్దం వాడవచ్చు. ఇప్పుడు ఈ మాటకు వాడుక ఉన్నట్లు లేదు; లేనట్లుందన్నా తప్పుకాదేమో! పిన్నలకు పెద్దలవద్ద మారాంచేసిగాని చేయకగాని సాధించుకోగల శక్తిని 'చనువు' అనవచ్చు. దీనికి సరైన మరో సంస్కృతపదం 'సామంతం' సాహిత్యంలోనేగాని సాధారణ వ్యవహారంలో వినిపించదు. ఈ రోజుల్లో 'చనువు (పూర్వం చనవు)' శబ్దాన్ని స్త్రీపురుషుల అన్యోన్యతను సూచించడానికూడా వాడుతున్నారు.

సంస్కృతంలోని 'ఇష్ట' శబ్దానికి సరయిన తెలుగుమాట ఇంపు. అయితే ఈ మాటను ఇప్పుడెవరూ అంతగా వాడటంలేదు. ఇంపును చక్కదనమనే అర్థంలో కూడా కొందరు వాడారు. 'మేలిమి' అనే మాటకు 'ప్రేమ, మరులు' అనే అర్థముందని కొన్ని నిఘంటువులు చెప్పినా 'ఉత్తమమైన, విలువైన, ఎత్తయిన' మొదలయిన అర్థాల్లో మాత్రమే దానికిప్పుడు వాడుక. 'తృప్తి'కి సరిగా దీటయిన తెలుగుమాట 'తనివి'. 'తనివి తీర్చుకొని' మొదలయిన పదబంధాల్లో దీనికి వాడుక ఎక్కువ; విడిగా ఇప్పటి వాడుకలో వ్యాప్తి తక్కువ. 'ఇష్టపడు' అనే క్రియాపదానికి సమానంగా 'నచ్చు' అనే క్రియను వాడుతుంటాంగాని, 'ఇష్టం' అనే నామ పదానికి సమానమైన 'నచ్చిక' అనే మాటను వాడుతున్నామని చెప్పలేం. భాషాభాగాలతో

నిమిత్తంలేకుండా సమానార్థకత ఉంటుందనడానికి, ఉన్నా ఒకప్పుడు వాడుకలో ఉండదనటానికీ ఇదో నిదర్శనం.

స్నేహం, ప్రేమ వగైరాలను తలచుకొన్నప్పుడు అవి ఉన్నవాళ్లను కూడా స్మరించాలిగదా. నిఘంటువుల్లోనయితే చాలా మాటలుంటాయి గాని ఎక్కువ వ్యాప్తిలో ఉన్న పదాల గురించే మననమాలోచిద్దాం – ఇది పరిచయమేగాని నిఘంటువుగాని శాస్త్రచర్చగాని కాదుకాబట్టి. స్నేహం కలవాడు స్నేహితుడు – ఎల్లకాలం మనవెంట వదలకుండా ఉండేవాడన్నమాట. మిత్రుడు, సఖుడు, సుహృత్తులాంటివి దీనికి సమానపదాలు. మిత్ర శబ్దానికి సూర్యుడు వగైరా ఇతరార్థాలున్నాయి. సంస్కృతంలో మిత్రశబ్దం ఎప్పుడూ నపుంసకలింగంలోనే ఉంటుంది. అందువల్లనే కొందరు సనాతన పండితులు 'అతడు మిత్రము, ఆమె మిత్రము, అది మిత్రము'లాంటి ప్రయోగాలు చేస్తుంటారు. తెలుగులో మిత్రుడు, మిత్రురాలు అనే మాటలకే స్నేహితుడు, స్నేహితురాలు అనే వాటికన్నా వాడుక తక్కువ. అయితే 'మిత్రమా' అని పిలవటం పరిపాటి. 'మిత్రా' అని పిలిచేవాళ్ళున్నట్లు తెలీదు. ఇంకా 'నేస్తం' అని పిలిచేవాళ్ళున్నారు చాలామంది. సుహృత్తు అంటే 'మంచి మనసుకలవా'డని అర్థం. అతడు స్నేహితుడు కాకపోవచ్చుగాని శత్రువెన్నటికీ కాడు. సఖుడు – అనే మాటలకు కావ్యాల్లోనే ప్రయోగం. సంబోధనలో 'సఖా' అనే రూపం. 'సఖీ!' అని చెలికత్తెలను పిలవటం సినిమాల పుణ్యమా అని వాడుకలో నిలిచింది.

స్నేహితుడనే సంస్కృత పదానికి చాలా దగ్గరైన తెలుగుమాట నెయ్యుడు. సంగాతి, సంగాతకాడు, సంగడికాడు, సంగడీడు, నేస్తగాడు అనే తెలుగు మాటలక్కూడా వాడుక తక్కువ. నేస్తం అనేది వ్యాప్తిలో ఉన్నమాట. చెలి(మి)కాడు, చెలి(మి)కత్తె అనే మాటలు పుస్తకాల్లో సినిమాల్లో కనిపించేవి, వినిపించేవి. ఈ రెంటిలోనూ సమానంగా ఉన్న 'చెలి' శబ్దాన్ని ఇటీవలికాలంలో స్త్రీలకు మాత్రమే అన్వయించి వాడుతున్నారుగాని పూర్వం ఆ మాట స్త్రీపురుషులిద్దరికీ అన్వయించేది. అన్నట్టు 'నెచ్చెలి' అనేమాట ఉందికదూ! "ఎక్కువ స్నేహంకల" వ్యక్తి అని ఆ మాటకర్థం – ప్రాణస్నేహితుడన్నట్లు, ఆప్తమిత్రుడన్నట్లు. ఇలాంటిదే మరో తెలుగుమాట 'అనుగు/అనుంగు' అనేది పూర్వం వాడుకలో ఉండేది – స్త్రీపురుషభేదం లేకుండా. 'అనుంగు నెచ్చెలి' మొదలైన తిక్కన ప్రయోగా లనేకమున్నాయి – చాలా దగ్గరివాడైన పరమస్నేహితుడనే అర్థంలో. కొన్ని శాసనాల్లో ఫలానా రాజుగారి 'అనుంగు'నని చెప్పుకొన్న వాళ్ళుండేవారు. ఇప్పుడీమాట వాడుకనుంచి చాలావరకు తప్పిపోయింది. ఎక్కడో ఒకరు 'అనుగుబిడ్డ' లాంటి ప్రయోగాలు చేస్తున్నమాట నిజమేగాని అది 'పదుగురాడుమాట' కాదన్నమాట.

స్నేహ మనటానికి దోస్తీ, స్నేహితుడనటానికి దోస్తు అనే మాటలు ఉరుదూనుంచి తెలుగులో ప్రవేశించి బాగా నిలదొక్కుకున్నాయి. ఇంగ్లీషు నుంచి ఫ్రెండు, ఫ్రెండ్‌షిప్పూ కూడా బడిపిల్లల్లో అలవాటయి పెద్దలక్కూడా వ్యాపించింది. అయితే చిన్నపిల్లల వాడుకలలో 'సావాసం' అనేది మైత్రికో స్నేహానికో సమానార్థకంగా నిలిచింది. ఈమాట సంస్కృతంలోని 'సహవాసం' (=కలిసి బతకటం/కాపురముండటం) నుంచి

వచ్చింది. నిజానికి కొంతకాలం కలిసిమెలిసి చదువుకుంటారు కాబట్టి (అప్పుడప్పుడు పోట్లాడుకున్నా చిన్నపిల్లలు వెంటనే మరిచిపోయి మళ్ళీ కలసిపోతారు కాబట్టి) సావాసం అనేమాటకు కలిసి ఉండటమనే అర్థం చెప్పవచ్చు. దీనికి కొంచెమించుగా 'చెలికారం' అనే మాట దగ్గరిది, చెలిమితో ఉండటమనే అర్థంలో సౌహార్దం, సౌహృదం అనేమాటలు రెండూ 'సుహృత్తు గుణాలు' సూచించేవి. వాటిలో మంచితనానికున్న ప్రాముఖ్యం మరిదేనికీలేదు. సఖుడి/సఖి లక్షణం సఖ్యం.

స్నేహం ముదిరి ప్రేమగా పరిణమించవచ్చు – కొన్ని సందర్భాల్లోనయినా. ప్రేమించేవాడు ప్రేమికుడు. ప్రేమించిన స్త్రీ ప్రేమికురాలు. ప్రతి ప్రేమికుడూ ప్రియుడు కాదు. ప్రియుడంటే ఇష్టమైనవాడు. అలాగే ప్రతిప్రేమికురాలూ ప్రియురాలు కాదు. ప్రేమ ఫలించిన తరువాత ప్రియుడో ప్రియురాలో కావచ్చు. ప్రేమ భగ్నమయినా ప్రేమికుడుగా, ప్రేమికురాలుగా నిలిచిపోవచ్చు. అయితే ప్రేమ ఫలించిన పురుషుణ్నే ప్రియుడన్నట్లు అటువంటి దశలోనే ఉన్న ప్రేమికురాలిని ప్రేయసి అంటారేగాని ప్రియురాలనే వాళ్ళ సంఖ్య చాలా తక్కువ. 'ప్రేయసీ ప్రియు'ల వంటి పదబంధాల వాడుక ఇందుకు కారణం. ప్రేమా వలపూ సమానార్థకాలని ప్రేయసీ ప్రియుల స్థానంలో 'వలపుకాడు, వలపుకత్తె'లను నిలపటం కష్టం. ఆ మాటలకు సహజంగా అపార్థం లేకపోయినా మోహపరవశులయిన జంటనే ఈ తెలుగు మాటలతో పలకరిస్తుంటారు. ప్రయోగ సందర్భాలనుబట్టి ఇలా ఊహించగలమేగాని శబ్దగతంగా అలాంటి అర్థంలేదు. ప్రేమికుడనే అర్థంలో వాడే 'అరితికాడు, మేలువాడు'లాంటి తెలుగుమాటలు పుస్తకాల్లో మాత్రమే ఎక్కడో కనిపించే మాటలే. మేలువాడనే మాటకు 'ఉత్తముడు, పైవాడు, ఎక్కువవాడు'లాంటి ఇతరార్థాలు కూడా ఉన్నాయి. మేలు శబ్దానికి 'ఎత్తు, పైభాగం' అనే అర్థవిశేషాలూ ఉన్నాయి. (ఉదాహరణకు మేలు దూలం, మేలుమిద్దె వంటి ప్రయోగాలు వాడుకలో వినిపిస్తాయి). 'ప్రియ' శబ్దానికి 'ఖరీదయిన' అనే అర్థవిశేషం వాడుకలో వచ్చింది. (ఈయేడు ధాన్యం ప్రియమయింది. ప్రతిదీ 'పిరియ' మయితే బతికేదెలా? – లాంటి ప్రయోగాలు చూడండి). మేలునుంచి కూడా ఇదే మూలార్థంతో 'మేలిమి (బంగారం), మేలు (కట్టు)' వంటి పదబంధాలేర్పడ్డాయి.

ప్రేమికుల మధ్య, ప్రేయసీ ప్రియులమధ్య ఎప్పుడయినా గొడవలు రావటం కద్దు. రాకపోతే ఆశ్చర్యపడాలేమో! సంస్కృతంలో 'ప్రణయకలహ' మనేమాట ఈ పరిస్థితిని వర్ణించటానికి పుట్టింది. తెలుగులో 'పొలయలుక/పొలయల్క, వెడమోడి' అనే మాటలున్నాయి. అలుక/అల్క అంటే కోపం. మోడి అంటే కోపం వచ్చినప్పుడు ప్రదర్శించే చిరాకు, విసురు వగైరాలు. కొన్ని నిఘంటువుల్లో 'పొల' శబ్దానికిచ్చిన అర్థాలకూ ఈ సమాసానికీ పొంతన కుదరటంలేదు. 'వ్యాపించు, వీచు, పుట్టు, విసరు' మొదలైన అర్థాలున్న 'పొలయు' అనే క్రియకూ ఈ విశేషణానికీ సంబంధముందని చెప్పవచ్చు. ప్రేమామృతంలోనయినా మునిగితేలటం ఎల్లప్పుడూ సాధ్యం కాదు.

★ ★ ★

# శత్రువు-శత్రుత్వం

మైత్రిని గురించి ప్రస్తావించినప్పుడు దానికి వ్యతిరేకమయిన శత్రుత్వం గురించి రెండుమాటలు తెలుసుకోవటం న్యాయం. వైరం, విరోధం అనే రెండు సంస్కృతపదాలు శత్రుత్వంలాగా వాడుకలో ఉన్నాయి. వీర శబ్దానికీ వైరానికీ సంబంధముంది. వైరం బహిరంగమయింది, కనబడేది. శత్రుత్వం ఎన్నివిధాలనయినా ఉండవచ్చు. అందుకే అనుకూల శత్రుత్వం, ప్రతికూల శత్రుత్వంలాంటి మాటలు పుట్టాయి. శత్రుత్వంలో మోసం, వెన్నుపోటు, నటన వంటివి ఉండవచ్చు. వైరం బాహాటమయింది. విరోధం ఈ రెంటికన్నా విలక్షణమయింది. అది తాత్కాలికం కావచ్చు; దీర్ఘకాలికం కావచ్చు. కానీ అభిప్రాయాల్లో నడవడిలో ఆలోచనల్లో 'విరుద్ధత'వల్ల పుట్టేది విరోధమే. తన దారికి అడ్డువచ్చినప్పుడు పుట్టేభావం విరోధం. శత్రుత్వం, వైరమంత తీవ్రమయిందికాదు విరోధం. వైరుధ్యమనేది మరోమాట. ఇటువంటి అభిప్రాయభేదాలవల్ల, అడ్డంకులవల్ల వైరుధ్యం కలుగుతుంది. వైరానికీ శత్రుత్వానికీ ఇంతచిన్న కారణాలక్కరలేదు. వాటికి 'పగ' ప్రధానం. విరోధంలో పగ పాలు తక్కువ, కోపమెక్కువ.

తెలుగువాళ్ళకు మాతృభాషలో శత్రుత్వాదులకు దగ్గరగా ఉండే మాటలు చాలా ఉన్నాయి – కోపదారివాళ్ళు కనుక. "ఒంటమి, ఒప్పమి, కంటు, కొట్లాట, గొడవ, దెబ్బలాట, జగడం, పగ, పోట్లాట, వేరం, మచ్చరం, సూడు"లాంటి మాటలింకా ఉన్నాయి. ఒంటమి తనమార్గం నచ్చని, తనకు అనుకూలంగా ఉండనివాళ్ళ మీద పుట్టేభావం. 'ఒంటిగంటం రామలింగం' అంటారే అతడి లక్షణమన్నమాట. ఒంటమిలో తీవ్రతలేదు – తిరుగుబాటులేదు. తనగొడవే తనదిగా ఇతరులకు దూరంగా ఉండటం ఒంటమి. ఒప్పమి అంటే ఒకరు చెప్పింది ఒప్పుకోకపోవటం – తనకు విరుద్ధంగా చెప్పినమాటనూ చేసిన పనినీ సహించక దూరంగా ఉండటమే ఒప్పమి. ఒంటమి కలవాడు తనకుతాను దూరంగా ఉండి బాధపడతాడేగాని ఆ బాధనుకూడా వ్యక్తీకరించడు. ఒప్పమి కలవాడు తన భావాలు చెప్పావచ్చు – మానావచ్చు. అంతే భేదం. తక్కిన లక్షణాలు ఒంటమికీ ఒప్పమికీ సమానమే. ఈ రెంటికీ ఇప్పుడు వాడుక ఉన్నట్లులేదు. కొద్దిమంది ఇంకా అక్కడక్కడ 'ఆయన నిష్కారణంగా కంటువెట్టుకున్నాడు'లాంటి వాక్యాలు వాడుతున్నారు. భారతంలో "మొగమున గంటు వెట్టుకొని' అనే ప్రయోగం చాలాచోట్ల కనిపిస్తుంది. ఇంచుమించు 'కోపం, పగ' వంటి అర్థాలున్న ఈ మాటకు వాడుక తక్కువ.

కొట్లాట, దెబ్బలాట, పోట్లాట అనే మాటలు విచిత్రమైనవి. పదంలో 'ఆట' ఉన్నా అవి ఆటలుకావు. ఏదో కదలికగల శత్రుత్వాలన్నమాట. కొట్టు, దెబ్బ, పోటు – అనేవాటిలో మొదటిదానికన్నా రెండోది, దానికన్నా మూడోది తీవ్రమైనవి. వీటిలో సమాన లక్షణం చేతికన్నా ఎక్కువగా నోరు పారేసుకోవటం. చాలా

సందర్భాల్లో చెయ్యిచేసుకోవటం జరక్కపోయినా మాటల స్వరూపం మటుకు మారలేదు! శరీరానికి జరిగే కొట్లు, పోటులాంటి ప్రమాదం ఏమీలేకుండా నిర్వహించే శత్రుత్వం జగడం. అది సాధారణపదం. పై మూడూ అందులో భాగాలు. వాడుకలో 'వాళ్ళిద్దరూ జుట్టూ జుట్టూ పట్టుకున్నా'రంటాం కాని నిజంగా ఒకరిజుట్టు మరొకరు పీకారని అర్థం కాదు. జగడం వైరంలాంటిది. బహిరంగమయింది. ఎవరూ జగడాన్ని మనస్సులో పెట్టుకోలేరు – శత్రుత్వాన్ని లాగా. ఈ లక్షణంలో ఇది 'పగ'కన్నా వేరయినది. పగ మనసులో ఉండే శత్రుత్వం; సాధారణంగా దీర్ఘకాలికం. తరతరాలుగా కూడా ఒక్కొక్కప్పుడది అలాగే రాజుకుంటూ ఉంటుంది. అందుకే 'తాచుపగ, పాముపగ'లాంటి మాటలు పుట్టాయి. కోపతాపాల తీవ్రత తగ్గినా పగ తగ్గదు. కొన్ని ప్రాంతాల్లో శత్రుత్వం వచ్చిందనడానికి 'జట్టీ వచ్చింది, గొడవ(లు) వచ్చాయి' అంటారు. జట్టీ నిజానికి ముఠాలాంటిది. కొందరొకవైపూ మరికొందరు ఇంకోవైపూ ఉండి తగాదాపడితే అది జట్టీ రావటం. చిన్నచిన్న కారణాలకే పుట్టి, అంత తీవ్రంగా ఉండక, తొందరగా సమసిపోయే శత్రుత్వమే గొడవ. వైరుధ్యం లాంటిదది. కొన్ని నిఘంటువులు శత్రుత్వానికి 'మచ్చరం' పర్యాయపదమని చెప్తాయిగాని అది 'మాత్సర్య'మనే సంస్కృత పదం నుంచి పుట్టినమాట. ఈర్ష్య, అసూయలతో పుట్టిన శత్రుత్వం మచ్చరం. ఇప్పుడు వాడుకలో లేదనిపించే మరో తెలుగుమాట 'సూడు'. ఈ శబ్దానికి క్రియార్థంలో 'కాల్చు, తగలబెట్టు' అనే అర్థ విశేషాలున్నాయి. తీవ్రమయిన క్షణికమైన శత్రుత్వం సూడు.

వైరానికీ శత్రుత్వానికీ ఉన్న అంతరమే వైరికీ శత్రువుకూ మధ్యకూడా ఉంది. వైరి అనేమాటకిప్పుడు వాడుక చాలా తక్కువ. 'విరోధి' అనేమాట ఎక్కువ వ్యాప్తిలో ఉంది. విరోధం కలవాడూ, కల్పించినవాడూ విరోధి. పరిపంథి లాంటి పదాలు పుస్తకాల్లో తప్ప కనిపించవు. అచ్చతెలుగులో "పగ, పగతుడు, పగవాడు, మార్తుడు" అనే మాటలున్నాయి. పగతుడు కావ్యాల్లోనే కనిపిస్తాడు. పగవా డనేమాటను విరోధి, శత్రువు, వైరి అనే మూడార్థాల్లోనూ సమానంగా వాడుతున్నాం. పూర్వకావ్యాల్లో "పగ" అంటే పగవాడనే పదానికి సంక్షిప్తరూపంగా (నిజానికి పగవాడనేదే విస్తృత రూపం) కనిపిస్తుంది. ఇప్పుడటువంటి ప్రయోగం సాహితీ గ్రంథాల్లో కూడా అరుదైపోయింది. బహువచనంలో 'పగరు' అని ప్రాచీన గ్రంథాల్లో ప్రయోగముందిగాని వాడుకలో అమాట లేదిప్పుడు. మార్తుడు – అంటే ఎదుర్కొన్నవాడు, తిరగబడినవాడు, కయ్యానికి కాలుదువ్వినవాడు అని అర్థం చెప్పవచ్చు. పగవాడు ఇలా బయటపడనక్కరలేదు. అదే వారిద్దరికీ భేదం.

శత్రుత్వానికి కారణాలనేకం. కొన్ని సమయాల్లో భయంవల్లకూడా శత్రుత్వం రావచ్చు. క్రూర జంతువులు మనిషికి భయపడి తిరగబడితే, మనిషి అవి చంపుతాయేమోనన్న భయంతో ముందుగా తానే చంపటంకద్దు. భయం, భీతి అనే రెండు సంస్కృతపదాల్లో రెండోదానికి వాడుక తక్కువ. భయభీతులని ద్వంద్వసమాసం చేసేవాళ్ళూ ఉన్నారు. భయానికి సరైన తెలుగుమాట వెరపు; భీతికి సరిపొయ్యే తెలుగు పదం జంకు. ఇప్పటివాడుకలో భయం, జంకు రెండే

ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాటలు. వెర, వెరగు – అనే తెలుగుమాటలు 'వెరపు' శబ్దానికి పర్యాయపదాలని కొందరు కోశకర్తలు చెప్పారు. కానీ 'వెరగు' అనేమాటకు ఆశ్చర్యమనే అర్థంకూడా ఉంది. జంకులో పిరికితనముంది; అది వెరపులోలేదా? అనుమానమే. నిర్భయంగా నిర్భీకంగా అనే మాటలున్నాయి. ఆ సందర్భంలో 'జంకులేకుండా' అనే అర్థం చెప్పకోవాలి. వ్యుత్పత్తులను గాలించి మూలార్థం కనిపెట్టినా కాలక్రమంలో వాడుకలో నిలిచిన అర్థమే మిగులుతుంది నిజానికి.

## నిజానిజాలు

చాలా సందర్భాల్లో నిజానిజాలు తెలియక, తెలుసుకోక, తెలియజెప్పక శత్రుత్వాలు వస్తుంటాయి. మామూలుగా నిజం, అబద్ధం అనేవి వ్యతిరేకార్థక శబ్దాలుగా వాడుకలో ఉన్నాయి. నిజం, అనిజం అనే వాటిలోని రెండోమాట ఈ సమాసంలో తప్ప విడిగా కనిపించదు. ముందు నిజంసంగతి చూద్దాం – దానిలాగానే దాని పర్యాయపదాల సంఖ్య కూడా తక్కువే కాబట్టి. సత్యం, ఋతం, సూనృతం, సమ్యక్, తథ్యం వంటి సంస్కృతపదాలూ, 'నిక్కం, నిక్కువం, నిక్కెం, నేటు' వంటి తెలుగుపదాలూ సమీపార్థంలో ఉన్నమాటలు. నిజం సంస్కృతమో తెలుగో ఉచ్చారణనుబట్టి చెప్తారు సంప్రదాయపండితులు! దాని వ్యుత్పత్తి కూడా సందిగ్ధమన్నమాట. నిజంనుంచి 'నైజం' అనే మాట పుట్టింది. దానికర్థం 'స్వభావం, పుట్టుకతో వచ్చిన గుణ'మని. ఓ పెద్దపండితుడు 'జని' (అంటే పుట్టుక) తిరగబడి 'నిజ' శబ్దం పుట్టిందన్నాడు! అదేమయ్యా అంటే 'సింహం'లోంచి 'హింస', 'హింస' లోంచి 'సింహం' పుట్టిందని యాస్కాచార్యుడంతటివాడు చెప్పగాలేంది జని–నిజాలు ఒకదాన్నుంచి మరొకటి పుట్టాయంటే తప్పా అని రెట్టించాడు. కాబోలు. పేచీ ఎందుకు?

నిజం, సత్యం అన్నివిధాలా సమానమైనవి కావు. సత్యం ఖచ్చితమైనది. తిరుగులేనిది. ఒకరు నిజ మనుకొన్నది మరొకరికి నచ్చకపోవచ్చు. స్వభావం మీద ఆధారపడ్డది నిజమయితే, నిత్యత్వం మీద ఆధారపడిన తాత్వికమైన నిజమే సత్యం. ఋతమనేది పుస్తకాల్లో మాత్రమే కనిపించేమాట. దాన్ని నొక్కిచెప్పే మరోమాట సూనృతం. ఋతం (రుతమనిరాస్తే నేటి భాషలో తప్పేంకాదు) ఋజువయింది – అంటే తిన్నగా ఉండేది, వంకరలేనిది. స్పష్టంగా కనిపించే వినిపించే నిజమన్నమాట. తెలుగు వాడుకలో 'ఋజువు, రుజువు' రెండూ ఉన్నాయి. మొదటిదానికి 'సూటిఅయిన' అనే అర్థముంటే రెండోదానికి 'నిరూపణ, సాక్ష్యం, దృష్టాంతం' అనే అర్థాలున్నాయి. 'బ'కు రెండు కొమ్ములిచ్చినమాట సంస్కృతం నుంచీ, 'ర'కు ఒక్కకొమ్మిచ్చింది ఉర్దూద్వారా పర్షియన్‌భాష నుంచీ తెలుగులోకి వచ్చినమాటలు (రెంటినీ 'రుజు'వనే రాయవచ్చుగాని సందర్భాన్నిబట్టి అర్థం గుర్తించవలసి వుంటుంది). సూనృతమంటే చాలా సూటిగా ఉండేది. స్పష్టమైనమాట అన్నమాట. వీటన్నిటిలోకీ సత్యమనేది

పెద్దమాట. దానికి వేదాంతంలో తర్కశాస్త్రంలో ప్రత్యేకమయిన అర్థాలున్నాయి. అబద్ధంకానిదనే అర్థంలో 'నిబద్ధి' అనే సమీపపద మొకటుంది. దానికిప్పుడు వాడుక తక్కువ. కట్టుబాటులేనిమాట అని అర్థం. మాటకు కట్టుబాటుంటే నిబద్ధి. సత్యం దైవానికి తప్ప మరిదేనికీ కట్టుబడి ఉండదంటారు కొందరు. దైవమే సత్యానికి కట్టుబడి ఉంటుందని మరికొందరు చెప్తారు. నిబద్ధి మాటకూ నిజం పుట్టుకకూ/స్వభావానికీ కట్టుబడి ఉంటుంది. తథ్యమన్నా సత్యమేనని కొందరు. దానికి తప్పనిది, తప్పకుండా జరిగేది అనే అర్థాలు కూడా ఉన్నాయి. నిజమనే అర్థంలో వాడుక చాలా తక్కువ.

నిక్కం, నిక్కువం, నిక్కెం అనే తెలుగుమాటలు ఒకదానికొకటి రూపాంతరాలు. మూలమొక్కటే. మరి గతిలేదుకాబట్టి దీన్నే/వీటినే సత్యాదులన్నిటికీ పర్యాయపదాలుగా భావించాలి. నేటు శబ్దానికి వ్యుత్పత్తి తెలియదు. పైగా దానికి ప్రయోగం చాలా తక్కువ. అది మారుమూలమాటకిందే లెక్క.

నిజానికన్నా అబద్ధానికే వ్యాప్తి ఎక్కువ. అందుకేనేమో సంబంధిపదాలుకూడా ఎక్కువే. "అసత్యం, కపటం, కైతవం, ఛద్మం, దంభం, మృష, అబద్ధి, అనర్థక"మనేవి సమీపార్థంగల సంస్కృతపదాల్లో ఎక్కువ వ్యాప్తికలవి. వాటినే తీసుకుందాం. అబద్ధమంటే కట్టుబాటులేనిదని చెప్పాలి. ఈమాటకే తెలుగులో వాడుక ఎక్కువ. దాని తరువాత బాగా వాడుకలో ఉన్నది అసత్యం. కపటంలో మోసముంది. కావాలని చెప్పే అబద్ధమే కపటం. కైతవ మనేది 'కితవ' శబ్దం నుంచి వచ్చింది. కితవు డంటే జూదగాడు. జూదంలో చేసేమోసమే కైతవం. ఆటనియమాలకు కట్టుబడకుండా ఉండటం కాబట్టి అదోరకం అబద్ధమన్నమాట – సంకుచితార్థంలో. ఛద్మశబ్దానికి మారు (వేషం), రహస్యం, దాపరికం అనే అర్థాలున్నాయి. నిజాన్ని దాచింది ఛద్మం; నిజానికి వ్యతిరేకం అబద్ధం. అనర్థకమనేమాటకు 'పాసగనిమాట' అని అర్థం. ఇప్పటివాడుకలో 'ప్రమాద'మనే భావం కూడా ఉంది. 'అర్థంలేని'దని, 'అర్థంకాని' దని కూడా వివరించవచ్చు. ఇంకా 'నికృతి' (తప్పుపని) వంటి మాటలను కూడా పర్యాయ/సమీపపదాలుగా పరిగణించే వారున్నారు. కాని ఆ బాపతు మాటలకు ప్రయోగాలు చాలా తక్కువ.

అనృతమనే మాటకు 'సేద్యం, కృషి' అనే అర్థాలు సంస్కృతనిఘంటువుల్లో కనిపిస్తాయి! ఈ అర్థాలెందుకు వచ్చాయో తెలీదు. అంతకన్నా ఘోరం, సంస్కృతంలో 'సత్యానృత' మనే మరోమాటుంది. మాటనుబట్టి 'సగం నిజం, నిజమైన అబద్ధం, నిజంగా కనిపించే అబద్ధం' వగైరా అర్థాలను ఊహిస్తే పప్పులో కాలువేశామన్నమాటే. నిఘంటువుల ప్రకారం ఆ మాటకు "బేరం, బేరమాడట"మని అర్థంట! వ్యాపారంలో, బేరంలో నిజానిజాలు రెండూ కలగాపులగ మైపోతాయనుకొని ఈ అర్థం కల్పించారేమో తెలీదు.

అచ్చతెలుగులో అబద్ధానికి పర్యాయపదాలని చెప్పేమాటలు చాలా ఉన్నాయి. "కల్ల, కొడిమె, దబ్బర, ఉల్లసం, బూతు, బూమె, బూక, బూటకం, బద్దు, బొంకు, వేడబం, హుళిక్కి (వాడుకలో హుళక్కి అనే రూపమే ప్రచురం)" మొదలైనమాటలున్నా, 'కల్ల, బొంకు' అనేవాటికే ప్రయోగబాహుళ్యం కనిపిస్తుంది.

కలకూ కల్లకూ వ్యుత్పత్తిరీత్యా చాలా దగ్గరి సంబంధముంది. లేనిది ఉందని చెప్తే కల్ల. ఉన్నది లేదంటే బహుశా బొంకేమో! 'దబ్బర'కు అబద్ధమనే అర్థంలో కావ్యప్రయోగాలు మెండు. హుళిక్కి/హుళక్కి అంటే శూన్యం, లేనిదన్నమాట. ఈ పదం కన్నడం మంచి దిగుమతి అయింది. అన్నట్లు తెలుగులో భాస్కరరామాయణం రాసిన కవిని హుళక్కి భాస్కరుడని వ్యవహరిస్తారుగాని అది పొరపాటు. అమాట 'హుళకి' – అంటే తాంబూలం. ఈ గ్రంథం రాయడానికి రాజుదగ్గర 'తాంబూలం పుచ్చుకొన్నాడన్నమాట' (–అంటే అంగీకరించాడని అర్థం). బూతుకు 'తిట్టు, తప్పుమాట, పదిమందిలో పలకరానిపదం' అన్న అర్థాలతోబాటు 'పొగిడేవాడు, భట్రాజు' అనే అర్థాలు కూడా ఉన్నాయి. బూతు అతిశయోక్తి కావచ్చుగాని అంతా అబద్ధం కాదు. కల్లను పెంచిచెప్తే బూతవుతుంది.

బూక అనే మాటకిప్పుడు వాడుకలేదుగాని దాన్నుంచి పుట్టిన 'బూకరింపు' దబాయింపనే అర్థంలో ప్రయుక్తమవుతున్నది. లేనిది ఉందని గట్టిగా చెప్పటం బూకరింపు. అదే పూర్వం బూక. బూమె శబ్దం 'భ్రమ' నుంచి పుట్టిందనేవాళ్ళున్నారు. నిజానికి దాని వ్యుత్పత్తి తెలీదు. బూటకం ముమ్మూర్తులా కపటంతో సమానమయిన తెలుగుమాట. మోసంతో కూడిన అబద్ధమని వివరించవచ్చు. ఉల్లసమనేమాటకు "ఎత్తిపొడుపు" అనే అర్థంకూడా ఉంది. వేడబం పుస్తకాల్లోమాత్రమే కనిపిస్తుంది. వాడుకలో వినిపించదు.

## కష్టసుఖాలు

నిజానిజాలే కష్టసుఖాలకు కారణమవుతాయి. మనదో చిత్రమయిన భాష. తెలుగులో కష్టాలకున్నన్ని పర్యాయపదాలు సుఖాలకు కనిపించవు. 'సంకటం, బాధ, సంబాధ, ఆధి, వ్యాధి, విపత్తు, ఆపత్తు, ఆపద' మొదలైన సంస్కృతపదాలు కష్టానికి పర్యాయపదాలు. తెలుగు మాటలు 'ఇడుమ, బెడద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆత్రం, అంగలార్పు, గోరం, దొసగు, వెత, కస్తి, అంగద, కడగండ్లు, అగచాటు, అగబాటు, బాము, చోద, పల్లటం, మల్లట, చోడుమ, బడవ'లాంటి వనేక మున్నాయి.

కష్టమనేది (బహుశా కష్టాలనే బహువచనరూపంలో) చాలా ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట. శరీరానికిగాని మనసుకుగాని ఒత్తిడి కలిగించి అలసటపెట్టేది కష్టం. బాధ అలాంటిదేగాని వ్యక్తిని కట్టిపడేసి ఎటూ తోచని పరిస్థితి కలిగించేదికూడా. సంబాధ(ం) అంటే తీవ్రమయిన బాధ. ఆధి అనేది మనసుకు మాత్రమే కలిగిన కష్టమయితే వ్యాధి శరీరానికి వచ్చిన కష్టం. కష్టంకన్నా బాధ, దానికన్నా సంబాధ తీవ్రమయినవి. ఆధి వ్యాధులు విడివిడిగా ప్రత్యేక కష్టాలు; కలిసికట్టుగా మనిషిని పూర్తిగా బాధించేవి. ఆపద ఆపత్తులకు రూపభేదమేగాని అర్థభేదంలేదు. విపత్తు విశేషమయిన ప్రమాదమయితే ఆపత్తు/ఆపద సాధారణ ప్రమాదం. అనుకోని సంఘటన ద్వారా మామూలుగానో ప్రత్యేక పద్ధతిలోనో వచ్చే కష్టం ఆపద;

తీవ్రంగా ఉంటే విపత్తు. ఈ రెంటిలోనూ 'ప్రమాద' వశాన వచ్చిన కష్టముండటం సమానధర్మం; అవి రెండూ అనుకోని కష్టాలన్నమాట. సంకట శబ్దానికి ఇబ్బంది, ఇరుకు అనే అర్థాలున్నాయి.

తెలుగు కావ్యాల్లో అనేక పదాలు కష్టపర్యాయాలుగా కనిపించినా 'ఇడుమ, కడగండ్లు, అగచాటు, బాము' అనేవే బహుళ వ్యాప్తిలో ఉన్నాయి. ఇడుమకూ ఇబ్బందికీ పెద్ద అంతరమున్నట్లు తోచదు. తమంత వచ్చిపడ్డ ఇబ్బందులు ఇడుమలు. వాటిని అనుభవించక తప్పదు. కడగండ్లు శబ్దానికి ఏకవచన రూపం ప్రయోగాల్లో కనిపించదు; అది నిత్యబహువచన మన్నమాట – కడదాకా అంటే జీవితాంతం నిలిచే కష్టాలవి. అగచాటు, అగబాటు అనేవి కనిపించే కష్టాలు, లోకానికి తెలీకుండా తమలో తామే బాధపడేవి కావవి. బహిరంగకష్టా లన్నమాట. బాము శబ్దం 'భ్రమ' నుంచి వచ్చిందంటారు కొందరు. నిజానికి కష్టాలు కాకపోయినా కష్టాలనిపించేవి బాములు. తిక్కనాదులు ఈ శబ్దాలను ఎంతో మెలకువతో ప్రత్యేకార్థాల్లో ప్రయోగించారు. మామూలు కవులు ఈ అర్థవిశేషాలను పాటించకుండా గణయతిప్రాసలు సరిపోతేసరి అని అన్నింటినీ ఒకేవిధంగా ప్రయోగిస్తుంటారు.

బెడద అంటే భయం పుట్టించే కష్టం; తీవ్రమయిందన్నమాట. బెడదకు ప్రమాదం, ఆశ్చర్యకర కష్టమనే విశేషార్థాలు కూడా కనిపిస్తాయి. దెస అనేది నిఘంటువులు పొరపాటున పర్యాయపద పట్టికల్లో చేర్చిన మాటేమో! అది దిశ/ దిక్కు అనే శబ్దం నుంచి పుట్టిందనవచ్చు. చేటు శబ్దానికి నష్టమనే అర్థంకూడా ఉంది. చెడిపోవటం చేడ్పాటు. కష్టాలకు ఫలితంగా వచ్చే ప్రమాదం చేడ్పాటు. దీనికి క్రియారూపం చేడ్పడు. గొడవకు 'గోల, అల్లరి, శత్రుత్వం, పొరపొచ్చెం, అభిప్రాయభేదం'లాంటి అర్థవిశేషాలుకూడా ఉన్నాయి. ఆత్రం బహుశా సంస్కృతంలోని అతురత అనే శబ్దం నుంచి పుట్టింది కావచ్చు. 'తొందరపాటు' అనే ప్రత్యేకార్థం దానికుంది. అంగలార్పు అనేది తీవ్రబాధా సూచకం. బాధ(లు) భరించలేక ఏడవటం అనేది అంగలార్పు ప్రత్యేక లక్షణం. దుఃఖపూరితంగాని కష్టం అంగలార్పు కాదు. గోరం అనేది కేవలం ప్రాంతీయ వ్యవహారంలో ఉన్నమాట. అది 'ఘోర' శబ్దభవమని కొందరంటారుగాని 'రోగ' శబ్దంలోని వర్ణవ్యత్యయం వల్ల ఏర్పడ్డదనటమే సమంజసతరంగా ఉంటుంది. కొన్ని ప్రాంతాల్లో – గుంటూరు, ప్రకాశం ప్రాంతాల్లో – పెద్దింటివాళ్లు కష్టాల్లో ఉన్నా, రోగగ్రస్తులై ఉన్నా, 'అమ్మగారి 'గోరం' తగ్గిందా?' అని ఓదార్పుగా అడగటం కద్దు. రోగశబ్దం వాడటం బాగుండదని (రోగం కుదిరింది – వంటి ప్రయోగాల్లో ఆక్షేపణ పాలెక్కువ కాబట్టి) గోరం అనే రూపాన్ని వాడటం వినిపిస్తుంది.

దొసగు అంటే నిజానికి తప్పనే అర్థం. 'వెత' సంస్కృతంలోని 'వ్యథా' శబ్దం నుంచి ఏర్పడింది. 'వెతలుకుడుచు' వంటి ప్రయోగాలు 'బాధలు అనుభవించు' అనే అర్థంలో పూర్వకావ్యాల్లో కనిపిస్తాయి. విశేషమైన బాధనే వ్యథ/వెత అనవచ్చు. కుమిలిపోవటం వంటి మానసిక కష్టాలే వెతలు. కస్తి అనేది చిన్న కష్టాలకూ, పెద్ద ఇబ్బందులకూ సూచకం. ఇప్పటికీ ఈ మాటకు వాడుక లేకపోలేదు. 'చోద, పల్లటం, మల్లటం, చోడుమ, బడవ'ల అర్థం స్పష్టంగా తెలియదు – వ్యుత్పత్తులంతకన్నా అస్పష్టం. వీటికి ఇప్పటి కావ్యాల్లో కూడా వాడుక చాలా తక్కువ.

సుఖం తెలుగువాళ్లకు దొరకని వస్తువేమో! 'సుకం, సుగం' అనే తద్భవరూపాలే గానీ మరే అచ్చతెలుగు మాటలూ నిఘంటువుల కెక్కినట్లు లేదు. సంస్కృతంలో 'అబాధ, మోదం, ఆమోదం, ప్రమోదం, సమ్మోదం, ఆనందం, శర్మ, శాతం, సాతం, ప్రీతి, ప్రసాదం, హార్షం' వంటివి సుఖ శబ్దానికి పర్యాయాలని నిఘంటువులు ఘోషిస్తున్నాయి. బాధకు కేవలం వ్యతిరేకమైనది అబాధ. మోదమంటే సంతోషం. ప్రమోదం మరీ ఎక్కువ సంతోషం. సమ్మోదం పూర్తి సంతోషం. హార్షం అంటే మనస్సుకు కలిగే ఆనందం, తృప్తి. శర్మ శబ్దానికి శాంత లక్షణం గల ఆనందమని విశేషార్థం. ప్రీతి అంటే ఇష్టం, నచ్చిక. ఇలా చూస్తుంటే సంస్కృతంలో కూడా సుఖం తక్కువే నవిపిస్తుంది!

## తెలివితేటలు

నిజానిజాలూ కష్టసుఖాలూలాంటి భావాలను నిరూపించేది 'బుద్ధి'. ఇలాంటి అమూర్త వస్తువులను (అంటే కంటికి కనిపించని రూపంలేని మాటలను) సూచించే పదాలు తెలుగులో చాలా తక్కువ సంస్కృతంతోపోలిస్తే. అమరకోశంలో కనిపించే మాటలను తీసుకున్నా బుద్ధివిశేషాన్ని వివరించే పదాలు సంస్కృతంలో చాలా వున్నాయి – 'మనీష, ధిషణ, ధీ, ప్రజ్ఞ, శేముషి, మతి, ప్రేక్ష, ఉపలబ్ధి, చిత్తు, సంవిత్తు, ప్రతిపత్తు, జ్ఞప్తి, చేతన, మేధ, సంకల్పం, అవధానం' మొదలైనవి.

బుద్ధిశబ్దానికి 'తెలివి, ఎరుక, తలపోత'వంటి తెలుగు మాటలు సమీపపదాలు. ఎరుక శబ్దానికి జ్ఞానం అనే అర్థం వుండగా తలపోతకు ఆలోచన, ఊహ అనే అర్థవిశేషాలున్నాయి. 'వాడికి బుద్ధీ జ్ఞానమూ లేవ'నే మాటలు వింటుంటాం. సహజంగా ఉండే పుట్టుకతో వచ్చిన తెలివి బుద్ధి. లోకాన్ని చూసి, అనుభవాలు పొంది గడించిన ఎరుక జ్ఞానం. ఈ రెండూ లేవనేది ఆక్షేపణ. తెలుగులో మరో చిత్రమైన నానుడి వుంది. 'తెలివి ఎక్కువయితే బుద్ధి తక్కువవుతుంది' అనేది! అంటే సొంతంగా తెలివితేటలున్న వ్యక్తి ఇతరులు చెప్పేదాన్ని వేదప్రమాణంగా ఒప్పుకోడని. బుద్ధికీ 'బోధ'కూ సంబంధముంది. బోధ అంటే తెలివిడి – తెలుసుకోవటం. ఈ బోధ తనంత తానుగా స్వీయానుభవాలవల్ల కలిగేది. దాన్ని ప్రయత్నపూర్వకంగా కలిగించటమే బోధన. స్వయాన తెలుసుకున్నవాడు బుద్ధుడు. ఒకరు తెలియజేస్తే తెలుసుకున్నవాడు బోధితుడు; అలా తెలియజెప్పేవాడు బోధకుడు.

'మనీష' అంటే ఆలోచనద్వారా వచ్చిన జ్ఞానం. అటువంటి జ్ఞానంగల వ్యక్తి మనీషి. ఇటీవల చమత్కారంకోసం 'మనీ(డబ్బు), షి(స్త్రీ)' – ఈ రెండూ ఉన్నవాడే మనీషి అని కొందరు నిర్వచిస్తున్నారనుకోండి! 'మన్' అంటే ఆలోచన. ఆలోచనాపరుడు మనీషి. ఆలోచనవల్ల కలిగిన తెలివి మనీష. మతి అన్నా 'తెలివి, ఆలోచన' అనే చెప్పవచ్చు. 'వాడికి మతిలేదు, బుద్ధి లేదు' అనే వాక్యాల్లో 'సక్రమమైన'

ఆలోచన, 'సరయిన' తెలివి లేవనే ఆక్షేపణ వుందన్నమాట. ప్రజ్ఞ అంటే గొప్ప తెలివిడి. ప్రేక్ష అంటే బాగా 'చూసి' తెలుసుకోగల శక్తి. అన్నీ గమనించగల శక్తి ప్రేక్ష. ఉపలబ్ధి అంటే సహజంగా జన్మసిద్ధంగా వచ్చిన తెలివి. లబ్ధి అంటేనే 'వచ్చిపడ్డది' అని అర్థం. జ్ఞప్తి అంటే గుర్తు. మంచిచెడ్డలూ నిజానిజాలు వగైరాలను గుర్తించగలగటం జ్ఞప్తి. ఇవన్నీ అర్థం చేసుకోగల సామర్థ్యాన్ని సూచించే మాటలు.

ఒకసారి గుర్తించిన, తెలుసుకున్న విషయాన్ని మనసులో నిలుపుకోగలగడం మేధ. ఈ శక్తిని 'మేధాశక్తి' అంటారు. చాలామంది 'మేదశ్శక్తి' అని పొరపాటుగా వాడుతుంటారు. మేదస్సు అంటే మెదడు. మేధ అంటే తెలివితేటలు. ఇవి రెండూ ఒకదానిమీద మరొకటి ఆధారపడ్డవే కాబట్టి ఈ పొరపాటు ప్రయోగం వచ్చిందన్నమాట. మనస్సు చేసేపని – ఆలోచన, ఊహ మొదలైనవి – సంకల్పం. ఖచ్చితంగా చెప్పితే 'అనుకొన్నది' అని తెలుగుచేయాలి. దీనికి విరుద్ధమయింది 'వికల్పం'. అనుకొన్నదానికి పూర్తిగా వ్యతిరేకమైనది వికల్పం. అవధానమంటే ఒకవిషయంగాని అనేక విషయాలుగాని మనస్సులో నిలిపి వుంచటం. దృష్టిని కేంద్రీకరించి, ఏకరంధిగా, ఒకేపట్టుగా చేసే ఆలోచన అవధానం. అవధానంలో గుర్తు, పట్టుదల కూడా ఉంటాయి. దీన్నే 'మనస్కార'మని కూడా అంటారు. అంటే 'మనను చేసేపని' అన్నమాట.

చర్చ అనేది కూడా బుద్ధికి దగ్గరిమాటే. ఒక విషయంలోని మంచిచెడ్డలను జాగ్రత్తగా పరిశీలించటం చర్చ. ఈ కాలంలో ప్రతిపనికీ ఒక చర్చాగోష్ఠిని ఏర్పాటుచేసి ఎవరి ఉపన్యాసం వారు చెప్పిపోవటంకూడా చర్చకిందే చలామణి అయిపోతున్నది. భావికాలంలో ఈమాటకు ఈ కారణంగా 'చెప్పింది వినట' మనో, 'సభ చేయట' మనో, మైకులూ పూలదండలూ ఫోటోగ్రాఫులూ వగైరాలు ఏర్పాటుచేయటమనో అర్థం రావచ్చు! 'తర్కం' బుద్ధి చేసేపని. ఊహ లేనిదాన్ని ఆలోచనద్వారా చర్చద్వారా కల్పించటం. ఇలాంటి భేదాలెన్నో!

తెలివి, ఎరుక అన్నవి అన్నివిధాలా ఒకటి కావు. తెలివి సహజం. ఎరుక సంపాదించినది – తరవాతి కాలంలో వచ్చేది. ఎరుకకు మరో రూపం 'ఎరకువ' అనేదుంది. అలాగే తెలివికి 'తెలివిడి' అనే సమీప పదముంది. తెలివిడి అనేది నిజానికి జ్ఞానం. తెలుగు మాటలకు సంస్కృతంలోనో, నాలెడ్జ్ అని ఇంగ్లీషులోనో అర్థం చెప్తే స్పష్టంగా వుండవచ్చు.

బుద్ధికి వ్యతిరేకపదాలేవనే అనుమానం వస్తే తప్పేంలేదు. అబుద్ధి, అజ్ఞానం వంటి మాటలేగాని, ఇలా సమాసాలుగాని వ్యస్తపదాలున్నట్లు లేదు. ఉన్నాయని గిట్టించినా వాటికి వాడుక ఉన్నట్లు లేదు. తెలుగులో కూడా 'తెలివి ఎక్కువ, తెలివిలేమి' వంటివే వ్యతిరేకార్థకాలుగా స్ఫురిస్తాయి. 'మొద్దు' వంటి మాటలున్నా అవి 'కదలికలేని, చెట్టుబోదె' వంటి విశేషణ విశేష్యార్థాలు కలవే! అయినా కావలసింది తెలివితేటలేగాని అవి లేకపోవటం కాదు కాబట్టి మనవాళ్లు బండెడు పర్యాయపదాలనో సమీపపదాలనో సృష్టించుకొని వుండకపోవచ్చు. 'మొద్దూ మొకరం' అనే ప్రయోగం తెలుగులో తెలివితక్కువ వాళ్లను ఆక్షేపిస్తూ వాడుకలో వుంది. అక్కడకూడా మొద్దంటే కొమ్మలూ రెమ్మలూ లేని చెట్టుబోదెలాంటి వ్యక్తి

అనే అర్థం. మొకరం/మొగరం అనేమాటకు 'స్తంభం' అని అర్థం. ఓ బండలాగా, మొండిచెట్టులాగా, గుంజలాగా, రాటలాగా ఏ ఆలోచనా ఏపాటి జ్ఞానమూలేని వ్యక్తి అనే నిందే ఇందులో వినిపిస్తుంది. మొత్తానికి మన 'బుద్ధుల'వల్లనే మానావమానాలు వస్తాయి. శుభాశుభాలు కలుగుతాయి.

# మానావమానాలు

మానవజాతిలో సంఘర్షణలకు దారితీసే మానసిక లక్షణాల్లో మానావమానాలు ముఖ్యమైనవి. ఒకరి మానంవల్ల మరొకరికి అవమానం జరిగినప్పుడు పరిణామాలు తీవ్రంగా ఉంటాయి. భారత రామాయణాదుల్లోని మహాయుద్ధాలకు దారితీసిన సంఘటనలన్నీ ఆయాపాత్రల మానావమానాలమీదే ఆధారపడ్డవి. మొదట మానం సంగతి తెలుసుకుందాం. కొద్దిపాటి అర్థభేదాలతో మాన శబ్దానికి సన్నిహితంగా ఉండేమాటలు చాలా ఉన్నాయి! "గౌరవం, ఆదరం, గర్వం, అహంకారం, అభిమానం, దర్పం, అవలేపం, అవష్టంభం, స్మయం, మదం" అనే సంస్కృత పదాలూ 'మన్నన, మన్నిక, మన్నింపు, ఈలువు' వంటి తెలుగుశబ్దాలూ ఈ కోవకు చెందినవి.

మానమంటే తన ఘనతనే గుర్తించే స్వభావం. సహజంగా ఈ భావమున్న వ్యక్తికి ఇతరులమీద చిన్నచూపుంటుంది. ఈ స్వభావం మరింత ఎక్కువై ఇతరులు తన ఘనతను గుర్తించలేదనే బాధతో కుమిలిపోవటాన్ని 'మానరోష' మంటారు. తనకు పారిజాత పుష్పం ముందుగా ఇవ్వలేదనుకున్న సత్యభామ ప్రకటించిన లక్షణం మానరోషం. దాంతోనే కృష్ణుణ్ణి ఎడమకాలితో తన్నిందంటారు. ఎదుటి వ్యక్తిమీద తనకున్న మానం – అంటే గౌరవభావం అభిమానం. స్పష్టతకోసం తనమీద తనకున్న అభిమానాన్ని ఆత్మాభిమాన మంటారు. 'మాన్యత, మాన్యుడు, మాననీయుడు' మొదలైన మాటల అర్థాలకూ మాన శబ్దార్థానికీ సన్నిహిత సంబంధముంది. గౌరవశబ్దం గురువనే విశేషణం నుంచి పుట్టింది. పెద్దతనాన్నీ పెద్దరికాన్నీ గుర్తించి ప్రవర్తించటం గౌరవం చూపటం. ఆదరం ప్రేమతో కూడిన గౌరవభావం. అది విడిగా అంత స్పష్టంగా అర్థవంతంగా ఉండదని కాబోలు 'గౌరవాదరాలు, ప్రేమాభిమానాలు' మొదలైన సమాసాలు వాడుతుంటాం. గౌరవం చూపదగిన వ్యక్తి 'గౌరవనీయు'డని మంత్రులు వగైరాలను అలా సంబోధిస్తుంటాంగాని వ్యాకరణం ప్రకారం అది తప్పుశబ్దం. మాననీయుడనో మాన్యుడనో అనాలి. అన్నట్లు 'మంత్రి' శబ్దంకూడా ప్రాంతీయంగా గౌరవంలేని మాటే. కళింగప్రాంతంలో (విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాల్లో) మంగలిపని చేసేవాళ్ళని 'మంత్రు'లనీ, నేతపనివాళ్లని 'సేనాపతు'లనీ పిలుస్తారు! మన మంత్రులు దేశానికీ దేశసంపదకూ అలాంటిపని చేయగూడదనుకున్నవాళ్లు 'అమాత్యు'లనీ, 'సచివు'లనీ వాళ్లని పిలుస్తుంటారు. కార్యదర్శులను 'సచివు'లంటారు ఉత్తర హిందూస్థానంలో. మన రాష్ట్రంలో కూడా వాళ్లంతా ఉండేచోటును 'సచివాలయ'మంటున్నామని గుర్తించండి – సెక్రటేరియట్‌కు తెలుగు అనువాదంగా).

మాన శబ్దానికి సమీప పదాల్లో ఎక్కువ వాడుకలో ఉన్నమాట 'గర్వం'. ఈ అర్థంలోనే ప్రాంతీయంగా 'అతిశయ' మనేమాట వాడుకలో వినిపిస్తుంది. తన్ను తాను గొప్పగా భావించటం అతిశయం. ఇది సంస్కృత పదమేగాని సంస్కృతంలో ఈ అర్థ విశేషం కనిపించదు. 'ఎక్కువ' అనే అర్థమే ఆ భాషలోని సహజార్థం. గర్వమున్న వ్యక్తికి తప్పకుండా ఉండే మరో లక్షణం 'అహంకారం'. అహమంటే నేను. అహంకారమంటే నేనే ప్రయోజకున్ననీ, అంతా నాకే తెలుసని, అన్నీ నేనే చేయగలవనీ మిడిసిపడటం – విర్రవీగటం. అహంకారమున్న వ్యక్తికి తప్పకుండా ఉండేది దర్పం. గర్వంవల్ల అహంకారం, దానివల్ల దర్పం పుట్టుకొస్తాయి. 'మింగమెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగనూనె రాసే' మనస్తత్వానికి దర్పమని పేరు. డాబు, డాబుసరి, (కొన్ని సందర్భాల్లో బడాయి) దర్పానికి సమానమయిన తెలుగు (?) మాటలు. బడాయి హిందీనుంచి వచ్చినమాట. మూలార్థంలో నేనే గొప్ప/పెద్ద అనే భావమది. దీనికి సమంగా గోదావరిజిల్లాల్లో వినిపించే మరోమాట 'గీర'. ఎక్కువవాడుకలో ఉన్న మరో సమీప పదం 'మదం'. ఈ భావమున్న వ్యక్తి మత్తులోపడ్డట్లు వ్యవహరిస్తాడు. 'స్వాతిశయ' భావంతో విర్రవీగటమే మదం. ఇక 'అవష్టంభం, స్మయం, అవలేపం' అనే పదాలు కావ్యభాషలో మాత్రమే కనిపిస్తాయి. వాటి వాడుక లేనిదానితోనే సమానం.

ఎక్కువగా ప్రదర్శించే మానం 'బహుమానం'. నిజానికి ఆ మాటకు అర్థం మారిపోయింది. నేటివాడుకలో ఇప్పుడు 'బహుమతి, పురస్కారం, బహూకృతి, ప్రెయిజ్' వగైరా అర్థాల్లోనే బహుమాన శబ్దం వాడుతున్నాం. బహుమానితుడంటే కావ్యభాషలో పెద్దగా గౌరవం పొందిన వ్యక్తి అనే అర్థమే ఉంది. వాస్తవంలో బహుమతి శబ్దానిక్కూడా అటువంటి అర్థమే ఉండేది. గొప్పవాడని భావించటం బహుమతి; ఆ దృష్టితో గౌరవించటం బహుమానం; అలా పెంచి పెద్దచేయటం బహూకృతి. ఈ అర్థాలు మారి వ్యక్తినీ వ్యక్తిత్వాన్నీ గుర్తిస్తూ ఏదైనా వస్తువునో పతకాన్నో సొమ్మునో (చివరికి కాణీ ఖర్చులేని బిరుదాన్నో) ఇవ్వటాన్ని బహుమానించటమనీ, ఇచ్చినదాన్ని బహుమానం/బహుమతి/బహూకృతి అని పిలుస్తున్నాం. 'మీకీవస్తువును బహూకరిస్తున్నామం'టే ఇస్తున్నామనేగాని మిమ్ము గౌరవిస్తున్నామన్న అర్థం ఈ కాలానికి మరుగుపడిపోయింది.

తెలుగులో 'పొగరు, మిడిసిపాటు, డాబు(సరి), గీర, విర్రవీగటం, తలతిరుగుడు, కళ్ళు నెత్తికెక్కటం, అదిరిపాటు' వగైరా మాటలున్నాయి. పొగరు అహంకారానికి, మిడిసిపాటు మదానికి ఇంచుమించు సమానమైన పదాలు. గర్వంనుంచి 'గరువం' అనే తెలుగుమాట పుట్టింది. నిఘంటువులు అభిమానానికి సమానపదమని 'ఈలువు' అనే తెలుగుమాటను పేర్కొంటాయి. ఇది 'నీలుగు' అనే మాటకు రూపాంతరం. నీలుగు అనేదానికే వాడుక ఎక్కువ. మొండితనంతో గూడిన గర్వమది. ఇక బహుమాన శబ్దంతోబాటు అర్థంమారిన తెలుగుమాట మన్నన. తిక్కన వాడుకలో దీనికి వ్యాప్తి ఎక్కువ. మన్నింపు అనేది మన్నించు (=గౌరవించు, ఆదరించు) అనే క్రియారూపంనుంచి ఏర్పడ్డ నామవాచకం. 'మన్నిక' అనేదీ అటువంటిదేగాని ఈ కాలానికి దాని అర్థంమారి 'చాలాకాలం చెడకుండా మారకుండా ఉండే'దనే

అర్థవిశేషం సంపాదించుకున్నది. బహుమాన శబ్దానికి ఇప్పుడున్న అర్థంలో కావ్యాల్లోనే కనిపించే తెలుగుమాట 'ఉడుగర'; వాడుకలో కూడా వినిపించేది 'కానుక' (కాన్కి, కానిక – వంటి రూపాలు పుస్తకాల్లో ఉంటాయి).

అవమానమన్న సంస్కృత పదానికే తెలుగులో వాడుక ఎక్కువ. దానిసమీప పదాల్లో 'పరాభవం, తిరస్కారం, పరిభవం' అనే వున్నాయని చెప్పవచ్చు. అగౌరవమనే వ్యతిరేకరూపం కూడా బాగా వాడుకలో ఉంది. 'అనాదరం, పరీభావం, తిరస్క్రియ, తిరస్కృతి, అవమాననం, రీఢ, అవజ్ఞ, (అవ)హేళనం, నికారం, న్యక్కారం, అభీభావం, అవగణన, అవమతం, అసూక్షణం, అసుక్షణం' వంటి సమీపపదాలు కావ్యభాషలో కనిపిస్తాయి. ఆదరం చూపకపోవటం అనాదరమయితే మానం గుర్తించకపోవటం అవమానం. ఉన్నగౌరవాన్ని తగ్గించిచూడటం అవమానం. ఉన్నగౌరవాన్ని తగ్గించి చూడటం, తక్కువగా చూడటం అవమానం. నిర్లక్ష్యం చేయటం తిరస్కారం. సదరువ్యక్తికున్న గౌరవం చూపకపోగా, అసలావ్యక్తే లేనట్లు భావించటం తిరస్కారం. ఎదుటివ్యక్తిని లేనివాడితో సమంగాభావించటమేగాక తక్కువ చేయటం తిరస్క్రియ. ఈ మాటకు 'మాయంకావటం, కనిపించకపోవటం, అదృశ్యంకావట'మనే అర్థవిశేషాలు కూడా ఉన్నాయి. కనిపించకుండా చేయటమనే అర్థంలోనే తెరగుడ్డకు 'తిరస్కరిణి' అనేపేరు వచ్చింది. పరదా అనే అర్థంలోనేగాక, మాయమయ్యే, లేదా ఎదుటివాళ్లకు కనిపించకుండాపోయే విద్యకు పేరుగాకూడా తిరస్కరిణీ శబ్దానికి ప్రయోగముంది. అవమానంచేయటం అవమాననం. పరిభవం, పరీభావమనేవి 'రూపాంతరాలు'. పరాభవ శబ్దానికీ వీటికీ సన్నిహిత సంబంధముంది. 'దూరంచేయటం, విసిరికొట్టటం' వగైరా అర్థవిశేషాల్లో పరాభవాదులకు ప్రయోగాలు కనిపిస్తాయి. అవమానించటం మాటలరూపంలో ఉంటే పరాభవం క్రియారూపంలో ఉంటుందికాబట్టి అది తీవ్రతరమయింది. అనాదరానికి 'అనాదృతి' అనే రూపాంతరముంది.

అవజ్ఞ అనేది సుకుమారమయిన అవమానం. తక్కువవాడని తెలుసుకోవటం అవజ్ఞ. తెలుసుకొని లేదా గుర్తించి భావించి ఏంచేస్తారనేది తరవాతి విషయం. హేళన, అవహేళన, వహేళన అనేవి వెక్కిరింతలు. మాటలద్వారాగాని చేష్టలద్వారాగాని 'వేళాకోళం' చేయటం హేళన. హేళనలో అవతలివ్యక్తిని కించపరచటం లేకపోవచ్చు. కానీ (అ)వహేళనలో కించపాటు, తక్కువచేయటం ముఖ్యం. అవగణనమంటే తక్కువచేయటం. గణనశబ్దానికి లెక్కించటం, గుర్తించటం మొదలైన అర్థాలున్నాయి. అవగణన తక్కువ వ్యక్తి/వస్తువని పరిగణించటం/చూడటం. అవమతశబ్దానికి తక్కువ వ్యక్తి వస్తువని 'భావించట'మని అర్థం. అవగణనం క్రియారూపమయితే అవమతం కేవలం మానసికమైన భావన. అన్నట్లు పరాభవ శబ్దానికి పండితభాషలో ఓగమ్మత్తయిన తెలుగు పర్యాయపదముంది. అది 'నలభై'. అరవై సంవత్సరాల చక్రంలో 'పరాభవ' నలభయ్యోదికాబట్టి అతడికి పరాభవం జరిగిందనటానికి 'నలభై అయిం'దంటారు (స్పష్టంగా నోటితో చెప్పకుండా).

తక్కిన సంస్కృత పదాలకు కావ్యభాషలో మారుమూల ప్రయోగాలున్నాయని కూడా వెంటనే చెప్పలేనివి 'అసూక్షణం, అసుక్షణం, అభీభావం' అనే శబ్దాలు. నికారమనేపదానికి అక్కడక్కడ కావ్యప్రయోగాలు లభిస్తాయి. న్యక్కారమనే మాటకు

'ఛీఅనట'మని అర్థం చెప్పవచ్చు. దీనికి కావ్యప్రయోగాలేగాని వ్యవహార ప్రయోగమున్నట్లు లేదు. కానీ 'ధిక్కారమును సైతునా, కుటిలజన ధిక్కారమును సైతునా' అన్నపాట తెలుగునేల నాలుగుచెరగులా మారుమోగిపోయింది. ధిక్కారాన్ని 'ఛీకొట్టడ'మని అనువదించవచ్చు. క్రియాపదమైన ధిక్కరించుకు 'ఎదురుతిరుగు, తిరుగుబాటుచేయు' మొదలైన అర్థాలువచ్చి 'ఛీకొట్టు' అనే సగంతెలుగు, సగం సంస్కృతం క్రియాపదముంది. దానికి అవమానించు అనే అర్థం. అవమానం పొందాలంటే భంగపడాలి; అవమానం చేయాలంటే భంగపరచవచ్చు కూడా.

తెలుగు 'బన్న'మనే మాటకు భంగమని అర్థమంటారు. అది భగ్నశబ్దభవమని కొందరంటే మరికొందరు భంగ శబ్దంనుంచే వచ్చిందంటారు. ఏమయితేనేం? అది అచ్చతెలుగనే లెక్కిద్దాం – వ్యాకర్తల ననుసరించి. బన్నమనేమాటకు కష్టమనే అర్థభేదం కూడా ఉంది. తెలుగులో అవమానపర్యాయాలని నిఘంటువులు పరిగణించినమాటలు 'ఒచ్చెం, ఎల్లిదం, చౌక, నలుచు' అనేవి. ఎల్లిదానికి ఏలిదమనే రూపాంతరముంది. దీనికి 'తేలిక, తక్కువ, ఎగతాళి, వేళాకోళం' మొదలైన అర్థాలున్నాయి. ఈ మాట నేటివాడుకలో ఉన్నట్లు తెలీదు; తిక్కన భాషలో చాలాచోట్ల కనిపిస్తుంది. ఒచ్చెం అనేమాట వ్యుత్పత్తి సరిగాతేలదు కానీ అక్కడక్కడ పాతకాలపు మనుషులవాడుకలో ఇంకా వినిపిస్తుంది – పల్లెటూళ్లలో. 'చౌక'కు గిరాకీ ఎక్కువ. '(వెల)తక్కువ' అనే అర్థవిశేషంలో ఈ మాటకు బహుళవ్యాప్తి ఉంది. 'కించపాటు' అనే నామరూపం, 'కించపరుచు' అనే క్రియాపదం కొద్దిమంది వాడుకలో ఉన్నాయి.

మానావమానాలను గురించి మామూలు మనుషులు పట్టించుకోవాల్సిందేగాని పండితులు గుర్తించనక్కరలేదంటారు. 'భారతసావిత్రి'లో 'మానావమానంబులు దేహంబునకేగానిఆత్మకుం జెందనేర'వని సాక్షాత్తుశ్రీకృష్ణపరమాత్మ విదురుడంతటి విద్వాంసుడికి బోధిస్తాడు! చిత్రమేమంటే – కాదు, విచారకర విషయమేమంటే – అచ్చతెలుగులో 'పండితుడు, కవి' అనే మాటలకు సరైన పర్యాయపదాలు లేకపోవటం. గతిలేక 'కవి'ని తెలుగుకవులు 'కయి' అని పిలిచారు. 'కయి/కై' అనేమాటకు 'చేయి' అని అర్థం! అదేవిధంగా కవిత మనకు 'కయిత' అయిపోయింది. వికటకవి రామలింగడు 'ఏమి తిని సెపితివి కపితము' అని అల్లసాని పెద్దన్ననే వెక్కిరిస్తూ 'కపితము' అనేమాటను 'కవిత్వ' శబ్దానికి తెలుగుపర్యాయం చేసిపారేశాడు. ఖర్మ!

## పండితపామరులు

కవులను స్మరించినమీదట పండితులను ప్రస్తావించక తప్పదు. "విద్వాంసుడు, విపశ్చిత్తు, దోషజ్ఞుడు, సుధి, కోవిదుడు, బుధుడు, మనీషి, విజ్ఞుడు, సంఖ్యావంతుడు, కవి, ధీమంతుడు, సూరి, కృతి, కృష్టి, విచక్షణుడు, లబ్ధవర్ణుడు, దూరదర్శి, దీర్ఘదర్శి" వగైరాలు పండితశబ్దానికి పర్యాయపదాలంటారు. ఇవన్నీ సంస్కృతపదాలే. ఒకప్పుడు వేదవిద్య తెలిసిన వ్యక్తినే పండితుడనేవారు. సంప్రదాయబద్ధంగా చదువుకొన్నవాళ్లని

పండితులనేవాళ్లు. బ్రిటిష్‌హయాంలో ప్రాచ్యవిద్యా సంస్థలు స్థాపించి అందులోని ఉపాధ్యాయులను పండితులని (పండిట్స్) పిలిచారు. దరిమిలా తెలుగుసంస్కృతం వగైరా దేశభాషలు బోధించేవాళ్లని పండితులన్నారు. కళాశాలల్లో విశ్వవిద్యాలయాల్లో దేశభాషలను బోధించే ఇంగ్లీషువిద్యలు రాని ఉపాధ్యాయులను పండితులని పిలుస్తున్నారు. రామరామ వాళ్ల పాండిత్యం సంగతి అలావుంచి చిన్న ఉద్యోగాలు చేసే, ఇంగ్లీషు వచ్చినా అంతగారాని ఉద్యోగులను (ఉపాధ్యాయులను) పండితులనటం పరిపాటయింది. బోధన వృత్తిలో ఉన్నవాళ్లు తమనెవరయినా అధికారులు 'పండితు'లని వ్యవహరిస్తే జీతం తగ్గుతుందనో, తగ్గిస్తారనో భయపడుతుంటారు. పండిత శబ్దం బిరుదుగా కాక ఉద్యోగంగా పరిణమిస్తున్నదన్నమాట!

విద్వాంసుడంటే 'తెలిసిన'వాడని అర్థం. ఏమి తెలిసినవాడన్నది వేరే ప్రశ్నగాని సాధారణంగా ప్రాచీనశాస్త్రాలు నేర్చినవాడనే భావం మిగిలినట్లుంది. అందుకే దీని మరో రూపమైన 'విద్వాన్' అనేది ప్రాచ్యవిద్యాజ్ఞాన సూచకమైన ఓ డిగ్రీ పేరయిపోయింది. అపట్టా ఉన్న వ్యక్తికి ఇంగ్లీషు భాషా జ్ఞానం తక్కువనీ, అందువల్ల తెలుగు/సంస్కృతం నేర్పే ఉపాధ్యాయపదవికి తప్ప మరెందుకూ పనికిరాని వ్యక్తి అనీ కొన్ని దుర్భావాలు పుట్టాయి. పూర్వాపరాలు గుర్తించగలిగిన పండితుణ్ణి విపశ్చిత్తు అంటారు. ఈ మాట పుస్తకాల్లోనే మిగిలిపోయింది. వాడుకకు ఎక్కినట్లు లేదు. **"పండితః పండితం దృష్ట్వా శ్వానవత్ ఘుర్ఘురాయతే"** అనే సామెత పుట్టింది సంస్కృతంలో. కుక్కలకులాగా పండితులక్కూడా జ్ఞాతివైరం సహజమనీ, అందువల్ల ఇద్దరు పండితులు సమీపిస్తే ఒకరివైపు మరొకరు గుర్రుపెట్టూచూస్తుంటారనీ అప్రతిష్ఠ వచ్చిపడింది. అందుకు విద్యాస్పర్ధ – అంటే చదువుల్లో పోటీ – ప్రధానకారణం. ఈ లక్షణంవల్ల పండితులకు దోషజ్ఞులు – అంటే తప్పులు తెలిసినవాళ్లు – అనే పేరు వచ్చింది. తప్పులు వెతికేవాళ్లనేది దానివెంటనే వచ్చిన అపప్రథ అనుకోండి. ఈ మాటకు వాడుక చాలా తక్కువ. వాడవలసినవాళ్లు పండితులే కాబట్టి తమకు తప్పులే తెలుసుగాని ఒప్పులు తెలీవనే సూచ్యార్థంగల ఈ మాటను అంతగా వాడటంలేదన్నమాట.

సుధి అంటే మంచి తెలివిగలవాడని అర్థం. ఆ తెలివినే 'ప్రతిభ' అంటారు. ప్రతిభావంతుడనే అర్థంగల ఈ మాటకు గ్రంథప్రయోగం ఎక్కువ. కోవిదుడు అనేపదం కొన్ని పరీక్షలకు పేరయిపోయింది. (ముఖ్యంగా హిందీ సంస్కృతాల్లో 'కోవిద' పరీక్షలున్నాయి). ఆ పరీక్షల్లో నెగ్గినా నెగ్గకపోయినా 'బాగాతెలిసిన వ్యక్తి' అనే అర్థంగల మాట ఇది. బుధుడంటే మంచివాడని (బుధగ్రహంలాగా) అసమర్థుడని దురర్థాలు వచ్చాయిగాని తెలిసినవాడనే సహజార్థం దానికుంది. బుద్ధ శబ్దానికీ బుధ శబ్దానికీ అర్థగతమైన సంబంధముంది. 'పెద్దమనిషి' అనే అర్థం పండితవ్యవహారంలో ఉంది. మనీషి అంటే మేధావి – తెలివిగలవాడు. ఇంతమంచి మాటకు ఈకాలంలో జరుగుతున్న దుశ్చర్యల ప్రభావంతో 'పెడర్థాలు' పుట్టాయి. కొందరు 'మనీ+షి' (అంటే ధనం+స్త్రీ) అని పదాన్ని విరిచి 'కాంతాకనకాలు' అనే వికటార్థం సృష్టించారు. 'మనీ' ఇంగ్లీషుమాట, షీలాగానే. ఈ శబ్దమేమో సంస్కృతపదం. ఇది చమత్కారానికి చేసిన కసరత్తేగాని శబ్దార్థం కానేకాదు.

ఈ మాటకు కొంతవ్యాప్తి ఉంది. 'ప్రాజ్ఞుడు' గొప్పగా తెలిసినవాడయితే 'విజ్ఞుడు' విశేషంగా తెలిసినవాడు. అర్థాలయితే ఇలా ఉన్నాయిగాని పండితులకు లోకజ్ఞానం తక్కువ అని నూటికి తొంభయ్యమంది వాదిస్తారు. అంటే పుస్తక ప్రపంచమేగాని వాస్తవ జగత్తు తెలియనివాళ్లని తేల్చిచెప్పటమన్నమాట. సంఖ్యావంతుడనే మాటకు 'అంకెలు తెలిసినవాడు' అని అర్థం. మంచిలెక్కగాడని, గణితశాస్త్రజ్ఞుడనీ భావం. పూర్వం జోస్యులకూ (జాతకాలు చెప్పేవాళ్లకీ), గణకులకూ (లెక్కలు వేసేవాళ్లకీ) ఈ పదం అన్వయిస్తుండేది. పుస్తకాల్లో తప్ప దీనికి వాడుకలేదు. 'కవి' అనేది కవిత్వం చెప్పేవాడనే అర్థంలోకన్నా 'శుక్రాచార్యుడు' (రాక్షసగురువు) అనే భావంతోనో, మొదటి కవి 'వాల్మీకి' అనే భావంతోనో పర్యాయపదమవుతుంది పండితశబ్దానికి. పండితకవుల సంఖ్య చాలా తక్కువ – వేళ్ళమీద లెక్కించవచ్చు. కేవలం పండితులూ కేవల కవులూ అసంఖ్యాకులు. పండితులు కవిత్వం చెప్పలేరనీ, కవులకు పాండిత్యం తక్కువనీ లోకప్రవాదం.

ధీమంతుడంటే తెలివితేటలున్నవాడు. ఒప్పచెప్పే/బట్టీపెట్టే పండితుడు ధీమంతుడు కాడు నిజానికి. సూరి అంటే పండితుడు – చదువుకున్నవాడని అర్థం. కృతి అంటే పుణ్యవంతుడనే అర్థంకూడా ఉంది. కావ్యాలనూ పాటలనూ కృతులని కూడా పిలుస్తారు.. పండితుడనే అర్థంలో ఈ శబ్దానికి కావ్యప్రయోగాలేగాని వాడుకలేదు. కృష్టి అంటే శ్రమించేవాడని అర్థం. 'కృషి' చేసేవాడన్నమాట. ఎంతో అవస్థపడి చదివికూడా చదువు ఒంటబట్టని వ్యక్తిని ఈ పేరుతో పిలిస్తే అతికిపోతుంది. కానీ ఈ మాటను వాడినవాళ్లే చాలాతక్కువ. లబ్ధవర్ణుడనేమాట ఒకనాటి సమాజధర్మాన్ని తెలుపుతుంది. 'రంగుకు వచ్చిన వా'డని 'ముక్కస్య ముక్కార్థం' చెప్పవచ్చు. ఆర్యసమాజంలో పుట్టకపోయినా చదువుసంధ్యలవల్ల వన్నెవాసీ సంపాదించిన పండితుడని వివరించవచ్చు. అమరకోశం పర్యాయపదాలని పేర్కొన్నా నిజజీవితంలో పండితుడనే వాడికి లేని, ఉండని లక్షణాలతో వాళ్లకి 'దూరదర్శి, దీర్ఘదర్శి' అనే పేర్లు పెట్టినట్లుంది – వెక్కిరింతగా! ముందుచూపుగలవాడు దూరదర్శి. ఆలోచించి తెలుసుకొనేవాడు దీర్ఘదర్శి. నీతిచంద్రికలోని చేపలపేర్లలాంటి ఈ బిరుదులు పండితులకు వచ్చాయన్నమాట. ఇప్పటి వాడుకలో 'విద్యావంతు'డనే మాట పండిత శబ్దానికి సరయిన పర్యాయపదం. 'చదువరి' అనే తెలుగుమాట సమీపపదం. ఈ కాలానికి 'చదువుకొన్నవాడు' అనే అర్థం మారి 'చదువుతున్నవాడు/పాఠకుడు' అనే అర్థం వచ్చి పడింది చదువరి శబ్దానికి! తెలుగులో ఇటువంటి శబ్దాలకు పర్యాయ/సమీప. పదాలు చాలా తక్కువ.

పండితుడన్నప్పుడు అపండితు డుండక తప్పదు – అక్షరాస్యు డున్నప్పుడు నిరక్షరాస్యుడిలాగా. అన్నట్లు అక్షరాస్యుడన్నది విచిత్రమైన మాట. ఆస్యంలో – నోటిలో, అక్షరాలున్నవాడనీ, లేనివాడనీ ఎవరు ఎప్పుడు ఈ మాటలను సృష్టించారోగాని అవి భాషలో నిలిచిపోయాయి. తెలుగువాళ్ల సంస్కృతంలో తప్ప ఈ జంట మరెక్కడా కనిపించదు – వినిపించదు. అపండిత శబ్దానికికూడా సమీపపదాలూ పర్యాయ పదాలూ ఉన్నాయి. 'అజ్ఞుడు, మూఢుడు, యథాజాతుడు, మూర్ఖుడు, వైధేయుడు, బాలిశుడు' అనే పదాలను అమరకోశం పేర్కొంటున్నది.

జ్ఞానం (=ఎరుక) లేనివాడు అజ్ఞుడు. మూఢుడంటే ఏమీ తెలియనివాడనీ, మూర్ఖుడంటే తెలిసీ తెలియనివాడనీ వివరిస్తుంటారు. ఇలాంటివాడే జడుడు ఒకడున్నాడుగాని అమరంలో ఆయనకు స్థానం దొరకలేదు. జడశబ్దానికి సరైన తెలుగుమాట 'మొద్దు'. కానీ సంస్కృత సాహిత్యంలో జడభరతుడనే మహావేదాంతి ఒకడున్నాడు. తమాషా ఏమంటే సంస్కృత పండితులు – ముఖ్యంగా వ్యాకరణ పండితులు – "దేవానాం ప్రియు"డనేవాణ్ణి కనిపెట్టారు. ఆ మాటకు మూర్ఖుడని అర్థం చెప్పారు. అయితే అశోకచక్రవర్తి తన బిరుదంగా ఈ శబ్దాన్నే వాడుకున్నాడు. 'దేవతలకు ఇష్టుడు' అని మాటకర్థం. బహుశా అశోకుడు బౌద్ధమతం పుచ్చుకున్నందువల్ల అర్షవిద్వాంసులు అతణ్ణి మూర్ఖుడని తిట్టడానికి ఈ విశేషార్థం కల్పించారేమో తెలీదు! ఇలాంటి చమత్కారాలు మన పండితులకు కొట్టినపిండి. కాబట్టే రామాయణంలోని 'సుందరకాండ'కు ఆ పేరెందుకు వచ్చిందంటే 'సుందరో హనుమాన్ జ్ఞేయః' అని ఒక నిఘంటువును సృష్టించి సుందరుడంటే హనుమంతుడేనని తెలుసుకోండన్నారని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు విస్మయచకితులైనారు!

యథాజాతుడన్నది సరసమైన కల్పన. 'పుట్టినప్పటిలాగే ఉన్నవా'డని ఆ మాటకు స్పష్టార్థం. ఎన్నాళ్లుబతికినా ఏమీ జ్ఞానం సంపాదించనివాడనే వెక్కిరింపుతో ఈ మాట పుట్టింది. వైధేయుడు, బాలిశుడు అనేవి భిన్నప్రాంతాల వ్యక్తులను నిందిస్తూ పుట్టించిన ఆర్యభాషా పదాలు. వాటికి వాడుక లేదనలేం – రెండోమాట ఇంకా అర్థంతో నిమిత్తం లేకుండా నిందార్థకంగా వాడుకలో ఉంది కాబట్టే. అపండితుడికి తెలుగులో సమానుడు 'మొరకు' అంటారుగాని అది మూర్ఖశబ్దం నుంచి వచ్చింది. మన మొద్దుకు తిరుగులేదన్నమాట.

పండితాపండితుల మధ్యగల భేదం జ్ఞానాజ్ఞానాలకు సంబంధించింది. ఈ రెండు మాటలకూ తిరుగులేని వాడుక ఉంది. జ్ఞానశబ్దానికి సంబంధించిన మాటలు జ్ఞాతం, జ్ఞేయం అనేవి తార్కికుల వాడుకలో ఉన్నాయి. జ్ఞాతమంటే నిజానికి 'తెలిసినది'; జ్ఞేయమంటే 'తెలుసుకోదగింది, తెలుసుకోవలసింది'. జ్ఞానం ఎక్కువైతే విజ్ఞానమవుతుంది. ఆంగ్లవిద్యద్వారా మనకు సంక్రమించిన 'సైన్స్' అనే పదానికి పర్యాయంగా విజ్ఞానశబ్దం రూఢిలోకి వచ్చింది. విజ్ఞానసర్వస్వం వంటి సమాసాల్లో అన్ని రకాల 'ఎరుకలకూ' విజ్ఞానమనే పదాన్నే వాడుతున్నాం. తెలుగుమాట 'ఎరుక'; దానికి తోడుబోయింది 'తెలివిడి'. విజ్ఞాన శబ్దంనుంచి 'విన్నాణ'మనే తెలుగుమాట పుట్టింది. అయితే కాలక్రమాన దానికి 'నేర్పు, కుశలత, కౌశల్యం, నిపుణత, నైపుణ్యం' అనే అర్థాలు వచ్చిచేరాయి. అజ్ఞానాన్ని 'అవిద్య, అహంమతి' అనికూడా గురికిబెత్తెడెడంగా వ్యవహరిస్తుంటారని ఇంతకుముందే అనుకున్నాం. అవిద్యాశబ్దాన్ని వేదాంతులెక్కువగా వాడుతుంటారు. వేదం, వేదాంతం తెలుసుకోకపోవటాన్ని వాళ్లు అవిద్యగా భావిస్తుంటారు – తక్కినవెన్ని మనం తెలుసుకున్నా! అజ్ఞానానికి సంబంధించి 'అజ్ఞాతం, అజ్ఞేయం' అనే మరి రెండు మాటలున్నాయి. అజ్ఞాతం అంటే 'తెలియనిది'. అజ్ఞేయం అంటే 'తెలుసుకోనిది, తెలుసుకోవలసింది'. అజ్ఞానశబ్దానికి తెలుగుమాటల్లో అర్థం చెప్పాలంటే 'తెలియమి, ఎరుగమి, ఎరుకలేమి' అని చెప్పుకోవాల్సిందే. "తెలియనివా డజ్ఞుండగు, తెలిసిన సదసద్వివేక చతురతగలుగున్" అనే పద్యాన్ని

పూర్వం ఆటవిడుపు పద్యంగా ఒప్పచెప్పించేవాళ్లు. ఇప్పుడా గొడవలేదుకదా. 'జ్ఞ' అనే ధ్వనిని 'గ్న' తో సమంగా ఉచ్చరించటం/పలకటం, ఆ ధ్వని ఉన్న సంస్కృతపదాలను వెతికివెతికి ఈ ఉచ్చారణతో తెలుగు చేయటం, మనకు మనప్రియతమ తెలుగు ముఖ్యమంత్రిగారిస్తున్న మహాప్రసాదం. స్వీకరించండి!

# గురుశిష్యులు

అజ్ఞానం పోగొట్టుకొని జ్ఞానం సంపాదించాలంటే గురుశుశ్రూష చేయాలి. శుశ్రూష సంగతి ఇంతకుముందే తెలుసుకున్నాం కాబట్టి మిగిలింది గురువే. ఈ సంస్కృత శబ్దానికి సమీపపదాలు 'శ్రోత్రియుడు, ఛాందసుడు, ఉపాధ్యాయుడు, అధ్యాపకుడు, ఆచార్యుడు, ఆదేష్ట' అనేవి. అమరం చెప్పని 'దేశికుడు, ఉపదేశికుడు' లేకపోలేదు. 'శ్రుతి' అంటే వినేదీ వినిపించేదీ. వేదాలను శ్రుతులంటారు. ఆ శ్రుతులను/వేదాలను చదివినవాడూ చదివించేవాడూ శ్రోత్రియుడు. తాను చదువుతూ విద్యార్థులచేత వేదం చదివించేవాడన్నమాట. ఛందస్సంటే వేదమంత్రం, పద్యం రాసే పద్ధతి వగైరా. ఛందస్సును బోధించేవాడు, నేర్చినవాడు ఛాందసుడు. ఈ అసలర్థాలు మరుగునపడి ఈ కాలానికి ఈ రెండుమాటలకూ 'లోకజ్ఞానంలేనివా'డనే అర్థాలు వచ్చాయి. ఉపాధ్యాయుడనే మాటకు వాడుకహెచ్చు. అధ్యాపకుడన్నా ఉపాధ్యాయుడన్నా నేర్పేవాడని అర్థం. అధ్యాపకుడు గొప్పవిషయాలు నేర్పితే ఉపాధ్యాయుడు చిన్న విషయాలు బోధిస్తాడన్నమాట. పూర్వం ఈ రెండు పేర్లూ వేదం బోధించే వ్యక్తికే అన్వయించేవి. గురువంటే పెద్దవాడని సామాన్యార్థం. కుటుంబ యజమానిగా కర్మలుచేసే/చేయించే వ్యక్తినే గురువనేవాళ్లు ఒకప్పుడు. రానురాను 'ఏంగురూ!' అని సమానులూ సన్నిహితులూ వాడే పలకరింపు మాటగా మారిపోయిందది! ఆచార్యుడు కూడా వేదాన్ని బోధించేవాడే – అందులోనూ మంత్రాలకు వ్యాఖ్యానం చెప్పేవాడట అప్పుడు. ఇప్పుడది కుల మత వయోభేదంతో పనిలేని 'ప్రొఫెసర్' పదవికి పేరయిపోయింది! యజ్ఞం చేసేవిధానం నేర్పే వ్యక్తి ఆదేష్ట. దేశికుడు మతవిద్యను బోధించేవాడు. ఒకవిధంగా మతప్రచారకుడో ప్రవక్తోనని చెప్పవచ్చు. ఉపదేశకుడు సాధారణంగా మంత్రవిద్య నేర్పేవాడు. ఈ అర్థాలుమారి కన్యాశుల్కంలో 'ఉపదేశం' అంటే 'మందుకొట్టడం/కొట్టించడం' అనే కొత్త అర్థంతో ప్రయోగం లభిస్తుంది. వ్యభిచార ప్రసంగం కూడా ఉపదేశమేనట! (కన్యాశుల్కంలో మున్సిబునాయుడు యోగిని ఈరేశకు 'ఉప్పదేశం' చేస్తున్నదని గోలపెట్టాడు). గురువుకు తెలుగుమాట పంతులేనా? అది పండితశబ్దం నుంచి వచ్చినమాట. మరోమాట తెలుగులో ఉన్నట్లు తెలీదు.

గురువులను స్మరించినప్పుడు శిష్యుల సంగతి ప్రస్తావించకతప్పదు. ఇటీవలి 'విద్యార్థు'ల్లో కొందరు తాము 'శిశువుల'మని చెప్పకోవటం కద్దు! సంస్కృతంలో ఆర్షసంప్రదాయం ప్రకారం గురుకులవాసం చేసిన శిష్యులు అనేకవిధాలుగా ఉండేవారు

కాబట్టి రకరకాల సంబంధిపదాలు పుట్టాయి. వేదవేదాంగాలను ఒకే గురువుదగ్గర నేర్చిన శిష్యుణ్ణి 'అనూచాను'డనేవారు. 'అనూచానంగా' వచ్చేదంటే గురువునుంచి శిష్యుడికి ఆ పరంపరలో వచ్చిందన్నమాట. ఈ కాలానికి ఆచారంగా గతానుగతికంగా పారంపర్యంగా సంక్రమించిన వాటిని అనూచానంగా వచ్చినవని చెప్పాలి. ఖచ్చితంగా చెప్పాలంటే 'ఒకరు చెప్పగా అనుకరించి తెలుసుకున్నవాడ'ని అనూచాన శబ్దానికి అర్థం. వేదం తాను పల్లెవేస్తూ శిష్యుడిచేత బట్టీపెట్టించే వాళ్ళు కాబట్టి ఈ మాట సరైన అర్థమిస్తుంది. గురువుదగ్గర వేదాలను నేర్చుకొని ఆయన అనుమతితో గృహస్థాశ్రమం స్వీకరించే శిష్యుడికి 'సమావృత్తు'డని పేరు. వేదం చదివికూడా బ్రహ్మచర్యంవదలక తీర్థయాత్రలు చేస్తూ ఉండే శిష్యుణ్ణి 'స్నాతకు'డంటారు. అలా తీర్థయాత్రలకు బయలుదేరుతున్న బ్రహ్మచారిని నిర్బంధించి గృహస్థుణ్ణి చేసే తతంగానికి 'స్నాతక(వ్రత)ం' అని నేటికీ వివాహాల్లో పేరుంది. కానీ 'విశ్వవిద్యాలయాల్లో'ని మహావిద్వాంసులు 'స్నాతకస్థాయి' అంటే మొదటిడిగ్రీ (బి.ఎ., బి.కాం., బి.ఎస్సి. వంటివి) అనే వ్యవహారం మొదలుపెట్టి ఇంగ్లీషులోని 'పోస్ట్-గ్రాజుయేట్' కోర్సుకు 'స్నాతకోత్తరస్థాయి' అని నామకరణం చేశారు. స్నాతక శబ్దంలో ప్రధానమైన భాగం 'స్నానంచేయుట'మనేది. దాన్తో నిమిత్తం లేకుండానే ఇప్పుడు స్నాతకులు కావచ్చు. తీర్థయాత్రలూ చేయనక్కరలేదు.

పూర్వం శిష్యుణ్ణి 'ఛాత్రుడు, అంతేవాసి, శైక్షుడు, సమావృత్తుడు, బ్రహ్మచారి' అని పిలిచేవాళ్ళు. ఇప్పుడు 'విద్యార్థి' అనే పదంకూడా ఈ పట్టికలో చేరింది. అంతేవాసి అంటే 'దగ్గరగా ఉండేవా'డని అర్థం. పూర్వం గురుకులాల్లో గురుశిష్యులు ఒకేచోట ఉండేవాళ్ళు. గురువే తిండిపెట్టి పోషించేవాడు. శిష్యుడు సేవలు చేసేవాడు. ఇప్పుడుకూడా 'గురుకుల పాఠశాల'లని, 'ఆశ్రమ పాఠశాల'లని ఏర్పడ్డాయికాని వాటిలో గురువులూ (అంటే ఉపాధ్యాయులూ) శిష్యులూ (అంటే విద్యార్థులూ) 'కలిసిమెలిసి' ఉంటున్నారని బల్లగుద్ది చెప్పలేం. ఉభయపక్షాలనూ ప్రభుత్వమో యాజమాన్యమో ఒకచోట చేర్చింది. కానీ ఏ విద్యార్థీ గురువును 'వరించి' ఫలానావ్యక్తిదగ్గర చదవాలనుకోవటంలేదు. ఎంపిక ప్రశ్నేలేదు. శైక్షుడంటే 'శిక్ష' పొందేవాడు. శిక్ష అనేది అప్పటిలెక్కన వేదాంగాలనే షడంగాలలో ఒకటి. 'శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిషం, నిరుక్తం, కల్పం' అనే ఆరుశాస్త్రాలను షడంగాలనీ వేదాంగాలనీ (వేదాల్లో భాగాలనీ) అనేవారు. శిక్షకు ఈ కాలానికి అర్థం పూర్తిగా మారిపోయింది. (ఇప్పటికీ హిందీలో శిక్ష అంటే బోధనే). అందుకే మనవాళ్ళు చదువు నేర్పటాన్ని 'శిక్షణ' అని పిలుస్తున్నారు. అప్పట్లో రకరకాల 'శిక్ష'లుండేవి. (ఆపిశలీయశిక్ష, పాణినీయశిక్ష మొదలైనవి). ఆమాట మన 'పెదబాలశిక్ష'లో ఇంకా మిగిలిఉంది. బాలశిక్షలు వాడుకనుంచి పోయినా పేరుమాత్రం మిగిలిందన్నమాట. బ్రహ్మచారి శబ్దానికి భగవంతుణ్ణి గురించిన ధ్యానంలో ఉండేవాడని అర్థం. ఇప్పుడు 'అవివాహితు'డనే అర్థంలోనే దానికి వాడుక. ఛాత్రుడంటే సీదాసాదా శిష్యుడు. శిష్యుణ్ణి 'శిశువు'డని పిలిచేవాళ్ళు కూడా ఉన్నారు! అచ్చతెలుగులో చెప్పాలంటే 'చదువుకొనేవాడు, నేర్చుకొనేవాడు' మొదలైన కొత్తసమాసాలను కల్పించుకోవాల్సిందే. ఈ సంప్రదాయం సంబంధం తొలితరం తెలుగువాళ్ళకు లేదని మాటల్లేకపోవటాన్నిబట్టి చెప్పవచ్చు.

గురుశిష్యులను గురించి ఎంతసేపూ సంస్కృతాంధ్రపదాలనుబట్టే చర్చించటం ఈకాలంలో న్యాయంకాకపోవచ్చు. ఇంగ్లీషుబళ్ళు వచ్చినర్వాత 'టీచర'నేమాట బాగా తెలుగువారి వాడుకలోకి వచ్చింది. (బడి) పంతులనే పేరు గురువుకూ 'విద్యార్థి' అనేపేరు శిష్యుడికీ సంక్రమించాయి. సమాజంలో జీవనస్థాయిలో తక్కువగా ఉన్న (బడి) పంతులు 'బతకలేనితనానికి' చిహ్నంగా నిలిచాడు. (పంతులు నిఘానికి పండితశబ్దం నుంచి వచ్చింది. అది లౌక్యవృత్తుల్లో బతికే బ్రాహ్మణ కులస్థులక్కూడా పేరయిపోయింది). అందుకేనేమో 'టీచర్' అనే ఇంగ్లీషుమాట వాడుకలోకి వచ్చింది. అయితే కాన్వెంటు చదువులూ 'పంతులమ్మలూ' వ్యాప్తిలోకి రాగానే ఆ మాటకు 'పాఠాలు చెప్పే స్త్రీ' అనే అర్థం వచ్చిపడింది. మొగపంతులికి పర్యాయంగా మరోమాట వెతుక్కొని ఇంగ్లీషునుంచి 'సార్' అనేమాటను దిగుమతిచేసుకున్నాం. ఇంగ్లీషులో మర్యాదావాచకంగా, కొన్ని సందర్భాల్లో పెద్దరాజోద్యోగికి గౌరవవాచకంగా ఉన్నమాట తెలుగులోకి వచ్చి బడిపంతులికి పర్యాయపద మయిపోయింది! (సర్ అనేది బ్రిటిష్‌వారి హయాంలో గొప్పబిరుదుకూడా). సరే. శిష్యులు చదువునేర్చినా నేర్వకపోయినా గురువులను పొగడకతప్పదు.

# పాపపుణ్యాలు

పాతకాలపు గురుశిష్యులకు పాపపుణ్య నిరూపణచేసే వేదవిద్యే ప్రధానం. అన్నట్లు పాపపుణ్యాలు రెండూ సంస్కృతపదాలే. 'ధర్మం, వృషం, శ్రేయం, సుకృతం' అనేవి పుణ్యానికీ, 'కిల్బిషం, పాప్మ, కల్మషం, కలుషం, వృజినం, ఏనం, అఘం, అంహం, దురితం, పాతకం' వగైరాలు పాపానికీ పర్యాయపదాలంటారు. సంఖ్యాబలంకూడా పాపానికే ఎక్కువ వ్యాప్తిఉందని సూచిస్తుంది. మన దౌర్భాగ్యమేమోకాని తెలుగులో పుణ్యానికి 'పున్నెం' తప్ప మరోమాట ఉన్నట్లులేదు. పాపానికి అలా ఒక్కమాట యినా లేదు. (మనకు పాపం లేదుకాబోలు!) పుణ్యం, ధర్మం సమానపదాలంటే తలదిరిగిపోతుంది. ధర్మం అంటే 'ధరించింది, నిలిచింది'. దేశకాలపాత్రలనుబట్టి అది మారిపోతుంటుంది. పుణ్యంగూడా అలా మారిపోతే ఇంకేమయినా ఉందా? వృషమంటే ఎద్దనికూడా ఓ అర్థముంది. ధర్మం నాలుగుపాదాలా నడుస్తుందంటారు కాబట్టి ఈ మాట పుట్టిందేమో! శ్రేయమంటే మేలు. పుణ్యం చేస్తే, పుణ్యకార్యాలు చేస్తే (బహుశా వచ్చేజన్మలో) మేలు కలుగుతుందని చెప్పటానికి ఈ మాటను పుణ్యపర్యాయమన్నారు కాబోలు. సుకృతమంటే 'మంచిపని'. ఫలితార్థంలో 'మంచి'నే పుణ్యమనుకున్నారన్నా తప్పులేదు.

పాపం, పాప్మ రెండూ మాండలికోచ్చారణభేదా లనిపిస్తుంది. కిల్బిషం అనేమాటకు 'చెడు, చెరుపు, తప్పు' అనే అర్థాలున్నాయి. కల్మషానికి 'కల్మాష'మనే రూపాంతరముంది. కలుషం, కల్మషం రెండూ 'మురికి' అనే అర్థవిశేషమున్నవే.

వృజినం, ఏనం, అంహం అనేమాటలు పుస్తకాల్లో మారుమూల ప్రయోగాలుగా మాత్రమే కనిపిస్తాయి. అఘమనేది ఎక్కువ వాడుకలో ఉంది. అంతకన్నా బహుళవ్యాప్తిలో 'అనఘ' శబ్దం వినిపిస్తుంది. అనఘా! 'అనగా పాపం చేయనివాడా!' అని బళ్ళల్లో చెప్తుంటారు. (బహుశా పుణ్యం చేయటంకన్నా పాపం చేయకపోవటమే గొప్ప అని మన పెద్దలు భావించిఉంటారు). పాపం తరవాత అంత వాడుకలోనూ వినిపించే పదం పాతకం. మనకు పంచమహాపాతకా లున్నాయి! దురితం, దుష్కృతం అనేవాటికి గ్రంథప్రయోగ మెక్కువ. దుష్కృతం అంటే 'చెడ్డపని'. దురితమంటే 'చెడ్డ ఆలోచన'. మొత్తంమీద పాపపుణ్యాలు వ్యతిరేకక్రమంలో మంచిచెడ్డలకు మారుపేర్లని చెప్పవచ్చు. ఏది పుణ్యం ఏదిపాప మనేది దేశ కాలపాత్రలతో మారే ధర్మాధర్మాల నిర్ణయమని చెప్పవచ్చు.

గురువులు శిష్యులను తప్పుబట్టడం, శిష్యులు గురువులను గౌరవించటం సహజకర్మలే. తప్పు పట్టేవ్యక్తి తిట్టవచ్చు, వెక్కిరించవచ్చు, ఈసడించవచ్చు. గౌరవించేవ్యక్తి పొగడవచ్చు. మెచ్చవచ్చు. ఎదటపొగడి వెనకతిట్టవచ్చు. పాతకాలంలో కూడా గురుశిష్యసంబంధాలు ప్రేమాభిమానాలతోనేగాక నిందాస్తుతులతో కూడా పెనవేసుకొని ఉండేవి. ఇప్పుడయితే మొహంమీద ప్రత్యక్షంగా జరిగేవన్నీ ఆ కాలంలో చాటుమాటున జరగలేదనటానికి దాఖలాలు దొరకవు. స్తుతించటంకన్నా నిందించటం తేలిక. కాబట్టి మొదట నిందాసంబంధి పదాలను పరిశీలిద్దాం.

# నిందాస్తుతులు

నింద అనేకవిధాలు. నిందించటం బహువిధాలు. "అవర్ణం, ఆక్షేపం, అధిక్షేపం, పరిహాసం, పరీహాసం, నిర్వాదం, పరివాదం, పరీవాదం, అపవాదం, (అవ)హేళన(ం), ఉపక్రోశం, జుగుప్స, కుత్స, గర్హణ(ం), దూషణ(ం), పారుష్యం, అతివాదం, భర్త్సనం, పరిభాషణం, ఉపాలంభం, విప్రలాపం, నిహ్నవం, అవాచ్యం" వంటి అనేక సంబంధిపదాలు సంస్కృతం నుంచి వచ్చినవి. "ఆడిక, ఏవం, ఈసడం, ఈసడింపు, తెగడు, తెగడిక, ఆరడి, అవసడి, అగడు, జౌరు, దూరు, దిసంతు, సడి, రోయి, రోత, రొచ్చు, సేగింపు, సెగ్గెం, సెగ్గి, ఏవగింపు, రట్టు, తిట్టు, రట్టడి, రవ్వ, రద్ది, రద్దు, ఉప్పత, రంతు, గొహారు" మొదలైనవి తెలుగుమాటలు. 'పరిహాస' శబ్దానికి పర్యాయాలుగా 'క్రేణి, కేరడం, దచ్చన, గేలి, మేలం, మందెమేలం, ఆట, త్రస్తరి, హోళి, వేళాకోళం, వెక్కిరింత, కొక్కిరింత, ఎగతాళి' మొదలయిన తెలుగుమాటలను ప్రస్తావించవచ్చు. ఈ పట్టికలను చూస్తే తెలుగుభాష కూడా ఈ విషయంలో సంస్కృతంకన్నా ఏమీ తక్కువ తినలేదని తెలుస్తుంది.

అవర్ణ శబ్దానికి సరైన ధ్వనులుగాని అక్షరాలుగాని లేనిదని అర్థం. ఏదో అనగూడని, వినగూడని, చెప్పగూడనిమాట అని వివరించవచ్చు. లేదా సంస్కారంలేని మాట అని వ్యాఖ్యానించవచ్చు. ఆక్షేపం ఎదుటివ్యక్తి చేతలనూ కూతలనూ 'ఎత్తిపొడవటం'. దీనికి

సరైన తెలుగుమాట 'ఎత్తిపొడుపు'. అధిక్షేపం ఇటువంటిదే. ఆక్షేప శబ్దానికి తర్క శాస్త్రంలో సాంకేతికమైన అర్థాలూ ప్రయోగమూ ఉండగా, అధిక్షేపానికి సాహిత్యంలో స్థానముంది. పరిహాసం 'వెక్కిరింతకు' సంస్కృత పర్యాయమనవచ్చు. ఈ శబ్దానికి పరీహాసమనే రూపాంతరముంది. నిర్వాదమంటే చర్చతో సంభాషణతో నిమిత్తంలేని నింద. పరివాదం/పరీవాదం అనే శబ్దాన్ని ఒకవిధంగా అప్రతిష్ఠపాలుచేసే 'నీలాపనింద'తో సరిపోల్చవచ్చు. అపవాదానికి నియమవిరుద్ధమైనదనే పారిభాషికార్థముంది. 'తక్కువచేసి' మాట్లాడటమనే అర్థంచెప్పవచ్చు. హేళన వెక్కిరింతే. అవహేళన(ం) మరింత ఘాటుగా మోటుగా చేసిన వెక్కిరింత. ఉపక్రోశమంటే నిజానికి 'ఏడిపించటం' లాంటిది. జుగుప్స అంటే 'అసహ్యం, రోత, ఏవం' అనే అర్థాలున్నాయిగాని కొందరు నిఘంటుకారులెందుకో దాన్ని నిందకు పర్యాయపదంగా పరిగణించారు. కుత్స అంటే 'బూతు'. గర్హణ(ం) తేలికగా భావించటం, అసహ్యించుకోవటం. దూషణ(ం) అక్షరాలా తెలుగు 'తిట్టు'కు సంస్కృతంపేరన్నమాట. పారుష్యం అంటే 'కఠినమైన, బాధకలిగించే మాట!'. అతివాద శబ్దానికి అవసరంకన్నా మించి మాట్లాడటమనే అర్థముంది గాని అది కేవలం మన 'అతివాగుడు' వంటిదికాదు. భర్త్సనం 'ఛీ కొట్టడం'లాంటిది; అందులో 'బెదిరింపు' కూడా ఉంటుంది. మనస్సు బాధపడేటట్లు ఎత్తిపొడవటం పరిభాషణం. కించపరచటాన్ని కూడా పరిభాషణమనవచ్చు. ఉపాలంభ శబ్దానికి కావ్యాల్లో వాడుక ఎక్కువ. మన ప్రబంధనాయికలు విరహబాధలో పడ్డప్పుడల్లా మన్మథుణ్ణీ, చంద్రుణ్ణీ, వసంతుణ్ణీ, మలయమారుతాన్ని ఉపాలంభిస్తుంటారు – అంటే తిడ్తుంటారు. ఎత్తిపొడుపునూ, తిట్టునూ వెక్కిరింతనూ ఈసడింపునూ రంగరిస్తే ఉపాలంభ మవుతుంది. విప్రలాప మంటే తీవ్రభాషలో దూషించటం. ప్రలాపమంటే 'వదరటం'. సందర్భశుద్ధిలేని వాగుడు విప్రలాప మన్నమాట. నిహ్నవం కడుపులో ఏమోపెట్టుకొని అరచాటుగా తిట్టడం. అవాచ్యమంటే సభ్యసమాజంలో మాట్లాడరాని మాటల్తో తిట్టడం. ఇన్నింటిలోనూ 'నింద, హేళన, ఆక్షేపం, దూషణ, పరిహాసం' అనే మాటలే వాడుకలో ఎక్కువగా దొర్లుతుంటాయి. తక్కినవాటికి కావ్యభాషలోనే ప్రయోగాలెక్కువ.

అడిక అనే తెలుగుమాటకు 'అనట' మనే అర్థం. చెడుగా అన్నప్పుడే/మాట్లాడినప్పుడే అది అడిక అవుతుంది. ఏవమంటే అసహ్యమని కూడా అర్థముంది. ఏవగింపు ఈ భావంనుంచి వచ్చింది. తెగడు, తెగడికలకు 'తిట్టడం, ఖండించడం, కాదనటం, తప్పుబట్టడ'మనే అర్థాలున్నాయి. ఈసడమన్నా ఈసడింపన్నా తక్కువచేసి మాట్లాడటం. చులకనగా చూడటమని చెప్పవచ్చు. తెగడు, తెగడికలు రూపాంతరాలు. వాటికి 'నిందించు, తిట్టు' అని సామాన్యార్థాలు. తెగడ్త అనే మాటకూడా ఉంది. దాన్ని సాధారణంగా 'పొగడ్త'కు వ్యతిరేకపదంగా వాడుతుంటారు. ఆరడి బాధపెట్టడమనే అర్థంలోనే ఇప్పుడు వాడుకలో ఉంది. అత్తలు కోడళ్లను పెట్టేబాధలను ఆరళ్లంటారు. అవసడి, సడి అనే రెండూ ఒకదానితో ఒకటి సంబంధించినవి. సడి అనేమాటకు 'పుకారు, అబద్ధవార్త, తప్పుడుప్రచారం' వగైరా అర్థాలున్నాయి. అవసడి మరింత తీవ్రమయిన సడికావచ్చు. అగడు శబ్దానికి 'కష్టం, బాధ' అనే అర్థంలో కావ్యప్రయోగాలున్నా కొందరు కోశకర్తలు దాన్ని నిందకూ తిట్టుకూ పర్యాయపదాలుగా

పరిగణించారు. ఔారు అనేమాట మారుమూలపదం. వాడుకలో లేనిమాట అది. దూర్రు కావ్యభాషలో తిట్టుకూ నిందకూ పర్యాయంగా ప్రయుక్తమయింది. ఇది చాలదన్నట్లు 'అపదూరు' అనే మాటకూడా వ్యాకరణాలను ఖాతరుచేయకుండా వాడుకలోకి వచ్చిపడింది. దిసంతుకన్నా 'దిసంతులు కొట్టడ' మనే పదబంధానికే కావ్యప్రయోగా లెక్కువ. "కేకలూ బొబ్బలూ పెట్టడం, అరవటం, బొబ్బరింత, గర్జించటం" వగైరా అర్థాలు ఈ మాటకున్నాయిగాని నేటివాడుకలో ఇది వినిపించదు. రోయికి పుస్తకాల్లోనే ప్రయోగం. ఇదిగాక సంస్కృతంలోని రై శబ్దంనుంచి పుట్టిన 'రో' శబ్దానికి రూపాంతరంగా దీనికి 'వెల, డబ్బు' వంటి అర్థవిశేషాలున్నాయి. బహుశా అందుకేనేమో ఇది వాడుక మంచి తొలగిపోయింది. రోత అసహ్యమనే అర్థంలో స్థిరపడింది – రొచ్చు 'బురద' అనే భావంలో కూరుకుపోయినట్లు. సేగింపు, సెగ్గెం, సెగ్గి అనేమాటలు "సేగి=చెడు, తప్పు" అనే మాటకు సంబంధించినవి. రట్టు అంటే 'గుట్టు బయటపెట్టడం'. రట్టడి దీనికి రూపాంతరం. (నేటి రెడ్డి శబ్దానికి పూర్వకాలపు శాసనాల్లో రడ్డి, రట్టడి అనే రూపాలు కనిపిస్తాయి). రవ్వ అంటే 'ఆగడం, ఆకతాయితనం'. పోతన కృష్ణలీలావర్ణనలో ఈ మాటను జోరుగా వాడాడు. రద్ది, రద్దు అనే మాటలు ఇప్పటి వాడుకలో లేవు. రద్దీ అంటే 'చెత్తాచెదారం' అనీ, రద్దు అంటే 'తొలగించటం, తీసివేయటం' అనీ అర్థాంతరాలు వచ్చాయి. ఉప్పత నేటి వాడుకలో ఉన్నట్లులేదుగాని 'ఉప్పతనం' అనేమాట నేటి 'ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్/ఆత్మన్యూనతాభావం' అనే అర్థంలో ప్రజావ్యవహారంలో ఉంది – శాస్త్రగ్రంథాల్లో చేరకపోయినా. గొహారు అంటే ఏమిటో నిఘంటుకారులకే తెలియాలి. ఈ మాటలన్నిటిలో 'తిట్టు, రట్టు, ఈసడింపు, రోత, ఏవగింపు' లకే వాడుక ఎక్కువ.

వెక్కిరింతకు తెలుగులో చాలా సంబంధి పదాలున్నాయి – "కొక్కిరింత, ఎగతాళి, ఎద్దేవ, ఈసడింపు, వేళాకోళం, క్రేణి, కేరడం, దచ్చన, గేలి, మేలం, మందెమేలం, ఆట, త్రస్తరి, హేళి, ఎల్లిదం" మొదలైనవి. వెక్కిరింత కోతిపని. కొక్కిరింతలో కొంత విమర్శకూడా ఉంది. కొక్కిరించే వ్యక్తికీ "కొక్కిరాయి"కీ సంబంధమేమో తెలీదుగానీ, తన నాటి జాతీయనాయకులందర్నీ వెక్కిరించి కొక్కిరించి వేళాకోళమాడిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య తనను గురించి చెప్తూ "గోపాలకిష్టాయి కొక్కిరాయి" అని వర్ణించుకొన్నాడు. వెక్కిరింత అవతలి వ్యక్తిని అనుకరిస్తూ ఆటపట్టించటం. కొక్కిరింత రెచ్చగొట్టే వెక్కిరింత. వేళాకోళం నోటిమాటలతో వెక్కిరించటం. వెక్కిరింత కొక్కిరింతల్లో 'చేష్టలు' ప్రధానం; వేళాకోళంలో మాటలు ముఖ్యం. సరసమాడటమని కూడా అర్థం చెప్పవచ్చు. వరసకాని వాళ్ళతో వేళాకోళం పనికిరాదు – పెద్దలతో కుదరదు. ఎగతాళికి వయసుతోగాని, వావితోగాని నిమిత్తంలేదు. హాస్యపూరితంగా ఉండటం ప్రధానలక్షణం. ఎద్దేవ తెలుగేకాదంటారు కొందరు. ఇది ఆక్షేపణ వంటిది; లోపాన్నో తప్పునో ఎత్తి చూపటం వంటిది. ఈసడింపు తక్కువ చేయటం, చులకనగా చూడటం. క్రేణి అనేమాట కావ్యాల్లోనే కనిపిస్తుంది. కేరడం పేర్లు పెట్టడం. కేరడానికి పసిపిల్లలు పెట్టే కేరింతలకూ కొంత సంబంధముంది. ఉద్దేశరహితంగా ఆనందప్రదర్శన

చేయటం కేరడం. కేరడంలో ఉత్తరకుమార ప్రజ్ఞలు 'కోతలు కోయటం' లాంటివి ఉండవచ్చు. 'దచ్చన, త్రస్తరి' గ్రంథాల్లో మాత్రమే కనిపించే మాటలు. మేలం అంటే సరసంతోకూడిన పరిహాసం; ఒక్కోసారి శృంగారపూర్వం కూడా కావచ్చు. 'నర్మ' అని ఇంతకుముందు ప్రస్తావించిన మాటకూ మేలానికీ సంబంధముంది. పోలి కావ్యభాషాపదం. ప్రబంధసుందరులు 'విరాళి' (విరహం)లో ఉన్నప్పుడు మన్మథుడూ చంద్రుడూ వగైరాలతో పోలిదేలటం అలవాటు. అధిక్షేపశబ్దాని కిది దగ్గరిమాట. ఎల్లిదమంటే తేలికవటం, చిన్నబుచ్చటం. తిక్కనకు ఈ పదం చాలా ఇష్టమనిపిస్తుంది.

గురువుల పరిహాసాలకు నిందలకూ తలఒగ్గి చదువునేర్చిన పాతకాలపు విద్యార్థులు కవులో పండితులో అయిపోయేవారు – చాలావరకు. ఈకాలంలోలాగా అప్పుడు రకరకాల విద్యావిషయకోద్యోగాలు లేవుకదా. భిక్షావృత్తి, పౌరోహిత్యం వగైరాలు సర్వసాధారణం. ఎక్కువమందికి గురుకులాలు వదిలిపెట్టిన తరువాత జీవనోపాధి మార్గాలవే ఆనాడు. దానికి పర్యాయపదాలని చెప్పదగ్గవి "ఆజీవం, జీవిక, వార్త, వృత్తివర్తనం, జీవనం" అనే సంస్కృత పదాలు. ఆజీవమనేమాటకు 'జీవితాంతం – అంటే జీవించినంతకాలం' అనే అర్థంకూడా ఉంది. జీవితాంతం ఉండే/ఉండవలసిన 'బతుకుతెరువు'ను ఆజీవిక అంటారు. జీవనం, జీవిక – అనేవి తాత్కాలికంకూడా కావచ్చు. అవి ఉద్యోగం (అంటే పాతకాలపు అర్థంలో యత్నం, కృషి) ద్వారా దొరికేవన్నమాట. జీవన శబ్దానికి 'నీరు' అనే అర్థంకూడా ఉండేది. అలాగే 'జీవిక' అనేమాటకు (ఇప్పటి) 'జీత' మనే అర్థవిశేషముంది. అన్నట్లు మనమిప్పుడు జీతమనేదాన్ని మన పాతశాసనాల్లో కూడా "జీవితం" అని పిలిచేవాళ్ళు! జీవితం అంటే బతుకు. అంతేకాదు బతుకుతెరువనికూడా భావించారన్నమాట. అప్పట్లో 'వృత్తి' ప్రధానంగా రెండు రకాలుగా ఉండేది కాబట్టి (ముఖ్యంగా బ్రాహ్మణులకూ వేదాది విద్యలు నేర్చిన వాళ్ళకీ) అమరకోశంలో రెండు భేదాలను పేర్లతో పిలిచాడు. 'ఉంఛ' అనే వృత్తి ఉండేది. ఊళ్ళో తిరుగుతూ రోళ్ళపక్కరాలిపడ్డ ధాన్యపు గింజలు ఏరుకుంటూ బతకట మన్నమాట. రెండోది 'శిలం': ఊరి బయట పొలాల్లో పరిగలేరుకొని బతకటం. బిచ్చమెత్తుకోవటం సరేసరి. కానీ అది 'వృత్తి'కాదు ఆ కాలంలో!

'వార్త' అనేమాట సంస్కృతంలో చిక్కులుబెట్టే పదం. వృత్తికి పర్యాయపదం గానేకాక 'కృషివాణిజ్యాలు వార్త' అనే నిర్వచనంకూడా ఉంది దానికి. అంటే వ్యవసాయం, వ్యాపారం అనే రెంటికీ కలిపి 'వార్త' అనే పేరుండేదన్నమాట. భారతంలోని "వార్తయందు జగతి వర్థిల్లుచున్నది" అనే పద్యపాదానికి ఇటీవలి వాళ్ళు కొందరు మానవసమాజ వృత్తాంతం/సంగతి తెలుసుకోవటమో తెలియజెప్పటమోనన్న వ్యాఖ్యానం చేస్తున్నారు. కానీ నిజానికి పాతకాలపు భారతదేశంలో వ్యవసాయం వల్లా వ్యాపారంవల్లా ప్రపంచం నడుస్తున్నదన్న విశ్వాసమే ఉండేది. ఇప్పటి అర్థంలో వార్తఅంటే వృత్తాంతం. వాటిని అందించేవి 'వార్తాపత్రికలు'. 'వర్తన' మన్నమాటకు 'నడవడి(క)' అనే అర్థంకూడా ఉంది. 'జీవనం, వృత్తి' అనేవాటికే నేటి వ్యవహారంలో బతుకుతెరువనే అర్థముంది. ఉద్యోగాన్ని తెలంగాణాలో 'కొలువు' అంటారు.

ప్రాచీన భారతదేశంలో జీవనోపాధి మార్గం శరీరశ్రమచేయని, చేయలేని వ్యక్తులకు స్తుతించి బతకటమే – గ్రామాధికారులనుంచి చక్రవర్తులదాకా. "స్తుతి, ప్రస్తుతి, ప్రణుతి, అభాషణం, ఆలాపం, సల్లాపం, సంలాపం, సుప్రలాపం, సురచనం, స్తవం, స్తోత్రం, నుతి, భూషణం" మొదలైనవి పొగడ్తకు సంబంధించిన సంస్కృత పదాలు. స్తుతి అంటేనే పొగడటం. ప్రస్తుతి అంటే 'తెగపొగడటం'. నుతి అంటే మెచ్చుకోవటం. ప్రణుతి అంటే విపరీతంగా మెచ్చుకోవటం. 'అభాషణ'మంటే మంచిగా మాట్లాడటం, నచ్చేటట్లు పలకటం. ఆలాపం అంటే సాగదీసి/పెంచిచెప్పటం. అందుకే సంగీతంలోని అకారసాధనకు – అంటే రాగంతీయటానికి – ఆలాప(న)ం అనే పేరువచ్చింది. 'ఏదో ఆలాపనగాఉంది' లాంటి వాక్యాల్లో దీర్ఘాలోచన జరుగుతున్న/చేస్తున్న సూచన వుంది. సల్లాపం, సంలాపం అనేవి ఒకదానికొకటి రూపాంతరాలు. 'సరసం'గా మాట్లాడిన మాటను సల్లాపమంటారు. అదిచాలక 'సరససల్లాపా' లని రెంటినీ జమాయించి చెప్పటమూ కద్దు. సురచనమనేది కవిత్వ సంబంధమైన మాట. 'బాగా రాసింది' అనేది దాని సామాన్యార్థం. స్తవం అనేమాటకు పొగడ్త అనే అర్థం. సాధారణంగా దేవీదేవతలను తలచుకొంటూ చెప్పిన మాటలనే స్తవాలంటారు. స్తోత్రం అనేది స్తుతికి సంబంధించిన పదమే. దేవమనుష్య భేదంలేకుండా ఎవర్నయినా స్తోత్రం చేయవచ్చు. అభాషణం, ఆలాపం, సురచనం, సుప్రలాపం అనే మాటలకు కావ్యప్రయోగమే గతి. భూషణ శబ్దానికి అలంకారమనే అర్థంకూడా ఉంది. దూషణభూషణ తిరస్కారాలకు అతీతంగా ఉండటం గొప్పతనమని నమ్మకం. సుప్రలాప శబ్దాన్ని ఎవరో కల్పించివుంటారనిపిస్తుంది. ప్రలాపమంటే తెగవాగుడు, వదరటం, పేలటం. బాగా/మంచిగా పేలితే అది పొగడ్త అని భావించిన మహాత్ములు నేటి రాజకీయ కార్యకర్తల్లోనే గాక ప్రాచీన భారతదేశంలో కూడా ఉన్నారంటే గర్వించాలేమో మనం. దానమిచ్చిన 'కృతిపతు'లను పొగడుతూ రాసి బతకటం కూడా ఒకవిధమైన జీవనోపాధే కాబట్టి స్తుతించగలగటాన్ని జీవనోపాధి లక్షణంగా భావించవచ్చు. నిర్జీవపదార్థాలకు దైవత్వ మారోపించే దేశంలో బతికున్న వ్యక్తులను పొగడి బతకటం తప్పుకాదని చెప్పవచ్చు.

పొగడ్తకు "పొగడు, పొగడిత, పొగడిక, మెప్పు, కైవారం, మెచ్చుకోలు, కొండాట, అగ్గింపు, కొనియాట" అనే తెలుగు మాటలను పర్యాయపదాలనవచ్చు. పొగడ్త, పొగడిత, పొగడిక, పొగడు రూపాంతరాలు. మెప్పుకన్నా పొగడ్త గొప్పది. మెచ్చుకోలు (మెచ్చుకొను – అనే క్రియాపదానికి నామరూపం) అనేమాటకు సాధారణంగా ఉన్న విషయంలోని మంచిచెప్పటమనే అర్థం. మెప్పు అనేది 'మెచ్చు' క్రియకు సంబంధించిన నామవాచక రూపం. పూర్వభాషలో 'మెచ్చు' నామవాచకంగా కూడా ప్రయుక్తమయింది. పొగడ్తకు మెచ్చు మెప్పులకన్న పరిమితులు లేవు. ఒంటికంటిరాజు చక్కదనాన్ని పొగడ్తూ తెనాలిరామలింగడు "అన్నాతిగూడ హరుడవు, అన్నాతిని కూడకున్న అసురగురుండౌ, దన్నా 'తిరుమలరాయా!', కన్నొక్కటి లేదుగాని కంతుడవయ్యా!" అన్నాడట. భార్యరెండుకళ్లనూ రాజుగారి ఒంటికంటినీ కలిపితే (భార్య 'అర్ధాంగి' కాబట్టి ఆమెకళ్లుకూడా అయన సొంతంకిందనే లెక్కించవచ్చుకాబట్టి) శివుడంతవాడట. కలవకపోతే శుక్రాచార్యుడంతమేధావి. కన్నులేకపోతేనే మన్మథుడంతటివాడయితే ఉంటే రెండురెట్లు చక్కనివాడేకదా? ఇలాంటివి మెప్పులుకాదు – పొగడ్తలే.

కైవారం అనేది సామాన్యంగా రాజాస్థానాల్లో రాజుగారిని నిద్రలేపటానికీ, సభలో ప్రవేశించేముందు ఆయనగారి బిరుదులూ వగైరాలను వర్ణించడానికి నియుక్తులయిన ఉద్యోగులు చేసేపని. ప్రత్యేకపద్ధతి పొగడ్త అన్నమాట. అభిమన్యుడిచావు తెలియని అర్జునుడు శిబిరానికి తిరిగివస్తూ "వంది మాగధులు కైవారంబు చేయకున్నారేల నీరజనాభ! నేడు?" అని అడిగిన పద్యం ఒకప్పుడు తెలుగునేలమీద మోగిపోయింది. 'కొండాడు' అన్న క్రియకు నామరూపం కొండాట. దీనికి కావ్యభాషలోనే ప్రయోగం. అగ్గించు అనే ప్రక్రియకు విశేష్యరూపం అగ్గింపు – పెంచిచెప్పటమనే అర్థంగల ఈమాటకు. జనవ్యవహారంలో ప్రయోగం కనిపించే కొనియాడు అనే క్రియాపదాన్ని ఇప్పుడూ కొందరు వాడుతున్నారుగాని దాని నామరూపానికి అంత విస్తృతమయిన వాడుక లేనట్లుంది.

పొగడ్తలకు ఉబ్బి పోషించేవాడు దాత. అతడు చేసేపని దానం. అదేంకర్మమోగాని 'దాత'కు సమానమైన ఒంటి తెలుగుమాట కనిపించదు – 'ఈవికాడు' వంటి డొంకతిరుగుడు మాటతప్ప. "వదన్యుడు, వదాన్యుడు, స్థూల లక్షుడు, దానశౌండుడు, బహుప్రదుడు" అనే పదాలేగాక "వరదుడు, సమర్థకుడు, సుకలుడు" అనే సంస్కృత పదాలు కూడా దాతృ శబ్దానికి పర్యాయపదాలకింద లెక్క. వదాన్యుడు, దాత – అనే రెంటికే వ్యవహారంలో బహుళవ్యాప్తి ఉంది. ఇచ్చేవాడని అర్థం దాతకు. మరీ ఎక్కువఇస్తే 'ప్రదాత'; అంతకన్నా గొప్పవాడు మహాదాత. 'విశ్వదాత' వగైరాలు బిరుదులు. స్థూలాక్షుడు/స్థూలలక్ష్యుడు అనేశబ్దానికి 'బాగాఉన్నవా'డనే అర్థముంది. ఉన్నదికాబట్టి ఇస్తాడని దాతకు పర్యాయమనుకున్నారేమో తెలీదు. దానశౌండుడనేది సమాసం. 'దానవీరు'డని అర్థం. గొప్పగా దానాలు చేసినవాడన్నమాట. బహుప్రదుడు బహుశా కల్పిత శబ్దం కావచ్చు; 'చాలా ఇచ్చేవా'డని ఆ మాటకు అర్థం. వరద శబ్దాన్ని సాధారణంగా వ్యక్తులకుగాక దేవతలకు అన్వయిస్తుంటాం. సమర్థకుడు అనే మాటను ఇప్పటిభాషలో దాత అనే అర్థంలో వాడలేం. 'సమర్థించేవాడు' (అంటే ఒకరు చెప్పినదానికి నిజమేనని తల ఊపేవాడు) అనే అర్థం వచ్చిందిప్పుడు. బాగా డబ్బున్నవాడనే అర్థం పూర్వం ఉండేదేమో (అర్థం అంటే సొమ్ముకూడా). సుకలుడు అనేది విశేష శబ్దం; త్యాగభోగాలు రెండూ ఉన్నవాడన్నమాట.

దాత ఇచ్చిందీ ఇచ్చేదీ దానం. ఈమాట త్యాగంతో కలగాపులగ మైపోయింది. "దానం, త్యాగం, విహాయితం, ఉత్సర్జనం, విసర్జన(ం), విశ్రాణనం, వితరణ(ం), స్పర్శనం, ప్రతిపాదనం, ప్రాదేశనం, నిర్వపనం, అపవర్జనం, అపసర్జనం, అంహతి" అనే సంస్కృతపదాలు ఒకదానికొకటి పర్యాయపదాలు. వీటిలో దానం, త్యాగం, వితరణ(ం) అనే మూటికే వాడుక ఎక్కువ. తక్కినవి పుస్తకాల్లో కనిపించేమాటలు. దానమంటే 'ఇచ్చింది'. త్యాగమంటే 'వదిలిపెట్టింది' (త్యజించిందన్నమాట). త్యాగం విధిలేక చేసినా చేయవచ్చు. దానం మనస్ఫూర్తిగా ఇవ్వట మవాలి. సర్జనం, వర్జనం అనేవాటికి 'వదలటం, విడవటం' అనేవి క్రమంగా సామాన్యార్థాలు. ధనరూపంలోనో ద్రవ్యరూపంలోనో ఇతరులకోసం వదులుకున్నా, విడిచిపెట్టినా ఈ మాటలను వాడవచ్చు. ఉత్సర్జనమంటే 'ఎక్కువగా' వదులుకోవటం; విసర్జనమంటే 'విశేషం/ఘనం గా వదులుకోవటం'.

ఈమాట ఒకప్పుడు సాహితీలోకంలో విచారణకు వచ్చింది. రవీంద్రనాథ్ ఠాకుర్ "విసర్జన" అని బెంగాలీభాషలో రాసిన గ్రంథాన్ని డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అదేపేరుతో తెలుగుచేశారు! మరి మన ఇప్పటివాడుకలో 'మలవిసర్జన, మూత్రవిసర్జన' వంటి సమాసాల్లోనే ఆ మాటకు ప్రయోగం. బెంగాలీలో దానికి 'త్యాగ'మనే అర్థం - సంస్కృతంలోలాగా. చర్చఎందుకు జరిగిందో ఊహించటం సులభమే. విశ్రాణనమంటే ఒకవిధంగా వర్షించటం/కురవటం. గొప్పగా చేసిన దానం విశ్రాణనం. స్పర్శనం అంటే 'తాకటం' అనేది సామాన్యార్థం. పెద్దలు ఒకసారి తమచేత్తో తాకి మరెవరిచేతనైనా ఇప్పించిన దానం స్పర్శనం అన్నమాట. బహుశా ఇది 'స్వయంపాకం' లాంటిది కావచ్చు. ఈ మాట తలచుకొంటే మరోటి గుర్తుకువస్తుంది. ఆంధ్రప్రాంతంలో తమయింట తిండి తినరనుకున్నవాళ్లు వంటచేసుకొని తినడానికి కావలసిన వస్తువులనిస్తే వాటిని 'స్వయంపాక'మంటారు (అంటే సొంతగా వండుకోడానికిచ్చిన వస్తువులని అర్థం). తెలంగాణాలో దీనికి పర్యాయపదం 'సాహిత్యం' (సాధారణంగా కవిపండితులే ఇలాంటి ఘరానా బిచ్చం తీసుకుంటుంటారుకాబట్టి, వారికి ప్రత్యేకత అయిన సాహిత్యం వారు స్వీకరించే స్వయంపాకానికి పేరయింది!). స్వయంపాకంకూడా నిజానికో వ్రతం. స్వకుటుంబంలోకూడా భార్యచేతివంటకాకుండా తామేవండుకొని తినటమే వ్రతంగా పెట్టుకొన్న 'స్వయంపాకులవారు' పూర్వం ఉండేవారు. ఇప్పుడున్నారో లేదో తెలీదు.

ప్రతిపాదన శబ్దానికిప్పటి అర్థంవేరు. మిగిలినవి పుస్తకాల్లో ఉండేవేగాని వాడుకలో లేనివి. తెలుగులో "ఉజ్జనం, ఉజ్జగింపు, విడి, విడుపు, విడుదల, విడటం, మానటం, వీడుకోలు, ఎదుదు, తక్కు, వదలటం, అరటం, తొరగటం, పెట్టుడు, ఇచ్చుడు, ఈవి, ఈగి, పుడుకు, పెట్టు, తేగం, చాగం" వంటి మాటలు దానార్థంలో కనిపిస్తాయి. ఉజ్జన శబ్దం వర్జనమనే సంస్కృతపదం నుంచి పుట్టింది. ఉజ్జగించు అనేక్రియాపదంకూడా 'వర్జించు' అనే తత్సమ క్రియనుంచే పుట్టిందనీ, అందువల్ల ఉజ్జగింపు అనేమాట కూడా అచ్చతెలుగుకాదనీ వాదించేవారున్నారు. తేగం, చాగం అనే రెండుమాటలూ సంస్కృతంలోని 'త్యాగ' శబ్దంనుంచి వచ్చినవేనని వాటిరూపమే చెప్తుంది. తక్కిన తెలుగుమాటల్లో 'ఈవి'కి మాత్రమే నేటికీ వాడుకఉంది.

దానశబ్ద పర్యాయాలైన కొన్ని తెలుగుమాటలు ఏ ప్రత్యేకార్థాలిస్తాయో చూద్దాం. 'విడి' అనే పుస్తకాల్లోని మాట ఈ కాలానికి విశేష్యత్వం నుంచి విశేషణత్వం పొంది భాషాభాగమే మారిపోయిందనాలి. విడుపు, విడుదల, విడటం అనేవాటికిప్పుడు దానమనే అర్థం పోయినట్లే. 'ఆటవిడుపు, పట్టువిడుపులు' మొదలైన సమాసాల్లో కేవలం 'వదిలిపెట్టడం' అనే అర్థమే మిగిలింది. మానటం చేసినపని చేయకపోవటమనే అర్థంలో నిలిచిపోయింది. వీడుకోలు అనేది 'బంధుమిత్రాదులను వదిలిపెట్టి వెళ్లటం, వెళ్తున్నవారికి టాటా చెప్పటం' లాంటి అర్థాల్లో మాత్రమే వాడుకలో ఉంది. 'వీడుకోలు సమావేశం' లాంటి ప్రయోగాలవల్ల ఇది మామూలు విషయంగా కాక ఏదో ప్రత్యేకత ఉన్న కార్య(క్రమ)ంగా వాడుకలోకి వచ్చింది. 'ఎదుదు, తక్కు, అరటం, తొరగటం' అనేవి చాలా పాతకాలపు మాటలు; 'తప్పుకొను, తప్పించు' మొదలైన అర్థాల్లో కూడా వీటికి కావ్యభాషలో ప్రయోగాలు దొరుకుతున్నాయి.

'పెట్టుడు, ఇచ్చుడు' అనేవి మాండలికంగా మాత్రమే వినిపిస్తాయి. 'ఈవి' ఒక్కటే (దాని రూపాంతరం 'ఈగి' కూడా కాదు) దానార్థకంగా వాడుతున్నాంగాని దాన శబ్దానికున్న వ్యాప్తి ఈతెలుగుమాటకు లేదనే చెప్పాలి. 'పుడుకు' అనే మాట ఇప్పుడెక్కడా కనిపించదు – వినిపించదు. 'పెట్టుపోత'లనే పదబంధానికున్న వ్యాప్తి 'పెట్టు'కు లేదు. పెట్టుపోతలనేవి కూడా పరాయివారికిచ్చే దానమనే అర్థాన్ని ఏనాడో పోగొట్టుకొన్నాయి. సాంసారికధర్మంగా ఇచ్చేవాటినే పెట్టుపోతలంటారు.

## ఇష్టానిష్టాలు

దానధర్మాలూ పెట్టుపోతలూ ఇష్టానిష్టాలమీద ఆధారపడి చేసేవి, జరిగేవి. ఎందుచేతనో తెలీదుగాని ఇష్టం, అంగీకారం అనే రెంటినీ ఒకేగాటను గట్టి పర్యాయపదాలుగా పరిగణించారు కోశకారులు. "సంవిత్తు, ఆగువు, ప్రతిజ్ఞానం, నియమం, ఆశ్రవం, అభ్యుపగమం, ప్రతిశ్రవం, సమాధి, అంగీకారం, ఇష్టం" అనేవి ఇంచుమించు సమానార్థకాలన్నారు. వీటన్నింటిలో 'ఇష్టం, అంగీకార' మనేవే వాడుకలో ఉన్న మాటలు. 'అంగీకృతి' అనేది అంగీకారానికి రూపాంతరం. సంవిత్తంటే 'బాగా తెలిసింది' (కాబట్టి నచ్చినది, ఇష్టమైనది అని చెప్పుకోవాలి). ఆగువంటే అసలర్థమేమిటో తెలీదు. ప్రతి జ్ఞానమంటే తెలిసినట్లున్నది. నియమమంటే 'కట్టుబాటు'. అందరూ ఒప్పుకొని చేసుకొన్న ఏర్పాటు కాబట్టి అదికూడా ఇష్టమైనదే, 'సమ్మత' మయినదేనని భావించాలి. ఈ కాలంలో నియమ శబ్దాన్ని ఇష్టాంగీకారాలకు సమానార్థమని చెప్పలేం. సమ్మతి, సమ్మతం అనేవి కూడా సంస్కృత పదాలే – 'మనసుకు నచ్చినవి' అనే అర్థంలో. ఆశ్రవం, సంశ్రవం, ప్రతిశ్రవ మనే మూడు మాటలకూ దగ్గర సంబంధముంది. 'చెవికింపయినవి' అని చెప్పవచ్చు. అభ్యుపగమ శబ్దానికి తర్క వ్యాకరణాల్లో సాంకేతికమయిన అర్థాలున్నాయి. వాటిని మామూలు వ్యవహారంలో వాడటం మంచిదికాదు. 'సమాధి'కి సాహిత్యాలంకార శాస్త్రాల్లో ఉన్న అర్థానికీ, ఇప్పటి వాడుకలో ఉన్న అర్థానికీ, కోశకారుల పరిగణనకూ పొంతనలేదు. 'మంచిమనస్థితి' అని ఆ మాటకు అర్థం చెప్పుకోవాలి.

తెలుగులోని సంబంధి పదాలను లెక్కిస్తే 'ఇయ్యకోలు, ఒప్పుకోలు, మైకోలు, మేకోలు, సనుకోలు, ఒడంబడి(క), ఒడబాటు, ఒల్లబాటు, ఒప్పు, నప్పు, వల్లె, మంచి' మొదలయినవి కనిపిస్తాయి. వీటిలో ఒప్పు, నప్పు, ఒడంబడిక శబ్దాలు తప్ప తక్కినవి మన భాషాపదాలేనా అన్నంత అనుమానం పుడుతుంది. ఇయ్యకోలు, ఈకోలు శబ్దాలూ మేకోలు, మైకోలు శబ్దాలూ పరస్పరం రూపాంతరాలు. 'ఇయ్యకొను, మైకొను/మేకొను' అని క్రియారూపాలనుంచి ఏర్పడ్డ నామవాచకాలన్నమాట. ఒప్పుకొను అనే క్రియాపదం నేటికీ మంచివాడుకలో ఉంది. దానిమీద నామరూపం ఒప్పుకోలు. ఇయ్యకొను అనే క్రియారూపానికి పాతపుస్తకాల్లో కావలసినన్ని ప్రయోగాలు

దొరుకుతాయి. ఒడబడు/ఒడంబడు అనే క్రియాపదం నుంచి వచ్చిన విశేష్యం ఒడబాటు. ఒడంబడిక అనే శబ్దంలో ఈ క్రియార్థముంది. ఈశబ్దం 'సంధి' అనే అర్థంలోనే నేటి వాడుకలో వినిపిస్తుంది. ఏర్పాటు అనే అర్థవిశేషం లేకపోలేదు దీనికి. మైకొను, మైకోలు, మేకొను, మేకోలు అనేవి పూర్వ కావ్యాల్లోనే కనిపిస్తాయి. 'మేకొను' అంటే 'మేకుకొను (తీసుకొను)' అనే అర్థంలో "మేకులవంటి టోకులను మేకొని కొట్టెద నెల్లవేళలన్" అని ఓ చమత్కారి చాటువు చెప్పాడు. 'ఒప్పు' అనే రూపంకన్నా 'ఒప్పుకొను' అనే రూపమే ఎక్కువ వాడుకలో ఉంది. నప్పు శబ్దానికి క్రియారూపంలో ప్రాంతీయవ్యవహారముంది. 'నచ్చు' అనే క్రియా నామరూపాలకు రెంటికీ ఇది రూపాంతరం.

ఒల్లబాటు అనే రూపం 'వల్లె' అనే శబ్దం చాలాదగ్గర సంబంధం కలవి. ఈ కాలంలో "ఎస్" అనే ఇంగ్లీషు మాటలాంటిది వల్లె. తెలంగాణాలోని 'అవ్(మల్లా)' లాంటిది. 'ఒప్పుదలను' సూచించే పాతమాట వల్లె. దీనికి వ్యతిరేకార్థంలో 'ఒల్లమి' అనే రూపముంది. అలాగే అవ్యతిరేకంలో 'ఒల్లబాటు' అనే మరో రూపాంతరముంది. ఒల్లబాటు అంటే 'అవుననటం, సరే అనటం' అని అర్థం చెప్పవచ్చు. తెలంగాణాలో 'మంచిది' అనేమాటను ఎటుబడితే అటు తిప్పికొట్టడానికి వాడ్తారు. స్వరాన్నిబట్టి తప్ప అవునన్నారో కాదన్నారో ఆక్షేపిస్తున్నారో తెలుసుకోవటం కష్టం. కళింగప్రాంతంలోని "అc అc" అనే ధ్వని వంటిది కూడాను. ఈకాలానికి "ఒప్పందం, కట్టుబాటు" వంటి మరికొన్ని మాటలు ఇంచుమించు సమానార్థకాల స్థాయిలో వాడుకకు వచ్చాయి. తెలుగు నిఘంటువు ఒకటి 'కాని' అనే శబ్దాన్ని అంగీకారానికి తెలుగుమాటగా చెప్పింది 'కాని' అదేమిటో ఎలాగో అంతుపట్టడం లేదు.

ఇష్టమున్నప్పుడు అనిష్టమూ, అంగీకారముంటే అనంగీకారమూ ఉండకతప్పదు. 'కాదు, లేదు' శబ్దాలతో పనిగడుపుకొనే తెలుగువాళ్లు అనంగీకారానికి వేరే పర్యాయపదాల అవసరముం దనుకోకపోవచ్చు. కానీ సంస్కృతకోశకారులు అనంగీకారానికి పర్యాయపదాల నెందుకు చెప్పలేదో చెప్పలేం. అనిష్ట శబ్దానికి మన వాడుకలో 'అయిష్టం' అనే రూపం ఏర్పడింది. కావ్యభాషలో అచ్చ తెలుగులో చెప్పాలంటే 'ఒల్లమి, ఒప్పమి, నచ్చమి, నప్పమి' అంటూ 'అమి' చేరిన పదాలను వాడవలసి ఉంటుంది. ఎందుచేతనో 'అమి' ప్రత్యయంచేరిన మాటలిప్పటి వాడుకనుంచి తొలగిపోయాయి.

ఇష్టానిష్టాల్లాగానే న్యాయాన్యాయాల విషయంలో కూడా కోశకర్తలు తప్పొప్పులతో అనుసంధించి పర్యాయ పదాలనో సంబంధి పదాలనో సమీప పదాలనో పేర్కొన్నారు. తప్పొప్పులూ న్యాయాన్యాయాలూ ధర్మాధర్మాలూ దేశకాల పాత్రలనుబట్టి మారేవికాబట్టి వాటిని ఒకదానితో ఒకటి ముడివేసి పరిగణించారేమో.

★ ★ ★

# న్యాయాన్యాయ, ధర్మాధర్మాలు

న్యాయాన్యాయాలకూ తప్పొప్పులకూ అవినాభావ సంబంధముంది. న్యాయం ఒప్పనీ, ఒప్పే న్యాయమనీ మన పెద్దలు భావించారన్నమాట. మరోవైపు ధర్మాధర్మాలకూ న్యాయాన్యాయాలకూ దగ్గరి చుట్టరికముంది. దేశ కాల పరిస్థితులనుబట్టి ఇవి మారుతుంటాయి. ఇంకోవైపు పుణ్యాపాపాలకూ వీటికీ సంబంధం కనిపిస్తుంది. "ధర్మం, సుకృతం, పుణ్యం, శ్రేయం, యుక్తం, ఔపయికం, లభ్యం, భజమానం, అభినీతం, అభ్రేషం, సమంజసం, దేశరూపం" అనేవి న్యాయానికీ, "అగం, అపరాధం, మస్తువు" అనేవి అన్యాయానికీ పర్యాయ పదాలంటారు. ఇవన్నీ సంస్కృతపదాలు. 'ఒప్పు' అనే తెలుగుమాట ఒక్కటే న్యాయపర్యాయం. "తప్పు, సేగి, తప్పిదం, అగడం, దుడుకు, నేరం, నేరమి, దుండగం" అనేవి అన్యాయ పర్యాయాలయిన తెలుగుమాటలు.

ధర్మం అంటే సమాజం ఒప్పుకొని గౌరవించేది. 'ధరించేది/భరించేది' అని కొందరు వివరిస్తారు. సుకృతం అంటే 'మంచిపని'. దీన్నే పుణ్యమని కూడా భావిస్తుంటాం. పుణ్యమంటే పవిత్రమయినదని అర్థం. శ్రేయమంటే మేలుచేసేది. యుక్తమంటే తగింది. లభ్యమంటే దొరికింది, తటస్థపడ్డది అన్నమాట. ఔపయికం అంటే నిజానికి ఉపయోగపడేది. భజమానం అంటే గౌరవం పొందినది; పొగడ్త కెక్కింది. అభినీతమంటే మంచిదని గుర్తించి ఆదరించిందన్నమాట. సమంజసమంటే తగింది. అభ్రేష శబ్దానికి బాగా కోరింది, అభిమానించింది అని అర్థం. దేశరూప మనేది దివ్యమైనమాట. ఆయాదేశాల్లో (ఆసమయంలో) ప్రత్యేకంగా ఉండేదని చెప్పాలి. న్యాయమనే మాటకు అనుసరించేదని అర్థం. ఈ మాటలన్నిటిలోను సామాన్యంగా కనిపించే అర్థవిశేషం సమాజం అంగీకరించిందనేది. ఆచారాలు, ధర్మసూత్రాలు, చట్టాలు మారుతుంటాయి. ఒకప్పటి న్యాయం మరోకాలంలో చెల్లదు. ఒకచోటి ధర్మం మరోచోట అధర్మం కావచ్చు. ఉదాహరణకు ద్రౌపదిలాగా పంచభర్తృకగా ఉండటం ఈ కాలంలో అన్యాయం, అధర్మం – మనసమాజంలో. కులూవేలీలో (ఉత్తరప్రదేశ్ ఉత్తరభాగంలో) నేటికీ ఇది తప్పుకాదు – ఆచారమే. హిందూ సమాజంలో అన్న కూతురిని పెండ్లాడటం అధర్మం. ముస్లిం సమాజంలో అది ఒప్పే. ఈ మాటల్లో 'ఔపయికం, భజమానం, అభినీతం, అభ్రేషం, దేశరూపం' అనేవి కేవలం పుస్తకాల్లో మాత్రమే కనిపించే శబ్దాలు. ధర్మం, న్యాయం, పుణ్యం, యుక్తమనేవి నేటి వాడుకలో నిలిచిన మాటలేగాని న్యాయం ధర్మం ఒకటికాదు. న్యాయం చట్టరీత్యా అమల్లో ఉన్న సాంఘిక నిబంధన. ధర్మం చట్టం అంగీకరించినా లేకపోయినా సమాజం గౌరవించే నియమాలు.

న్యాయస్థానాలని కింది కోర్టులనూ, ధర్మాసనాలని హైకోర్టు సుప్రీంకోర్టులనూ (ముఖ్యంగా 'బెంచ్' అనేమాటకు పర్యాయంగా) కొందరు వాడుతున్నారు. ఒకవిధంగా ఇది సరైనదే. న్యాయస్థానాలు చట్టప్రకారం తప్పొ ఒప్పో తేలుస్తాయి. చట్టం

ఒప్పోతప్పో తేల్చగల అధికారం (రాజ్యాంగంప్రకారం) హైకోర్టులకు మాత్రమే ఉంది. కాబట్టి ఈరకంగా ప్రాధాన్యవివక్ష చేయటం సరైనదనిపిస్తుంది. న్యాయానికి కళ్ళు లేవు. అంటే స్వయంగా చూసిగాక, చూసినవాళ్ళు చెప్పేమాటల విశ్వసనీయతమీద ఆధారపడిమాత్రమే న్యాయమూర్తులు నిర్ణయించగలరు. అందువల్ల ఏ తప్పు(డు) సాక్ష్యాలో తప్పు(డు) వాదనలో కారణంగా ఒక్కొక్కప్పుడు తప్పునిర్ణయాలు తీసుకోవచ్చు. అలాంటి పొరపాటుకూడా అవకాశంలేని న్యాయమే ధర్మం. ధర్మం న్యాయంకన్నా సమున్నతమైనది. సుకృతంకన్నా పుణ్యం పెద్దమాట – మంచిపనికన్నా మహనీయమైనది పవిత్రతరం కాబట్టి. యుక్తమనేది మరీ మామూలుమాట. ఆ కాలానికో ఆ దేశానికో ఆ వ్యక్తికో తగినదన్నమాట.

తప్పు అనేమాటకు 'తప్పిద'మనేది రూపాంతం. ఆగడం అనేమాట అల్లరిలాంటి చిన్నతప్పును సూచించేమాట. దుడుకు అంటే పొగరుతో చేసేతప్పుపని. 'దుందుడుకు/తుందుడుకు' అనే మరో శబ్ద పల్లవముంది. దానికి తొందరపాటు అనే అర్థంవచ్చింది. నేరం పెద్దతప్పు. నేరమి దీనికి రూపాంతరమేగాని 'చేతగానితనం, అసమర్థత, అసహాయత' అనే అర్థాలు కూడా ఉన్నాయి దానికి. దుండగం బాధించేతప్పు. సేగి అనేది ప్రమాదకరమైన తప్పు; 'చెట్ట, చెడ్డ' శబ్దాలకూ దానికీ దూరసంబంధముంది. ఈ తెలుగుమాటలకు బదులు మాటలుగా అపరాధమనే సంస్కృత పదమొకటుంది. తప్పుశబ్దానికిది సరైనమాట. ఆగం సంస్కృత శబ్దమంటే నమ్మటంకష్టం – ఆగడానికి చాలాదగ్గరి మాటలాగుంది, కాబట్టి. అన్యాయం, అయుక్తం, అధర్మం లాంటి పదాలు వ్యతిరేకార్థకాలుగా వచ్చాయి. న్యాయం కానిదనే లేనిదనే అర్థంలో న్యాయంకానిది అన్యాయమయితీరాలని తర్కశాస్త్రం ఒప్పుకోదు! మస్తువనేమాట పుస్తకాల్లో మిగిలిపోయింది.

## శుభాశుభాలు

న్యాయపర్యాయాల్లో శ్రేయముందికదా. దానికీ శుభానికీ ఎంతో దగ్గరి సంబంధముంది. "శ్వం, శివం, భద్రం, కల్యాణం, మంగళం, భవికం, భావికం, భవ్యం, కుశలం, క్షేమ"మనే సంస్కృత శబ్దాలు శుభ శబ్దానికి పర్యాయపదాలంటారు. శ్వమంటే శుభమనే అర్థం. శ్రేయమంటే మేలు. శివమంటే మేలనే అర్థమేగాని 'శివమెక్కింది, శివాలు తొక్కుతున్నాడు' మొదలైన ప్రయోగాల్లో 'వీరావేశ'మనే అర్థవిశేషం కూడా వచ్చిపడింది. భద్ర శబ్దానికి క్షేమమనే అర్థం. భవ్యమనే మాటకు పవిత్రమని కూడా అర్థముంది. కల్యాణ శబ్దానికి 'పెళ్ళి' అనే అర్థంవచ్చింది. చిత్రం ఏమంటే 'క్షౌరకల్యాణం, కల్యాణకట్ట' వంటి పదబంధాల్లో ఈ మాటకు 'గొరుగుడు' అనే అర్థంకూడా రావటం. పూర్వం 'ముండనం మండనం పుంసాం' అనే సూక్తి వాడుకలో ఉండేది. తలమీద వెంట్రుక లేకుండా గొరిగిస్తే అది మగవాడికి అలంకారమన్నారు! అప్పట్లో అది ఫ్యాషన్ అన్నమాట! (ఇప్పుడు

కూడా 'బాల్డీస్, రెడ్ హెడ్స్' వగైరాపేర్లతో కొందరు పాశ్చాత్యయువకులు చలిమిడి ముద్దలాంటి గుండుతో తిరగటం అతి నవీనాలంకారంకింద పరిగణిస్తున్నారు!). కుశలశబ్దం మద్రాసు తెలుగులో, తమిళప్రభావంగల తెలుగులో బాగా వాడుకకెక్కింది. సంస్కృతంలో 'అమంగళం, అకుశలం' అనేవి అశుభానికి పర్యాయపదాలు.

తెలుగుమాటల్లో "లగ్గు, లెస్స, మేలు, సేమం, మంచి, బాగు" అనేవి శుభానికీ "చేటు. చేడ్పాటు, కీడ్పాటు, చెట్ట, సేగి, కీడు, చెడిది, సిలుగు, చెడు, చెరుపు" లాంటివి అశుభానికీ పర్యాయపదాలంటారు కోశకారులు. లగ్గు శబ్దం పుస్తకాల్లో మాత్రమే "ఎగ్గు"(=ప్రమాదం) శబ్దానికి వ్యతిరేకపదంగా కనిపిస్తుంది. 'దేశభాషలందు తెలుగులెస్స' అనే పద్యంలో మాత్రం నిలిచింది లెస్స. సేమం క్షేమ శబ్దభవం. మేలు శబ్దానికి 'ఎత్తయిన' అనే విశేషణార్థం కూడా ఉంది. (ఉదాహరణకు 'మేలుదూలం'లాంటి మాటల్లో). మంచి, బాగు అవేవే బాగా వాడుకలో ఉన్నమాటలు. చేటు శబ్దానికి 'ప్రమాదం, కష్టం' అనే అర్థాలు. వేదు చెడు, చెరుపులు తప్ప తక్కిన అశుభార్థక శబ్దాలు కావ్యాల్లో మాత్రమే దొరుకుతాయి. మంచి, బాగులు విశేషణాలుగా కూడా ప్రయోగంలో కనిపిస్తాయి.

# మూర్తామూర్తపదాలు

భాషలోని పదాలను ప్రధానంగా రెండు రకాలుగా విభజింపవచ్చు. మన ఊహల్లో, ఆలోచనల్లో ఉండి అవి సూచించే వస్తువులుండనిమాట లొకరకం. వాటిని అమూర్త పదాలంటాం. మంచి చెడు ఆ బాపతు శబ్దాలు. రెండోరకానికి చెందినవి మూర్త పదాలు. అవి రూపంగల వస్తువుల పేర్లన్నమాట. కంటికి కనిపించే పదార్థాలకు భాషల్లో ఉన్న పేర్లుకూడా మూర్త పదాలే. చీకటి, వెలుగు, ఇలాంటివి. చెట్టు, పుట్టలాంటి ద్రవ్యాల పేర్లన్నీ మూర్తాలే. తెలుగువంటి భాషల్లో మూర్తపదాలు సమృద్ధిగా ఉంటాయి. పాపం, పుణ్యం, కవిత్వం, ఆనందంలాంటి అమూర్త పదాలు సంస్కృతంలాంటి భాషల్లో కొల్లలు, తెలుగులో తక్కువ. తెలుగులో శబ్దసంపదను గుర్తించాలంటే మూర్తపదాలను పరిశీలించాలి. అలాగని అలాంటి మాటలు సంస్కృతం వంటి భాషల్లో తక్కువనుకోరాదు. ఏదో కొంత మార్పుకోసం నిత్యజీవితంలో ఎదురయ్యే వస్తువుల పేర్లనూ వాటికి సంబంధించిన మాటలనూ పరీక్షిస్తూ ఆయా వస్తువుల్లో మన సమాజం ఎంత వైవిధ్యం చూపుతుందో గమనిద్దాం. ముందు సాధారణ పదాలను చర్చించి తరవాత ఆ మూర్త పదాలద్వారా మన సంస్కృతి వికాసాన్ని గుర్తిద్దాం.

మాటల్లో మరోచిత్రం కూడా ఉంది. భాషలోని మాటలన్నిటినీ ఎవరూ వాడరు – వాడలేరు కూడా. ఆయా సందర్భాల్లో అవసరానికి కావలసిన మాటలు మాట్లాడ్తాం. కొన్నిటిని మాట్లాడక తప్పదు. వాటి వాడుక చాలా ఎక్కువ. వాడూ వీడూ వచ్చాడు వెళ్లాడు లాంటి 'ప్రాథమిక పదాలను' వాడకుండా

భాషనుపయోగించలేం. ఈ మాటలు అనుక్షణ అనుదిన వ్యవహారంలో ఉంటాయి. కాబట్టి అనుకోకుండా ఆలోచించకుండా వీటిని వాడగలం – వాడ్తాం కూడా. కొన్నిటిని ఎప్పుడోగాని వాడం. ఎవరైనా వాడినప్పుడు వాటి అర్థం తెలుసుకోగలం. గుర్తించగలం. మనమూ అవసరపడ్డప్పుడు వాడ్తాం. మరికొన్ని మాటలు ఎక్కడో విన్నట్లు గుర్తుకువస్తాయి; ఎప్పుడూ రావు. ఇంకా కొన్ని మాటలను సందర్భంబట్టి అర్థం చేసుకుంటాం. గురికి బెత్తెడెడంగా నిఘంటు నిర్మాతలు కూడా ఏ సందర్భంలో ఏ ప్రకరణంలో ఏ వాక్యంలో ఆమాట వాడారో సరిచూసి అర్థం నిర్ణయిస్తారు. ఈ సరిచూడటంలో ఆయా వ్యక్తుల అనుభవభేదాలనుబట్టి అర్థభేదాలు స్ఫురిస్తుంటాయి. ఈమాట కీఅర్థమని చెప్పవలసివప్పుడు పండితుల్లో కూడా అభిప్రాయభేదాలు వచ్చేది ఈ అనుభవ తారతమ్యాన్ని బట్టే. అన్ని సమయాల్లోనూ ఈ మాటకిది అర్థమని నిష్కర్షగా చెప్పలేకపోతే అది ఎప్పుడోగాని ఎవరోగాని వాడని పదమని సరిపెట్టుకోవాలి. అలాంటివి మారుమూల మాటలంటాం. దేశకాల పరిస్థితుల్లోని మార్పులవల్ల మాటల రూపంతోబాటు అర్థాలు కూడా మారిపోతుంటాయి. ఒకమాటకు వాడుక మరీ ఎక్కువయినా ఈ మార్పు వస్తుంది – చాలా తక్కువయినా ఈ మార్పు తప్పదు. అర్థంలో రూపంలో వచ్చిన మార్పునుబట్టి ఆయా పదాల చరిత్రను తెలుసుకోవచ్చు. ఆ చరిత్రే భాషాచరిత్ర. అదే సంస్కృతి చరిత్ర. అదే నాగరకతా చరిత్ర.

ఒక్కోమాటను పట్టుకొని దాని చరిత్రంతా నేర్చుకోవటం మరోసారి చూద్దాం. ప్రస్తుతానికి పూర్వంలోలాగానే ఒక వస్తువును భిన్నకోణాల నుంచి చూసి ఎన్నెన్ని పేర్లు పెట్టామో దానికి మాత్రమే పరిమితంగా పరిశీలనకు దిగుదాం. మొదట ఈ రకం పర్యాయ పదాలను గుర్తించి తరువాత ఆ పర్యాయపదాల్లో ఏభావం ప్రధానంగా ఏ రకంమాట వాడుతున్నామో గమనిద్దాం – కొంతకాలం.

## ఇళ్ళు: రకాలు

ఈ పద్ధతిలో మొదట 'ఇల్లు' అనే సర్వసాధారణ వస్తువు సంగతి చూద్దాం. (అంటే తెలుగువాళ్లందరికీ ఇళ్ళున్నాయనే భ్రాంతితోకాక ఇళ్ళు అందరికీ ఉండాలనే సదుద్దేశంతోనే ఉపక్రమిద్దాం). తెలుగులో ఇల్లు శబ్దానికి పర్యాయంగా "ఇక్క, ఇరవు, ఇమ్ము, ఉనికి(పట్టు), కొంప, టెంకి, ఠావు, తావు, నట్టు, సెలవు, గీము, తెంకి, బిడారు, విడిది, మనికి(పట్టు)" మొదలైన మాటలున్నాయి. సంస్కృతపదాల్లో "గృహం, గేహం, వేశ్మ(ం), సద్మం, నికేతనం, నిశాంతం, సదనం, భవనం, అగారం, మందిరం, నిలయం, ఆలయం, వాసం, ఉదవసితం, సాల, సభ, వస్త్య, నికాయ్యం" లాంటి మాటలేకాక "ఓకం, స్థానం, వాస్తు, ఉటజం, ధామం, నివేశం, శరణం, క్షయం, ధిష్ణ్యం, సంస్త్యాయం, నివసనం, అవసథం" లాంటివి కూడా పర్యాయ ప్రయోగంలో ఉన్నాయి. వీటిలో కొన్ని మారుమూల మాటలయితే, మరికొన్ని రోజూ మనం వినే, వాడే మాటలే. ఇవన్నీ సాధారణ పదాలు. మొదట వీటి విషయం.

సొంతదయితే ఇల్లని, ఇతరులదయితే కొంపని వ్యాఖ్యానించేవాళ్ళున్నారు! నిజానికి ఇల్లూ కొంపల మధ్య ఇంగ్లీషులోని 'హౌస్, హోమ్'ల మధ్య ఉన్న అంతరముంది. ఇల్లు ప్రేమాస్పదం; కొంపకాదు. విసుగులో నిరసనలో కొంప శబ్దానికి వాడుక ఎక్కువ. ఇక్క, ఇరవు, తావు శబ్దాలకు 'ఉండే స్థాన' మని అర్థం. అది ఇల్లే కానక్కరలేదు. ఇల్లు శాశ్వత నివాసస్థలమయితే ఇవి తాత్కాలికాలు. తావుకు ఠావు అనే మరో రూపాంతరముందంటారు కొందరు. అది ప్రాకృతం నుంచి తెలుగులోకి వచ్చిన మరో పదమంటారు మరికొందరు. 'ఉనికి, మనికి' అనే మాటలకు క్రమంగా 'ఉండటం, బతకటం' అని అర్థాలు. ఆ దశలకు 'పట్టు'గా ఉండే నిర్మాణాలను ఉనికిపట్టు, మనికిపట్టు అంటారు. తలదాచుకొనే చోటు ఉనికిపట్టు. బతికేచోటు మనికిపట్టు. తెంకి, టెంకి శబ్దాలు రూపాంతరాలు. వీటికూడా తాత్కాలిక నివాసస్థలమనే అర్థం. నెలవు అంటే ఉండేచోటు. ఉనికిపట్టు అనే పదబంధానికి సమానమైన ఒక్కమాట ఇది. నట్టు అనేది 'నడిచేచోటు' అనే అర్థంగల మాట. నడయాడే ప్రదేశమన్నమాట. గీము అనేది సంస్కృతంలోని గృహ శబ్దంనుంచి పుట్టింది. బిడారు శబ్దాన్ని అచ్చతెలుగు కవులు కొందరు 'ఇల్లు' అనే సామాన్యార్థంలోనే వాడారుగాని అమ్మకం సామగ్రితో వ్యాపారస్థులు తండాలుగా ప్రయాణిస్తూ తాత్కాలికంగా నిలిచేచోటు అని దానిఅర్థం. అలాగని ఈ మాటకు 'గుడారం, డేరా' అని అర్థంలేదు. తనది కాని స్థలంలో నిర్మించుకొన్న తాత్కాలిక వాసగృహమన్నమాట బిడారు. విడిది అనేది తాను కొంతకాలం మాత్రం నివసించే ఇతరుల గృహం. ఇల్లు తనది; విడిది పరాయివాళ్లది. కొంతసేపు మజిలీచేసేచోటు విడిది.

పై తెలుగుమాటల్లో అభిమానంతో చెప్పే ఇల్లు, ఈసడింపుగా వాడే కొంప అనే శబ్దాలకే ఈ కాలంలో ఎక్కువ వాడుక వుంది. తావు శబ్దానికి ఏ ప్రదేశమయినా అర్థం కావచ్చు. ఇప్పుడా మాటకు ఇల్లనే అర్థంలేదు. కాకపోతే 'తావున' అనే విభక్త్యంతరూపం కొన్ని ప్రాంతాల్లో 'తన'గా మారి ఫలానావస్తువు 'నాతాన' లేదనేలాంటి ప్రయోగాల్లో వినిపిస్తుంది – 'నాదగ్గర' అనే అర్థవిశేషంలో. ఇమ్ము శబ్దానికి 'ఇష్టమైనది, నచ్చినది' అనే అర్థాలు కూడా ఉన్నాయి గాని దానికీకాలంలో వాడుక లేదు. మిగిలినమాటలేవీ నేటి వాడుకలో వినిపించేవి కావు – 'పుస్తకాల్లోని' మాటలన్నమాట.

సంస్కృతపదాల్లో కొన్ని – 'గృహం, సదనం, భవనం, నిలయం, నికేతనం' అనేవి – ఎక్కువ వాడుకలో ఉన్నమాటలు. వీటిలో మొదటిది తప్ప తక్కిన వాటిని ఇంటికి పెట్టుకొనేపేర్లకు వాడటమెక్కువ. మొదటిమాట సాధారణ పదం. కుటుంబం నివసించే నిర్మాణానికి గృహమని పేరు. గేహమంటే ఇల్లేగాని ఈ మాటకు గ్రంథప్రయోగమేగాని నిత్యవ్యవహారంలో వాడుక తక్కువ. తెలుగుదేశంలో లేదుగాని మరాఠీ ప్రాంతంలో 'గృహ' శబ్దాన్ని హోటలనే అర్థంలో కూడా వాడుతుంటారు. మరాఠీ ప్రభావమున్న సరిహద్దు పట్టణాల్లో తెలుగువాళ్ళు కూడా కదాచిత్తుగా ఈ ప్రయోగం చేస్తుంటారు. నిలయమనేది సంస్కృతపదం కాదనీ అది ద్రావిడభాషల

నుంచి ఎరువుగా తెచ్చుకొన్న మాటేనని కొందరు వాదిస్తారు. మూలమేదయినా అది సంస్కృతభాషలో వాడుకకెక్కిన మాటే. తెలుగులోని 'నిలు(చు)'లోని 'నిలు' అనే భాగమే నిలయ శబ్దంలోనూ ఉందని చెప్తారు. ఈ పదం దక్షిణోత్తర భాషాకుటుంబాలకు రెంటికీ చెందిందనే భావంతోనే "రాష్ట్రపతి నిలయ"మనీ ఆ భవనానికి పేరు పెట్టారు. వేశ్మ శబ్దానికి (వ్యక్తులు) విశ్రాంతిగా ఉండే తావని అర్థం. సద్మం మంచి యిల్లు. నికేతనం పెద్దఇల్లు. అన్ని కాలాల్లోనూ సుఖంగా ఉండటానికి వీలయిన గృహాన్ని నిశాంతమంటారు. సదనం, సద్మం రెండూ ఒకదానికొక్కటి దగ్గరగా ఉండేమాటలు. భవనం అంటే పెద్దఇల్లు. విశాలమైనదని అర్థవిశేషం.

ఆలయం, మందిరమనేవి గృహ పర్యాయాలేగాని వాటికి దేవతలు నివసించే ఇళ్లనే విశేషార్థం వచ్చింది. తెలుగుదేశంలో ఆలయ శబ్దం 'గుడి'కి పర్యాయంగానే ప్రయుక్తమవుతుంది. మందిర శబ్దం ఉత్తరాది వారి ప్రభావంవల్ల తెలంగాణాలో దేవాలయార్థంలో వాడుకకెక్కింది. ఇతర ప్రాంతాల్లో రాజులూ, జమీందార్లూ, సంపన్నులూ నివసించే ఇళ్లనే మందిరాలని పిలుస్తారు. అగార శబ్దానికి విడిగా వాడుక తక్కువ. కానీ 'ధనాగారం, కోశాగారం, కారాగారం' వంటి పదబంధాల్లో సమాసాల్లో దానికి ఎక్కువ వ్యాప్తి ఉంది. 'దాచేచోటు' అనే ప్రత్యేకార్థంలో అగార శబ్దానికి వాడుక ఎక్కువ. వాసమంటే కాపురముండే తావని అర్థం. దీనిక్కూడా 'జనావాసం, వాసస్థలం' మొదలైన సమాసాల్లోనే వాడుక అధికం. సభా శబ్దానికి ఇప్పటికి అర్థమే మారిపోయింది. పదిమంది ఒకచోట చేరిన సమావేశానికే సభ అనిపేరుగాని కేవలం గృహార్థంలో దీనికి వాడుకలేదు. సభలో ఉండేవాళ్లు సభ్యులు. సభ్యులనే అర్థంలో ఈ కాలంలో సభికులనేమాటనే ఎక్కువమంది వాడుతున్నారు. ఒకప్పుడు జూదమాడేచోటును మాత్రమే సభ అనిపిలిచేవాళ్లు. జూదరులనూ జూదమాడించే వాళ్లనూ సభికులనేవాళ్లు. జీవితమే జూదమైన ఈ కాలంలో సభ్యులకూ సభికులకూ మధ్య భేదం అంతరించిందన్నమాట! సాలా శబ్దాన్ని కోశకారులు గృహపర్యాయమని చెప్తారుగాని దీనికీ 'శాల'కూ సంబంధముండేమోనన్న అనుమానం కలుగుతుంది. ఉదవసితం, వస్త్యం, నికాయ్యం అనే మాటలకు సంస్కృత కావ్యాల్లో కూడా ప్రయోగాలు దొరకటం కష్టం.

ఓక శబ్దం విడిగాకాక సమాసాల్లో వినిపించేమాట. 'నాకౌకసులు, జలౌకం' మొదలైన సమాసాల్లో ఓక శబ్దానికి 'నివాసం, స్థానం, స్థలం' అనే అర్థాలున్నాయి. స్థానశబ్దాన్ని గృహశబ్ద పర్యాయమని అంగీకరించటం కష్టమే. 'ప్రదేశం, తావు, ప్రాంతం' అనే అర్థాల్లోనే దానికి బహుళవ్యాప్తి కనిపిస్తుంది. వాస్తు శబ్దానికి గృహమనే అర్థం 'వాస్తుశాస్త్రం, వాస్తుపురుషుడు' వంటి సమాసాల్లో కనిపిస్తుంది. వస్తువులున్నది, వస్తువులకు సంబంధించిందీ వాస్తు. ఉటజ శబ్దానికి 'తౌర' అనే అర్థంకూడా ఉంది. ధామ శబ్దానికి ఉండేచోటనే అర్థం. ఈ మాట నివాసస్థలమనే అర్థంలో విడిగానూ సమాసాల్లోనూ వాడుకకెక్కింది. నివేశమంటే ఉండేతావు. ఈ మాటకు ఈ అర్థంలో వాడుక తక్కువేగాని దీని రూపాంతరమైన 'నివేశన' శబ్దానికి ముఖ్యంగా దస్తావేజుల భాషలో మంచి వాడుక ఉంది. 'ఇల్లు కట్టుకోదగినచోటు' అనే

అర్థంలో నివేశనస్థలమనే మాటను ధారాళంగా వాడుతుంటారు. తక్కినమాటలకు – ధిష్ణ్యం, సంస్త్యాయం, నివసనం, అవసథ'మనే వాటికి – వాడుక చాలా చాలా తక్కువ, సంస్కృతంలోకూడా.

కొన్ని అర్థ విశేషాల్లో మరికొన్ని సంస్కృత పదాలు గృహశబ్దపర్యాయాలని చెప్పదగినవి ఉన్నాయి. నలుచదరంగా ఉండే, నాలుగు చావళ్లుండే ఇంటిని 'చతుశ్శాల' అనీ, 'సంజవన'మనీ పిలుస్తారు. పైన పేర్కొన్న ఉటజ శబ్దంతోపాటు 'పర్ణశాల' అనే మాటను మునులు నివసించే పూరిళ్లనే అర్థంలో వాడేవారు. యజ్ఞం చేసే శాలను 'ఆయతనం, చైత్యం' అని పిలిచేవాళ్ళు. ఈ రెండు మాటలనూ యజ్ఞవిధులను వ్యతిరేకించే బౌద్ధులు సొంతం చేసుకొని బౌద్ధసన్యాసులూ భిక్షుకులూ నివసించే చోట్లనే అర్థవిశేషం కల్పించారు! అచ్చ తెలుగులో 'లాయ'మనిపిల్చే గుర్రాలసావడిని సంస్కృతంలో 'వాజశాల, మందురి' అంటారు. సన్యాసులూ వారి శిష్యులూ నివసించే ఇళ్లను మఠమని, వారికి ఉచిత నివాసంతోపాటు భోజన వసతి కూడా కల్పించేచోటును సత్రం అనీ అంటారు. 'సత్రేభోజనం మఠేనిద్రా' అనేమాట అందుకే పుట్టింది. మహారాజుల ఇళ్లలో తాగడంతో తృప్తిపడక ప్రత్యేకించి తాగుడుకోసం వేరే ఇళ్లు కట్టించుకొనేవాళ్లు. అటువంటి గృహాన్ని 'గంజ, మదిరాగృహం' అని పిలుస్తారు. పడకటింటిని 'గర్భాగారం, వాసగృహం' అంటారు. దేవాలయాలకు సంబంధించి గర్భగృహం, గర్భాగారం అనేవాటి స్థానంలో దేవుడుండే ప్రత్యేక స్థలానికి 'గర్భగుడి' అనే అర్థం వచ్చింది. గర్భగృహం, గర్భాగారం అనే సమాసాల్లోని గర్భ శబ్దానికీ గర్భాదానానికీ సంబంధముందిగాని 'గర్భగుడి'లోని గర్భ శబ్దానికి కడుపనే అర్థంకాక 'లోపలి భాగం' అనే ప్రత్యేకార్థం వచ్చింది. పురుటింటిని సంస్కృతంలో 'అరిష్టం, సూతికాగృహం' అని పిలిచేవాళ్లు. అరిష్టం అంటే ప్రమాదమనీ, కాకి అనీ ఇతరార్థాలు కూడా ఉన్నాయి. ఇళ్లలోని భాగాలను ఇలాపిలుస్తుంటే ప్రత్యేక గృహాలకు వేరే పేర్లున్నాయి.

రాతి కట్టడాలను కుట్టిమాలంటారు. పై మేడను చంద్రశాల అనీ, శిరోగృహమనీ పిలుస్తారు. రాజులుండే పెద్దఇళ్లను రాజగృహాలనేకాక ప్రాసాదాలనికూడా చెప్తారు. డబ్బున్నవాడి ఇంటిని హార్మ్యమంటారు. సౌధమంటే సున్నంకొట్టిన/వెల్లవేసిన ఇల్లు. ఈ మాటనుబట్టి పూర్వం అందరి ఇళ్లకూ అన్ని ఇళ్లకూ సున్నం కొట్టేవారుకాదని తేల్చవచ్చేమో! రాజ సదనమని కూడా సౌధ శబ్దానికి పర్యాయపదమొకటుంది. బహుశా ఏదో ఒకకాలంలో రాజుల ఇళ్లకేగాని ఇతరుల కొంపలకు సున్నం కొట్టించరాదనే నిషేధముందేమోనన్న సంశయం కలుగుతుంది.

తెలుగు మాటల్లో ఉండే, ఉండదగ్గ స్థలానికి 'వేలం, పాళెం, వీడు' మొదలైన పర్యాయపదాలుండేవి. కాలక్రమాన అవి ఊళ్లపేర్లకు చివరి ప్రత్యయాలుగా మారిపోయాయి. ఇక ఈనాటి తెలుగుదేశంలో ఎన్నిరకాల ఇళ్లున్నవో శాస్త్రం ప్రకారం కాక వాస్తవ వ్యవహారాన్నిబట్టి తెలుసుకొందాం.

ఎన్ని రకాల ఇళ్లున్నాయని ఏ తెలుగు విద్యార్థినడిగినా ముఖ్యంగా మూడురకాలు పేర్కొంటాడు: పూరిల్లు, పెంకుటిల్లు, మేడ – అని. 'పూరి' అంటే గడ్డి. గడ్డికప్పున్న ఇల్లు పూరిల్లు. తెలంగాణాలో ఇళ్లు రెండు రకాలంటారు. గుడిసె,

బంగ్లా అని. రాయలసీమలోనయితే మేడ బదులు మిద్దె శబ్దాన్ని ఎక్కువగా వాడ్తారు. ఇతర పదాలు లేవని కాదు. ఎక్కువ వాడుకలో ఉన్నవాటి విషయం ప్రస్తావిస్తున్నాం.

నిజానికి అత్యధిక సంఖ్యలో ఉన్న తెలుగిళ్లు గుడిసెలే. గుడుసు అంటే గుండ్రం. గుండ్రంగా ఉండే ఇళ్లు గుడిసె అనేది సామాన్యార్థం. దాన్నే కొన్ని ప్రాంతాల్లో చుట్టిల్లు అని పిలుస్తారు. మరికొన్ని ప్రాంతాల్లో కైవారమి ల్లంటారు. మరికొన్నిచోట్ల 'సేరు' అని పిలుస్తారు. సేరు శబ్దానికి చక్కదనమనే అర్థంకూడా ఉంది. గుడిసె అంటేనే గుండ్రటిదని అర్థమైనా దాన్ని 'చుట్టుగుడిసె' అంటేగాని కొందరికి తృప్తిగా ఉండదు. దాన్నే 'గుండుకొట్టం, గుండుగుడిసె, చుట్టిల్లు గుడిసె, బుడిమి, బొడ్డుగుడిసె' వగైరా రకరకాల పేర్లతో భిన్నప్రాంతాల్లో పిలుస్తుంటారు. నిజానికి బుడిమి పూర్తిగా గుండ్రంగా ఉండదు. అర్ధచంద్రాకారంలో ఉంటుంది. వెదురుబొంగుల్ని వంచి రెండువైపులా నేలలో పాతి ఆ చట్రానికి చాపకప్పు వేస్తే అది బుడిమి అవుతుందన్నమాట. గుడిసెలన్నీ పూరిళ్లేగాని అవి గుండ్రంగా ఉంటాయి కాబట్టి గుడిసెలన్నారు; వాటి కప్పుమీద గడ్డి (పూరి) ఉంది కాబట్టి పూరిల్లన్నారు. కాశె గడ్డి కప్పున్న పూరిల్లు కాశె గుడిసె. ఈతాకులుగాని కప్పువేయడానికి వాడ్తే అది కమ్మరిల్లు. తాటి కొబ్బరి మట్టలను (ముఖ్యంగా) కళింగ ప్రాంతంలో కమ్మలని పిలుస్తారు. తెలుగు గుడిసెలకు కప్పుగా ఎక్కువ వాడుకలో కనిపించేవి తాటాకులు. కొన్నిచోట్ల మాత్రం కొబ్బరాకులు. కొబ్బరాకు కప్పే పూరిళ్లను సాధారణంగా గుండ్రంగా కాక చతురస్రంగానో పొడుగ్గానో కట్టారు. దాన్ని కొన్నిచోట్ల 'వాసిల్లు' అని పిలిస్తే, మరికొన్నిచోట్ల 'బారాకజు' అంటారు. బారాకజు అనేది 'బారెక్స్' అనే ఇంగ్లీషు మాటనుంచి వచ్చిన మాట. ఆ పూరింటి కప్పుమీద ఆకు/గడ్డి గాలికి ఎగిరిపోకుండా కొమరలు (గెలవాసాలు) బిగిస్తే దాన్ని కొమరిల్లు అని పిలుస్తారు. దాన్ని మరికొన్నిచోట్ల 'కోరిల్లు' అనికూడా పిలుస్తారు.

చాలా లక్షణాల్లో గుడిసెలా ఉన్నా గుండ్రంగా ఉండని, చదరంగంగా ఉండే పూరింటిని చౌకపిల్లు అని పిలుస్తారు. చౌక మనేది చతుష్కమనే సంస్కృత పదం నుంచి పుట్టిన మాట. ఈ రకాల ఇంటినే భిన్నప్రాంతాల్లో "చదరపిల్లు, చుట్టుచౌకం, చౌకంకొట్టం, సవిరిల్లు, సేకండిల్లు" వగైరా పేర్లతో పిలుస్తున్నారు. చుట్టూ గోడలుంటే ఇల్లు. గోడల్లేకపోతే 'పాక'. చివరకు వీ వెదురుబద్దల 'దడి' అయినా ఒకవైపుంటే ఆ పూరింటిని 'గోవిల్లు' అని పిలుస్తారు. పాకల్లోకూడా రకాలున్నాయి. వాటికి వేరువేరు పేర్లున్నాయి. గుండ్రంగా ఉండే పాకను 'చుట్టుపాక' అంటారు. పొడుగాటి పాకను 'దోనిపాక' అంటారు. వాలుకప్పున్న పాకను 'వారపాక' అంటారు. నిజానికిది 'ఒర'పాక. దీన్నే 'మొరపాక, సాయిబాన్' వగైరా పేర్లతో భిన్నప్రాంతాల్లో పిలుస్తుంటారు. ఇళ్లు మనుషులకు, పాకలు పశువులకు. గతిలేనప్పుడు పాకలనే ఇళ్లుగా భావించి తలదాచుకొనే వాళ్లున్నారు. అలాగే ఇంట్లోనే పశువులను కట్టివేసుకొనే వాళ్లూ ఉన్నారు. ఈ పరిస్థితులకు 'అవసరం' ప్రధానకారణం.

గడ్డికప్పు స్థానంలో పెంకులను వాడితే పెంకుటిల్లు తయారవుతుంది. పెంకును కొన్ని ప్రాంతాల్లో 'పెంక, పెంకి, పెంకె' అనికూడా పలుకుతుంటారు. 'పెంకిల్లు, బిళ్లిల్లు, కవేవిల్లు' అనే పేర్లు ప్రాంత భేదాలనుబట్టి పెంకుటింటికి వాడుకలో ఉన్నాయి.

ఆయా ఇళ్ల ఆకారంలోని భేదాలనుబట్టి రకరకాల పెంకుటిళ్లకు రకరకాల పేర్లు పెట్టారు. ఒకవైపు వంపుతో రెండు దిమ్మలకు బదులు నాలుగువైపులనుంచీ గాలీవెలుతురూ వచ్చేందుకు వీలుగా కట్టిన పెంకుటింటిని 'ఒకసంకిల్లు' అని కొందరు పిలుస్తారు. ఇక్కడి 'సంక' శబ్దం 'చంక' శబ్దానికి రూపాంతరం. మరికొందరు ఈ రకం కట్టడాన్ని 'ఒంటిలొద్దిల్లు' అని వ్యవహరిస్తారు. 'లొద్ది' అంటే 'మూల'. రెండువైపులకు బదులు మూడువైపులా గదులుండేట్లు కట్టిన పెంకుటింటిని 'చాటాకుల్లారి' అని తెలుగువాళ్లు పిలుస్తారు. ఇంగ్లీషులోని యూ అనే అక్షరం రూపంలో, 'చేట'లాగా మూడువైపులా ఎత్తుగా ఉండేది కాబట్టి ఈ పేరు వచ్చింది. దీన్నే కొందరు సంస్కృతంలో 'త్రిశాల' అంటారు – మూడు సావళ్లున్న ఇల్లనే అర్థంలో. నాలుగువైపులా కట్టుబడిచేసి మధ్యలో ఖాళీ జాగా ఉంచిన పెంకుటింటిని 'లోగిలిల్లు' అని పిలుస్తారు. ఈ రకం ఇంటికి అనేక ప్రాంతాల్లో రకరకాల పేర్లున్నాయి – మాండలికంగా. కాస్త చదువు – అదే సంస్కృతం (!) – ఒంటపట్టినవాళ్లు 'చతుర్భవంతి, చతుశ్శాల' అని పిలిచేది లోగిలింటినే. కొంచెం ఉర్దూగాని మరాఠీగాని అలవాటైనవాళ్లు 'చౌబార(భవంతి), చౌభవంతి' అని దీన్నే పిలుస్తారు. అటూఇటూ గాని చదువులవారయితే 'చుట్టు భవంతి, నాలుగిళ్ల భవంతి, నాలుగుసారల భవంతి' అంటారు దీన్నే. సీదాసాదాజనం ఈ లోగిలింటినే 'చుట్టుగులారపిల్లు, మండువా (ఇల్లు)' అంటారు. పేర్లు భిన్నమేగాని వస్తువొక్కటే.

భవన శబ్దానికి రూపాంతరంగా వాడుకకెక్కిన 'భవంతి' చిత్రమైన మాట. పెద్ద ఇంటిని భవంతి అని వ్యవహరిస్తున్నారు. తెలంగాణాలోనయితే సామాన్య జన వ్యవహారంలో గుడిసె (పూరిల్లు) కానిదేదయినాసరే 'బంగ్లా' కిందనే లెక్క. ఇది బెంగాలీ నుంచి ఇంగ్లీషులోకి వలసపోయి తిరిగి మన భాషలోకి దిగుమతయిన మాట. ఎక్కువ గదులున్న పెంకుటింటిని భవంతి అంటారు. రెండు గోడలమధ్య అడ్డంగా ఉన్న దూరం 'అంకణ'మని కొందరు, 'గది' అని మరికొందరు, 'అర'ని ఇంకా కొందరు వాడుతున్నారు. ఈ అంకణాల సంఖ్యనుబట్టి కూడా ఇళ్లకు పేర్లు మార్తాయి. ఒకే అంకణం ఉంటే దాన్ని 'ఏకేరిల్లు, ఏకారిల్లు, రోకుటిల్లు' అని భిన్నప్రాంతాల్లో పిలుస్తారు. భాగాలుగా కట్టిన పెంకుటింటిని కొందరు 'సందులిల్లు' అని పిలుస్తారు. ఒక ఇంటికి ఆనించి రెండోది కట్టినట్లు కప్పునుబట్టి కనిపిస్తుందిగాని ఒక్క ఇల్లుగానే ఉంటుంది ఈ సందులిల్లు. పక్కన పంచలు దించిన పెంకుటింటిని కొందరు 'కురుమాడిల్లు' అంటారు. కొన్నిచోట్ల ఇటువంటి ఇళ్లకు 'పై అంతస్తు' కూడా ఉంటుంది. అంతస్తు ప్రధానం కాదుగాని ఈ పేరు రావటానికి 'పంచ'దించటమే ముఖ్యకారణం. 'కురుమాడి' అంటే 'చిన్నమేడ' అని అర్థం చెప్పవచ్చు.

తెలంగాణా వ్యవహారంలో 'గుడిసె, బంగళా' అని ఇళ్ళు రెండురకాలు. చిన్నదయితే గుడిసె, పెద్దదయితే బంగళా. ఇది సాధారణ విశ్లేషణ. ఇళ్ళ రకాలను వాళ్ళు గుర్తించలేదని కాదు. చాలా రకాలు చెప్తారు. మరో రకం సులభ విభజన 'ఇల్లు, మేడ' అనేది. అంతస్తులున్నది మేడ; లేనిది ఇల్లు. అంతస్తుకు అంతరమనే పర్యాయపదముంది. మేడను భిన్న ప్రాంతాల్లో భిన్న విధాలుగా పిలుస్తారు – 'మేడి, మాడి, మాడిగ, మాలె, బంగళా' అని. మాట భేదమేగాని వస్తువొకటే. కొందరు

అంతస్తులున్న ఇంటిని 'మంజిల్' అని కూడా పిలుస్తారు. సంస్కృత కావ్యాల్లో 'చంద్రశాల, శిరోగృహం' అని పై మేడకు పేరు. 'పై మేడ' అంటే ఇంటిమీది అంతస్తు ఇల్లు. దీన్నే భిన్నప్రదేశాల్లో 'పై భవంతు, పై మిద్దె, మాడి, మేలు, మేల్మాలు' అని కూడా పిలుస్తుంటారు. 'మేల్మిద్దె, మేల్మాడి, మేల్మాలె' వంటి పేర్లు లేకపోలేదు. మేలు శబ్దానికి 'పై (నుండే)' అనే అర్థంకూడా ఉంది.

ఇటిక/రాతి కప్పున్న ఇంటికి అంతస్తులు లేకపోతే డాబా అని పేరు. దీన్నే 'దాబా, దావ' అనికూడా ఒక్కోచోట పిలుస్తారు. 'డాబ్‌నా' అనే హిందీ ధాతువునుంచి ఏర్పడ్డ మాట డాబా. తెలుగుమాటగా మిద్దె అనేది దీనికి పర్యాయపదం. మిద్దెకు 'మిద్ది, నిద్ది' అనే రూపాంతరాలూ భవంతులాంటి పర్యాయపదాలు ఉన్నాయి. ఆకారాన్నిబట్టి, కప్పునుబట్టి, హంగులనుబట్టి రకరకాల పేర్లున్నాయి ఇళ్లకు. గడ్డికప్పుగాని, ఆకుకప్పుగాని ఉన్న ఇంటి మామూలుపేరు పూరిల్లు/గుడిసె. దీన్ని సంస్కృతంలో (పర్ణ)కుటి, కుటీరం అని పిలుస్తారు. చిత్రమేమంటే మహాభవనాలు కట్టి వాటికి 'కుటి, పర్ణకుటి, (పర్ణ)కుటీరం' అనిపేర్లు పెట్టినవాళ్లుండటం. మహాభవనాలను సంస్కృతంలో హర్మ్యాలంటారు. దాన్ని సున్నంతో కట్తే సౌధమని పిలుస్తారు. సుధ అనేది గమ్మత్తు మాట. దానికి సున్నమనీ అమృతమనీ రెండర్థాలూ ఉన్నాయి. అలాగే ఓ మోస్తరు ఇల్లుకట్టి దాన్ని 'మంజిల్' అనే ఉర్దూ మాటతోగాని 'మేన్షన్' అనే ఇంగ్లీషు మాటతోగాని వ్యవహరించే వాళ్లూ ఉన్నారు! పూరికప్పుల్లో కూడా రకాలున్నాయి. వాడే ఆకులనుబట్టి గడ్డి రకాలనుబట్టి కొన్ని పేర్లు వస్తే కప్పు స్వభావాన్ని బట్టి పేరు మారుతుందికూడా. గుండ్రటి ఆకు కప్పును బోడికప్పంటారు. ఎక్కువ వాలుగా ఉన్న పూరికప్పును కోరాటం కప్పంటారు. దీన్నే 'మేలాటం, మేలువాటు' అనికూడా పిలుస్తారు. మేలంటే ఇక్కడ ఎక్కువ అని అర్థం. వాటు/వాటం అనేవి 'వాలు' అనే అర్థమిస్తాయి.

మట్టికప్పు సాధారణంగా మిద్దెలకుంటుంది. చౌడుమట్టి కప్పున్న మిద్దెను చౌడుమిద్దె అంటారు. కొందరు దీన్నే అటకమిద్దె అనికూడా పిలుస్తారు. రాతిదూలాల మిద్దెను కొందరు తీర్లమిద్దె అని పిలుస్తారు. చెక్క కప్పున్న మిద్దెను దొల్లు మిద్దె/మిద్ది అని వ్యవహరిస్తారు. మట్టికప్పు దించిన పంచలూ ఉన్న మిద్దెను పరాన మిద్ది అని పిలుస్తారు. రాతిగోడల మీద చెక్కకూర్పుతో కప్పువేసి దానిపైన మట్టిమేగితే 'దర్దలం' అనిపించుకుంటుంది నేటివ్యవహారంలో. కావ్యభాషలో 'దర్దడం, దర్దళం' అని దీన్నే పిలిచేవాళ్లు. ఈ మాటకు సూర్యరాయాంధ్ర నిఘంటువులో "బోడిమిద్దె, చిన్న రాతికప్పుగల గుడిసె, చిన్నగుడి, యుద్ధసాధనాలు నిలుపు రాతిమిద్దె" అనే అర్థాలిచ్చారు. వారిచ్చిన ప్రయోగంలో 'రాతిదర్దడము' అనేమాట ఉంది. అది నిజంగా రాతికట్టడమే అయితే 'రాతిదర్దడం' అని ఎందుకు చెప్పవలసి వచ్చిందో మరి! ఇప్పటివాడుకలో బోడి మిద్దె అనే మాటకు రెండర్థాలున్నాయి. ఒకటేమో పిట్టగోడల్లేని మిద్దె అనేది; రెండోది గుండ్రంగా ఉండే మిద్దె అని. గుడిసెకు రాతి కప్పేమో నిఘంటుకారులు వివరించలేదు. సాధారణంగా కోటల ముఖద్వారం మీద ఈ చెక్కకూర్పు గదులు వేసి అందులో యుద్ధసాధనాలుంచేవాళ్ళు. 'వంకదారకు చేరి వాకిట దర్దడంబులు చేర్చి...' అనే లాంటి పద్యాల ద్వారా ఈ విషయం

గుర్తించవచ్చు. గుళ్లకు రాతికప్పు సాధారణం. చెక్కకూర్పు గుళ్ళున్నవేమో తెలీదు. ఈ మిద్ది శబ్దాన్ని 'అంచ, తంతె, మెట్టు' అనే అర్థంలో కూడా కొందరు కొన్ని చోట్ల వాడుతున్నారు. చెక్కకప్పు స్థానంలో ఏ తడికనో పరిచి దానిమీద మట్టి మేగిన డాబాను/మిద్దెను 'సరంబ' అని పిలుస్తారు. మిద్దె శబ్దాన్ని నిఘంటుకారులు మేడకు పర్యాయ పదంగానే పరిగణించారు! వాళ్ళలెక్కన 'మేడ, మిద్దె, మాడుగు, మాడుపు, మచ్చు, ఉప్పరిగ'లు పర్యాయపదాలు. కావ్య భాషలోని మాడుగు, మాడువు–లకు నేటి సమానరూపాలు 'మాడి(గ), మాళిగ' అనేవి. మచ్చుకు ఇప్పుడు ఆయాప్రాంతాల్లో 'అటక, మంచె, మచ్చె' అనే అర్థాలున్నాయి. ఉప్పరం అంటే ఆకాశం. ఉప్పరిగ అంటే ఎత్తుగా ఉన్నఇల్లు అని చెప్పవచ్చు.

పెంకు కప్పున్న ఇంటిని 'పెంకుటిల్లు' అంటాం. దాన్నే 'కవేలిల్లు, బిళ్ళిల్లు' అనే వాళ్ళున్నారు. పెద్ద పెంకుల కప్పంటే 'కూనిల్లు, గూనిల్లు' అనికూడా పిలుస్తుంటారు. కప్పుల ఆకారాన్ని బట్టి వాటికి రకరకాల పేర్లున్నాయి. వెన్ను దగ్గర వెడల్పు తక్కువగా ఉండి క్రమంగా పక్కలకు విశాలంగా పరచుకొన్న పెంకు కప్పును 'బాలంగిరి' కప్పు అంటారు. దాన్నే భిన్న ప్రాంతాల్లో 'బాలంగి, బాలంకిరి, బాదాంగిరి, బారంకి' కప్పులని పిలుస్తారు. కప్పు నల్బదరంగా ఉంటే దాన్ని పాకకప్పు అని పేర్కొంటారు. ఇంటికప్పు పైనచిన్నగా ఉండి దూరంనుంచి చూస్తే త్రిభుజాకారంగా పక్కలకు వ్యాపించి ఉంటే దాన్ని 'కురుమాడు, కురువాటం' కప్పని పిలుస్తారు. 'కురు' అంటే చిన్న. 'మాడు' అంటే పైభాగం. ఈ రకం కప్పును మరికొందరు 'చిప్పపెంక' అని వ్యవహరిస్తారు. వెడల్పూ వాలూ తక్కువగా ఉండే పెంకు కప్పును 'పడకకప్పు' అని పిలుస్తారు. పాత, కొత్త పెంకులతో కప్పు 'నేత'ను రకరకాల నమూనాల్లో డిజైన్లలో నేసేవాళ్ళు పూర్వం. ఇప్పుడు ఆ విద్య ఇంచుమించు పూర్తిగా అంతరించిందనే చెప్పాలి. బంగళా అనేది 'బెంగుళూరు/మంగుళూరు/బంగళా' పెంకులతో – పెద్ద పెంకులతోఉన్న ఇంటికి పేరు. అసలది బెంగాల్ నుంచి వచ్చింది. ఇంగ్లీషువాళ్ళు అనేక ప్రభుత్వ భవనాలను ఆపెంకుల కప్పులతో ఎత్తయిన గోడలతో కట్టి దేశవ్యాప్తంగా అలవాటు చేశారు. ఈ పెంకును సీమపెంకని పిలవటానికి ఇంగ్లీషువాళ్ళ ప్రమేయం కారణం.

కొంత మేడ, కొంత పెంకుటిల్లు ఉన్న కట్టడాన్ని 'మాడిల్లు' అని పిలుస్తారు. నేలలో కట్టిన ఇల్లు 'మాళిగ'. నేలమాళిగ అనికూడా వ్యవహారం. ఆయా కాలాల్లో ఆయా ప్రాంతాల్లో ఇలా రకరకాల పేర్లతో ఇల్లు కట్టి దానికి పేరు పెట్టడం అలవాటయింది.

ఇల్లు కట్టే స్థలాన్ని నివేశమంటారు. దానికి తెలుగులో 'వేలం, పాళెం, వీడు, పట్టు, బిడారు, విడిది' అనేవి పర్యాయపదాలని నిఘంటుకారులు చెప్పారు. ఇప్పటిభాషలో 'వేలం' అనేమాట అర్థం పూర్తిగా మారింది. ఇప్పటి 'వేలం (పాట)' అనేమాట పోర్చుగీసుపదం 'వేలియో' నుంచి వచ్చింది. 'ఏలం' అంటేనే సరైనరూపం. వేలం అనాలని పెద్దలు తప్పుగా దిద్దుతుంటారు. (కొందరికి పోర్చుగీసువారిని బుడతకీచులంటేనే గాని తృప్తికలగదు). పాళెం అనేది సరిహద్దులోఉన్న ఊరు, సైనికులు నిలిచే ఊరు అనే అర్థంలోనూ, ఊళ్ళపేర్లకు చివరప్రత్యయంగానూ

ఎక్కువవాడుకలో ఉంది. 'వీడు' అనేమాటకు పట్టణమనే అర్థమే ఎక్కువ వ్యాప్తిగలది. పట్టు సాధారణంగా నీటివసతి బాగా ఉన్న ఊరు. ఈ అర్థంలో ఇది ఊళ్ళపేర్ల చివర ప్రత్యయంగా చేరింది. బిడారు శబ్దానికి వ్యాపారుల స్థావరమనే అర్థమే ఎక్కువ వ్యాప్తిలో ఉంది. విడిదికి తాత్కాలిక నివాసమనే అర్థంలోనే ఎక్కువ వాడుక.

# భార్యాభర్తలు

ఇల్లు గుర్తుకురాగానే ఇల్లాలు జ్ఞప్తికి వస్తుంది. ఆలు అంటే భార్య. ఇల్లాలంటే ఇంటియజమాని భార్య. ఇంగ్లీషులోని 'హౌస్‌వైఫ్' అనే మాటవంటిది. ఈ కాలంలో ఈ ఇంగ్లీషుమాటకు ఇల్లాలనే అర్థంకన్నా ఉద్యోగంగాని వృత్తిగాని లేక ఇంటిపనులే చేసుకొనే స్త్రీ అనే అర్థం ప్రచురమయింది. ఆలు శబ్దాన్ని ఈ కాలంలో విడిగా వాడటం చాలా తక్కువ. ఒకప్పుడు 'ఇంటిది' అని పిలిచేవాళ్ళు! ఇప్పుడామాటకన్నా 'పెండ్లాం/పెళ్ళాం' అనే మాటకే ప్రాచుర్యమెక్కువ. చదువుకొన్నవాళ్ళు 'వైఫ్' అంటున్నారనుకోండి – ఇంగ్లీషుమాట వాడి. తెలుగు నిఘంటుకారులు 'రాణి, గేస్తురాలు' అనే మాటలను పర్యాయపదాలన్నారు. రాణి సంస్కృతంలోని రాజ్ఞీ శబ్దభవం. అలాంటిదే సాని శబ్దమొకటుంది. అది స్వామినీ శబ్దంనుంచి వచ్చింది. పూర్వం అందర్నీ సానులని వ్యవహరించేవాళ్ళు. కాలక్రమాన అది వేశ్యావాచకం కావటంతో వాడుక ఇంచుమించు పూర్తిగా మానేశారు. 'దొరసాని, రెడ్డిసాని' వంటి సమాసప్రయోగాలు తెలంగాణాలోనే ఇంకా వినిపిస్తున్నాయి.

సంస్కృతంలో ఇల్లాలు శబ్దానికి సమానార్థకాలుగా "పత్ని, ద్వితీయ, పాణిగృహీతి, సహధర్మిణి, సహధర్మచారిణి, కుటుంబిని, పురంధ్రి, కులస్త్రీ, కులపాలిక, దార, జాయ" లాంటి మాటలెన్నిఉన్నా భార్యాశబ్దమే ఎక్కువ వ్యాప్తిలో ఉంది తెలుగులో కూడా. పత్ని అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య. ద్వితీయాశబ్దం ఒకనాటి భారతీయ సంస్కృతికి చిహ్నం. ముఖ్యంగా రాజులకు భూమి/రాజ్యం భార్యకింద లెక్క; పెళ్ళాడిన వ్యక్తి ఆ కారణంగా ద్వితీయ (అంటే 'రెండోది') అయిపోయిందన్నమాట. పాణిగ్రహీతి అంటే పాణిగ్రహణం చేసుకొన్న స్త్రీ. అలాకాక ఉంచుకొన్నస్త్రీనయితే 'పాణిగ్రహీత' అంటారు! చివరి అచ్చును జాగ్రత్తగా వాడకపోతే ప్రమాదం. సహధర్మిణి, సహధర్మచారిణి అనే మాటలకు యజ్ఞాల్లో, యాగాల్లో మంత్రపూతమైన విధులనూ కర్మలనూ కలిసిచేసేదని అర్థం. పట్టపురాణి, పెద్దభార్య వంటివాళ్ళకే ఈ అధికారం. ఈ 'అధికారం' కోసం సత్యవతి పట్టుబట్టి భారతకథ నడిపించింది. (ఎందుకంటే ఆమె కడుపున పుట్టినవాళ్ళకే రాజ్యాధికారం సంక్రమిస్తుంది). శకుంతల అందుకే పట్టుబట్టింది. బంగారుసీత లేకపోతే యజ్ఞం సాగేదికాదు. కుటుంబిని అంటే పిల్లాజెల్లా ఉన్న ఇల్లాలు–పిల్లలకోడి అనుకోండి. పురంధ్రి అనేది పట్టపురాణి వంటిమాట. పతివ్రత అనే అర్థంలోకూడా ఈ పదం వాడుతుంటారు. కులస్త్రీ అంటే ఇంటావిడ.

కులపాలిక ఇల్లుచూసే ఆమె. దార, భార్య, జాయ మామూలు మాటలు. వీటిలో మధ్యదానికే విడిగా ఎక్కువ వాడుక. దారపుత్రుల వంటి సమాసాల్లో 'దార'కు వాడుక ఎక్కువ. జాయా శబ్దం పుస్తకాల్లోని మాట. పోషణ పొందేది భార్య. 'చిన్నిల్లు' ఉన్నా 'న్యాయశాస్త్రరీత్యా' పోషించవలసినది భార్యనే.

భర్త అనేది ఎక్కువవాడుకలో ఉన్నమాట. పెండ్లాడిన పురుష వ్యక్తి అనే అర్థంలోనే ఈ మాటకు వాడుక ఎక్కువ. తెలుగు నిఘంటువులు ఇంటి యజమాని, 'కుటుంబ పెద్ద' అనే అర్థాల్లో 'గేస్తు, ఇలురేడు, మనికిరేడు, ఇంటివాడు' అనే మాటలనేగాక 'అలుబిడ్డలుగల యతడు' (!) అనే సమాసాన్ని కూడా గృహయజమాని అనే అర్థంలో పర్యాయపదాలని పేర్కొంటున్నాయి. గేస్తు శబ్దం 'గృహస్థ(డు)' అనే సంస్కృత పదం నుంచి వచ్చినమాట. 'ఇంటివాడు' అనేదొక్కటే 'ఇల్లాలు'లాంటి సమాసం. అయితే ఇంటివాడయినాడంటే పెళ్ళాడాడనే అర్థం. ఇలు, మనికి అనే శబ్దాలపక్కన రేడు (=రాజు) అనే మాటచేర్చి తెలుగుకవులు గృహయజమానికి పర్యాయపదాలు సృష్టించారన్నమాట – ఎవరింటికివారే ప్రభువులనే భావంతో. అలుబిడ్డలుగలయతడనేది కేవలం కృత్రిమశబ్దం. ఒక ఇంటికి యజమానిగా ఉండి ఒకప్పుడు భార్యలేకుండా, ఒకప్పుడు సంతానంలేకుండా ఉండరాదని ఎక్కడుంది? నిస్సంతుగా ఉన్న గృహస్థులులేరా? ఇప్పటి వాడుకలో 'ఇంటాయన, ఇల్లుగలాయన' అని రెండురకాల మాటలు పుట్టాయి. ఇంటాయన భర్తకావచ్చు, ఇంటికి యజమానీకావచ్చు. ఇల్లుగలాయన అనే సమానం 'తమకు అద్దెకిచ్చిన ఇంటి సొంతదారు' అనే అర్థంలో వచ్చింది – అద్దెకొంపల విషయంలో వాటి యజమానినీ తనభర్తనూ స్పష్టంగా వేరుచేసి చెప్పడంకోసం. ఎవరిజాగ్రత్తలు వారివే అయినా మారిన పరిస్థితుల్లో తప్పర్థం రాకుండా ఈ నూతనసమాసకల్పన జరిగింది.

పుస్తకాల్లో ఏ తెలుగుమాటమ వాడినా వ్యవహారంలో 'యజమాని' అని కొందరూ, 'సంసారి' అని చాలామందీ గృహాధిపతిని పేర్కొంటున్నారు. కొన్నిప్రాంతాల్లో 'సంసారి' శబ్దానికి 'రైతు, సేద్యగాడు' అనే అర్థం వచ్చిందికాబట్టి 'ఖామందు' అనే ఉర్దూ మాటను పర్యాయంగా వాడుతున్నారు. 'ఓనర్' అనే ఇంగ్లీషుమాటను 'ఇల్లుగలాయన' అనే అర్థంలో వాడుతున్నా ఇల్లాలు శబ్దానికి పోటీగా ఇంటియజమాని అనే అర్థమిచ్చే ఒక్కమాట వాడుకలో విన్పించటంలేదు. మగడు/మొగుడు అంటే భర్తేగాని యజమానికాడు. ఇల్లాలు తన భర్తనుగురించి ప్రస్తావించేటప్పుడు 'తాను, (మా)ఇంటాయన' లాంటి మాటలు వాడుతుండేది పూర్వం. ఇప్పుడు పుస్తకాల, సినిమాల ప్రభావం వల్ల 'శ్రీమతి, శ్రీవారు' అనే కొత్త జంట వెలసింది తెలుగువాడుకలో. ఇంకా 'హబ్బీ' (హజ్బెండుకు సంక్షేపరూపం) అంతగా వాడుకలోకి వచ్చినట్లు లేదు.

సంస్కృతాంధ్ర కవుల్లో ఒక సంప్రదాయముంది. ఇల్లాలుకు పర్యాయాలుగా భార్య, స్త్రీశబ్ద పర్యాయాలనూ, గృహయజమానికి పర్యాయంగా భర్తృశబ్ద పర్యాయపదాలనూ వాడటమది. బహుశా తక్కిన భారతీయ భాషాకవులు కూడా ఇదే పద్ధతి అవలంబించి ఉండవచ్చు. తెలుగుభాషలో సహజంగానూ, సంస్కృత పదాలను ఎరువు తెచ్చుకున్నందువల్లనూ స్త్రీశబ్ద పర్యాయపదాలు చాలా ఉన్నాయి. వాటి సంగతి

దరిమిలా పట్టించుకుందాం. ప్రస్తుతానికి వద్దు – వాటి సంఖ్య చాలా తక్కువ కాబట్టి. ఇల్లాలు విషయంలోలాగానే ఇంటి యజమాని సంగతి ఇప్పుడాలోచిద్దాం.

'స్వామి, ఈశ్వరుడు, పతి, అధిభువు, నాయకుడు, నేత, ప్రభువు, పరివృఢుడు, అధిపుడు, రమణుడు, యజమాని, యజమానుడు, భర్త, రమణుడు, కుటుంబవ్యాపృతుడు, ఈశిత, అభ్యాగారికుడు, గృహమేధి' వగైరా సంస్కృత పదాలు ఇంటాయనకు పర్యాయపదాలంటారు. అల్లసాని పెద్దన మనుచరిత్రలో "కెలకులనున్న తంగెటిజున్ను గృహమేధి, యజమాను డంకస్థితార్థపేటి" అనే పద్యంలో ప్రవరుడి సంగతితోబాటు పర్యాయపద పట్టిక విషయంకూడా చూశాడు. తెలుగు మాటల సంగతి ఇంతకు ముందే చూశాం కాబట్టి ఇప్పుడీ పట్టికను పరిశీలిద్దాం. కోస్తా ప్రాంతంలో 'ఖామందు' అనే ఉర్దూమాట కూడా వాడుకలో వినిపిస్తుంది. ఆస్తిపాస్తులుండి ఆదాయప్పన్ను పోటుతోబాటు కోర్టు గొడవలు కూడా ఉన్న కుటుంబాల్లో (అన్నట్లు 'కుటుంబిక'డనే మాట కూడా ఓ పర్యాయపదమే – 'సంసారి' అనేమాట లాగా) 'కర్త' అనేమాట వినిపిస్తుంది – అవిభక్త హిందూ కుటుంబ వ్యవహారాలుచూసే న్యాయాధికారంగల వ్యక్తి అన్న సాంకేతికార్థంలో.

పై పట్టికను చూస్తే స్థూలంగా మూడు రకాల మాటలున్నాయని తెలుస్తుంది. 'రాజ' శబ్దానికీ 'భర్తృ' శబ్దానికీ ముడి వేసినవి ఒకరకం. రెండోరకం సంపాదించి పెట్టేవాడనే అర్థం కలవి. మూడోరకం ఇంటికి వచ్చినవాడికి ఇంత పెట్టించేవాడనే మాట. 'రాజు'తోబాటు 'దేవుడి'తో కూడా ముడిగల మాటల సంగతి ముందు చూద్దాం. 'స్వామి, ఈశ్వరుడు, పతి, అధిభువు, నాయకుడు, నేత, ప్రభువు, అధిపుడు, రమణుడు, ఈశిత' అనేవి అటు దేవుడికీ, ఇటు రాజుకూ చాలక ఇంటి యజమానిక్కూడా అన్వయిస్తాయని గుర్తించగలరు. రాజు విష్ణ్వంశ సంభూతుడనే భావం, యజమాని పితృస్వామిక వ్యవస్థలోని అవిభక్త కుటుంబానికి సర్వాధికారి అనే భావం ఇవి పర్యాయపదాలని పరిగణించడానికి దారి తీశాయి. సంస్కృత నాటకాల్లో స్త్రీపాత్రలు కూడా "యద్ భర్తా ఆజ్ఞాపయిష్యతి" (రాజుగారు ఆజ్ఞాపించినట్లు) అనే మాటలు వింటే రాజుకూ మొగుడికీ భేదం లేదా అని గాభరాపడక తప్పదు. భర్తకు భర్త కాబట్టి – అంటే తనను భరించేవాడని భరించేవాడు కాబట్టి – ఆనాటి స్త్రీలు రాజును కూడా భర్తకిందే లెక్కించినట్లుంది. 'రాజును చూసిన కళ్లతో మొగుణ్ణి చూస్తే మొత్తబుద్ధిపుట్టిం'దనే సామెతకూ దీనికి లంకె వేస్తే అర్థం స్పష్టమవుతుందా? ఇప్పటికీ ఉద్యోగాలు చేసే మగవాళ్లు తనపై అధికారిని మొగుడుగానో మిండమొగుడుగానో చెప్పుకోవటం లేకపోలేదు – పెత్తందారనే అర్థంలో.

'స్వం' అంటే సొమ్ము. స్వామి దానికి అధికారి. మనమంతా దేవుడి 'సొమ్ము'లమే కాబట్టి దేవుడు మనకు స్వామి. సొమ్ములంటే పశువులని ఇప్పటికీ కళింగ ప్రాంతంలో వ్యవహారముంది. ఇనపసొమ్ములంటే నల్లగొడ్డు– బర్రెలూ దున్నలూ. వాటికి పశువనేది సంస్కృత పర్యాయపదం. మన దేవుడు 'పశుపతి' (శంకరుడు). మనం పశువులం కాకపోతే మన దేవుడికీ పశుపతిత్వం కుదరదు. క్రైస్తవులు కూడా ప్రజలను గొర్రెలనీ, జీసస్ గొర్రెలకాపరనీ వ్యవహరిస్తారు. ఒకప్పుడు ప్రాచీన

కాలంలో ఇంకా వ్యవసాయం స్థిరవృత్తిగా ఏర్పడక ఆర్యులు గొడ్లమందలతో సంచార జాతులుగా తిరుగుతున్న కాలంలో – పశువులే సొమ్ముకింద లెక్కించేవాళ్లు. ఇప్పటి 'పైసా' శబ్దం అప్పటి 'పశు' శబ్దం నుంచే పుట్టిందని పెద్దలంటారు. ఈశుడు, ఈశ్వరుడు, ఈశిత, అధిపుడు, అధిభువు మొదలైన మాటలన్నీ 'పాలించేవాడు, పెత్తనం చేసేవాడు, నెత్తిన ఎక్కినవాడు' మొదలైన అర్థాల్లో వచ్చినమాటలే.

గృహమేధి, కుటుంబికుడు అనే మాటలు ఖచ్చితంగా సమానం కావు. అశ్వమేధం, నరమేధం వంటి మాటల్లో చివరఉన్న 'మేధం' చేసే వ్యక్తి గృహమేధి. వేద విహితంగా తన ఇంట్లో 'అగ్ని కార్యాలు' నెరవేర్చేవాడు గృహమేధి. అందరూ కాదన్నమాట. కుటుంబికుడు అనేదే సామాన్యపదం. రమణీ–రమణుడు అనేవి పరస్పరం వ్యతిరేక పదాలు. రమణి అంటే చక్కని స్త్రీ. రమణుడు అంటే పురుషుడు. దంపతుల్లో ఏ ఒక్కరైనా చక్కనివాళ్లు కాకపోతే ఈ మాటలు వాడవచ్చునో లేదో తెలియదు. అయినా వాళ్లిద్దరూ ఒకరి దృష్టిలో మరొకరు చక్కనివాళ్లేనని సరిపెట్టుకొంటే ఇబ్బంది లేదు. సరిపెట్టుకోనప్పుడు జరిగేదేమిటో పాఠకుల ఊహాశక్తికి వదిలిపెట్టడం మంచిదేమో. 'కుటుంబ వ్యాపృతుడు' వంటి మాటలు కవులు గణపూరణ పాదపూరణల కోసం కల్పించుకొన్న సమాసాలేగాని ఏనాటి వాడుకలోనూ ఉన్న సాధారణ శబ్దాలు కావు.

అభ్యాగారికుడంటే బహుశా మంచి ఇల్లున్నవాడని చెప్పాలేమో. ఆతిథేయుడు లాంటివి మూడోరకం మాటలు. తన ఇంటికి వచ్చిన వ్యక్తికి ఆతిథ్యమిచ్చి – అన్నపానాదులు ఏర్పాటు చేసి, మర్యాద చేసేవాడని ఆమాటలకర్థం. పిల్లికయినా బిచ్చం పెట్టని వాళ్ల విషయంలో ఈమాటలు పనికిరావు. భార్యాభర్తలున్నది ఇల్లు.

ఇల్లాలు, ఇంటాయన శబ్దాలకు విడివిడిగా పర్యాయపదాలు పరిశీలించలేంగాని వారిద్దరినీ కలిపి చెప్పేమాటలసంగతి చెప్పటం కుదరలేదు. తెలుగులో రెండుగాని, అంతకుమించిన వాటిని గురించిగాని చెప్తే బహువచనమవుతుంది. సంస్కృతంలో ఏక, ద్వి, బహువచనాలని మూడు వచనాలున్నాయి. ఎప్పుడూ కలిసి ఉండే రెండేసి వస్తువులనూ, ఇద్దరేసి వ్యక్తులనూ చెప్పటానికి ద్వివచనం వాడటం సంస్కృతసంప్ర దాయం – వేదకాలం నుంచీ. ఇంద్రావరుణులు, అశ్వినేయులు మొదలైన దేవతలనూ, తల్లిదండ్రులు భార్యాభర్తలు మొదలైన వ్యక్తులనూ ద్వివచనంలో చెప్తారు. అవి కూడా తెలుగు లెక్కనయితే బహువచనాలే. ఇప్పుడు భార్యాభర్తల విషయానికి వద్దాం.

'మిథునం, ద్వంద్వం, యుగ్మం, యుగలం, యుగం' వంటి ఏకవచనరూపాలూ, 'స్త్రీపుంసే, దంపతీ, జంపతీ, జాయాపతీ, భార్యాపతీ' వంటి ద్వివచనరూపాలూ సంస్కృతంలో భార్యాభర్తలను సూచించటానికి వాడేమాటలు. మిథునం అంటే (ఒకరితోఒకరు) కలిసిఉండే జంట అని అర్థం. ద్వంద్వమంటే రెండు – కలిసివున్న ఇద్దరనే అర్థం. 'యుగ్మం, యుగలం, యుగం' అనే మాటలకు 'జోడా, జోడీ' అనే హిందీ మాటలూ 'జంట' అనే తెలుగుమాటా సమానార్థకాలు. ఈ మాటలకు తెలుగుగ్రంథాల్లో ఈ అర్థంలో వాడుక తక్కువ. యుగ శబ్దానికి కాలభాగం మొదలైన ఇతరార్థాలుకూడా ఉన్నాయి. ఒక్క మిథున శబ్దం మాత్రం కొంచెమెక్కువ వాడుకగలమాట. 'స్త్రీపుంసే, భార్యాపతీ' శబ్దాలకు తెలుగుకావ్యాల్లో కూడా

వాడుక దొరకదు – ద్వివచనం తెలుగులో లేదుకాబట్టి. దంపతీ, జంపతీ శబ్దాలు రూపాంతరాలు. 'దంపతులు' అనే అనువాదంతో బహువచనరూపంలో ఈ మాట తెలుగులో అత్యధికవ్యాప్తిలో ఉన్నది. దాని రూపాంతరానికి కావ్యప్రయోగమేగాని వ్యవహారప్రయోగం లేదనేచెప్పాలి. జాయాపతులనే మాట పుస్తకాల్లో కనిపిస్తుంది.

తెలుగువారి దైనందిన వ్యవహారంలో "ఆలుమగలు" అనే సమాసం చదువుకొన్న వాళ్లలోనూ 'మొగుడూపెళ్ళాలూ' అనేది తదితరుల వాడుకలోనూ వినిపిస్తాయి. భార్యాభర్తలనే మాటకున్నంతవాడుక ఈ రెంటికీ లేదేమో చదువుకున్నవాళ్ళ వాడుకలో. 'జంట' శబ్దం కూడా అప్పుడప్పుడు వినిపిస్తుంది. 'జోడా, జోడీ' అనేవి హిందీ/ఉర్దూ పదాలయినా తెలుగులో కలిసిపోయాయి. జంట శబ్దం స్త్రీపురుష వ్యక్తులను సూచించడానికేకాక వస్తువులను పేర్కొనటంలో కూడా వాడుతుంటాం. అది మరో నామవాచకానికి ముందున్నప్పుడు విశేషణంగా కూడా ప్రయుక్తమవుతుంది. జంటపిట్టలంటే రెండు పక్షులు; పిట్ట(ల) జంట అంటే పక్షులు రెండున్న జోడీ.

దంపతులుంటే చాలు – పిల్లలున్నా లేకపోయినా అది కుటుంబమవుతుంది. సంసారమవుతుంది. వంశమవుతుంది. 'కులం' కూడా అవుతుంది. కుటుంబం తెలుగువారి వాడుకలో చేరినమాట. తెలుగురచయితలు సామూహికంగా సృష్టించిన పాత్రపేరు కుటుంబరావు – అంటే చాలామంది పిల్లలున్నవాడనే అర్థంలో. విడివిడిగా కొందరు మహారచయితలు 'గిరీశం, పార్వతీశం, కాంతం, ఎంకి' వంటి ప్రత్యేక పాత్రలు సృష్టిస్తే, కలివిడిగా చాలామంది తెలుగురచయితలు కుచేలుడివంటి 'కుటుంబరావు'లనూ, గుమాస్తాగా బతుకుతూ ఆడపిల్లల పెళ్ళిళ్ళకోసం అష్టకష్టాలు పడుతుంటే 'పరంధామయ్య'లనూ సృష్టించారని నవలాసాహిత్యంతో పరిచయమున్నవాళ్ళు సులభంగా గుర్తించగలరు. కుటుంబ శబ్దంలాగానే సంసారం, వంశం, కులం అనే మూడుపదాలూ సంస్కృతంలోవే. తెలుగుసినిమాల్లో 'కుటుంబగౌరవం, వంశగౌరవం' అనే మాటలు జోరుగా వినిపిస్తాయి. వంశ శబ్దానికి 'వెదురు' అనే అర్థంకూడా ఉంది. బహుశా వెదురుపొదలాగా విస్తరించాలనే భావంతో ఈ మాటపుట్టిందేమో! కుటుంబ శబ్దానికి 'సమూహం, గుంపు' అనే అర్థవిశేషాలున్నాయి. కుల శబ్దానికి ఈ కాలానికి అర్థం మారిపోయింది. పూర్వకాలంలో, 'అష్టపుత్ర బహుధనావాప్తిరస్తు' అని దీవించేకాలంలో, ఈ మాటలకు వాడుకా విలువా ఉండేవి. కాలంమారి ఇప్పుడది శాపంగా పరిణమిస్తున్నదనుకోండి. అది వేరేసంగతి.

తెలుగుమాటల్లో చెప్పాలంటే 'కొలం, వంగడం, వంగసం, సంతు, పదుగు' అనే ఉన్నాయి. వీటిలో మొదటిది కులశబ్దం నుంచి పుట్టింది. చదువుకోనివాళ్ళ వాడుకలోనే ఈ మాట వినిపిస్తుందిగాని 'కుల' శబ్దానికి వచ్చిన అర్థవ్యాకోచం ఈ తద్భవపదానికి వచ్చినట్లులేదు. వంగడం, వంగసం రూపాంతరాలు. వీటిని వంశశబ్దం నుంచి పుట్టిన మాటలని చెప్పేవారు లేకపోలేదు – సంస్కృతాభిమానులు. కానీ నిజానికివి అచ్చ తెలుగుమాటలే. ఇప్పటివాడుకలో 'వంగడం' ఉందిగాని 'వంగసం' లేదు. ఉన్నమాటను జంతువృక్ష 'సంతతి'ని వర్ణించేటప్పుడే ఎక్కువగా వాడుతున్నాం. ఉదాహరణకు వరివంగడం లాంటి సమాసాల్లో – వరి 'జాతులు/రకాలు'

అనే అర్థవిశేషంలో. సంతుశబ్దం 'సంతతి' నుంచిపుట్టిందో, 'సంతానం' నుంచే పుట్టిందో తేల్చటం కష్టం. ఆరెండు మూలశబ్దాలూ సంస్కృతంలోవి. సంతు తద్భవపద మంటారు. 'పదుగు' అనేది నిక్కచ్చిగా తెలుగుమాట – పదిమందిగల కుటుంబమనే అర్థం దానికుంది. ఈమాటకు తెలుగుకావ్యాల్లో గూడా మారుమూల ప్రయోగాలున్నాయేమోకాని నోటిమాట వాడుక ఉన్నట్లు చెప్పలేం. ఈ కుటుంబం ఒకనాటికి పెరిగేటప్పటికి ఆలుమగలు తల్లిదండ్రులవుతారు.

సంస్కృతంలో తల్లిదండ్రులనే జంటను చెప్పటానికి ద్వివచనంలో 'మాతాపితరౌ, మాతరపితరౌ, ప్రసూజనయితారౌ' అనే మాటలున్నాయి. మూడోదానికి ఆ భాషలోనే వాడుక చాలా తక్కువ – పిల్లలను కన్నవాళ్ళనే డొంకతిరుగుడు సమాసార్థంకలమాట అది. తెలుగు పుస్తకాల్లో 'మాత్రపితలు, మాతాపితరులు' వంటి ప్రయోగాలు కనిపిస్తాయి. 'తల్లిదండ్రులు/తలిదండ్రులు' అనే ద్వంద్వసమాసమొక్కటే తెలుగువారి మాటల్లో చాలా తరుచుగా వినిపిస్తుంది.

## సంతానం

దంపతుల కడుపున ఒక 'కాయ' కాచిందంటే వంశాభివృద్ధి జరిగినట్లు. అయితే ఈలాంటి వాక్యాల్లో తప్ప, 'సంతు' ను 'కాయ' అని విడిగా చెప్పరు; బిడ్డ అంటారు. మగబిడ్డ, ఆడబిడ్డ – అని విశేషణాలు చేర్చి చెప్పకపోతే బిడ్డ స్త్రీ పురుషుల్లో ఎవరయినా కావచ్చు. కానీ తెలంగాణా మాండలికంలో 'బిడ్డ' ఎప్పుడూ స్త్రీ వాచకమే. రాయలసీమలో కూడా చాలావరకు వ్యవహారం ఇలాగే ఉంటుంది. సంస్కృతంలో కూతురో కొడుకో తేల్చకుండా ఇద్దరికీ సరిపొయ్యే మాటలు రెండున్నాయి – అపత్యం, తోకం అని. తోకశబ్దం తరవాతికాలంలో వంశం, అన్వయం, అన్వవాయం, అభిజనం, గోత్రం, సంతతి, సంతాన శబ్దాలకు పర్యాయపద మైపోయింది. అలాగే వంశానికి పర్యాయమైన 'సంతాన' శబ్దం నేటివాడుకలో 'కొడుకులూ కూతుళ్లూ' అనే అర్థంలో స్థిరపడిపోతున్నది. మీకు సంతాన మెంతమంది? మీకు పిల్లలెందరు? అనే రెండు వాక్యాలకూ ఈకాలంలో ఒకే అర్థం. బిడ్డ శబ్దంలాగా పిల్ల శబ్దం కూడా స్త్రీ పురుషసామాన్యమేగాని 'ఆడపిల్ల, మగపిల్లవాడు' అని వివరంగా చెప్పనప్పుడు కూతురనే అర్థంలోనే స్థిరపడింది. కొన్నిప్రాంతాల్లో 'పిల్లా' అని వయసు వచ్చిన స్త్రీని గురించి సంబోధించటం తప్పుకింద లెక్క. 'పిల్లలు'అని బహువచనంలో చెప్తే ఆమాట లింగభేదంలేని సంతానంవంటి మాట – ఆడ మగ పిల్లలిద్దరికీ సరిపోయే దన్నమాట.

'బిడ, బిడ్డ, పాప, పాప, కుర్ర, చిరుత, కందు, కూన, నిసువు, నిసుగు, సిసువు, బొట్టె, బుడత, పిన్న, చిన్న, చోర, చొర, పడుచు' అనే మాటలు స్త్రీ పురుషభేదం లేకుండా ఆడమగపిల్లల కిద్దరికీ అన్వయించేవి. అంటే సంస్కృతంలో 'శిశువు,

కిశోరం' లాంటివన్నమాట. చిత్రమేమంటే అచ్చతెలుగు నిఘంటువులు నిత్యం మనం మాట్లాడే 'అమ్మాయి, అబ్బాయి, గుంట, గుంటడు, పోరి, పోరడు, పసిపాప, పసిబిడ్డ, చంటి(పాప)' లాంటి మాటలను గ్రంథస్థం చేయలేదుగాని 'పాలబుడత, కొొండికవాడు, చిన్నవాడు, పసివాడు(!)' లాంటి పదాలను కోశస్థంచేశాయి. ఈ మాటల్లోని 'బిడ-బిడ్డ, పిన్న-పిన, చిన్న-చిన, చొర-చోర, నిసుగు-నిసువు' అనేవి అన్యోన్యం రూపాంతరాలు. 'చిన్ని, బుజ్జి, బుల్లి' వంటి విశేషణాలను కూడా పసిపిల్లలను ప్రస్తావిస్తూ ఉపయోగిస్తారు. పాలుతాగే బిడ్డను 'చంటిపాప' అంటామేగాని 'పాలబుడుత' అని ఎవరైనా ఏకాలంలోనైనా నోటిమాటగా వాడారనటానికి ఆధారాలు లేవు. నిజానికి 'పూప, కుఱ్ఱ, చిరుత, కందు, బుడత, పడుచు' అనేవి విశేషణాలూ విశేష్యాలూ అయిన మాటలు.

పూప శబ్దాన్ని 'మొగ్గ' అనే అర్థంలో కూడా వాడ్తాం. ఇప్పుడు బిడ్డ అనే అర్థంలో దానికి వాడుక పూర్తిగా తగ్గిపోయింది. పాప సర్వసాధారణంగా ఆడపిల్లే నేటి వ్యవహారంలో. కుఱ్ఱకు విడిగా ప్రయోగంలేదిప్పుడు. 'కుఱ్ఱది, కుఱ్ఱవాడు, కుఱ్ఱకారు' అనే మాటలకు యౌవనంలోని ఆడపిల్లలకు, మొగపిల్లవాడికి, యువతీయువకుల సమూహానికి క్రమంగా పర్యాయపదా లయినాయిప్పుడు. కందు శబ్దానికి 'మచ్చ' అనే అర్థవిశేషంకూడా ఉంది. 'చిన్ని జాబిలికందు' వంటి ప్రయోగాలున్నాయి. కూన శబ్దానికి శిశుపర్యాయంగా సాహిత్యంలోని ప్రయోగం – వ్యస్తంగానూ, 'ముద్దుకూన'వంటి సమాసాల్లోనూ. నిసువు/నిసుగు అనేవే నిజానికి శిశుబోధకాలయిన తెలుగు మాటలు. వాటిలో 'నిసుగు' అనేదానికి కావ్యప్రయోగాలు మాత్రమే లభిస్తాయి. 'ఏం? నీవేమంత బొట్టివా? ఏమీ తెలీదనడానికి?'లాంటి ఈసడింపుమాటల్లో మాత్రమే బొట్టెకు నేటి వాడుక నిలిచింది. పడుచు శబ్దం యౌవనంలో ఉన్న స్త్రీ అనే అర్థంలోనే వాడుకలో ఉంది. సమాసంలో దాన్ని పురుషవాచకంగానూ వాడ్తాం – పడుచువాడు మొదలైనవి పదబంధాల్లో.

గుంట, గుంటడు అనేమాటలు క్రమంగా స్త్రీపురుషబాల పర్యాయంగా కళింగ ప్రాంతంలో, కొంతవరకు ఉభయగోదావరి జిల్లాల్లో ఎక్కువ వాడుకలో ఉన్నాయి. గోదావరికి దక్షిణాన వాటివాడుక నిందార్థంలోనే. పోరి, పోరడు/పోరగాడు శబ్దాలు తెలంగాణా వాడుకలో చాలా ఎక్కువ. నేటికి పన్నెండువందల సంవత్సరాలకిందట రాయలసీమ శాసనాల్లో 'వసన్తపోఱి మహాదేవులు' వగైరా ప్రయోగాలున్నాయి. అప్పట్లో ఆ మాటలో బండిరా వాడేవా రన్నమాట. నాటి 'పోఱి' శబ్దానికి 'పాఱేఱి' అనే రూపాంతరంకూడా ఉండేది, 'గోవిందపాఱేఱి మన్మరాళు' వంటి ప్రయోగాల్లో. ఎందువల్లనో ఈనాటి వ్యవహారంలో వాడుకలేకుండా పోయింది. మొత్తం రాష్ట్రంలో అమ్మాయి, అబ్బాయి శబ్దాలకు తిరుగులేని వ్యాప్తి ఉంది. అయితే ఇవి కేవలం శిశువు అనే అర్థంలోనేకాక వయసుతో నిమిత్తంలేకుండా కూతురు, కొడుకు అనే అర్థంలో వాడుకకెక్కాయి. కృష్ణాజిల్లా వ్యవహారంలో నేటికీ ఎంత పెద్దామెను గురించి ప్రస్తావించేటప్పుడయినా 'అమ్మాయి' శబ్దం ప్రయోగించడం కద్దు. ఎందుచేతనో తెలీదుగాని శిశు శబ్దంనుంచి 'సృష్టించిన' శిశువుడనే మాట 'శిష్యుడు' అనే అర్థంలో

కొన్నిప్రాంతాల్లో వినిపిస్తుంది. అచ్చతెలుగు నిఘంటువులు 'శిశువు' నుంచి 'సిసువు' అనే రూపాన్ని సృష్టించి కోశస్థం చేశాయిగానీ కావ్యప్రయోగాలున్నట్లు లేదు దానికి. ఒకవేళ 'సిసువు'ను 'సిసువు' అని చదివి పొరపాటుపడ్డా ఆశ్చర్యపడనక్కరలేదు. లేఖన సంప్రదాయంవల్ల ఇలాంటి పొరపాట్లుచేసిన మహాకవులూ ఉన్నారు. వారిని సమర్థిస్తూ 'శాస్త్రం' చెప్పిన మహాపండితులూ ఉన్నారు. ఉదాహరణకు "సప్పంబు పడగనీడను, కప్పవసించిన విధంబుగదరా సుమతీ" అనే పద్యభాగం చాలామందికి తెలుసుకదా. 'సర్పంబు' అనేమాటను నిన్నమొన్నటిదాకా 'వలపలగిలక'తో 'సప్పంబు' అనిరాసేవాళ్లు. కవిగారు 'ప్ప'కు పక్కన రాసిన వలపల గిలకను చూడక 'కప్ప'తో ప్రాసలో బిగించినా విస్తుపోనక్కరలేదు. ఒకవేళ "సప్ప"మనే తద్భవం అంతకుముందే వాడుకకెక్కినా ఎక్కి ఉండవచ్చు. ఇలాంటి అనుమానం కూడా 'సిసువు' విషయంలో రానక్కరలేదేమో.

'అడ్డాలనాటి బిడ్డ, అడ్డాలపాప' అన్నట్లు సంస్కృతంలో 'ఉత్తానశాయి' అనే శబ్దముంది – 'వెల్లకిలా పడుకున్నపాప' అన్న అర్థంలో. 'చంటిపాప'కు సమమైన సంస్కృత శబ్దం 'స్తనపాయి'. పసిబిడ్డను 'డింభక' శబ్దంతో, కొంచెం పెద్దపిల్లలను 'డింభ' శబ్దంతో వ్యవహరించేవాళ్ళు సంస్కృతంలో. సినిమా పుణ్యమా అని డింభక శబ్దం ఇటీవల వాడుకలోకి వచ్చినట్లుంది.

ఇంతకుముందు ప్రస్తావించిన 'అబ్బాయి, పోరడు, పోరగాడు, గుంటడు' అనే మాటలేకాక కొడుకు శబ్దానికి 'కొమరుడు, బుడుతడు, పట్టి' అనే తెలుగు మాటలూ, 'కుమారుడు, కుమారకుడు, పుత్రుడు, పుత్రకుడు, ఆత్మజుడు, తనయుడు, సూనుడు, సుతుడు, మాణవకుడు' అనే సంస్కృతపదాలూ పర్యాయపదాలంటారు. కొమరుడు అనేది కుమార శబ్దంనుంచి పుట్టిన తద్భవరూపం. బుడుత అనే విశేషణానికి పురుషవాచకమైన డు ప్రత్యయంచేరి కొడుకనే అర్థంలో వాడారు. పట్టి అసలుసిసలు తెలుగుమాట (అసలుసిసలు మాత్రం అచ్చతెలుగుకాదు). ముద్దులపట్టి, అనుంగుపట్టివంటి ప్రయోగాలు తెలుగు కావ్యాలన్నింటిలో కనిపిస్తాయి. కాని నేటి వాడుకలో ఈ మాట ఎందుచేతనో వినిపించటంలేదు. కొడుకు అనే అర్థంలో ప్రాచీనశాసనాల్లో వాడిన మరోమాట 'మగడు'(!). ఇప్పుడది భర్త అనే అర్థంలోనే స్థిరపడిపోయింది. 'మకన్డు, మగన్డు' అనే రూపాల్లో ఈ శబ్దం ప్రాచీనశాసనాల్లో కొడుకనే అర్థంలోనే కనిపిస్తుంది. తమిళ మలయాళాది ద్రవిడభాషలన్నింటిలో ఈ శబ్దం ఈ అర్థంలోనే పూర్వముండేది. 'మగపిల్లవాడు' అనే ఈనాటికీ పిలుస్తున్నాం కదా. పోతన్నగారు భాగవతంలో 'మన యశోద చిన్నమగవాని కనెనట, చూచివత్తమమ్మ? సుదతులార!' అనిపిస్తాడు. మగపిల్లవాడికీ సంక్షేపరూపం మగవాడు; దానికి మరీ సంక్షిప్తరూపం మగడు. కాలం మారింది. దాంతోబాటు అర్థం మారింది! కొడుకన్నమాటకే బహుళప్రచారముంది.

సంస్కృతపదాల్లో 'పుత్రు'డనేదీ 'కుమారు'డనేదీ తెలుగువారి వాడుకలో ఎక్కువగా వినిపించే మాటలు. పుత్రకు డనేది పుత్ర శబ్దానికి రూపాంతరమేగాని మరీ చిన్నవాడైన కొడుకనే అర్థంలో దాన్ని వాడాలి. కుమారకుడని కుమార శబ్దానికి చివర 'క' చేర్చి వాడే మాటొకటి వుంది. దాన్నికూడా ఈవిధంగానే అర్థం

చేసుకోవాలి. 'పుత్' అనే నరకముందనీ, పిల్లలు – అందునా మగపిల్లలు – లేనివాళ్లకీ నరకం తప్పదనీ శాస్త్రాలు ఘోషించాయట. ఆ నరకబాధను తప్పించేవాడు కాబట్టి పుత్రుడని పెద్దలు వ్యాఖ్యానిస్తుంటారు. మరి కుమారాదులు – వాళ్లూ కొడుకులే అయినా ఈవిధంగా నరకబాధ పోగొట్టగలరో లేరో తెలీదు! ఆత్మజుడనే మాటకు 'తనకే పుట్టినవా'డని అర్థం. ప్రాచీన భారతీయ ధర్మశాస్త్రాలు చాలారకాల కొడుకులను పేర్కొన్నాయి. వారందరిలో 'సరైన, సొంతమైన' కుమారుడే ఆత్మజుడు. (ఇతరవిధాల వాళ్లసంగతి కొంచెమాగి మాట్లాడుకుందాం). తనయు డంటే తనువుమంచి – అంటే (తన) శరీరంనుంచి – ఏర్పడ్డవాడని ప్రత్యేకార్థం. ఆలెక్కన తల్లులే కొడుకులను తనయులని పిలవటానికి అర్హులని చెప్పాలి. సూనుడు 'ప్రసవఫలితంగా' పుట్టినవాడు. అందరూ అలాంటివాళ్లుకారా? అనే ప్రశ్న మనకు వద్దు. ఎందుకంటే మన పురాణకథల్లో నానావిధాలుగా పుట్టిన మహాత్ములున్నారు! 'కొండిన్యుడు ముండకొడుకు, మాండవ్యుడు కప్పకపుడు మహిలో పుట్టెన్...' వగైరా విదర్శనాలు చాలా వున్నాయి. ఒక్క భారతంలోనే రకరకాలుగా పుట్టినవాళ్ళ కథలున్నాయని అందరికీ తెలుసు. సుతుడు, ప్రసూతుడు అలాగే – అంటే సూనుడిలాగే – కొడుకులన్నమాట. మాణవకుడనే మాటకు సంస్కృతరూపకాల్లో వాడుక ఎక్కువ. ఇతర కావ్యాల్లో కూడా ఆమాట అంతగా కనిపించదు – వినిపించదు.

రకరకాలు కొడుకులను గురించి ఇక్కడ విపులంగా చర్చించటం సాధ్యపడదు. స్థూలంగా విచారిద్దాం. మామూలు వ్యవహారంలో జనకపుత్రుడు, దత్తపుత్రుడని కొడుకులు ప్రధానంగా రెండురకాలు. జనకపుత్రుణ్నే 'ఔరసు' డంటారు స్వచ్ఛమైన సంస్కృతంలో. తన ఉరువునుంచి పుట్టాడు కాబట్టే ఔరసుడని వివరిస్తారు. అంటే తండ్రికి తన భార్యద్వారా సహజమార్గాన పుట్టిన వాడన్నమాట. అంటే సక్రమసంతానమని భాష్యం. ఆస్తిపాస్తులు ఇతడికి సంక్రమిస్తాయి న్యాయశాస్త్రప్రకారం సహజాధికారంవల్ల. తండ్రి స్వార్జితంలో అతడికి అధికారమున్నా లేకపోయినా పిత్రార్జితంలో – అంటే వంశపారంపర్యంగా వచ్చిన ఆస్తిలో – ఈరకం కొడుక్కి సర్వాధికారాలూ వుంటాయి. ఇటీవల వాడుకలోకి వచ్చిన మాట 'వారసు(డు)' అనేది. ఇదో సంకరపదం. పర్షియన్ భాషనుంచి ఉర్దూద్వారా తెలుగులోకి వచ్చినమాట ఇది. అసలుమాట 'వారిస్'. ఈ శబ్దానికీ సంస్కృతపదమైన 'ఔరస' శబ్దానికీ చాలా పాతకాలంలో బంధుత్వం వుండేది. అవి సజాతీయపదా లన్నమాట. ఈ సంకర శబ్దంనుంచి 'వారసత్వం' అనే కొత్త మిశ్రపదం సృష్టించుకొన్నాం అంతటితో ఆగక అలాంటి మరో మాటను సామ్యంమీద ఆధారపడి సృష్టించాం. అది 'పౌరసత్వం'. పురంలో వున్నవాడు పౌరుడు. పౌరుడి లక్షణమూ అధికారమూ 'పౌరత్వ'మేగాని 'పౌరసత్వం' కాదు. అయినా వారసత్వంలాగా పౌరసత్వం కల్పించామన్నమాట – అసల్లో లేని సకారాన్ని అదనంగా చేర్చి!

ఇక కర్ణుణ్ణి కానీనుడంటాంకదా. కన్యకు – అవివాహిత స్త్రీకి – పుట్టినవాడు కానీనుడు. 'సొంత' తండ్రికికాక తదితర వ్యక్తికి జన్మించినవాడన్నమాట. 'సొంత' భార్యకుకాక ఇతరుడి భార్యకు తనవల్ల కొడుకు పుట్టితే ఆ కొడుకునేమనాలో సంస్కృతపండితులు ఆలోచించిపెట్టారు. అతగాడు 'పారస్త్రైణేయుడు'. పరస్త్రీకి

జంటపదాలు. జననీ జనకులు, మాతాపితలు అనేవి అలాంటివే. తండ్రి పచ్చి తెలుగుమాటయితే అయ్య అచ్చ తెలుగుపదం. ఇది ఆర్యశబ్దభవమని చెప్తారు. సంస్కృతంలోని ఆర్యశబ్దానికి తండ్రి అనే అర్థముందని అంగీకరించటం కష్టం. తెలుగులోకి వచ్చేటప్పటికి అర్థం మారిందని చెప్పాలి. అబ్బ అనేమాటను నిందించే సమయంలోనే వాడుతాం – 'నీ అబ్బకు చెప్పుకో!' లాంటి వాక్యాల్లో, సందర్భాల్లో. నాన్న, నాయన శబ్దాలు రూపాంతరాలు. 'నా–అన్న' అనే రెండు మాటలు కలిపి 'నాయన' అనే రూపం ఏర్పడిందనీ అన్న శబ్దానికి అయ్య అనే అర్థం కూడా ఉండేదనీ కొందరి వాదన. ఉమ్మడి కుటుంబాల్లో అన్న, తండ్రి తరువాత తండ్రి అంతటివాడనీ, తండ్రితో సమానుడనీ భావించేవాళ్లు. ఇప్పుడా వ్యవస్థ శిథిలమైపోయినట్లే. కాబట్టి ఆ అర్థం కూడా నప్పదు. అప్ప శబ్దం తండ్రి అనే అర్థంలో రాయలసీమలో అత్యంత వ్యాప్తిగలమాట. ఆ మాటకి 'అక్క' అనే అర్థం ఇతర ప్రాంతాల్లో ఎక్కువ వాడుకలో ఉంది. కన్నయ్య అంటే కన్నతండ్రి. ఆ మాటకు కృష్ణుడనే అర్థంకూడా ఉంది. ఆ అర్థంలో అది హిందీలోని 'కన్హయ్య'లోంచి ఎరువుగా వచ్చిందని చెప్పాలి. జనకుడంటే కన్నవాడు. తాత శబ్దం ఈ అర్థంలో తెలుగులో వాడుకలో నిలవదు – తండ్రి తండ్రిని తాత అంటాం కాబట్టి. 'జనకతండ్రి' వంటి మిశ్రసమాసాలు 'వ్యవహారార్థం' పుట్టినవి. దత్తుపోయిన వ్యక్తిని కన్న తండ్రి అనే అర్థంలోనే ఈ మాటకు వాడుక.

## అన్నదమ్ములు - అక్కాచెల్లెళ్ళు

దంపతులకు పుట్టే పిల్లలు 'కవల'లయినాకూడా వారిలో ఒకరు పెద్దా, మరొకరు చిన్నా కాకతప్పదు. కవల పిల్లలను అమడలని కూడా అంటారు తెలుగులో. 'కవ' అంటే జంట. జంటగా పుట్టిన పిల్లలు కవ–లు. మరి కాన్పుకు ముగ్గురూ నలుగురూ పుట్టే ఏమంటారో తెలీదు. మనుష్యజాతిలో ఇలా ముగ్గురు నలుగురు ఒకే కాన్పులో పుట్టడం అరుదైనా జంతువుల్లో మామూలే – ముఖ్యంగా పిల్లులూకుక్కలూ పందులూ వగైరాల్లో. ఈ 'ఈత'కు ఇన్ని 'పిల్లలుపెట్టిం'దంటామేగాని సంఖ్యను బట్టి ప్రత్యేక పదాలున్నట్లుగా వాడుతున్నట్లూ తెలీదు. సరి. పుట్టిన పిల్లల్లో ఒకరు పెద్ద, తరువాతవారు చిన్న, బుల్లి, బుజ్జి, వగైరాలు కావచ్చు. సంస్కృతంలోనయినా ఒక తల్లికి/తండ్రికి పుట్టిన పిల్లలూ ఆడయినా, మగయినా, కొందరు ఆడపిల్లలూ కొందరు మగపిల్లలయినా 'భ్రాతరౌ' అనే మాటతో చెప్పవచ్చు. వారంతా పరస్పరం సోదరులు; సోదరీ శబ్దానికిగాని, సోదర శబ్దానికిగాని బహువచనంలో ఇదొక్కటే రూపం. ఈ సోదరులు తెలుగులో అన్న–తమ్ముడు, అక్క–చెల్లెలు అనే విధంగానూ, అన్న–చెల్లెలు, అక్క–తమ్ముడు అన్నట్లూ ఇలా మరి రెండు పద్ధతుల్లో ఉండవచ్చు.

'అన్న' అనే తెలుగు మాటకు 'తో(డ)బుట్టు(వు)' అనే పర్యాయపదమున్నా

రెండో మాట లింగభేదాన్ని స్పష్టంగా సూచించదు. అన్న శబ్దానికి 'తండ్రి, పెద్దమనిషి, ఎరగనివ్యక్తి' అనే అర్థవిశేషాల్లో ప్రయోగాలున్నాయి. సంస్కృతంలోవి 'భ్రాత, సహజుడు, సగర్భ్యుడు, సోదర్యుడు, సమానోదర్యుడు' వంటివి అన్నకు పర్యాయాలు. వాటిలో భ్రాతృశబ్దమొక్కటే ఎక్కువ వాడుకలో ఉంది. 'అగ్రజు'డనేది తరవాత వ్యాప్తిలో ఉన్నమాట. తక్కినవాటికి కావ్య ప్రయోగాలేగాని వ్యవహారంలో వాడుక తక్కువ. 'తమ్ముడు' చిన్నవాడు. అతణ్నీ 'భ్రాత' అనవచ్చు-సంస్కృతంలో సోదరుడన్నట్లు. 'అనుజు'డనేది స్పష్టంగా వయస్సును సూచించే పదం. పెద్దవాడి 'తరవాత' పుట్టి వాడు అనుజుడు. కళింగ ప్రాంతంలో అన్నో తమ్ముడో స్పష్టంగా సూచించకుండా 'ఆయనాండి! ఆయన మా అన్నదమ్ముడాండీ!' అంటారు! అలాగే 'అప్పచెల్లె'లనే మాటను కూడా వాడ్తారు.

'అక్క'కు తెలుగులో 'అప్ప, అత్త' అనే పర్యాయపదాలున్నాయి. మేనరికం సంఘధర్మంగా ఉన్నందున అక్కను అత్త అని పిలిచేవాళ్లు. అప్ప శబ్దం తండ్రి, (పలకరింపులో) కొత్తవ్యక్తి, అనే అర్థవిశేషాల్లో కూడా వాడుకలో ఉంది. సందర్భమే ఎవర్ని గురించి ప్రస్తావిస్తున్నామో నిర్ణయిస్తుంది. అక్కకు సంస్కృతంలో 'సోదరి' అనే అస్పష్టశబ్దమూ, 'అగ్రజ' అనే స్పష్ట పదమూ పర్యాయపదాలు. సోదరీ శబ్దానికి పర్యాయాలుగా 'భగినీ, స్వసా' అనే శబ్దాలు కూడా సంస్కృతంలో ఉన్నాయి. చెల్లెలయితే 'అనుజ' అనాలి. చెల్లెలు అనే తెలుగు మాటకు 'చెల్లి, చెల్లె, చెల్లమ్మ' లాంటి రూపాంతరాలున్నాయి. తెలుగు నిఘంటువులు 'తోడు, సైదోడు, తో(డ)బుట్టువు' శబ్దాలను కూడా పర్యాయపదాలుగా పరిగణిస్తాయి.. 'చెలి' శబ్దానికి 'స్నేహితుడు/స్నేహితురాలు' అనే అర్థవిశేషాలున్నాయి. పురుషవాచకంగా చెలి శబ్దానికి శాసన భాషలోనే ప్రయోగమెక్కువ. బహుశా ఆ కారణంచేతనే 'సైదోడు' శబ్దాన్ని చెల్లి శబ్దానికి పర్యాయపదంగా భావించి ఉంటారు. 'చేతోడు, వాతోడు' అంటామే – వాటిలోని మొదట మాటకూ 'సైదోడు'కూ దూరబంధుత్వముంది.

## అల్లుళ్ళు - కోడళ్ళు

ఈ అన్నదమ్ములూ అక్కచెల్లెళ్లూ పెరిగి పెద్దవారైన తర్వాత ఏదో ఒకింటికి అల్లుళ్లో, కోడళ్లో అవుతారు. కాక తప్పదు. అల్లుణ్నే పూర్వకావ్యాల్లో 'అల్లుగుర్ర' అని కూడా వ్యవహరించేవారు. అంటే 'కుర్రవాడైన' అల్లుడన్నమాట. (అల్లిక-అనే అర్థంలో తెలంగాణాలోని కొన్ని ప్రాంతాల్లో అల్లుడు శబ్దం వినిపిస్తుంది! దానికీ దీనికీ సంబంధం లేదు). 'అళియ' అనే కన్నడపదం ఒకప్పుడు వాడుకలో ఉండేది ఈ అర్థంలో. అళియరామరాజు అనే విజయనగర ప్రభువుండేవాడని చరిత్రలో చదివిన వాళ్లకు ఈ అర్థం ఎంత అతుకుతుందో తెలుస్తుంది. సంస్కృతంలో అల్లుణ్నే 'జామాత' అంటారు. దాని వ్యుత్పత్తి సరిగా తెలీదుగాని 'జామాతా దశమో గ్రహః'

అన్న వాక్యం తెలుసు. అంటే నవగ్రహాల తరవాత పదో గ్రహం అల్లుడని అర్థం! తాను 'మామ'గా ఉన్నప్పుడు మాత్రమే అల్లుణ్ని పదోగ్రహమంటారని తెలుసుగదా! తెలుగులో రెండురకాల అల్లుళ్లున్నారు. పిల్లను పెళ్లాడిన అల్లుడు (ఈతడే దశమ గ్రహం) ఒకడయితే, 'మేనల్లుడు' మరొకడు. ఈ మేనరికమనేది దక్షిణాదినేగాని ఉత్తర భారతదేశంలో లేదు. అక్కడి వాళ్లు ఇది చాలా తప్పుపని అని భావిస్తారు కూడా! మనకు మేనరికం (పెళ్లిళ్లు) అలవాటే కాబట్టి 'మేనవదినె, మేనబావ, మేనమరిది, మేనమరదలు' వంటి మాటలున్నాయి మన భాషలో. సాధారణంగా మేనరికం మేనమామ/మేనత్త కూతుర్ని వివాహమాడటమైతే మేనమామ/మేనత్త కొడుకును పెండ్లాడటం 'ఎదురు మేనరికం'. ఇంగ్లీషువాళ్లకు ఈ సంబంధబాంధవ్యాలను వివరించటం కష్టం. ఇంగ్లీషులోకి వీటిని అనువదించటం (అర్థమయ్యేటట్లు) ఇంకా కష్టం. ఉత్తర హిందూస్థానంలో ఈ ఆచారం లేకపోయినా మేనల్లుడికి పర్యాయపదాలుగా 'భాగినేయుడు, స్వస్రీయుడు' అన్న మాటలున్నాయి. భగిని అంటే సోదరి; ఆమె పుత్రుడు భాగినేయుడు. స్వసా అన్నా సోదరే. ఆమె కొడుకు స్వస్రీయుడు. ఈ రెండు మాటలూ ఆ భాషలో సహజ శబ్దాలనిపించవు – అవసరార్థం కల్పించుకొన్నవయివుంటాయి.

కోడలు శబ్దానికి సంస్కృత పర్యాయపదం స్నుష. 'కుత్రతనంలో, 'కోడె' వయసులో ఉన్న 'అలు' కోడలని వ్యుత్పత్తి. మనకు లేదుగాని ఉత్తర హిందూ స్థానంలో ఇప్పటికీ ఇంటి కోడలు మామ బావల ఎదుట ముఖం చూపకూడదు; ముసుగు వేసుకోవాల్సిందే – హిందూ కుటుంబాల్లోనయినా! వాళ్లు ఆమెను 'బహూ' (=వధువు, పెండ్లికూతురు) అని పిలిచి శాశ్వతంగా పరదాలోనే బంధిస్తుంటారు. ఒక ఇంట్లో ఇద్దరుగాని, అంతకన్నా ఎక్కువమందిగాని కోడళ్ళంటే ఒకరికొకరు తోడికోడళ్లవుతారు. సంస్కృతంలో తోడికోడలును 'యాత, యాతర' అంటారు. వాళ్ల ఉచ్చారణ ప్రకారం 'జాత(ర)' అవుతుంది కూడా! కోడలికి తాను మెట్టినింటి ఆడపిల్ల/ ఆడబడుచు ఆడబిడ్డ అవుతుంది. సంస్కృతంలో ఆడబిడ్డను 'ననంద, ననాంద' అంటారు. రెండోమాటకు వాడుక చాలా తక్కువ. ఆమెవల్ల కోడలి 'నంద'త్వం సన్నగిల్లుతుందనేమో 'ననంద' (సంతోషం లేనిది) అనే మాట వచ్చిందని ఓ పండితుడు చమత్కరించాడు. 'ఆడబిడ్డ అర్ధమొగు'డనే సామెత తెలుగులో ఉంది. కొందరు ఆమెచేత కూడా 'మంగళసూత్రానికి' మరోముడి వేయిస్తారు – పెండ్లి సమయంలో, ఆచారంలో భాగంగా (!).

## అత్తమామలూ వారిసంతూ

అల్లుడూ కోడలూ ఏర్పడగానే దంపతులు అత్తమామ లయిపోతారు. అత్త శబ్దం, మామ శబ్దం తెలుగో, సంస్కృతమో తేలక నేటికీ పండితులు గిజాటుపడుతున్నారు.

అవి ఆర్య, ద్రవిడ భాషలు రెంటిలోనూ వినిపించే ప్రాథమిక శబ్దాలు. ప్రాథమిక శబ్దాలు ఆధారంగా భాషలను కుటుంబాలుగా వర్గీకరించి శాస్త్రంచెప్పేవాళ్ళకి తలనొప్పి కలిగించేమాటలివి. అత్త శబ్దానికి (మేనరికం పుణ్యమా అని) 'అక్క' అనే అర్థంకూడా ఉంది. 'అత్తికా' అనే రూపాంతరముంది. బావను 'అక్క భర్తను' 'అత్తికాభర్త' అని వ్యవహరించాడు తెనాలిరామకృష్ణుడు. 'ఏదిక్కూ లేకపోతే అక్కమొగుడే దిక్కు' అనే సామెతకూడా పుట్టింది తెలుగులో ! అత్తను శుద్ధ సంస్కృతంలో 'శ్వశ్రువు' అనే రెండొత్తులున్న మాటతో పిలుస్తారు. అత్తకన్నా ముఖ్యం 'అత్తగారిల్లు'. మామగారిల్లని తెలుగువాళ్ళం ఎందుకనమో తెలీదు! తెలుగత్తకూ, ఇంగ్లీషత్తకూ పొంతనాలేదు–పోలికాలేదు. అత్తకు భయపడేది – భయపడటమంటూ జరిగితే – కోడలేగాని అల్లుడెన్నడూకాదు. (ఇల్లిటపల్లుడికి భార్య అన్నా, మామ అన్నా భయమంటారు. అనుభవంలేక తేల్చిచెప్పలేకపోతున్నా!). ఇది రివాజు తెలుగుదేశంలో. ఇంగ్లీషుమొగవాళ్ళు అత్తంటే గజగజలాడ్తారు. 'మదరిన్లాప్ మెనేస్' అనే పదబంధం పుట్టింది ఇంగ్లీషులో. (అంతమాత్రాన తెలుగుకోడలు ఇంగ్లీషు అల్లుడితో సమానమని తేల్చిపారేయకండి!). అత్తకన్నా మేనత్తంటే ఇష్టంమనకు.

మామలు రెండు రకాలు – కాదు – మూడు! 'పిల్లనిచ్చిన మామ, మేనమామ, భర్త/ప్రియుడు' అని మూడురకాలన్నమాట. మేనరికం కారణంగా మూడో అర్థం పుట్టిందనాలి. 'మేనత్త మొగుడు మేనమామాకాడు, మేనమామ భార్య మేనత్తాకాదు' అనే సామెత బాంధవ్యంలోని ఆప్యాయతనుబట్టి పుట్టిందని తెలుగువాళ్ళందరూ గుర్తిస్తారు. 'మేనమామ'ను సంస్కృతంలో 'మాతులు' డంటారు. పెద్దబాలశిక్ష చదివినవాళ్ళు 'కంసుడు మేనమామ' అని చదివే ఉంటారు. సంస్కృతం నేర్చినవాడు 'సర్వనాశాయ మాతులః' (మేనమామ సర్వనాశనంచేస్తాడు) అని చదివి ఉంటారు – 'శకుని' అనే మహాత్ముడివల్ల ఈ సూక్తి పుట్టిందంటారు. నిజానికి మేనమామలందరూ కంసుళ్ళూ, శకునులూ అయితే జాతి ఏనాడో అంతరించేది. మేనమామ భార్యను 'మాతులీ, మాతులానీ' అంటారు సంస్కృతంలో. మేనత్త భర్తను సంస్కృతంలో ఏమంటారో సరిగా తెలీదు. మేనత్తను 'పితృష్వస' (అంటే 'తండ్రితోబుట్టువు') అంటారుకానీ ఆమె భర్తనేమనాలో చెప్పలేం. మేనరికం మొహమే ఎరగని భాషలో ఏమంటేమటుకేమని సరిపెట్టుకున్నా–నామటుకు నేను.

కోడలికి ఆడబిడ్డా, ఆడబిడ్డకు కోడలూ వదినో మరదలో అవుతారు తెలుగులో (ఆడబిడ్డ ఇప్పటిరూపం. 'ఆడుబిడ్డ' అనేది పూర్వరూపం. 'ఆడ' అంటే అక్కడ. అంటే మరో ఇంట్లో ఉండవలసిందికాబట్టి 'ఆడబిడ్డ' అని వ్యాఖ్యానించినవాళ్ళు లేకపోలేదు! నిజానికి ఆడదైన బిడ్డ–మొగబిడ్డకానిది–అనేదే సరైన అర్థం. ఈ వివరణ సరికాకపోతే 'ఇల్లటపల్లుణ్ణి' తెచ్చుకొన్న ఇంటి సంగతినెలాచెప్పాలనేది పెద్ద అనుమానం!). 'వధూనీ' అనే సంస్కృత శబ్దంనుంచి తెలుగు 'వదినె' పుట్టిందంటారు. అలా పుట్టని రూపం మరొకటి తెలుగులోలేదుకాబట్టి తెలుగుమాటకు అదే సంస్కృతీకరణమన్నవాళ్ళూ లేకపోలేదు. రెండోదే సరైన వాదమేమో! ఎందుకంటే పెద్దదైన వదినెకు చిన్నదైన మరదలంటూ ఒకామె ఉంటుంది. మరదలు శబ్దానికి సంస్కృతంలో మరో పేరుందా? 'మరది–మరదలు' అనే మాటలకు ప్రాచీనకావ్యాల్లో శాసనాల్లో బండిరా

ఉండేది. ఇప్పుడు 'మరిది' అంటున్నమాటను అప్పుడు 'మఱది, మఱంది' అనే రూపాన్ని తయారుచేసుకొన్నది తెలుగువాళ్ళు. ఇలాంటి కట్టుదిట్టమైన ఏర్పాట్లు లేని సంస్కృతంనుంచి మనమాటలన్నీ ఏర్పడ్డాయనటం అంతబాగాలేదనేవాళ్ళూ ఉన్నారు. సంస్కృతంలో 'వధూనీ/వధూనికా' శబ్దానికి 'భ్రాతృజాయా, ప్రజావతీ' అన్న శబ్దాలు పర్యాయపదాలని అమరకోశం చెప్తుంది. 'సోదరుడి భార్య' అన్నది మొదటిమాటకు అర్థం. రెండోదానికి 'పిల్లలతల్లి' అని అర్థం. వదినలందరికీ పిల్లలుండితీరాలనే నియమంలేదు. ఉత్తర హిందూస్థానంలో అన్న చనిపోతే -- తనను చిన్నతనంలో తల్లిలాగా పెంచినాసరే – వదినను పెండ్లాడాలనే ఒక దురాచారముంది. కొంచెం శ్రమించి ప్రేమ్‌చంద్ రచనలు గాలిస్తే ఇలాంటి నిదర్శనాలు లభిస్తాయి! భార్యపోతే ఆమె చెల్లెలిని పెండ్లాడిన తెలుగువాళ్ళున్నారుగాని పైన చెప్పిన అనాచారం తెలుగుజాతిలో లేదు.

పెద్దవాణ్ణి బావ అనీ, చిన్నవాణ్ణి మరిది అనీ పిలవటం మన ఆచారం. అలాగే వదిన, మరదలు అనే విషయంలోనూ. మన 'బావ'లు రెండురకాలు సాధారణంగా; 'మేనబావ, (మామూలు)బావ' అని. వాడవదినెలు 'బావా!' అని ఎవర్నయినా పిలవచ్చనేది వేరేవిషయం. సంస్కృతంలో భర్త సోదరుణ్ణి (బావను/మరిదిని) 'దేవ, దేవర' శబ్దాలతోనూ, భార్య సోదరుణ్ణి 'శ్యాల, శాలక' శబ్దాలతోనూ పిలుస్తారు. 'దేవరన్యాయం' సంగతీ, వ్యాసుడు ధృతరాష్ట్రాదులను 'కన్న' సంగతీ ఇటీవల టీ.వీ. పుణ్యమా అని అందరికీ తెలిసిఉండాలి. శ్యాలకుల విషయం సంస్కృతసాహిత్యంలో రెండు రకాలుగా తెలుస్తుంది. 'రాజశ్యాలకుడూ', 'రాజ్యశ్యాలకుడూ' అని రెండురకాల బావమరుదులు (రాజుగారికే అనుకోండి) ఉండవచ్చు. రాజశ్యాలకుడంటే రాజుగారి బావమరిది. అంత ప్రమాదకరమైన వ్యక్తికాదు. రాజుగారి ఉంపుడుగత్తెగారి సోదరుణ్ణి 'రాజ్యశ్యాలకు'డంటారు. ఆయన రాజుగారికేకాక మొత్తం రాజ్యానిక్కూడా బావమరిదినమకొని విర్రవీగుతుంటాడు. భాసుడి 'చారుదత్త' కథనుగాని, శూద్రకుడి 'మృచ్ఛకటిక' కథనుగాని విన్నవాళ్ళకి రాజ్యశ్యాలకుడి పరాక్రమం తెలుస్తుంది. మొత్తానికి మాతులుడి విషయంలోలాగా, శ్యాలకుడి విషయంలోనూ ఓ సూక్తి పుట్టింది సంస్కృతంలో – 'శ్యాలకో గృహనాశాయ' అని. అంటే బావమరిదిని కొంపలో చేరిస్తే ఇల్లుగుల్లవుతుందని అర్థం! రాజుకన్నా రాజశ్యాలకుడే ఎక్కువ ప్రమాదకరమైన వ్యక్తి. ఇప్పుడు రాజులు లేరుకాబట్టి బతికిపోయామనుకోకండి. వారి స్థానంలో వచ్చిన మంత్రులు తక్కువతిన్నారనటం న్యాయంకాదు–పైపెచ్చు వాళ్ళు మన ప్రతినిధులేకాక మన సేవకులుకూడా! వాళ్లని తక్కువచేయటం భావ్యంకాదు.

## చుట్టరికాలు

చుట్టరికమనే తెలుగు మాటకు ఎక్కువ వాడుకలో ఉన్న సంస్కృత పర్యాయపదం బంధుత్వం. ఆమాటకు బంధుత అనే రూపాంతరం, జ్ఞాతేయమనే పర్యాయపదం ఉన్నాయి. జ్ఞాతులంటే దాయాదులు. అంటే దగ్గరి చుట్టాలు. జ్ఞాతులంటే (బాగా)

తెలిసిన వాళ్లని వ్యుత్పత్తి చెప్పవచ్చు. వాళ్లని సనాభయులని కూడా అంటారు. ఏడు తరాలకు చెందినదగ్గరి చుట్టాలను ఆ పేరుతో పిలుస్తారు. ఆస్తిపాస్తుల పంపకంలో భారతయుద్ధాలు చేయగలవాళ్లు కాబట్టి సంస్కృతంలో 'జ్ఞాతిశ్చే దనలేన కిమ్?' అనే ప్రశ్న పుట్టింది. జ్ఞాతి ఉంటే వేరుగా నిప్పు అక్కరలేదని భావం. దూరపు చుట్టాలను సంస్కృతంలో 'సగోత్రు'లని, 'బంధువు'లని, 'బాంధవు'లని, 'స్వజను'లనీ పిలుస్తారు. ఒకే గోత్రానికి చెందిన (శాఖలకూ శాఖాంతరాలకూ చెందినప్పటికీ) వారంతా సగోత్రులు. స్వజన శబ్దానికి సరయిన తెలుగుమాట 'అయినవాళ్లు' అనేది. 'కావలసిన' చుట్టాలను–ముఖ్యంగా వియ్యాలవారిని– 'రాజబంధువు'లంటారు. రాజుగారి బంధువులని కాదు దానికర్థం – ముఖ్య బంధువులని. కంచంపొత్తేకాక మంచం పొత్తుకూడా ఉన్నవాళ్లు రాజబంధువులు. తక్కినవాళ్లతో కేవలం 'కంచంపొత్తు' మాత్రమే ఉంటుందన్నమాట. బంధు శబ్దం నుంచి పుట్టినమాట 'బందుగు'. 'చుట్టం, విందు' అనేవి పచ్చి తెలుగుమాటలు. బహువచనంలో 'చుట్టాలు' అనేమాటకు పాత తెలుగులో 'చుట్ట'లనే పర్యాయపదముండేది. ఇప్పుడు చుట్టలంటే అర్థం మారింది. మరీ దగ్గరి చుట్టాలను 'సపిండు'లంటారు సంస్కృతంలో. తద్దినం పెట్టినప్పుడు పిండాలందుకోదగిన వాళ్లన్నమాట. సాధారణంగా తాత ముత్తాతలవుతారు. వంశపారంపర్యంగా సంబంధంచేసే వాళ్లని తెలుగు నిఘంటువుల ప్రకారం 'అంతల పొంతలవారు, అంది పొందినవారు' అనాలి కానీ ఆ మాటలను నిఘంటుకారులు తప్ప ఇతరులు వాడినట్లు లేదు. సగోత్రుడనే శబ్దానికి సరైన తెలుగు మాట 'దాయ'. ఈ మాటకు 'శత్రు'వనే మరో అర్థంకూడా ఉండటమే విశేషం.

తరతరాలుగా ఉండే తండ్రి, తాత వంటి మాటలను గురించి ఇంతకుముందు కొంత తెలుసుకున్నాం. తెలుగులో మాండలికంగా ఇంతకుముందు చెప్పని పర్యాయ పదాలెన్నో వాడుకలో ఉన్నాయి. నిజానికన్నీ తెలీదు. నిఘంటువుల్లోనూ కనిపించవు. తెలిసినంతలో క్లుప్తంగా పేర్కొన్నా అన్నిమాటలనూ స్థూలంగా పర్యాయపదాలని చెప్పవలసిందేగాని ఏ భాషనుంచి ఎరువు తెచ్చుకొన్నామో, ఏ కారణాలవల్ల ఇలాంటి మాటలు వాడుకలోకి వచ్చాయో ఇక్కడ ప్రస్తావించటం కష్టం. కొన్ని చుట్టరికాలను మాత్రం పర్యాయపదాలతో సహా పరిశీలిద్దాం.

'తండ్రి'ని భిన్నప్రాంతాల్లో 'నాన్న, అయ్య, అప్ప, బాపు, బాబు, అన్న, అన్నయ్య, అన్నాజీ, బప్ప, అప్పడు' వగైరా పేర్లలో పిలుస్తారు. (ఒకే మాట భిన్నబంధుత్వాల్లో వాడుకలో ఉంటే ఆశ్చర్యపోకండి. అన్నిటికీ కారణాలుంటాయి. కానీ వాటినిక్కడ చర్చించడం వీలుపడదు. ఏప్రాంతంలో ఏకులం వారు వీటిలో ఏమాటనుపయోగిస్తారో వివరించటంకూడా సాధ్యంకాదు.) 'తల్లి'ని 'అమ్మ, అవ్వ, అక్క, ఆయి, తాయి' అని రకరకాలుగా పిలిచేవాళ్ళున్నారు. 'తాత'లు రెండురకాలు – తల్లితండ్రి, తండ్రితండ్రి అని. తల్లితండ్రిని సంస్కృతంలో మాతామహుడంటారు. తండ్రితండ్రిని పితామహుడంటారు. పితృపిత అనేవాళ్లు కూడా ఉన్నారంటారు కోశకర్తలు. తెలుగులో ఈభేదం పాటించకుండా ఉభయులనూ 'తాతయ్య, అబ్బ, జేజయ్య, జేజినాయన, జేజబ్బ' అనేవాళ్లున్నారు. 'అవ్వ'లు కూడా రెండు రకాలు – తల్లితల్లి, తండ్రితల్లి అని. తల్లితల్లిని 'అవ్వ, అమ్మమ్మ, అమ్మగారవ్వ, ఆయమ్మ,

మామ్మ, నాన్నమ్మ, జేజి, జేజమ్మ, బావమ్మ, అమ్మ, అవ్వతల్లి, మామాయి' అని పిలుస్తారు. తండ్రితల్లిని 'నాయనమ్మ, బామ్మ, బావమ్మ, అన్నవ్వ, నాన్నవ్వ, అమ్మ, అమ్ము, బాపాయి' అని వివిధ విధాలుగా పిలుస్తారు.

తాతతండ్రిని కొందరు 'పెత్తాత' అనీ, మరికొందరు 'ముత్తాత' అనీ పిలుస్తారు. సంస్కృతంలో ప్రపితామహుడనీ, ప్రమాతామహుడనీ సందర్భాన్ని బట్టి వ్యవహరిస్తారు. అలాగే 'ముత్తవ్వ'ను ప్రపితామహి అనీ, ప్రమాతామహి అనీ పిలుస్తారు. వాళ్ల తలిదండ్రులను (చూడటం అరుదు, తలుచుకోవటం అంతకన్నా అరుదు) సంస్కృతంలోనయితే 'వృద్ధప్రపితామహు'డనీ, 'వృద్ధప్రపితామహి' అనీ పిలవవచ్చు. అలాగే వృద్ధప్రమాతామహి, వృద్ధప్రమాతామహుడనీ అనవచ్చు. తెలుగులో కొద్దిమంది మాత్రం 'తాతమ్మ, మిత్తాతమ్మ' అనేవాళ్లున్నారని విన్నాం. మామూలుగానయితే 'మాముత్తాత తండ్రిగారు/ తాతగారు, ముత్తవ్వ తలిదండ్రులు' అనవలసిందే. మూడు తరాలకు పైగా ముందున్న వాళ్లను గురించి వినాలంటే మహాభారతం చదవాలి! పోటీకి తరవాతితరాల సంగతి చూద్దాం.

కొడుకు/కూతురి కొడుకు మనవడవుతాడు. కొడుకు కొడుకును సంస్కృతంలో పౌత్రుడనీ, నప్త అనీ అంటారు. అదే కూతురు కొడకయితే దౌహిత్రుడవుతాడు. కొడుకు కూతురు మనమరాలు. ఆమెను సంస్కృతంలో 'పౌత్రి/నప్త్రి' అంటారు. అందులో మొదటి **మాటకే** వ్యవహార బలమెక్కువ – ఒత్తులు తక్కువ! కూతురి కూతురు 'దౌహిత్రి/నప్త్రి'. 'సుతాత్మజ' అనవచ్చని కోశకారులు చెప్తారుగాని, సంధి విషయంలో లేని గొడవ విడదీసినప్పుడు వస్తుంది. ('సుత–ఆత్మజ' అని విభజిస్తే కూతురి కూతురవుతుంది). మనమడి/మనమరాలి కొడుకును/కూతురిని ఏమని పిలిచేవాళ్లో సంస్కృతంలో చెప్పలేం. తెలుగులో 'ముదిమనమడు, మునిమనమడు, ముత్తోమనమ'డనే పురుషవాచకశబ్దాలూ, 'ముదిమనమరాలు, ముదుమనుమరాలు' అనే మాటలున్నాయని విన్నాం. వారి పిల్లలను 'ఇనిమనమడు, ఇనిమనమరాలు' అంటారని విన్నాంగాని ప్రయోగాలు దొరకలేదు – నిఘంటువులూ చూపినట్లులేదు. అంతలావు సూర్యరాయాంధ్ర నిఘంటువులోనే 'ఇనుమనుమడు' అంటే 'మునిమనుమడి కొడుకు, ప్రపౌత్రుని కొడుకు' అని అర్థమిచ్చారేగాని ప్రయోగమివ్వలేదు. 'ఇను–ఇరు'లు రూపాంతరాలు. రెండోతరం మనుమడని అర్థం కాబోలు. కొడుకు కొడుకైన మనమడి కొడుకయిన మునిమనమడిని చూడగలిగితే సదరు ముత్తాతగారు నేరుగా స్వర్గలోకానికి పోతారని మనవాళ్ల విశ్వాసం. అయితే ఈ పరంపర కూతురి విషయంలో స్వర్గప్రాప్తి కలిగించదట. పురుష ప్రపంచంలో, అందులోనూ దక్షిణాదిలో ఇలాంటి నమ్మకాలుండటంలో ఆశ్చర్యంలేదు. చివరికి చితిపేర్చటానికి, నిప్పు ముట్టించటానికీ కాకపోయినా, శ్మశానానికి పోవటానికైనా నోచని స్త్రీలకు ఇంతకన్నా గొప్ప మర్యాద ఏముంటుందని ఊహించగలం?

ఇంతకుముందు పేర్కొన్నవాళ్ళుకాక మిగిలిన ముఖ్యబంధువులను ఎన్నిరకాలుగా తెలుగువాళ్ళం పిలుస్తుంటామో ఇప్పుడు గుర్తిద్దాం. తండ్రికన్నా పెద్దవాడయిన ఆయన అన్నను 'పెదతండ్రి, పెదనాయన, పెదబాపు, పెద్దన్న, బడ్‌దాద, పెదనాన్న, బాబు, బావాజీ, బావయ్య, బాబయ్య, కాకా, పెదకాకా, పెద్దయ్య, బాపు' అని

అనేకవిధాల పిలుస్తారు. పినతండ్రిని 'చిన్నాయన, చినబాపు, కాక, చిన్నన్న, చిన్నయ్య, అబ్బయ్య, పిన్నప్ప, బాబాయి, చిన్నాన్న, పిన్నయ్య, అప్పయ్య, చినకాక' అని వేరువేరు ప్రాంతాల్లో పిలుస్తున్నారు. అలాగే తల్లి అక్కగారిని 'పెత్తల్లి, పెద్దమ్మ, పెద్దవ్వ' అనీ, ఆమె చెల్లెల్ని 'పిన్ని, చిన్నాయి, చిన్నమ్మ, చిన్నవ్వ, చిన్ని, కాకి, తాయి, మౌషి' వగైరాపేర్లతోనూ పిలుస్తారు.

అన్నదమ్ముల కొడుకులను శ్రీకాకుళంజిల్లాలో 'పుత్రాకొడుకు' అనీ, కూతుళ్ళను 'పుత్రాకూతుళ్ళు' అనీ విచిత్రంగా వ్యవహరిస్తారు కొందరు. మేనత్తను 'అత్త, బాయి, బాప్ప, అక్క, బువ్వ' అని పిల్చేవాళ్ళున్నారు. అత్తను–ఆమె భార్య తల్లిఅయితే – 'అత్తమ్మ, మాయి, అత్తెబాయి' అనీ, భర్తతల్లి అయితే 'అత్తాయి, అత్తమ్మ, మాయి, సానుబాయి' అనీ రకరకాలుగా వ్యవహరిస్తారు. భార్యతండ్రిని 'మామ(గారు)' అనటం మామూలేగాని, భర్తతండ్రిని 'మాము' అనికూడా పిలవటం కద్దు. అక్కను 'అక్కయ్య, అక్కాయి, జీజీ' అని పిలుస్తారు. అలాగే చెల్లెల్ని 'చెల్లి, చెల్లమ్మ, అమ్మాయి' అని అంటారు. ఆడబిడ్డను 'ఆడబొట్టె, అలబొట్టె' అని పిలిచేవాళ్ళున్నారు. కొంతమంది 'వదినమరదలు' అని రెండు 'వరస'లనూ 'ఏకవరస'లో కలిపి చెప్తే, మరికొంతమంది 'పుట్టింటిబిడ్డ' అని వ్యాఖ్యానరూపంలో పలకరిస్తారు! తోడికోడలును సంస్కృతంలో 'యాత' అంటారని ఇంతకుముందు చెప్పాం. ఆమెనే 'ఏరాలు, జాదువ' అనికూడా పిలిచేవాళ్ళు లేకపోలేదు. తోడల్లుళ్ళను సంస్కృతంలో షడ్డకులంటారు. అక్కడికి ఆగక, 'షడ్డక షడ్డకశ్చైవ, ముష్టియుద్ధం పునఃపునః' అని ఓమాటనుకూడా విసిరారు. దానర్థం తోడల్లుళ్ళు (ఎందుకయితే మనకెందుకుగాని) గుద్దులాడుకుంటారని! తోడల్లుణ్ణి 'జగిలిగా'డని పిలిచేవాళ్ళున్నారు – ఏకవచనంలో. బహువచనంలో 'తోటన్న'లనేవాళ్ళు కొందరయితే, మరికొందరు 'అన్నదమ్ము' లని పిలుస్తారు! తెలుగు సంస్కృతాల సంగతెలా ఉన్నా మనమీ చుట్టరికాన్ని ఇంగ్లీషులోకి 'కోసవిన్లా' అని అనువదిస్తాంకదూ – ఆమాట అసలింగ్లీషువాడికి చచ్చినా బోధపడదు!

భర్త అన్నగారిని చాలామంది 'బావ(గారు)' అన్నా కొద్దిమందయినా 'భవజీ' అనే వాళ్ళున్నారు. మేనమామ భార్యను (ఆమె మేనత్తంత సన్నిహితురాలు కాకపోయినా) 'అత్త'కిందే లెక్కిస్తారు చాలామంది. అత్తనెన్నివిధాల పిలుస్తారో ఆమెనూ అన్నిరకాలుగా పిలుస్తారు. కొందరేమో 'మామి' అంటారు–బహుశా మార్పుకోసం. మేనరికం మనువాడినవాళ్ళు మగవాడిని 'మేనోడు' అనీ, ఆడదాన్ని 'మేనది' అనికూడా పిలుస్తారు. బహుశా అందుకేనేమో – అతి పరిచయంవల్ల తీసేసినట్లు మర్యాదలేకుండా మాట్లాడ్తారనేమో 'మేనబావ మొగుడూకాదు, మేనమరదలు పెండ్లామూకాదు' అనే సామెత పుట్టింది. 'చనువు'వల్ల వచ్చిన ఇబ్బంది ఇది. అన్న భార్యను చాలామంది 'వదిన' అంటుంటే కొందరయినా 'అత్తిగ' అని పిలుస్తున్నారు.

వియ్యమంటే సంబంధం, తమపిల్లలకు వివాహబంధం కల్పించే సంబంధం. వియ్యమందిన మగవాడు 'వియ్యంకుడు'. ఆయన్ను కొన్ని ప్రాంతాల్లో 'వియ్యంపు' డంటారు. మరికొందరు 'వీరకా'డంటారు. ఇంకాకొందరు 'బీగుడు' అని పిలుస్తారు. ఆయన భార్య 'వియ్యపురాలు'. ఆమెను 'వియ్యంపురాలు, వియ్యంకురాలు, వీరకత్తె, బీగురాలు, బీగరాలు, వియ్యాలకాపు, వియ్యాలసాని' అని రకరకాలుగా పిలుస్తారు.

కొద్దిమంది 'బీదరాలు' అంటారు(!) – పేదరాలన్నట్లు. వియ్యమందేసరికి పేదరికం వచ్చి పడుతుందేమో తెలీదు! శ్రీకాకుళం జిల్లాలో కొందరు 'ఏరాలు'ను – అంటే తోడికోడలును – 'సవతి' అని పిలుస్తారు(!). సంస్కృతంలోని 'సపత్నీ' శబ్దంనుంచి పుట్టిన 'సవతి' మరొకామె ఉండనేఉంది – తన భర్తను తనతోబాటు పంచుకొన్న మరో ఇల్లాలు. మరి ఈ రెండుమాటలూ ఇలా ఎలాకలిశాయో చెప్పలేం.

వివాహాన్ని 'మనువాడటం, పెండ్లాడటం' మొదలైన తెలుగుమాటలతో చెప్పవచ్చు. పెణ్–అంటే స్త్రీ. పెండ్లి అంటే మొదట్లో తన ఇంటికో స్త్రీని తెచ్చుకోవటమే కావచ్చు. 'ఇల్లరికం/ఇల్లిటం'గా పురుషుడిని తెచ్చుకొన్నా అది పెండ్లే అయింది తరవాత తరవాత! "ఓలి" (దాన్నే కన్యాశుల్కమంటారు) ఇచ్చి పెండ్లాడేవాళ్ళు పూర్వం. పురుషుడే డబ్బుఖర్చుపెట్టి భార్యను సంపాదించుకొనే ఆచారం ఇంకా 'తక్కువ కులాలవా'ళ్ళని ఆక్షేపానికి గురయ్యేవాళ్ళలోనూ గిరిజన సంస్కృతిలోనూ నిలిచేఉంది. 'కట్నం' (దాన్నే వరశుల్కమంటారు) ఈ కాలంలో జోరయిపోయింది. స్త్రీ పురుషుణ్ణి కొనుక్కునే సంప్రదాయం ఇప్పుడు వెర్రితలలు వేస్తున్నదన్నమాట. 'ఉద్వాహం, పాణిగ్రహణం, పాణిపీడనం' లాంటి సంస్కృతపదాలు మన 'పెండ్లి'కి పర్యాయపదాలు. పాణిగ్రహణమంటే 'చేయిపట్టుకోవడం', 'పాణిపీడనం' అంటే 'చెయ్యిలాగటం/గుంజటం', ఫలితంలో పెండ్లాడటమే. ఇప్పటికీ గోండులనే గిరిజనుల్లో స్త్రీ పురుషులెవరైనా ఒకరి దండచేతిని మరొకరు పట్టుకొంటే నిర్బంధించయినా కులపెద్దలు పెళ్ళిచేసే ఆచారముంది! 'ఆర్యు'లకు ఈ పాణిపీడనమనే ఆచారం ఈ 'అనార్యద్రవిడులనుంచి' సంక్రమించిందేమో పరిశోధక పరబ్రహ్మలు తేల్చాలి.

తెలుగులో 'మారుమనువు' అనేమాట ఉంది. దానికి సరిపోయే సంస్కృతపదం 'పునర్వివాహం'. 'అగ్ర' వర్ణాలవారు అనాదరం చూపే ఈ విధానం చాలాకులాల్లో ఉంది. రెండుమార్లు పెళ్ళాడిన యువతిని సంస్కృతంలో 'పునర్భువు' అంటారు. మక్కికిమక్కిగా అర్థంచెప్తే 'మళ్ళీ పుట్టింది' అని చెప్పాలి. ఆమెను 'దిధిషువు' అనికూడా పిలుస్తారాభాషలో. ఆమె భర్తను 'దిధిషుడు' అంటారు. విధవా వివాహం గొడవ పెట్టుకోకుండా గిరీశం ఇలాంటి వ్యవహారంలో దిగితే ఏ ఆర్గ్యుమెంట్లు చెప్పేవాడో ఊహించాలి.

## ఆకాశమార్గంలో

నేల విడిచిన సాము మేలుకాదు కాబట్టి. భూమ్మీద నిలిచి పైనున్న ప్రపంచంచూస్తూ మనశబ్దసంపద ఎంతలో ఉందో ఓసారి పారజూద్దాం. తలఎత్తగానే కనిపించే ఆకాశం దగ్గర మొదలుపెట్టి క్రమంగా కిందికి దిగి తరవాతి పరిసరాలను పరిశీలిద్దాం. భూమినీ ఆకాశాన్నీ చెట్లనూ పుట్టలనూ దేవతలని భావిస్తాంకాబట్టి మనభాషలో రెండురకాల పదజాలం తప్పదు. ఒకరకం సహజపదాలయితే రెండోరకం

భక్తితాత్పర్యపూరితమైన కవితామయ శబ్దజాలం. అంటే రెండోరకం మాటలు కవులూ పండితులూ భావస్పష్టత కోసం కల్పించుకొన్న సమాసాలన్నమాట. ఈ ద్వైవిధ్యం అన్ని భాషల్లోనూ కనిపిస్తుంది. మనం తెలుగు సంస్కృతాలకు పరిమితంగా ఈ విశేషాలు గమనిద్దాం.

ఆకాశాన్ని అచ్చతెలుగులో విడిమాటల్లో చెప్పాలంటే "నింగి, చదలు, ఉప్పరం, విన్ను, మిన్ను, బయలు" అనే శబ్దాలతో సూచించవచ్చు. మనకవులూ నిఘంటుకారులూ "అకసం, మబ్బుత్రోవ, వెన్నునడుగు, రిక్కదారి, వేలుపుల త్రోవ, ఉప్పరవీది, మొయిలుదారి, చుక్కలతెరువు, గాడ్పుతండ్రి, చుక్కలత్రోవ, వేల్పుదెరువు, గాలితండ్రి, మొగిలుతెన్ను" వంటి అనేక సమాసాలు కల్పించారు అదనంగా. ఇవి గ్రంథాల్లోనేగాని నిత్యవ్యవహారంలో వినిపించేవికావు.

చదలు అనేమాటకు దిక్కు అనే అర్థంకూడా ఉంది. అన్నివైపులకూ వ్యాపించింది కాబట్టి ఆపేరు వచ్చివుండవచ్చు. నింగి అనేమాటకు కావ్యప్రయోగా లనేకం. ఒకప్పుడు భీమసేనుడు 'నేలయు నింగియు తాళమున్ వాయింప'దలచాడట! నిగ్గు(ప్రకాశం)కల ప్రదేశంకాబట్టి 'నింగి' అనేపేరు వచ్చిందంటారు కొందరు. ఉప్పరమంటే ఎత్తయినదని అర్థం. అందుకే మేడలనూ అంతస్తులనూ 'ఉప్పరిగ'లని పిలిచేవాళ్ళు పూర్వం. విన్నుమిన్నులకు వినుమిను లనే రూపాంతరాలున్నాయి. విన్ను అంటే వెలిగే తావని అర్థం. మిన్ను అలాంటిదే. 'మినుకుమినుక్కు'మనే నక్షత్రాదులున్న తావు అనే అర్థంతో ఈ మాటపుట్టింది. అంతా బహిరంగంగా, అడ్డంలేకుండా వ్యాపించింది కాబట్టి ఆకాశానికి 'బయలు' అనే పేరుకూడా వచ్చింది. 'నేలా నింగీ, మన్నూమిన్నూ' అనేవి ఎక్కువ వాడుకలో ఉన్న జంటపదాలు. 'భూమ్యాకాశాలు' అనే ద్వంద్వసమాసానికివి సరైన తెలుగుమాటలు. అకసమనేది ఆకాశ శబ్దం నుంచి పుట్టినమాట.

నక్షత్రాలూ, మేఘాలూ ఆకాశంలో తిరుగుతున్నట్లు కనిపిస్తాయికాబట్టి 'రిక్కత్రోవ, చుక్కలతెరువు, మబ్బుత్రోవ, రిక్కదారి, మొయిలుదారి, మొగిలుతెన్ను' వంటి మాటలు పుట్టాయి. అలాగే దేవతలు ఆకాశంలో విమానాల్లో తిరుగుతుంటారనే పురాణగాథలను పురస్కరించుకొని 'వేలుపులత్రోవ, వేల్పుదెరువు' వంటి సమాసాలు కల్పించారు. గాలి ఆకాశంలో పుట్టిందనుకున్నారుకాబట్టి 'గాడ్పుతండ్రి, గాలితండ్రి' అనే మాటలు వచ్చాయి. విష్ణుమూర్తి అడుగే ఆకాశమని, అక్కడ ఆకాశగంగానది పుట్టిందనీ ఒక ఐతిహ్యముంది. అందువల్ల 'వెన్నునడుగు' అనే సమాసాన్ని అచ్చతెలుగు కవులు కల్పించారు. పాలపుంత ఓ రాజమార్గంలాగా కనిపిస్తుందికాబట్టి 'ఉప్పరవీది' అనే మాట పుట్టింది. ఈ భావాలకు అనుగుణంగా ఎన్నెన్ని కొత్తసమాసాలు పుట్టించినా అచ్చతెలుగులో ఆకాశపర్యాయపదాలుగా ఉన్నవి 'నింగి, మిన్ను, విన్ను' అనేవే. బయలు శబ్దానికి ఇతరార్థాలుకూడా ఉన్నాయని మనకు తెలుసు. కల్పనల్లో కొంత గజిబిజి తప్పదేమో. నింగి వంటి మాటలు తెలుగులో అమహత్తులు. అంటే మగవాణ్ణి గురించి చెప్పేవికావు. అయినా మన తెలుగుకవులు 'గాడ్పుతండ్రి, గాలితండ్రి' వంటి మాటలు సృష్టించి ఆకాశాన్ని మగవాణ్ణి చేశారు! 'గాడ్పుతల్లి' అని ఎందుకు అమహత్తుగానే వ్యవహరించలేదో ఈ కృత్రిమభాషాసృష్టికర్తలే చెప్పాలి.

సంస్కృతంలోకూడా తెలుగులోలాగే రెండురకాల పర్యాయపదాలున్నాయి ఆకాశానికి. విడిమాటలని చెప్పదగ్గవి 'దివం, అభ్రం, వ్యోమం, పుష్కరం, అంబరం, నభం, గగనం, ఖం, అనంతం, వియత్తు, విహాయ(స)ం, నాకం, ద్యువు' మొదలైనవీ; 'అంతరిక్షం, సురవర్త్మ, విష్ణుపదం, తారాపథం, శబ్దగుణం, మేఘద్వారం, మహాబిలం'మొదలైనవీ. దివ మనే మాటకు స్వర్గమనే అర్థంకూడా ఉంది. స్వర్గం పైనా, నరకం కిందా ఉంటాయన్న మనవిశ్వాసానికి అనుగుణంగా ఆకాశ స్వర్గాలు రెంటికీ ఒకేమాటను వాడివుంటారు. ఆకాశం అంటే బాగా వెలుగుతున్నది, ప్రకాశిస్తున్నది అని అర్థం. ఆ–కాశం, ప్ర–కాశం అనే మాటల్లోని మొదటి అక్షరాలను ఉపసర్గలంటారు. కాశం అంటేనే వెలుగు. 'మంచి వెలుగునిచ్చేది' అనే అర్థంలో ఆకాశశబ్దం వాడుతున్నారన్నమాట. అభ్ర శబ్దానికి మబ్బు అనే మరో అర్థంకూడా ఉంది. ఆ మాటను వాడినప్పుడు సందర్భాన్నిబట్టి అది నింగో మబ్బో తెలుసుకోవాలి. వ్యోమపదం అటు ఆకాశానికి ఇటు స్వర్గానికీ, మళ్ళీ మాట్లాడితే వాటి పైభాగానికీ సమానంగా పనికివస్తుంది. పుష్కర శబ్దానికి అనేకార్థాలున్నాయి. ప్రళయకాలంలో వచ్చే ఒకరకం మేఘాన్నీ కొంతకాలపరిధినీ కూడా పుష్కరమని పిలుస్తారు. అంబరం అంటే ఆకాశం, వస్త్రం మొదలైన అర్థాలున్నాయి. ఆకాశానికి అంతులేదుకాబట్టి దాన్ని అనంతమన్నారు. గగనమనేది ఆకాశ శబ్దం తరవాత ఎక్కువ వ్యాప్తిగల శబ్దం–తెలుగువారి వాడుకలో కూడా. అందుకే ఆధునిక శాస్త్రవిజ్ఞానం ప్రసాదించిన 'గగనసఖులూ' (air-hostesses), 'వ్యోమగాములూ' (astro-nauts) మనకేర్పడ్డారు! ద్యు శబ్దంనుంచి పుట్టిన ద్యువు వెలుగనే అర్థంగలమాట. నాకం స్వర్గాకాశాలు రెంటికీ అన్వయించే మాట. వియత్తు, విహాయ(స)ం అనేవి ఆకాశపర్యాయపదాలే. వాటి వ్యుత్పత్తులు ప్రాచీనులు చెప్పేవి అంతగా నప్పవు. అయితే వాటికి కావ్యప్రపంచంలో తప్ప వాడుక లేదు. 'ఆకాశం గగనం శూన్య'మని ఏమీలేని దానికింద చెప్పినవాళ్ళున్నారు!

ఇక అంతరిక్షం నిఘంటువులు ఆకాశ శబ్దానికి పర్యాయపదమనిచెప్పినా, ఇప్పటి వాడుకలో దాని అర్థం మారిపోయింది. ఆకాశంలో కనిపించే నక్షత్రమండలాల మధ్య ప్రదేశాన్ని అంతరిక్షం (space) అంటున్నాం. సువర్త్మ కవులు కల్పించిన శబ్దం. 'దేవతలు పోయేదారి' అని దానికర్థం. 'ఆకాశహర్మ్యం/గాలిమేడ' అనేవి లేనివాటిని గురించి ప్రస్తావించేటప్పుడు వాడేమాటలు. దేవతలు మాత్రమే అక్కడ నివసిస్తారని నమ్మినా ఇబ్బందిలేదు. ఆ ఉండేది మనం కానంతకాలం ఇబ్బందీ లేదు. విష్ణుపదం అనే సమాసం 'వెన్నునడుగు' అనే తెలుగుసమాసానికి మూలమని చెప్పాలి. తారాపథం అంటే నక్షత్రాల దారి. ఇదీ కవితాత్మకంగా పెట్టినపేరే. మేఘద్వారం అనేదీ అలాంటిదే. శబ్దగుణమనే పర్యాయపదమే చిత్రమయింది. తర్కశాస్త్రంలోని ఒక భావన ఆధారంగా ఈపేరు పెట్టారు ఆకాశానికి. 'అన్నీ మనవేదాల్లో ఉన్నాయిష!' అని సంతోషించటానికి పనికివచ్చే మాట మహాబిలమనేది. బిలమంటే రంధ్రం, గుహ వగైరా. ఇదో పెద్ద రంధ్రమనుకోగానే కన్యాశుల్కం గుర్తుకువస్తుంది – 'ఆకాశానికి బొక్కడ్డదంటారే' అనే ప్రసంగం – కల్లుపాక సీనులోది. అయితే ఈ మాటకు వ్యవహారంలో స్థానంలేదు.

# సూర్యచంద్రాదులు

ఆకాశంలో సూర్యుణ్ణి చూడగానే ఓనమస్కారం పెడ్దామనుకున్నా పేచీ తప్పదు. పొద్దుటి సూర్యుడు, సాయం సూర్యుడు, మధ్యాహ్న సూర్యుడూ అని మూడుగా విభజించి త్రిమూర్తులతో ఆయన్ను అభేదంగా భావించాలంటారు. బ్రహ్మకు నమస్కారం పనికిరాదు. భూమ్మీద మానవుల మనుగడకు ఆధారభూతమైన సూర్యనక్షత్రాన్ని దేవుడుగా భావిస్తారు. కాబట్టి దేవతలందరికిలాగానే ఆయనకూ అష్టోత్తర సహస్రనామా లుంటాయి. అవన్నీ పర్యాయపదా లనుకుంటే ప్రమాదం. అందులో చాలాభాగం ఇతర దేవుళ్ళకుక్కూడా సరిపోతాయి. అదలాఉంచి సూర్యపర్యాయాలు కూడా మన సాధారణసూత్రం ప్రకారం రెండు రకాలనీ, ప్రాథమికపదాలు వేరుగా వర్ణనాత్మక శబ్దాలు వేరుగా ఉంటాయనీ గమనించాలి.

తెలుగు నిఘంటువులన్నీ గాలించినా అచ్చమైన తెలుగుపేరు 'ప్రొద్దు' (ఇప్పటి వాడుకలో 'పొద్దు') ఒక్కటే సూర్యశబ్ద పర్యాయంగా దొరుకుతుంది. ఈమాటకు ఇంకా రాయలసీమలోనే వాడుక మిగిలింది. పొద్దుకు 'సమయం' అనే అర్థవిశేషంకూడా ఉంది. పల్లెటూళ్ళలో కాలాన్ని 'అంబటిపొద్దు, బారెడుపొద్దు'లాంటి మాటల్తోనే విభజిస్తున్నారిప్పటికీ. ఇతర ప్రాంతాల్లోనూ విద్యావంతుల వాడుకలోనూ సూర్యుడే మిగిలాడు తెలుగువాళ్ళకు. కొందరు రచయితలు 'సూరీడు' అనే తద్భవరూపం సృష్టించారు. తక్కిన 'అచ్చతెలుగు' మాటలన్నీ కవిపండితులు పురాణైతిహ్యాలమీద ఆధారపడి సృష్టించిన సమాసాలే. అవెన్నడూ ప్రజల వాడుకలో ఉన్నవీకావు నిలిచినవీ కావు. 'చాయపెనిమిటి' అని ఒకరంటే 'జముతండ్రి' అని మరొకరన్నారు. సూర్యుడికి ఛాయాదేవి (నీడగారు!) భార్యట. ఆమెభర్తట ఆయన. యముడాయన కొడుకుకాబట్టి సూర్యుణ్ణి జముతండ్రి అన్నారు. తండ్రినిబట్టి కొడుక్కుగాక కొడుకునుబట్టి తండ్రికి పేరువచ్చిందన్నమాట! అలాగే ఫలానా అమ్మగారి భర్త అనికూడా! 'జగముకన్ను' అని ఒక కవి పిలిస్తే, 'మిను రతనమ్ము' (ఆకాశరత్నం) అని మరోకవి వర్ణించాడు సూర్యుణ్ణి. ఆయన 'తమ్మిచుట్టం' (పద్మాలకు బంధువు) అన్నారు కొందరు. ఇదో (మూఢ) విశ్వాసం. పద్మాలు సూర్యోదయంతో వికసించి సూర్యాస్తమయంతో ముకుళిస్తాయనేది 'కవిసమయ' మంటారు. రాత్రిళ్ళు తామరపువ్వులు వికసించి – కనిపించినా, పగలు కలువపూలు విచ్చి కంటబడ్డా కవులు మాత్రం అంగీకరించరు. ఆయన రథానికి ఏడు పచ్చగుర్రా లుంటాయట. అందుకని 'పచ్చగుర్రముల రౌతు' అని మరో కవి కీర్తించాడు. మరో పండితుడాయన్ని 'ప్రాబలుకుటెంకి' అన్నాడు. ప్రాబలుకులు అంటే పాతకాలపుమాటలు – అంటే వేదాలు. వాటికి ఆధారమైనవాడట సూర్యుడు. కొందరాయన్ను చంద్రుడు వురఫ్ 'రేవెలుగు'కు పోటీగా 'వేవెలుగు' అని పిలుస్తారు. ఇలాంటి కల్పనలెన్నిఉన్నా తెలుగులో అసలుసిసలైన మాట 'పొద్దు' అనేదే. అదికూడా వాడుకలోనుంచి తప్పుకొంటున్నది చాలాచోట్ల.

సంస్కృతంలోనుంచి 'సూరుడు, శూరుడు, సూర్యుడు, అర్యముడు, అర్కుడు,

మిహిరుడు, అరుణుడు, పూష, తరణి, మిత్రుడు, తపనుడు, సవిత, రవి, హరి, ఇనుడు, భగుడు, భానుడు, హంసుడు, బ్రధ్నుడు, భాస్కరుడు' వంటి విడి మాటలు చాలా ఉన్నాయి. సూరుడంటే పండితుడు. ఆయన హనుమంతుడికి పాఠాలు చెప్పినవాడుకదా మరి. శూరుడంటే నిజానికి తేరి చూడటానికి వీలుకానివాడు. అర్యముడంటే ఆర్యుడు, పెద్దవాడు, ఉత్తముడు. అర్కుడంటే ఋక్కుల్లో (వేదమంత్రాల్లో) వినిపించేవాడు. వేదకాలంనుంచీ సూర్యారాధన ఉందికాబట్టి ఈ మాట వచ్చింది. మిహిరుడనేమాట సంస్కృతంకాదని, గ్రీకు పదమనీ చెప్తారు. ఉదయాస్తమయ సమయాల్లో అరుణంగా–ఎర్రగా–కనిపిస్తాడు కాబట్టి అరుణుడు. దిక్చక్రాన్ని ఇటునుంచి అటు ప్రతిదినం తరిస్తుండే–దాటే–వాడు కాబట్టి తరణి. ప్రాణిరాశులు అతడి స్పర్శలేనిదే జీవించలేదు. అందువల్ల సూర్యుడు ప్రాణులందరికీ మిత్రుడు–స్నేహితుడు–అయినాడు. తాపం, తపన పుట్టిస్తాడుకాబట్టి తపనుడని పిలిచారు. ప్రకాశవంతుడు కాబట్టి రవి, సవిత, ఇనుడు అనే పేర్లు వచ్చాయి. హరి అనేపేరు అనేక దేవతలకూ – జంతువులకూ ఉంది – నిఘంటువుల ప్రకారం. హరించేవాడు హరి. సూర్యమండల మధ్యంలో విష్ణుమూర్తి ఉంటాడట. అదే వికుంఠమని చెప్తారు కొందరు. విష్ణుస్థానంకాబట్టి హరి అనే పేరుకూడా వచ్చిందన్నమాట. భగవచ్ఛబ్దానికున్న అనేకార్థాలమాట అటుంచి దేవుణ్ణి భగవంతుడంటాంకదా. ప్రత్యక్షదైవమనుకుంటున్నాం కాబట్టి సూర్యుణ్ణి భగుడనికూడా పిలుస్తారు. భా, బ్రధ్న శబ్దాలకు వెలుగనే అర్థముంది. కిరణాలు కలవాడని భానుడు, బ్రధ్నుడు అంటున్నాం. ప్రకాశం కలిగించే, వెలుతురు కల్పించేవాడు కాబట్టి భాస్కరుడన్నారు.

కవితాత్మకమైన పేర్లుకూడా సూర్యుడికి చాలా ఉన్నాయి. అందులో కొన్ని వర్ణనాత్మకాలు. మరికొన్ని లక్షణ సూచకాలు. ఆదిత్యుడు, దివాకరుడు, ద్వాదశాత్మ, అహస్కరుడు, ప్రభాకరుడు, విభాకరుడు, భాస్వంతుడు, వివస్వంతుడు, సప్తాశ్వుడు, హరిదశ్వుడు, ఉష్ణరశ్మి, వికర్తనుడు, మార్తాండుడు, ద్యుమణి, చిత్రభానువు, విరోచనుడు, విభానువు, గ్రహపతి, త్విషాంపతి, అహర్పతి, సహస్రాంశుడు, కర్మసాక్షి, జగచ్చక్షువు, అంశుమాలి, త్రయీతనువు, ప్రద్యోతనుడు, దినమణి, ఖద్యోతుడు, లోకబాంధవుడు, ధామనిధి, పద్మినీవల్లభుడు, పద్మాక్షుడు, తేజోరాశి, ఛాయానాథుడు, తమిస్రహుడు వగైరా చాలాపేర్లు పెట్టారు సూర్యుడికి. అదితి కుమారుడుకాబట్టి ఆదిత్యుడన్నారు. దివాకర, అహస్కర, అహర్పతి శబ్దాలకు పగలింటిని కల్పించే, దానికి ఆధిపత్యం వహించేవాడని అర్థం. ప్రభాకర, విభాకర, భాస్వంత, అంశుమాలి, ప్రద్యోతన, తేజోరాశి శబ్దాలకు వెలుగునిచ్చేవాడని, కిరణాలు ప్రసరించేవాడని అర్థాలు. ఏడుగుర్రాల రౌతుకాబట్టి సప్తాశ్వుడంటే, పచ్చగుర్రాలరౌతని హరిదశ్వుడన్నారు. చీకటిని పోగొట్టుతాడని తమిస్రహుడన్నారు. నీడమ్మగారి భర్త కాబట్టి ఛాయానాథుడన్నారు. వెయ్యి కిరణాలున్నాయిట – అందుకు సహస్రాంశువు అన్నారు. ఆకాశంలో వెలిగిపోతుంటాడు కాబట్టి ఖద్యోతుడనే పేరు వచ్చింది. పైనుండి కింద ఎవరెవరు ఏయే పుణ్యపాపాలు చేస్తున్నారో చూస్తుంటాడని కర్మసాక్షి, జగచ్చక్షువు (లోకానికి కన్నువంటివాడు) అని పిలిచారు. త్రిమూర్త్యాత్మకుడని త్రయీతను డన్నారు. పన్నెండు రూపాలున్నాయని (ద్వాదశాదిత్యులు కాబట్టి) ద్వాదశాత్మ అన్నారు. అప్పుడప్పుడు రంగురంగుల

కిరణాలు విరజిమ్ముతాడు కాబట్టి చిత్రభానుడని పిలిచారు. వేడి ఇస్తాడు కాబట్టి ఉష్ణరశ్మి అని పిలిచారు. ఆయన లేకపోతే లోకం సుఖంగా బతకదు కాబట్టి లోకబాంధవుడన్నారు. ఆకాశంలో వెలుగుతుంటాడు కాబట్టి ద్యుమణి అని, పగలే వెలిగేవాడుకాబట్టి దినమణి అని అన్నారు. మనపూర్వులు సూర్యుణ్ణి నక్షత్రంగాకాక గ్రహంగా లెక్కించారు. ఆ (నవ) గ్రహాలకూ ఆయనే అధిపతికాబట్టి గ్రహపతి అని సూర్యుడికి పేరు పెట్టారు. దేవుడు కాబట్టి సహస్రనామాలున్నా ఆశ్చర్యంలేదు. ఇన్నిమాటల్లోనూ తెలుగువారి వాడుకలో సూర్యశబ్దానికున్నవ్యాప్తి మరి దేనికీ లేదు.

గ్రహంగాని సూర్యుణ్ని గ్రహమని అన్నవాళ్లే ఉపగ్రహమైన చంద్రుణ్నీ గ్రహంగా పరిగణించారు. సూర్యుడికి అందువల్ల గౌరవభంగం కలిగిందో లేదోగాని చంద్రుడి ప్రతిష్ఠ పెరిగిందని చెప్పకతప్పదు. పాశ్చాత్యులు స్త్రీగా భావించే 'మూన్' మనవాళ్ల లెక్కన మొగవాడై, గురుభార్యతో సరసం వెలిగించి, ఒకానొక క్షత్రియ వంశానికీ సూర్యుడికీ పోటీగా తనపరంపరను కూడా ప్రసాదించాడు. నిన్నమొన్నటి శ్రీకృష్ణదేవరాయలుకూడా చంద్రవంశంవాడేనట.

అచ్చతెలుగులో 'నెల' అన్నదొక్కటే నిస్సంశయంగా చంద్రుడిపేరని చెప్పదగిన మాట. ఆమాటకు మాసం అనే అర్థవిశేషంకూడా ఉంది. 'నెలవంక, నెలపొడుపు' వంటి సమాసాల్లోనూ 'నెలతప్పటం' వంటి సంబంధాల్లోనూ తప్ప ఈ కాలంలో చంద్రుడనే అర్థంలో నెలశబ్దానికి వాడుక ఉన్నట్లు లేదు. బాగా వాడుకలో ఉన్నమాట 'చందమామ' చిత్రమయింది. సంస్కృతంలో 'చంద్రమా' అనే శబ్దం నుంచి ఇది ఏర్పడ్డదేగాని అచ్చతెలుగుపదం కాదిది. ఆ మాటచివరి 'మామ'కు నానార్థాలూ వివరాలూ చెప్తారు పండితులు. మరోమాట జాబిలి/జాబిల్లి. ఇది సంస్కృతపదం కాదని బల్లగుద్ది చెప్పవచ్చుగాని తెలుగుమాట అని వ్యుత్పత్తి చెప్పటం సులభంకాదు. పసిబిడ్డలను అలరిస్తూ పాడే 'చందమామ రావే! జాబిల్లి రావే' అనేపాటలోని జాబిల్లి మహత్తనిపించదు. అంటే పురుషవాచక మనిపించదు నెలశబ్దంలాగానే. తొలిదినాల్లో తెలుగువారి చంద్రుడు అమహత్తుగా ఉండి సంస్కృత ప్రభావంతో పురాణగాథల పుణ్యమా అని మొగవాడైపోయాడేమో!

అచ్చతెలుగు కవులూ నిఘంటుకారులూ సృష్టించిన చంద్రపర్యాయపదాలను గమనిస్తే కొన్నిట మహత్తుగా, కొన్నిట అమహత్తుగా చంద్రుడుండటాన్నిబట్టి పై అనుమానం మరింత బలపడుతున్నది. 'రేయివెల్గు, రేవెలుగు, వెన్నెలగుత్తి, చందు, వేలుపులబోనం, పుట్టుకచల్వజోతి, లచ్చిరేనెడమకన్ను' వంటి సమాసాల్లో అతగాడు అమహత్తే. మరి 'చందురుడు, చందమామ, వెన్నెలరాయుడు, రేపాలతిమగండు, చుక్కలదొర' అనే మాటల్లో ఆయన స్పష్టంగా మహత్తే. 'చెంగలువ నెచ్చెలి' వంటి మాటల్లో ఎటయినా కావచ్చు. ఆ సందిగ్ధతకు కారణం 'నెచ్చెలి' శబ్దమే గాని ఆయన కాకపోవచ్చు!

వేవెలుగయిన సూర్యుడికి పోటీ రేవెలుగు – అంటే రాత్రిళ్లు వెలిగిపొయ్యేవాడని చెప్పాలి. అన్నిరాత్రులూకాదుగదా అనే ఆక్షేపం ఉండనే ఉందనుకోండి. చంద్రుడిలో అమృతముందట. అమృతంతిన్న దేవతలు చంద్రుణ్నీ తిన్నట్టేగదా అని ఓ కవి

వేల్పులబోన మని పిలిచాడు! పుట్టినప్పటినుంచీ చల్లగా ఉండే వెలుగుకాబట్టి పుట్టుక చల్వడోతి అన్నారు. లక్ష్మీదేవి భర్త విష్ణుమూర్తి (లచ్చిరేడన్నమాట). ఆయనకోకన్ను సూర్యుడున్నూ మరోకన్ను చంద్రుడున్నూ అని పురాణాలు ఘోషిస్తున్నాయి. అయితే చంద్రుడు ఎడమకన్నేనని తేల్చిన మహాకవి 'లచ్చిరే నెడమకన్న'ని చంద్రుణ్ణి వర్ణించాడు. ఈ ఎడమకన్నుగారే 'రేపాలతి' – అంటే రాత్రి అనే స్త్రీకి భర్తకూడానట. అందుకని రేపాలతిమగం డన్నారు. ఆయన 27 నక్షత్రాలనే స్త్రీలకూ భర్తే కాబట్టి (దేవతల్లోనూ గొప్పవాళ్లలోనూ బహుభార్యాత్వ నిషేధశాసనానికి ప్రవృత్తిలేదు) చుక్కలదొర అయినాడు. చల్లగా వెలుగుతాడు కాబట్టి చలివెలుగన్నారు. ఆయన్ను చూడగానే కలవపూలు విచ్చుకుంటాయని 'చెంగలువ నెచ్చెలి' అన్ననోటితోనే, ఇంతకు ముందు చెప్పని 'తామరలగొంగ' (తామరలు ముడుచుకుంటాయని) తామరపూలకు శత్రువన్నారు మనవాళ్లు. ఇది కవిసమయం అంటారు. కవులకు సమయాసమయాల పట్టింపులేనట్లే కవిసమయాలక్కూడా తర్కబాధలేదు. వాస్తవంతో నిమిత్తమూ లేదు. అందుకే 'వెన్నెలగుత్తి' అనే చిత్రమయిన పేరుకూడా పెట్టారు చంద్రుడికి! ఇన్ని పేర్లలోనూ చందమామ, జాబిల్లి, చంద్రుడనేవాటికే వ్యవహారంలో వ్యాప్తి ఉంది.

సంస్కృత శబ్దాల్లో కూడా వర్ణనాత్మక నామధేయాలూ, మామూలు మాటలూ ఉన్నాయి. విడిమాటలని చెప్పదగిన పేర్లు 'చంద్రుడు, ఇందుడు, విధుడు, గ్లౌ' అనేవి. చివరిమాటను తెలుగుకవులుకూడా వ్యస్తంగా వాడినట్లులేదు. ఆనందకరుడనే అర్థంలో ఇందు శబ్దం వచ్చింది. కవుల వాడుకలో 'హిమాంశుడు, కుముదబాంధవుడు, సుధాంశుడు, సుధాకరుడు, శుభ్రాంశువు, ఓషధీశుడు, నిశాపతి, అబ్జుడు, జైవాతృకుడు, సోముడు, మృగాంకుడు, కలానిధి, ద్విజరాజు, శశధరుడు, నక్షత్రేశుడు, ఉడుపతి, క్షపాకరుడు' వగైరా చాలా పేర్లున్నాయి. చల్లని కిరణాలు కలవాడు కాబట్టి హిమాంశుడన్నారు. కలువపూలకు చుట్టం(!) కాబట్టి కుముదబాంధవుడు. సుధ – అంటే అమృతం–వంటి చల్లని కిరణాలున్నాయి కాబట్టి సుధాంశుడు. సుధా శబ్దానికి సున్నమనే అర్థంకూడా ఉంది కాని దాన్నిక్కడ చెప్పగూడదు. అమృతం (సుధను) తయారుచేస్తాడు కాబట్టి సుధాకరుడు. శుభ్రంగా తెల్లగా ఉండే కిరణాలు చిమ్ముతాడు కాబట్టి శుభ్రాంశువు. ఆయుర్వేదవైద్యులు వాడే మూలికలను (ఓషధులను) వెన్నెలరాత్రుల్లో సేకరిస్తే వాటి శక్తి బాగా ఉంటుందన్న నమ్మకముంది. ఆ మూలికలకు చంద్రుడే రాజట. అందుకని ఓషధీశు డన్నారు. నిశ అంటే రాత్రి. దానికి భర్త(!) కాబట్టి ఆయన నిశాపతి. ఇదేవిధంగా రజనీపతి, రజనీకాంతుడు వగైరా పేర్లూ పెట్టారు. ఆయన క్రమంగా పెరుగుతూ తరుగుతూ తన 'కళ'లు ప్రదర్శిస్తుంటాడు కాబట్టి కలానాథుడు, కలానిధి లాంటి పేర్లతో పిలుస్తారు. నక్షత్రాలకు భర్త కాబట్టి (దక్ష ప్రజాపతి తన 27గురు ఆడపిల్లలనూ – అశ్వని నుంచి రేవతి దాకా ఉన్నవాళ్లందర్నీ మూకుమ్మడిగా ఈయనకు కట్టబెట్టి కట్నాల సమస్యను తగ్గించుకున్నట్లుంది!) ఉడుపతి, నక్షత్రేశుడు అనే పేర్లు ఆయన నక్షత్రాలకు రాజో భర్తో అయినందువల్ల వచ్చినవి. ఆ మాటకు వస్తే ఆయనకు 'రాజు' అనే బిరుదనామం కూడా ఉంది.

ఇన్ని శుభలక్షణాలున్న చంద్రుడికి మచ్చలున్నాయి. అందుకే ఆయనకు మృగాంకుడు (లేడిలాగా కనిపించే మచ్చగలవాడు) అనే పేరు వచ్చింది. కొందరామచ్చను

కుందేలంటారు. అందు కాయనకు 'శశధరు'డనే పేరు పెట్టారు. ఓ కవి అది పుట్టుమచ్చ అన్నాట్ట. మరోకవి సముద్రంలో పుట్టాడు కాబట్టి అక్కడి బురద అంటుకొని అలా కనిపిస్తున్నా డన్నాడు. అది లేడి గుర్తేనన్నాడు మరొకడు. భూమి నీడపడి అలా మచ్చలాగా కనిపిస్తున్నదన్నాట్ట ఓ శాస్త్రవేత్త. అవేమీకాదు. ఆయన రాత్రిపూట గాఢాంధకారాన్నంతా తాగి కడుపులో నిల్వచేసుకొన్నందున అదలా వల్లగా మచ్చలాగా కనిపిస్తున్నదని మరో పెద్దకవి దబాయించాడు! మనం తెలుగువాళ్లం అక్కడో రేగుచెట్టున్నదని, దానికింద ఓ ముసలమ్మ ఉందని చెప్తుంటాం. అక్కడ రాళ్లూరప్పలూ గుంటలూ గోతులూ తప్ప మరేంలేవనీ, అది గ్రహంకాదనీ, భూమికి అదో ఉపగ్రహమనీ ఇప్పటి శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. ఎవరెన్నివిధాల చెప్పినా చంద్రగ్రహంవల్ల సముద్రంలో అలలూ మనుషుల్లో వెర్రీ ('ప్రేమపిచ్చి'తో సహా) పుట్టుకొస్తాయన్నది అనుభవం చెప్పే పాఠం.

సూర్యచంద్రులిద్దర్నీ కలిపి (ద్వివచనంలో) ఒకేమాటగా చెప్పే సంప్రదాయం సంస్కృత భాషలో ఉంది. మనభాషలో ఆ వచనమూ లేదు, ఆ పద్ధతీ లేదు.

సూర్యచంద్రుల తరువాత ఆకాశానికి శోభనిచ్చేవి నక్షత్రాలు. కాళిదాసు 'నక్షత్ర తారాగ్రహసంకుల'మైన ఆకాశాన్ని స్మరించాడు. అంటే ఈ మూడూ ఒక్కటి కాదన్నమాట. అశ్వని, భరణి వగైరా మనం పేర్కొనే ఇరవైయేడు నక్షత్రాలూ నిజానికి ఒంటిరిక్కలు కావు. కొన్ని చుక్కల సమూహమన్నమాట. నక్షత్రమండలమనేకన్నా వాటిని తారామండలా లనటమే నయం. మినుకుమినుకుమనే చుక్కలు తారలు. ఆ మినుకులేని చుక్కలు గ్రహాలు. అయితే మామూలు వ్యవహారంలోనే కాక జ్యోతిషంలో కూడా సూర్యచంద్రుల్ని గ్రహాలంటున్నాం. సూర్యుడో తార. చంద్రుడు ఉపగ్రహం; అంటే ఒక గ్రహం చుట్టూ తిరిగే మరో గోళం. గ్రహాలక్కూడా స్వయం ప్రకాశంలేదు. తారలు సొంతంగా వెలుగిస్తాయి. అలాంటివి కొన్ని కలిసినప్పుడు ఆగుంపునే నక్షత్రమంటున్నాం. రాహుకేతువులకు ఛాయాగ్రహాలనే పేరు పెట్టారు జ్యోతిషులు. అదే పేరు నిజానికి చంద్రుడిక్కూడా సరిపోతుంది. గ్రహాన్ని అచ్చతెలుగులో 'గాము' అంటారు, సంస్కృతపదాన్ని కొంత మార్చి.

పైన పేర్కొన్న సూక్ష్మభేదాలతో నిమిత్తం లేకుండా 'ఋక్షం, భం, తార, తారక, ఉడువు' అనే మాటలను నక్షత్రపర్యాయాలుగా పరిగణిస్తున్నారు. చిన్నతారను తారక అంటారు. భమ్మనే శబ్దానికి విడిగా వాడుకలేదు. 'ఉడుపతి, ఉడుగణం లాంటి సమాసాల్లోనే ఉడుశబ్దాన్ని తెలుగు కవులు ప్రయోగించారు – సర్వసాధారణంగా. ఋక్ష శబ్దానికి వేదప్రయోగాలెక్కువ. దాన్నుంచే 'రిక్క' అనే తెలుగు మాట పుట్టింది. 'చుక్క' అన్నదొక్కటే అసలుసిసలు తెలుగుమాట. ఋక్ష శబ్దానికి ఎలుగ్గొడ్డు అనే అర్థవిశేషం కూడా ఉంది. బహుశా ఇంగ్లీషు వాళ్లు 'గ్రేట్ బేర్' అనిపిలిచే సప్తర్షి మండలాన్ని బట్టి అదే అర్థంగల ఋక్షశబ్దం ఆర్యసంస్కృతిలో నక్షత్రపర్యాయంగా నిలిచి వుండవచ్చు. చుక్కశబ్దానికి 'బొట్టు' అనే అర్థం కూడా ఉంది తెలుగులో. అయితే 'చక్కనిచుక్క'లోని చుక్కకున్న ప్రత్యేకార్థాన్ని ఎలా చెప్పాలో తెలీటంలేదు!

సూర్యచంద్రులకూ నక్షత్రతారకలకూ కిరణాలున్నాయి. సూర్యుణ్ణి సహస్ర కిరణుడంటారని కూడా ఇంతకుముందు ప్రస్తావించాం. కిరణం, మెరుపు, వెలుగు

అనేవాటికి చాలా దగ్గరి సంబంధాలున్నందువల్ల వాటి వాటి పర్యాయపదాల్లో కొన్ని సమానంగా ఉంటాయి. అయినా ఆయాపదాల పర్యాయపదాలను స్మరిద్దాం విడివిడిగా.

కిరణ శబ్దానికి సంస్కృతంలో 'ఉస్రం, మయూఖం, అంశువు, గభస్తి, ఘృణి, ధృష్ణి, వృష్ణి, భానువు, కరం, మరీచి, దీధితి, ప్రభ, రుక్కు, రుచి, త్విట్టు, భా, భవి, ద్యుతి, దీప్తి, రోచి(స్సు), శోచిస్సు' వగైరా పర్యాయపదాలున్నాయి. వీటిలోని భా శబ్దానికి తెలుగులో విడిగా ప్రయోగంలేదు. భానువు దీని రూపాంతరం. ఇవి ఉన్నవాడు కాబట్టే సూర్యుణ్ణి 'భానుమూర్తి, భానుమంతుడు' మొదలైన పేర్లతో పిలుస్తారు. కిరణాలు మనచేతుల వంటివని కర శబ్దంతో వ్యవహరించటం కద్దు. ఆ దృష్టితోనే వేడిగా ఉండే సూర్యుణ్ణి 'ఖరకరుడు' (తీక్షమయిన చేతులు/కిరణాలు కలవాడు) అని వ్యవహరిస్తున్నారు. అంశువంటే మినుకు/వెలుగు. దీన్నే కిరణంతో సమానంగా భావిస్తున్నారు. ప్రభా శబ్దానికి ప్రకాశమనే అర్థం కూడా ఉంది. ప్రకాశం/వెలుగు ఇచ్చేది కాబట్టే కిరణాన్ని ప్రభ అంటున్నారు. ఘృణి, ధృష్ణి, రుక్కు, త్విట్టు శబ్దాలకు సమాసాల్లో తప్ప తెలుగులో ప్రయోగాలు దొరకటం కష్టం. సంస్కృతంలోనయినా వీటికి పర్యాప్తప్రయోగాలులేవు. మరీచి, గభస్తి, శోచిస్సు అనేవి కేవలం కావ్యప్రయోగబాహుళ్యం కలవి. భవి, ద్యుతి, దీప్తి, రోచి(స్సు) కిరణార్థంలో ఎక్కువ వ్యాప్తికల మాటలు. ద్యుతికి ప్రకాశమని, దీప్తికి అధికప్రకాశమని, భవికి వెలుగనీ అర్థవిశేషాలున్నాయి.

'మినుకు, తళుకు, నిగ్గు, మించు, కళుకు' అనేవి కిరణార్థంలోవాడే తెలుగుమాటలు. ఇవన్నీ వెలుగు, ప్రకాశం, తళతళ వంటి అర్థాలిచ్చే మాటలే. తళుకుతోబాటు అదే అర్థంగల మరోమాట బెళుకును కలిపి వాడుతుంటాం. బెళుకు కన్నడం నుంచి వచ్చిన ఎరువుమాట అని కొందరంటారు. సిగ్గు బిడియం లాంటి జంటపదంగా వీటిని వాడుతుంటాం. బెళుకు శబ్దం తెలుపు, తెల్లదనం, వెల్లదనం వంటి అర్థాలు కూడా ఉన్నమాట. తెలుపు, వెలుగులాంటి శబ్దాల పరస్పర సంబంధం గురించి తరవాత ఆలోచిద్దాం. నిగ్గు శబ్దానికి సారం, మెరుగులాంటి అర్థ విశేషాలు కూడా ఉన్నాయి. మించు శబ్దానికి కూడా తెల్లదనం, వెలుగులాంటి అర్థాలు కూడా ఉన్నాయి.

## వెలుగు చీకట్లు

సూర్యచంద్రుల వల్ల వెలుగువస్తుంది. అది లేనప్పుడు చీకటి ఉంటుంది. వెలుగుకు తెలుపుతో, చీకటికి నలుపుతో దగ్గరి సంబంధముంది. మొదట కిరణాల వల్ల వచ్చే వెలుగుమా దానికి దగ్గరయిన తెలుపును గురించీ తెలుసుకుందాం. 'శోభ, కాంతి, కాశం, ప్రకాశం, సుషమ, ద్యుతి, భవి' లాంటి పదాలు వెలుగుకు పర్యాయాలైన సంస్కృతశబ్దాలు. శోభా శబ్దానికి 'చక్కదనం, మంచి' మొదలైన అర్థవిశేషాలు కూడా ఉన్నాయి. కాంతి అనేది సర్వసాధారణ పదం. ద్యుతి, భవి

అనేవి కిరణ శబ్దానిక్కూడా పర్యాయపదాలని ఇంతకుముందే గమనించాం. కళ్లు జిగేలుమనిపించే వెలుగును 'సుషమ' అంటారు. దీనికి సరైన అచ్చతెలుగుమాట 'జిగ్గు'.

అచ్చతెలుగులో 'కాంతి'కి పర్యాయాలుగా 'వెలుగు, వెలుతురు, జోతి, జిగ్గు, నిగ్గు, డాలు, మినుకు, మిన్కు, మిస, మించు, నిగ, తళుకు, తళ్కు, మెరుగు, మెరుపు, చికిలి, కళుకు, రంగు' లాంటివి చాలా ఉన్నాయి. వెలుగు వెలుతురులు రూపాంతరాలని చెప్పవచ్చు. జోతి అనేది సంస్కృతంలోని 'జ్యోతి' నుంచి పుట్టినమాట. జిగ్గునిగ్గులను కలిపి జంటమాటగా అల్లసాని పెద్దన వాడాడు. నిగ్గు, మినుకు, తళుకు, కళుకు, శబ్దాలకు కిరణమనే అర్థముందని ఇంతకు ముందే గుర్తించాం. తళుకు, తళ్కు, మినుకు, మిన్కులు రూపాంతరాలు. మెరుగు, నిగ్గులకు తళతళ అనే అర్థం కూడా ఉంది. నిగ శబ్దం నిగ్గు శబ్దానికి దగ్గరిమాట. 'నిగనిగలాడు' అనేమాటలో దీనికి ప్రయోగం ఎక్కువ. మెరపు శబ్దానికీ మెరుపు/మెరుము శబ్దానికీ చాలా దగ్గరి సంబంధముంది. మెరుపులాగా చప్పున జిగేలుమనేట్లు వెలగటాన్ని ఈ పదం సూచిస్తుంది. డాలు, రంగులకు 'వన్నె' అనే అర్థవిశేషముంది. చికిలి శబ్దానికి 'పదును' అనే అర్థం కూడా కనిపిస్తుంది – 'చిరుసానపట్టించి చికిలి సేయించిన గండ్రగొడ్డలి నిశాగహనలతకు'లాంటి శ్రీనాథ ప్రయోగాల్లో.

తెలుపునూ తెల్లదనాన్నీ సూచించే సంస్కృతశబ్దాలు చాలావున్నాయి – 'శుక్లం, శుభ్రం, శుచి, శ్వేతం, విశదం, పాండురం, అవదాతం, సితం, గౌరం, వలక్షం, అవలక్షం, ధవళం, అర్జునం' వంటివి. శుక్లపక్షం, శుక్లాంబరధరం... లాంటి సమాసాల్లో వినిపించే శుక్ల శబ్దానికి తెలుపనే అర్థం. కళ్ళమీద వచ్చే తెల్లపొరలను కూడా శుక్లా లంటారు. శుభ్ర శబ్దానికి 'మలినంలేని'దనే అర్థవిశేషం కూడా ఉంది. అలాగే శుచి శబ్దానికి కూడా. శుచికి 'మడి' అనే అర్థమూ ఉంది. శుచీశుభ్రమని రెంటినీ జంటగా వాడే సందర్భాలెన్నో. శ్వేతం, పాండురం అనేవాటికి తెలుపనే అర్థంతోబాటు కొన్నిరకాల జబ్బుల పేర్లకు కూడా సంబంధించినవి. అవదాతం అంటే మంచి తెలుపు – తెల్లటి తెలుపన్నమాట. వలక్షం, అవలక్షం రూపాంతరాలు. వీటికి గ్రంథాల్లోనే వ్యాప్తి. ధవళం తెల్లదనానికేకాక ఒకరకం పాటక్కూడా పేరు. అర్జునానికి తెలుపు, తెల్లమద్ది (చెట్టు) వగైరా అర్థాలున్నాయి. అయితే విజయవిలాసంలో మరికొన్ని తెలుగు కావ్యాల్లో పాండవుడైన అర్జునుడు నల్లటివాడనే వర్ణనలున్నాయి! పైమాటల్లోని శుక్లం, శ్వేతం, సితం అనేవాటికి వాడుక ఎక్కువ.

'తెలి, తెల్లని, తెల్ల, తెలుపు, వెలి, వెల్ల, వెల్లన' అనేవి అచ్చతెలుగు మాటలు. ఇన్నింటిలోనూ ప్రాతిపదికగా ఉన్నవి 'తెల్, వెల్' అనే భాగాలే. తెల్లం వంటి మాటలకున్న 'స్పష్టత' అనే అర్థం విశేషం తెలి రూపాంతరాలకూ, వెలుతురు, వెలుగు మొదలైన మాటలకున్న 'ప్రకాశం, కాంతి' అనే ప్రత్యేకార్థం వెలిరూపాంతరాలకూ ఉన్నాయి. మరీ స్వచ్ఛతనో స్పష్టతనో చెప్పాలంటే తెల్లటి తెలుపు వంటి పదబంధాలను ప్రయోగిస్తాం. అలాంటి ప్రయోగం వెలి రూపాంతరాల విషయంలో కనిపించదు. వెల్లకు 'సున్నం' అనే అర్థం కూడా ప్రాంతీయంగా ఉంది.

ఇక చీకటి సంగతికి వద్దాం. 'అంధకారం, ధ్వాంతం, తమిస్రం, తిమిరం, తమస్సు' అనేవి చీకటికి పర్యాయపదాలయిన సంస్కృత శబ్దాలు. అంధ శబ్దానికి 'గుడ్డి'

అనే అర్థముంది. గుడ్డితనం లాంటి అశక్తతను కల్పించేది కాబట్టి అంధకారమనే మాట పుట్టింది. ధ్వాంత శబ్దానికి ధ్మాంతమనే రూపాంతరముంది. వాడుక తక్కువ. తమిస్రం, తమస్సు అనేవి దగ్గరి మాటలు. తమశ్శబ్దానికి దురహంకారం, దుర్లక్షణంవంటి అర్థాంతరాలున్నాయి. చెడుకు చీకటిని సంకేతంగా భావించే ఆచారముంది. మరీ దట్టమయిన చీకటిని అంధతమస మంటారు. దీనికి సరైన తెలుగు మాటలు 'చిమ్మ చీకటి, కటిక చీకటి' అనేవి. గాఢాంధకారమనే దీని సంస్కృత పర్యాయపదానికే తెలుగులో వాడుక ఎక్కువ. చీకటి బాగా వ్యాపిస్తే దాన్ని సంతమసమంటారు సంస్కృతంలో. చీకటి అంతగా లేకపోతే అవతమసమంటారు సంస్కృతంలో. దీనికి సరైన తెలుగు మాటలు 'గుడ్డి చీకటి, మసక చీకటి, ముని చీకటి, మురి చీకటి' వగైరాలు. తెలుగుమాటలు రెండే వినిపిస్తాయి – చీకటి, ఇరులు అనేవి. ఇరులు శబ్దం పూర్వకావ్యాల్లో మాత్రమే కనిపిస్తుంది – వినిపిస్తుంది. దీనికి 'ఇనుము, రేయి' వంటి మాటలకూ సంబంధముందంటారు వ్యుత్పత్తిశాస్త్రజ్ఞులు. ఇనుము శబ్దానికి ఈ కాలంలో చీకటి అనే అర్థంలేదుగాని, నల్లగొడ్లను, 'ఇనుప సామాను, ఇనపగొడ్లు, ఎనుము' వగైరా పేర్లతో ప్రాంతీయంగా వ్యవహరించే సందర్భాల్లో 'నలుపు, చీకటి' అనే అర్థాలే ఉన్న తెలుగుమాట. 'చీకువాలు' అనే మాట ఒకటి మాత్రం ఈ అర్థంలో పాత పుస్తకాల్లో కనిపిస్తుంది. ఒకప్పుడు చీకటి శబ్దంలోని మొదటిరెండు అక్షరాల మధ్య అరసున్నా ఉందని కొందరూ లేదని కొందరూ పోరాడుకున్నారు! మరికొందరు ఉన్నా చీకట్లో కనిపించదని అసలు విషయం దాటవేశారు!

చీకట్లో నుంచి బయటపడ్డా నలుపు తప్పేటట్లు లేదు – ఈ రెంటినీ కలిపి మాట్లాడుకుందా మనుకున్నాం కాబట్టి. సంస్కృతంలో 'కృష్ణం, నీలం, అసితం, శ్యామం, కాలం, శ్యామలం, మేచకం' వంటి పదాలున్నాయి నలుపనే అర్థంలో. కృష్ణశబ్దానికి 'ఆకర్షించేది' అనే అర్థవిశేషం కూడా ఉంది. ఆ అర్థంలోనే కృష్ణ (ద్రౌపది), కృష్ణుడు వగైరా మాటలు పుట్టాయి. పూర్వకాలపు ఆర్యులంతా తెల్లటివాళ్ళు కాబట్టి వాళ్ళకి నలుపే ఆకర్షణకరంగా ఉండేమో తెలీదు. తెల్లవాళ్ళకు నీగ్రోల మీద ఇందుకే మోజని చెప్పేవాళ్ళున్నారు! నీలం, నీలిమ అనేవి పూర్తి నలుపు కావనీ ఇంగ్లీషులోని 'బ్లూ'తో సమానమనీ వాదించే వాళ్ళూ లేకపోలేదు. అసిత మనేదానికి 'తెలుపు' కానిదని అర్థం. శ్యామం, శ్యామలం అనేవి నలు పనరాదనీ తెలుగులోని 'చామనచాయ'కు సమానమనీ చెప్పాలి. ఇంగ్లీషులోని 'Gray/Grey' శబ్దాన్నీ తెలుగులోని 'చామనచాయ'నూ నిర్వచించటం సాధ్యమా అనేది ప్రశ్న.

అచ్చతెలుగులోని 'కర, కరి, క్రి, కారియ, కరియ, నల్ల, నల్లన, నలుపు, నల్పు, కప్పు, కందు' అనేవి నల్లదాన్ని సూచించే మాటలని నిఘంటువులు పేర్కొంటున్నాయి. 'కర' నుంచి 'కరియ' దాకా ఉన్న మాటలన్నీ ఒకదానికొకటి పర్యాయపదమనే చెప్పాలి. అర్జునుణ్ణి (తెల్లటి వాణ్ణి!) తెలుగులో 'క్రి' అనికూడా కవులు వ్యవహరించారు. 'క్రి విక్రమంబు కాళ్ళ గ్రు' వంటి ప్రయోగాలు ఇందుకు నిదర్శనాలు. ఇంకా అక్కడక్కడ నల్లావును 'క్ర్రా' ' అని పిలవటం కద్దు. కారియ శబ్దానికి 'కష్టం' అనే అర్థం కూడా ఉంది. నల్ల అనేదానికి 'నెత్తురు' అనే అర్థమెందుకు వచ్చిందో చెప్పలేం. ఈ కాలంలో నల్ల శబ్దం విశేషణమే గాని నన్నయకాలంలో దానికి

విశేష్యంగా/నామవాచకంగాకూడా వాడుక ఉండేది. 'ఉల్ల జవనాశ్వపుం దోక నల్ల చూడు' మనే ప్రసంగం కద్రూ వినతల పందెం సందర్భంలో నన్నయభారతంలో కనిపిస్తుంది. కందు, కప్పు శబ్దాలకు 'మచ్చ' అనే అర్థవిశేషంగా కూడా ఉంది. ఇక మరీ నల్లగా ఉన్నవాటిని చెప్పేటప్పుడు 'నల్లటి నలుపు, కారునలుపు' అంటుంటాం. 'కారుమబ్బు'ల వంటి పదబంధాల్లో కూడా కారు శబ్దానికి 'చిక్కని, ఎక్కువ' అనే విశేషణార్థా లున్నాయి.

## మబ్బులు: రంగులు

రంగు లనగానే – తెలుగు నలుపులు కూడా రంగులే కాబట్టి – ఒక విషయం గుర్తుకు వస్తుంది. ఒక్కో భాషలో కొన్నిరంగులు పేర్లు మాత్రమే ప్రాథమికంగా ఉంటాయి. తెలుగువాళ్ళం 'నలుపు, తెలుపు, ఎరుపు, పసుపు' అనే నాలుగు రంగుల్ని మాత్రమే వివక్షిస్తాం. పసుపు అనేది 'పసుప్పచ్చ' కావచ్చు – 'ఆకుపచ్చ' కావచ్చు. తక్కిన రంగులపేర్లను ఎరువుమాటలతోగాని (ఉదా. నీలి), పదబంధాల్తోగాని (ఉదా. కావిరంగు, వంగరంగు, పుల్ల ఎరుపు వగైరా) సూచిస్తాం.

ఆకాశంలో రకరకాల రూపాలతో కనిపించేవాటిలో ప్రధానమైనవి మబ్బులు. 'మొయిలు/మొగులు' అనే రూపాంతరాలు 'మబ్బు'కు పర్యాయపదాలు. ఇవి తెలుగుమాటలు. మొయిలు శబ్దానికి కావ్య ప్రయోగమేగాని జనవ్యవహారంలో ఈ కాలంలో వాడుకఉన్నట్లు తెలియదు. మబ్బు అనేమాటకు 'మసక, మాంద్యం' అనే అర్థవిశేషాలు ముఖ్యంగా తెలంగాణా వ్యవహారంలో వినిపిస్తాయి. 'మత్తు' అనే అర్థవిశేషం కోస్తావారి వాడుకలోవుంది. సూర్యరశ్మికి అడ్డుపడి మసకచీకట్లు వ్యాపింపచేస్తాయి కాబట్టి, మబ్బు పట్టినప్పుడు కొంత మాంద్యం వస్తుంది కాబట్టి ఈ వ్యావహారికార్థాలు సకారణంగానే వచ్చాయని చెప్పాలి. సంస్కృతంలో చాలా మాటలున్నాయి ఈ అర్థంలో.

'అభ్రం, మేఘం, వారివాహం, బలాహకం, ధారాధరం, జలధరం, తటిత్వంతం, వారిదం, జలదం, అంబుభృత్తు, ఘనం, జీమూతం, ముదిరం, జలముక్కు, ధూమయోని, స్తనయిత్నువు'లాంటివి మబ్బుకు పర్యాయపదాలని చెప్పదగిన సంస్కృత పదాలు. వీటన్నిటిలో మేఘమన్నదే అత్యంత వ్యాప్తిలో (తెలుగులో కూడా) ఉన్న పదం. అభ్ర శబ్దానికి ఆకాశమనే అర్థంలో కూడా ఉంది. ఘనమంటే 'గట్టిది, గడ్డకట్టినది'. ముదిర శబ్దానికి విస్పష్టార్థమేదో తెలీదు. పైన పేర్కొన్నవాటిలో ఈ మూడు శబ్దాలే ప్రాథమికాలు. తక్కినవన్నీ వర్ణనాత్మకాలు.

వారి అంటే నీరు. వాహం అంటే మోసేది. నీటిని మోసేది కాబట్టి వారివాహ మన్నారు. ధార అంటే నీటి బిందువుల గుంపు. వాటిని ధరించేది కాబట్టి – మోసేది కాబట్టి – ధారాధర మనే పేరుపెట్టారు. జలధరం అనేది కూడా అటువంటిమాటే. తటిత్తంటే మెరుపు. తటిత్వంతమంటే మెరుపులున్నది.

నిజానికి మెరుపులతో కూడిన మబ్బునే ఈ పేరుతో పిలవాలి. వారిదం అంటే నీటినిచ్చేది. వానకురవని మబ్బు నీపేరుతో పిలవటం అన్యాయం. అంబుభృత్తంటే నీటిని భరించేది. వానమబ్బులనే ఈలా పిలవటం సమంజసం. జీమూత శబ్ద వ్యుత్పత్తి తెలీదు. అలాగే ముదిరం విషయంలోనూ. జలముక్ శబ్దానికి నీటిని వదిలేది అని అర్థం. ధూమయోని అనే పేరెవరు పెట్టారో తెలీదుగాని అచ్చం గిరీశం పట్టులో నామకరణం చేశారని చెప్పాలి. ధూమం అంటే పొగ. దానికి ఆధారం/మూలం అయినది ధూమయోని. లేదా ధూమం పుట్టడానికి కారణమయింది ధూమయోని. పొగపైకిలేచి మబ్బయి వానకురుస్తుందని కదా గిరీశం పరిశోధించి కనుక్కొన్నది! స్తనయిత్నువు అనేది తమాషామాట. ఎవరో కవి సృష్టించిన మాట అయివుండాలి. స్తనమంటే చన్ను. చన్నుగలది అని స్తనయిత్ను శబ్దానికర్థం. అంటే తల్లిపాలు చేపినట్లు – బహుశా ముసురువాన – కురిపించేదని అర్థం కావచ్చు. రకరకాల మబ్బులు గుంపులు కట్టివుంటే దాన్ని 'కాదంబిని' అంటారు. దాన్నే 'మేఘమాల' అంటారు. ఎప్పుడయినా తెల్లమబ్బులుగాని పీచు మబ్బులుగాని ఆకాశంలో చిన్న చిన్న ముక్కలుగా కనిపిస్తే వాటిని 'అగడప'లంటారు తెలుగులో. దానికి సరయిన సంస్కృత పర్యాయపదమేమో తెలీదు. ఎవరైనా చెప్తే బాగుండు.

మబ్బులున్నప్పుడు మెరుపులు కూడా కొన్ని సమయాల్లోనయినా కనిపిస్తాయి. కొందరు మెరుపును 'మెరుము, మెరుగు' అనికూడా పిలుస్తారు. తెలుగు నిఘంటువులు 'మించు, డాలు' శబ్దాలు మెరుపు శబ్దానికి పర్యాయపదాలని చెప్తున్నాయి. కళ్లు చెదిరేట్లు మెరిసిన మెరుపును 'మిరిమిడి' అంటారు. 'మిరుమిట్లు' అన్నమాటకూ ఈ శబ్దానికీ దగ్గరి సంబంధ ముందనిపించటంలేదా? మించు, డాలు అనేది వెలుతురుకూ వెలుగుకూ కూడా పర్యాయపదాలే. అంటే ఈ మాటకిదే పర్యాయపదమని నిష్కర్షగా విభజించి చెప్పటం అన్ని సందర్భాల్లోనూ సాధ్యంకాదని గుర్తించాలి. 'గురికి బెత్తెడు ఎడంగా' మాత్రమే చెప్పగలం. అందుకే ఖచ్చితంగా చెప్పాలంటే ఏ మాటా మరోమాటకు అన్నివిధాలా పర్యాయపదం కాదని భాషాశాస్త్రజ్ఞులంటారు.

మెరుపు శబ్దానికి పర్యాయపదాలని చెప్పే సంస్కృతపదాలు చాలా ఉన్నాయి. 'శంప, సంప, శతహ్రద, హ్రాదిని, ఐరావతి, క్షణప్రభ, తటిత్తు, విద్యుత్తు, చంచల, చపల, సౌదామని, సౌదామిని' అనేవి అలాంటివే. శంపా/సంపా శబ్దాల వ్యుత్పత్తి విస్పష్టంగా చెప్పలేంగాని అవే సంస్కృత భాషలోని ప్రాథమిక శబ్దాలనీ అవి ఒకదానికొకటి రూపాంతరమనీ బల్లగుద్ది చెప్పవచ్చు. తక్కినవన్నీ వర్ణనాత్మక శబ్దాలు. శతహ్రద అంటే నూరు (శత) గుంటలు మెలికలు (హ్రదాలు) కలదని అర్థం. (నూరు/చాలా) మెలికలు తిరుగుతుంటుంది కాబట్టి మెరుపును ఆ పేరుతో పిలిచారు. హ్రాదిని అంటే భయం పుట్టించేది. ఈ శబ్దానికి 'పిడుగు' అనే అర్థం కూడా ఉంది. అంటే ఈ పేర్లు పెట్టినవాళ్ళు ఎవరయినాగాని పిడుగుకూ మెరుపు అనే దానికీ సంబంధముందని గ్రహించారని చెప్పాలి. కాంతివేగంకన్నా ధ్వనివేగం తక్కువకాబట్టి మెరుపు మెరిసిన చాలా సమయం తరువాత పిడుగులు పడ్తాయని వాళ్లక్కూడా తెలుసనుకొంటే 'అన్నీ వేదాల్లో ఉన్నాయిష' అని సంతోషించటంతో తప్పలేదు. ఐరావతి అనేది పురాణైతిహ్యంతో ముడిపడ్డది. ఇంద్రుడెక్కే తెల్ల ఏనుగు పేరు ఐరావతమని గుర్తుంటే తక్కిన విషయం ఊహించటం తేలికే!

క్షణప్రభ అంటే కొద్దికాలం మాత్రం వెలిగిపోయేది. మెరుపు స్వభావాన్ని సూచించేమాట ఇది. ప్రభా శబ్దానికి కాంతి, వెలుగు అనే అర్థాలున్నాయని ఇంతకుముందే గమనించాం కదూ! తటిత్, విద్యుత్ అనే శబ్దాల్లోని చివరిభాగాలు తొందరపాటున సూచిస్తాయి. ద్యుత్ – అంటే వెలుగు, తొందర. చాలా తొందరగా వెలిగి ఆరిపోయేది కాబట్టి విద్యుత్తు అనే పేరువచ్చింది. ఇంగ్లీషులోని 'ఎలక్ట్రిసిటీ'కి పర్యాయంగా ప్రస్తుతం 'విద్యుత్' శబ్దం వాడుతున్నాం కాబట్టి మనవాళ్లు చాలా వేల సంవత్సరాల క్రితమే దాన్ని కనిపెట్టారంటే చరిత్ర అంగీకరించదనటంకన్నా చేయగలిగిందేమీ లేదు. దీనికి పర్యాయపదంగా వాడుతున్న 'కరెంటు' (ప్రవాహమని అర్థం) అనే ఇంగ్లీషు మాటకు్కాడా 'ఎలెక్ట్రిసిటీ' అనే అర్థం లేదు పూర్వం! చంచల అంటే స్థిరంగా ఉండనిది. చపల అంటే స్థిమితంగా ఉండనిది. ఈ రెండు పేర్లూ అటుమెరుపు అనే అర్థంలోనూ ఇటు 'లక్ష్మి/సంపద' అనే అర్థంలోనూ వాడుకలో ఉండటమే విశేషం. డబ్బున్నప్పుడు వెలిగి ఆ తరవాత ఆరిపోతారనే భావం రెంటికీ సమంగా ఉంది – 'వెలుగు' అనే అర్థవిశేషం వల్ల! సౌదామనీ, సౌదామినీ శబ్దాలు రూపాంతరాలు. వీటిని 'సుదామ' శబ్దంనుంచి కూడా సాధించవచ్చు. ఆకాశానికి కాకపోతే మబ్బులకయినా ఇవి హారాల/దండల వంటి వన్నమాట.

ప్రకృతిలో రాత్రింబవళ్లకు నలుపుతెలుపులు ప్రతీకలయినా దానిశోభకు రంగులే నిదర్శనాలు. ఈనాటి శాస్త్రజ్ఞులుచెప్పే సప్తవర్ణప్రణాళికనూ సూర్యుడి సప్తాశ్వవర్ణాలనూ సమన్వయించేవాళ్లున్నారు. కాంతితరంగాల దైర్ఘ్యంలోని మార్పులే రకరకాలరంగులు భాసించటానికి కారణమంటారు. మన అనుభవంలో కంటికి కనిపించే వింతరంగులన్నిటికీ పేర్లులేవు – అంటే పేర్లు పెట్టలేక పోతున్నామన్నమాట – కవితా భాషలో కూడా. మరో విశేషం ప్రాథమికవర్ణాలు ఒక్కోభాషకు ఒక్కోజాతికి ఒక్కోవిధంగా కనిపించటం. ఇంకో ప్రత్యేకత స్త్రీలు గుర్తించగలన్ని ఛాయాభేదాలను పురుషపుంగవులు గమనించలేకపోవటం. మరో విశిష్టత ఒకే విద్యూరపు వన్నెను నలుగురు నాలుగురకాల పేర్లతో పిలవటం. ఈ విచిత్రాలనిక్కడ చర్చించలేంగాని కొన్ని 'ప్రధాన' వర్ణాల పర్యాయపదాలను తెలుసుకొనిగాని సంధ్యాశోభవంటి అద్భుతాలను గమనించలేం.

జంతువులనూ మానవులనూ సమంగా ఆకర్షించే వన్నె ఎరుపు. కుక్కలు ఈ రంగునే సరిగా గుర్తించగలవంటారు. పశువు లీవన్నెను చూసి బెదురుతాయంటారు. కానీ ఎందుచేతనో ఎరుపువన్నెకూ చక్కదనానికీ లంకెఉంది – చాలాభాషల్లో. మాటవరసకు తెలుగులోనే 'చెన్ను' శబ్దానికి విడిగా చక్కదనమనే అర్థం; సమాసంలో 'ఎరుపు' (ఉదాహరణకు 'చెందొవ' అంటే ఎర్రగలువ). సంస్కృతంలో 'లోహితం, రోహితం, రక్త'మనేవి ఎరుపనే అర్థమిచ్చే పర్యాయపదాలు. రక్త శబ్దానికి నెత్తురనే అర్థవిశేషం కూడా ఉంది. మరోమాట 'శోణం'. దీనికి ఎర్రకలువరంగు అనేది విస్పష్టార్థం. శోణితం అంటే రక్తం అనే అర్థం. సంస్కృతంలో అరుణం అంటే ముదురెరుపురంగు. అలా ఎర్రగాఉన్న సూర్యుణ్ణే అరుణుడంటారు. తెలుపూ ఎరుపూ కలిసిన రంగును పాటల మంటారు. పసుపూ ఎరుపూ రంగులు

కలిసిఉంటే 'తామ్రం, నిపీతరక్తం, పింజరం' అనే పేర్లతో పిలుస్తారు. నలుపూ ఎరుపూ కలిసిన 'ఊదా' రంగును సంస్కృతంలో 'నీలలోహిత'మనే సమాసంలో చెప్పాల్సిందే.

తెలుగులో ఎరుపు, ఎర్రని అనేమాటలకు 'కెంజాయ, కెంపు, తొగరు, తొవరు' అనే పర్యాయ పదాలున్నాయి. కెంపుచాయనే కెంజాయ అనే చిన్నిసమాసంలో మలుచుకున్నాం. తొగ/తొగరు అనే మాటలకు కలువపూవనే అర్థముంది. వాటి చివరి 'రు' ఏదో ప్రత్యయమన్నమాట (పొద–పొదరు అనే జంటలోలాగ). కెంపురంగని సమాసంగా కూడా వ్యవహరిస్తాం. అంటే ఎరుపు శబ్దమొక్కటే తెలుగులో ప్రాథమికమైన ఆ రంగుపేరని చెప్పాలి.

పసుపురంగు తెలుగులో 'పసుపుపచ్చ, ఆకుపచ్చ' అనే రెండు వన్నెలకూ సాధారణమైన మాట అని ఇంతకుముందే గుర్తించాం. పసుపుపచ్చకు మరో పర్యాయపదం పుస్తకాల్లో కనిపించేమాట 'అలిది'. దానికి 'హలిది' అనే రూపాంతరం కూడా ఉంది. ఇది 'హరిద్రా' అనే సంస్కృతశబ్దభవమని కొందరంటారు. సంస్కృతంలోని 'పీతం, గౌరం' అనే శబ్దాలు పర్యాయపదాలంటారు నిఘంటుకారులు. అయితే గౌరశబ్దానికి తెలుపనే అర్థంకూడా ఉందని ఇంతకు పూర్వం గమనించాం. అంటే పీతమొక్కటే ఆ భాషలో మౌలికపద మన్నమాట. హరిద్ర అంటే పసుపుకొమ్ము కూడా.

ఆకుపచ్చ తెలుగులో సమాసం. 'పైరు' శబ్దమూ పచ్చ శబ్దమూ ఒకప్పుడు ఒకేమాటగా ఉండేవంటారు. దీన్నే 'పసరుచాయ' అనే సమాసంతో కూడా వ్యక్తీకరిస్తాం. సంస్కృతంలోని 'ఫలాశం/పాలాశం, హరిత'మనేవి ఇందుకు పర్యాయపదాలు. పలాశ శబ్దానికి 'ఆకు' అనే అర్థంకూడా ఉంది. కాబట్టే 'హరిత'మొక్కటే ఆ భాషలో మౌలికపదం. సూర్యుణ్ణి హరిదశ్వుడంటారు. ఆయన గుర్రాలు ఆకుపచ్చగా ఉంటాయట!

నలుపుపాలు ఎక్కువగా ఉన్న ఎరుపుతో కూడిన రంగును సంస్కృతంలో 'ధూమ్రం, ధూమలం' అంటారు. తెలుగులో 'బూడిదరం'గంటాం. ధూమ శబ్దానికి 'పొగ' అనే అర్థముంది. పొగరం గన్నమాట. గోధుమరంగును సంస్కృతంలో 'శ్యావ' మంటారు. కపిశ మనేది మరోపేరు. కపి అంటే కోతి. కోతి రంగువంటిదని కపిశ శబ్దాని కర్థం. 'గోరోజనం' రంగును – అంటే తెలుగులో చెప్తే 'పుల్లావు' రంగును సంస్కృతంలో 'కడారం, కపిలం, పింగలం, పిశంగం, కద్రువు, పింగం' అనే పేర్లతో పిలుస్తారు. కపిల అంటే పుల్లావుకూడా. నన్నయ 'కపిల' అనిదాన్ని తెలుగుచేసినట్లుంది. వ్యాసుడి గడ్డమూ కళ్ళూ జుట్టూ కవిలవన్నెలో ఉన్నాయని నన్నయ వర్ణించాడు. ఊహించండి ఆకారాన్ని!

రకరకాల రంగులు కలిపివుంటే అచ్చతెలుగులో ఒక్కమాటలో చెప్పలేం – వన్నెల, వన్నెచిన్నెల, రంగురంగుల అని తప్ప. సంస్కృతంలో 'చిత్రం, కిర్మీరం, కల్మాషం, శబలం, ఏతం, కర్బురం' అనేమాటల్లో ఏదైనా వాడవచ్చు. ఈ అర్థంలో చిత్రశబ్దానికి ఆశ్చర్యకరంలాంటి అర్థాంతరాలున్నాయి. కల్మాషం అంటే 'కలగాపులగం,

మలినం' అనే అర్థభేదా లున్నాయి. కర్బుర శబ్దాన్ని కాళిదాసు 'కపోత కర్బుర'మనే సమాసంలో వాడి కాలిన మన్మథుడి బూడిదను వర్ణించాడు! కిర్మీరమంటేనే రంగురంగులయినా 'చిత్రవర్ణకిర్మీరిత'మని రాసిన కవులున్నారు!

ఇంతకూ 'VIBGYOR' అనే ఏడురంగులకూ సంస్కృతాంధ్రాల్లో మౌలిక పదాలులేవు! వయొలెట్టును 'ఊదా' రంగని, ఇండిగోను 'నీలి' రంగని, బ్రౌన్‌ను 'గోధుమరంగని', గ్రీన్ను 'ఆకుపచ్చ' అనీ, ఎల్లోను 'పసుప్పచ్చ' అనీ, ఆరంజిని 'నారింజ' రంగని, రెడ్‌ను 'ఎరుప'నీ పిలుస్తున్నాం – గురికిబెత్తెడు ఎడంగా సరిపెట్టుకొని. చేనేత, వాస్తుపదకోశాల్లో చూస్తే ఒకే 'వన్నె'ను భిన్నప్రాంతాల్లో రకరకాల పేర్లతో పిలుస్తున్నారనీ, శకుంతల మేనకలాంటి పేర్లతోబాటు 'పంతులమ్మ, అంజలి' రంగుల్లాంటివి కూడా భాషలో అవతరించాయనీ తెలుస్తుంది.

## రాత్రింబవళ్ళు

సూర్యోదయంతో తెల్లవారుతుంది. అంటే ప్రపంచం వెలుగువల్ల తెల్లబడుతుంది. ఆ సమయాన్ని 'వేకువ, వేగు, వేవి' అనే మాటల్లో పిలుస్తాం తెలుగువాళ్లం. ఈ మూడూ దగ్గరి సంబంధమున్న మాటలే – రూపాంతరాలే. పూర్వం 'వేంగు' అనే రూపంకూడా ఉండేది. 'వేగి, వేగినాడు' మొదలైన మాటలు సూర్యోదయాన్ని సూచించే 'తూర్పు' (సూర్యుడు తూరి/దూరి వచ్చే దిక్కు)తో సంబంధం గలవే.

సంస్కృతంలో 'ప్రత్యూషం, అహర్ముఖం, కల్యం, ఉషస్సు, ప్రత్యుషస్సు, ప్రభాతం, ప్రాతః(కాలం)' వంటి మాటలు తెల్లవారుజామును సూచిస్తాయి. ప్రత్యుషస్సు, ప్రత్యూషం, ఉషస్సు అనేవాటిలోని మొదటి రెండూ రూపాంతరాలు. వాటిలో మూడోమాట భాగంగా ఉంది. ఉష శబ్దమే మౌలికపదం. ప్రతిదినం ఉండే ఉషస్సు ప్రత్యుషస్సు. అహస్సు అంటే పగలు. పగలు మొదలయ్యే సమయం కాబట్టి అహర్ముఖ మన్నారు. ప్రభ అంటే వెలుగు, కాంతి; అది మొదలయ్యే వేళ 'ప్రభాతం'. కల్య శబ్దానికి కాలానికి సంబంధముందో లేదో తెలీదు.

తెల్లవారగానే పగలు మొదలవుతుంది. ఈమాటకు 'పవలు' అనే రూపాంతరముంది – కావ్యభాషలో. దీనికి సంస్కృతంలోని 'దినం, అహం, దివసం, వాసరం, అహ్నం, అహస్సు, ప్రాహ్ణం' అనేమాటలు పర్యాయపదాలు. దినం, దివసం (దెవసం) అనే మాటలకు తెలుగులో అర్థాలు మారిపోయి 'చచ్చినవారిని తలుచుకొనే రోజ'నే అర్థ వ్యాప్తమయింది – కర్మకాండల ద్వారా. రోజు అనేది పర్షియన్ పదం. ఒక రాత్రీ ఒకపగలూ కలిసిన కాలాన్ని దినమని వ్యవహరిస్తున్నామిప్పుడు – రోజుకు పర్యాయంగా. ఆ అర్థంలో తెలుగుమాట 'పొద్దు' (పూర్వం 'ప్రొద్దు') ఒక్కటే సమానమయింది. పొద్దు శబ్దానికి సూర్యుడనే అర్థంకూడా ఉంది తెలుగులో. ఇలా మొత్తం 'రోజు'ను సంస్కృతంలో విభజించి 'పూర్వాహ్ణం/ప్రాహ్ణం' అని

పొద్దుటిపూటనూ, మధ్యాహ్నమని సూర్యుడు నడినెత్తిన ఉండే సమయాన్నీ, అప్పటినుంచీ రాత్రిదాకా ఉన్న సమయాన్ని 'అపరాహ్ణ'మనీ, కేవలం సాయంకాలాన్ని 'సాయాహ్న'మనీ పిలుస్తారు. మధ్యాహ్నశబ్దానికి సరైన తెలుగుమాట 'పట్టపగలు'.

'రాత్రి'ని చెప్పేమాటలు సంస్కృతంలో చాలా ఉన్నాయి. 'శర్వరి, నిశ, నిశీథిని, త్రియామ, క్షణద, క్షప, విభావరి, తమస్విని, రజని, యామిని, తమి, తమస్సు' వగైరా వీటిలో కొన్ని. 'రజని, యామిని' అనేవాటిని ఆడపిల్లలకు పేర్లుగా కూడా పెడ్తుంటాం. తమి, తమస్సు, తమస్విని – అనేవి చీకటిగా ఉండేవనే అర్థం కలవి. నిశ, నిశీథిని రూపాంతరాలు. త్రియామ అంటే మూడు జాముల సమయం. యామం అంటే 'జాము'. క్షణద అంటే 'క్షణ'మనే కాలవిభాగాన్ని కల్పించేదని అర్థం. విభా అంటే ప్రకాశం. విభావరి ప్రకాశవంతమైన (వెన్నెలగల) రాత్రి. అలాంటి రాత్రిని 'జ్యోత్స్ని' అనికూడా పిలుస్తారు (జ్యోత్స్న – అంటే వెన్నెల). కారుచీకటి రాత్రిని తమిస్ర అంటారు. వీటిలో నిశ, రజని, యామిని అనే వాటికి వాడుక ఎక్కువ.

రాత్రి మొదలయ్యే సమయాన్ని 'ప్రదోష'మంటారు. దీన్నే 'రజనీముఖ'మని కూడా పిలుస్తారు. దీనికి సరైన తెలుగుమాట '(ముని)మాపు'. మాపంటే నల్లబడే సమయమన్నమాట. మధ్యరాత్రిని 'అర్ధరాత్రం, నిశీథం' అని పిలుస్తారు. నిశీథానికి నిశీథినికీ ఉన్న భేదం గమనించండి. ఈ అర్థంలో 'నడిరాతిరి, నడి(కి)రేయి, అర్ధమరేయి, సరిప్రొద్దు' వగైరా తెలుగు సమాసాలు సమానమైనవి. 'కాందారి మాందారి ప్రొద్దు' అనే పేరుకూడా ఉంది. దీని అర్థవిశేషం తెలీదుకాని దానికి 'కాదారిప్రొద్దు' అనే మరోమాట ఉంది. 'కన్నేరు కాదారి ప్రొద్దున' అనే శ్రీనాథుడి ప్రయోగముంది. కంటికి బాధపుట్టించే వేళ అని అర్థం చెప్పకోవాలి. తెలుగులోని 'రాతిరి, రేతిరి' అనేవి రాత్రి శబ్దభవాలు. అచ్చం తెలుగుమాట 'రెయి/రేయి' అనేది. దీనికీ 'ఇరులు, ఇనుము, ఎనుము' (అంటే నల్లని) అనే మాటలకూ దగ్గర సంబంధముందని ఇంతకు ముందు గమనించాం.

సాయంత్రం (కొందరు 'సాయంత్రి' అనికూడా పిలుస్తారు) అనేదానికి 'దినాంతం, అపరాహ్ణం, సాయాహ్నం, సాయం' అనే సంస్కృత పదాలూ, 'పూట, పుంట, పురంట' అనే తెలుగుమాటలూ పర్యాయపదాలు. 'సాయం' అన్నదే మూలరూపం. దినాంతమంటే పగటి చివరిభాగం. పూట శబ్దాన్ని 'రోజు'లో సగమనే అర్థంలోనే ఇప్పుడు వాడుతున్నాం. ఒకప్పుడీ మాటకు సాయంత్రమనే అర్థం. 'పుంట, పురంట'లకు కావ్యప్రయోగాలుకూడా తక్కువ.

పగలూ రాత్రీగాని, రాత్రీ పగలూగాని, మధ్యాహ్నం తదితరాలతోగాని కలిసే సమయాన్ని సంస్కృతంలో 'సంధ్య' అనే అంటారు. ప్రాతస్సంధ్య రాత్రికీ పగటికీ మధ్యకాలం. మధ్యాహ్నసంధ్య రెండుపూటలనూ కలిపే వేళ. పగలునూ రాత్రినీ కలిపే వేళ సాయంసంధ్య. వెలుతురు పూర్తిగా ఉండక, పూర్తిగా పోక ఉన్న సమయం సంధ్య. దీనికి సంస్కృతంలో 'పితృప్రసువు, విభాతం, వ్యుష్టం, గోసర్గం' అనే పేర్లుకూడా ఉన్నాయి. పెద్దలు గుర్తుకు వచ్చేవేళ పితృప్రసువు. 'తథాస్తుదేవత'లప్పుడు తిరుగుతుంటారనీ తప్పమాటలు మాట్లాడకూడదనీ పెద్దవాళ్లు బెదిరిస్తుంటారు. ప్రభాతం తెల్లవారుజామయితే, విభాతం సందెవేళ అనే భేదం

గుర్తించాలి. సంధ్యకు తెలుగులో సరయిన మాటయితే 'మునిమాపు'. సంజ, సందె – అనేవి సంస్కృతభవరూపాలు. గోసర్గం అనేదాన్ని 'గోధూళివేళ' అనికూడా పిలుస్తారు. ఆవులు (నిజానికి పెంపుడు గొడ్లు) ఇంటికి చేరేవేళ అది.

రాత్రింబవళ్లని (మొదటిమాట సంస్కృతం రెండోది తెలుగు) కలిపి చెప్పటం అలవాటయింది తెలుగువాళ్లకు. ఈ రెంటినీ కలిపి 'అహోరాత్ర'మంటారు సంస్కృతంలో. ఇప్పుడు 'దినం, రోజు' అంటున్నాం దీన్నే. నాలుగురాత్రులూ రెండు పగళ్లూ కలిపిన కాలాన్ని సంస్కృతంలో 'పక్షిణి' అంటారు (ఆడపిట్టను కూడా పక్షిణి అంటారు). అనేక రాత్రులకాలాన్ని 'గణరాత్ర'మంటారు. గణమంటే గుంపు. పగలూ మధ్యాహ్నమూ రాత్రీ కలిసిన మొత్తం కాలాన్ని 'త్రిసంధ్య'మంటారు. వీటికి సమానమైన అచ్చతెలుగు మాటలున్నట్లు లేదు.

## ఎండవానలు

తెలుగులోని 'ఎండ' సంస్కృతంలోని 'ఆతపం' సమానార్థకాలు. తపన పుట్టించేది ఆతపం. దీనికి 'ప్రకాశం, ద్యోత' మనేవి పర్యాయపదాలని నిఘంటుకారులు చెప్తారుగానీ ఆ రెంటికీ వెలుగు, వెలుతురు అనే అర్థాలు కూడా ఉన్నాయి. కొద్దిపాటి ఎండకు, 'ఈరెండ, నీరెండ' అనే తెలుగుపేర్లున్నాయి. సంస్కృతంలో వీటికి ప్రత్యేక సమానార్థకాలున్నట్లు లేదు – కించిదాతపం వంటివితప్ప.

ఎండవల్ల పుట్టేది వేడి. దీనికి 'వెచ్చ, వెక్క, వెట్ట, బెట్ట, కరుకు, రుటం, చురుకు, తీండ్ర(ం), ఉడుకు, సెక, ఉబ్బ, ఉమ్మ(రం), ఆవి, ఉక్క, వేడిమి' వంటివి పర్యాయపదాలని కోశకర్తలు చెప్పారు. సెక అనేది శిఖా శబ్దభవం. ఆవి అనే మాటకు ఊపిరి అనే అర్థం కూడా ఉంది. 'ఆ సుయోధను ముక్కులో ఆవి కలుగ' సూదిమొన మోపినంత భూమిని కూడా ఇవ్వనన్నాట్ట. ఉక్క, ఉమ్మ(రం), ఉబ్బ, అనేవి రూపాంతరాలు. ఎండ వల్ల కలిగే తాపాన్ని సూచించే మాటలుగానే వీటిని వాడుతున్నాం. అలాంటివే బెట్ట, వెట్ట, ఉడుకు అనేవి కూడా. రుటమేమిటో తెలీకుండా ఉంది. చురుకు, తీండ్ర(ం), కరుకు అనేవి 'తీవ్రత'ను సూచించే విశేషణాలు కూడా.

తిగ్మం, తీక్ష్ణం, ఖరమనే సంస్కృతపదాలు వేడికి పర్యాయపదాలు. వీటిని విశేషణాలుగా కూడా వాడవచ్చు – 'తీవ్ర' మనే అర్థంలో. తెలుగులో కొద్దిపాటి వెచ్చదనాన్ని 'గోరువెచ్చన, నులివెచ్చన, తనివెచ్చన' అనే మాటలతో వివరించవచ్చు. గోరు శబ్దానికి 'కొద్దిపాటి, చిన్న' మొదలైన అర్థవిశేషాలు కూడా ఉన్నాయి (ఉదా: గోరుచిక్కుడు). వీటికి పర్యాయాలుగా 'కోష్ణం, కదుష్ణం, కవోష్ణం, మందోష్ణం' అనే సంస్కృతపదాలున్నాయి. గోరు, నులి, తని – అనే వాటిలాగానే 'మంద' అనేది కూడా విశేషణభాగం. ఉష్ణమనేదే ప్రధాన నామవాచక రూపం.

ఎండ సూర్యప్రసాదమైతే వెన్నెల చంద్రుడిచ్చేది. 'వెల్' అనే భాగానికి 'తెల్లని' అని అర్థమనీ నెల (చంద్రుడు) ఇచ్చే తెల్లటి వెలుగును వెన్నెల అంటారనీ పండితులు వివరిస్తుంటారు. నిజానికి ఇది తప్ప మరోమాట తెలుగులో ఈ అర్థంలోలేదు. కొందరు 'రేయెండ' (అంటే రాత్రికాసే ఎండ) అనేమాట ఉన్నదంటారుగానీ దానికి పూర్వకావ్యాల్లో 'ఎండ, కొద్దిపాటి ఎండ' అనే అర్థాల్లో కూడా ప్రయోగాలున్నాయని మరికొందరంటున్నారు. పూర్వం 'వెన్నెల' అనేమాటను వేశ్యాకులంలో పేరుగా పెట్టేవాళ్ళు. కానీ ఈ కాలంలో దీని సంస్కృత పర్యాయపదాలు మూటినీ ఆడపిల్లలపేర్లుగా పెడ్తున్నారు. అది చంద్రిక, జ్యోత్స్న, కౌముది – అనేవి. వీటిలో చివరిదానికి అలాంటి వాడుక తక్కువ. చంద్రుడిచ్చే వెలుగు కాబట్టి చంద్రిక అన్నారు. కుముదాలకు (నల్లకలువ పూలకు) ఆనందం కల్గించేది కాబట్టి కౌముది అనే పేరు వచ్చిందిట. చంద్రుడుదయిస్తే కలువలు వికసిస్తాయనే 'కవిసమయం' (కవులు వాడే సంకేతం) పూర్తిగా నిజంకాకపోయినా అలవాటు బలిమిని అపటం కష్టం కాబట్టి నమ్మకం పెరిగిపోతున్నది. జ్యోత్స్న శబ్దానికి వెలుగనే అర్థం. కొందరు కవులు సాగదీసి దీన్ని 'చంద్రాతపం' అనికూడా అంటున్నారు. ఆతపానికి ఎండ అనే అర్థమనుకొన్నాంకదూ!

తెలుగువారి వాడుకలో ఎండ, వెన్నెలలుకాక 'ఎండవానలు' వ్యతిరేకార్థకాలు. అసలు మబ్బుపడితేనే మనవాళ్ళు 'దుర్దిన'మని భావించేవాళ్ళు పూర్వం. 'వృష్టి, వర్షం' అనేమాటలు వానకు పర్యాయాలైన సంస్కృతపదాలు. వర్ష శబ్దానికి 'సంవత్సరం, దేశం' వగైరా విశేషార్థాలున్నాయి. (ఉదాహరణకు పదివర్షాల వయస్సు, భారతవర్షం). వృష్టి శబ్దానికి 'రాలేది, పడేది' అని అర్థం. తెలుగులో 'వాన' అన్నదే మౌలికపదం. ఎడతెరపిలేకుండా ఏనుగు తొండాంలాంటి ధారలతో పడ్డవానను 'జడి' అంటారు. అంతవానకు ఇంత చిన్నపేరా అని కొందరు 'జడివాన' అని పిలుస్తారు. దీనికి సమానార్థకమైన సంస్కృతపదం 'ఆసారం'.

వానల్లో చాలా రకాలున్నాయి. కొద్దిపాటి వర్షమయితే అచ్చతెలుగులో 'పసపస, ముసురు' అంటారు. మొదటిమాటకు వాడుక తక్కువ. 'ధార'గా వానకురుస్తుంటే దాన్ని 'సోన, తూర, జల్లు' అంటారు. వాననీటి చుక్కను 'చినుకు' అంటారు. తుప్పరగా మాత్రమే పడుతుంటే దాన్ని 'బొట్టు, తుంపర' అంటారు. పెద్దవానను సంస్కృతంలో 'కుంభవృష్టి' అనీ తెలుగులో 'కుండపోత(వాన)' అనీ పిలుస్తారు. పొగమంచు వ్యాపించినట్లు కురిసిన వానను 'తుట్ర, తూరవాన' అంటారు. వాన కురిసివెలిసిన తరువాత కారే చూరునీళ్ళను 'వంగుళ్ళు, నట్లొట్లు' అంటారు అచ్చ తెలుగులో. అయితే ఈ రెండు మాటలకు ఇప్పుడు వాడుకఉన్నట్లు లేదు.

తెలుగులో 'మంచు' శబ్దానికి 'ఇనం, ఇగం, ఈము' అనే రూపాంతరాలే పర్యాయపదాలని చెప్పాలి. సంస్కృతంలో 'తుషారం, హిమం, తుహినం, ప్రాలేయం, మిహిక, మహిక, నీహారం, ఉపశ్యాయం' వంటి మాటలున్నాయి పర్యాయార్థంలో. ఆర్యసమాజం తొలుత మంచుకొండల్లో బతికింది. కాబట్టి ఇన్నిపేర్లు పెట్టుకుందేమో! వీటి వ్యుత్పత్తులు స్పష్టంగా తెలీవుకాబట్టి, ఏ విశేషార్థంలో ఏ మాటను వాడాలో ఏది సరైనదో చెప్పటం కష్టం. తెలుగులో 'గూడమంచు, పొగమంచు' వంటి సమాసాలు

లేకపోలేదు. అయినా దక్షిణాదివాళ్లకి మంచు అంతగా అందుబాటులో లేదనేది వాస్తవం.

మంచువల్లగాని, గాలివల్లగాని వచ్చే చల్లదనాన్ని 'చలి' అంటాం. అందువల్ల వణుకుపుట్టవచ్చు. చలికి 'చలిమిడి, జలుబు, సీతు, చలువ, ఇవకం, ఇవతాలింపు' వంటి పర్యాయపదాలున్నాయి. చలి, చలిమిరి, చలువ/చలవ అనే వాటికి చాలా దగ్గరి సంబంధం వుంది. ఇవకానికి, ఇవాకానికి (హిమానికీ) పోలిక ఉంది. జలుబుకు ఇప్పటి అర్థం పరిమితం. పూర్వం చలినీ చల్లదనాన్ని ఆమాటతోనే సూచించేవాళ్లు. సంస్కృతంలో 'శీతం, శీతలం, శైత్యం, సుశుమం, సుషిమం, శిశిరం, జడం, తుషారం' అనే పర్యాయపదాలున్నాయి. వీటిలో తుషారం మంచనే అర్థంలో కూడా వాడేది. సీతు అనే తెలుగుమాట శీతం నుంచి పుట్టింది. మంచుకు నీళ్ళు గడ్డగట్తాయి కాబట్టేమో 'జడ' మనే పేరు కూడా వచ్చింది చల్లదనానికి. మన రాష్ట్రంలో కొబ్బరిమానె గడ్డగట్టడమే విశేషం.

# చప్పుళ్లు

మబ్బులనూ మెరుపులనూ తలచుకొన్నప్పుడే ఉరుములనూ పిడుగులనూ ప్రస్తావించవలసింది. పోనీ ఇప్పుడుచూద్దాం. నిజానికి ఉరుముకు పర్యాయపదమైన మరో తెలుగుమాటే ఉన్నట్లు లేదు. పెద్దగా మాట్లాడినా అరిచినా కూడా ఉరిమినట్లే లెక్క తెలుగులో. గుడ్లురిమిచూడటం కూడా కద్దు. సంస్కృతంలో 'స్తనితం, గర్జ(న), గర్జితం, రసితం' అనే పర్యాయపదాలున్నాయి. గర్జ, గర్జన, గర్జితం అనేవి సింహాదులు పెట్టే కేకలక్కూడా వర్తిస్తాయి. స్తనితమొక్కటే ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట.

పిడుగుకూడా ఒంటిగంట రామలింగంలాంటి తెలుగుమాటే. దానికీ మరో పర్యాయపదం తెలుగులో కనిపించదు. సంస్కృతంలో రెండురకాల పర్యాయ పదాలున్నాయి: 'హ్రాదిని, స్వరువు, శంబం' అనే కేవలధ్వనిసూచకాలూ, ఇంద్రుడి ఆయుధమనే విశ్వాసానికి చిహ్నాలయిన 'వజ్రం, కులిశం, భిదురం, దంభోళి, అశని, పవి, శతకోటి' అనేవీ. హ్రాదం (భయం) పుట్టించేది కాబట్టి హ్రాదిని. చప్పుడుగా ఉండేదికాబట్టి స్వరువు. శంబ శబ్దానికీ శంపా శబ్దానికీ ధ్వనిసాదృశ్యముంది. బహుశా మెరిసిన తరువాత వినిపించే దనే మూలార్థముందేమో తెలీదు. బద్దలుకొట్టేదికాబట్టి భిదురమనేమాట పుట్టింది. నూరంచులున్న (ఆయుధం) కాబట్టి శతకోటి అనే పేరు వచ్చింది.

ఉరుములూ పిడుగులూ పెద్దచప్పుడు చేస్తాయి. ఆ చప్పుడుకు తెలుగులో 'మ్రోత, మోత, రవళి, నాదు, మ్రోగుడు, వాగుడు, సద్దు, ఉలివు, అలికిడి, అలుకుడు, కూత, రంపు, రంపి, రంత, క్రందు' మొదలైన పర్యాయపదాలున్నాయి. మ్రోత, మోత, మ్రోగుడు అనేవి మూడూ మోగు (చప్పుడు చేయు) అనే క్రియాపదం నుంచి పుట్టిన నామవాచకాలు. మోత సాధారణపదం. రవళి అనే

మాటను మామూలుగా 'అందెలరవళి' వంటి సమాసాల్లో వాడ్తుంటాం. గజ్జెల చప్పుడు, గాజుల చప్పుడు మొదలయిన సుకుమారధ్వనుల విషయంలో రవళి శబ్దాన్ని వాడ్తాం. నాదు అనేది సంస్కృతంలోని నాదశబ్దభవం. వాగుడు మామూలుగా ఎడతెరపిలేని నోటిమాటల చప్పుడుకే అన్వయిస్తుంది. సద్దు అనేది శబ్దమనే సంస్కృతపదం నుంచి పుట్టినమాట. పక్షులుచేసే చప్పుడును ఉలివు అంటారు. దీనికి పూర్వకావ్యాల్లో మాత్రమే ప్రయోగం కనిపిస్తుంది. అలికిడి, అలుకుడు రూపాంతరాలు. ఇవి అడుగుల చప్పుడు, ఏ పొదల్లోనో దాక్కుంటున్న జంతువులకదలిక వగైరాలను సూచించడానికి వాడే మాటలు. కూత సాధారణంగా పిట్టలకు అన్వయించి చెప్పేమాట – కొన్ని సమయాల్లో మనుషులక్కూడా. పోట్లాటల్లో పెద్దగా అరుస్తూ చేసే ధ్వనికి రంపి, రంపు అనే రూపాంతరాలూ, రంతు అనే మరోమాటా అన్వయిస్తారు.

అలుకుడు అనే మాటను 'ఏడ్పు' అనే అర్థంలోకూడా వాడుతారు. పక్షులుగాని, ఆడపిల్లలుగాని సన్నసన్నగా నవ్వుతూ చేసే కలకల ధ్వనికి తెలుగుమాటలు అలబలం, హాళాహాళి అనేవి సమానార్థకాలు. మద్దెలమోతను ప్రత్యేకించి 'దిముకు, గొలక, గొల్లు, గొల్లు' అనే మాటలతో సూచిస్తారు. రొద అనేది చెవికింపుగాని చప్పుడు. ఇలా ప్రత్యేకార్థాల్లో వాడేమాటలనేకమున్నాయి తెలుగులో. కాకపోతే అభ్యాసంగాని, వాటికి ప్రత్యేకమయిన అర్థాల్లోనే మాటలనువాడాలనే పట్టుదలగాని లేనందున 'సర్వం జగన్నాథ'మన్నట్లు ఏదో ఒక పదాన్ని వాడి అదే సరయిందని సంతోషిస్తుంటారు. అది మానవబలహీనత. మానవులను వదిలిపోదు.

మోతకు పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృతపదా లనేకమున్నాయి. 'శబ్దం, ధ్వని, నినదం, నినాదం, స్వనం, స్వానం, నిస్వనం, నిస్వానం, రవం, రావం, ఆరవం, ఆరావం, సంరావం, విరావం, ధ్వానం, నిర్ఘోషం, నిర్హ్రాదం, గర్జ(నం)' వగైరాలు. చాలా మాటల్లో 'న'కారం ఎందుకుందో, 'ర' ఎందుకుందో చెప్పలేం. శబ్దం, ధ్వని అనేవీ, రవం అనేదీ ఎక్కువవ్యాప్తిలో ఉన్నమాటలు. 'నినదం, నినాదం', 'స్వనం, స్వానం', 'నిస్వనం, నిస్వానం', 'రవం, రావం', 'ధ్వని, ధ్వానం' అనేవి అన్యోన్యం రూపాంతరాలు. 'ఆ, సం, వి' అనే ఉపసర్గలు చేర్చి 'రావ' శబ్దాన్ని పర్యాయరూపాలతో వాడుతున్నారనికూడా గమనించాలి. నిర్ఘోష శబ్దాన్ని ఉరుమునూ, పిడుగుపాటునూ వర్ణించేటప్పుడు కూడా వాడ్తారు – నిర్హ్రాదాన్ని లాగానే. స్వనం, స్వానం, నిస్వానంలాంటి మాటల్లో మృదుత్వంగల ధ్వని అనే సూచన ఉంది. ఆరావం, సంరావం, ఆరవం వంటి వాటిలో ధ్వనితీవ్రత సూచితం– మాధుర్యం లేదనేభావంతోబాటు.

గుడ్డలచప్పుడు, ఆకుల కదలిక వగైరా ధ్వనులను సూచించటానికి 'మర్మరం' అనే శబ్దాన్ని ప్రయోగిస్తారు. నగల చప్పుడును సూచించటానికి 'శింజ, శింజితం' అనే రూపాంతరాలను వాడ్తారు. వాద్యాల ధ్వనిని 'నిక్వణం, నిక్వాణం, క్వాణం, క్వణం, క్వణనం' అనే రూపాంతరాలతో సూచిస్తారు. వీణ, వాయులీనంవంటి వాటి ధ్వనులను 'ప్రక్వాణం, ప్రక్వణం' వంటి మాటలతో వర్ణిస్తారు. పదిమంది (జనం) చేరి గుసగుసలుగా మాట్లాడుకున్నా పుట్టేచప్పుడును 'కలకలం' అంటారు; అది కొంచెం

పెద్దగా ఉంటే 'కోలాహల'మంటారు. పశుపక్షులు చేసే చప్పుడును 'రుతం, వాశితం' అంటారు. కోకిలాదుల 'రుతి'ని 'కూజిత'మంటారు. ఎంతోమధురంగా ఉండి వినగానే పులకరింత పుట్టించే ధ్వని అయితే 'కాకలి' అంటారు. ఇవన్నీ సంస్కృతపదాలు. తెలుగులో వీటిని సొంతం చేసుకొన్నాం-ఏనాడో

# భూమి సముద్రాలు

తెలుగులో 'భూమి' శబ్దానికి స్పష్టమైన పర్యాయపదాలు రెండు—నేల, మన్ను—అనేవి. మనం, మనతోబాటు సమస్త చరాచర వస్తువులూ నిలవడానికి ఆధారమయింది కాబట్టి 'నేల' అన్నారు. నిలు(చు) అనే క్రియాపదానికీ దీనికీ చాలా దగ్గర సంబంధముంది. మను/మన్ను అనే క్రియకూ, మన్నిక అనే నామపదానికీ సంబంధించినమాట మన్ను. మన ఉనికికీ బతుక్కూ ఆధారభూతమైంది కాబట్టి 'మన్ను' అని భూమిని పిలుస్తున్నాం. మంటి, మట్టి అనేవి బహుశా దీని ఔపవిభక్తిక రూపాలయి వుండవచ్చు. పృథ్వీ అనే సంస్కృత శబ్దంనుంచి 'పుఢవీ' అనే ప్రాకృతరూపం ఏర్పడిందనీ, దాన్నుంచి పుట్టిన 'పుడమి' అనేది 'అచ్చ' తెలుగనే వ్యాకరణాలు చెప్తాయి. భూ శబ్దంనుంచి ఏర్పడ్డది బువి అనేమాట. కవులు సృష్టించుకొన్నమాట 'పంటవలంతి' – బాగా పంటలు పండే చోటనే అర్థంలో. పంటల్లేకపోయినా, అవి ఎండిపోయినా ఈ మాటను నిర్దాక్షిణ్యంగా వాడేస్తుంటారు కొందరు. ఇవి తెలుగుమాటలు.

సంస్కృతంలో చాలా పర్యాయపదాలున్నాయి. అవి రెండు రకాలు. ఏవో కొన్ని ప్రత్యయాల్లో మార్పులతో ఉన్న మూలపదాలు ఒకరకం. వర్ణనాత్మకంగా ఉండేవి మరోరకం. 'ఇల, భూమి, అచల, అనంత, రస, స్థిర, ధర, ధరణి, ధారణి, ధారుణి, ధరిత్రి, క్షోణి, జ్యా, క్షితి, ఉర్వి, గోత్ర, కు, పృథివి, పృథ్వి, క్ష్మా, క్షమ, అవని, మేదిని, మహి, విపుల, ధాత్రి, జగతి' అనేవి మొదటిరకం మాటలు. విశ్వంభర, రత్నగర్భ, వసుంధర, సర్వంసహ, వసుమతి, వసుధ, గహ్వరి, భూతధాత్రి, అబ్ధిమేఖల వగైరాలు రెండో రకానివి.

స్థిర, ధర, ధరణి, ధారుణి, ధరిత్రి – అనే మాటల్లోని ప్రధానార్థం కదలకుండా ఉండేది, 'జీవరాసులను ధరించేది/మోసేది' అనే భావం. ధారుణి అనే రూపం సంస్కృత కవుల వాడుకలో కనిపించదు గాని తెలుగు కవులు నన్నయ కాలంనుంచీ మార్చుడానికి వీల్లేని యతిస్థానాల్లో బిగించి వాడేశారు. భూమి అంటే చాలా పెద్దది అని అర్థం. భౌమం అనేమాటకు భూమికి సంబంధించిన, చాలా పెద్దదైన అనే రెండర్థాలూ ఉన్నాయి. భూమిని లాటిన్లో terra firma అంటారు స్థిరంగా ఉండేదనే అర్థంలో. పృథివి, పృథ్వీ శబ్దాలు రూపాంతరాలు. వీటికి 'పృథు' (అంటే చాలా పెద్దదైన) అనే విశేషణంతో సంబంధమున్నా పురాణాలు 'పృథు' చక్రవర్తికీ భూమికీ ముడివేసి కథలల్లాయి. అలాగే 'ఉరు' (గొప్ప, పెద్ద) అనే విశేషణానికి 'ఉర్వి'కీ దగ్గరి చుట్టరికముంది. అచలమంటే కదలనిది. భూమి కదలదనీ సూర్యచంద్రాదులు

దానిచుట్టూ తిరుగుతుంటారనీ విశ్వసించిన కాలంలో ఈమాట పుట్టింది. కొండ అనే అర్థంకూడా ఈ మాటకుంది.

అనంతమంటే అంతులేనిది. చాలా విశాలమైనది అనే అర్థంలో ఈ పదం భూమికి పర్యాయపదమయింది. అవనమంటే రక్షణ. జనానికి నిలవనీడనిచ్చి రక్షించేది కాబట్టి అవని అన్నారు. మహత్తంటే గొప్పది. 'మహా' అనే అవ్యయానికీ మహీ శబ్దానికీ చుట్టరికముంది. విపుల అంటే విశాలమయింది. విపుల శబ్దాన్ని విశేషణంగా కూడా వాడుతారు. ధాత్రీ శబ్దానికి పోషించేది, ధరించేది అని అర్థం. పాలిచ్చే దాది అనే అర్థవిశేషం కూడా ఈ మాటకున్నది. జగత్తు, జగతి అనేవి రూపాంతరాలు. ఈ మాటలకు భూమి అనే అర్థంతోబాటు ప్రపంచమనే విశేషార్థంకూడా ఉంది. తిరిగేది అనే విశేషణార్థం లేకపోలేదు. మేదుడనే రాక్షసుడి మెదడు ఇలా భూమిగా మారిందనే పురాణగాథ ప్రకారం మేదిని అనే మాట పుట్టింది. క్షమ, క్ష్మా అనే శబ్దాలకు 'ఓర్పుకలది' అని అర్థం. భూదేవంత ఓర్పనే నానుడి ఉండనే ఉంది. ఏ భూకంపమో వచ్చినప్పుడు తప్ప ఈ మానవజాతిని ఓర్పుగా మోస్తున్నది కాబట్టి క్షమ అన్నారు. దాని రూపాంతరం క్ష్మా.

ఇలా శబ్దానికీ ద్రావిడ భాషల్లోని 'ఇల్, నిల్' అనే ధాతువులకూ సంబంధముందని కొందరంటారు. ఏడు అధోలోకాల్లోనూ ఒకటైన 'రసాతలానికీ' భూమికీ 'రస' అనే ఒకే పేరుండటం ఆశ్చర్యం. దీన్నిబట్టి రసాతలం కూడా భూమిలో ఒక ప్రాంతమేమోనన్న అనుమానం రావచ్చు. రస శబ్దానికి ఇంకా చాలా అర్థాలున్నాయి. అది వేరే విషయం. కుభృత్ వంటి శబ్దాలనుంచి విడదీసి ఏర్పరిచిన ఏకాక్షర శబ్దమేమో 'కు' అనేది. కొందరీమాటకూ ఇంగ్లీషులోని 'cow', సంస్కృతంలోని 'గౌః' అనే మాటలకూ ముడివేసి ఆర్య సంప్రదాయంలో భూమికీ ఆవుకూ ఉన్న అన్యోన్యసంబంధాన్ని గురించి ఉపన్యసించక పోలేదు. ఈ అర్థాల సంగతి ఎలాఉన్నా భూశబ్ద పర్యాయపదాలు తెలుగులో పద్యాలు రాసిన కవులకు పాదపూరణార్థం బాగా పనికి వచ్చేవని చెప్పాలి.

వసుధ, వసుంధర, వసుమతి అనే మాటలు భూమినుంచి వసువులు (రత్నాలు) దొరుకుతున్నాయని గ్రహించిన తరవాత పెట్టిన పేర్లు అని చెప్పవచ్చు. ఆడపిల్లలకు పేర్లుగా కూడా వీటి ఉపయోగం స్మరించదగ్గదే. రత్నగర్భ అంటే కడుపులో రత్నాలు దాచుకున్న స్త్రీ. భూమిని స్త్రీమూర్తిగా భావిస్తాం కాబట్టి భూమిని రత్నగర్భ అన్నాం. రత్నగర్భుడు అని పుంలింగరూపం చేశామో సముద్రుడయిపోతాడు. భూమిలో సముద్రంలో రత్నాలు దొరుకుతాయని తెలుసుకొని పెట్టిన పేర్లవి.

విశ్వంభర, సర్వంసహా అనేవి భూమి లక్షణాలనుబట్టి పెట్టిన పేర్లు. విశ్వాన్ని – ప్రపంచాన్ని భరించేది విశ్వంభర. సర్వం – అన్నిటినీ, అంతటినీ – సహించేది సర్వంసహా. గహ్వరమంటే గుహ, అడవి. కొండల్లో ఉండే గుహలనుబట్టి కాక భూమిపైనుండే అరణ్యాలనుబట్టి దానికి గహ్వరి అనే పేరు వచ్చిఉంటుంది. సమస్త చరాచర జీవరాశికీ భూతాలకూ – కన్నతల్లి వంటిది కాబట్టి భూమిని భూతధాత్రి అన్నారు. ఇవన్నీ వర్ణనాత్మక నామధేయాలు.

భూమిని తల్లిగా భావించటం మన సంప్రదాయం. జర్మనులు తండ్రిగా భావిస్తారు. అందుకే మనం mother land అంటుంటే వాళ్లు father land అని మాతృభూమిని అంటే స్వదేశాన్ని పిలుస్తారు. ఈ భూమినే కాళిదాసాదులు రాజులకు 'భార్య'గా పరిగణించారు. ఆలెక్కన చరిత్రగతిలో ఎందరు రాజులైనారో మన 'తల్లిభూమి' (రాయప్రోలువారి మహత్తర ప్రయోగం) అందరికీ భార్య అయింది. అది మన దౌర్భాగ్యం.

సముద్ర శబ్దానికి పర్యాయపదమని చెప్పదగిన ఒకేఒక అచ్చ తెలుగుమాట 'కడలి'. కడ అంటే చివర, అంచు. ఎంతో దూరందాకా ఉన్నదనే అర్థంలో బహుశా కడలి శబ్దం పుట్టివుండవచ్చు. సంద్రమనే తద్భవ పదం సముద్ర శబ్దం నుంచి పుట్టింది. తెలుగు కవులు సృష్టించుకొన్న ప్రాయేరు, మున్నీరు అనే సమాసాలను కూడా నిఘంటువులు కడలి పర్యాయాలుగా పరిగణిస్తాయి. ప్రా అనేది 'ప్రాత' శబ్దానికి సమాసాల్లో వచ్చే రూపాంతరం. 'పాతకాలపు నీరని' పిండితార్థం. మున్ – అంటే మొదటి, తొలికాలపు. సృష్టికి మొదటిదనీ, సృష్టి అక్కడే (సముద్రంలోనే) మొదలయిందనీ భావించి కల్పించిన మాట మున్నీరు. ఎంతో విశాలమైన సాగరతీరమున్న తెలుగువాళ్లు కడలి అనే ఒక్కమాటతోనే సముద్రాన్ని పిలిచే వాళ్లన్నమాట. చిత్రమేమరి.

సంస్కృతంలో చాలా పేర్లున్నాయి. 'సముద్రం, అబ్ధి, అకూపారం, పారావారం, సరిత్పతి, ఉదన్వంతుడు, ఉదధి, సింధువు, సరస్వంతుడు, సాగరం, అర్ణవం, రత్నాకరం, జలనిధి, జడనిధి, యాదఃపతి, అపాంపతి' మొదలైనవి చాలావరకు వర్ణనాత్మకాలయిన పేర్లే. అప్ – అంటే నీరు. ఆ నీరు నిండినచోటు కాబట్టి అబ్ధి అన్నారు. పారం అంటే అవతలి ఒడ్డు. అవారం అంటే ఇవతలి ఒడ్డు. పారావారం అంటే రెండు ఒడ్ల మధ్యా ఉన్నదని అర్థంట. నిజానికి ఇటూ అటూ ఒడ్డు లేకుండా ఉండే ప్రవాహంగాని పడియగాని ఉండదు గాని ఎందుకుపెట్టారో సముద్రాని కీపేరు పెట్టారు. పారంగతుడు మొదలైన పదాల్లో అవతలి ఒడ్డు చేరినవాడనే అర్థం. అంటే అంతా తెలిసిన వాడని భావార్థం. అకూపార శబ్దానికి విష్ణుమూర్తి రెండో అవతారమైన తాబేలనే అర్థం కూడా ఉంది. సదరు తాబేలు మునిగి అడుగునుంచి వేదాలను బయటికి తెచ్చిందిట. ఇది పురాణగాథ. సముద్రం, తాబేలు అనే రెండర్థాలకూ ఒకేమాట ఎలా పొసగిందో ఆ పదాన్ని సృష్టించిన వాళ్లకే తెలియాలి.

## వ్యుత్పత్తులు

ఈ సందర్భంలో 'వ్యుత్పత్తు'లను గురించి రెండుమూడు మాటలు ప్రస్తావించటం సమంజసమనిపిస్తుంది. క్రీస్తుపూర్వం 1500 నాటి యాస్కాచార్యుడి నిరుక్తంలో చాలా మాటలకిచ్చిన వ్యుత్పత్తులు గమ్మత్తుగా ఉంటాయి. హింస చేస్తుంది కాబట్టి అక్షరాలు తిరగబడి సింహమయిందట. అంతకన్నా క్రూరమైన పెద్దపులి కెందుకీపేరు రాలేదో చెప్పలేం. 'నరః వా' మనిషేమో అనిపిస్తుంది కాబట్టి వానరం (అంటే

కోశి) అనే మాట పుట్టిందట. ఈ రకం పట్టు ల్యాటిన్ గ్రీకు పండితులు కూడా ప్రదర్శించారు. లిథోస్ అంటే రాయి. లిథ్ అంటే పరిగెత్తటం. రాయి పరిగెత్తదు కాబట్టి అలా పేరు వచ్చిందన్నారు! ఇలా ప్రతిమాటకూ 'వ్యుత్పత్తి' చెప్పటం పండితుల కోవినోదం అయింది. చెప్పే వ్యుత్పత్తులు పొసగుతాయో లేదో వారికి అక్కరలేదన్నమాట. తెలుగుమాటలకు సంస్కృత వ్యుత్పత్తులు చెప్పినవారున్నారు. వేంకట అనే తెలుగుమాట, వేంగడ అనే తమిళపదం 'పెద్దపులి' అనే మూలార్థం కలవి. ఆ మాట సంస్కృతమని 'వేం పాపాన్ కట తీతి వేంకటః' – అంటే 'పాపాలను (వేం) ఖండించే (కట)వాడ'ని వ్యుత్పత్తి చెప్పారు. రామాయణంలోని 'సుందరకాండ'కు ఆ పేరెందుకు వచ్చిందో ఆలోచించి ఎవరో 'సుందరో హనుమాన్ జ్ఞేయః' అనేనిఘంటువు(!) చెప్పి హనుమంతుడికి సుందరుడు (అనగా చక్కనివాడు) అనే పేరుంద కాబట్టి లంకాదహనం వగైరా కథాభాగమున్న ఆ కాండకు సుందరకాండ అనే పేరు వచ్చిందన్నారు! అవునంటారా?

ఇలా వ్యుత్పత్తి శాస్త్రం (Etymological Science) అనేది ప్రపంచ వ్యాప్తంగా వెర్రితలలు వేసిన మీదట వోల్తెయిర్ అనే ఫ్రెంచి విద్వాంసుడు ఆ శాస్త్రానికి చిత్రమైన నిర్వచనం చెప్పాడు. ఏమనంటే – "వ్యుత్పత్తులు చెప్పటం ఒక శాస్త్రం. అందులో అచ్చులకు విలువలేదు. హల్లులకు ఉన్నట్లూ లేదు" అని! ఈ రెండూ లేని మాటలుండవు కాబట్టి ఆ శాస్త్రానికే విలువలేదని ఆయన వెక్కిరింత. అందుచేతనే స్పష్టంగా అనుమానరహితంగా ఉన్న సందర్భాల్లో తప్ప కరాఖండిగా ఇదే వ్యుత్పత్త్యర్థమని చెప్పటానికి సాహసించటం లేదు. కొన్ని ఇంచుమించు సమానంగా ఉండే ధ్వనులున్న అర్థాలున్న మాటలను పోల్చి వాటిలో ఈ భాగానికి ఇది బహుశా అర్థమై ఉంటుందని ఊహించటం క్షేమం. పాఠకులు క్షమించాలి.

## నదులూ నీళ్ళు

సరిత్తంటే నది. నదులకు (అవి స్త్రీలు) సముద్రుడు (ఒకే ఒక మగవాడు) భర్త కాబట్టే సరిత్పతి అన్నారు. యాదఃపతి, అపాంపతి అనే మాటలీలాంటివే. ఉదన్వంతుడు, ఉదధి, జలనిధి, జడనిధి అనే మాటలకు నీళ్లు నిలవవున్నచోటు అని అర్థం. సింధు శబ్దానికి నది, సముద్రం అనే రెండర్థాలూ ఉన్నాయి. ఆర్యులెరిగిన చాలా పెద్దనది (సముద్రమంత నది!) కాబట్టే నదిని సముద్రంతో సమానమన్నారేమో! రత్నాలు దొరికేచోటు కాబట్టి రత్నాకరం (ఆకరం అంటే స్థానం) అన్నారు. సరస్వంతుడనే మాట కూడా నీరు నిండినవాడనే భావంతో పెట్టిన పేరే. సగరుడి కొడుకులు పాతాళందాకా తవ్వినీరు నింపిన చోటు కాబట్టే సాగరమనే పేరు వచ్చిందని పురాణాలు చెప్తాయి. అర్ణమంటే నీరు. అది నిండావున్నచోటు అర్ణవం. దాన్ని అర్ణోరాశి (అంటే నీటికుప్ప) అనికూడా పిలిచారు. ఏతావతా సముద్రమొక్కటే వర్ణనాత్మకంకాని పేరని చెప్పాలి.

పాలసముద్రం (క్షీరోదధి), పెరుగు సముద్రం (దధ్యోదధి), నెయ్యి సముద్రం (ఘృతోదధి), చెరుకు సముద్రం (ఇక్షూదధి), కల్లు సముద్రం (సురోదధి), మంచినీటి సముద్రం (స్వాదూదధి) అని సప్తసముద్రా లున్నాయట. ఇప్పటి 'అట్లాసు'ల్లో అవి కనిపించవు. కనీసం ఆ చివరి రెండూ బయటపడితే మన సమస్యలు చాలా తీరిపోతాయి!

నీటికి నీరు అన్న ఒక్కటే నిజమైన తెలుగుమాట. కొందరు దాని (నీళ్లు అనే) బహువచనరూపాన్నే వ్యవహరిస్తారు. ఇదే మాట సంస్కృతంలోకి 'నీరం' అనే రూపంలో ప్రవేశించింది. నీరాగారమని (అంటే నీటి ఇల్లు అని) సముద్రాన్ని పిలుస్తారు సంస్కృతంలో. మనకున్న ఒక్కమాటనూ సంస్కృతం సంగ్రహించినందుకు సంతోషదుఃఖాలు రెండూ అనుభవించాలేమో!

సంస్కృతంలో 'అప్పు, ఆపస్సు, వారి, సలిలం, జలం, కమలం, పయస్సు, కీలాలం, అర్ణం, అమృతం, జీవనం, భువనం, వనం, కబంధం, ఉదకం, పాథస్సు, పుష్కరం, సర్వతోముఖం, అంభస్సు, అంబువు, శంబరం, సంవరం, మేఘపుష్పం, ఘనరసం, రసం, కృపీటం, కాండం, జీవనీయం, కుశం, విషం' లాంటి (కొన్ని) పరస్పర విరుద్ధార్థాలున్న పర్యాయపదాలున్నాయి. వీటిలో 'సలిలం, జలం, ఉదకం' అనే మూడుమాటలే ఎక్కువ వాడుకలో ఉన్నవి. తక్కినవాటికి పుస్తకాలూ, కవులు ఆధారం.

నీరులేనిదే బతకటం దుర్ఘటం. మొదట గాలి, తరవాత నీరు మన ప్రాణాలు నిలుపుతాయి. ఆ మీదనే ఆహారం. ఈ సంగతి ఆదికాలం నుంచీ అందరికీ తెలుసు కాబట్టే నీటిని 'జీవనం, జీవనీయం, అమృతం' అని పిలిచారు. బతుకే నీటిమీద ఆధారపడ్డది కాబట్టే నీటిని జీవనం అన్నారు. బతికించేది కాబట్టే జీవనీయం. చావుతప్పించేది కాబట్టే (కొంతకాలమయినా) దాన్ని అమృతమన్నారు. బహుశా తియ్యనీటినే అమృత మనిఉంటారు. భువన శబ్దానికి లోకం, ప్రపంచమనే అర్థాలు కూడా ఉన్నాయి. ఈ సృష్టికే నీరు ప్రథమాధారం కాబట్టే నీటినే భువనమన్నారు. కాళిదాసు అభిజ్ఞానశాకుంతలం నాందీశ్లోకంలోనే 'యా సృష్టిః స్రష్టురాద్యా' అని స్మరించాడు ఈ దృష్టితోనే. అదే దృష్టితో రసమని కూడా పిలిచారు నీటిని. తియ్యనీరయితే పాలలాగా (కొబ్బరి పాలవంటి నీళ్లని ఇప్పటికీ పిలుస్తుంటాం కదా) ఆమోదకరంగా ఉంటాయని కాబోలు నీటికి పయస్సు అనికూడా పేరు పెట్టారు. పాథస్సు అనే మాటకు నీరు, అన్నం అనే రెండర్థాలూ ఉన్నాయి. నీరనే అర్థముంది కాబట్టి సముద్రాన్ని పాథోనిధి, పాథోధి అని కూడా పిలిచారు. అన్నమనే అర్థంలో పాథేయమని దారిబత్తేనికి పేరు పెట్టారు. అంటే నీటికి ఆహారమనే అర్థం కూడా కల్పించారని చెప్పాలి. మబ్బుల (ఘనం) నుంచి వచ్చే 'రసం' కాబట్టే ఘనరసమన్నారు.

ఇంతవరకూ బాగుంది కాని నీటిని 'కీలాలం, కబంధం, శంబరం, కుశం, విషం' అని ఎందుకు పిలిచారో చెప్పలేం. కీలాల శబ్దానికి నెత్తురనే అర్థమే మామూలిది. కబంధ శబ్దానికి (తలలేని) మొండెమనీ, సముద్రమనీ అర్థవిశేషా లున్నాయట. 'క' అంటే నీరనీ, దాన్ని బంధించి (కట్టిపడేసి) ఉంచేచోటుకాబట్టే సముద్రానికి కబంధమనే పేరువచ్చిందనీ కొందరు 'సాధిస్తారు' – అంటే సమర్థిస్తారు! సంస్కృతంలో

కొన్ని చమక్కులున్నాయి. అకారంనుంచి క్షకారందాకా ఉన్న ప్రత్యక్షరానికీ విడివిడి అర్థాలు సృష్టించి మంత్రశాస్త్రంలో ముఖ్యంగాను, చిత్రకవిత్వంలో మరోగతిలేకనూ కవిపండితులు ప్రయోగిస్తుంటారు. ఈ అర్థాలకోసం 'ఏకాక్షర నిఘంటువులు' పుట్టాయి. అవధానాలు చేసేవారు ఒక్కోపదాన్ని తునాతునకలుచేసి, అచ్చులుగా హల్లులుగా విడగొట్టి, వాటికి విడివిడి అర్థాలుచెప్పి, భాషలో సాములుచేసి, అదంతా కవిత్వమనిపించుకొని, పృచ్ఛకులనుంచి వచ్చే గండాలు తప్పించుకొని ఒడ్డున పడుతుంటారు. భాషలో వాక్యాలు అఖండంగా ఉంటాయని, పదాలూ ధ్వనులూ, ప్రకృతి ప్రత్యయాలూ వ్యాకరణ ప్రయోజనంకోసం (విడమరిచి తెలుసుకోవటంకోసం) సృష్టించుకున్నవనీ పతంజలి, భర్తృహరి వంటి సిద్ధాంతకర్తలు చెప్పారు. దానికి కేవలం విరుద్ధంగా ఏకాక్షర నిఘంటువులూ ఈ శషభిషలూ వ్యాప్తిలోకి వచ్చిన తరవాత భాషలోని సహజత్వం చచ్చి కృత్రిమ కవితాభాష ఏర్పడి కాలక్రమాన కవిత్వమనేది ప్రజలకు దూరమైపోయింది! ఈ కసరత్తులుచేయని వాల్మీకి, కాళిదాసువంటివాళ్ళు మహాకవులుగా బతుకుతున్నా, అంత పేరుప్రతిష్ఠలు సంపాదించటం మనవల్లకాదనేమో ఈ కసరత్తులతో కొందరు కాలం దొర్లిస్తున్నారు!

శంబర శబ్దానికి 'నీరు, చేప, జింక, ఒకరాక్షసుడు' వగైరా నానార్థాలున్నాయి. శంబరుడనే రాక్షసుడు మాయల్లో మొనగాడుట. అందుకే ఇంద్రజాలవిద్యకు శాంబరీ విద్య అనే పేరు వచ్చిందంటారు. నీరనే అర్థం రావటానికి శంబర శబ్దానికున్న శక్తి ఏమో సరిగా చెప్పలేం. అయినా ఇదెక్కడో మారుమూలగ్రంథాల్లో కనిపించే పర్యాయపదం కాబట్టి ఇబ్బందిలేదు. కు శబ్దానికి 'నీళ్ళు, దర్భ, పలుపు' వగైరా నానార్థాలున్నాయి. 'కు' అంటే 'భూమి'ట. దానికి 'శం' అంటే మేలు కలిగించేది కాబట్టి కుశమని నీటికి పేరువచ్చిందిట. అన్నిటికన్నా ఘోరమైన పర్యాయపదం 'విష'మనేది. దీనికి 'నీరు' అనే అర్థంకూడా ఉందికాబట్టి సముద్రానికి 'విషధి' అనే పేరుపెట్టారు.

కవుల 'చమత్కారానికి' ఇలాంటి మాటలే నిదర్శనమనే వాళ్ళున్నారు. దానికి లాక్షణికార్థాలనూ అలంకారిక సమర్థనలనూ చెప్పేవాళ్ళున్నారు. ఓ పెద్ద తెలుగుకవి విష్ణుమూర్తిని 'లంజకుమగండు' అని వర్ణించాడు! 'లం' అంటే నీరుట. అందులో 'జ' అంటే పుట్టింది కాబట్టి 'లంజ' అంటే లక్ష్మీదేవిట. నీటిలో నానావస్తువులూ పుట్టినా కవిగారికి తమకు దుర్లభమైన లక్ష్మిమాత్రమే గుర్తుకువచ్చింది! ఆమెగారి పెనిమిటికాబట్టి విష్ణుమూర్తిని పట్టుకొని ఇంత మాటా అన్నాడు. ఈకాలంలో ఇలాంటి పదకల్పనలు చేయకపోవటమే సారస్వతసేవ.

నీళ్లు అన్నివైపులా కనిపిస్తాయి కాబట్టి నీటిని 'సర్వతోముఖ'మని ఓ పెద్దమాటతో వర్ణించి అదికూడా ఒక పర్యాయపద మన్నారు. సంవరమనేది శంబర శబ్దానికి రూపాంతరమేనని నిఘంటువులు పేర్కొంటున్నాయి. కాండ శబ్దానికి ఒక్క శబ్ద రత్నాకరంలోనే పన్నెండు భిన్నార్థాలున్నాయి. అందులో నీరనేది ఒకటి. కృపీట శబ్దానికి కడుపనే అర్థంకూడా ఉంది. నీళ్లు అనే అర్థంకల్పించి అగ్నిని 'కృపీటయోని' అన్నారు. ఎందుకంటే నిప్పు నీళ్లలోనే పుట్టిందట. దానికి బడబాగ్ని అనే పేరుట. అది 'బడబ' అనే నీటి గుర్రం రూపంలో ఉంటుందట! సముద్రగర్భంలో

నివసించే ఒక జీవం తోకతో దెబ్బకొట్టే కరెంటుషాకు వస్తుందని తెలుసు. అలాంటి అనుభవమైన మహాత్ముడెవరో ఈకల్పన చేసివుంటాడు.

సముద్రంకాక నీరుండేవి మరికొన్ని ఉన్నాయి – నదులూ, కాలువలూ, చెరువులూ వగైరాలు. నదీ శబ్దానికి పర్యాయపదాలైన సంస్కృతం మాటలు "సరిత్తు, తరంగిణి, శైవలిని, తటిని, హ్రాదిని, ధుని, స్రోతస్విని, ద్వీపవతి, స్రవంతి, నిమ్నగ, ఆపగ, ప్రవాహిని, కూలంకష, నిర్ఝరిణి, సరస్వతి, స్రోతస్సు, నిర్ఝరం, ఝురం" మొదలైనవి. వీటిలో కొన్ని వర్ణనాత్మకాలు. అచ్చతెలుగులో వీటికి పర్యాయపదా లనదగ్గవి 'ఏరు, వాక, వంక, వాగు' అనేవి.

నది అంటే చప్పుడు చేస్తూ ప్రవహించేది. తూర్పున పుట్టి పడమటికి ప్రవహించే వాటిని నదాలని (నర్మద, తపతి వంటివి), పడమట పుట్టి తూర్పుకు ప్రవహించేవాటిని నదులని చెప్తారు. ఈ రెంటిలోనూ సమాన లక్షణం చప్పుడు చేయడం, గలగలమని పారటం. తరంగాలంటే అలలు. అలలున్న నది తరంగిణి – పెద్ద నది అన్నమాట. శైవలం అంటే నాచు. నాచుతో నిండిన నదిని శైవలిని అంటారు. తటం అంటే ఒడ్డు. నిజానికి ప్రతి జలరాశికీ ఒడ్డు ఉన్నా నదిని తటిని (ఒడ్డుగలది) అని పిలుస్తారు. హ్రాదం అంటే అగాధం – ఎక్కువ లోతన్నమాట. లోతైన నదిని హ్రాదిని అంటారు. ధుని అంటే ధ్వనియుక్తంగా గలగలమంటూ ప్రవహించే నది అన్నమాట. స్రోతం అంటే తనంత తానే పారేది. స్రోతస్విని అంటే ఎడతెగకుండా, సంవత్సరం పొడవునా ప్రవహించే జీవనది. ద్వీపమంటే లంక, దిబ్బ. ద్వీపవతి అంటే నడుమ లంకలున్న నది. గోదావరి, కృష్ణ వంటి పెద్దనది అన్నమాట. స్రవం, స్రావం అంటే కారటం. స్రవంతి అంటే జాలువారే కొద్దిపాటి నదీ ప్రవాహం.

నిమ్నం అంటే పల్లం. నిమ్నగ అంటే పల్లానికి ప్రవహించేది అని అర్థం. 'నీరు పల్లమెరుగు' అనే సూక్తి అందరికీ తెలుసు. అయినా నిమ్నగ అని నదినే ఎందుకన్నారో తెలీదు. ఆపగ అంటే 'నీటితో నడిచేది' అనే అర్థం చెప్పవచ్చు. ఈ మాటంటే పాల్కుర్కి సోమన్న వర్ణన గుర్తుకు వస్తుంది: 'పడిబారు సెలయేటి కొడలెల్ల కాళ్ళు' అన్నది! ప్రవాహినికి అర్థం స్పష్టం; ప్రవహించేదని. కూలం అంటే ఒడ్డు. కషణం అంటే కోయటం. ఒడ్డులొరుస్తూ ప్రవహించే నదిని కూలంకష అంటారు. నిర్ఝరిణికి సరైన తెలుగుమాట సెలయేరు. పైనుంచి హోరుమంటూ ప్రవహించే వాగును ఆ పేరుతో పిలుస్తారు. ఝురం అన్నా గబాగబా కదిలే జలప్రవాహమే. సరస్వతి అనేది నదీ సాధారణానికీ ఒక కానరాని నదికీ (త్రివేణుల్లో కనపడే గంగా యమునలు కాక కనపడని అంతర్వాహినికీ) పేరు. ఆ నది ఇప్పటికీ భూమిలో ప్రవహించి ప్రయాగ దగ్గర కలుస్తున్నదని చెప్తారు. కొందరు పుణ్యాత్ములకు కనిపిస్తుందట కూడా. నేను చూడలేదు, నాకు కనిపించలేదు. వాహిని అంటేనే నది. దీనికి సైన్యమనే మరో అర్థం కూడా ఉంది. ప్రవాహిని పెద్ద వాహిని, పెద్దనది.

ప్రవాహం, నిర్ఝరం, ఝురమనే వాటికి తుల్యమైన తెలుగుమాట 'కొండవాగు' అనేది. తెలుగు మాటలైన ఏరుకూ, వాగుకూ కొద్ది భేదముంది. వాగు చప్పుడు చేస్తూ కొండలమీదినుంచి ప్రవహించేది. ఊటకల ప్రవాహం ఏరు. ఏరెండిపోయినా

దాని మధ్యనున్న ఇసుక తిన్నెలమధ్య చిన్నగుంట తవ్వినా 'చెలమలు' పడి తియ్యని నీళ్ళు దొరుకుతాయి – ఏకాలంలోనయినా. వాగులో ఆ సౌకర్యం లేదు. వాక, వంక అనేవి రూపాంతరాలు. మెలికలు తిరుగుతూ ప్రవహించేవి అనే అర్థంలో ఈ మాటలు వాడ్తారు. వాగుకు సైన్యమనే విశేషార్థంకూడా ఉంది – వాహినీ శబ్దానికిలాగా. ఏరు శబ్దాన్ని నదిగా సంస్కృతీకరించడం మనవాళ్లకి అలవాటు. చెయ్యేరు (చెయ్యి–ఏరు)ను 'బాహుదానది' అనటం ఓ ఉదాహరణ. వేగంగా ప్రవహించేది వాగు. తిన్నగా ప్రవహించేది ఏరు. మెలి తిరుగుతూ ప్రవహించేది వంక/వాక.

ప్రవాహానికి తెలుగులో చాలా మాటలున్నాయి. 'పరవ, పరద, వరద, పరతి, పరత, వఱ్ఱు' అనేవి ప్రవాహార్థకాలు. వఱ్ఱు తప్ప తక్కినవి ఒకదానికొకటి పర్యాయపదాలు. వెల్లి, వెల్లువ అనే రూపాంతరాలకు పెద్దప్రవాహం/వరద అని అర్థం. వఱ్ఱు, వరదలు కూడా రూపాంతరాలో కాదో నిశ్చయంగా చెప్పలేం. వెల్లి, వెల్లువలు 'ముంపు' తెచ్చేవి. వరదలో ముంపు ప్రధానంకాదు. వేగం ముఖ్యం. త్వరగా వచ్చేది వరద; క్రమంగా దొర్లి ముంచివేసేది వెల్లువ.

పెద్ద నదుల మధ్య ఉండే భూభాగాన్ని ద్వీపమంటారు. ఆ సంస్కృతపదానికి అంతరీపమనే పర్యాయపదముంది. నాలుగువైపులా నీరున్న విశాల ప్రాంతం ద్వీపం. ఆ భాగం ఎప్పుడైనా ముంపునకు గురికావచ్చుగాని అది సాధారణంగా నీరు నిలవని ప్రదేశం. అంతరీపం అంటే (నది) మధ్యభాగంలో ఉండేదని అర్థం. నీళ్ళు ఎండినప్పుడు బయటపడే నదీమధ్య భూమిని పులినమంటారు. అది చిన్నచిన్న రాళ్ళగుట్టలతోకాక మెత్తని మట్టితో నిండినదయితే సైకతమంటారు. సికత అంటే మట్టి. ద్వీప శబ్దానికి సమానమైన తెలుగుమాట 'దిబ్బ/తిప్ప'. పులినానికి సమమయింది 'తిన్నె'. తిన్నెకు 'అరుగు' అనే అర్థవిశేషం కూడా ఉంది. ఎత్తయినది దిబ్బ/తిప్ప. అంత ఎత్తుకానిది తిన్నె. ద్వీప శబ్దం నుండి పుట్టిన తద్భవపదం 'దీవి'. మరో అచ్చ తెలుగుమాట – పరిమాణంతో నిమిత్తం లేనిది – లంక. శ్రీరాముడు సింహళద్వీపంలోని రావణాసురుణ్ణి కాక గోదావరి 'లంక'లోని ఒక వీరుణ్ణి జయించాడని కొందరు వాదించారు. ఆయనకు తోడ్పడ్డ గోలాంగూల సైన్యం పుట్టగోచీలు పెట్టిన శబర/సవర జాతివారేనని వారి వాదం. అయినా మనం చూడని, మనకు గట్టిగా తెలీని విషయం కనక దీన్నింతటితో వదిలేద్దాం.

నది అనేది సముద్రం తరవాత లోతయిన జలప్రవాహం. అంతకన్నా తక్కువలోతు కలవి చెరువులూ, దొరువులూ వగైరాలు. మొదట 'లోతు'కు పర్యాయపదాలు చూసి తరువాత ఆ లోతు తక్కువ వాటి సంగతి చూద్దాం. లోతు అన్న తెలుగుమాటకు 'పల్లు/పల్ల, అవుకు' అనేవి పర్యాయపదాలని కొందరంటారు. పల్లు, పల్లం అనేవి రూపాంతరాలు. వీటికీ సమానమైన సంస్కృతపదం నిమ్నం. దీనికి గభీరం, గంభీరం అనే రూపాంతరాలు పర్యాయపదాలు. లోతు తక్కువయితే 'ఉత్తాన'మంటారు. మరీ ఎక్కువయితే 'అగాధం, అతలస్పర్శం' అంటారు. వీటిలో రెండోది వర్ణనాత్మక పదం.

# చెరువులూ బావులూ

చిన్నదయితే చెరువు, పెద్దదయితే సరస్సు అనే భ్రాంతి చాలామందిలో ఉంది. కానీ మొదటిది తెలుగుమాట – రెండోది సంస్కృతపదం. పెద్ద పెద్ద చెరువులను 'సాగరం, సముద్రం' అని వర్ణించి అతిశయోక్తులు రాసిన పెద్దలున్నారు. ఫిరంగిపురం శాసనంలో శ్రీనాథుడంతటివాడు 'సంతాన సాగర(మనే) మహాపయోధి'లో తిమితిమింగలాలు కూడా తిరుగుతున్నాయన్నాడు! ఇంతాచేసి అదో పెద్దచెరువు. ఇప్పటి మన 'హుసేన్ సాగర్, హిమాయత్ సాగర్' వగైరాలకది ముందు రూపమన్నమాట. అప్పటికే అది చెరువు పరిస్థితి నుంచి సాగర్ స్థితికి పెరిగిందన్నమాట.

తెలుగులో 'చెరువు, కొలను, కొలకు, పడియ, గాడి, చెలమ, మడుగు, నీరుటెంకి, కుంట, కుంత, గుంట, గుంత' మొదలయిన మాటలున్నాయి. లోతైన చెరువును 'మడుగు' అంటారు. సంస్కృతంలోని 'హ్రద' శబ్దానికిది సమానార్థకం. చాలా చిన్నచెరువును 'పడియ' అంటారు. దీనికి 'పడి' అనే రూపాంతరముంది. పడియకన్నా పెద్దదీ, చెరువుకన్నా చిన్నదీ 'కుంట'. దీనికి 'కుంత, గుంట, గుంత' అనేవి రూపాంతరాలు మాత్రమే. చెరువులు సహజంగా ఏర్పడివుండవచ్చు. ఎవరైనా తవ్వించినవి కావచ్చు. వాటి వైశాల్యానికి ఒక పరిమితి లేదు. పరిమితిగలవీ తవ్వించినవీ అయిన చెరువులను – ముఖ్యంగా దేవాలయాల ఆవరణలో ఉన్నవాటిని – కొలను/కొలకు అంటారు. చెరువులకు జలాధరం నదుల ద్వారా కాలవల ద్వారా ఏర్పడి వుండవచ్చు. అలాంటి అవసరంలేని ఊటగల చిన్నచెరువులను 'చెలమ'లంటారు.

తీరప్రాంతంలో ఇసకనేలల్లో 'దొరువు'లుంటాయి. అవి వైశాల్యంలో చిన్నవయినా బావుల్లోలాగా ఊట కలవి. సాలు పొడుగునా నీటివూట ఉండి వ్యవసాయానిక్కూడా పనికివచ్చే చెలమలను 'సొన'లంటారు. రాయలసీమ ప్రాంతంలో వాటినే 'దొన'లంటారు. ఈ రెండు పూర్వం రూపాంతరాలేగాని కాలక్రమాన అర్థభేదం సంపాదించాయి. సొనలు సాధారణంగా చిన్నవి. సన్నగా పొడుగ్గా ఉండే సొనను 'గాడి' అని పిలుస్తారు. దొనకు 'దొణ' అనే రూపాంతరముంది. రెండుగుట్టల నడుమ నీరుచేరే పల్లపు ప్రాంతాన్ని రాయలసీమలో 'దొణ'లంటారు. అటువంటి స్థలాల్లో సాధారణంగా శివలింగం ప్రతిష్ఠించి 'దొణప్ప' అని పిలుస్తారు. ఊటనీరున్నవి సొనలయితే కొండవాగులు చేరేచోట్ల దొణలు. మొదటివి ఇసకనేలల్లో రెండోవి కొండసీమల్లో సాధారణం.

చాలా పాతకాలంలో (రోడ్లు బాటలూ లేని రోజుల్లో) ప్రయాణికులు ఒక దొరువు నుంచి మరో దొరువుదాకా మజిలీలు చేస్తూ ప్రయాణించేవాళ్లు – దారిలో దప్పికతీరే వసతులు వెదుక్కుంటూ. అప్పుడా దొరువులను (కన్నడంలోలాగా) 'తొఱె' అని పిలిచేవాళ్లు – బండిరాతో సహా. ఆమాటే 'తొఅవ, త్రోవ, త్రోవ, దోవ'గా కాలక్రమాన మారిందంటారు. ఇంకాకొన్ని ఊళ్లపేర్లు 'తొరె' చివర

చేరినవి కన్నడం దేశం సరిహద్దుల్లో వినిపిస్తాయి. 'నీరుటెంకి' అనేది కవిపండితులు కల్పించుకున్న సమస్తపదం. టెంకి అంటే స్థానం, ఉండేచోటు. నీళ్లు నిలిచినచోటు అనే అర్థంలో ఈమాట పుట్టింది. మరో ముఖ్యమైన విషయం సౌనల్లో నీరు ప్రవహించటం; చెరువుల్లో నిలకడగా ఉండటం; పడియల్లో 'నిలవనీరు' చేరటం.

సంస్కృతంలో 'జలాశయం, జలాధారం, నిపానం, అపకూపం, హ్రాదం, పద్మాకరం, తటాకం, తడాగం, కాసారం, సరసి, సరస్సు, పుష్కరిణి, ఖాతం, అఖాతం, దేవఖాతం, వేశంతం, పల్వలం' మొదలైన మాటలు ఇంచుమించు పర్యాయార్థంలో కనిపిస్తాయి. మొదటి రెండుమాటలూ వర్ణనాత్మకమైనవి – 'నీరుటెంకి' అనే తెలుగుసమాసానికి సమానమైనవి. సహజంగా ఏర్పడ్డ చెరువులు చిన్నవైనా పెద్దవైనా 'అఖాతం' అనిపించుకుంటాయి. ఖాతం అంటే తవ్వింది; అఖాతం ఎవరూ తవ్వకుండా తనంత తానే ఏర్పడ్డది (బంగాళాఖాతం లాగా). ఆ భావం మరింత స్పష్టంగా చెప్పటానికి అఖాతాన్ని దేవఖాతం అనికూడా పిలుస్తారు. అంటే దేవతలు తవ్వించన్నమాట (సాగరాన్ని సగరుడి కొడుకు తవ్వాడని చెప్పినట్లు). తవ్విన చెరువు ఖాతం. దాన్ని పుష్కరిణి అనే మరోపేరుతో పిలుస్తారు. పుష్కర శబ్దానికి 'తామర' (పువ్వు) అనే అర్థం కూడా ఉంది కాబట్టి తామరపూలున్న చెరువును పుష్కరిణి అనవచ్చు. ఎందుచేతనో 'నల్చదరంగా' ఉండే చెరువును ఈ పేరుతో పిలుస్తారు. స్వామి(వారి) కోవెలలో ఉండే కొలనుకి పుష్కరిణి అని పేరు ఎక్కువ వాడుకలోకి వచ్చింది.

పల్వలం, వేశంతం, అల్పసరమనే మాటలు తెలుగులోని 'పడియ'కు సమానార్థకాలు. హ్రాదమనేది మడుగుకు సమానార్థకం. చెలమకు సమానమైనది ఉపకూపమనే పదం. కూపం అంటే బావి. చిన్న బావిలాంటిదనే అర్థంలో ఆమాట పుట్టింది. గాడికి సరయిన సంస్కృతపదం నిపానం. సరసి, సరస్సు అన్యోన్యం రూపాంతరాలు. 'నీటితో నిండిన'దని దానికర్థం. పద్మాకరం అంటే తామరపూలుండే తావని అర్థం. కొందరు కలవపూలుండే చోటనే అర్థంలో కమలాకరం వగైరా పేర్లతో పిలుస్తారు. ఇవి వర్ణనాత్మకమైన పదాలు. తటాకతడాగ శబ్దాలు చెరువు, కొలను అనే అర్థంలో వాడే పరస్పర రూపాంతరాలు. కాసారమనేది వర్షాధారంతో ఏర్పడ్డ చెరువు.

నీరు ప్రవహించేవీ, తవ్వి సృష్టించేవీ, తవ్వి సృష్టించిన పొడుగాటివీ అయిన జలాధారాలను కాలవ లంటాం. అవి చిన్నవయితే బట్టెలు; మరీ చిన్నవయితే 'జాలు'లు. లోతు తక్కువయితే 'కయ్య'లు; చీలి పాయలైనవయితే 'కూడలి' లు. ఈ తెలుగుమాటలకు అర్థభేదాలతో నిమిత్తంలేని సంస్కృత పర్యాయపదం 'కుల్య'.

నదులూ, చెరువులూ, కాలువలూ ఎక్కువమందికి ఉపయోగపడే జలాధారాలయితే బావులు పరిమిత ప్రయోజనం కలవి. ఈ కాలంలో బావి, నుయ్యి/నూయి ఇంచుమించు సమానార్థకాలే గాని పూర్వం కాదు. నన్నయ భారతంలోని శకుంతలోపాఖ్యానంలో "నుతజలపూరితంబులగు నూతులు నూరిటకంటె సూనృతవ్రత! ఒకబావిమే"లనే ప్రయోగముంది. దాన్నిబట్టి నుయ్యికన్నా బావి పెద్దదని తేలుతుంది. బావుల్లో నడబావి, దిగుడుబావి వంటి భేదాలున్నాయి. నీటి ఊట వుండి పెద్దదై వ్యవసాయాధారంగా

ఉండి దిగి నీళ్ళు తెచ్చుకోవడానికి మెట్లుకూడా ఉన్నది దిగుడుబావి. దీన్ని పూర్వం డిగ్గియ/దిగ్గియ అనేవాళ్ళు – డిగడానికి/దిగడానికి వీలుగా మెట్లున్న బావి అనే అర్థంలో. బావితో కలిసిన సమస్తరూపమే ఇప్పటి వాడుకలో నిలిచింది. ఇవి తెలుగుమాటలు.

వాపి, కూపం, దీర్ఘిక – అనేవి సంస్కృతపదాలు. లోతయిన నుయ్యి – కూపం. లోతు తక్కువది వాపి. విశాలమయింది దీర్ఘిక. ఈ మాటనుంచే తెలుగులోని 'డిగ్గియ' పుట్టిందని కొందరంటారు. కాని అది నప్పని వ్యుత్పత్తి. డిగు–దిగు అనే రూపాంతరాలున్న తెలుగుమాటకూ దీనికీ సంబంధం లేదు. తెలుగుమాటలో కిందకు దిగడానికి వీలున్నబావి అనే అర్థముంటే సంస్కృతపదానికి దీర్ఘమైన/పొడుగైన బావి అనే అర్థం. వీటికి పర్యాయపదాలుగా అంధువు, ప్రహి, ఉదపానం అనే మాటలుకూడా ఉన్నాయి సంస్కృతంలో. అంధువంటే చీకటిగా గుడ్డిగా ఉండేదని అర్థం. అంటే చాలా లోతయిన బావి అన్నమాట. ఉదం అంటే నీరు. ఉదపానమనే సమాసానికి తియ్యనీటి/తాగునీటి బావి అర్థం.

నీళ్ళుంటూ ఉన్న తరవాత నిశ్చలంగా ఉండటం తక్కువ. నీటికదలికను సూచించే అలలు సముద్రంలో ఉన్నంత స్పష్టంగా జోరుగా ఇతర జలాశయాల్లో ఉండవు. అల అనే తెలుగు మాటకు 'తెర, కరడు, కర, కడలు, తరగ, తరంగ' అనేవి పర్యాయపదాలంటారు. తెరకు గుడ్డపొర మొదలైన అర్థాంతరాలున్నాయి. గాలి 'తెరలుతెరలు'గా వీస్తుందని, వాసన అలాగే వస్తుందని అనే సందర్భాల్లో ఈమాట ఎప్పుడూ బహువచనరూపంలోనే వాడుకలో కనిపిస్తుంది. కర, కరడు అనేవి అన్యోన్య రూపాంతరాలు. వీటికి కావ్యప్రయోగాలేగాని వాగ్ వ్యవహారంలో వాడుక ఉన్నట్లు లేదు. 'కరడుగట్టిన మూర్ఖత్వం' వంటి ప్రయోగాల్లో 'ముద్దగట్టిన, గట్టిపడిన' అనే అర్థముంది. కానీ ఒకప్పుడీపదంలోని రేఫను బండిరాగా పలికేవాళ్ళు – వేరుమాటగా. కడలుశబ్దానికి 'చివరలు' అనే అర్థం ఉంది. బహుశా 'కడ'దాకా – చివరదాకా – లేదా చాలా దూరం – ప్రయాణించే అలలను ఈ పేరుతో పిలిచి, ఇలాంటి కడళ్ళున్నది కాబట్టి సముద్రాన్ని 'కడలి' అని పిలిచారేమోనన్న అనుమానం పుడుతుంది. తరగ/తరంగ – అనేవి సంస్కృతతరంగ శబ్దభవాలే.

సంస్కృతంలో 'అల'కు పర్యాయాలు 'తరంగం, భంగం, ఊర్మి, వీచి' అనేవి. భంగమంటే విరిగిపోయేదని అర్థం. ఊర్మి అనేది గుండ్రంగా చుట్టూ వ్యాపిస్తూపోయే అల. నీటిమీద రాయివేస్తే వలయాలుగా నీరుకదులుతుంది. అటువంటిదే ఊర్మి. దీనికి ఊర్మిక అనే రూపాంతరముంది. ఊర్మికన్నా ఊర్మిక చిన్నది. ఊర్మిక అనేమాటకు 'ఉంగరం, (గుడ్డ) ముడత'లాంటి ఇతరార్థాలున్నాయి. గుండ్రదనం ప్రధానంగా వచ్చినమాట ఇది. అయితే కొన్ని నిఘంటువుల్లో 'అల, పెద్దఅల' అనే అర్థాలెందుకిచ్చారో తెలీదు. వీచీ శబ్దానికి వీచిక అనే రూపాంతరముంది. ఆ శబ్దానికి 'కాంచెం' అనే అర్థవిశేషం కూడా ఉంది. గాలికి కదిలే చిరుతరంగాలను ఈ పేరుతో పిలుస్తారు. వీచికన్నా వీచిక చిన్నది. తరంగమనేది సాధారణ శబ్దం. 'తరలించేది, కదిలేది, దాటేది' అని దీనికర్థం. సముద్రంలో ఒక అల బయలుదేరి ఒడ్డుకు చేరేలోగా విరిగిపోతుంటే మరొకటి దానిమీదుగా దొర్లి ఒడ్డునపడుతుంది. అవీ

తరంగాలు. ఇలాంటి సూక్ష్మభేదాలున్నాయి కాబట్టి ఈ మాటలు ఒకదానికొకటి అన్ని సందర్భాల్లోనూ పూర్తిగా పర్యాయపదాలని చెప్పటం సముచితంకాదు.

నీళ్ళలో – ముఖ్యంగా నదుల్లో సముద్రంలో – సుళ్ళుంటాయి అక్కడక్కడ. సుడి అనేది తెలుగుమాట. గుండ్రంగా నీళ్ళు తిరిగే ప్రమాదకరమైన తావు సుడి. సుడియు అనే క్రియాపదానికి 'చుట్టుకొను, మెలిదిరుగు' వంటి అర్థాలున్నాయి. దాని నామరూపం సుడి. దానికి పర్యాయపదా లనదగ్గ సంస్కృతపదాలు 'ఆవర్తం, భ్రమం' అనేవి. ఆవృత్తి అంటే వచ్చిందే మళ్ళీమళ్ళీ రావటం, గుండ్రంగా తిరగటం (వృత్తంలాగా) అనే అర్థాలున్నాయి. అలా తిరిగే నీళ్ళున్నతావు ఆవర్తం. భ్రమ శబ్దానికి ఇతరార్థాలతోబాటు 'తిరగటం' అనే అర్థంకూడా ఉంది. ఈ మూడుమాటలు స్వభావాన్నీ లక్షణాన్నీ పురస్కరించుకొని పుట్టాయన్నమాట.

ఏ జలరాశికయినా ఒక దరి ఉంటుంది. 'దరి, తట్టు, ఒడ్డు' అనే తెలుగుమాటలు దాదాపు ఒకే అర్థంగలవి. వీటిలో చివరిది ఎక్కువ వాడుకలో ఉన్నమాట. ఒడ్డు శబ్దానికి క్రియార్థంలో 'ఎదురుపడు, తాకు' వగైరా అర్థాలున్నాయి. గట్టును తాకేచోటు ఒడ్డు. దరియు అనే క్రియాపదానికి 'సమీపించు, దాటు' మొదలైన అర్థాలున్నాయి. గట్టును చేరే చోటు దరి. అలాగే నీళ్ళు భూమిని 'తన్నే, తాకే' చోటును తట్టు అంటారు. తానున్నచోటకి దూరంగా ఎదురుగా ఉన్న ఒడ్డును 'అద్దరి, అవతలి, ఆతల, ఆవల, అవ్వల, అవల' అంటారు. తనవైపున్న ఒడ్డును 'ఇద్దరి, ఈవల, ఇవ్వల, ఇవల, ఈతల, ఇవతల' అని పిలుస్తారు. అవతలి ఒడ్డును సంస్కృతంలో 'పార'మంటారు. ఇవతలిదాన్ని 'అవార'మంటారు. కేవలం ఒడ్డును చెప్పేసంస్కృతపదాలు 'కూలం, తీరం, తటం, రోధస్సు, ప్రతీరం' లాంటివి. వీటిలో మొదటిమాటకే వాడుక ఎక్కువ తెలుగులోకూడా. తక్కిన రెంటికీ కావ్యప్రయోగాలే గతి.

## రాళ్ళూ రప్పలూ

భూమిమీద కనిపించే సర్వసాధారణ ఘనపదార్థం రాయి. 'రాయి, రప్ప, కల్లు' అనేవి తెలుగుమాటలు. వాటిలోని మొదటి రెంటినీ కలిపి ఏక బహువచనాల్లో ఒక్కమాటగానే వాడుతుంటాం. రాయి అనేది సహజంగా ఏర్పడింది కావచ్చు, కల్పించింది కావచ్చు (ఇటికరాయిలాగా). కల్లు అనేది అచ్చతెలుగుమాటే గాని దానికీకాలంలో సమాసాల్లోనేగాని వ్యస్తంగా వాడుక ఉన్నట్లు లేదు. 'ఉప్పుగల్లు' వంటి సమాసాల్లో ఇప్పటికే వాడుకలో ఉన్నమాట ఇది. రప్ప అనే మాట ఎలా ఏర్పడిందో తెలీదు. తెలంగాణా వాడుకలో 'రాతు' అనే అన్యదేశ్యానికే వాడుక ఎక్కువ. నేలలో అడుగున ఉన్న రాతిని 'చట్టు' అంటారు. చదునుగా ఉండేరాతిని చాపరాయి, చలుప అనేపేర్లతో పిలుస్తారు. అయితే రెండోమాటకు వాడుక చాలా తక్కువ. వెడల్పయిన రాతిని 'బండ' అంటారు. గుండ్రటి రాయి 'గుండు'. చాలా చిన్నరాయి 'మొరవ'.

రాయి శబ్దానికి పర్యాయాలుగా సంస్కృతపదాలు కొన్ని వాడుకలో ఉన్నాయి. 'పాషాణం, ప్రస్తరం, గ్రావం, శిల, ఉపలం, అశ్మం, దృషత్తు, దృశత్తు' అనేవి. వాటిలో చివరివి రెండూ రూపాంతరాలు – వాటికి కావ్య ప్రయోగాలే దిక్కు. వాటి మూలార్థం 'కనిపించేవి' అనేది. గట్టిరాతిని పాషాణమంటారు. ఉపలమంటే మొరపరాయి, పాత్రం వగైరా. ప్రస్తర శబ్దానికి రత్నమనే అర్థవిశేషముంది. అంటే మెరిసేరాయి అని అర్థం. పాషాణం బండరాయి. గ్రావం అనేది కఠినమైన రాయి. శిల పొరలరాయి. 'అశ్మం' అనేది చిన్నరాయి.

పెద్దరాతిగుట్టను కొండ అంటారు. ఈ తెలుగుమాటకు 'మల, గట్టు, తిప్ప, దిబ్బ, గుబ్బలి, కరువ, ఇలతాల్పు, మెట్టు' వంటివి పర్యాయపదాలంటారు. 'తిరుమల' వంటి స్థల నామాల్లో కనిపించే 'మల' శబ్దానికి ఇప్పుడు విడిగా ప్రయోగమున్నట్లు లేదు. ఈ శబ్దం దక్షిణభారతంలో వినిపించినందున దక్షిణ పర్వతానికి 'మలయపర్వత'మని బహుశా పేరువచ్చి ఉంటుంది. నిజానికి ఈ సమస్తపదం పిగ్గుబిడియం, పేపర్ కాగితంలాంటిదన్నమాట. గట్టు చాలాచిన్న రాళ్లగుట్ట. అంతకన్నా పెద్దది తిప్ప. దిబ్బ దీనికి రూపాంతరం. 'కొండగాలి' అనే అర్థంలో వచ్చే 'కరువలి' అనే పదంలో కొండ అనే అర్థంలో కరువ శబ్దం వినిపిస్తుంది. దీనికి కావ్యప్రయోగాలు కూడా ఎక్కువలేవు. గుబ్బలి అనేది గుబ్బలాగా గుండ్రంగా ఉండే కొండకు పేరు. ఇలతాల్పు అనే సమాసం 'భూమీధ్రం' అనే సంస్కృత సమాసానికి కవిపండితులు కల్పించుకొన్న అనువాదమేగాని నిత్యవ్యవహారంలో వినిపించే, వినిపించదగ్గ మాటకాదు. కొండ అన్నదే మామూలు మాట.

'మహీధ్రం, శిఖరి, క్ష్మాభృత్తు, ఆహార్యం, ధరం, పర్వతం, అద్రి, గోత్రం, గిరి, గ్రావం, అచలం, శైలం, భూమీధ్రం, శిలోచ్చయం' వంటి అనేక సంస్కృత పదాలు కొండకు పర్యాయపదా లంటారు. వీటిలో పర్వతం, గిరి, అద్రి అనే మాటలకే వాడుక ఎక్కువ. వీటిలో అనేకం వర్ణనాత్మకాలు. మహిని (భూమిని) ధరిస్తుంది కాబట్టి మహీధ్రమన్నారు. కొండ భూమిని మోస్తుందనేది పురాణకల్పన. క్ష్మాభృత్తు, భూ(మీ)ధ్రమనేవి కూడా ఇటువంటివే. శిఖరం (కొప్పు/కొమ్ము) ఉన్నది శిఖరి అన్నారు. అనేక శిలలు (రాళ్లు) కలిసి ఏర్పడ్డది కాబట్టి శిలోచ్చయ మన్నారు. కదలనిది కాబట్టి 'అచల'మని పిలిచారు. అంటే ఇంద్రుడు కొండలరెక్కలను విరగ్గొట్టిన తరువాత వాటికి పట్టినగతిని ఈ మాట సూచిస్తుందని సరిపెట్టుకోవాలన్నమాట. శిలల సమూహం లేదా శిలలవల్ల ఏర్పడ్డది కాబట్టే శైల మన్నారు.

ఆహార్యమనేది చిత్రమైన మాట. దానికి 'అలంకార'మనే అర్థంకూడా ఉంది. 'మిహికాహార్యం' వంటి పేర్లతో హిమాలయాలవంటి మంచుకొండలను పిలిచేవాళ్ళు – మంచే అలంకారంగా కలదన్న అర్థంలో ఫలితంలో ఆహార్యశబ్దానికి కొండ అన్న సంకుచితార్థం కాలక్రమాన వచ్చిందన్నా ఆశ్చర్యంలేదు. ధర అంటే భూమి. భూధరం అంటే కొండ. మోసేది అనే అర్థంలో ఈ మాట పుట్టింది. గోత్ర శబ్దానికి వంశం, కులం వగైరా అర్థవిశేషాలు కూడా ఉన్నాయి. ఒక్కో వంశానికి ఒక్కో కొండ గుర్తుగా ఉంటుందనే విశ్వాసంతో కులపర్వతాలను నిర్ణయించారు పూర్వులు. ఆ భావన ఫలితంగా గోత్ర శబ్దానికి కొండ అనే సాధారణార్థం కూడా వచ్చిందని

చెప్పాలి. గ్రావ శబ్దానికి బండరాయనే అర్థం కూడా ఉంది. అద్రి శబ్దానికి 'చెట్టు, సూర్యుడు' వగైరా అర్థాంతరాలున్నాయి. అంచెలంచెలుగా పైకిలేచింది కాబట్టి పర్వతమన్నారు. గిరి మామూలుమాట.

కొండపైభాగాన్ని తెలుగులో 'కొమ్ము, కొప్పు, గుబ్బ, పేటు, సిగరం' అని పిలుస్తారు. సంస్కృతంలో 'శృంగం, శిఖరం, కూటం' అంటారు. శృంగం – కొమ్ము అనేవి సమానార్థకాలు. పైకి పొడుచుకొని వచ్చిన భాగం కాబట్టి గుబ్బ. అలాంటి గుబ్బలున్నది గుబ్బలి. సిగరం అనేది శిఖర శబ్దభవం. శిఖా శబ్దానికి జుట్టని కూడా అర్థముంది. తలపైభాగాన జుట్టున్నట్లు కొండ మీద ఎత్తయిన ప్రాంతాన్ని కొప్పనీ, శిఖరమనీ పిలుస్తారు. కూట శబ్దానికి సమూహాద్యర్థాలున్నాయి. ఇవన్నీ మొత్తం వర్ణనాత్మకంగా పెట్టిన పేర్లనిపిస్తాయి.

కొండవాలును 'చరియ' అంటాం తెలుగులో. దానికి 'చరి' అనే రూపాంతరం, 'పడకు/పణక' అనే పర్యాయపదం ఉన్నాయి. ఇంటి విషయంలో కూడా వాలుగా ఉన్న కొప్పును పెణక అంటారు. ఆ మాటకూ పడకు/పణకలకూ దగ్గరి సంబంధముంది. పడుతున్నట్లు వాలి ఉన్న భాగమని అర్థమున్నమాట. సంస్కృతంలో దాన్ని 'ప్రపాతం, భృగువు, తటం' అని పిలుస్తారు. ప్రపాతం ఎక్కువ వాలుగా ఉన్నదనే అర్థంలోనూ, భృగువు ఎత్తయినదన్న అర్థంలోనూ వాడుకకు వచ్చాయి. తట శబ్దానికి ఒడ్డులాంటి ఇతరార్థాలున్నాయి. కొండమీద వెన్ను (గాడి)లాగా పొడవుగా ఎత్తున ఉన్న భాగాన్ని తెలుగులో 'నెత్త'మనీ, సంస్కృతంలో 'కటక'మనీ పిలుస్తారు.

కొండ భూమిని కలిసినచోట చదునుగా ఉన్న పీఠభూమిని సంస్కృతంలో 'సానువు, స్నువు, ప్రస్థం' అని పిలుస్తారు. సానువంటే కొండనెత్తమని కొందరంటారు. మరికొంద రది 'లోయ'కు (అంటే రెండుకొండల మధ్య తక్కువ ఎత్తున ఉన్న ఇరుకుచోటు) సమానార్థకమంటారు. స్నుశబ్దం సంస్కృతంలో కూడా మారుమూల మాటే. ప్రస్థమన్నా కొండనెత్తమేనని కొందరు చెప్తే మరికొందరు అది కొండల మధ్య ఇరుకుదారి అని వివరిస్తారు. కొండకింది పల్లపునేలను 'ఉపత్యక'మనీ, మెట్టనేలను 'అధిత్యక'మనీ సంస్కృతంలో చెప్తారు. వీటికి సరైన తెలుగుమాటలేవో తేలటంలేదు.

కొండల్లో గుహలుంటాయి కదా. ఆ మాట సంస్కృతపదం. తెలుగువారి వాడుకలో నిలిచి పోయినమాట. దానికి గహ్వరమనే పర్యాయపదముంది సంస్కృతంలోనే. చీకటిగా ఉండేదనే అర్థం దానికి. గుహ అంటే శబ్దరత్నాకరాదులు కొండలోని 'తొలిచిన' భాగమని వివరిస్తాయికాని సంస్కృత నిఘంటువుల లెక్కన సహజంగా ఏర్పడ్డవాటినే గుహా గహ్వరశబ్దాలతో వ్యవహరించాలి. కృత్రిమంగా మనుష్య ప్రయత్నంవల్ల ఏర్పరచినవాటిని 'దరి, కందర(ం)' అనే మాటలతోనే పిలవాలని సంస్కృత నిఘంటువులు నిర్దేశిస్తాయి. వీటికి సరైనమాట తెలుగులో 'బొరియ' కావచ్చు. కాని నక్కల బొరియలనే ప్రయోగమేగాని కొండబొరియలనే ప్రయోగం ఏమారుమూలనైనా ఉందేమోగాని వాడుకలో ఉన్నట్లు లేదు. పర్వతబిలం వంటి వర్ణనాత్మకపదాలు మరికొన్ని సంస్కృతంలో లేకపోలేదు.

★ ★ ★

# ఎత్తుపల్లాలు: పొడుగు వెడల్పులు

కొండలు ఎత్తుగా ఉంటాయి. ఎత్తు అనే తెలుగుమాటకు 'వాసి' అనేది పర్యాయపదమని కొందరంటారుగాని అది పొడవుకు పర్యాయమని మరికొందరి వాదవ. సంస్కృతంలో 'ఉచ్చం, ప్రాంశు(వు), ఉన్నతం, ఉదగ్రం, ఉచ్ఛ్రితం, తుంగం' అనే విశేషణాలున్నాయి ఎత్తుకు దీటుగా. చాలా ఎత్తయినది తుంగం. అంతకన్నా ఎత్తయితే ఉత్తుంగం. మన కవులు చెరువునీటిలోని చిరుతరగలను కూడా ఉత్తుంగతరంగాలని వర్ణిస్తారు అతిశయోక్తులతో! 'తుంగస్తనీ' అని స్త్రీని వర్ణించే వాళ్లకదో లెక్క కాదుగదా! ఉచ్చమంటే ఎత్తయిన. బాగా ఎత్తయితే ప్రాంశువు. ఈ మాటకు 'పొడగరి' అనే అర్థవిశేషంకూడా ఉంది. 'ప్రాంశులభ్యే ఫలే మోహా దుద్బాహు రివ వామనః' అన్న కాళిదాస ప్రయోగముంది. ఉన్నత, ఉదగ్ర శబ్దాలకు '(కొన)పైకి లేచిన, పైకి(కొన)దేలిన' మొదలైన అర్థభేదాలున్నాయి. మిట్టగా, మిర్రుగా తక్కువ ఎత్తులో ఉంటే దాన్ని సంస్కృతంలో ఉత్తానమంటారు.

పొడుగు అనే తెలుగు మాటకు 'పొడవు' అనే రూపాంతరం, 'నిడుద, చాపు, నిడివి, నిడుపు, వాసి' అనేవి పర్యాయపదాలంటారు. నిడుద, నిడివి, నిడుపు అనే మూడుమాటలూ నిడు అనే (అంటే పొడుగైన అనే అర్థంగల) విశేషణం నుంచి పుట్టిన నామవాచకరూపాలు. పొడవు శబ్దానికి 'ఉన్నతమైన, ఎత్తయిన' అనే అర్థవిశేషాలున్నాయి. 'పొడవులన్నింట పొడవైన బోటువేల్పు' అని భగవంతుణ్నే స్తుతించిన తెలుగు కవులున్నారు. చాగు అనే పాతమాటకు సాగు అనే ఇప్పటి రూపం. ఇప్పటి వాడుకలో నిలిచిన (పంచెల)చాపువంటి మాటల్లో పొడుగయిన (పంచె) అనే అర్థముంది. వాసి అనేమాటకు 'అంతరం, భేదం' అనే విశేషార్థాలేకాక 'ఎత్తయిన' అనే అర్థవిశేషంకూడా ఉంది.

'పొడుగు'కు పర్యాయాలని చెప్పదగ్గ సంస్కృతపదాలు 'దైర్ఘ్యం, ఆయామం, ఆరోహం, ఆనాహ'మనే విశేష్యాలూ, 'దీర్ఘం, ఆయతం' అనే విశేషణాలూ. వీటిలో దీర్ఘశబ్దరూపాలకే వాడుక ఎక్కువ. ఆయామ శబ్దానికి వైశాల్యమనే అర్థమూ, ఆయత శబ్దానికి 'విశాల'మనే అర్థమూ తెలుగువారు కల్పించుకొన్న సంస్కృతార్థాలు. ఆరోహశబ్దానికి 'ఎక్కడం, ఎగుడు' అనే అర్థాలు అలాగే వచ్చాయి.

ఎందుచేతనోగాని తెలుగులో 'పొట్టి' శబ్దానికి చాలా పర్యాయపదాలున్నాయి. 'మొటిమ, గిటర, పొదిటి, పొదడు, గున్న, పొనుగు, బుడుత, గుజ్జు, బురుక, బుడిగి, కురుచ, కురుజు, కుర్ర, కొటిక, కుసువి, కుట్ట, మట్టం, మట్టసం, గొనమ, గొనప, గొవిసె, గునసె, గిరక, టింగణా' వంటివనేకం. టింగణా ఎలాంటి తెలుగుమాటోగాని 'సంగతియె యోయి ఇనుమంత టింగణావు' అనే ఆముక్తమాల్యదా ప్రయోగంలో ఆమాట ప్రత్యక్షమవుతుంది. పొట్టిగా ఉండే వస్తువులపేర్లుగా (ఉదా. మొటిమ), వ్యక్తులపేర్లుగా (ఉదా. బుడత, గుజ్జు మొ.), చిన్నవనే అర్థంలో (ఉదా. కుర్ర), 'చదునైన, నేలబారు' మొదలైన అర్థాల్లో (ఉదా. మట్టసం మొ.) రకరకాలుగా

ఈమాటలు కొన్ని సమయాల్లో విశేషణాలుగా, మరికొన్నిసార్లు విశేష్యాలుగా వాడుకలో ఉన్నాయి. వీటిలో కొన్ని ఒకదానికొకటి రూపాంతరాలు (ఉదా. బుడుత, బుడిగి; కురుచ, కురుజు; గొనమ, గొనప).

పొట్టి శబ్దానికి పర్యాయాలని చెప్పదగ్గ సంస్కృతపదాలు 'హ్రస్వం, వామనం, కుబ్జం, నీచం, ఖర్వం' అనేవి. వీటన్నిటిలోనూ మొదటిపదానికే వ్యాప్తి ఎక్కువ. కుబ్జ శబ్దానికి 'మరిపొట్టి, మరుగుజ్జు' అని అర్థం. వామనుడి సంగతి జగద్విదితం. నీచ శబ్దానికి తక్కువదనం లాంటి అర్థాంతరాలున్నాయి. వీటికి 'చిన్న' అనే అర్థం కూడా ఉంది. ఖర్వ శబ్దానికి కావ్యప్రయోగాలే దిక్కు.

వెడల్పుకు 'విప్పు, తనర్పు, వెడద, విరివి, పరపు' అనే మాటల్తో దగ్గరి చుట్టరికముంది. విప్పుకు వైశాల్యం, తనర్పుకు ఉల్లాసం, విరివికి సమృద్ధి, పరపుకు చదునులాంటి అర్థవిశేషాలు లేకపోలేదు. వీటికి దీటైన సంస్కృతపదాలు 'పరిణాహం, విశాలత' అనేవి. విశాలతకు రూపాంతరం వైశాల్యం. దానికి ఈ కాలానికి పొడుగు వెడల్పులను వెచ్చిస్తే వచ్చే చదరపు కొలత అనే అర్థం గణితశాస్త్రం పుణ్యమా అని వచ్చింది. మరి హృదయవైశాల్యమనే మాటలోని రెండో భాగానికి స్పష్టమైన అర్థమేమో ఊహించండి!

## వనాలూ మూలికలూ

కొండల్లాగా నదుల్లాగా భూమిమీద కనిపించే అత్యంత ప్రయోజనకరమైన ప్రకృతి సంపద అడవి. ఈ మాట 'అటవీ' అనే సంస్కృత శబ్దంనుంచి పుట్టింది. అచ్చ తెలుగుమాట 'కాన'. ఈ మాటకిప్పుడు వాడుక తక్కువ. తద్భవమైన అడవికే వ్యాప్తి హెచ్చు. సంస్కృత పదాలు 'అటవి, అరణ్యం, కాననం, వనం, విపినం, గహనం' అనేవి దీనికి పర్యాయపదాలంటారు. క్రూరజంతువులు తిరిగే ప్రాంతం కాబట్టి అటవి అన్నారు. వన శబ్దం అటు తోటకూ ఇటు అడవికీ పర్యాయపదం కింద లెక్క. కానన శబ్దం తెలుగుమాటకు సంస్కృతీకరణమేమోనని కొందరు అనుమానిస్తున్నారు. అరణ్య శబ్దం సంస్కృతంలోని సాధారణ శబ్దం. గహనం అంటే చీకటిగా ఉండేది. దట్టమైనది అని అర్థం. నిజానికి దీనికి సరైన తెలుగుమాట 'కారడవి'. 'కాకులు దూరని కారడవి' లాంటి మాటల్లోకూడా ఈ అర్థమే స్ఫురిస్తుంది. కారు అంటే నలుపు, చీకటి మొదలైన అర్థాలున్నాయి.

చెట్లెక్కువగా దట్టంగా ఉన్న తావు అరణ్యమయితే అది సువిశాలంగా ఇంకా దట్టంగా చీకటిగా ఉంటే మహారణ్యమని, అరణ్యాని అని, మహావనమని సంస్కృతంలో వ్యవహరిస్తారు. అరణ్యానికి సమానమైన తెలుగు సమాసం 'పేరడవి'. పేరు శబ్దానికి 'పెద్ద' అనే అర్థం సమాసాల్లోనే కనిపిస్తుంది. అడవులు ప్రకృతిసిద్ధాలు. ఎవరూ పెంచేవికాదు. అయితే ఈ కాలంలో 'అడవుల పెంపక'మనేది కొత్తగా పుట్టింది! మానవ ప్రయత్నంవల్ల నీటుగా, ఒక క్రమంలో చెట్లూ మొక్కలూ వగైరా

పెంచితే వాటికి వేరే పేర్లున్నాయి. ఇంటిచుట్టూ పెంచేది తోట. ఉదాహరణకు 'పెరటితోట' వంటి సమాసాలను చెప్పవచ్చు. ఇవి సాధారణంగా చిన్నవిగా తక్కువ వైశాల్యంలో ఉంటాయి. తోట తెలుగుమాట. దీనికి దీటైన సంస్కృత పదాలు ఆరామం, నిష్కుటం అనేవి. ఆరామం కృత్రిమంగా కల్పించిన చాలా చిన్న అడవి. గృహప్రాంతాల్లో కల్పించినవి కాబట్టి నిష్కుటమన్నారు. విశ్రాంతినిచ్చేది కాబట్టి ఆరామమన్నారు. స్త్రీలు(రామ-లు) విహరించేది కాబట్టి ఆరామమని ఎవరో మరో నిర్వచనమిచ్చారు.

ఒకరి యాజమాన్యంలో లేని, పదిమందీ విహరించడానికి అనువైన తోటను 'తోపు' అని పిలుస్తారు తెలుగులో. దీనికి మరోపేరు ఆక్రీడం. ఆటలాడుకొనే స్థలమన్న అర్థంలో ఈమాట పుట్టింది. క్రీడ అంటే ఆట. పూర్వంరాజులు తమ అంతఃపుర స్త్రీలు మాత్రమే విహరించేందుకు నిర్మించిన ఉద్యానాలను ప్రమదవనం/ప్రమదావనం అని పిలిచేవాళ్లు. ప్రమద అంటే స్త్రీ అనే అర్థంతోబాటు ఎక్కువ సంతోషమనే అర్థంకూడా ఉంది. తోట సొంతం; తోపు అందరిదీ; ప్రమదవనం రాజకుమారులది.

తోటనుంచి కానదాకా రకరకాల పేర్లున్న స్థలాల్లో భిన్నదశల్లో ఉన్న చెట్లు, రకరకాలచెట్లు ఉంటాయి. చెట్టు అనేది తెలుగులో సర్వసాధారణమైన మాటేగాని పరిమాణం, స్వభావం వగైరాలనుబట్టి అందులో రకాలున్నాయి. అవి పెద్దవై గట్టిబోదెతో ఉంటే 'మాను/మాకు' అంటారు. మానుకట్టడమనేది అన్ని చెట్లకూ వర్తించే లక్షణంకాదు. పూర్వం ఈ మాటలనే 'మ్రాను/మ్రాకు' అనే వాళ్లు. 'మ్రాకులు' అనే మాటలోని చివరి 'కులు' అనేది బహువచన ప్రత్యయమనీ, కేవలం 'లు' మాత్రమేకాదనీ భాషా చరిత్రకారులంటారు. కాలక్రమాన మాకింది రావత్తు వాడుకలో తొలిగిపోయింది.

చెట్టుకు సమానమైన సాధారణ సంస్కృతపదం 'వృక్షం'. దానికి 'భూరుహం, మహీరుహం, శాఖి, విటపి, పాదపం, తరువు, ఓషధి, అనోకహం, కుటం, సాలం, పలాశి, ద్రు(మం), అగమం' లాంటి పర్యాయపదాలున్నాయి. భూమి/మహి నుంచి పుట్టేదికాబట్టి భూరుహం/మహీరుహం అని పిలిచారు. కొమ్మలు (శాఖలు) ఉన్నది కాబట్టి శాఖి. కొమ్మల్లేని చెట్లను ఈ పేరుతో పిలవటం భావ్యంకాదు. విటపి మానుకట్టే చెట్టు. మచ్చుకు వటవిటపి అంటే మర్రిమాను. మామూలుగా మర్రిచెట్టనే వ్యవహరిస్తాంగాని అది చాలా పెద్ద చెట్టుకాబట్టి మాననటమే సరైన ప్రయోగం. పాదాలతో (అంటే వేళ్లతో) నీళ్లు తాగుతుంది కాబట్టి పాదపమన్నారు. మొలకెత్తేది కాబట్టి తరువు. త్వరగా పెరిగేది ద్రు(మం). ఆకులు (పలాశాలు) కలది కాబట్టి పలాశి. భూమిలోంచి పొటమరించేది కాబట్టి అగమం. నిజానికి మాటను తొలకరిలో ఒక్కసారిగా భూమి చీల్చుకొని వచ్చే గడ్డిమొక్కలకు గాని, వసంతంలో అకస్మాత్తుగా పుట్టుకవచ్చే పూల మొక్కలకుగాని అన్వయించాలి. మంచులోనుంచి ఒక్కసారి మొక్కలు లేవటం హిమాలయ ప్రాంతాల్లోగాని, ఇతర ప్రదేశాల్లో అసాధారణమయిన విశేషం. అయితే ఆర్యజాతి భాషలో ఈమాట

పుట్టడంలో ఆశ్చర్యంలేదు. సాలశబ్దానికి ఒక మహావృక్షమనే విశేషార్థముంది. అదే వృక్షసాధారణానిక్కూడా పేరుగా కొందరి వాడుకకెక్కింది.

మన వాడుకలో 'మూలికలు' అనే మాట ఉంది. మూలమంటే వేరు. కొన్నిచెట్ల వేళ్లను వైద్యానికి ఉపయోగించేవాళ్ళు – ముఖ్యంగా అయుర్వేదంలో. అందువల్ల వైద్యానికి వాడేవేళ్లకు మూలికలనే పేరు వచ్చింది. చెట్టులోని ఆకు, బెరడు, కాడ వగైరా ఏ భాగమయినా వైద్యానికి పనికిరావచ్చు. అలా ఉపయోగపడే ఇతర భాగాలున్న (మూలేతర భాగాలున్న) చెట్లను ఓషధులంటారు. వాటినుంచి తయారైన మందులను ఔషధా లంటారు. ఓషధీ శబ్దానికి మరో విశేషార్థముంది. కాయలుకాసి అవి పండి పండ్లు కాగానే చచ్చే చెట్లు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు అరటిచెట్టు. అలాంటి చెట్టును ఓషధి అంటారు. అసలు పండ్లేలేని గొడ్డుచెట్టును 'వంధ్యం, అఫలం, అవకేశి' అంటారు సంస్కృతంలో పండ్లు కాసేదాన్ని ఫలి, ఫలవంతం అంటారు – పండ్లున్న సమయంలో పండ్లచెట్టయినదాన్ని ఆవంధ్యం, ఫలేగ్రహి అని కూడా పిలుస్తారు. పనసలాగా పూలు లేకుండానే పండ్లుకాసే చెట్లను 'వనస్పతి' అంటారు. ఈ కాలానికి ఈ మాటకు 'డాల్డా' అనే అర్థం వచ్చింది. చిత్రమేమంటే డాల్డా అనేది వస్తువు పేరు కాదు – అది ట్రేడ్ మార్క్ మాత్రమే. ఆ మార్కుతో మొదటిసారి మార్కెట్లో ప్రవేశించిన నేయివంటి పదార్థానికి 'వనస్పతి' అనేదే నిజమైన పేరు. వ్యవహారంలో 'డాల్డా' అని ట్రేడ్ మార్క్ పేరు వచ్చింది ద్రవ్యానికి. మామిడిలాగా పూలనుంచి పండ్లేర్పడ్డ చెట్టును వానస్పత్యం అని పిలుస్తారు. ఇలా చెట్టు స్వభావాన్ని బట్టి ప్రత్యేక నామధేయాలున్నాయి. వాడుకలో అన్ని వివరాలనూ పట్టించుకోం. అంతే భేదం.

చిన్నచెట్టుకు వేరే పేర్లున్నాయి – మొక్క, మొలక, మోక, మొటిక, నిసువు, ఈరిక వగైరాలు. వీటిలోని మొదటి మూడూ ఒకదానికొకటి రూపాంతరాలు. అప్పుడే పుట్టిన చెట్టుకు మొలక వంటి పేర్లన్నమాట. మొలుచు అనే తెలుగు క్రియాపదానికి ఇవి నామవాచకరూపాలు. తమంత తాముగా తెలుగునుడికారంలో 'పడిమొలిచిన' చిన్న చెట్లను మొక్క, మొలక, మోక అని పిలుస్తారు. మొటిక అంటే నలుసులాంటిదని, చిన్న మొటిమలాంటిదని వర్ణించి చెప్పేమాట. నిసువుకు 'నిసుగు' అనే రూపాంతరముంది. పసికందు అనే అర్థంలో కూడా నిసువు శబ్దం వాడుతుంటాం. చిన్నగా ఉండి గుబురుగా మొలిచిన మొక్కను ఈరిక అంటారు. మోసులెత్తినది అనే అర్థంలో 'కోరిక లీరికలెత్తుట' అనే ప్రయోగంలో వినిపించేది ఈ మాటే. ఇవన్నీ తెలుగు మాటలు. మోసు అనే మాటకు మొన, కొన అనే అర్థవిశేషాలూ, 'మోసులెత్తు' వంటి ప్రయోగాల్లో వాడుకా ఉన్నాయి.

ఈ మాటలకు సంస్కృత పర్యాయపదాలు 'అంకురం, అంకూరం, అభినవోద్భిజం' అనేవి. చివరిది నిజానికి వివరణాత్మకమయిన పదం. అభినవం అంటే సరికొత్త. ఉద్భిజం అంటే పైకి లేచినది అని అర్థం. అప్పటికప్పుడు మోసులెత్తినదనే అర్థంలో ఈ మాట పుట్టింది. ఇది వ్యస్తపదం కాదు; ఒక సమాసం. అంకుర శబ్దానికి అంకూర మనేది రూపాంతరం. మొలకెత్తినదనే అర్థం. ఈ మాటకే విత్తనమనే అర్థవిశేషం కూడా సంస్కృతంలో ఉంది. మొలక, అంకురం, వంటివి ఏరకం చెట్టు తొలిదశను చెప్పటానికయినా పనికివచ్చే సాధారణ శబ్దాలు.

చెట్లన్నీ మానుకట్టవు. అన్నిటికీ గట్టి బోదె ఉండదు. మానుకట్టని బోదెలేని చెట్టును 'తీగ, తీగె, తీగియ, తీవ, తీవె, తీవియ' అనే రూపాంతరాలున్న ఒకేమాటతో తెలుగులో చెప్పగలం. సంస్కృతంలో 'లత, లతిక, వల్లి, ప్రతతి' అనే మాటలు పర్యాయార్థంలో ఉన్నాయి. తీగకు సమానార్థకం లత. చిన్న లతను లతిక అంటారు. మెలికలు తిరుగుతూ పైకిపాకే తీగ వల్లి. గుబురుగా అల్లుకొనే తీగ ప్రతతి. ఈ చివరిమాటకు గ్రంథాల్లో తప్ప ప్రయోగం లేదు. కొందరు పొట్లచెట్టు, మల్లెమొక్కలాంటి ప్రయోగాలు చేస్తుంటారు. పొట్లతీగ, పొట్లపాదు అనేవి సరైన ప్రయోగాలు. మల్లె, సంపెంగలాంటి కొన్నిటిలో మొక్కలుగా పెరిగేవి, తీగలుగా సాగేవి – అని రెండు రకాలూ ఉన్నాయి. కానీ మరోరకం పొట్ల, కాకర లేవు – కొత్తగా శాస్త్రజ్ఞులు అటువంటి వంగడాలను కల్పించేదాకా ఆ రకంగా వాడటం సరికాదు.

చిన్న మొక్కలుగాని, కొన్ని తీగలుకాని గుబురుగా, దట్టంగా, పొట్టిగా పెరిగితే వాటిని పొద అంటాం. పాత పుస్తకాల్లోనూ, పొదరిల్లు వంటి సమాసాల్లోనూ ఆ మాటకు 'పొదరు' అనే రూపాంతరముంది. ఈరమనే పర్యాయపదముంది. గుల్మం, స్తంబం అనే సంస్కృత పర్యాయపదాలున్నాయి. స్తంభమనే మాటకు, స్తంబమనే మాటకూ మధ్యగల భేదం గుర్తించండి. పొద అనే అర్థంలో ఒత్తక్షరాలు లేవు. సంస్కృతంలోని నికుంజ శబ్దం తెలుగుపొదరిల్లు శబ్దానికి సమానమైనది. చిన్న పొదలను 'వీరుత్తు, గుల్మిని, ఉలపం' అనే పర్యాయపదాలతో వ్యవహరిస్తారు.

చెట్లకు (కొన్నిటికి తప్ప) కొమ్మలుంటాయి. ఈ తెలుగు మాటకు స్త్రీ అనే విశేషార్థముంది. దీనికి సంస్కృత పర్యాయపదమైన శాఖా శబ్దానికి చేయి, చీలికవంటి అర్థ విశేషాలున్నాయి. శాఖకు పర్యాయపదమని కొన్ని నిఘంటువులు లతాశబ్దాన్ని పేర్కొంటున్నాయి. దీనికి తీగ అన్నదే రూఢి సిద్ధమయిన అర్థం. 'శాల' అనే మరో పర్యాయపదముందిగాని దానికి మారుమూల ప్రయోగాలయినా కనిపించవు ఒకపట్టాన. అయితే నిఘంటువులు చెప్తాయి. ఇలాంటి మాటలను నైఘంటుక శబ్దాలంటారు.

కొమ్మల నుంచి చీలిన చిన్న కొమ్మలను ఉపశాఖలంటారు సంస్కృతంలో. తెలుగులో ఈ మాటకు పర్యాయపదాలుగా 'రెమ్మ, రెబ్బ, రెవట, రివట, రివ్వ, సెలగ, చివ్వ, చివక, మల్లె, జబర, చివర, సరిగ, బలుగు, గోల, సెల' వంటి అనేక శబ్దాలు కనిపిస్తాయి. వీటిలో చిన్నతనాన్నీ పెద్దతనాన్నీ స్పష్టపరిచే మూలార్థాలేమో మన తెలుగు నిఘంటువులు చెప్పవు. కొన్ని ప్రాంతీయ మాండలిక పదాలు కావచ్చు. రెమ్మనుంచి రివ్వదాకా పేర్కొన్న అయిదు మాటలూ పరస్పర రూపాంతరాలని మాత్రం గట్టిగా చెప్పవచ్చు. మల్లె, చివర అనే పదాలకు ఇతరార్థాలున్నాయి. మర్రివంటి మహావృక్షాలకున్న వేలాడే కొమ్మలను ఊడ అని తెలుగులోనూ 'శిఫ, జట' అని సంస్కృతంలోనూ పిలుస్తారు. జటా శబ్దానికి జడ అనే మరో అర్థముంది.

కొమ్మల చివర చిగుర్లుంటాయి. చిగురు, చివురు అనే రూపాంతరాలు రెండూ ప్రాచీనాలు. వాటికి ఇగురు, ఇవురు అనే రూపాంతరాలు తరవాతి కాలానివి. చిగురు శబ్దానికి చివర అనే అర్థవిశేషం కూడా ఉంది. ఈ నాలుగు రూపాలనూ ఒకే

పదంకింద లెక్కించాలి. దీనికి 'తలిరు' అనే పర్యాయపదముంది తెలుగులో. ఆ మాటకు 'పువ్వు' అనే మరో అర్థముంది. వీటికి పల్లవం, కిసలయం అనేవి సంస్కృత పర్యాయ పదాలు. కిసలయ శబ్దానికి గణయతి ప్రాసలకోసం కవులు కల్పించుకొన్న కిసాలయం, కిసలం, కిసం అనే రూపాంతరాలున్నాయి. ఈ మాటక్కూడా పువ్వనే అర్థాంతరం లేకపోలేదు. పల్లవ శబ్దానికీ ఇతరార్థాలున్నాయిగాని అదే ప్రధాన శబ్దం. ఈ మాట 'పత్–లవం' అని విభజించదగిన రూపముందనీ, ఆకులో భాగమనే అర్థముందనీ కొందరు వ్యాఖ్యానించారు.

చిగురు పెరిగి పెద్దదై ఆకవుతుంది. అదొక్కటే అచ్చు తెలుగుమాట. కొందరు నిఘంటుకారులు 'పత్తిరి' అనేది దీనికి పర్యాయపదమంటారు గాని అది సంస్కృతంలోని 'పత్ర' శబ్దభావం. సంస్కృతంలో 'పత్రం, పర్ణం, పలాశం, ఛదనం, ఛదం, దలం (దళం)' అనే పర్యాయపదాలున్నాయి. ఛద(న)ం అంటే కప్పేది. మొగ్గను కప్పే ఆకు ఛదన(ం). చెట్టునుంచి (ఎప్పటికైనా) రాలిపోయేది కాబట్టి పత్రమన్నారు. దళమంటే రేకు. పల్చనిదని అర్థం. పర్ణం ఎండుటాకు.

చిగుళ్ళు ఆకులుగా మారినట్లే మొగ్గలు పూలవుతాయి. మొగ్గకు 'మొగడ' అనే రూపాంతరం ఉంది. తెలుగులో మొగ్గరంవంటి కొన్ని శబ్దాలు మొగ్గతో పోల్చినందున ఏర్పడ్డవని కొందరి నమ్మకం. ఒక రెమ్మను మరొకటిచుట్టి వుంటుంది మొక్కలో. అలాగే మొగ్గరంలో సేనాదళాలు ఒకదాన్నొకటి చుట్టి ఆవరించి ఉంటాయి. మొగ్గకు కావ్యభాషలో 'మొగ' అనే రూపాంతరం కూడా ఉంది. ఆ మాటకు 'మొదలు' అనే అర్థవిశేషం కూడా ఉంది. మొగడించు అనే క్రియాపదానికి 'ముకుళించు, ముడుచుకొనిపోవు' అనే విశేషార్థాలున్నాయి. వీటన్నిటిలోనూ మూలసూత్రంగా ఉన్నది మొగ్గ, మొగ, మొగడ శబ్దాలు పుట్టబోయే పూవు 'మొదటి' రూపమనే అర్థం.

మొగ్గకు పర్యాయపదాలని చెప్పదగ్గవి సంస్కృతంలో రెండు రకాల మాటలున్నాయి. 'ముకుళం, కుట్మలం' అనేవి అప్పుడే విచ్చుతున్న మొగ్గకు పేర్లు. 'కదిక, కోరకం' అనేవి మొగ్గ తొలి దశను సూచించేమాటలు. ముడుచుకున్నట్లు, ఒక రెమ్మతో మరొకటి అతుక్కొని పోయినట్లు ఉండే మొగ్గ ముకుళం. 'ముకుళితహస్తు' లంటే నమస్కరిస్తున్నవాళ్లని అర్థం. నమస్కరించేటప్పుడు చేతివేళ్లు ఒకదాన్ని మరొకటి అంటుకొని ఉన్నట్లు రేకులు అతికి ఉన్నది ముకుళం. కుట్మలమన్నది సగం విచ్చిన మొగ్గ. అచ్చతెలుగులోని 'అరవిరి' అనేది సరిగ్గా సమానం దానికి. కలిక అంటే మొటిమలాంటిది. 'దీపకలిక' అనే సమాసముంది. ప్రమిదలో దీపం వత్తిని వెలిగించినప్పుడు నిప్పున్న భాగం ఏ రూపంలో ఉంటుందో అలా కోడిగుడ్డులాగా ఉన్న మధ్య భాగం చివరకు మొనదేలివుంటే అది కలిక. 'కళిక' అనేది దాని రూపాంతరం. కోరక శబ్దాన్ని కొందరు కుట్మలానికి సమానమంటారు. దానికి తామరతూడు అనే మరో అర్థంకూడా ఉంది. బుగ్గలాగా ఉన్న మొగ్గ కోరకం. కలిక మొనదేలివుంటే, గుండ్రంగా చివరి భాగం చదునుగా ఉండేది కోరకం.

మొగ్గ విప్పారి పువ్వవుతుంది. ఈ తెలుగుమాటకు 'పువు, పూ' అనే రూపాంతరాలూ, 'విరి, అలరు, పుప్పం' అనే పర్యాయపదాలూ ఉన్నాయంటారు. 'పూ'

అనే దీర్ఘాంతశబ్దమే చిత్రమయింది తెలుగులో. శ్రీనాథుడంతటివాడు 'కాలకంధరు శిరసుపూ గగనగంగ' అన్నచోట ఈ రూపం ప్రయోగించాడు. సాధారణంగా 'పూదేనె' వంటి సమాసాల్లో మాత్రమే పువ్వు శబ్దానికి ఈ రూపాంతరం కనిపిస్తుంది. విరి అనే నామవాచకానికీ 'విరియు' అనే క్రియా రూపానికీ చాలా దగ్గరి సంబంధముంది. పూర్తిగా విప్పారిన పూవును విరి అంటారు. సగం విచ్చినదయితే అరవిరి. అలరు శబ్దం 'సంతోషపెట్టేది, ఆనందం కలిగించేది' అనే అర్థాల్లో వచ్చినమాట. అదే రూపంగల క్రియా పదానికి కూడా అటువంటి అర్థాలే ఉన్నాయి. ఇక 'పుప్పం' అనేది కవులు కృత్రిమంగా కల్పించుకొన్న 'పుష్ప' శబ్దభవమైనా కావాలి; చిన్నపిల్లలు 'ష్ప' పలకలేక వర్ణ సమీకరణం చేసి వాడిన మాటైనా కావాలి.

సంస్కృతంలో 'పువ్వుకు' పర్యాయపదాలని చెప్పదగినవి 'సుమం, కుసుమం, పుష్పం, సూనం, ప్రసూనం, సుమనస్సు' అనేవి. పుష్పమన్నదే మామూలు మాట. సహజమో అసహజమో పువ్వులాంటిదయితే సుమం. కుసుమమంటే 'చెట్టుకు' పూసిన పూవు. ఏ తీగకో పూసినది సుమం. పుష్పమనేది 'మకరందం/పూదేనె' గల పువ్వు. అన్ని పూలకు మకరందం ఎక్కువగా, సువాసనతో ఉండదు. పూదేనె గల పువ్వే పుష్పం. వాసనలేనిది సుమం. సూనం అంటే (చెట్టుకో, తీగకో) పుట్టినదని అర్థం. అంటే సహజమైన అకృత్రిమమైన పూవని. ప్రసూనం అంటే పెద్దపువ్వు. సుమనస్సు అనే మాటకు పువ్వనే అర్థంతోబాటు 'దేవత, పండితుడు' మొదలైన అర్థాలున్నాయి. 'సు-మనస్సు' అంటే మనసుకు మంచిగా కనిపించే అంటే చక్కనిపూవని అర్థం. ఈ మాటకు కవితా భాషలోనే ప్రయోగమెక్కువ.

పువ్వు క్రమంగా 'పూప'గా మారుతుంది. పూప పెరిగి పిందె అవుతుంది. పిందె కాయగా, పండుగా మారి రాలిపోతుంది. ఆ కాయే ఎండిపోతే వట్టు, వరుగు అవుతుంది. ఇవన్నీ తెలుగు మాటలు. కాయల్లో 'పసరుకాయ, పచ్చికాయ, దోరగాయ' వగైరా భేదాలు. సగం పండింది దోర, పండనిది పచ్చి, గింజ పట్టనిది పసరు. ఈ భేదాలను చెప్పే విడి మాటలు సంస్కృతంలో ఉన్నాయేమో తెలీదు. అంత సంస్కృతం రాకయినా పోయి ఉండాలి; ఆ భేదాలను ఆర్యులు గుర్తించక పోయైనా ఉండాలి. శలాటు వనేది కాయకు పర్యాయమైన సంస్కృతపదం. బాలశలాటువంటే పిందె అని, అత్యంత బాలశలాటువంటే పూప అనీ, శుష్కశలాటువంటే వరుగు అనీ తెలుగు నిఘంటుకారులు చెప్తున్నారు. విడి మాటలుంటే వాడరా అనే అనుమానం కలుగుతుంది! క్షారకం, జాలకం – అనే రెండుమాటలున్నాయి సంస్కృతంలో. అవి పసరు మొగ్గలను చెప్పేవనీ పసరుకాయలను సూచించేవనీ పండితుల్లోనే అభిప్రాయభేదాలున్నాయి. మరికొందరు గుత్తిగట్టిన మొగ్గలను ఆ పేర్లతో పిలుస్తారు.

తెలుగులో పండు సంస్కృతంలో ఫలం సమానార్థకాలు. కొందరు పండుకు 'సస్యం/శస్యం' అనే రూపాంతరాలు పర్యాయపదాలని భావిస్తారు. సస్యశబ్దానికి 'గడ్డి, పంట' మొదలైన ఇతరార్థాలున్నాయి. కాయ, పండు అనే మాటలను తెలుగువాళ్ళు భిన్నప్రాంతాల్లో భిన్నవిధాలుగా వాడుతుంటారు. గుంటూరు ప్రాంతంలో మామిడిపండును 'మామిడికాయ' అనే పిలుస్తారు. అది పచ్చిదయితే 'పచ్చిమామిడికాయ'

అంటారు. విశాఖ ప్రాంతంలోని వాళ్లు ఈ ప్రయోగాన్ని ఆక్షేపిస్తూనే పనసపండును పనసకాయ అని వ్యవహరిస్తారు. ఇవి అలవాటుకు సంబంధించినవేగానీ మరేమీకాదు. సంస్కృత ఫలశబ్దంలోని ఫకారాన్ని కాఫీలోని 'f' ధ్వనిలాగా ఉచ్చరించే వాళ్ళున్నారు. దానికీ చేయగలదేమీ లేదు.

'గుత్తి' అనే తెలుగు మాటకు పర్యాయపదాలనే నాలుగింటిలో రెండేసి చొప్పున ప్రత్యేకార్థాలున్న వున్నాయి. పూలగుత్తిని 'వల్లరి, మంజరి' అంటారు. పూచిన కొమ్మనూ, తీగనూ మళ్లీ ఆ పేర్లతోనే పిలుస్తారు. ఒకే కొమ్మకు గన్నేరు మొక్కకులా చాలా పూలు పూస్తే ఆ పూలగుత్తిని 'స్తబకం, గుచ్ఛ(క)ం' అని పిలుస్తారు. చాలా పూలుంటే మంజరి. ఈ భేదాలను కవులు కూడా సరిగా పాటిస్తున్నారని చెప్పలేం.

# స్త్రీ పురుషులు

మనిషి సంగతి ఎత్తగానే కడుపు చెరువయిపోతుంది, అచ్చ తెలుగు మాటొక్కటయినా కనిపించనందువల్ల. నిఘంటువులేమో 'మనిసి, మానిసి' అనే తద్భవాలతో సరిపెట్టుకోమంటాయి. తెలుగువాళ్లేమో 'మనిషి' తెలుగే అని సర్దుకొని సంతోషిస్తున్నారు. అచ్చ తెలుగులో 'ష' వర్ణం లేనేలేదు. కాబట్టి కూడా ఇది తెలుగు మాట కాదని చెప్పవచ్చు. అయితే తెలుగు మాటే లేదా అని ఆశ్చర్యపడనక్కరలేదు. ఉన్నవి వాడుకలో లేనందుకుమాత్రం విచారించక తప్పదు.

స్త్రీ పురుషులకు సమంగా అన్వయించే మాటొకటి పూర్వం ఉండేది – 'అల్' అని. అది ఎప్పటి సంగతంటే, నన్నయకు ముందుకాలపు మాట. ఆ మాటకు 'అణ్' అనే రూపాంతరం కూడా ఉండేది. దానికి 'వ్యక్తి' అని సంస్కృతంలో అర్థం చెప్పుకోవలసిందే. అది విడిగా వాడుకలో లేదు. సమాసాల్లో వినిపిస్తుంది కాని గుర్తుపట్టడం కష్టం. 'పెరుమాళ్ళు' అనేమాట చాలామంది విని వుంటారు. అది అరవమాట అని చాలామంది విశ్వసిస్తారుకూడా. ఆ మాటను విడదీస్తే 'పెర్' (అంటే 'పెద్ద') అనే భాగమొకటి, 'అల్' (వ్యక్తి) అనే మరోభాగమూ దాంట్లో ఉన్నాయి. ఆ రెంటికీ మధ్యఉన్న 'ఉమ్' అనేది తాతలనాటి సముచ్చయార్థకం (మాటలను కలిపే ప్రత్యయం). 'అలు' అనేమాట విడిగానూ 'ఇల్లాలు' అనేమాటలో భాగంగానూ 'భార్య' అనే అర్థంలో మిగిలిపోయింది. 'ఆడది' అనే నేటి మాటకు చాలా పూర్వకాలంలో 'అణ్డది' అనే రూపాంతరం ఉండేది. అందులో 'అణ్' అనే మూలరూపాంతరం ఇరికి ఉంది. 'దేవాణ్డే, భూమాణ్డే' వగైరా వ్యక్తినామాలు పూర్వశాసనాల్లో కనిపిస్తాయి. ఆ పేర్ల చివరి 'అణ్డే' అనే భాగం సందర్భాన్నిబట్టి పురుషుడనో, స్త్రీ అనో అర్థమిస్తుంది. దాంట్లో అల్, అణ్ (అంటే 'వ్యక్తి') అనే వ్యక్తివాచకమైన అచ్చతెలుగుమాట ఇమిడి వుండేది. ఇప్పటి భాషలో 'అలు'

మిగిలింది – భార్య అనే అర్థంలో. పురుషవాచకత్వం తొలగిపోయింది భాషనుంచి.

వ్యక్తి అనే సంస్కృత పదానికి 'వ్యక్తమవుతున్న, బయటపడుతున్న, తెలుస్తున్న జీవం' అనే అర్థం మొదటిది. గండు అనే తెలుగు మాటొకటుంది. దానికి 'మొగ' అనే అర్థం. ఇప్పటి వ్యవహారంలో అది విశేషణంగా 'గండుచీమ, గండుపిల్లి' మొదలైన సమాసాల్లో నిలిచింది. గండడు అంటే వీరుడు, శౌరుషవంతుడనే అర్థాలున్నాయి. ఆ మాటకూ గండ శబ్దానికీ చాలా దగ్గరి చుట్టరికముంది. దానికి గండడు అనే రూపాంతరం పూర్వం ఉండేది. ఈ మాట సంస్కృతంలోకి వలసపోయింది కూడా. ఇప్పటికీ వాడుకలో నిలిచిన 'గండరగండడు' వంటి సమాసాల్లో ఈ శబ్దం వినిపిస్తుంది. గండర – అంటే వీరులలో/వీరులకు, గండడు – అంటే వీరుడు. ఈ మొత్తం కన్నడ సమాసం తెలుగులో ఇంకా బతికుంది.

మగవాడు, మగువ అనే రెండు మాటల్లోనూ ఉన్న మొదటి భాగం వ్యక్తివాచకమని చెప్పవచ్చు. వ్యవహారంలో 'మొగ' – అనే రూపాంతరం కూడా ఉంది. అయితే అదికూడా ఆ అర్థంలో వ్యవహారదూరమైపోయింది. 'మంది' అనేది మాత్రం సమూహవాచకమైన వ్యక్తి సూచకమైన తెలుగుమాట. ఇది సంఖ్యావాచకాల తరవాత ప్రత్యయంగా కూడా మారిపోయింది – పదిమంది వంటి మాటల్లో. 'మంది ఎక్కువయితే మజ్జిగ పలచబడుతుంది'లాంటి వాక్యాల్లో దీనికి స్వతంత్ర ప్రయోగముంది. మరి ఏకవచనంలో 'మనిషి, వ్యక్తి' అనే మాటలకు సమానార్థకాలు ఇప్పటి తెలుగులో అచ్చతెలుగులో వాడుకలో లేవని బాధపడక తప్పదుకదా?

మానిసి, మనిసి అనేవి తద్భవరూపాలు. మనిషి అనేది మిశ్రరూపం, సంకరరూపం, అయినా దానికే తెలుగు వ్యవహారంలో పెద్దపీటవేశాం. మనిషి శబ్దానికి 'భర్త' అనే అర్థం వినిపిస్తుంది – 'మా మనిషి ఇంట్లోలేడు' లాంటి వాక్యాల్లో. 'పనిమనిషి, ఆడమనిషి, మొగమనిషి' వగైరా సమాసాల్లో 'వ్యక్తి' అనే అర్థంలోనే వాడుక. వ్యక్తికూడా చిత్రమయిన మాట. సంస్కృతంలో, ముఖ్యంగా వ్యాకరణశాస్త్రంలో ఆ మాటకు 'మూర్తవస్తువు, నిర్దిష్టపదార్థం' వగైరా అర్థవిశేషాలున్నాయి. మనమిప్పుడు కుక్కను వ్యక్తి అనం. సంస్కృత వ్యాకరణంలో అనవచ్చు. గోడను కూడా వ్యక్తి అనవచ్చు. మనం ఆ మాటను ఎరువు తెచ్చుకొని దాన్ని పరిమితపరిధిలో వాడుతున్నామన్నమాట. 'వ్యక్తమయ్యే, తెలిసే, బయటపడే' మొదలైన అర్థాల్లో దానికి ప్రయోగమన్నమాట.

మాటవరసకు 'మనిషి' తెలుగుమాటే అనుకొందాం (నిజానికి ఇప్పుడలాగే వాడుక). దానికి 'మనుష్యుడు, మానుషుడు, మర్త్యుడు, మనుజుడు, మానవుడు, నరుడు, పంచజనుడు, పురుషుడు' అనేవి సంస్కృత పర్యాయపదాలంటారు. పూర్వం మనువును బ్రహ్మ సృష్టిస్తే ఆయన మన పెద్దలందర్నీ సృష్టించాడని పురాణాలు ఘోషిస్తున్నాయి. మనువుకు పుట్టినవాళ్ళు కాబట్టే మనుజులైనారు; అలాగే తద్ధిత రూపంలో మానవు లయ్యారు. పుట్టారు కాబట్టే చస్తారు కూడా. మృతి పొందేవాళ్ళు కాబట్టి మర్త్యులన్నారు. (దేవతలకు చావు లేదట – అందువల్ల వాళ్ళను అమర్త్యులన్నారు). 'నృ' అనే ఏకాక్షర శబ్దానికి నరుడనేది రూపాంతరం. నృసింహుడు

మొదలైన మాటల్లో పదరు 'నృ' శబ్దం వినిపిస్తుంది. బహుశా ఇదే సంస్కృతంలోని సాధారణపదం కావచ్చు. 'మన్' అనే ధాతువుకు 'ఆలోచించు' అనే అర్థముందట. ఆలోచనగల జీవం కాబట్టే మనుష్యుడు, మానుషుడు అనే పేర్లు వచ్చాయి. మానుషం అనేమాటకు మనుష్యత్వమనే మామూలర్థమేకాక 'పౌరుషం, అభిమానం' వగైరా విశేషార్థాలున్నాయి. పురుషుడు మొగవాడనే సంకుచితార్థంగల సాధారణ శబ్దం. 'రాజపురుషాది' శబ్దాల్లో ఇది మన తెలుగు 'మనిషి'లాంటి అర్థాలతో ప్రవర్తిస్తుంది. పురు వంశానికీ పురుష శబ్దానికీ బాదరాయణ సంబంధమైనా ఉందేమో చెప్పలేం. పంచజనుడనేది ఆర్యసమాజ లక్షణాలకు ప్రతీక కావచ్చు. పంచధా – అంటే అయిదుగా – విభక్తులయిన జనంలోనివాడనే అర్థం చెప్పవచ్చామాటకు. నాలుగు వర్ణాలూ కాక అదనంగా వీరి సేవ చేయటానికి 'పంచము'లనే అయిదో వర్ణాన్ని కల్పించుకున్న సమాజం ఈ పదాన్ని కూడా సృష్టించుకుందన్నమాట. మాటలద్వారా సాంఘిక పరిస్థితులను ఇటువంటి సందర్భాల్లో గుర్తించవచ్చు. సరిగ్గా ఏ కాలంలో ఇలా జరిగిందో ఖచ్చితంగా చెప్పలేకపోయినా. 'మగ' శబ్దానికవి పర్యాయపదాలనుకుందాం.

సంస్కృతాంధ్ర కవులకు వీరావేశం తెచ్చేమాటలు 'స్త్రీ'శబ్ద పర్యాయపదాలు. మన ప్రాచీన సాహిత్యంలోని చాలా భాగం స్త్రీవర్ణనలకే దఖలైపోయింది. గురజాడ అప్పారావు గారు ఎన్నెన్ని మాటలున్నాయో లెక్కపెట్టి మరీ వెక్కిరించారు. అయితేనేం 'భావకవులు' పాతవాసనలు పూర్తిగా పోక యథేచ్ఛగా అనేక శబ్దాలను వాడివేశారు. వాటన్నింటినీ చర్చించాలంటే స్థలం చాలదు.

మొదట 'దేవభాష'లోని మాటలు చూద్దాం. 'అబల, యోషిత్తు, యోష, జోష, నారి, సీమంతిని, వధువు, ప్రతీపదర్శిని, వామ, వనిత, మహిళ' అనేవి సాధారణ శబ్దాలనీ 'అంగన, భీరువు, కామిని, కాంత, లలన, నితంబిని, వామలోచన, ప్రమద, భావిని, మానిని, సుందరి, రమణి, రామ, భామిని, కోపన, వరారోహ, మత్తకాశిని, మత్తకాసిని, ఉత్తమ, వరవర్ణిని, మహిషి, భగిని, తరుణి, తలుని, యువతి' అనేవి ప్రత్యేకార్థాలు గల శబ్దాలనీ నిఘంటువులు పేర్కొంటాయి. అవిచాలక భార్య అనే అర్థంలో 'పత్ని, పాణిగృహీతి, ద్వితీయ, సహధర్మిణి, భార్య, జాయ, దార, కుటుంబిని, పురంధ్రి, సూచరిత్ర, సాధ్వి, ఫతి, పతివ్రత, పతివత్ని, సభర్తృక' వగైరాలింకా ఉన్నాయంటారు. సంస్కృత స్త్రీలను పరామర్శించిన తరవాత తెలుగువారి సంగతి ఆలోచించవచ్చు.

అబల బలహీనురాలు. యోషిత్తు, యోష, జోషలు పరస్పర రూపాంతరాలు, నరశబ్దానికి స్త్రీలింగ రూపమని చెప్పదగింది నారి. సీమంతం అంటే పాపట. సీమంతిని పాపట తీర్చినది. అంటే వర్ణనాత్మకపదం. వధూ శబ్దానికి పెండ్లికూతురు, కోడలు, భార్య వగైరా అర్థవిశేషాలున్నాయి. దీనితో దగ్గర సంబంధమున్న మరో సామాన్యపదం వధూటి. ప్రతీప శబ్దానికి ప్రతికూలం, పగవాడు మొదలైన అర్థాలున్నాయి. బహుశా (భర్తచెప్పినదానికి) వ్యతిరేకంగా ఆలోచించే నడిచే స్త్రీఅనే అర్థంలో ఈ మాటపుట్టిందేమో. వామ శబ్దానికి ఉత్తమ స్త్రీ అనే అర్థం చెప్తారు. దానికి 'సొమ్ము, చక్కనిది, వ్యతిరేకం, ఎడమ, కుడి' మొదలైన పరస్పర విరుద్ధార్థ

విశేషాలుకూడా ఉన్నాయి. అనురాగవతిని వనిత అంటారు. కోరిన స్త్రీని కూడా వనిత అని పిలుస్తారు. మహిళా శబ్దప్రత్యేకత తెలీదు.

అంగన అంటే అవయవ సౌందర్యంగలది. భీరువంటే పిరికిది. కామిని ఎక్కువ కామంగలదైనా కావచ్చు; ఎంతో కోరదగినదయినా కావచ్చు. చక్కని కళ్లున్నది వామలోచన. వామాక్షి మొదలుగా ఇటువంటి మాటలు కూడా ఉన్నాయి. ప్రమదమంటే సంతోషం కావచ్చు, పొగరూ కావచ్చు. ఆ గుణాలున్నది ప్రమద. భావిని అంటే సింగారి/శృంగారవతి. మానిని అంటే ప్రణయకోపమున్న స్త్రీ. మానమంటే అభిమానం, అహంకారం వగైరా అర్థాలున్నాయి. ఆ లక్షణాలున్నామె మానిని. ఆమెనే మానవతి వంటి పేర్లతోనూ పిలవవచ్చు. సుందరి అంటే చక్కనిది. రమణి అంటే సంతోషపెట్టేది. రామ అంటే లలితకళలు (సంగీత నృత్యసాహిత్యాదులు) నేర్చి ఆనందించగలది. కాంత అంటే ప్రకాశించేది. చాలా చక్కనిదని అర్థం. లలన అంటే వేడుక, ఉత్సాహం కలది. నితంబమంటే పిరుదు. నితంబిని చక్కని పిరుదులున్నస్త్రీ. వరారోహ శబ్దానికి నితంబిని అనే అర్థమూ చెప్పవచ్చు. మత్తకాశినీ మత్తకాసినీ శబ్దాలు రూపాంతరాలు. ఉత్తమురా ఉత్తమ. వరవర్ణిని అంటే కాలానుగుణంగా శరీరాన్ని చల్లబరచగల, లేదా వెచ్చబరచగల అవయవాలున్నదని తాత్పర్యం. రాజుగారి పట్టపురాణి అయితేనే మహిషి. తరుణీ తలునీ శబ్దాలు రూపాంతరాలు. యుక్తవయస్సులోని స్త్రీలను ఆ పేరుతో పిలుస్తారు. యౌవనంలో ఉన్న స్త్రీ యువతి.

భార్య, జాయ, దార, అనే మాటలు పెండ్లామనే అర్థంగల మాటలు. పత్ని, పాణిగృహీతి, ద్వితీయ, సహధర్మిణి అనే మాటలు అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యలకు పేర్లు. వాళ్లకే భర్తలు యజ్ఞంచేసేటప్పుడు పీటలమీద కూర్చునే యోగ్యతో అర్హతో ఉందంటారు. కొద్దిపాటి వర్ణభేదంతో 'పాణీగృహీత' అనే మాటుంది, ఉంపుడుగత్తె అనే అర్థంలో అక్షరంమారితే అర్థం తలకిందులుగా మారుతుంది కాబట్టి ఈ మాటను వాడేవాళ్లు జాగ్రత్తగా రూపం చూసుకోవాలి. కుటుంబిని, పురంధ్రి అనే మాటలకు సంసారస్త్రీ అని అర్థం. సతీసాధ్వీ శబ్దాలకు పతివ్రత అని అర్థం. సాధ్వి అంటే సాధువైన, మెత్తని స్త్రీ అనే అర్థం చెప్పవచ్చు. పతిపత్నీ శబ్దానికి పతివత్ని అనే రూపాంతరముంది. మగనాలు అనే తెలుగు మాటకిది సమానమైన శబ్దం. శీలవతి అయిన ఇల్లాలును కులస్త్రీ అని, కులపాలిక అనీ పిలుస్తారు.

కన్య, కన్యక, కుమారి(క) అన్నమాటలకు పెళ్లికాని పడుచని అర్థం. 'అష్టవర్షాభవేత్కన్యా' అని ఎనిమిదేళ్ల పిల్ల అని కొందరు వివరిస్తారు. సమర్తాడని పడుచును 'గౌరి, నగ్నిక' అనే పేర్లతో పిలుస్తారు. అప్పుడే పెద్దదైన ఆమెను మధ్యమ అంటారు. పెండ్లి అయిన తరవాత కాపురానికి ఇంకాపోక పుట్టినింట ఉన్న స్త్రీని చిరంటి, సువాసిని అంటారు. ఈ రెండోమాటకు స్వవాసిని అనే రూపాంతరముంది. డబ్బాశ మొదలైనవి ఎక్కువగా ఉన్న స్త్రీని ఇచ్ఛావతి అని, కాముక అని పిలుస్తారు. కాముకి అని అక్షరం మార్చిచెప్తే విపరీత సంభోగవాంఛగలదనే అర్థం వస్తుంది. ఈ అర్థంలో ఆమెను వృషస్యంతి అని కూడా పిలవవచ్చు. గొడ్రాలిని అశిశ్వీ అని పిలుస్తారు. మొగుడుగాని బిడ్డలుగాని లేనిది అవీర. భర్తమాత్రం లేనిదయితే విధవ,

విశ్వస్త. తలనెరసిన స్త్రీని వృద్ధ అనిగాని పలిక్ని అనిగాని చెప్పవచ్చు. లోకజ్ఞానంగల స్త్రీని ప్రాజ్ఞి, ప్రజ్ఞ, ప్రాజ్ఞ, ధీమతి అని పిలవవచ్చు.

పుంశ్చలి, ధర్షణి, బంధకి, చర్షణి, అసతి, కులట, స్వైరిణి, పాంసుల, ఇత్వరి వంటి పేర్లతో వ్యభిచారిణులను పేర్కొంటారు. పుంశ్చలి అంటే మొగవాళ్ల వెంటబడే స్త్రీ. ధర్షిణి అంటే తిరగబడి మాట్లాడేది అని అర్థం. తిరుగుబోతుకానిదే తిరగబడుతుందా అనే ధర్మసందేహం వచ్చేమో రంకుటాలికి ఈ పేరు పెట్టారు. బంధకీ శబ్దానికి ఆటకత్తె అనే అర్థంకూడా ఉంది. పూర్వసమాజంలో నటీనటులమీద వ్యభిచారపరాయణులనే చిన్నచూపుండేది. దాని ఫలితమేమో ఈ అర్థం. చర్షణి అంటే తిరుగుబోతు. అసతి అంటే సతిగా పవిత్రురాలిగా పతివ్రతగా ఉండనిదని సతీశబ్దానికి వ్యతిరేకార్థంలో చెప్పినమాట. కులటాశబ్దానికి ఊరిమీద తిరిగేదని అర్థం. స్వైరిణి అంటే తన ఇష్టంప్రకారం నడిచేది. పాంసువంటే దుమ్ము, ధూళి. పాంసుల అంటే పార్లాడేదని అర్థం. ఇత్వరి అంటే అచ్చుపోసినట్లు ఆంబోతులాగా నిర్లక్ష్యంగా నిర్భయంగా తిరిగేదని అర్థం.

స్త్రీ పర్యాయపదాలయిన అచ్చతెలుగుమాటలని నిఘంటువులు పేర్కొన్నవి చాలా ఉన్నాయి. ఒకప్పుడు గురజాడ అప్పారావుగారు లెక్కపెట్టి ప్రబంధసాహిత్యంలోని విపరీత శృంగారాభిరుచిని ఎద్దేవా చేశారు కూడా. వీటన్నిటినీ ఇక్కడ ప్రస్తావించటం సాధ్యమూకాదు – అవసరమూకాదు. 'బోటి, చేడియ, చేడె, ప్రోయాలు, పైదలి, పొలతుక, పొల్తుక, పొలతి, పొల్తి, అతివ, తొయ్యలి, కొమ, కొమ్మ, అన్ను, సకి, తెరవ, నెలతుక, నెలత, పడతి, పడతుక, ఎలనాగ, కోమలి, ఇంతి, చెలువ, చెలి, వెలదుక, వెలది, మెలతుక, మెలత, నవలా, మగువ, నాతి, నాతుక, అడుది, లేమ, గోల, ఉవిద, చామ, చాన, గోతి, చిత్తరి, యుగ్మలి, కలికి, కల్కి, మడతి, జోటిక, ముద్దుగుమ్మ' లాంటివనేకం.

పైమాటల్లోని 'చేడియ, చేడె; పొలతుక, పొలతి, పొల్తుక, పొల్తి; కొమ, కొమ్మ; నెలతుక, నెలత; పడతి, పడతుక, మడతి; చెలువ, చెలి; వెలది, వెలదుక; మెలత, మెలతుక; నాతి, నాతుక; కలికి, కల్కి' అనేవి పరస్పరం రూపాంతరాలు. నెలత, మెలతలు కూడా అటువంటివే. వీటన్నిటిలో యుగ్మలి శబ్దమే చిత్రమయింది. పదాదియకారం దీని తరవాతి సంయుక్తాక్షరం అది సంస్కృత పదమో అన్యదేశ్యమో అనిపిస్తుంది. కొందరు దాన్ని 'ఉగ్మలి' అనికూడా భ్రాంతిపడ్డారు. నవలా అనే దీర్ఘాంతశబ్దం అచ్చతెలుగు లక్షణాలకు విరుద్ధం. అది 'ణవలయా' అనే ప్రాకృత శబ్దంనుంచి పుట్టిందంటారు. సకి అనేమాట సఖి అనే సంస్కృత శబ్దంనుంచి పుట్టింది. చామశబ్దం సంస్కృతంలోని శ్యామా శబ్దభవం. ఉవిద అనేది సంస్కృత యువతీ శబ్దభవమనేవాళ్లున్నారు. చేడియ, చేడెలు సంస్కృతంలోని చేటీ శబ్దభవాలు.

ఈ తెలుగు మాటల్లో కొన్ని వర్ణనాత్మకాలు. తొయ్యలి అనేది తొలివయసులోని స్త్రీ. కొమ, కొమ్మ శబ్దాలకూ కొమరు (=చక్కదనం) అనేమాటకు దూరసంబంధమయినా ఉంది. అన్ను అన్నది కూడా అలాంటిదే – చక్కనిది అనే అర్థంలో. కోమలి శబ్దం పట్టికలో పొరబాటున దూరిన సంస్కృతపదం – మృదువుగా ఉండేదనే అర్థంలో. ఎల శబ్దానికి 'లేత' అనే విశేషణార్థముంది –

ఎలమావివంటి సమాసాల్లోలాగా. అంటే ఎలనాగ తొయ్యలివంటి మాట అని చెప్పాలి. చెలువమనే మాటకు 'చక్కదనం, ఒయ్యారం' వగైరా అర్థాలున్నాయి. చెలి శబ్దానికి 'స్నేహితురా'లనే అర్థాలున్నాయి. పాతకాలపు తెలుగులో చెలి ఉభయలింగపదం. దానికి మిత్రుడనే అర్థంకూడా ఉంది. నెచ్చెలి వంటి కావ్యప్రయోగాల్లో, ముదిసెలివంటి శాసన ప్రయోగాల్లో ఈ మాట వినిపిస్తుంది. వెలది, వెలదుక వంటివి ఖరీదయిన స్త్రీకి పర్యాయాలు కావచ్చు (వెలయాలు వంటి వాటిలో లాగా); లేదా 'తెల్లనిది' అనే అర్థంలోనూ వచ్చి ఉండవచ్చు (వెల్ల, వెలుతురు వంటి వాటిలోలాగా). లేమ శబ్దంకూడా లేతవయసు స్త్రీ అనే అర్థంలోనే పుట్టింది. నెలత, నెలతుక శబ్దాలు యుక్తవయస్సులోని స్త్రీ అని సూచించేవి. నెల శబ్దానికీ వీటికీ దూరపు సంబంధమయినా ఉంది. మెలత కేవలం నెలతకు రూపాంతరమే.

పడతి, పడతుక, మడతి అనే మాటలకూ పడుచు, పడ్డవంటి శబ్దాలకూ బాంధవ్యముంది. ఈ మాటలు కూడా కోడె వయసులోని స్త్రీ అనే అర్థమే ఇస్తాయి. బిత్తరి అంటే హుషారయిన స్త్రీ. బిత్తరపు చూపులు వగైరా సమాసాల్లో బిత్తరమనే విశేషణముంది. కలికి, కల్కికూడా అటువంటిదే. ముద్దువచ్చే గుమ్మ (అంటే చిన్నది) ముద్దుగుమ్మ.

గోల అంటే అమాయకురాలు. ఇంతి శబ్దాన్ని కొందరు స్త్రీ శబ్దభవమంటారు. తెరవ అంటే పలచని పెదవులున్న సుకుమారి; పైదలి వోణీలు వేసుకొనే వయసు వచ్చిన స్త్రీ. ప్రోయాలంటే ఇల్లాలు – పెండ్లి అయిన స్త్రీ. బోటి శబ్దానికి 'చెలిమి, స్నేహం' అనే అర్థాలున్నాయి. బోటికత్తె వంటి సమాసాల్లో ఈ మాట ఈ అర్థంలోనే వస్తుంది. నాతి శబ్దాని కొకప్పుడు వెలయాలివంటి అర్థముండేదేమో. 'నాతం' అనే మాటకూ దీనికీ సంబంధమున్నట్లుంది. జోటి శబ్దానిక్కూడా 'చెలిమి, సంబంధం, సంభోగ'మనే అర్థాలూ, జోటిక వంటి రూపాంతరాలూ ఉన్నాయి. జోటిపని అంటే మైథునం. జతగూడిన స్త్రీని జోటి అని పిలుస్తారు. గోతి శబ్దానికి భారత ప్రయోగంకూడా ఉందిగాని అర్థం సుస్పష్టంకాదు.

యుక్త వయసులోని స్త్రీని కొమిరె, జవరాలు, జవ్వని అంటారు. కాపురం చేస్తున్న ఆమెను మగనాలు, అయిదువ(రాలు) అని పిలుస్తారు. ఇల్లాలిని గేస్తురాలు, గరిత అంటారు. రాణిని దేవేరి అంటారని నిఘంటువులు చెప్తాయిగాని అందులోని ప్రథమ భాగం సంస్కృత దేవ శబ్దమేనని చెప్పాలి. చివరి 'ఏరి' అనే స్త్రీవాచకమైన ప్రత్యయంగా బండిరాతో శాసనభాషలో కనిపిస్తుంది. ఇక మిటారి (నిక్కునీలుగులున్న ఆమె), వాల్గంటి (వాలు చూపులు చూసేది), చిలుకలకొలికి (చిలకపలుకులు/ముద్దుమాటలు మాట్లాడేది), చిగురుబోడి/బోణి, పూబోడి/బోణి, మెరుగుబోడి/బోణి (చిగురులాగా, పూవులాగా, మెరుపులాగా ఉండేది) మొదలయిన మాటల సంగతి చెప్పనక్కరలేదు. భార్య అనే అర్థంలో ఆలు, పెండ్లాం అనే తెలుగుమాటలున్నాయి గాని మొదటిదానికిప్పటి భాషలో విడిగా బూతుల్లో తప్ప ప్రయోగమున్నట్లు లేదు.

ఇటీవలి కాలంలో సంస్కృతాంధ్రమిశ్రితమైన 'శ్రీవారు' భర్త అనే అర్థంలో, 'శ్రీమతి' అనే శుద్ధసంస్కృతపదం భార్య అనే అర్థంలోనూ వాడుకలోకి వచ్చాయి. శ్రీమతి శబ్దం మగనాలు అనే అర్థంలో పలకరింపు మాటగానూ గౌరవార్థకంగానూ ఎక్కువ వాడుకలో ఉంది. 'మా/నా శ్రీమతి' అన్నప్పుడు మాత్రమే 'భార్య' అనే అర్థంలో ప్రయోగం. గౌరవవాచకమయిన 'వారు' అనే తెలుగు సర్వనామానికిముందు 'శ్రీ' చేర్చి భర్త అనే అర్థంలో ఇల్లాళ్లు చెప్పటం ఈనాటి పద్ధతి అవుతున్నది. ప్రభుత్వ పరిభాషలో 'శ్రీ' పురుషవాచకంగా, 'శ్రీమతి' వివాహితస్త్రీ వాచకంగా, 'కుమారి' అవివాహిత స్త్రీ వాచకంగా గౌరవపూర్వకంగా వాడవలసిన మాటలు. అయితే పురుషుడికి పెండ్లయిందో లేదో శ్రీ శబ్దంవల్ల బయటపడనప్పుడు స్త్రీల విషయంలో ఈ భేద సూచకపదా లెందుకనే వాదం పుట్టకపోలేదు. పేరురాసి చివర 'గారు' చేరిస్తే ఈ పేచీ తప్పిపోతుంది. మహారాష్ట్రలోని కొన్ని ప్రాంతాల్లో శ్రీమతి శబ్దానికి 'విధవరాలు' అనే దురర్థం వచ్చిపడింది!

## శరీరభాగాలు

శరీరభాగాలను చెప్పే పర్యాయపదాలను పరిశీలిద్దాం. ప్రబంధ కవుల్లాగా 'ఆపాద మస్తకం' అనే క్రమం వదలిపెట్టి అన్ని అవయవాల్లోకి ప్రధాన తమమైన 'తల'తో మొదలెద్దాం. తల అనే తెలుగుమాటకు తలకాయ, తలపండు, బుర్ర(కాయ) అనేవి తెలుగులోని బదులు మాటలు. బుర్ర అనేది గుండ్రంగా ఉంటుందని ఆలంకారికంగా వచ్చిన పేరేమో. తలకు కాయ పండు శబ్దాలను మాండలికంగానయినా చేరుస్తుంటాం. తలపండు శబ్దం సాధారణంగా తిట్లలో వాడుతుంటాం. మళ్లీ 'తల పండిం'దన్నప్పుడు జుట్టు నెరిసిందని, అనుభవజ్ఞానం వచ్చిందని రెండు రకాల అర్థాలు చెప్తుంటాం. తలలో నుంచే ఆలోచనలు, ఊహాలు వగైరా పుట్తాయి కాబట్టే 'తలచు' వంటి క్రియా రూపం, 'తలపు' వంటి నామరూపం తలనుంచే పుట్టాయనాలి. కొద్దిమంది 'తల'కు బదులు 'నెత్తి' అనే మాట వాడుతుంటారు. అది 'ఎత్తయిన, పై' భాగం అనే అర్థంలో పుట్టినమాట. కొండశిఖరాన్ని కూడా 'నెత్తం' అని పిలుస్తారు. తలమీది, పుర్రె మీది భాగం 'మాడు'. ఆ మాటకు 'మిద్దె, మేడ' అనే అర్థాలు కూడా ఉన్నాయి.

తలకు పర్యాయాలని చెప్పదగిన సంస్కృతపదాలు శిరసు, శిరస్సు, శీర్షం, మూర్ధ(ం), మస్తకం, ఉత్తమాంగ మనేవి. వీటిలోని మొదటి రెండూ రూపాంతరాలు. శీర్ష శబ్దానికి కావ్య ప్రపంచంలోకన్నా వేదవాఙ్మయంలో, మంత్రశాస్త్రంలో ఎక్కువ వాడుక ఉన్నట్లుంది. మూర్ధ శబ్దం 'మూర్ధాభిషక్తుడు' వంటి సమాసాల్లోనే ఎక్కువ వ్యాప్తి కలది. మస్తం, మస్తకం అనేవి రూపాంతరాలు. వాటికి 'పైనున్నది' అనే అర్థం. తెలుగులోని 'మాడు' వంటి పదమన్నమాట. అంగాలన్నిటిలో తల ఉత్తమమని దానికి ఉత్తమాంగమనే వర్ణనాత్మకనామం వచ్చింది.

నుదురు, నొసలు అనే రెండు తెలుగుమాటలు తల ముందు వైపున్న విశాలభాగానికి పేర్లు. రెండో పదానికి వ్యాప్తి తక్కువ. వీటికి పర్యాయాలుగా 'అలికం, లలాటం, ఫాలం' అనే సంస్కృతపదాలున్నాయి. అలికానికి అలీకమనే రూపాంతరముంది. అలీకానికి మిథ్య, మాయలాంటి అర్థవిశేషాలున్నాయి. ఫాల శబ్దానికి వీరశైవకవుల వాడుకలో 'భాల'మనే రూపాంతరం కనిపిస్తుంది. 'ఫాల-అంక-ఈశ్వరు'డనే మూడు మాటల సమాసం నొసట కన్నున్న శివుడనే అర్థమిస్తుంది. దానికి 'భాలాంకేశ్వరు'డనే రూపాంతరం పుట్టి అది కాలక్రమాన 'బాలంకేశ్వరుడు'గా మారిపోయింది. నుదురుకు రెండువైపులా కనుబొమ/కనుబొమ్మ లుంటాయి. ఇది తెలుగుమాట. దీనికి దీటయిన సంస్కృతపదం 'భ్రూవు'. కనుబొమల మధ్య గల కురచనైన వెంట్రుకలను సంస్కృతంలో 'కూర్చం' అంటారు. దీనికి సమానమైన తెలుగుమాట తెలీదు. సాముద్రికశాస్త్రంలో ఈ కూర్చానికి ప్రత్యేక స్థానముంది.

శరీరానికి తలలాగా తలకు ముఖ్యమయినవి కళ్లు. ఏకవచనంలో కను/కన్ను. ఇది తప్ప తెలుగులో మరో మాట పర్యాయపదంగా ఉన్నట్లు తెలీదు. 'గుడ్డు' అనేది కన్నుగాదు – కాకపోదు. కన్ను శబ్దానికి అనేక ఇతరార్థాలు ఉన్నాయి. ఉదాహరణకు 'నెమలి కన్ను, బండికన్ను' అనే సమాసాల్లోని కన్ను. సంస్కృతంలో 'లోచనం, నయనం, నేత్రం, ఈక్షణం, చక్షువు, అక్షి, దృక్కు, దృష్టి' అనే పర్యాయపదాలున్నాయి. ఈక్షణమంటే చూసేది. దానికి 'చూపు' అనే అర్థాంతరముంది. దృష్టి శబ్దానికి ఈ రెండర్థాలూ ఉన్నాయి. కను 'గుడ్డు'ను సంస్కృతంలో గోళకం అంటారు – గుండ్రంగా ఉండేదనే అర్థంలో. గుడ్డు మధ్యనున్న భాగాన్ని తెలుగులో 'పాప, అబ' అనవచ్చు. రెండోమాట నిఘంటువుల్లో నిలిచింది – వ్యవహారంలో తొలగిపోయింది. ఈ మాటలకు సమానమైన సంస్కృతపదాలు 'తారక, కనీనిక' అనేవి. తారకా శబ్దానికి నక్షత్రం వగైరా ఇతరార్థాలున్నాయి. కనీనికా శబ్దానికి 'చిటికెనవేలు' అనే అర్థంకూడా ఉంది – బహుశా 'చిన్నది' అనే భావంతో ఈ పేరు వచ్చిఉంటుంది. కనీసం, కనిష్ఠ వంటి మాటలతో దీనికి దూరబంధుత్వమయినా ఉండనాలి.

కళ్ల మధ్య ఉన్న ముక్కుకు 'ముకు' అనే రూపాంతరముంది. అది వాడుకలో కూడా 'ముకుదాడు'వంటి సమాసాల్లో వినిపిస్తుంది. ముక్కు శబ్దం క్రియగా కూడా కనిపిస్తుంది–వినిపిస్తుంది. దీనికి 'చనుమొన' అనే అర్థంలో ప్రయోగాలున్నాయి. 'కొన, కొస' అనే అర్థంలో వాడుక ఉంది. ఉదాహరణకు పెన్సిలు 'ముక్కు' చెక్కుతాం. దీనికి పర్యాయపదమని చెప్పదగిన మరో తెలుగుమాట కనిపించదు. 'ఘ్రాణం, గంధవహం, ఘోణ, నాస, నాసిక, నస్య' అనే సంస్కృత పదాలు పర్యాయపదాలు. ఘ్రాణం అంటే వాసన చూసేది. ఘోణ శబ్దానికి ముక్కు అనే అర్థం చెప్పేకన్నా 'ముట్టె' అనే అర్థం చెప్పటం నయం. ఆఘోణం కలది కాబట్టి పిదుపందికి ఘోణి అనే పేరు వచ్చింది. వాసనను మోసుకవచ్చి మనకు తెలుపుతుంది కాబట్టి దాన్ని గంధవహ మన్నారు. ఈ మాటకు 'గాలి' అనే అర్థాంతరముంది. నాస, నాసిక, నస్యలు రూపాంతరాలు. బహుశా చిన్నముక్కును నాసిక అనాలేమో. నస్య అనే శబ్దం నిఘంటువుల్లోనే కనిపిస్తుంది. 'నశ్య'మనే ముక్కుపొడికి దీనికీ బదరీబాదరాయణ సంబంధముందేమో చెప్పలేం. నాసా

శబ్దమొక్కటే సంస్కృతంలో ముక్కును సూచించే మామూలు మాట. తక్కినవి వర్ణనాత్మక పదాలు.

ముక్కుకు రెండువైపులా చెంపలుంటాయి. ఆ మాటకు 'చెంక, చెక్కు, చెక్కిలి, గవుద' అనే పర్యాయపదాలున్నాయి. చెంపాచెంకలూ చెక్కు చెక్కిళ్లూ రూపాంతరాలు. చెంప/చెంక శబ్దాలకు 'పక్కవైపు' అనే అర్థాలున్నాయి. ముక్కుకు పక్కనున్న భాగమని ఈ పేర్లు వచ్చాయి. చెక్కు, చెక్కిలి అనేవి కావ్యభాషా పదాలు. గవుద/గౌద అనే మాటకు తిట్లలోనే వాడుక ఎక్కువనిపిస్తుంది. వీటికి తుల్యమైన సంస్కృతపదాలు 'కపోలం, గండం' అనేవి. గండ శబ్దానికి గుండ్రాయి వంటి ఇతరార్థాలు చాలా ఉన్నాయి. బహుశా ఇది 'ఉబ్బిన' భాగమనే అర్థంలో వర్ణనాత్మకంగా ఏర్పడ్డ రూపం కావచ్చు.

ముక్కు కింద పెదవి, నోరు ఉంటాయి కదా. పెదవికి 'ఔడు/అవుడు, మోవి, వాతెర' అనేవి తెలుగు పర్యాయపదాలు. వాతెర అంటే 'వా' (=నోరు) కు 'తెర'గా అడ్డుగా ఉండే భాగమని అర్థం. ఔడు శబ్దాన్ని కొందరు సంస్కృతంలోని ఓష్ఠశబ్దం నుంచి పుట్టిన మాట అని చెప్తారు. మోవికీ 'మోవు' (లేత ఆకు)కూ దూరసంబంధమైనా ఉండాలి. వీటికి సమానమైన సంస్కృత పదాలు'అధరం, ఓష్ఠం, రదనచ్ఛద'మనేవి. అధరమనే మాటకు 'కింది' అనే అర్థం కూడా ఉంది కాబట్టి కొందరు దానికి 'కింది పెదవి' అని అర్థం చెప్తారు. అందువల్ల ఓష్ఠం అంటే పైపెదవి కాక తప్పదు. రదనమంటే పళ్లు. ఛదం అంటే కప్పు. పళ్లు కనిపించకుండా చూస్తాయి కాబట్టి పెదవులకు ఆ పేరు పెట్టారు వర్ణనాత్మకంగా. తెలుగు పెదవులు నోరు మూస్తే సంస్కృతం పెదవులు పళ్లనుమాత్రం కప్పిపెట్టాయి!

సంస్కృతం నేర్చుకొనే తొలిరోజుల్లో 'ముఖమంటే నోరా? మోరా?' అనే సందేహం వచ్చింది. అది ఈనాటికీ తీరిందన్న నమ్మకం లేదు. 'వక్త్రం, ఆస్యం, వదనం, తుండం, ఆననం, లపనం' అనే సంస్కృత పదాలు ముఖ్యపర్యాయాలు. ముఖ శబ్దానికి 'ఎదట ఉన్న'దనే అర్థముంది. మాటలు వెలువడే చోటు కాబట్టి వదనం. మాటలు చెప్పేది కాబట్టి వక్త్రం. మాటలకు పుట్టిల్లు కాబట్టి లపనం. వక్త్ర, వదన, శబ్దాలకూ 'వచ్, వద్' ధాతువులకూ సంబంధముంది. వాటికి 'పలుకు' అనే అర్థం. లపన శబ్దానికి 'మాట' అనే అర్థముంది. తుండ శబ్దానికి '(పక్షి) ముక్కు, (ఏనుగు) ముక్కు' అనే అర్థవిశేషాలున్నాయి. ఈ పదాలన్నిటికీ 'నోరు, మోర' అనే రెండర్థాలూ ఉన్నాయి. చెవి, కన్ను, ముక్కులాంటి భాగాల మొత్తాన్నీ ముఖాది శబ్దాలతో పిలుస్తాం. నోటిని కూడా అదే పేరిట పిలుస్తాం.

ఈ విషయంలో సంస్కృతంకన్నా తెలుగే నయమనిపిస్తుంది. కేవలం నోరు అనే అర్థంలో 'వా(యి), మూతి' అనే మాటలున్నాయి అచ్చతెలుగులో ఆ మాటకువస్తే 'ముట్టె' అనేదికూడా. ఇతరావయవాలతో కలిసిన తల ముందుభాగాన్ని 'మోర' అంటాం. 'మొగం, మోము' అనే రూపాంతరాలు సంస్కృత ముఖ శబ్దంనుంచి ఏర్పడ్డ మాటలు. అయితే వాటికి మూలభాషలో లాగా 'నోరు' అనే అర్థం లేదు. కానీ 'మొహం' కడిగాడన్నప్పుడు 'పళ్లుతోమా'డనే మరో వ్యవహారం లేకపోలేదు. 'మొహం తోముకో' అంటామేగాని 'పళ్లు కడుక్కో' అని దానికి పర్యాయంగా

వాడ్తామని గట్టిగా చెప్పలేం వా, వాయి అనే రూపాంతరాల్లో మొదటిది 'వాతెర' వంటి సమాసాల్లోనే కనిపిస్తుంది. వాయి శబ్దం నేటి వాడుకలో తిట్లలోతప్ప వినిపించదు. మూతి, నోరు అనేవి కూడా నిజానికి పర్యాయపదాలని చెప్పలేం. మూతి ముడుస్తాం; నోరు ముడువంగానీ మూస్తాం. నోరు తెరుస్తాం కానీ మూతి తెరవం. తెరవడానికీ మూయడానికీ వీలయిన పెదవులుగల భాగం నోరు. మరోవిధంగా చెప్పాలంటే తెరవటం, మూయటంలేని భాగం మూతి. జంతువులయితే 'ముట్టె'; మనుష్యులయితే 'మూతి'. ఈ కాలానికి 'మోర' అనేది జంతువుల మొహమేగాని మనుష్యులది కాదు – తిట్లలో తప్ప, వెక్కిరింతలో తప్ప.

మూతిమీద మీసం, మూతికింద గడ్డం పురుషచిహ్నాలకింద లెక్క. మీసం బహువచన రూపం 'మీసలు' అనేది కూడా ఉంది – పుస్తకాల్లో. ఇది తెలుగు మాటేనంటారు కొందరు. కాదు – సంస్కృతంలోని 'శ్మశ్రు' శబ్దభవమంటారు మరికొందరు. గడ్డమనే మాటకు కనీసం రెండర్థాలున్నాయి. మూతికింది దవడకింది భాగం. ఇది స్త్రీ పురుష సాధారణావయవం. దానిపై వెంట్రుకలుంటే పురుషలక్షణం. గడ్డమనేది – రోమరహితమైనప్పుడు – 'గద్దువ' అనే పర్యాయపదం కలది. ఈ మాట గ్రంథాల్లోనేకానీ వాడుకలో ఉన్నట్లులేదు. దానికి సమానార్థమైన సంస్కృతపదం 'చిబుకం'. ఇటీవల కొందరు 'చుబుక'మని ఉకారాదిగా కూడా రాస్తున్నారు, రచనా స్వాతంత్ర్యం పురస్కరించుకొని.

మూతికి రెండువైపులా 'దవడ'లూ లోపల నాలుకా ఉంటాయికదా. పక్కలనుండే భాగాన్ని చెంప, చెంక, చెక్కిలి అంటారని ఇంతకుముందనుకున్నాం. చెంప ఎముకలను 'దవుడ, దౌడ, దవడ' అనే రూపాంతరాలతో వ్యవహరిస్తాం. ఇది తెలుగుమాట. దానికి సమానమైన సంస్కృత పదం 'హనువు'. అది కొట్టవచ్చినట్లు కనిపించే వ్యక్తి కాబట్టి హనుమంతుడన్నారుగాని మానవులందర్నీ అలా పిలిచినా తప్పులేదు – మూలార్థాన్నిబట్టి. హనువు లోపలిభాగం – అంటే నోటివైపున్న దవడను 'తాలువు' అంటారు. కొందరు తెలుగుకవులు ఆమాట చివరి ఉకారాన్ని ఆకారంగా మార్చి అది తెలుగుమాటే పొమ్మన్నారుగాని అది సంస్కృతపదం. దానికి 'కాకుద'మనే పర్యాయపదముంది సంస్కృతంలో. దవడ పైభాగం ఉబికిఉంటే 'బుగ్గ' అంటాం. 'నీటిబుగ్గ' అనేచోట కూడా ఉబుకుతున్నచోటనే అర్థం. సొట్టబుగ్గలు, చప్పిడి బుగ్గలు వగైరా భేదాలున్నాయనుకోండి. వాటి సంగతిని సౌందర్యారాధకులకు వదిలేద్దాం.

నాలుక అన్నదొక్కటే తెలుగులో ఉన్నమాట. దానికి 'నాల్క' అనేది రూపాంతరం మాత్రమే. సంస్కృతంలో దానికి 'జిహ్వ, రసన, రసజ్ఞ' అనే పర్యాయపదాలున్నాయి. జిహ్వ ఒక్కటే మామూలుమాట. రసన, రసజ్ఞ అనే మాటలకు 'రుచి చెప్పేది, రుచి తెలుసుకొనేది' అనే వర్ణనాత్మకార్థముంది. నాలుకకు ఎముకే లేదుకాబట్టి ఎలాగయినా తిప్పవచ్చునంటారుగాని అసలు లేకపోలేదని శాస్త్రజ్ఞులంటారు. అయితే మనశాస్త్రం మనదే కాబట్టి ఇతరులను పట్టించుకోనక్కరలేదు. నాలుకపైన మరో చిన్ననాలుక ఉంటుంది. దాన్ని 'చిరునాలుక, కొండనాలుక' అంటారు. చిన్నది కాబట్టి చిరునాలిక. ఎత్తున ఉంటుంది కాబట్టి కొండనాలిక. కొండనాలికకు మందుపెడితే ఉన్న నాలిక ఊడిపోతుందంటారుగాని అది కేవలం భ్రమ. పాడిదగ్గ ఎంతకూ

తగ్గకపోతే వైద్యులు దాన్ని కత్తిరిస్తారు. దగ్గు తగ్గడంతప్ప మరో ప్రమాదమేమీ జరగదు. అయితేనేం? నమ్మకాలు పోవు!

నోట్లో ఉన్నవి పళ్లు. ఆ మాటకు ఏకవచన రూపం 'పల్లు'. కానీ వాడుకలో 'పన్ను' అనే రూపమే నిలిచింది. 'కన్ను–కళ్ళు' అనే రూపాల సామ్యంవల్ల 'పన్ను–పళ్లు' అనే రూపా లేర్పడ్డాయన్నమాట. పల్లు శబ్దానికి పల్లం, గుంట అనే అర్థాంతరాలున్నాయి. అలాగే పండు శబ్దానికి బహువచనంగా పళ్లు అనే మరో రూపముంది. పల్లు శబ్దానికి 'కోర' అనే మరో పర్యాయముందిగాని వాడిగా పొడుగ్గా ఉన్నదే కోర. ఈ అర్థం వాడుకలోమారి 'కోరపళ్లు' వంటి సమాసాలు ఏర్పడ్డాయి. జంతువులకూ రాక్షసులకూ మాత్రమే కోరలుంటా యనుకొంటాం. కోరకు సమానమైన సంస్కృతపదం 'దంష్ట్ర' పల్లుకు సమానమైన సంస్కృత పదాలు 'దంతం, రదం, రదనం, దశనం' అనేవి. దంత శబ్దం ఏనుగు కోరపళ్లకు పేరైపోయింది. రదం, రచనం అనేవి పరస్పరం రూపాంతరాలు. రదం అంటే కొరికేది. దశన శబ్దానికి 'కవచం, శిఖరం' అనే ఇతరార్థాలున్నాయి. చాలా ఉంటాయికాబట్టి దశ–నం అన్నారు.

తలకు మరోవైపు చెవులుంటాయి. చెవికి పర్యాయాలని చెప్పదగిన తెలుగుమాటలు 'వీను, జానుగు' అనేవి. వీను శబ్దం సాహిత్య పుస్తకాల్లోనూ, జానుగు శబ్దం నిఘంటువుల్లోనూ కనిపిస్తాయి. 'వీనులవిందు' వంటి ప్రయోగాల్లో తప్ప వీను శబ్దానికి నిత్యవ్యవహారంలో వాడుకలేదు. అసలు జానుగు శబ్దం అచ్చ తెలుగేనా అన్న సందేహముంది. 'కర్ణం, శ్రోతం, శ్రుతి, శ్రవం, శ్రవణం, శబ్దగ్రహం' అనేవి చెవికి పర్యాయపదాలైన సంస్కృత శబ్దాలు. శ్రుతి శబ్దానికి 'వినికి, వేదం' అనే అర్థాలున్నాయి. వినేది కాబట్టి శ్రవ(ణ)ం, శబ్దగ్రహం. వినిపించుకొనేది కాబట్టి శ్రోత్రం. ఇక మిగిలిన కర్ణ శబ్దమే ఆ భాషలో మామూలుమాట.

తల నిలిచేది 'మెడ' మీద. కొందరు దీన్ని మెడకాయ అనికూడా పిలుస్తారు. 'అఱ్ఱు, కొలిమి' అనే మరి రెండు తెలుగు మాటలు దీనికి పర్యాయపదాలని నిఘంటువులు చెప్తాయి. మొహం విషయంలోలాగానే మెడ విషయంలో కూడా కొంత అస్తవ్యస్తత లేకపోలేదు. 'గొంతు, కుతుక, కుత్తుక' అనే వాటిని కూడా మెడకు పర్యాయపదాలన్న వారు లేకపోలేదు. లోపలి భాగం గొంతు(క), కుత్తుక; పైభాగం మెడ, అఱ్ఱు. అఱ్ఱు ఔపవిభక్తికపదం. అఱ్ఱుకు 'అరుత' అనేది ఔపవిభక్తిక రూపం. అంటే ద్వితీయాది విభక్తుల్లో వచ్చేరూపం. కానీ కొందరు దాన్నే ప్రథమావిభక్తి రూపంగా భావించారు పొరపాటున. మెడ అంటే పైనున్నది – బహుశా మొండెంపైనున్నది. అఱ్ఱు అనే పదం ప్రాచీన శాసనాల్లో, కావ్యాల్లో కనిపించే పదం. ఈ కాలానికి వ్యవహారచ్యుత మయిపోయింది. కొలిమి అన్న పదానికి నిఘంటుప్రయోగం తప్ప మరే వాడుకా ఉన్నట్లు లేదు.

గొంతు అనే లోభాగానికి పర్యాయంగా చెప్పదగిన సంస్కృత పదాలు 'కంఠం, గలం/గళం' అనేవి. కంఠ శబ్దానికి సమీపమనే అర్థముంది. ఇప్పటికీ 'గ్రామకంఠం' వంటి సమాసాల్లో ఆ అర్థం వినిపిస్తుంది. ఆ శబ్దానికి మెడ అనే అర్థంకూడా ఉంది కాబట్టి మెడకు తగిలించే నగను 'కంఠిక, కంటె' అని పిలుస్తారు. గొంతుతోబాటు

గొంతులోనుంచి పుట్టే ధ్వనిక్కూడా కంఠమనేపేరే ఉంది. అలాగే గళ శబ్దానిక్కూడా గళాంకురం, గళశుండిక (=కొండనాలుక) అనే సమస్త పదాలు గళ శబ్దానికి మెడలోపలి భాగమనే అర్థముందని నిరూపిస్తాయి. గళ శబ్దానికి వినడానికి ఉపయోగపడేదనే దూరార్థం కూడా ఉంది కాబట్టి గళితం (=తిన్నది, మింగినది) అనే మాట పుట్టింది.

గొంతు బయటి భాగానికి – అంటే మెడకు పర్యాయపదాలని చెప్పదగిన సంస్కృత పదాలు 'గ్రీవ, శిరోధి, కంధర' అనేవి. శిరోధి అనటంలోనే శిరసు (=తల) కిందదనే అర్థం తట్టుతుంది. కంధర శబ్దానికి కంధరం అనే రూపాంతరముంది. గ్రీవా శబ్దానికి 'మెడనరం' అనే అర్థవిశేషం కూడా ఉంది. 'సుగ్రీవుడు, గరళగ్రీవుడు (=శివుడు)' మొదలైన మాటల్లో ఈ పదాని కిప్పటికీ ప్రయోగం కనిపిస్తుంది. మెడ వెనకభాగానికి 'పెడతల' అనేది తెలుగు పేరు. సంస్కృతంలో దీనికి పర్యాయపదాలని చెప్పదగ్గవి 'అవటు(వు), ఘాట, కృకాటిక' అనేవి. అవటు శబ్దానికి కొందరు 'ముచ్చలిగుంట' అనే ప్రత్యేకార్థముందంటారు. పల్లం, గుంట అనే అర్థాలు కూడా ఈమాటకున్నాయి. ఘాట శబ్దానిక్కూడా ఇలాగే అర్థాలు చెప్తారు. కృకం అంటే కంఠనాళం. కృకాటిక అంటే ఆ నాళాలున్న చోటు. అది పూర్తిగా వర్ణనాత్మకమైన శబ్దం. బహుశా వైద్యశాస్త్రంలోనే ఇది పుట్టి వుంటుంది. అవటు శబ్దానికి కావ్య ప్రయోగాలు చాలా దొరుకుతాయిగాని ఘాట శబ్దానికి వెతికి పట్టుకోవలసిందే.

తల నుంచి మెడ కింది వరకూ – స్త్రీలకయితే మీగాళ్ల వరకూ – వ్యాపించిన వెంట్రుకల సంగతి తలచుకోకపోవడం కొరత. ఇంగ్లీషు అకుల మీద నూగునుంచి మానవ శరీరంలోని భిన్న భాగాల్లో కనిపించే రోమాలకు 'హెయిర్' (hair, hairs) అనే మాటొక్కటే ఉన్నట్లుంది. కానీ మన భాషలో కొన్ని చెప్పరాని మాటలు కూడా కలిపి చాలాపదాలున్నాయి. మొదట జుట్టు/జుత్తు సంగతి చూద్దాం. ఈ రెండూ రూపాంతరాలయిన సమూహవాచి శబ్దాలు – అంటే వెంట్రుకల గుంపును చెప్పే మాటలు. రెండూ తెలుగుమాటలే. వీటికి పర్యాయపదాలని చెప్పదగ్గవి 'చికురం, కుంతలం, వాలం, కచం, కేశం, శిరోరుహం' అనేవి. శిరోరుహం అంటే తలమీద పుట్టిందని అర్థం. ఇది కేవలం వర్ణనాత్మకం. కచ శబ్దానికి వెంట్రుక అనే ఏకవచనార్థమేగాక వాటికట్టు అనే సమూహార్థంకూడా ఉంది. కేశం అంటే వెంట్రుక. చక్కని జుట్టుందని కాబోలు విష్ణుమూర్తిని కేశవుడంటారు. అయితే పండితులందరూ ఆరకంగా చెప్తే ఒప్పుకోరు. 'కే' అంటే నీటిలో – అంటే పాల సముద్రంలో – శయనించినవాడు – అంటే విష్ణువు అని చెప్తేనేగాని చాలా మందికి సంతృప్తి కలగదు! మామూలుగా చెప్పేకన్నా ఏదో కొంత కల్పనతో చెప్తేనే నచ్చుతుంది కాబోలు! కుంతల శబ్దానికి ఇతరార్థాలు చాలా ఉన్నాయి. వాలం అంటే తోక అని వేరే చెప్పనక్కర లేదు. బహుశా పొడుగాటి వెంట్రుకలను ఒకప్పుడు ఆపేరుతో పిలిచేవాళ్లేమో. ఈ కాలంలో కవులు కూడా ఈ అర్థంలో ఈమాట వాడటంలేదు.

నుదురుమీది జుట్టుముడికిరాని చిన్నచిన్న వెంట్రుకలను (శుద్ధ గ్రాంధికంలో వెండ్రుకలు – కేవల వ్యవహారంలో వెంట్రికలు) వేరే మాటలున్నాయి. వీటిని సాధారణంగా బహువచన రూపంలోనే వాడుతుంటారు – తెలుగులో. అవి 'నెరి,

నెరులు, కురులు' అనేవి. నెరి కురులనే సమాసానికే వాడుక చాలా ఎక్కువ. కురులు అంటే చిన్నవని అర్థం. నెరులంటే 'చక్కని, గుండ్రని' వని అర్థం. వంకర తిరిగిన చిన్న వెంట్రుకలు కురులు, నెరులు. అవి ముందు – తలకు ముందు – అంటే నుదుట – కప్పితే అవి 'ముంగురులు'. తలమీదనే ఉండి జడ వేయటానికిగాని, పిగ చుట్టడానికిగాని చాలీచాలనంత పొడవుగా వుంటే 'కూకటులు'. ఆ మాటకు ఏకవచన రూపం 'కూకటి'. 'పిల్ల జుట్టు, పిలక జుట్టు' అని చెప్పాలి దానికర్థం. పిలక అంటే చిన్నది, అప్పుడే మొలకెత్తింది అని అర్థం. కొందరు కూకటి శబ్దానికి 'ముఖ్యమైన' అనే అర్థంచెప్పి 'కూకటివేరు' వంటి సమాసాల్లో ఆ అర్థముందని చెప్తారు. మనుచరిత్రలోని ప్రవరాఖ్యుడికీ సోమిదేవమ్మకూ (అతడి భార్యకూ) 'కూకటుల్ కొలిచి' పెండ్లి చేశారట. అంటే వాత్స్యాయనం ప్రకారం భార్య వయస్సు భర్త వయస్సులో సగానికి రెండు కలిపినంత ఉంటే మంచిదన్నారు కాబట్టి రెండేళ్ల వయస్సును కూకటులనుబట్టి నిర్ణయించి బాల్యవివాహం చేశారనే వ్యాఖ్యానముంది. ఆ జుట్టుకు అలాంటి ప్రయోజనాలున్నాయని ఇటీవల తెలిసింది!

కురులకు సమానమైన సంస్కృత పదాలు 'అలక, చూర్ణకుంతలం' అనేవి. రెండో మాట పూర్తిగా వర్ణనాత్మకమయింది. కూకటిని 'కాకపక్షం, శిఖండకం' అనే పేర్లతో పిలవవచ్చు – సంస్కృతంలో. మరి శిఖండికి చక్కటి కూకటి వెంట్రుకలుండేవేమో తెలీదు. ముంగురులనే అర్థంగల సంస్కృతపదం భ్రమరకం. గాలికి అటూ ఇటూ ఎగురుతూ ముడికిరాని జుట్టనే కారణంగా ఈ పేరు వచ్చివుంటుంది. జుట్టు మొత్తాన్ని – తల వెండ్రుకలన్నింటినీ కలిపి – సంస్కృతంలో 'కైశ్యం, కైశికం' అని పిలుస్తారు – కేశ శబ్దం మీద నుంచి కల్పించి.

తెలుగులో 'కొప్పు' అనే మాటకు 'జుట్టుముడి' అనే సమాసం తప్ప మరో పర్యాయపదమున్నట్లు లేదు. 'తురుము' అనే మాట ఉందిగాని పూలు ముడిచినప్పుడే ఆ మాటను వాడవచ్చు. కొప్పు శబ్దానికి 'పైభాగం, చివరిభాగం' అనే అర్థవిశేషాలున్నాయి. ఉదాహరణకు 'ఇంటికొప్పు, నడికొప్పు, వింటికొప్పు' వగైరాలు. సంస్కృతంలో దీనికి సమానమైన పదం 'కబరి'. కేశపాశమనే మరోమాట ఉందిగాని అది వర్ణనాత్మకమే. దువ్వి అలంకరించిన కొప్పును 'ధమ్మిల్లం' అంటారు. ఆ మాటకు సరిగ్గా సమానమైన తెలుగుమాట 'కీలుగంటు'. దీనికి కావ్యాల్లో తప్ప వాడుకలేదు. అల్లిన జడను సంస్కృతంలో 'వేణి' అంటారు. పెద్ద జడ అయితే ప్రవేణి. వేణీ శబ్దానికి 'పాయ' అనే అర్థముంది. అసలు 'జడ' అన్న తెలుగుమాటే సంస్కృతంలో 'జటా' శబ్దంనుంచి పుట్టింది.

నడినెత్తిన చుట్టచుట్టిన జుట్టును తెలుగులో 'సిగ' అని, సంస్కృతంలో 'శిఖ' అనీ పిలుస్తారు. తెలుగుమాట సంస్కృత శబ్దంనుంచి పుట్టింది. శాఖా శబ్దానికి 'చూడ, కేశపాశి' అనే పర్యాయపదాలున్నాయి. సన్యాసులూ మహర్షులూ చుట్ట చుట్టిన వెంట్రుకలను 'జట, సట' అని వ్యవహరిస్తారు. అలంకారంగాని, నూనెమెరుగుగాని లేని జడలను జట అంటారు. జటా శబ్దం నుంచి పుట్టిన జడ అనే మాటకు స్త్రీల జుట్టుముడి అనే అర్థవిశేషం వచ్చింది తెలుగువారి వాడుకలో. సటా శబ్దానికి 'జూలు' అనే అర్థం. అంటే ముడివేయని 'చింపిరిజుట్టు' అని అర్థం. సింహంవంటి జంతువుల

జుట్టుకు ఈ పేరు నిలిచిపోయింది. కొప్పుల్లో ఎన్నో రకాలున్నాయి. ఆలయ శిల్పాల్లో అవి కనిపిస్తాయి. కాని వాటికున్న ప్రత్యేకమైన పేర్లు సరిగా తెలియవు. అన్నట్లు 'వెంట్రుక'కు సమానమైన సంస్కృత పదాలను చెప్పలేదు కదూ. అవి 'రోమం, లోమం, తనూరుహ'మనేవి. మొదటిరెండు మాటలూ ఒకదానికొకటి రూపాంతరాలు. మూడోది కేవలం వర్ణనాత్మకం. తనువు (=శరీరం)లో పుట్టినదని దానికర్థం.

తలలేని శరీరాన్ని తెలుగులో 'మొండెం' అనీ, సంస్కృతంలో 'కబంధ'మనీ పిలుస్తారు. తల ఉన్నా ప్రాణం లేని, అస్థిచర్మాలులేని, మాంసం లేని శరీరాన్ని తెలుగులో 'బొంద, బొందడు, డొక్క' అంటారు. ఎందుకట్లైను కూడా బొంద అంటాం. 'నీ బొంద! నీ బోలె!' వగైరా తిట్లలో మాత్రమే బొంద శబ్దం వినిపిస్తుంది. డొక్కకు పొట్ట అనే మరో అర్థముంది. 'డొక్కు' అనే రూపాంతరానికి 'ఎండిపోయిన, ఖాళీగా ఉన్న, ముదివరుగయిన' మొదలైన విశేషార్థాలున్నాయి. వీటికి సమానమైన సంస్కృత పదం 'కంకాళం'. దానికి పర్యాయపదం 'అస్థిపంజరం'. 'ఎముకలగూడు' అనే తెలుగు సమాసం దానికి సరైన సమానార్థకం.

తల లోపలి ఎముకలు తప్ప రక్తమాంసాదులు లేని తలను తెలుగులో 'పుర్రె, పుచ్చె, పునుక, పురియ, బోకి, బొంకి, పెంచు, పెంకు, పెంచుక, పెరకంచు, తలపాల, కప్పెర' మొదలైన పేర్లతో పిలుస్తాం. 'పురియపుర్రెలు, పెంచుపెంచుకలు, బోకిబొంకులు' అన్యోన్యరూపాంతరాలు. పురియ/పుర్రె – అనే మామూలు మాట. పుచ్చె శబ్దానికి టెంకాయబొండం అనే అర్థం కూడా ఉంది. పుర్రె, పుచ్చె అనే మాటలకే నిత్యవ్యవహారంలో ఎక్కువ వాడుక ఉంది. పునుక శబ్దానికి 'తలచిప్ప (ఎముక)' అని అర్థం. ఈ మాటకు కావ్యాల్లోనే ప్రయోగం కనిపిస్తుంది. పెంకు శబ్దానికి ఎండుగా, గట్టిగా ఉన్న ఏ వస్తువయినా అర్థం కావచ్చు. పెంచు, పెంచిక అనే రూపాంతరాలకూ్కడా అలాంటి అర్థాలే ఉన్నాయి. 'పెరకంచు'కు 'పెరక' అనే రూపాంతరముంది. బహుశా 'పెరక+పెంచు'ల మేళనం వల్ల ఈ రూపం ఏర్పడ్డదేమో. బోకి శబ్దానికి 'కుండ, పాత్ర' అనే అర్థాలూ, బోకె శబ్దానికి 'ఎముక' అన్న అర్థమూ ఉన్నాయి. తలపాల సమాసమనిపిస్తుంది గాని అందులోని 'పాల'కు 'కట్టె' అన్న అర్థముందా అన్న సందేహం కలుగుతుంది. కప్పెర సంస్కృతంలోని కర్పరాశబ్దభవం.

సంస్కృతంలో పుర్రెకు పర్యాయపదా లనదగ్గవి రెండే కనిపిస్తాయి – కపాలం, కర్పరం అనేవి. అందులో మొదటిదే సరైన సమానార్థకం. కర్పర శబ్దానికి తలపుర్రె అనే అర్థంతోబాటు 'వెడల్పు మూతిగల పాత్ర, పాత్రలోహ భాగం' మొదలైన అర్థాలున్నాయి. 'బ్రహ్మాండభాండకర్పరము' పగిలిపోయేటట్లు భీమాదులు కేకలు పెట్టారట. 'గుడ్డు మీది గట్టి పొర'ను కూడా ఆపేరుతో పిలుస్తారన్నమాట. అంటే తెలుగులోని 'పెంకు, బోకి' వంటి వర్ణనాత్మక పదమన్నమాట ఇది. కపాల మొక్కటే సంస్కృతంలో సామాన్య ప్రయోగం గల శబ్దం – ఈ అర్థంలో.

తలతోబాటు అన్ని అవయవాలూ ఉన్న శరీరాన్ని సంస్కృతంలో 'గాత్రం, దేహం, తనువు, కాయం, విగ్రహం, మూర్తి, వపుస్సు, వర్ష్మ, కళేబరం' అని కూడా

వ్యవహరిస్తారు. ఈ కాలానికి గాత్రం అంటే కంఠస్వరం అని, విగ్రహ మూర్తులకు ఆకారమని, కళేబరం అంటే శవమనీ అర్థవిశేషాలు పుట్టాయి. దేహ శబ్దాన్ని సాధువులూ సన్యాసులూ 'దేహం' అని వ్యవహరించటం కద్దు. జయదేవుడు అష్టపదుల్లో ఒకచోట 'చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ' అని శ్రీకృష్ణుణ్నే వర్ణిస్తాడు. అక్కడ కళేబర శబ్దానికి శరీరమనే అర్థంగాని శవం కాదుగదా. నిత్యవ్యవహారంలో కూడా 'చచ్చిన శవం, మృతకళేబరం' వంటి వాడుకలున్నాయి. చస్తేనే కదా శవమయ్యేది? చచ్చిన శవమేమిటంటే 'చచ్చిన చావు' లాంటిదన్నారో పండితులవారు! వపుశ్శబ్దానికి 'చర్మం, సుందరాకారం' వంటి విశేషార్థాలున్నాయి. వర్ష్మ శబ్దానిక్కూడా ఇలాంటి అర్థాలే ఉన్నాయిగాని మారుమూల ప్రయోగాలు తప్ప సరయిన వాడుకలేదు.

శరీరానికి సమానమనే తెలుగుమాట 'మేను, మెయి, ఒడలు' అనేవి. మెయి శబ్దానికి 'మై' అనే రూపాంతరముంది సమాసాల్లో (మైపూత – వంటివాటిలో). విడిగా ఈ కాలంలో వాడుక ఉన్నట్లులేదు. మేను శబ్దానికి చివరికున్న 'ను' ఒకనాటి ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయం; 'ము' అనేదానికి రూపాంతరం. ఇప్పుడిది వాడుకలోలేదు. ఒడలు శబ్దం రూపాంతరాలు పొంది 'ఒళ్ళు, వళ్ళు'గా మారిపోయి ఇప్పటికీ నిలిచింది. మేయి, మే(ను)లు కూడా పరస్పరం రూపాంతరాలే.

శరీరంలో అవయవాలు భాగాలేగాని ఆమాట సంస్కృతపదం. దానికి సమానమైన తెలుగుమాట ఉన్నట్లు లేదు. తల తరువాత శరీరంలో ప్రధానమైన భాగం గుండె. అది 'రొమ్ము'లోపల ఎముకల గూడులో ఉన్న అవయవం. 'గుండె' కు 'గుండెకాయ, ఎద, అక్కు, రొమ్ము, ఎడద, బోర' అనే తెలుగు మాటలు పర్యాయపదాలంటారు. అక్కు, రొమ్ము, బోర అనేవి గుండె పైభాగాలు – ఎముకల గూళ్ళు. లోపల ఉన్నది 'ఎద, ఎడద, గుండె(కాయ)'. ఎద ఎడదలు రూపాంతరాలు. బోర అనేది రెండు భుజాల మధ్యగల భాగం. దాన్ని సంస్కృతంలో క్రోడమనీ, భుజాంతరమనీ వ్యవహరిస్తారు. అక్కు శబ్దం ప్రాచీన కావ్యాల్లో సినిమా పాటల్లో నిలచినట్లుంది. రొమ్ము అనే స్త్రీపురుష సాధారణమయిన శబ్దం. ఇది 'ఉరం' అనే సంస్కృత శబ్దంనుంచి వచ్చిందని కొందరంటారు. పూర్వం ఈ శబ్దాన్ని బండిరాతో రాసేవాళ్ళు. అంతకుముందు పలికేవారనికూడా చెప్తారు. రొమ్ము పలకమీద రెండు వైపులా ఉన్న కొవ్వును సూచించటానికి బండిరాయే ఉండాలని, 'అవిక' అనే మాటలో కూడా అందుకే బండిరా ఉందనీ పాతకాలపు పండితులు వివరిస్తుండేవాళ్ళు. గుండెమీది ఎముకల కూర్పుకు 'వత్సం, వక్షం' అనే సంస్కృత పదాలున్నాయి. వాటిలో రెండోదానికే నేటికీ వాడుక ఉంది. లోపలి భాగాన్ని 'హృదయం, హృత్తు' అంటారు.

తల పుర్రెలోపలి 'గుజ్జు'ను 'మెదడు' అంటాం తెలుగులో. దానికి సమానమైన సంస్కృతపదాలు 'మస్తిష్కం, గోర్దం, మేదస్సు' అనేవని నిఘంటువులు చెప్తాయి. వీటికి తెలుగు పర్యాయాలుగా మళ్లీ 'ఎద, ఎడ, ఎడద' అనే మాటలతోబాటు 'డెందం, మది, ఉలం' అనే వాటినికూడా పేర్కొంటాయి నిఘంటువులు. నిజానికి సంస్కృతంలోని 'మనస్సు' అనేమాటకు సమానమైనవి డెందం, మది, ఉల్లమనేవి. ఇవి ఆలోచనలకు, భావాలకు, ఊహాలకు, అనుభవాలకు సంబంధించిన అమూర్త

(రూపంలేని, కంటికి కనిపించని) విషయాలు. ఊహలు పుర్రెలో పుడ్తాయిగాని గుండెలో కాదు. గుండె చేసేపని రక్తప్రసారం మాత్రమే. ఆ రక్తం మెదడులోకి చేరినప్పుడు ఇతర ఇంద్రియాలను ఆ మెదడనే పదార్థం రక్తప్రసారం ద్వారా ఆదేశిస్తుంది. చేయవలసిన పనులు చేయవలసిందని మెదడునూ, గుండెనూ ఒకటిగా భావించి, భ్రమించి బోలెడు సాహిత్యం పుట్టింది, పుడ్తున్నది. దయ, కరుణ వంటివి గుండెలో పుట్తాయని నమ్మేవాళ్లు కోకొల్లలు. అందువల్ల జాలి కలిగితే 'హృదయం ద్రవిస్తుం'దని మహారచయితలు రాస్తుంటారు. మేదస్సు అనేది పుర్రెలో ఉండే పదార్థం. దానికి సరైన అంగ్లానువాదం "marrow" అనేది. దాని చైతన్యంవల్ల పుట్టేది మేధ – అంటే తెలివి. మేదశ్శక్తి అని తప్పుగా మేధాశక్తిని చెప్పేవాళ్లున్నారు. మేదస్సు, మేధ ఒకటి కానేకాదు. గుండెకాయనూ, తలకాయనూ కలగలిపి ఒకటిగా భావించటం సాహితీపరులనుంచి రాజకీయవాదులదాకా వ్యాపించింది. మనోహృదయాల్లో (mind and heart) దేని నుంచి భావాలు పుడ్తాయనే విషయంమీద ఎన్నో పుస్తకాలు వచ్చాయి, ఇంగ్లీషులోనే!

రొమ్ము శబ్దాన్ని బహువచనంలో ప్రయోగించినప్పుడు అది స్త్రీలకు మాత్రమే సంబంధిస్తుంది. తెలుగులో 'చన్ను, గుబ్బ, బొమ, పాలిల్లు' అనే మాటలూ, సంస్కృతంలో 'స్తనం, కుచం' అనేవీ పర్యాయపదాలు. ఉబ్బరించి ఉన్నవి కాబట్టి గుబ్బలన్నారు. పాలు పుట్టే చోటు కాబట్టి పాలిల్లు (బహువచనంలో పాలిండ్లు). బొమ శబ్దం చిత్రమయింది. ఇప్పటికీ గోండీ, కోయ భాషల్లో ఈమాట ఈ అర్థంలోనే ఉంది కాబట్టి అది తెలుగువాళ్లు ఎరువుగా తెచ్చుకొన్నదేమో! అయితే అది తెలుగు వాడుకలో నిలిచినట్లు లేదు. స్తనం పాలిచ్చేదనే అర్థంలో వచ్చింది. కుచశబ్దానికి అర్థమున్నట్లు లేదు. స్తన శబ్దంనుంచి చన్ను శబ్దాన్ని పూర్వులు 'సాధించే'వాళ్లు.

తలగాని గుండెగాని పని చేయటానికి అవసరమైనవి రక్తమాంసాలు. రక్త శబ్దానికి పర్యాయపదాలని చెప్పే సంస్కృత పదాలు 'రుధిరం, అసృక్కు, లోహితం, అస్రం, క్షతజం, శోణితం' అనేవి. నెత్తురన్నదొక్కటే ఇప్పుడు వాడే తెలుగుమాట. దానికి గణ యతిప్రాసలకోసం పుట్టిన రూపాంతరం 'నెత్రు'. రక్త, శోణిత, రుధిర, లోహిత శబ్దాలకు 'ఎర్రనివి' అనేది మూలార్థం. క్షతం అంటే గాయం, దెబ్బ. దానినుంచి పుట్టింది క్షతజం. ఇదో పెట్టుపేరు. శరీరంనుంచి స్రవించేది కాబట్టి అస్రం, అసృక్కు అనే పేర్లు వచ్చాయి. నెత్తురుకు ప్రాచీనకావ్య భాషలో 'నల్ల' అని మరో పర్యాయపదముంది. ఆమాట నేటివాడుక నుంచి పూర్తిగా తొలగిపోయింది.

మాంస శబ్దం సంస్కృత పదం. దానికి 'పిశితం, తరసం, పలలం, క్రవ్యం, ఆమిషం' అనేవి పర్యాయపదాలు. క్రవ్యం, పిశితం సాధారణ పదాలయితే తక్కినవి వర్ణనాత్మకాలు. తర శ్శబ్దానికి 'వేగం, వడి' అనే అర్థాలున్నాయి. ప్రవహించేది కాబట్టి తరసమన్నారు. పలల శబ్దానికి 'బురద' అనే అర్థం కూడా ఉంది. చిక్కని, గట్టి రక్తమే కాబట్టి మాంసాన్ని పలలమని పిలిచారు. ఆమిష శబ్దానికి నానార్థాలున్నాయి – లాభం, లంచం, భోగం వగైరాలు. 'తినేది, అనుభవించేది' అనే అర్థంలో ఈ మాట పుట్టి ఉండవచ్చు. వీటికి దీటయిన తెలుగుమాటలు 'ఎరచి, పొల, నంజుడు, పొలసు' అనేవి. ఈమాటలేవీ ఇప్పటి వాడుకలో తొలినాటి అర్థంలో, మాంసమన్న

అర్థంలో ఉన్నట్లు లేదు. పాల అంటే (దేహమంతటా) వ్యాపించి ఉన్నదని భావం. పాలయు అనే క్రియా రూపానికి కూడా 'వ్యాపించు' అనే అర్థముంది. అన్నంలో నంజుకొనేది కాబట్టి నంజుడు. పాల, పాలుసు శబ్దాలు రూపాంతరాలు. ఎరచి ప్రాచీనకావ్య భాషలో కనిపించేమాట.

అన్ని అవయవాల్లోనూ రక్తమాంసాలుంటాయి. కానీ అవయవానికి సరైన తెలుగుమాట తెలీటం లేదు. దానికి సంస్కృతంలో 'అంగం, అపఘనం, ప్రతీకం' అనే పర్యాయపదాలున్నాయి. అంగ శబ్దానికి దేహమనే అర్థం కూడా ఉంది. మర్మావయవమనే అర్థం కూడా వచ్చింది ఈనాటికి. అతిముఖ్యంకాదు కాబట్టి అవఘనం, మనుష్య రూపానికి (చిహ్నం) కాబట్టి ప్రతీకమన్నారు.

రొమ్ముకు రెండువైపులా కనిపించే మరో ప్రధానావయవం చేయి. 'చెయి, చేయి; కయి, కై, కేలు' అనే తెలుగు మాటలు నిజానికి రూపాంతరాలేగాని వాటిని పర్యాయపదాలనేవాళ్లు లేకపోలేదు. తాలవ్యీకరణమనే ధ్వనిపరిణామంవల్ల కయి/కై శబ్దం చెయి/చేయిగా మారిందని చెప్పారు. కేలు అనేది నిత్యైకవచన రూపమంటారు. అంటే దానికి బహువచనరూపం వాడుకలేదని భావం కానీ ఒకప్పుడది కెయి అనే ఏకవచన రూపానికి బహువచనరూపమే. కొన్ని శతాబ్దాలకిందటే అది 'పాలు' శబ్దంలాగా నిత్యైకవచనరూప మయిందన్నమాట. కైమోడ్పు వంటి సమాసాల్లో కై మిగిలింది. కేలు అనే రూపం వాడుకనుంచి తొలగిపోయింది.

చేయి శబ్దానికి సమానమైన సంస్కృతపదాలు 'భుజ(ం), బాహువు, దోష, ప్రవేష్టం' అనేవి. ఈ మాటలు మూపు నుంచి మణికట్టు దాకా ఉన్న శరీరభాగాన్ని చెప్పేవి. దోష శబ్దానికి ఇతరార్థాలున్నాయి తప్పు-వగైరా. మొండెంలో ఒకపక్కన ప్రవేశించి అంటే అతుక్కొని ఉంటుంది. కాబట్టి ప్రవేష్ట మన్నారు. దండచేతినే భుజమంటారు. దోషప్రవేష్ట శబ్దాలకు సంస్కృతంలోనే ప్రయోగాలు తక్కువ. దోషశబ్ద రూపాంతరమైన దోశ్శబ్దం సమాసాల్లో (దోర్బలం వంటి వాటిలో) ఇంకా నిలిచివుంది. మణికట్టు నుంచి వేళ్లతోసహా కలిసి వున్న భాగాన్ని వేరుపేర్లతో పిలుస్తారు. 'పాణి, శమం, శయం, పంచశాఖ'మనే మాటలున్నాయి. శమశయ శబ్దాలు రూపాంతరాలు కావచ్చు. అయిదు వేళ్లుగా చీలి ఉంటుంది కాబట్టి పంచశాఖ మన్నారు. ఇది వర్ణనాత్మక పదం. పాణి అన్నదే మామూలు మాట. దానికి ముత్తెపునీరనే మరో అర్థవిశేషం లేకపోలేదు. పాణిగ్రహణం, పాణిపీడనం (=వివాహం) లాంటి మాటల్లో నేటికీ ఈ మాట వాడుకలో ఉంది.

చేయి మొండెంతో కలిసిన చోటుకు రెండు పేర్లున్నాయి. పైభాగం మూపు, కిందిభాగం చంక. ఈ రెండూ తెలుగుమాటలే. చంకకు పర్యాయమైన సంస్కృత పదాలు 'కక్ష, బాహుమూలం' అనేవి. రెండోది వర్ణనాత్మకం – చేతి మొదటి భాగమనే అర్థమిస్తుంది కాబట్టి. మూపు శబ్దానికి స్కంధం, భుజశిరస్సు, అంసం అనే సంస్కృత పదాలు పర్యాయాలు. భుజం పైభాగం కాబట్టి భుజశిరస్సు అన్నారు. స్కంధ శబ్దానికి చెట్టుబోదె, శరీరంలాంటి ఇతరార్థాలున్నాయి. వరూధిని అంసద్వయం బంటే ప్రవరుడు నెట్టివేశాడని మనుచరిత్రలో అల్లసాని పెద్దన చూసినట్లు చెప్పాడు. అంటే రెండు మూపులనూ – అని అర్థం. చేయి మడతపడే భాగాన్ని మోచేయి

అంటాం. దానికి సమానమైన సంస్కృత పదాలు కర్పరం, కూర్పరం, కఫోణి అనేవి. తలపుర్రెను కూడా కర్పరమంటారు. బహుశా మోచేతి 'చిప్ప' కది పేరయి వుంటుంది. కూర్పరానికి మోకాలనే అర్థం కూడా ఉంది. ఆమాట కీలుకుగాక మోచేతి మోకాలి 'చిప్ప' లకే పేరయి వుండాలి.

చేతికి వేళ్లుంటాయి కదా. ఇప్పటి భాషలో ఉచ్చారణలో చేతి 'వేళ్ల'కూ చెట్టు 'వేళ్ల'కూ భేదం లేదు కాని చేతికుండే వాటిని పూర్వం 'వ్రేలు' అని ఏకవచనంలోనూ 'వ్రేళ్లు' అని బహువచనంలోనూ పిలిచేవాళ్లు. కాలికుండేవి కూడా వ్రేళ్లే పూర్వం. వేలు అనే తెలుగుమాటకు తుల్యమైన సంస్కృత పదాలు అంగుళం, అంగుళి, కరశాఖ అనేవి. మొదటి రెండూ అన్యోన్యం రూపాంతరాలు. మూడోది 'చేతిభాగం' అనే అర్థంలో పుట్టిన వర్ణనాత్మక పదం. కొలతల్లో వాడే అంగుళం (అడుగులో పన్నెండోభాగం) వేలిపొడుగుమీద ఆధారపడే పుట్టిన మాట. తెలుగులో బొటనవేలనే దాన్ని సంస్కృతంలో అంగుష్ఠమంటారు. చూపుడు వేలు అనేదానికి జుట్టనవేలు అనే తెలుగు పర్యాయపదముంది. దానికి సమమైన సంస్కృత పదాలు తర్జని, ప్రదేశని అనేవి. రెండో మాటకు ప్రదేశిని అనే రూపాంతరముంది. మొదటి మాటే వాడుకలో ఉన్న పదం. బెదిరించే సమయంలో కదిలించే వేలనే అర్థంలో తర్జని అనే మాట పుట్టింది. నడిమివేలును మధ్యమ అంటారు. కొందరు శ్రోత్రియులు దాన్నే దర్భవే లంటారు. దర్భల ఉంగరం తగిలించే వేలుకాబట్టి దర్భవే లనిపిలిచారు. మనం తెలుగులో ఉంగరం వేలనే దాన్ని సంస్కృతంలో అనామిక అంటారు. అంటే ప్రత్యేకమయిన పేరు లేనిదని అర్థం. చిటికెనవేలును 'కనిష్ఠ, కనిష్ఠిక, కన్యస, కనీని, కనీనిక' అని పిలుస్తారు సంస్కృతంలో. మొదటి రెండు మాటలూ చివరి రెండు పదాలూ అన్యోన్యం రూపాంతరాలు. వీటన్నిటికీ 'చిన్నది' అనేదే మూలార్థం. అయితే ఈ పేర్లన్నీ చేతివేళ్లకేగాని కాలివేళ్లకు – మొదటి చివరి వాటికి తప్ప – పేర్లుకావు.

చేతికీ వేళ్లకూ మరో గణితసంబంధముంది. కొలతల్లో వీటిని బట్టి పేర్లూ పరిమాణాలూ మారుతుంటాయి. చూపుడు వేలునూ బొటనవేలునూ చాచి పట్టినప్పుడు ఆ రెంటి మధ్యా ఉన్నదూరాన్ని లొడితి, జుత్తిలి అని పిలుస్తారు తెలుగులో. వాటి మీద వచ్చిన విశేషణ రూపాలు లొడితెడు, జుత్తెడు అనేవి. లొడితి శబ్దానికి లొడితిని అనే రూపాంతరముంది. దీనికి సమానమైన సంస్కృతపదాలు ప్రాదేశం, తాలం, గోకర్ణం అనేవి. వీటిలో మొదటి శబ్దాన్ని యజ్ఞాల్లో, మూడో మాటను భూమికొలతల్లో ఎక్కువగా వాడ్తారు. బొటనవేలుకూ చిటికెనవేలికీ మధ్యగల చాచిపట్టిన దూరం జేన (నేటి ఉచ్చారణలో 'జాన'). దీనికి సమానమైన సంస్కృతపదం వితస్తి. మరో మాట వర్ణనాత్మకమైనది 'ద్వాదశాంగులం' అనేది – అంటే పన్నెండువేళ్ల కొలత అని అర్థం.

చేతి వేళ్లను ముడిచి మోచేతి నుంచి ముడిచిన వేళ్లదాకా ఉన్న దూరాన్ని చెప్పే కొలత 'పిడిమూర' అంటారు. దీనికి పర్యాయపదం 'రత్ని' అనే సంస్కృతపదం. మోచేతి నుంచి చాచిన చిటికెనవేలిదాకా ఉన్న కొలత 'పిడికిటి మూర'. దానికి సమానమైనది 'అరత్ని' అనే సంస్కృత పదం. రెండు జేనల పొడుగున్నది మూర.

దానికి తుల్యమైన సంస్కృతపదం 'హస్తం'. వేళ్లు చాచిపట్టిన అరచేయి చేర. అందులో సగం – అంటే వేళ్లు వంచిన అరచేయి – పుడిసిలి. ఈ రెంటికీ 'ప్రసృతి' అనే సంస్కృత పదమే పర్యాయపదమంటారు. రెండు చేరలనూ ఒకేచోట చేరిస్తే అది 'దోసిలి' అవుతుంది తెలుగులో – దాన్ని 'అంజలి' అంటారు సంస్కృతంలో. ఈ రెండు మాటలూ 'నమస్కరించు, గౌరవించు' అనే అర్థంలో క్రియారూపాల్లో వాడుకలో ఉన్నాయి. అరచేతిని సంస్కృతంలో 'చపేటం, పుహస్తం, ప్రతలం' అంటారు. చపేటానికి చెంపదెబ్బ అనే అర్థం ఇటీవల వచ్చింది.

వేలున్నప్పుడు 'గోరు' తప్పదు. అదొక్కటే మాట తెలుగులో వాడుకలో ఉన్నది. దానిక్కూడా 'చిన్న' అనే విశేషణార్థముంది. గోరుచిక్కుడు వంటి మాటల్లో గోరంటే 'చిన్న'. గోరువెచ్చన వంటి సమాసాల్లో దానికి 'కొంచెం' అని అర్థం. దీనికి పర్యాయపదాలని చెప్పతగ్గ సంస్కృత పదాలు 'నఖ(ర)ం, పునర్భవం, పునర్నవం, కరరుహం' అనేవి. నఖ, నఖరాలు రూపాంతరాలు. నఖమనేదే మామూలు మాట. పునర్భవం అంటే మళ్లీ పుట్టేది/మొలిచేది. పునర్నవం అంటే మళ్లీ కొత్తగా వచ్చేది. కరరుహం అంటే చేతిలో పుట్టినది. ఈ మూడూ వర్ణనాత్మకాలే. గోరు, నఖం అంటే అటు చేతివేళ్లకూ ఇటు కాలివేళ్లకూ ఉండేవి.

మొత్తం శరీరాన్ని మోసే, కదిలించే అవయవాలు కాళ్లు. కాలు శబ్దానికి నాలుగోవంతనే అర్థం కూడా ఉంది. కాలుకు పర్యాయపదాలని చెప్పదగ్గ తెలుగుమాటలు 'అడుగు, అంజ, హజ్జ, అజ్జ' అనేవి. కాలికింది భాగమూ అడుగే; నడిచేటప్పుడు కాళ్లు కదిలిస్తే అడుగు వేయటమే. అంటే 'నడక'ను కూడా అడుగు శబ్దంతో ప్రస్తావిస్తున్నామన్నమాట. అంజకు 'అంగ' అనే రూపాంతరమేకాక అర్థవిశేషం కూడా ఉంది. హజ్జ, అజ్జ అనే రూపాంతరాలకూ అంజకూ ధ్వనిశాస్త్ర సంబంధం లేకపోలేదు. ఈ మాటలన్నిటికీ 'నాలుగోవంతు' అనే అర్థం కూడా ఉండటం విశేషం. అనువాకం అనే వేద భాగాన్ని అజ్జ/హజ్జ అనే పేరుతో పిలుస్తుంటారు – భాగమనే అర్థంలో.

కాలు శబ్దానికి పర్యాయపదమని చెప్పదగ్గ సంస్కృత పదాలు 'పాదం, పత్తు, అంఘ్రి, చరణ'మనేవి. వాటిలో మొదటి, చివరి మాటలకు తెలుగులో లాగా నాలుగో వంతనే అర్థవిశేషం లేకపోలేదు. పత్తు పాద శబ్దానికి రూపాంతరమే. పాదాది శబ్దాలన్నిటికీ కాలు, కాలి అడుగుభాగం అనే అర్థాలు రెండూ ఉండటం విలక్షణం. కాలు మడతపడే కీలున్న చోటును తెలుగులో మోకాలంటాం. సంస్కృతంలో దాన్నే జానువు, ఊరుపర్వం, అష్ఠీవ త్తంటారు. మొదటిది మామూలు మాట. 'తొడలోని కణుపు/ముడుచుకొనే భాగం' అన్న అర్థంలో ఊరుపర్వమనే వర్ణనాత్మక పదం పుట్టింది. మోండేనికి కాలు కలిసే భాగాన్ని గజ్జ(లు) అంటాం తెలుగులో. సంస్కృతంలో దాన్ని వంక్షణం అంటారు. గజ్జల నించి మోకాలిదాకా ఉన్న కాలిభాగం తొడ. దాన్ని సంస్కృతంలో ఊరు వంటారు. సక్థి అనే మరో మాట ఉందిగాని దానికి ఆయుర్వేదంలోనే ప్రయోగం.

గుండెకూ కాళ్లకూ మధ్య రెండు ప్రధానావయవాలున్నాయి. మొదటిది నడుము. ఇది వర్ణనాత్మకం. నడిమి భాగాన ఉన్నది కాబట్టి నడుమన్నారు. దీనికి సరైన తెలుగుమాట కౌను. కావ్యాల్లో తప్ప ఈ మాటకు ప్రయోగమున్నట్లు లేదు. కౌనుకు పర్యాయపదాలయిన సంస్కృత పదాలు 'మధ్య(మ)ం, అవలగ్నం' అనేవి. మధ్య–శరీరం మధ్య–ఉండే అవయవం కాబట్టి మధ్య(మ)ం. అవలగ్న శబ్దానికి అతుక్కొని/తగులుకొని ఉన్న భాగమని అర్థం. నడుము మధ్యలో ఉండే గుంటను బొడ్డు అంటాం. దాన్నే పూర్వం (ముఖ్యంగా కావ్యాల్లో) పొక్కిలి అని కూడా పిలిచేవాళ్ళు. ఈ తెలుగు మాటలకు సమానమైన సంస్కృతపదం నాభి.

నడుమున్నా లేకపోయినా జీవనాధారంగా ఉండకతప్పనిదీ, ఎంత నింపినా నిండనిదీ, ఎన్ని పాపాలయినా తనకోసం చేయవలసిందీ పొట్ట. దీనికి 'కడుపు, డొక్క, బొజ్జ, బొర్ర' అనే తెలుగు మాటలూ, 'ఉదరం, కుక్షి, జఠరం, తుందం, పిచండం/పిచిండం' అనే సంస్కృతపదాలూ పర్యాయపదాలంటారు. పొట్ట చిన్నదయితే బొజ్జ; మరీ చిన్నదయితే చిరుబొజ్జ; కొంచెం పెద్దదయితే బొర్ర; ఎండుకపోయి ఉంటే డొక్క; వెన్నుకు అతుక్కపోయివుంటే 'అంటుపొట్ట'. పెరిగితే కడుపు. తెగబెరిగితే బానకడుపు. జఠరం అంటే కడుపు; తుందమంటే బొర్ర; పిచండం అంటే బానకడుపు. ఉదరమన్నా, కుక్షి అన్నా పొట్ట. తుందిలుడు/తుందిభుడు అనే పదాలను పెద్దపొట్టగలవాళ్లను చెప్పడానికి వాడ్తారు. పిచండిలుడంటే బానకడుపున్నవాడు.

గుండెకు వెనకనున్న భాగం వీపు. దాన్నే వెన్ను అంటారు కూడా. దీనికి సమానమైన సంస్కృత పదం పృష్ఠం. అయితే ఈ కాలానికి 'ముడ్డి' అనే అర్థాన్ని పృష్ఠ శబ్దానికి ఆపాదించారు కొందరు. వీపు కిందిభాగం – కండగలది – కొవ్వెక్కినదీ పిరుదు. దీనికి పిర్ర అనేది రూపాంతరం. ఈ రెండు మాటలూ అచ్చతెలుగు పదాలు. వీటికి సమానమైన సంస్కృత పదాలు 'కటి, శ్రోణి, కకుద్మతి' అనేవి. పిరుదు శబ్దానికి 'వెనకఉన్నది' అని వ్యుత్పత్తి. కటం అంటే 'మొల'. మొల దగ్గరిది కాబట్టి కటి అన్నారు. కకుత్తు అంటే మూపురం అనే అర్థం కూడా ఉంది. కుకుద్మతి అంటే (ఎద్దుమూపురంలాగా) కొవ్వుగల/కండపట్టిన, ఎత్తయిన భాగమని అర్థం చెప్పవచ్చు. శ్రోణి శబ్దానికి 'మొల' అనే అర్థమూ ఉంది. పిర్రలనే అర్థమూ ఉంది. స్త్రీల పిరుదులను మాత్రమే నితంబమని పిలవాలని నిఘంటువులు చెప్తాయి! 'మొల'ను సూచించటానికి 'కటం, శ్రోణిఫలక'మనే మాటలున్నాయి సంస్కృతంలో.

పిరుదులకు ముందున్న భాగాన్ని 'జఘనం, పురస్సు' అనే శబ్దాలతో సూచిస్తారు సంస్కృతంలో. పురస్సంటే ముందున్నదని అర్థం. జఘన శబ్దానికి స్పష్టంగా అర్థాలివ్వరు నిఘంటువుల్లో. మొల అని కొందరు, 'మడికట్టు' అని కొందరు వివరిస్తారు. జఘన్యం అంటే పురుషాంగం. జఘనం అంటే స్త్రీ మర్మాంగం అని కొందరు. కాదు పిరుదులని కొందరు. ఇలా శరీరం లోపలా బయటా అనేకావయవాలూ భాగాలూ ఉంటాయి. వాటన్నిటినీ ప్రస్తావించటం ఆయుర్వేదం ఎత్తిరాయటమే.

శరీరంలోని రక్తమాంసాదులన్నిటినీ కప్పి ఉంచేది చర్మం. అది సంస్కృతపదం. త్వక్కు/త్వచం, అసృగ్వర/అసృగ్ధర అనే పర్యాయపదాలున్నాయి దానికి. త్వక్/త్వచం అనే మాటలకు పొర, బెరడు మొదలైన అర్థవిశేషాలున్నాయి. ఆ వివరణతోనే

అస్పృగ్దర వంటి వర్ణనాత్మక పదాలేర్పడ్డాయి. వాటికి దీటయిన తెలుగుమాటలు 'తోలు, తొక్క, తిత్తి, చట్ట, కడవసం/కళాసం' అనేవి. మొదటి రెండూ బూతుల్లో చేరితే, చివరి మూడూ పుస్తకాల్లో తలదాచుకున్నాయి. తిత్తికి అర్థం మారిపోయి చర్మమనే సంస్కృతపదమే తెలుగువారి వాడుకలో నిలిచింది.

# వస్త్రవిశేషాలు

శరీరాన్ని కప్పి నాగరకతకు చిహ్నంగా నిలిచే గుడ్డ విషయం చూద్దాం. గుడ్డ అనే అచ్చతెలుగు మాటను ఎందుచేతనో పర్యాయనిఘంటువులు పేర్కొనలేదు. అలాగే ఈ కాలంలో ఎక్కువ వాడుకలో (బహువచనంలోనే) వినిపించే 'దుస్తు' అనే మాటను కూడా అవి లెక్కించలేదు. నిఘంటువులు ఏయే మాటలు ఏయే నిర్దిష్టార్థాల్లో పర్యాయపదాలో సూచించటంలో కూడా ఏకాభిప్రాయం ప్రదర్శించటంలేదు. అందువల్ల మన నిఘంటువుల ప్రామాణ్యం సంగతి ఎలా ఉన్నా ఇక్కడ చెప్పే అర్థవిశేషాదులుగూడా అభిప్రాయభేదాలకు దారితీయవచ్చు. వివరాల్లోకి పోయి కవి ప్రయోగాలూ సోదరభాషా శబ్దాలూ రాయటం చర్చించటం ఇక్కడ సాధ్యం కాదు. అందువల్ల స్థూలంగా మాత్రమే వస్త్ర పర్యాయపదాలను ప్రస్తావించవలసి వస్తున్నది.

'గుడ్డ, బట్ట, దుస్తు, వలువ, కోక, పుట్టం, గింటెం, చీర/చీరె, చేరె, కట్టు, కప్పడం, సేల, వలిపం, వలువు, జీబు, కడితం, సుగ్గడితం' అనే తెలుగుమాటలూ, 'వస్త్రం, ఆచ్ఛాదనం, వాసస్సు, వసనం, అంశుకం, చేలం, పటం, వరాసి/వరాశి, దుకూలం' అనే సంస్కృత పదాలూ కొంచెమించుమించుగా ఒకదానికొకటి పర్యాయ పదమని చెప్పదగ్గవి. ఈ కాలానికి గుడ్డ, బట్ట అనే మాటలు వస్త్రసాధారణానికి – అంటే ఒంటిమీద ధరించే ఏ రకం వస్త్రానికయినా పేర్లని చెప్పవచ్చు. కుట్టించిన గుడ్డలను మాత్రమే దుస్తులంటాం. గుడ్డ శబ్దానికి చిన్నదనీ, తక్కువదనీ సూచ్యార్థముంది. కట్టుగుడ్డలు వగైరా సమాసాల్లో/పదబంధాల్లో గుడ్డ అంటే సాధారణ వస్త్రం/ సాదాబట్ట అనే అర్థసూచన వినిపిస్తుంది. బట్టలు – అని బహువచనంలో వాడినప్పుడు ఎవరికయినా బహూకరించటానికిచ్చే గుడ్డలు అనే అర్థవిశేషం, అందువల్ల ఏ కొంచెమో గౌరవవాచకత్వం ఉన్నదనిపిస్తుంది. రవికగుడ్డ(లు), అంటాంగాని 'రవికబట్టలు' అనం. అయితే కట్టుబట్టల్తో/కట్టుగుడ్డల్తో పాండవులు వనవాసాలకి వెళ్ళేరంటే అర్థంలో పెద్దభేదమున్నట్లనిపించదు. అసలు 'కట్టు' అన్నంతవరకే గుడ్డకు/బట్టకు పర్యాయపదం. కట్టుకొనేది కట్టు(గుడ్డ). కట్టుకొనే తీరు/పద్ధతిని కూడా కట్టు అంటాం. (ఆయన సైకిలుకట్టుగా పంచెకట్టాడు). గుడ్డ శబ్దానికి చుట్టుకొనేది. చుట్టేది అనే అర్థముంది. ఒక తీరూ పద్ధతీ లేకుండా ఒంటికి చుట్టుకొనేది తొడిగేది దుస్తు (దుస్తు అంటే అందమైనదనే అర్థం కూడా ఉంది). అయినా దుస్తులు కుట్టించుకుందామని చెప్తుంటాం – మొదటి అర్థం మరిచిపోయి.

చీర/చీరె అనేమాట స్త్రీలు ధరించే గుడ్డ – అంటే కోక – అనే అర్థంలోనే నేటి వాడుకలో ఉంది. ఒక పెద్ద బట్టనుంచి చీరి (అంటే చించి) తీసుకొని ధరించేగుడ్డ ఏదయినా చీరే. భారతంలో ఉత్తరుడు కౌరవవీరుల 'తలచీర'లు తెచ్చి బొమ్మపొత్తికలుగా వాడుకోడాని కిస్తానన్నాడు. అంటే 'తలపాగా'ల నన్నమాట. అరణ్యానికి పోయే స్త్రీ పురుషులు పూర్వం 'నారచీరలు' కట్టి బయల్దేరేవారు. ఒకప్పుడు చీరకు స్త్రీ వస్త్రమనే సంకుచితార్థం ఉండేదికాదు. కాలక్రమాన 'కోక' కూడా స్త్రీ వస్త్రమయింది కాని అది కూడా ఒకనాడు స్త్రీ పురుషసాధారణ వస్త్రంగానే ఉండేది. వలువ, వల్వ, వలుపు అనేవి పరస్పరం రూపాంతరాలు. పల్చనిగుడ్డ, మడతలు పెట్టిన బట్ట, శుభ్రమైన గుడ్డ, తెల్లనిగుడ్డ అనే రకరకాల అర్థాలు చెప్తారీ మాటలకు. ఇవే అర్థాలు వలిపం అనే మాటకూ చెప్తారు. 'వలి' అనే తెలుగుమాటకు 'చలి, చల్లదనం' అనే అర్థాలున్నాయి. వలిపం అనేది అప్పుడే ఉతికినబట్ట అన్నమాట. చల్లగా (అందువల్ల 'మడిగా') ఉండేది అనే అర్థంలోనే ఈ మాటలన్నీ పుట్టివుంటాయి. పుట్టమన్నా గుడ్డే. గుడ్డబంతిని 'పుట్టచెండు' అనేవాళ్లు పూర్వం. 'పుట్టగోచి' అనే మాటకూడా మొలకుచుట్టుకొనే ఆకులస్థానంలో వచ్చిన 'గుడ్డగోచి'కి పేరయివుంటుంది. నిఘంటువులు 'పెద్ద' అనే విశేషణార్థముందని ఈ సందర్భంలో చెప్తాయి. 'గట్టిగా నిలిచే'దనే అర్థంలోనే వచ్చి వుంటుందీమాట – 'పుట్టకోట' అనే మాటలోలాగా.

గింటెం అనేది మామూలు బట్టకాదు. 'జంటనేత' నేసినగుడ్డ–రెండు పొరలగుడ్డ అన్నమాట. కప్పడమనేది 'కర్పటం' అనే సంస్కృత శబ్దంనుంచి పుట్టిన తద్భవం. మూలంలోనే దానికి 'గుడ్డ, చినిగిన గుడ్డ, మాసినగుడ్డ' అనే అర్థాలున్నాయి. తెలుగులో చివరి అర్థం నిలిచినట్లులేదు. కడితం మామూలుగుడ్డ. సాధారణంగా సీలిరంగద్దిన గుడ్డ అది. పూర్వం ఆ గుడ్డమీద లెక్కలు రాసిచుట్టలు చుట్టి ఏ వేకు గొట్టంలోనో వెదురుగొట్టంలోనో దాచుకొనేవాళ్లు. లేదా దస్త్రాలుగా కట్టిపెట్టేవాళ్లు. కొంతకాలం గడిచిన తరువాత కడితం మీది అక్షరాలు చెరిగిపోయేవి. పాండురంగ మాహాత్మ్యంలో కడితం కప్పుదేలి అక్షరాలు కనపడకుండాపోయాయని బావురుమంటాడు. కొన్ని కడితాలను జిగురులో ముంచి మసిఅద్ది ఎండబెట్టి అట్టలాగా తయారుచేసేవాళ్లు. సుద్దముక్కతోనో సున్నంతోనో బలపంతోనో అక్షరాలు రాసేవాళ్లు. మడతలు పెట్టి కట్టగట్టినప్పుడు ఒక అక్షరం మీదమరొకటి పడి అంతా కలగాపులగమయ్యేది. కడితానికి కణితమనే రూపాంతరముంది. కడితం మామూలు కట్టుగుడ్డకాదని చెప్పవచ్చు. సుగ్గడితమనే మాట విశేషణమని 'చిక్కని నేతగల'దనే అర్థమిస్తుందనీ చెప్తారు. 'ముతకగుడ్డ' అనే వివరణ చాలావరకు సరిపోతుంది. కేవలం ఆడవాళ్లే కట్టేగుడ్డకు 'జీబు' అనే పేరుండేది. ఆ మాటకిప్పుడు వాడుకేలేదు.

చీర శబ్దానికి చీరె, చేరె అనే రూపాంతరాలున్నాయంటారు. అయితే మూడో రూపం నిఘంటువుల్లో తప్ప మరెక్కడా కనిపించదు. కొందరు నిఘంటుకారులు 'దువ్వలువ' అనే అచ్చతెలుగుమాట వస్త్రశబ్ద పర్యాయపదమన్నారు. వలువ అంటేనే వస్త్రమయితే దువ్వలువ అన్నా అదే అర్థమనటం వింతగా ఉంటుంది. 'దువ' వలువను దువ్వలువ అంటారు. దువ అంటే రెండు. రెండు పొరలగుడ్డను దువ్వలువ

అవాలి. దుప్పటి/దుప్పటం అనేది కూడా ఇలాంటి మాటలే – రెండు పొరలగుడ్డ అన్నమాట. కొన్ని నిఘంటువు లీమాటకు 'కట్టుకోక' అనే అర్థమిస్తాయి. చీరల్లో నారచీర, పట్టుచీర, నూలుచీర, వగైరాభేదాలున్నాయి. వాటన్నిటికీ సమానమైన సంస్కృతపదాలు ఉన్నాయి. ఒకప్పుడు 'చీర' అంటే మొత్తం శరీరాన్ని కప్పి ఉంచే గుడ్డ అనే అర్థం ఉండేది. కాలక్రమాన నడుముకు కట్టేదే చీరై, తలకు చుట్టేది 'తలచీర' అయి, పైగుడ్డగా వేసుకొనేది 'పైచీర'గా మారిపోయింది. ఆ తరవాత స్త్రీలు కట్టేది 'చీర' అన్నారు. మొగవాళ్లకు చీర స్థానంలో పంచె, దోవతి వగైరాలు వస్తాయి.

వస్త్రం, వసనం, వాసస్సు అనే మాటలు పరస్పర సంబంధంగల పదాలు. ఈ మాటిలోనూ (ఒంటిమీద) 'ఉండేది' అనే మూలార్థం కనిపిస్తుంది. ఆచ్ఛాదనం అంటే కప్పు. శరీరభాగాలను కప్పి ఉంచే వస్తువుకాబట్టి ఈ పేరు వచ్చింది. దేన్ని కప్పివుంచేదయినా ఆచ్ఛాదనమే. అంశుక మనే మాటకు గుడ్డ, సన్నగుడ్డ, ఉత్తరీయం అనే అర్థాలున్నాయి. అంశు శబ్దానికి కాంతి, ప్రకాశం వగైరా అర్థవిశేషాలున్నాయి. బహుశా మెరిసేది అనే అర్థంలోనో, దరిద్రుడు కాడని సూచించడానికో ఈ పేరు వచ్చి ఉంటుంది. అంశుమంతుడనే మాటకు ధనవంతుడనే అర్థముంది. ఒకప్పుడు ఒంటికి గుడ్డ ఉండటమే గొప్ప. లేనివాడు గోచీ పెడ్తే ఉన్నవాడు ఉత్తరీయంకూడా వేస్తాడు. వస్త్రధారణ నాగరకతకేగాక కలిమికి కూడా చిహ్నం కాబట్టి ఈ మాట పుట్టి ఉంటుంది. చేల(ం) అంటే గుడ్డ. చేల శబ్దానికి అధమం అనే అర్థంకూడా ఉంది. అయినా ఆమాట నుంచి పుట్టిన తెలుగుమాట 'సేల'కు నీచార్థం లేదు. విడిగా ఈ మాటకు – చేలకు – తెలుగు రచనల్లో ప్రయోగంలేదుగాని 'చేలాంచలం' వంటి సమాసాల్లో ఈమాట వినిపిస్తుం దీనాటికీ.

పటమనేది మామూలు గుడ్డకాదు. 'చిత్రపటం' అనేమాటకు బొమ్మకు బొమ్మ అనే అర్థం ఇటీవల వచ్చిందేగాని, చిత్రం – అంటే బొమ్మ–గీసేపటం – అనే గుడ్డను – చిత్రపటమనేవాళ్లు పూర్వం. దుకూలం అనే మాటకు కొందరు 'తెల్లగుడ్డ' అనీ, మరికొందరు 'సన్నగుడ్డ' అనీ అర్థాలు చెప్తారు. ఇంకా కొందరు ఈ రెండర్థాలూ ఉన్నాయంటారు. పరాశి, వరాసి శబ్దాలు రూపాంతరాలు. వీటికి ముతకగుడ్డ అనే అర్థవిశేషముంది. రకరకాలగుడ్డలకు రకరకాల పేర్లున్నాయి – సంస్కృతంలో.

చినిగిన గుడ్డను నక్తకం, కర్పటం అనే పేర్లతో పిలుస్తారు. బహుశా నక్తంలో – రాత్రివేళల – ధరించదగినది కాబట్టి నక్తక మన్నారేమో. చిరుగులు పదిమంది కంటబడటం బాగుండదు కాబట్టి వాటిని రాత్రులు ధరించవచ్చు గదా. కొందరామాటకు మాసినగుడ్డ అనే అర్థమంటారు. కర్పటమనేది కప్పడమనే మాటగా తెలుగులో చేరినపదానికి మూలరూపం. ఉభయభాషల్లోనూ వీటికి చినిగిన గుడ్డ అనే అర్థముంది. చీకి/చివికిపోయిన గుడ్డను సంస్కృతంలో పటచ్చర మంటారు. అంటే పాతగుడ్డ అనే తెలుగు సమాసానికి సరైన మాట అన్నమాట. వలచని గుడ్డను సుచేలమంటారు. కొందరు దాన్నే పటమనీ పిలుస్తారు. ఏవయినా వస్తువులనూ (దస్త్రాలుగా) కట్టి పడేయటానికి వాడే ముతకగుడ్డను నిచోలం అంటారు.

కేవలం నడుము కింది భాగాన్ని మాత్రమే కప్పివుంచే 'కట్టు' పుట్టాన్ని సంస్కృతంలో 'అంతరీయం, ఉపసంవ్యాసం, పరిధానం, అధోంశుకం' అనే పేర్లతో పిలుస్తారు. అంతరీయం ఉత్తరీయం కావిదన్నమాట. ఉత్తరీయం బుజమెక్కుతుంది. అంతరీయం నడుముకు చుట్టుకొంటుంది. అదే భేదం. సంవ్యాసమంటే బుజంమీద వేసుకొనే ఉత్తరీయం. ఉపసంవ్యాసం అంటే దానికి దిగువనుండే కట్టుగుడ్డ. పరిధానం అంటే దోవతి; సాధారణంగా మగవాళ్లు కట్టుకొనే పంచె. అయినా ఇటీవలి కవులు కొందరు వస్త్రసాధారణమనే భావంతో స్త్రీలు కట్టే గుడ్డలను కూడా ఈ పేరుతోనే పిలుస్తున్నారు! నిజానికి ఒంటికి చుట్టివుండేది అనే దాని మూలార్థం. అధోంశుకం అనగానే కింది (అధః) గుడ్డ (అంశుకం) అని తెలుస్తుంది. ఇవన్నీ వర్ణనాత్మకంగా వచ్చిన మాటలేగాని వేరుకావు.

పైగుడ్డ, పైపంచె అనేది లేకుండా వీధిలోకి పోవటం (ముఖ్యంగా కోస్తాలో) మర్యాదాపరుల లక్షణంకాదు. తలగుడ్డ, పైగుడ్డ రెండూ ఉండటం పెద్దరికానికి చిహ్నం. ఇప్పటికీ కోర్టుల్లో పైగుడ్డను తలకు చుట్టిగాని బోనెక్కనివాళ్లున్నారు. తలను కప్పివుంచకపోవటం ఎదుటి వ్యక్తిని అగౌరవించటంతో సమానం. బుజంమీద గుడ్డ లేకపోతే తనను తాను అగౌరవించుకున్నట్టు అని ఒకప్పుడు భావించేవారు. ఇరవయ్యో శతాబ్ది ప్రథమార్ధంలో కేవలం బుజంమీద ఏ తుండుగుడ్డనో వేసుకోవటం మామూలు సంసారికి ఎంత అవసరమనుకొనేవాళ్లో పెద్దింటి ధనవంతులకు 'వల్లెవాటు' అంతే ముఖ్యమనుకొనేవాళ్లు. అది నిజానికి ఒల్లెవాటు. ఒల్లె అంటే పంచలోసగం (అర్ధవస్త్రం). రెండు పంచెలయితే 'చాపు'. ఆ మర్యాదలు ఇప్పుడు మారిపోయినా వివాహసమయంలో పెండ్లికొడుక్కు ఒల్లెవాటు వేయటం అనే సంప్రదాయం చాలాచోట్ల నిలిచింది.

ఉత్తరీయం, అంగవస్త్రం అనే సంస్కృత పదాలే తెలుగువారి వాడుకలో నిలిచాయి. పైగుడ్డ, పైతుండు, పైపంచె వంటి తెలుగుమాటలు మొరటై ఇవి నాగరకతకు చిహ్నాలయిపోయాయి. అంగం అంటే శరీరం. దాన్ని కప్పే వస్త్రం అంగవస్త్రం. ఇది వాడుకలో అంగోస్త్రమయిపోయి చివరి కోకులానికీ అందులోని అంతశ్శాఖకూ లక్షణమైపోయింది. దాన్నే సంద్యానం అని కూడా పిలుస్తారు. కొందరు బృహతిక అనేవారు – అంటే పెద్దరికానికి చిహ్నమని.

ఇవేవీ లేని, భరించలేనివాళ్లు – మొగవాళ్లయితే ధరించేది/పెట్టేది గోచి. దీనికే కచ్చడం, గోణం, బొట్టం అనే తెలుగు పర్యాయపదాలున్నాయిగాని ఒక్క కచ్చడమనే మాటకే కావ్య'గౌరవం' ఉందని చెప్పాలి. దీన్నే సంస్కృతంలో కౌపీనమంటారు. గోచీ పెట్టడంలో గూడా వైవిధ్యముంది. 'పుట్టగోచి' వంటి భేదాలున్నాయి. ఆ గోచీని చూసి అది తోకని భ్రమించి ఆర్యులు సవరలు మొదలయిన ఆటవికులను కోతులని వర్ణించారని, హనుమంతుడూ సుగ్రీవుడూ వగైరాలు గోదావరీ ప్రాంతంలోని దీవుల్లో నివసించిన ఆదిమవాసులనీ, రాముడసలు గోదావరిదాటలేదని, ఇప్పటి శ్రీలంక అప్పటి లంకకాదనీ ఎడాపెడా వాదించినవాళ్లున్నారు. స్త్రీలయితే కట్టేంది 'పాత్తి'. అందుకే 'పాత్తుల్లో బిడ్డ, పాత్తిగుడ్డ' మొదలయిన మాటలు పుట్టాయి.

పురుషులు ఉత్తరీయాలు ధరిస్తే స్త్రీలు పైటలు వేస్తారు. ఈ మాట 'పైతా' అనే ప్రాకృత శబ్దం నుంచి పుట్టిందని కొందరు. దానికి పయట, పయంట, ప్రయ్యంట అనే రూపాంతరాలుండేవి. పయ్యెద అనే మరో అచ్చతెలుగు సమాసముంది, పర్యాయపదంగా. ఎద – అంటే గుండె – పైన ధరించేదికాబట్టి పయ్యెద అన్నారు. పైట వేసే అలవాటు మొదట దాక్షిణాత్యులది. అందుకే దానికి సరైనమాట సంస్కృతంలో లేదు. లేకనే 'స్తనోత్తరీయం, కాంతోత్తరీయం' అనే సమాసాలు కల్పించుకున్నారు! మనవాళ్లకు పైట ఎంత ముఖ్యమో ఉత్తరాది వాళ్లకు 'నివీత'మంత ముఖ్యం. నివీతమంటే కప్పుకొన్నది (దుప్పటి) అని అర్థం. దానికి ప్రావృతమనే పర్యాయపదముంది. దానికి 'కప్పింది' అని అర్థం. ఫలితమొక్కటే. దీన్నే తెలుగులో 'మేలిముసుగు' అంటాం. మేలి అంటే 'పైనున్న' అనేగాని 'ఉత్తమమైన, మంచి' అని కాదిక్కడ.

చీరెలూ పంచెలూ ఒంటికి చుట్టి ముడివేసేవేగాని వాటికి కుట్టుపనితో నిమిత్తంలేదు. శాతవాహనుల కాలం దాకా – అంటే రమారమి క్రీస్తు శకారంభం దాగా – కుట్టటం తెలీదని చెప్తారు. సూది, దారం, కుట్లు, అతుకులు అప్పటినుంచే వాడుకలోకి వచ్చాయుంటారు. మనమిప్పుడు కుట్టుపని అనేదాన్ని పూర్వం 'కుట్రపుపని' అనేవాళ్ళు. ఇప్పుడు మనం ఇంగ్లీషులో టెయిలర్ అంటున్న వ్యక్తిని అంతకుముందు ఉర్దూలో దర్జీ అనేవాళ్లు. అంతకన్నా ముందుకాలంలో కుట్రపువాడు అనేవాళ్లని క్రీడాభిరామం సాక్ష్యమిస్తుంది. కుట్టుపని తెలిసిన తరవాతనే చొక్కాలు, లాగూలూ, రవికలూ, అంగీలూ వచ్చాయి. అవి రాకముందు పురుషులు పైన ఉత్తరీయాలు ధరించినా ధరించకపోయినా స్త్రీలు మాత్రం దుప్పటికప్పుకొనేవారు. రొమ్ములచుట్టూ కప్పుకున్నదాని తిప్పి వీపునగాని ముందువైపునగాని ముడివేసేవారు. రవికలు వచ్చిన తరువాత కూడా చాలాకాలందాకా (రవిక) ముడేగాని గుండీలు వగైరాలు వాడుకలోకి రాలేదు. మొగవాళ్ల చొక్కాలకు బొత్తాలు లేనికాలంలో గట్టి దారాలతో లాగికట్టే వాళ్లు. ముస్లిం రాజ్యకాలంలో పొడుగాటి అంగరఖాలు వచ్చి, వాటిని కట్టడానికి పన్నెండు ముళ్లు వేయటమనే ఆచారం పుట్టింది. అంటే బారాబందీ (పన్నెండు ముళ్లు), అదే బాదరబందీగా మారిందంటారు!

తెలుగులో రవిక, రైక, కంచెల అనే మాటలున్నాయి. మొదటి రెండూ రూపాంతరాలు; మూడోది పర్యాయపదం. రవికను పూర్వం బండిరాతో రాసేవాళ్లు. కంచెల అనే మాట ఏనాడో వాడుక నుంచి తప్పిపోయింది. ఇంగ్లీషు మాటలు వచ్చింతర్వాత రవిక కూడా పల్లెటూరి/పాతకాలపుమాటగా మారిపోయింది. వీటికి సంస్కృత పర్యాయపదాలు 'చోలం, కూర్పాసకం, కంచులి(క)' అనేవి. ఈ చోలం అనేమాటనుంచే ఇప్పటి 'చోళీ' అనే మాట పుట్టింది. రూపంలో ఆకారంలో కుట్టేతీరులో ఫ్యాషన్లు పోయినట్లే అర్థచ్ఛాయలు కూడా మారిపోతుంటాయి. తలపాగాను కూర్పాసమంటారు. రవికను కూర్పాసకమనటమేమో తెలీదు. క ప్రత్యయం స్వార్థంలోనూ కాక అల్పార్థంలోనూ కాక మరో అర్థవిశేషంలో వచ్చిందనాలి. కంచులీ కంచెల శబ్దాలకు ధ్వనిలో అర్థంలో పోలిక వుంది. సంస్కృత పదానికి తెలుగుమాట మూలమో, తెలుగు మాటకు సంస్కృత పదం మూలమో చెప్పలేం.

లోకసామాన్యంలోనయితే తెలుగుకన్నా సంస్కృతమే ముసలిభాష కాబట్టి అన్ని తెలుగుమాటలకూ ప్రకృతి సంస్కృతంలోనే ఉందనే విశ్వాసముంది. సంస్కృతంలోని కంచులీ శబ్దానికి రవిక అనీ, కంచుక శబ్దానికి చొక్కా అనీ అర్థముండటమే విచిత్రం. కంచుకమనే మాటకు పాముకుబుసం, కవచం అనే ఇతరార్థాలు కూడా ఉన్నందున, అర్థవైవిధ్యమున్నమాట అర్వాచీనమో అరువుమాటో కావచ్చుననే సిద్ధాంతం ప్రకారం తెలుగు మాటే మొదటిదని కొందరు వాదిస్తారు. కవచమనే అర్థంలో కంచుక శబ్దానికి సమానమైన తెలుగుమాట 'బొందలం'. బొంద శబ్దానికి మొండెం, శరీరం అనే అర్థాలున్నాయి. మరో తెలుగుమాట ఉన్నట్లు లేదుగాని సంస్కృతంలో వారవాణం/బాణవారం అనే విచిత్ర శబ్దముంది. బాణం దెబ్బనుంచి కాపాడేది కాబట్టి ఆపేరు వచ్చింది – బాణవారమని. 'పారావతం'లోనుంచి పుట్టిన 'పారువం' తరవాత 'పావురం'గా వర్ణవ్యత్యయంతో మారినట్లే బాణవారం వారవాణంగా మారిందన్నమాట (బ–వ–ల మారుపాటు ఉత్తరాదివారి ఉచ్చారణలో సహజం).

ఇప్పుడు లంగా అని పిలిచే వస్త్రవిశేషాన్ని అచ్చతెలుగులో చల్లడమని, అంగ దట్టమని పిలిచేవాళ్లు. చల్లడ శబ్దానికి రూపాంతరమనిపించే చల్లాడమనేదాన్ని కొన్ని నిఘంటువులు 'పుమంతరీయ'మని వర్ణించాయి – అంటే మొగవాళ్లు వాడే డ్రాయరు వంటిదని! ఒకప్పుడు స్త్రీపుంభేదం లేకుండా 'చీర, కోక' శబ్దాల్లాగా చల్లాడ/చల్లడ శబ్దాన్ని వాడేవారేమో! చల్లడానికి సమానమైన సంస్కృతపదం చండాతకం. కొన్ని నిఘంటువులు 'లుంగి' అనే మాటను అంగదట్టానికి (అంటే పావడాకు) పర్యాయపదమన్నాయి! ఇప్పుడు అర్థం పరిమితమై లుంగి పురుష వస్త్రవిశేషమయిందనుకోవాలి.

స్త్రీలకు మేలిముసుగులాగా పురుషులకు తలగుడ్డ, తలపాగ/పాగా పూర్వం నియతంగా ఉండేది. సంస్కృతంలో దాన్ని 'వస్త్రమకుటం' (=గుడ్డకిరీటం!) అని పిలిచేవారట. పాగా అంటే చాలు – తలపాగా అనే అర్థం వస్తుంది. ఆ మాటకు (పాగ, పాగా–లు రూపాంతరాలు) పావుకోళ్లనే అర్థం కూడా ఉండటం విచిత్రం (తల ఎత్తునుంచి కాలికిందిదాకా ఒకే పేరుతో ఉన్నందువల్ల). పూర్వం తలపాగాను 'తలకట్టు' అనికూడా పిలిచేవాళ్లు. ఈ కాలానికి అది తెలుగు అక్షరాల పైభాగమనే అర్థంలో స్థిరపడిపోయింది. శ్రేష్ఠం, ముఖ్యం అనే అర్థవిశేషాలను సంతరించుకొంది; గాయం మాన్పడానికి తలకట్టిన గుడ్డకట్టనే సంకుచితార్థాన్నీ సంపాదించుకొంది. వీటిలో రకాలున్నాయి – కుల్లా, కుళాయి, తపారం, డెక్కి, జాతు, టోపీ వగైరాలుగా. మళ్లీ వాటిలోకూడా అవాంతర భేదాలున్నాయి – కుచ్చుల కుళాయి, ఈకలటోపీ, అల్లుతపారం వగైరాలుగా. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వందల రకాలుగా పద్ధతులు మార్చి తలగుడ్డలు చుట్టేవాడని చెప్తారు. అదొకప్పటి కళ. ఇప్పుడు విస్మృతాచారం. శ్రీనాథుడు 'కుల్లా' తలకూ, 'కోక' మొలకూ కట్టి కన్నడ దేశయాత్ర చేశానని చెప్పుకున్నాడు.

మరికొన్ని నిఘంటువులు 'దుత్తాయి, అరదట్టి, కుప్పసం, అంగి (!), కుబుసం' అనేవి తలపాగా అనే అర్థమిచ్చే సంస్కృత శబ్దం కూర్పాసానికి పర్యాయపదాలని పేర్కొన్నాయి. కుప్పసం కూర్పాస శబ్దభవమే. కుబుసం పాము శరీరానికీ మనిషి

తలకూ సరిపడ్డ ఆచ్ఛాదన. తలకు చుట్టినా దాన్ని 'అంగీ' అనే పిలిచారన్నమాట. అంగం అంటే శరీరభాగం. ఏ భాగాన్ని అలంకరించినా అది అంగి కావచ్చు! దట్టీ అనే మాటను నడుముచుట్టూ చుట్టే 'కాసెకోక' కు పర్యాయపదమంటారు. కాసె శబ్దానికి 'పని' అనే అర్థముంది. పనిచేసే వ్యక్తి పైబట్టలు అడ్డుపడకుండా, కింది బట్టలు జారకుండా బిగించి కట్టిన బెల్టు వంటి గుడ్డ కాసెకోక. అంత నిండుగా కాక తలకు చుట్టిన (తలవెంట్రుకలు కనిపించేటట్టు కట్టిన) తలగుడ్డను అరదట్టి అన్నారన్నమాట.

చీరల్లో రకాలున్నాయి. పూర్వం మహర్షులూ అరణ్యవాసానికి వెళ్లేరాజులూ 'నారచీర'లు కట్టేవాళ్లు. ఈ మాట తెలుగుమాట. దీనికి సమానమైన సంస్కృతపదం 'వాల్కం'. వల్కలం అంటే నార. ఆ నారతోచేసింది వాల్కం. కొన్ని నిఘంటువులు దానికి 'క్షేమ'మనే మరో పేరుందంటాయి. కొన్నేమో క్షేమ శబ్దానికి తెల్లచీర అనే అర్థముందంటాయి. మరికొన్ని క్షేమ శబ్దానికి క్షోమమనే రూపాంతరముందనే దానికి 'వెలిపట్టుచీరె' (అంటే తెల్లపట్టుచీర) అనే అర్థముందనీ చెప్తాయి. క్షోమ/క్షేమ శబ్దాలకు 'తెలుపు, తెల్లని, వెల్ల, వెలి' అనే అర్థవిశేషాలున్నాయి. అడివికిపోయ్యేవాళ్లు పేరంటానికిలాగా పెళ్లికిలాగా పట్టుచీరెలు కట్టిపోరు. ఈ మాటకు 'పట్టుచీరె' అనే అర్థవిశేషం ఉంటే అది వాల్క శబ్దానికి పర్యాయపదం కాదు.

నూలుచీరెను సంస్కృతంలో "కార్పాసం, ఫాలం, బాదరం" అని పిలిచేవాళ్లు. కార్పాసి అంటే పత్తి. కార్పాసమనేది పత్తితో తయారయినదనే అర్థమిస్తుంది. ఫాల శబ్దానికున్న అనేకార్థాల్లో 'నూలు' అనేదికూడా ఉంది. ఫల శబ్దానికి పత్తి అనే అర్థమున్నది. అందువల్ల ఫాలమంటే నూలుచీరె అనే అర్థం చెప్పవచ్చు. బదరమన్నా పత్తే. దాంతో తయారయిందికాబట్టే బాదరమనేపేరు వచ్చింది. అయితే కార్పాసమనే మాటకే వ్యాప్తి ఎక్కువ. నూలుచీరకన్నా మృదువయిందీ ఖరీదయిందీ పట్టుచీరె. అదిరంగులేక – తెల్లగా ఉంటే 'వెలిపట్టు' – అంటే తెల్లపట్టుచీరె. కుశ శబ్దానికి 'తాడు' అనే అర్థముందనీ, కౌశయం అనేపేరు ఆ కారణంచేత 'పట్టుచీర' అనే అర్థంలో సంస్కృతంలో వచ్చిందనీ చెప్తారు. తెలిపట్టుచీరను క్షోమం, క్షేమం, దుకూలం అని పిలుస్తారని చెప్తారు. కానీ దుకూల శబ్దానికి 'తెల్లని/సన్నని గుడ్డ' అనే అర్థవిశేషముందని కొందరూ, నేతనేసిన పట్టుచీరె అనే అర్థమే ఉందని మరికొందరూ చెప్తారు. శిల్కు వగైరాలు తరవాత కాలంలో వచ్చినవి. పాతమాటలుకావు.

కొత్త గుడ్డ/చీర అనేదానికి సంస్కృతంలో వేరేమాటలున్నాయి – 'అనాహతం, నిష్ప్రవాణి, తంత్రకం' అని. అహితం దెబ్బతగిలినది. అనాహతం అంటే (చాకలిబండమీద) దెబ్బలు తినని గుడ్డ అన్నమాట. అంటే ఉతుకుపడని, ఉతకని కొత్తగుడ్డ అని అర్థం. 'ప్రవాణి' శబ్దానికి పడుగుపేకల మధ్య నిలిపే 'లేకబద్ద' అని అర్థం. నిష్ప్రవాణి అని బహుశా అప్పుడే మగ్గంబయటికితీసిన సరికొత్తగుడ్డ అనే అర్థంలో చెప్పివుంటారు. తంత్రశబ్దానికి చాలా అర్థాలున్నాయి. అందులో 'మగ్గం, నూలిపడుగు' అనేవి కూడా ఉన్నాయి. 'అప్పుడేనేసి తెచ్చినగుడ్డ' అనే అర్థంలో తంత్రకం అనే పేరు పెట్టివుంటారు.

అలంకారం కోసం – ముఖ్యంగా పందిళ్లపై భాగంలో కట్టే రంగుగుడ్డలను తెలుగులో 'ఉల్లెడ, ఉల్లబం, మెట్టు, మట్టు, చందువా, మేల్కట్టు' అనేపేర్లతో పిలుస్తారు. చందువాకు చందువ, మేల్కట్టుకు మేలుకట్టు అనే రూపాంతరాలున్నాయి. మేలు శబ్దానికి 'పైన, మీద, ఎత్తయిన' వగైరా అర్థవిశేషాలున్నాయి. ఎత్తునకట్టినకట్టు కాబట్టే మేలుకట్టు. మెట్టుకు రూపాంతరం మట్టు. దానికి 'అంచె' అనే అర్థాంతరముంది. ఉల్లెడకు ఉల్లడ అనే రూపాంతరముంది. 'ఉల్ల' అనే మాట నన్నయ్య తరవాతికాలంలో వాడుకనుంచి తొలగిపోయినట్లుంది. 'అల్ల' అంటే అక్కడ, 'ఇల్ల' అంటే ఇక్కడ, 'ఉల్ల' అంటే 'అంత దగ్గరా అంత దూరమూగాని, మధ్యస్థదూరంలో ఉన్న' అని అర్థం. 'ఉల్ల జవనాశ్వవుందొక నల్లచూడు'మని కద్రూ వినతలసంభాషణలో నన్నయ ప్రయోగం. కప్పంత ఎత్తునకాక, అలాగని నేలబారుగానూకాక, మధ్యస్థంగా ఉండే ఎత్తున కట్టిన (రంగు) గుడ్డను 'ఉల్లడ/ఉల్లెడ' అనేకాక 'ఉల్లబం' అనికూడా పిలిచేవారు. అచ్చతెలుగుమాట అనిచెప్పే చందువాకూ 'చాందినీ' అనే హిందీ/ఉర్దూమాటకూ దూరపుచుట్టరికమయినా ఉందని గుర్తించాలి. ఈ తెలుగు మాటలకు సంస్కృత పర్యాయపదాలు 'వితానం, ఉల్లోచం, ఉల్లాభం' అనేవి. ఉల్లబాన్ని సంస్కృతీకరించి ఉల్లాభ మన్నారనిపిస్తుంది. వితాన శబ్దానికి మెట్టు అనే అర్థంకూడా ఉంది.

చలిబాధ తప్పించుకోడానికి 'గొంగళి/గొంగడి, కంబళి, దుప్పటి, దువ్వలువ' అవసరం. ఇవన్నీ తెలుగుమాటలని కొందరూ, ఇందులో కొన్ని మనవికావనీ కొందరూ వాదిస్తారు. కంబళి సంస్కృతంలోని కంబళ శబ్దభవం అంటారు. ద్విపటం (రెండువలసలగుడ్డ) అనే అర్థంగల శబ్దం నుంచి 'దుప్పటి, దుప్పటం, దువ్వటం' వగైరా రూపాంతరాలుగల తద్భవశబ్దా లేర్పడ్డాయంటారు కొందరు. ఈ అర్థంలో కాకపోయినా 'కప్పుకొనే (ముతక) గుడ్డ' అనే అర్థవిశేషంలో 'గవుసెన/గౌసెన' అనే తెలుగుమాట కూడా ఉందని కొందరంటారు. గవుసెనకు 'కట్టుకోక' అనే అర్థముందనీ, కాదు 'కప్పడు దుప్పటి' అనే అర్థముందనీ అభిప్రాయభేదాలున్నాయి. చలికి కప్పుకొనే దుప్పటిని సంస్కృతంలో నిశారం/నీశారం అని పిలుస్తారు – బహుశా అది 'నిశా' (రాత్రి) సమయంలో అవసరపడేదనే అర్థంలోనేమో! కంబళ శబ్దానికి కొందరు ఉత్తరీయమనే అర్థం చెప్పారు. కొందరు (పగలు) కప్పుకొనే గుడ్డను 'ఉల్లకం' అని పిలవాలంటారు సంస్కృతంలో. తెలుగులో 'గొంగడి' అనే రూపమేగాక, 'గోరుపడ'మనే పర్యాయపదంకూడా ఉంది ఈ మాటకు. దాన్ని 'పచ్చడం, పోరువ' అంటారని మరికొందరు చెప్తారు. పచ్చడం అనే తెలుగుమాట 'ప్రచ్ఛదం' (బాగా కప్పింది) అనే సంస్కృతపదంనుంచి పుట్టిందంటారు. పోరు అనే తెలుగుమాటకు 'పొర' అనే అర్థముంది. పొరలుపొరలుగా ఉన్నది కాబట్టే పోరువ అనే మాట పుట్టింది. కప్పుకొనే గుడ్డను సంస్కృతంలో 'నిచోలం' అని కూడా పిలుస్తారు. అది నేసిందయితే 'శాటి(క)'. సాధారణంగా యతులూ సన్యాసులూ కట్టేదాన్ని ఈ పేరుతో పిలిచేవాళ్లు ఒకప్పుడు. అది తెల్లలేడిచర్మంతోనే చేసేకాలంలో దానికి 'రాంకవం' అనే పేరు వచ్చింది. (సంస్కృతంలోని 'రంకు' శబ్దానికి తెల్లలేడి అని అర్థం! తెలుగు రంకు వేరు). అంచులూ కమ్ములూలేని ఉన్నిగుడ్డలకు 'సెల్లా, సేలు/సాలు, సాలువ/సాలువు/శాలువా' వగైరా పేర్లున్నాయి. ఈ కాలంలో ఆ పాత

అర్థాలు మారిపోయాయి. పలచని శాలువాను 'వీణం/వీణాం' అనికూడా పిలుస్తారు. ఇది తెలుగుమాటో సంస్కృతపదమో తేలేట్లు లేదు. సంస్కృతంలో దీనికి 'హసావళి' అనే పేరుందంటారు. ఎందుకామాట పుట్టిందో చెప్పలేం. పచ్చడమనే మాటకు 'పరుపుమీది దుప్పటి, (కుట్టు) గుడ్డ, అంగవస్త్రం' లాంటి రకరకాలు అర్థాలు చెప్తారు.

ఉతికి మడతలుపెట్టిన గుడ్డను అచ్చతెలుగులో 'మడుగు, మడత, మడి, చలువ' అని పిలుస్తారు. సంస్కృతంలో ధౌత (ఉతికిన) వస్త్రమంటారు. ఇలా వస్త్రభేదాలు ఇంకా చాలా చెప్పవచ్చు.

## ఆభరణాలు

నగల గురించి చర్చిద్దాం. 'సొమ్ము, తొడవు, తొడగు, మిన్న, ఒడమె, రవణం' అనే తెలుగు మాటలూ, 'భూష(ణం), అలంకారం, ఆభరణం, విభూషణం, మండనం, పరిష్కార'మనే సంస్కృత పదాలూ నగ శబ్దానికి పర్యాయపదాలంటారు. సొమ్ము శబ్దానికి తెలుగులో 'ధనం, పశువు' వగైరా ఇతరార్థాలున్నాయి. అసలిది 'స్వం' అనే సంస్కృత శబ్దం నుంచి పుట్టిందని వాదించేవాళ్ళున్నారు. తొడవు, తొడగులు పరస్పరం రూపాంతరాలు. 'తొడిగేవి' అనే అర్థంలో ఆ మాటలు పుట్టాయి. నన్నయభట్టు కాలంలో నగలుకూడా తొడిగేవాళ్లు; ఇప్పుడేమో గుడ్డలు మాత్రమే తొడుక్కుంటున్నాం. రవణం అంటే చప్పుడు, మోత అనే ఇతరార్థాలు కూడా ఉన్నాయి. రవళించే/మోగే వస్తువులు కాబట్టి ఈ పేరు వచ్చి వుండవచ్చు. మిన్న అనే మాటకు 'గొప్ప, మించినది' వగైరా అర్థాలున్నాయి. తమ ఆధిక్యాన్ని ప్రత్యేకతను, మిన్నదనాన్ని సూచించేందుకు ధరించేవి కాబట్టి ఆ మాట పుట్టివుండవచ్చు. ఒడమె అనేది తమిళపదం. అయినా కొందరి వాడుకలో మిగిలింది తెలుగులో కూడా.

భూష, భూషణం అనే సంస్కృతపదాలు పర్యాయపదాలు. 'పొగడదగిన, చెప్పదగిన' వస్తువులు కాబట్టి నగలకీ పేరు వచ్చి వుండవచ్చు. విభూషణం మరీమంచి, మరీగొప్ప నగ కావచ్చు. అలంకారం అనేది విశాలార్థంగల మాట. నగకట్టు లేకపోయినా ఇతర విధాలుగా శరీరాన్ని ఆకర్షణకరంగా తీర్చిదిద్దటం అలంకారమే. నగకు సమానార్థక శబ్దం ఆభరణం. 'పైన ధరించేది, మోసేది' అనేది ఆ మాటకసలర్థం. మండనం నగలు లేకుండా కూడా చేసుకొనే అలంకారమేమోననిపిస్తుంది. ఎవరోగాని 'ముండనం మండనం పుంసాం' అని మగవాళ్లకు తలగొరిగించడమే (బోడిగుండే) అలంకారమని చెప్పారు! అందువల్ల ఈ అనుమానం కలిగిందన్నమాట. పరిష్కారమనేది చిత్రమయిన మాట. సంస్కారమన్నట్లే పరిష్కారం కూడా ఒకప్పుడు 'మార్చి బాగుచేయట'మనే అర్థంలో వాడుకలో ఉండేది. ఇప్పుడు 'తేల్చటం' అనే అర్థం వచ్చింది. ఇప్పుడయినా నగానట్రా తొడిగి, ఇతరాలంకారాలు పూర్తిచేసే స్థితిని పరిష్కారమనవచ్చునేమో.

నగల్లోని నానావిధ భేదాలను ప్రస్తావించడం ప్రయోజనరహితమైన శ్రమ. చాలా నగల విషయంలో పేర్లేగాని ఇతర వివరాలు తెలియవు. మన నిఘంటువులు 'భూషావిశేష'మనో, 'ఒక దిమసు నగ' అనో చెప్తాయి. అసలు నగకట్టు ఏ ధాతువుతో, ఏ లోహంతో చేసినా అది ఇంతో అంతో ఉన్నవాళ్ళకే చెల్లు. అందువల్ల డబ్బంటే ఏమిటో దాని పర్యాయపదాలేమిటో ముందు కనుక్కుందాం. తరువాత నగలు చేయడానికి వాడే లోహాదులను గురించి ప్రస్తావిద్దాం. నగల్లో భేదాలకన్నా ఈ విషయాలే సుకరమైనవి.

## డబ్బు విషయం

తెలుగులో 'డబ్బు, సొమ్ము, పైకం, విడిముడి, రొక్కం' అనే మాటలున్నాయి. డబ్బనేది ఒకప్పుడొక నాణెంగా ఉండేది. 'డబ్బు లేనివాడు డుబ్బుకు కొరగాడు' అనే సామెత పుట్టింది. ఆ నాణేన్ని కొన్ని ప్రాంతాల్లో 'దుగ్గాణి' అనీ, మరికొన్నిచోట్ల 'దుడ్డు' అనీ వ్యవహరించేవాళ్లు. అది అన్నిటికన్నా చిన్న నాణెం. నేటి 'పైసా' వంటిది. ఒకప్పటి 'దమ్మిడీ' వంటిది. సొమ్ము అనేది ధనసాధారణానికి పేరు. ఈ మాటకు కొన్ని ప్రాంతాల్లో 'గొడ్డు, పశువు' అనే అర్థంలో నేటికీ బహుళప్రయోగముంది – ముఖ్యంగా కళింగ ప్రాంతంలో. నల్లగొడ్డు, బర్రె, గేదె – అని పిలిచే జంతువులను ఆ ప్రాంతంలో 'ఇనప సొమ్మన్లు/ఇనపసొమ్ములు' అని పిలుస్తారు. నిజానికి నేటి కరెన్సీ విధానంగాని, పూర్వపు నాణేల పద్ధతిగాని అమల్లోలేని ప్రాచీనకాలంలో పశువులే సొమ్ముకింద, ఆస్తికింద లెక్కగా ఉండేవి. ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో ఫలానా రైతుకు ఇన్ని గొర్రెలున్నాయి, ఇన్ని గొడ్లున్నాయి, ఇన్ని బాతులున్నాయని ఆ వ్యక్తి సంపదను వర్ణించడం కద్దు. మనమిప్పుడు వాడే 'పైసా' శబ్దం, ఇంగ్లీషువాళ్లు వాడిన pice అనే మాట వగైరాలన్నీ 'పశు' శబ్దం మూలరూపం నుంచే ఏర్పడ్డవంటారు. పశుసంపదే ప్రాచీనమానవుడికి సంపద – అదే ధనం, సొమ్ము, పైసా. పైకం తెలుగు మాటేనంటారు కొందరు. విడిముడి అనేది సమస్తపదం. బహుశా ముడివిప్పిన సొమ్ము, వాడుకలో (సర్క్యులేషన్లో/చలామణిలో) ఉన్న డబ్బు అనే అర్థంలో పుట్టివుంటుంది. రొక్కమనేది సంస్కృతంలోని 'రుక్మ' శబ్దభవమని కొందరు, 'రిక్త/రుక్థ' శబ్దభవమని కొందరు సాధిస్తారు. అది సంస్కృతంలోనుంచి వచ్చిన మాటేనన్న విషయంలో మాత్రం అభిప్రాయభేదం లేదు. ఒకప్పుడు 'గవ్వ'లనే డబ్బుగా వాడేవారు. అందుకే 'ఆ వస్తువు గుడ్డి గవ్వ ఖరీదు చేయదు' లాంటి ప్రయోగాలు వచ్చాయి.

తెలుగు డబ్బుకు పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృతపదాలు 'ధనం, విత్తం, ద్రవ్యం, రిక్థం, ఋక్థం, స్వాపతేయం, వసువు, ద్రవిణం, హిరణ్యం, ద్యుమ్నం, అర్థం, విభవం' అనేవి. వీటన్నిటిలో ధన, విత్త, ద్రవ్య, అర్థ శబ్దాలకే వాడుక ఎక్కువ. ఇటీవల money అనే మాటకు అనువాదంగా 'ద్రవ్యం', finance అనేదానికి తుల్యంగా

'విత్తం', economy అనే అర్థంలో 'అర్థం' అనే మాటలను సాంకేతికపదాలుగా ఆధునిక శాస్త్రాల్లో వాడుతున్నారు. రిక్థం, ఋక్థం రూపాంతరాలని చెప్పదగిన మాటలు. మారుమూల గ్రంథాల్లోతప్ప కావ్యభాషలో కూడా వాడుక లేనివి. వసు శబ్దానికి 'రత్న'మనే అర్థం, హిరణ్యమనే మాటకు 'బంగార'మనే అర్థం ఉన్నాయి. విభవ శబ్దానికి ఐశ్వర్యమనే అర్థముంది. ద్యుమ్నం అంటే ప్రకాశించేది, వెలిగేది. ఏ వెండినాణెమో, బంగారు నాణెమో అయిఉంటుంది. ద్రవ్య ద్రవిణ శబ్దాలకు 'ద్రవించే, కరిగే, వ్యాపించే వస్తు' వనే అర్థముంది. లోహాలను కరిగించి చేసిన నాణేలకు మొదట ఈ పేర్లుండేవి. అంతకుముందు కాలంలో ధన శబ్దానికి పశు సంపద అనే అర్థం కూడా ఉండేది. విత్తమంటే 'తెలిసినది' అని వ్యుత్పత్తి. బహుశా దొంగసొమ్మును ఆ పేరుతో పిలవగూడదేమో! చంచలమనీ, అస్థిరమనీ చెప్పటానిక్కూడా ద్రవిణ, ద్రవ్య శబ్దాలను వాడివుండవచ్చు.

టంకసాలల్లో తయారుచేసినా చేయకపోయినా, గనిలో నుంచి నేరుగా తెచ్చి వాడినా వెండి, బంగారాలకు కలిపి 'కోశం, కోషం, హిరణ్యం' అనే పేర్లున్నాయి. మొదటి రెండు మాటలనూ పరస్పర రూపాంతరాలని చెప్పాలి. మూడో మాటకు బంగారమనే అర్థంలోనే ఎక్కువ వ్యాప్తి.

## ధాతుభేదాలు

నగల తయారీలో వాడే లోహాల్లో బంగారం ప్రతిష్ఠాకరమయింది. బంగారమనే మాటకే దుర్లభమనే విశిష్టార్థముంది. దానికి తెలుగు పర్యాయపదాలు 'బంగారు, బంగరు, పసిడి, పైడి, పొన్ను, హొన్ను, పుత్తడి' అనేవి; సంస్కృత పర్యాయపదాలు 'స్వర్ణం, సువర్ణం, కనకం, హిరణ్యం, హేమం, హాటకం, తపనీయం, శాతకుంభం, గాంగేయం, భర్మ(ం), కర్బురం, చామీకరం, జాంబూనదం, జాతరూపం, మహారజతం, కాంచనం, రుక్మం, కార్తస్వరం, అష్టాపదం' వగైరాలు. తెలుగు మాటల్లో బంగారం, పైడి అనేవి, సంస్కృత పదాల్లో సువర్ణం, కనకం, కాంచనం అనేవీ ఎక్కువ వాడుకలో ఉన్నవి.

బంగారు, బంగరు, బంగారం అనేవి పరస్పరం రూపాంతరాలు. ఇవి భృంగారమనే సంస్కృత శబ్దం నుంచి పుట్టాయంటారు. అయితే సంస్కృతంలో ఆ శబ్దానికి ప్రాచుర్యమూ లేదు. అంత నిర్దిష్టార్థమూలేదు. భృంగారం అంటే 'బంగారుగిండి' అని నిఘంటువులు వివరిస్తాయి – కేవలం బంగారమనవు. పొన్ను, హొన్నులు రూపాంతరాలే పూర్వం. రెండోది కన్నడంలో ప్రాచుర్యంగల ఎరువుమాట అనవచ్చు. మరీ ప్రాచీన కాలంలో దానికి 'పొన్' అనే రూపం ఉండేది. ఇప్పుడా మాటకు 'తొడుగు' (వెండిపొన్ను వంటి సమాసాల్లో) అనే అర్థమే తెలుగులో మిగిలిపోయింది. పొన్నమ్మ వంటి పేరు దక్షిణ సరిహద్దు జిల్లాల్లో ఎక్కువ – ఇతర ప్రాంతాల్లో బంగారమ్మలాగా. పసిడి, పైడి శబ్దాలు కూడా రూపాంతరాలే. 'పసుపుపచ్చని'దనే

వాటికర్థం. పైరు - పయిరు, పసిమి వంటి పదాల్లో ఈ మూలార్థమే వినిపిస్తుంది. పైడి శబ్దానికి కళింగ ప్రాంతంలో నేటికీ వాడుక ఎక్కువ. పైడితల్లి అనే పేరును ఆ ప్రాంతంలో స్త్రీ పురుష సమానార్థకంగా వాడుతారు.

పుత్తడి శబ్దానికి పుత్తళి, పుత్తళిక అనే రూపాంతరాలున్నాయి. నిజానికీమాటకు మామూలు బంగారమని కాక పుటం పెట్టిన బంగారమనే అర్థం. ఇలా పుటంపెట్టి పదోవన్నెకు తెచ్చిన బంగారాన్ని పుత్తడి అనేవారు. ఈ అర్థంలో ఈ మాటకు 'కడాని, మేలిమి, అపరంజి, జాళువా (జాళ్వా), కుందనం, ఉదిరి' అనే పర్యాయ నామధేయాలున్నాయి. ఈ మాటల్లో మేలిమి అనే మాటకు విడిగానూ కుందన శబ్దానికి సమాసాల్లోనూ! (కుందనపు బొమ్మ వగైరా) ఈ కాలంలో బహుళ వ్యాప్తి ఉంది. కొన్ని ప్రాంతాల్లో మేలిమి శబ్దానికి (మేలయిన, ఖరీదయిన అనే అర్థంలో) పదహారో వన్నె బంగారమనే అర్థం వచ్చింది. అపరంజి, కడాని, జాళువా శబ్దాలకు గ్రంథాల్లోనే ప్రయోగం ఎక్కువ. ఉదిరి అనే మాటకు 'కాచిన, కాగబెట్టిన, పుటంబెట్టిన' అనే విశేషణార్థాలు కూడా ఉన్నాయి.

సువర్ణం, స్వర్ణం అనే రూపాంతరాలకు మంచి వన్నెగలవి అనే అర్థం. దానికి పర్యాయపదాలయిన శబ్దాల్లో "కార్తస్వరం, జాతరూపం, జంబూనదం, కనకం, భృంగారం, హాటకం, కాంచనం, శాతకుంభం" అనే మాటలకు 'ఉమ్మెత్త' అనే మరో అర్థం కూడా ఉండటం విశేషం. ఉమ్మెత్తకూ, బంగారానికి ఇలాంటి చుట్టరికం ఉండబట్టే కనకాభిషేకమంటే ఉమ్మెత్త పూలతో పూజ అనే మరో విరుద్ధార్థం వచ్చింది! కాంచన శబ్దానికి 'పచ్చని' అనే అర్థ విశేషముంది. 'కాంచని' అనే మాటకు 'పసుపు' అనే అర్థముంది. పుటం పెట్టినప్పుడల్లా రంగుమారుతుంది కాబట్టేమో బంగారానికి మరోపేరయిన కర్బుర శబ్దానికి 'చిత్రవర్ణం, రంగురంగుల పదార్థం' అనే అర్థాలు వచ్చాయి. పుటకతోనే చక్కని వన్నెఉన్నది కాబట్టి జాతరూప మన్నారు. వెండి (రజతం)కన్నా విలువుంటుంది కాబట్టి మహారజతం అన్నారు. వీటిలో హిరణ్య శబ్దానికి వేద ప్రయోగాలు మెండు. అష్టాపదమనేది బంగారానికి మారుపేరని కొందరంటే కాదు - దానికర్థం 'వెండికొండ' అని మరికొందరంటారు. నగానట్రా చేయటానికి వాడే బంగారాన్ని - బహుళ రాగి ఎక్కువగా కలిసిన బంగారాన్ని - శృంగి, శృంగీకనకం అంటారు. శృంగమంటే కొమ్ము. బహుశా ముద్ద బంగారంకన్నా నగల్లో ఉన్న బంగారం కొమ్ములు మొలిచి ఖరీదయిందనే అర్థముందో లేదో తెలీదు.

బంగారం తరవాత విలువయిన పదార్థం వెండి. 'వెల్/వెణ్' అనే ద్రవిడధాతువుకు 'తెల్లని, తెలుపు' అనే నామవిశేషణార్థాలు రెండూ ఉన్నాయి. ప్రకాశించేది అనే అర్థమూ ఉంది. 'వెలుగు, వెలుతురు, వెల్ల' మొదలయిన శబ్దాల్లో ఈ మూలధాతువికారమే ఉందని చెప్తారు. విడిగా వాడుకలో ఉన్నతెలుగు మాట ఇదొక్కటే ఈ అర్థంలో. మరో సమాసపదం 'మడికాసు' అనేది పుస్తకాల్లో మాత్రమే కనిపించే పర్యాయపదం. మడి అనే తెలుగుమాటకు 'శుద్ధమయిన, స్వచ్ఛమయిన' అనే అర్థాలు ఉన్నాయి. తెల్లగా ఉంటుంది కాబట్టే శుద్ధమని భావించివుంటారు (రాగికలిపినా!).

వెండికి పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృత శబ్దాలు "రజతం, రూప్యం, శ్వేతం, ఖర్జూరం, దుర్వర్ణ"మనేవి. వీటిలో మొదటిదానికే వ్యాప్తి ఎక్కువ. రూప్య శబ్దానికి 'సుందరమైన' అనే విశేషణార్థమూ, 'నాణెం' అనే విశేష్యార్థమూ ఉన్నాయి. అవికాక 'రూక, రూపాయి' అనే అర్థమూ ఉంది. బంగారు నాణేలను కూడా (ఇప్పుడవి మనదేశంలో ఒకప్పుడుండేవనే నమ్మకంకూడా పోయిందనుకోండి) రూప్యాలనే వ్యవహరించేవారు. తెల్లగా ఉంటుంది కాబట్టి శ్వేత అన్నారు. ఖర్జూర శబ్దానికి ఖర్జురమనే రూపాంతరముంది. అంతేకాదు 'చిట్టీత చెట్టు' అనే అర్థంకూడా ఉంది.

వెండి బంగారాల్లో 'రాగి' కలపనిదే నగ తయారు కాదు. స్వర్ణకారుడి సంపాదన రాగి కలపటంలోనే ఉంది. అది బాగా కలిపిన బంగారానికి 'మొరార్జీ బంగార'మనే పేరుకూడా వచ్చి స్థిరపడింది. నగలకు వాడే బంగారం మేలిమిగా ఉండరాదనే ఉత్తరువు మొరార్జీదేశాయ్ ఆర్థికమంత్రిగా ఉన్నప్పుడు వచ్చి నేటికీ అమల్లో ఉండి ఆయన పేరుకు శాశ్వత గౌరవం తెచ్చిపెట్టింది! సదరులోహానికి 'రాగి' అనేదే తెలుగుపేరు. పుస్తకాల్లో 'రావి' అనే రూపాంతరం కనిపిస్తుంది గాని వాడుకలోలేదు. పర్యాయ పదాలవదగ్గ సంస్కృత పదాలు "తామ్ర(క)ం, శుల్బం, వరిష్ఠం, ఉదుంబరం, ఔదుంబరం, ద్వ్యష్టం, మ్లేచ్ఛముఖం" అనేవి. తామ్ర శబ్దానికి 'ఎరుపు' అనే అర్థముంది. అది వరిష్ఠం (అన్నిటికన్నా ఉరువైన, మేలయిన లోహం) అనే పేరును స్వర్ణకారులే పెట్టి ఉండాలి. అది మ్లేచ్ఛుల ముఖంలాగా ఉంటుందని ఎవరో ఆ జాతిమీద కోపం ఉన్నవాళ్ళు వెక్కిరింతకు పెట్టివుంటారు. తామ్ర శబ్దమే వ్యాప్తి కలమాట.

నగలుగానేకాక విగ్రహాదులుగా కూడా 'పంచలోహాలు' ఉపయోగంలో ఉండేవి. వెండి, బంగారం, ఇత్తడి, కంచు, ఇనుము అనేవాటిని ఈ పేరుతో పిలుస్తారు. విడిగా ఇనపవస్తువులు వాడటం, ఇనపనగలు పెట్టుకోవటం దరిద్రచిహ్నంగా భావిస్తారు. అంటే దరిద్రులు ఇనపనగలు వాడేవారని కూడా తెలుస్తుంది. వెండి బంగారునగల తయారీలో ముఖ్యమైన 'రాగి'ని పంచలోహాల్లో ఎందుకు చేర్చలేదో చెప్పలేం. మొదట ఇనుము సంగతి చూద్దాం.

ఇనుమన్న మాటొక్కటే ఉంది తెలుగులో. దీనికీ చీకటి అనే అర్థమిచ్చే 'ఇరులు' అనే మాటకూ సంబంధముంది. 'చిరుగు–చినుగు' అన్నట్లు 'ఇరుము–ఇనుము' అనే రూపాంతరాలొకప్పుడు ఉండేవని నమ్మవచ్చు–నలుపు అనే అర్థంలో. ఇనుమనే శబ్దంతో వ్యుత్పత్తిరీత్యా సన్నిహిత సంబంధమున్న మరో తెలుగుమాట 'ఎనుము' దానికి 'బర్రె/గేదె, దున్న' అనే అర్థముంది. ఇప్పుడుకూడా కళింగప్రాంతంలో ఈ 'నల్ల'గొడ్లను 'ఇనుపసామా'నని పిలుస్తున్నారు. పూర్వం శాసనాల్లో దేవాలయాలకు భక్తులు దానంచేసిన వాటిలో 'ఇనప ఎడ్లు' విధిగా ఉండేవి. ఆ మాటకు బర్రెగొడ్లని కొందరు, నల్లమేకలని కొందరు అర్థంచెప్తారు. ఇనుమును మాంగనీసుకు కలిపి తయారుచేసే Steel కు సమానార్థంగా 'ఉక్కు' అనే తెలుగుమాట ఉంది. దీనికి కొన్ని తెలుగునిఘంటువులు 'అయస్సారం' (ఇనుముసారం) అనే అర్థంకూడా చెప్పాయి. కానీ నిజానికి ఉక్కు అనే మాటకు శక్తి వగైరా అర్థాలే ఉండేవి.

స్టీలనేది ఇటీవల తయారయిన వస్తువు – ఉక్కనేది అత్యంత ప్రాచీనకాలం నుంచీ ఉన్న తెలుగుమాట. వస్తువు లేకుండా మాట పుట్టిందనలేం. కొత్తగావచ్చిన వస్తువుకు పాతమాటను పేరుగా వాడుతున్నాం.

ఇనుముకు పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృత పదాలు. 'లోహం, శస్త్రకం, తీక్ష్ణం, పిండం, కాలాయసం, కృష్ణాయసం, అయస్సు, అశ్మసారం' అనేవి. వీటన్నిటిలోనూ అయస్సు అనేదే మామూలుమాట సంస్కృతంలో. లోహమనేది సాధారణపదం. వెండి, బంగారంలాంటి వస్తువులనుకూడా లోహాలనే పిలుస్తారు. ఆయుధాల (శస్త్రాల) తయారీలో వాడే పదార్థం కాబట్టి శస్త్రకమనే పేరువచ్చింది. పదునుగా ఉంటుంది కాబట్టి తీక్ష్ణకమన్నారు. నల్లగా ఉంటుందికాబట్టి ఇనుమనే అర్థమిచ్చే అయశ్శబ్దానికి ముందు 'కాల, కృష్ణ' (=నల్లని) అనే విశేషణాలను చేర్చారు. అంటే మరి తెల్లయినుంలాంటి మరోవస్తువేదో ఉండివుండాలి. అదేమోతెలీదు. అశ్మమంటే రాయి. అశ్మసారం అంటే గట్టిరాయి, చేవగల రాయి వగైరా అర్థాలు చెప్పవచ్చు. ఇనపరాయి అనే ఖనిజం నుంచి తీసిన పదార్థంకాబట్టి అశ్మసారమన్నారు. చిట్టెంకట్టిన ఇనుమును సంస్కృతంలో 'మండూరం' అంటారు. ఇదేపేరుతో చిట్టెంగల సిందూరాన్ని కూడా పిలుస్తారు. చిట్టెం అనే తెలుగుమాటకు 'చట్టెం' అనే రూపాంతరం కూడా ఉంది. ఈ ఇనపచిట్టేన్ని 'సింహాణం, శింఖాణం/శింఘాణం' అనే పేర్లతో పిలుస్తారు. సంస్కృతంలో ఈ మాటలెందుకు పుట్టాయో స్పష్టంగా ఖచ్చితంగా చెప్పలేం. నగకట్టుగానూ పాత్ర సామగ్రిగానూ వాడే వస్తువుల తయారీలో వాడే మరో లోహం ఇత్తడి. ఈమాటకు ఇత్తళి అనే రూపాంతరముంది. పిత్తడి/పిత్తలం అనేదికూడా రూపాంతరంకావచ్చు. వీటికి పర్యాయపదాలయిన సంస్కృత శబ్దాలు 'ఆరకూటం, రీతి' అనేవి. రీతి అనే శబ్దానికి ఇనప చిట్టె మనే అర్థాంతరంకూడా ఉంది. పంచలోహాల్లో చేరిన మరో పదార్థం కంచు. ఇది సంస్కృతంలోని కాంస్య శబ్దభవమంటారు. ఆమాటకు వెండి బంగారాలతో చేసిన పానపాత్ర అనే అర్థం కూడా ఉంది. ఈ అయిదులోహాలకూ తగరం, సత్తు, ధీవరం చేర్చి అష్టలోహాలంటారు కొందరు. ఇత్తడిని కొందరు దారువనికూడా పిలుస్తారు సంస్కృతంలో. మరి ఆ మాటకు 'కొయ్య' అనే మరో అర్థం – అందులోనూ సామాన్యార్థం – ఉంది.

## రంగురాళ్ళు

పంచలోహాల్లోనూ వెండి బంగారాలను మాత్రమే రాళ్ళు పొదగడానికి ఉపయోగిస్తారు. తెలుగులో 'రాయి' అనే మాట వెలతక్కువ బండలకూ ఖరీదయిన మణులకూ వాడ్తాం. మణి, రత్నం అనే సంస్కృతపదాలు దీని పర్యాయపదాలేగాక సమానార్థకాలుకూడా. అయితే 'నవరత్నాలు' అన్నట్లు 'నవమణులు' అనవచ్చుగాని అనేవాళ్ళు చాలాకొద్దిమంది మాత్రమే. "వజ్రం, వైడూర్యం, నీలం, ప్రవాళం, మరకతం, మాణిక్యం, గోమేధికం, పుష్యరాగం, మౌక్తికం" అనేవి నవరత్నాలని

చెప్పారు. ఇవన్నీ సంస్కృతపదాలే. వజ్రాన్ని తెలుగులో 'రవ/రవ్వ' అంటారు. వైడూర్యానికి అలాంటి చిన్నపేరు లేదు తెలుగులో. నిఘంటువుల్లో చెప్పే 'పిల్లికను రతనం' అనేది కల్పించినమాట. సంస్కృతంలోనే దానికి 'విదూర/విదూర' దేశం నుంచి వచ్చిన పదార్థమనే అర్థంలో వైడూర్యం/వైదూర్యం అనే పేరువచ్చింది. వజ్రాన్ని ఇంగ్లీషులో daimond అంటారు. వైడూర్యాన్ని cat's eye అంటారు. పిల్లికన్నురంగులో ఉండేరాయి అనేది అనువాద మన్నమాట. నీలం (sapphire) అనే సంస్కృతపదానికి వేరే తెలుగు పేరు లేదు – నీలిరాయి/నీలంరాయి అని వివరణమాత్రముంది.

గోమేధికం అంటే 'మలిమానిరాయి' (onyx) అని కొందరు వివరిస్తారు. మరికొందరు పసుపువన్నెరాయి (agate) అని విశదీకరిస్తారు. పుష్యరాగం (topaz) అనే మాటకు సంక్షిప్తరూపకంగా పుష్యమనే మాటకూడా సంస్కృతంలో ఉంది. అది 'శ్వేతమణి విశేష'మని నిఘంటువులు చెప్తాయి. అంటే ఒకరకం తెల్లటిరాయి అని. మౌక్తికమనే సంస్కృత శబ్దం ముత్యమనే (pearl) తెలుగుమాట నుంచే పుట్టిందనేవాళ్ళున్నారు. ప్రవాళం (coral) అనేదానికి తెలుగుపేరు పగడం. అది కేవల దేశ్యంకాదనీ సంస్కృత భవమనీ చెప్పాలి. నవరత్నాలనే వాటిలో ఇవి పోగా మిగిలినవాటికి తెలుగులో పేర్లున్నాయి. అవి మాణిక్యానికి (ruby, carbuncle) సమంగా కెంపు, మరకతానికి (emerald) తుల్యంగా 'పచ్చ' అనేవి. ఈ కాలానికి ఈ మణులన్నిటినీ కృత్రిమంగా తయారుచేస్తున్నారు. వాటిలోకూడా స్వచ్ఛతలో భేదాలుంటున్నాయి. జాతిగల రత్నమయితే శుభ్రమైన గాజుగ్లాసులో నీళ్ళు నింపి అందులో పడవేస్తే తన సహజమైన రంగును ప్రదర్శిస్తుందనీ, తక్కువ వెలుతురులో కూడా బాగా వెలిగిపోతూ కనిపిస్తుందనీ చెప్తారు.

రంగునుబట్టి తెలుగులో 'పచ్చ' అనిపిలిచే మణిని సంస్కృతంలో మరకతం, అశ్మగర్భం, హరిన్మణి అనిపిలుస్తారు. మరకత శబ్దానికి 'మరతక'మనే రూపాంతరముంది అది రాతి మధ్యలో (అశ్మగర్భంలో) దొరుకుతుంది కాబట్టి అశ్మగర్భమన్నారు. అదీ పసుప్పచ్చగా ఉంటుంది కాబట్టి హరిన్మణి (హరిత్+మణి) అని పిలిచారు. మరకతమనేదే సంస్కృతంలో దానికి సహజమైన పేరు. దీన్ని 'గారుత్మతం' అని కూడా పిలుస్తారు. దానికి సరైన తెలుగు అనువాదం 'గరుడపచ్చ'. అంత మంచిది కాని – అంటే జాతితక్కువైన – పచ్చను 'పేరోదనం' అంటారు తెలుగులో ఈ మాటకు "పేరాజం, పేరోజం" అనే రూపాంతరాలున్నాయి. కృత్రిమంగా తయారుచేసిన పచ్చను "మందాలి" అని పిలుస్తారు. ఈ మాటకు "పచ్చపట్టు చీరె" అనే మరో అర్థం కూడా ఉంది. ఇది విదేశాలనుంచి దిగుమతి అయిన వస్తువు కాబట్టి పేరుకూడా దేశ్యంకాదు. అయినా నిఘంటువులు అచ్చతెలుగంటాయి!

ఎఱ్ఱరాతిని తెలుగులో 'కెంపు' అంటారు. దాన్ని సంస్కృతంలో 'పద్మరాగం, లోహితకం, శోణరత్నం' అని పిలుస్తారు. ఎఱ్ఱతామర రంగులో ఉంటుంది కాబట్టి పద్మరాగమన్నారు. లోహితం అంటే ఎరుపు. ఎఱ్ఱని రంగుబట్టి లోహితకమన్నారు. శోణమంటే నెత్తురు. ఆ రంగులో ఉన్న రాయి కాబట్టి శోణరత్నమన్నారు. వన్నె తక్కువైన కెంపును తెలుగులో 'కరపక్క' అని పిలుస్తారు. కృత్రిమంగా తయారుచేసిన

కెంపును 'రవాయి' అంటారు. కెంపులోని మకిలను 'కుచ్చె' అంటారు. సావబట్టి కుచ్చెను తొలగించిన కెంపును 'చొక్కం' అంటారు. ఆ మాటకు 'స్వచ్ఛమైన' అనే విశేషణార్థముంది. కెంపునుంచి వచ్చే ఎర్రటి కాంతిని 'ఓడి' అంటారు. ఆ కాంతి బాగా ఎక్కువగా ఉంటే దాన్ని 'మొక్కలి' అంటారు. ఈ మాటకు 'మొక్కాలి' అనే రూపాంతరం కూడా ఉంది. కెంపు వన్నెను ఎండలో పరీక్షిస్తారు. అయితే అన్ని సమయాల్లోనూ ఎండలో ఉంచి చూడరు. వన్నె పరీక్షించటానికి వాటంగా అనుకూలంగా ఉండే ఎండను/వెలుతురును 'పాటం' అంటారు.

'ముత్తియం, ముత్తెం, ముత్యం' అనేది తెలుగుమాట. దీన్ని సంస్కృతీకరించి 'ముక్త, మౌక్తికం' అని సంస్కృతంలో వాడుతున్నారనే వాదముంది. సముద్రంలో దొరికే వస్తువుకాబట్టి ఆర్యసమాజమున్న ఉత్తర హిందూస్థానంలో ఈ వస్తువుకు సొంత పేరుండటం సాధ్యంకాదని ఈ వాదం పుట్టింది. మౌక్తికమనేది ముక్తా శబ్దానికి తద్ధిత రూపమేగాని వేరుమాటకాదు. 'అణిముత్య'మనేది తెలుగుసమాసం. అణి అంటే గుండ్రదనం. ఈ శబ్దానికి 'అణియం, అణెం, అనె' అనే రూపాంతరాలున్నాయి. దద్దురులాగా గుండ్రంగా ఉండే ముత్యాన్ని అణిముత్యమనీ మంచిముత్యమనీ అంటారు. గుండ్రంగా ఉండే ముత్యమే శ్రేష్ఠమని భావిస్తారు. అందుకే 'అణిపూస' అనే సమాసాన్ని శ్రేష్ఠార్థంలో వాడుతుంటారు.

మరీ గుండ్రంగా చక్కగా ఉన్న ముత్యాన్ని 'కట్టాణి (ముత్యం)' అంటారు. అది మొదటి తరగతి వస్తువు కింద లెక్క. తెల్లగా ఎక్కడా నలకగాని మచ్చగాని లేకుంటే 'నుపాణి' అంటారు. ఈ మాటకు 'నుప్పాణి' అనే రూపాంతరముందని, దాన్ని 'నుప్ప+పాణి' అని విభజించాలని, ఆ మొత్తానికి శుభ్రమైన నీరనే అర్థముందని చెప్పేనిఘంటువులు 'నుప్ప'కు అర్థమేమిటో చెప్పటమేలేదు! ముత్యం పైభాగం గతుకులు గతుకులుగా అసమంగా ఉంటే దాన్ని వొగ్గి (ముత్యం) అంటారు. కృత్రిమంగా తయారుచేసిన ముత్యాన్ని 'చిన్నముత్యం' అంటారు.

తెలుగులో వాడే పగడం అనేమాట సంస్కృతంలోని ప్రవాళ శబ్దాన్నించి పుట్టిందని చెప్తారు. తెలుగులో పగడానికి పర్యాయపదంగా 'సిరాజి' అనే మాట ఉందని, అదో 'దేశం' పేరనీ, అక్కడినుంచి వచ్చిన పగడానికి ఆ పేరే ఉంటుందనీ నిఘంటువులు చెప్తాయి. ఈ సిరాజి అనేది 'నారాజీ/నరాజీ' లాంటిదని నిఘంటువులెందుకు పేర్కొన్నాయో తెలీదు. నారాజి శబ్దానికి 'కత్తి' అని అర్థం. సంస్కృతంలోని ప్రవాళ శబ్దానికి విద్రుమమనేది పర్యాయపదమంటారు. విశేషమైన ద్రుమం (చెట్టు) కాబట్టి విద్రుమమన్నారు. ప్రవాళ విద్రుమ శబ్దాలు రెంటికి 'చిగురు' అనే అర్థం సామాన్యంగా ఉండటం విశేషం. చిగురు రంగులో ఉండేది కాబట్టి ఈ పేర్లు పుట్టివుంటాయి. పగడం బరువును 'కణుజు'ల్లో చెప్తారు.

నీలాన్ని తెలుగులో 'కప్పురాయి' అంటారు. కప్పు శబ్దానికి 'నలుపు, మసక' అనే అర్థాలు కూడా ఉన్నాయి. ఒకరకం తక్కువ జాతి నీలాన్ని 'గాతువు' అంటారు. మాటయితే అచ్చతెలుగనిపిస్తున్నది గాని దాని మూలార్థం తెలియటంలేదు. రత్నానికి 'రతనం', మాణిక్యానికి 'మానికం' తద్భవ రూపాలు. ఇవి ఏ ఖరీదయిన రాయికయినా సాధారణ నామధేయాలు కావచ్చు.రంధ్రం వేస్తేవాటిని 'పూస'లంటారు. స్ఫటికమనే తెల్లని స్వచ్ఛమైనరాయి .ఉంది. అది నవరత్నాల్లో చేరదుగాని తావళాల్లో ప్రశస్తంగా

వాడుతారు, ముఖ్యంగా శైవులు. దాన్ని 'పటిక (రాయి)' అంటారు తెలుగులో – తద్భవ రూపంలో.

వజ్రమనే సంస్కృత శబ్దానికి తెలుగు సమానార్థకం 'రవ/రవ్వ'. ఆ మాటకు 'వెలుగు, ప్రకాశం' అనేది మూలార్థం. వజ్రానికి 'మూలరాయి, మగరాయి, మగమానికం, గురుజరాయి, తరువు' అనే తెలుగు పర్యాయపదాలున్నాయి. మూల అంటే కోణం. సానబెట్టి చెక్కిన తరవాత వజ్రానికి ఎన్నో కోణాలూ అంచులూ వస్తాయి. వాటివల్లనే దాని ప్రకాశం పెరుగుతుంది – కాంతికిరణాల పరావర్తనంవల్ల. అందుకే మూలరాయి అన్నారు. అన్నిటిలోకీ ఖరీదైనదీ, గట్టిదీ వజ్రం కాబట్టి దాన్ని 'మగ'రాయి, 'మగ'మానికం అన్నారు. మగ శబ్దానికి 'శక్తిమంతమైన, శ్రేష్ఠమయిన' అనే విశేషణార్థాలు కూడా ఉన్నాయి. మిగిలిన రెండు పేర్లూ ఎందుకు వచ్చాయో చెప్పలేం. వజ్రం ప్రమాణాన్ని 'మంజాడి' అంటారు. వజ్రాన్ని ప్రమాణంగా తీసుకొని ఇతర శిలల కాఠిన్యాన్ని చెప్తారు. వజ్రకాఠిన్యం 10. ఇసకరాయిది 1. మణిపూసలకు పోటీగా ఇప్పుడు రకరకాల గాజుపూసలు అనేక రంగుల్లో తయారవుతున్నాయి. గాజు తెలుగు మాట. దానికి మూలం 'కాచ'మనే సంస్కృతపదం. దానికి 'క్షార'మనే మరో సంస్కృత శబ్దం పర్యాయపదమంటారుగాని దానికి 'ఉప్పుకారం, బూడిద' వగైరా ఇతరార్థాలున్నాయి.

## ఆవు, దూడ

గొడ్లన్నిటిలోనూ భారతీయులం గోవును పవిత్రంగా భావిస్తాం. ఆర్యసమాజంలో అది సంపద కిందే లెక్క. పశుసంపద అని ప్రత్యేకించిచెప్పటం కద్దు. 'గొడ్డూ గోదా' అనే మాటలో ఆవులనూ ఎద్దులనీ ప్రస్తావిస్తారు. మొదట ఆవు అనే మాటకున్న తెలుగు పర్యాయపదాలను స్మరిద్దాం. అవి 'తొఱ్ఱు, గిడ్డి, తొడుకు, మొదవు, పసి, పసరం' అనేవి. వాటికి తుల్యమైన సంస్కృతశబ్దాలు 'సహి, మాహ, మాహేయి, సురభి, సౌరభేయి, గోవు, ఉస్ర, మాత, శృంగిణి, అర్జుని, అఘ్న్య, రోహిణి' అనేవి.

తెలుగుమాటలన్నిటిలోనూ ఆవు శబ్దానికే బహుళవ్యాప్తి ఉంది. ప్రాచీనాంధ్ర శాసనాల్లో 'తొఱ్ఱు' అనే మాట కనిపిస్తుంది. మధ్యకాలపు శాసనాల్లో మొదవు శబ్దం బహుళప్రయోగంలో కనిపించేది. దాని బహువచన రూపాలు 'మోదలు, మోదొలు' అని రకరకాలుగా ఉండేవి. తొఱ్ఱు శబ్దం రాయలసీమ శాసనాల్లో, మొదవు శబ్దం కోస్తా శాసనాల్లో కనిపించేవి. ఈ కాలానికి ఆవు అనేదే సర్వసాధారణ శబ్దమయింది తెలుగులో. తొడుకు అనే మాట పుస్తకాల్లో మాత్రమే – అదీన్నీ ఎక్కడో మారుమూల – కనిపిస్తుంది. గిడ్డి శబ్దం వేలుపుగిడ్డి (కామధేనువు) అనే సమాసంలో ఎక్కువ వ్యాప్తి కలది. పసి శబ్దం బహుశా పశు శబ్దభవం కావచ్చు. పసరమనే మాటకు గొడ్డు అనే సామాన్యార్థంకూడా ఉంది. తొడుకు శబ్దానికి దొంగమేత అనే అర్థం కూడా ఉంది. ఆవు శబ్దంలోని 'ఆ' అన్నంతవరకే ఒకప్పుడు

ఆవు, ఎద్దు అనే రెండర్థాల్లోనూ సమానమైన పదంగా వాడుకలో ఉండేదంటారు. అందుకే 'అబోతు'లో ఆ(వు), పోతు(మగది) అనే రెండు మాటలూ ఉన్నాయి.

వయసులో చిన్నదైన ఆవును "క్రేపు, పడ్డ, దూడ, లేగదూడ, పెయ్య" అనే తెలుగుమాటల్లో చెప్పవచ్చు. క్రేపు శబ్దం ప్రాచీనాంధ్రకావ్యాల్లో మాత్రమే వినిపిస్తుంది – కనిపిస్తుంది. తొలిచూలు ఆవునుగాని గేదెనుగాని 'పడ్డ' అనిపిలుస్తారని నిఘంటువులు చెప్తాయిగాని, 'దున్నపడ్డ' లాంటి ప్రయోగాలు వాడుకలో వినిపిస్తాయి. దూడ అనేది సర్వసాధారణ పదం. అది ఆవుదూడ కావచ్చు; బర్రె దూడకావచ్చు. లేగ అంటే చిన్నది, లేతది అనే అర్థం కూడా ఉంది. అందుకే లేగదూడ అనే సమాసం పుట్టింది. పాలు విడిచిన ఆడ దూడను పెయ్య అనాలని నిఘంటువులు నిర్దేశిస్తాయి. పాలుతాగుతూ ఉన్నది లేగ; మానివేసింది పెయ్య. ఒక పట్టాన పాలుపితకనీక ఏడిపించే ఆవును తెలుగుమాటల్లో 'అర్ర, అరవ, బర్రియ, బర్రె' అనే వాటిలో దేనితోనయినా పిలవ్వచ్చు. మొదటిరెండు పదాలూ, తరవాతి రెండు మాటలూ పరస్పరం రూపాంతరాలు. అరవ/అర్ర అనే మాటక్కు 'పొగరుబోరు/బోతు, దుష్ట' అనే అర్థాలున్నాయి. పాలివ్వని ఆవును గొడ్డుటా వంటారు. దూడకు పాలుకుడిపే ఆవును లేగటా వంటారు. గోరోజనం రంగులో ఉండే ఆవును పల్లావు, కవిల అని పిలుస్తారు. కవిల శబ్దం సంస్కృతంలోని కపిల శబ్దభవం. పోట్లావును 'గోవావు' అని కూడా పిలుస్తారు (గోవు, ఆవు – అనే రెండుమాటలూ కలిపి!)

మహి, మహ, మాహేయి అనే మూడు మాటలూ పరస్పరం దగ్గరి పదాలు – వీటన్నిటికీ మహచ్ఛబ్దంతో (గొప్పది అనే అర్థంలో) సంబంధముంది. మహీశబ్దానికి భూమి అనే అర్థం కూడా ఉంది. భూమినీ ఆవునూ ఒకరితో ఒకర్ని పోల్చటం, సమంగా ఆరాధించటం ఆర్యసమాజంలో ప్రధానం. సురభి, సౌరభేయీ శబ్దాలు అన్యోన్య సంబంధులు. కామధేనువును సురభి అని పిలుస్తారు. అది దేవలోకంలో ఉంటుందట. ఆ సురభి సంతానం సౌరభేయి. గో(వు) శబ్దానిక్కూడా భూమి అనే మరో అర్థముంది. ఆవును తల్లితో (భూ–మాతతో) సమంగా గౌరవిస్తారు కాబట్టి ఏకంగా 'మాత' అనికూడా కొందరు వ్యవహరించారు. శృంగం అంటే కొమ్ము. శృంగిణి అంటే కొమ్ములున్నది అనే అర్థంలో ఆవుకు పేరయింది. అర్జుని అంటే బహుశా తెల్లావు కావచ్చు; నల్లావూ కావచ్చు. అర్జున శబ్దానికి తెల్లని అనే విశేషణార్థముంది. అయితే అర్జునుడు నల్లటివా డంటారు. అలాగే పేరుకు తెల్లటిదయినా రూపంలో నల్లది కావచ్చు. అర్జున శబ్దానికి కసవు, గడ్డి అనే అర్థాలూ ఉన్నాయి కాబట్టి గడ్డి తినేదనే అర్థంలోనైనా ఆ మాట ఏర్పడివుండవచ్చు. రోహిణీ శబ్దానికి 'తెల్లచంద్ర (మొక్క)' వంటి అర్థం కూడా ఉంది. బహుశా తెల్లదని, లేదా తెల్లగొడ్డని ఆ పేరుతో పిలిచి ఉంటారు. ఆవుదూడను రోహిణేయ మంటారు.

జాతిగల ఆవును సంస్కృతంలో 'నైచికి' అంటారు. చుక్కలున్న ఆవును 'శబలి' అంటారు. శబల శబ్దానికి 'రంగురంగుల' అనే విశేషణార్థముంది. పొట్టి ఆవును 'వామని' అంటారు. తెల్లగా ఉంటే 'ధవల' అనీ, పుల్లావునయితే 'కపిల' అనీ పిలుస్తారు. కపిలగోవు పరమ పవిత్రమని విశ్వాసం. పోట్లావును 'కరట, సుకత' అనే పేర్లతో పిలుస్తారు. గొడ్డుటావును 'వశ, వంధ్య' అనే పేర్లతో పిలుస్తారు. వెదలో

ఉన్న ఆవును 'సంధిని' అంటారు. ఆ కాలంలో దాటించగా ఈచుకపోయిన ఆవును 'వేహత్తు, గర్భోపఘాతిని' అంటారు. సహజంగానే ఈచుకపోతే 'అవతోక, ప్రదగ్గర్భ' అనేవారు. దాటింపునకు సిద్ధమైన ఆవు 'ఉపసర్య'. సాధువయిన ఆవును 'అచండి, సుకర' అనే పేర్లతో పిలిచేవాళ్లు. చాలా ఈతలీనిన ఆవును 'బహుసూతి' అనిగాని, 'పరేష్టుక' అనిగాని పిలుస్తారు. తరపి ఆవును 'చిరసూత' అనో, 'బష్కయణి' అనో పిలుస్తారు. లేగటావునే 'ధేనువు' అంటారు. ఏడిపించకుండా పాలుపితకనిచ్చేదాన్ని 'సువ్రత' అంటారు. లేదా 'సుఖసందోహ్యా' అంటారు. పెద్దపొదుగున్న ఆవు 'పీనోధ్ని'గాని 'పీవరస్తని'గాని కావచ్చు – వీటా ఈనే ఆవును 'సమాంసమీన' అనేవాళ్లు. కుండవిండా పాలిచ్చే ఆవు 'ద్రోణక్షీర, ద్రోణదుఘ'.

ఆవుల మంద ఉండేచోటును 'గోకులం, గోధనం' అని పిలుస్తారు. మందనేమో 'గవ్య' అనిగాని, 'గోత్ర' అనిగాని పిలిచేవాళ్లు. దూడల మందను 'వాత్సక'మనీ లేగదూడల గుంపును 'ధైనుక'మనీ పిలిచేవాళ్లు. అప్పుడే పుట్టిన దూడను తర్ణకం అంటారు. ఏడాదిలోపు వయసున్న దూడను 'వత్సం' అనిగాని, 'శకృత్కరి' అనిగాని అనటం కద్దు. తొలియీత ఆవును 'ప్రష్ఠౌహి' అనేవాళ్లు. ఇవి సంస్కృతపదాలు. తెలుగుమాటల్లో ఆవులను కట్టివేసే కొట్టామును 'తొౖరుపట్టు, దొడ్డి' అనే పేర్లతో పిలుస్తారు. అయితే మొదటి మాటకు ఈ కాలంలో వాడుకలేదు. ఆవుల గుంపును 'మంద' అనిగాని, 'కదుపు' అనిగాని, 'పదుపు' అనిగాని పిలుస్తారు. ఆవులేగాక ఒకేరకం ఇతర పశుపక్ష్యాదులు ఒకేచోట మందకట్టినప్పుడు కూడా కదుపు శబ్దం వాడవచ్చు. పదుపు శబ్దానికి 'పదుపు, పదుగు' అనే రూపాంతరాలున్నాయిగాని ఆ మాటలకిప్పుడు వాడుక ఉన్నట్లులేదు. బహుశా 'పది' (అంటే 'చాలా') గొడ్లు చేరిన సందర్భంలో ఈ మాట పుట్టివుండవచ్చు.

## వృషభం

ఆర్య సమాజంలో ఆవు పవిత్రమైన జంతువు. ఎద్దు బలానికీ ఉపయోగానికీ చిహ్నం. సంచార దశ నుంచి వ్యవసాయదశకు మారిన ఆ సమాజం ఈ రెంటినీ మచ్చికచేసుకొంది. వీటికున్న వ్యాప్తి బర్రెకు దున్నకూ లేదు. కారణం వారి మొదటి స్థావరం చలిదేశమై తెల్లగొడ్డు బతకడానికి ఎక్కువ అవకాశమిచ్చేది కావటమే. ఒకవిధంగా చెప్పాలంటే నల్లగొడ్డు ద్రావిడ జంతువు; ఎర్రగొడ్డు ఆర్యజంతువు!

తెలుగులో ఎద్దు అనేది ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట. బహువచనంలో దానికి ఎద్దులు, ఎడ్లు అనే రెండు రూపాలున్నాయి. ఆ మాటకు "ఆలపోతు, ఆబోతు, బసవడు, గిబ్బ, గిత్త, కోడె, గోద, పసి" అనేవి పర్యాయపదా లంటారు. వీటిలోని మొదటి రెండు మాటలూ సమాసాలు. ఆ రెంటిలో రెండోదే ఎక్కువగా వాడుకలో ఉన్నమాట. ఆవుల్లో పోతు (అంటే మగది) అని చెప్పాలి. పోతుటీగ అన్నట్లు పోతుటావు అని ఎందుకు అనలేదో చెప్పలేం. ఆవు శబ్దానికి తొలిరూపం ఆ. వాటిలో

మొగదయిన ఎద్దును అబోతు అన్నారు. దీనికి సమానమైన సంస్కృతపదం గోవృషం. ఖచ్చితంగా చెప్పాలంటే గోవులకు (ఆవులకు) సంతానం కలిగించేది (వృషం) కాబట్టి గోవృషమన్నారు. బసవడనేది శివుడి వాహనమనే పురాణకథ మీద ఆధారపడి వచ్చిన పేరు. గిబ్బ అనేది మామూలు ఎద్దుకాదు – అచ్చుబొట్టు అన్నమాట. అచ్చుపోసి విడిచిన 'అంబోతు' (అబోతుకు రూపాంతరం)ను ఈ పేరుతో పిలుస్తారు. వయసులో చిన్న వాటిని గిత్త, కోడె అంటారు. గిత్త మరీ చిన్నది. కోడె వయసుకు వస్తున్నది. కోడె వయస్సంటే యుక్త వయస్సు. సంసార యోగ్య వయస్సు. పసి అనేమాట గొడ్డు అన్నట్లు సామాన్యపదం. సంస్కృతంలోని పశుశబ్దభవం. గోద అంటే ఎద్దు. ఈ మాట ఇప్పటి వాడుకలో విడిగా వినిపించదు. శ్రీనాథుడు శివుణ్నే 'ముదిగోదనెక్కి భిక్షాటనం' చేసేవాడంటాడు. గొడ్డూగోదా అనే పదబంధంలో ఇది నేటికీ వ్యవహారంలో ఉన్నమాటే. ఇవి సాధారణ పదాలయితే అచ్చ తెలుగు కవులు 'మూపురము తాల్పు, ముక్కంటి మావు' వంటి కృతకనామాలు వాడారు!

ఎద్దు శబ్దానికి పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృత పదాలు "ఉక్షం, భద్రం, బలీవర్దం, ఋషభం, వృషభం, వృషం, అనడ్వాహం, సౌరభం, సౌరభేయం, ఉస్ర, గోవు" అనేవి. గోశబ్దం అటు ఆవుకూ ఇటు ఎద్దుకూ పేరుగా ఉండబట్టే అబోతును గోవృషమని పిలిచారని గుర్తించాలి. ఉక్ష శబ్దానికి వీర్యవంతమయినది, బలం కలది, (ఆవులకు) సంతానం ప్రసాదించేది అనే అర్థాలున్నాయి. వేదమంత్రాల్లో ఉషోదేవి (అంటే తెల్లవారుజాము అనే దేవత) ఎక్కిన రథాన్ని ఉక్షం (ఎద్దు) లాగుతుంటుందనే వర్ణనలున్నాయి. భూమిని గోవుగా భావించిన ఆర్యులు ఉషఃకాలంలో కనిపించే వెలుతురును ఎద్దుగా భావించారన్నమాట. అప్పటి ఎర్రదనాన్ని గమనించి ఈ మాటకు రూపాంతరమనిపించే ఉస్ర శబ్దానికి ఎర్రావు, ఎర్రెద్దు అనే అర్థాలను కల్పించుకున్నారు. ఆ మాటకు 'ఉదయకాంతి' అనే అర్థవిశేషం కూడా ఉంది. భద్రం అంటే మేలయినదని, శుభస్కరమనీ అర్థం. బలీవర్దం అంటే చాలా బలం గలిగినదని అర్థం. మనవాళ్ళకు అశ్వశక్తి (horse power) అనే మాట శక్తికి ప్రమాణంగా పాశ్చాత్యుల ద్వారా సంక్రమించింది. వాళ్ళు మనం ఎద్దులను పొలం దున్నడానికి వాడినట్లు గుర్రాలను వాడేవాళ్ళు. అందువల్ల వాళ్ళు అశ్వాల శక్తిని గుర్తించారు. మన సంప్రదాయం ఆ ఘనతను ఎద్దుకిస్తుంది.

ఋషభమనే మాటకు ఉత్తమమని అర్థం. ఏ పురుష జాతి జంతువునయినా ఈ పేరుతో పిలవచ్చు. వృషం, వృషభం అనేవి రూపాంతరాలు. వృషమంటే వీర్యశక్తి గలదని అర్థం. వృషణమనే మాటను ఇక్కడ అనుసంధించుకోవచ్చు. సురభి (అనే దేవతా ధేనువు) సంతానం కాబట్టి సౌరభం, సౌరభేయం అనే రూపాంతరాలతో పిలిచేవాళ్ళు. అనడ్వాహం అంటే బండిలాగే ఎద్దు. గోవు అనే మాటతో గూడా ఎద్దును సూచించవచ్చు. ఎత్తయిన పెద్ద ఎద్దును మహోక్ష మనేవారు. ముసలి ఎద్దును వృద్ధోక్షం, జరద్గవం అనే పేర్లతో పిలిచేవారు. ఈ రెండో మాట ఏ ప్రాణి విషయంలోనయినా వాడదగింది. జరవల్ల (ముసలితనం వల్ల) మెల్లగా నడిచే అనే విశేషణార్థం దీనికుంది. చిన్న ఎద్దును ఉక్షతరమనీ, గొడ్డుబోతును ఉక్షవేహంతమనీ పిలుస్తారు.

అప్పుడే పుట్టిన, ఇంకా పాలువదలని ఎద్దును తర్ణకం అని పిలుస్తారు. ఏడాదిలోపు గోదను శకృత్కారి, వత్సం అనే పేర్లతో పిలుస్తారు. అంతకన్నా పెద్ద వయసు వాటిని దమ్యం, వత్సతరం అనే పేర్లతో వ్యవహరిస్తారు. బరువులు మోయడానికి, పొలం దున్నడానికీ అనువయిన వయసులో ఉన్న వాటిని ఈ పేరున పిలవవచ్చు. బరువులు మోయగల వయసు వచ్చినా హుషారుగా ఉన్న ఎద్దును జాతోక్ష మంటారు. పట్టులు కొట్టదగిన వయసు వచ్చిన కోడెను ఆర్షభ్య మంటారు. అచ్చుబోసి విడిచిన ఆబోతును షండం, గోపతి, ఇట్చరం అనే పేర్లతో పిలుస్తారు. తెలుగువాళ్ళు దేవాలయాలకు ఆవులతోబాటు ఎద్దులను గూడా దానమిచ్చేటప్పుడు 'ఇన్న ఎడ్ల'ను మాత్రమే దానం చేసేవాళ్ళు. నల్ల ఎద్దులని ఆ మాటకు అర్థం చెప్పుకోవాలి.

## బర్రెలూ దున్నలూ

బర్రె దక్షిణాది జంతువు. ఈ తెలుగుమాటకు "ఎనుము, గేదె, ఎనుపెంటి" అనేవి పర్యాయపదాలు. ఎనుము అంటే (ఇనుము లాగా) నల్లటిదని అర్థం. ఎనుముపెంటి అంటే పెంటి (ఆడది) అయిన ఎనుము (నల్లగొడ్డు). గేదె శబ్దం ఉత్తరకోస్తాలో బర్రె శబ్దం పశ్చిమాంధ్రదేశంలో ఎక్కువ వాడుకగల ప్రాంతీయమాండలిక పదాలు. సంస్కృతంలో దీనికి పర్యాయపదం ఒక్కటే మహిషి అనేది. పట్టపురాణి అనే అర్థం కూడా ఈ మాటకుండటం విశేషమే. బర్రె దూడను సంస్కృతంలో కయాహ మంటారు.

దున్నకు "దుంత, ఎనుబోతు, దున్నపోతు, పోతు" అనేవి పర్యాయపదాలంటారు. కానీ నిజానికి దుంత అన్నదొక్కటే అలాంటిది. ఈ మాట ఇప్పటి వాడుకలో లేదు. పోతు మొగది అనే అర్థం గల మాట. దున్నకంలో పనికి వచ్చేది కాబట్టి దున్న అనిఉంటారు. 'మహిషం, ులాయం, కాసరం, సైరిభం' అనేవి సంస్కృత పర్యాయపదాలు. కాసరం అనేది కారు దున్న. కారెనుబోతు అనిపిలిచే అడవి దున్న పేరు. సైరిభమంటే దున్నకానికి పనికివచ్చే దున్న అని అర్థం. ులాయమంటే బండిలాగే దున్న.

## ఇతర జంతువులు

పాలకోసం, మాంసంకోసం పెంచుకొనే జంతువుల్లో మేకలూ, గొర్రెలూ ముఖ్యమైనవి. మేక విషయంలో పరంపరగా ఒక తప్పు ప్రయోగం వినిపిస్తుంది. ఏనాడు ఎవరు మొదలుపెట్టారోగానీ రాశులను చెప్పేటప్పుడు 'మేషం మేక, వృషభం ఎద్దు...' అని ఒప్పచెప్పించేవారు పూర్వం! మేషశబ్దానికి గొర్రె అనే అర్థమేగాని

మేక అనే అర్థం ఎన్నడూ లేదు – ఏ నిఘంటువులోనూ. గొర్రెబొమ్మ వేసి 'గోట్ మార్క్' బనియన్ల అమ్మకాన్ని ప్రచారం చేసుకొనే ఓ గుడ్డల మిల్లుంది! ఇలాంటి పొరపాట్లు ఎందుకు వస్తాయో చెప్పలేంగానీ అలవాటయిన తరవాత వాటిని దిద్దుకోవటం కూడా చాలా కష్టం. మేకలూ గొర్రెలూ భిన్నజాతి జంతువులనీ, వాటిలో ఏ జాతికాజాతిలో ఆడమగ భేదాలున్నాయనీ గుర్తించకుండా ఇలాంటి పొరపాట్లు అలవాటు కావటమే విచిత్రం!

మేక శబ్దానికి అది ఆడదయితే సంస్కృత పర్యాయపదాలు "అజ, ఛగలం, ఛగలిక, ఛాగి" అనేవి; మగదయితే "అజం, ఛాగం, ఛగం, ఛాగలం, ఛగలకం, తుభం, బస్తం" అనేవి. తెలుగులో మగదాన్ని మేకపోతు, ఆడదాన్ని ఆడమేక అంటాంగాని, రెంటికీ సాధారణనామం మేకే. మగదాన్ని పోతు అని ప్రత్యేకించి చెప్తాం. మరో తెలుగుమాట ఉన్నట్లు లేదు. సంస్కృతంలోని అజ శబ్దానికి అనేకార్థాలున్నాయి – బ్రహ్మ, విష్ణువు, శివుడు, మన్మథుడు వగైరా. మందమొదలో ఉండేదనే అర్థంలో ఈ పేరు వచ్చిందంటారు. ఛగం, ఛగలం, ఛాగం, ఛగలకం అనేవి అన్యోన్యం రూపాంతరాలు. తుభ శబ్దానికి బలియిచ్చేదనే అర్థవిశేషముంది. మేకలమందను 'అజవి(క), అజైడకం, ఛాగకం' వగైరా పేర్లతో పిలుస్తారు. పూర్వకాలపు దానశాసనాల్లో అక్కడక్కడ 'ఇన్నమేక'లను (నల్లమేకలను) దేవాలయాలకు దానమిచ్చినట్లు కనిపిస్తుంది.

గొర్రె శబ్దానికి తెలుగులో "గొరియ (పోతు), ఏడిక, తగరు, పొట్టేలు" అనే పర్యాయపదాలున్నాయి. సంస్కృతంలో "ఉరభ్రం, ఉరణం, ఊర్ణాయువు, ఏడకం, మేషం, కురరి, మేఢ్రం, వృష్ణి" అనేవి పర్యాయపదాలు. గొరియ అనేది ప్రాచీనరూపం; గొర్రె తరవాతికాలానిది. ఏడిక శబ్దం సంస్కృతంలోని ఏడకశబ్దభవం. తగరనే మాట పూర్వకావ్యాల్లో కనిపిస్తుందిగాని ఇప్పటికి వాడుకనుంచి తొలగిపోయింది. పొట్టేలనే మాట మగగొర్రెకు మాత్రమే అన్వయిస్తుంది. ఆడగొర్రెను మేషి అంటారు సంస్కృతంలో. 'కదులుతూ ఉండేది, ఎదురుతిరిగేది, పోరాడేది' అనే అర్థాల్లో ఉరణం, ఉరభ్రం అనే మాటలు పుట్టాయి. ఊర్ణం అంటే ఉన్ని. దాన్ని ఇచ్చేది కాబట్టి ఊర్ణాయువన్నారు. అడవిగొర్రెను ఏడకమంటారు. కురరిఅనేది కొండగొర్రె. మేషశబ్దాన్ని గొర్రెకేగాక ఉన్నివంటి పదార్థ సామాన్యానికి కూడా పేరుగా వాడేవారు ప్రాచీన సంస్కృతంలో. మేఢ్ర శబ్దం ఇటు గొర్రెకూ అటు పురుషాంగానికీ పేరు. వృష్ణి శబ్దాన్ని గొర్రెకూ ఎద్దుకూ పేరుగా వాడేవాళ్లు. 'బలవంతమైన, పొగరెక్కిన, కోపదారి' మొదలైన అర్థాల్లో ఈ మాటకు ప్రయోగముంది. శ్రీకృష్ణుడు వృష్ణివంశంవాడు. అంటే గొర్రెలకాపరుల వంశంవాడని అర్థం. అగ్నిదేవుడి వాహనమట గొర్రె. అందుకే అచ్చతెలుగు కవులు "జంటమొగము వేలుపుతేజి" అని గొర్రెకు చాంతాడంత పేరు పెట్టారు. గొర్రెల మందను సంస్కృతంలో ఔరభ్రకం అంటారు.

సామాన్యులు ఆహారార్థం పెంచుకునే జంతువుల్లో పంది ఒకటి. పందికీ అచ్చతెలుగులో చాలా పేర్లున్నాయికాని వాటిలో చాలామటుకు కవులు కల్పించినవని చెప్పాలి. అవి వర్ణనాత్మక శబ్దాలు. "చప్పరింత, కొమ్ముకాడు, ఊటమెకం, వేపులమిత్తి, ముస్తెలమేపరి, మోటుమెకం, వాలుమెకం, ఒంటరి, ముట్టెమెకం, పీటవెట్టుమెకం, ఏకలం, గుర్గురింత, ఏదు" వగైరాలు చాలావరకు కల్పితసమాసాలేగాని

వ్యస్తనామాలుకాదు. ఏదు, ఏకలం అనేవి ముళ్లపంది పేర్లేగాని ఊరబంది పేర్లుకావు. సెలపంది, సలుగు అనే అచ్చతెలుగు మాటలు కూడా అడవిపందికి/ ముళ్లపందికి పేర్లే. ఒంటరి(కాడు) అనేదికూడా అడవిపందికే పేరు. లొట్టలు వేస్తూ తింటుంటుంది కాబట్టి చప్పరింత అన్నారు. కోర ఉన్న జంతువు కాబట్టి కొమ్ముకాడు అని పిలిచారు. చెమ్మలో తిరిగేది కాబట్టి ఊటమెకం అనే పేరు వచ్చింది. వేపి అంటే కుక్క. వాటిని చంపేదికాబట్టి వేపుల మిత్తి అనే పేరుపెట్టారు. మిత్తి అనేది మృత్యుశబ్దభవం. నేలకుళ్ళగించి దుంపలు పెకలించి తింటుంది కాబట్టి ముస్తెల మెకం. మొరటయింది కాబట్టి మోటమెకం. ముట్టెకలది కాబట్టి ముట్టెమెకం. గురకపెట్టుంది కాబట్టి గుర్గురింత. ఇలా పంది లక్షణాలను పురస్కరించుకొని కవి పండితులు అచ్చతెలుగు పేర్లు సృష్టించారు.

విట్చరం అనే సంస్కృత పదానికి ఊరబంది అని అర్థం. "వరాహం, సూకరం/శూకరం, గృష్టి/ఘృష్టి, కోలం, పోత్రి, కిరి, కిటి, దంష్ట్రి, ఘోణి, క్రోడం, స్తబ్ధరోమం, భూదారం" అనే మాటలు చాలావరకు ముళ్ళపందికి/అడవిపందికి అన్వయించేవే. కాకతీయుల కాలం నుంచి వరాహావతారంలోని విష్ణుమూర్తి బొమ్మను బంగారునాణేనికి ఒకవైపు ముద్రించటం అలవాటయింది. మాటలో కొంచెం మార్పువచ్చి వరాహశబ్దం 'వరహా'గా మారిపోయింది. ఆకాలంలో వరహా అంటే నాలుగు రూపాయలు (వెండినాణేలు). ఈ శబ్దం కూడా అడవిపందికేగాని ఊరబందికి పేరుకాదు నిజానికి. సూ/శూ అనే ధ్వని చేస్తుందని సూకర/శూకర నామం వచ్చిందని కొన్ని నిఘంటువులు చెప్తాయి. భయపెట్టేది కాబట్టి కిటి. కిరి శబ్దం దీనికి రూపాంతరం. కోల, క్రోడ శబ్దాలు 'బలిసినది, మెత్తనిది' అనే అర్థాల్లో 'కొవ్వుపట్టినది' అనే భావంలో పందికి పెట్టిన పేళ్లు. కోర ఉన్నది కాబట్టి దంష్ట్రి అన్నారు. ఘోణమంటే ముట్టె. పెద్దముట్టె కలది కాబట్టి ఘోణి అనే పేరు వచ్చింది. పోత్రమన్నా ముట్టే. ముట్టె గలది పోత్రి. రోమం అంటే వెంట్రుక. స్తబ్ధరోమం అంటే నిక్కబొడుచుకున్న వెంట్రుకలు/ముళ్లు. అందువల్ల ముళ్లపంది నీపేరుతో పిలిచేవాళ్లు. భూమిని తవ్వుతుంటుంది కాబట్టి భూదార మన్నారు. ఎప్పుడూ నములుతూ ఉంటుంది కాబట్టి గృష్టి/ఘృష్టి/ఘృష్వి అనే పేర్లు పెట్టారు.

ఆహారార్థం పెంచుకొనే ఈ జంతువులు కాక సేవల నిమిత్తం (పనిచేయించుకొనేందుకు) పెంచుకొనేవి మరికొన్ని జంతువులున్నాయి. అలాంటివాటిలో కాపలాకు పనికివచ్చే కుక్క, చాకిరీకి ఉపయోగపడే గుర్రం, గాడిదలున్నాయి.

## పెంపుడు జంతువులు

ఆస్తిపాస్తుల పరిరక్షణకూ, శత్రు సంచారాన్ని ముందుగా గుర్తించి కాపాడటానికీ మానవుడు మచ్చిక చేసుకొని పెంచే జంతువుల్లో కుక్క గొప్పది. ప్రతి భాషలోనూ కుక్కలను గురించి వందల సామెతలు దొరుకుతాయి. కుక్క అనేది అచ్చ

తెలుగు మాట కాదనీ, అది సంస్కృతంలోని కుర్కుర శబ్దభవమనీ సంప్రదాయ పండితులంటారు. ఆ మాటకు తెలుగు పర్యాయపదాలు లేకపోలేదు. "నాయి, వేపి, బేపి, జాగిలం, మొరుగుడు" అనేవి. నాయి శబ్దం కన్నడంలో మంచి వ్యాప్తిగల పదం. నన్నెచోడుడి కుమారసంభవంలో ఆ మాటకు మొదటి తెలుగు ప్రయోగం దొరుకుతున్నది. ప్రాంతీయంగా కన్నడ సరిహద్దుల్లో తప్ప ఇప్పుడా పదానికి తెలుగులో వాడుక లేదనే చెప్పాలి. వేపి, బేపి అనేవి రూపాంతరాలు. వాటికి కూడా రాయలసీమలోని కొన్ని ప్రాంతాల్లో, కళింగ ప్రాంతంలో కొన్ని చోట్లా ఈనాటికీ స్థానిక మాండలికాల్లో ప్రయోగముంది. జాగిల మనేది వేటకుక్కకు పేరు. మొరుగుడు అనేది వర్ణనాత్మకంగా వచ్చినపేరు. పొగరుబోతు కుక్కను 'గుబ్బి' అంటారు తెలుగులో.

కుక్కకు పర్యాయపదాలయిన సంస్కృత శబ్దాలు "కౌలేయకం, సారమేయం, కుర్కురం, కుక్కురం, శునకం, శ్వానం, భష(క)ం" అనేవి. ఉత్తమ జాతికి చెందిన జాతికుక్కను కౌలేయకం అంటారు. సరమా అనే దేవజాతి కుక్క సంతానం కాబట్టి సారమేయ మన్నారు. సరమా ప్రస్తావన ఋగ్వేదంలో కూడా వినిపిస్తుంది. ఆమె దేవశుని (దేవతా జాతికి చెందిన ఆడకుక్క) అని మహాభారత ప్రసంగం చెప్తుంది. గుర్రుపెట్టుంది కాబట్టి కుర్కుర మన్నారు. దాని రూపాంతరమే కుక్కురం. శునకం అంటే చిన్న కుక్క లేదా కుక్కపిల్ల. భషణం, భషితం అనే మాటలకు మొరుగుడని అర్థం. మొరుగుతుంది కాబట్టి భషం, భషకం అనే రూపాంతరాలతో వ్యవహరిస్తారు. శ్వానమనేది సంస్కృతంలో సాధారణపదం.

ఆడకుక్కలను 'శుని, సరమ, కుర్కురి, కుక్కురి, భషి' అని పిలుస్తారు. పిచ్చి కుక్కను సంస్కృతంలో అలర్కమంటారు. వేటకుక్కను విశ్వకద్రువు అని పిలుస్తారు. మామూలుగా ఇతర జంతువులమీదికి ఒంటికాలితో పోయి కరుస్తుంది కాబట్టి కుక్కను వర్ణనాత్మకంగా 'మృగదంశకం' అని చెప్తారు. తెలుగు వాళ్ళ సొంత సంస్కృతంలో కుక్కకు 'వత్సనాభి' అనే సంస్కృతనామ ముంది. దూడలను చంపుకొని తింటుంది కాబట్టి ఈ పేరు వచ్చిందని తెలుగు నిఘంటువులు వివరించడమేగాని సంస్కృత కోశాల్లో ఈ మాట కనిపించదు (ఇలాంటి సంస్కృతాన్ని అక్కిరాజు ఉమాకాన్త పణ్డితుడు 'దూడపేడ సంస్కృత'మనేవాడు!). మగకుక్కల గుంపును శునీరమనీ, ఆడకుక్కల గుంపును శున్యమనీ వ్యవహరిస్తారు.

చాకిరికోసం పేదలూ సామాన్యులూ పెంచుకొనే మరో జంతువు గాడిద. ఇదే అచ్చమైన తెలుగుమాట. దీనికి 'గాలిగాడు, చలువగుర్రం, రేవుజక్కి' అనే కల్పితనామాలున్నాయి పుస్తకాల్లో. దయ్యంలా అరుస్తుందని గాలిగాడన్నారు. చల్లని ఉతికిన గుడ్డలు మోస్తుంది కాబట్టి చలువగుర్రమని పేరు పెట్టారు. చాకలి రేవుకు (ఉతికే చోటికి) తీసుకొని పోయే వాహనం కాబట్టి రేవుజక్కి అని వెక్కిరించారు. శాంతానికి, సహనానికీ మారు పేరు గాడిద. బుద్ధి శూన్యతకూ మొండితనానికీ కూడాను. శ్రీనాథుడొకప్పుడు గాడిదల్లోనూ కవులుండవచ్చని అనుమానించాడు. బండ్లు లాగడానిక్కూడా గాడిదలనుపయోగిస్తారు. అందుకే 'గాడిద చాకిరి' అనే మాట పుట్టింది. సంస్కృతంలో గాడిదను "రాసభం, గర్దభం, గార్దభం, ఖరం,

బాలేయం" అని పిలుస్తారు. ఓండ్ర పెట్టేది కాబట్టి రాసభం, గర్దభం (గార్దభం) అనే పేర్లు వచ్చాయి. మొండిగా బండగా పనిచేస్తుంది కాబట్టి ఖర మన్నారు. తక్కిన పేర్లెందుకు పుట్టాయో స్పష్టంగా తెలీదు. గాడిదలు లాగే బండిని కూడా గార్దభం అనేవాళ్ళు. ఆడగాడిదను గర్దభి అంటారు. మరి 'అడ్డగాడిద'ను ఏమంటారో చెప్పలేం. గుర్రం గాడిదల సంతానాన్ని తెలుగులో 'కంచర గాడిద, వేసడం' అంటారు; సంస్కృతంలో అశ్వతర మంటారు. కంచరం/కచడం అనే బండినిలాగే గాడిద కంచరగాడిద. వేసరం - అంటే శ్రమపడేది - కాబట్టి తెలుగులో వేసడం, వేసరం అనేపేరుకూడా వచ్చింది.

విలువైన శ్రమజీవి గుర్రం. తెలుగులో 'బాబా, వారువం/వాపురం, జక్కి, తత్తడి, మావు, తేజి, ఎక్కిరింత, కత్తలాని, కత్తరాని, కత్తళడు' మొదలైన పేర్లున్నా గుర్రమనేది వాడుకలో నిలిచిన మాట. వారువం, జక్కి, ఎక్కిరింత, తత్తడి అనే మాటలకు వాహనం, మోసేది అనే అర్థమే ముఖ్యం. మేలుజాతి గుర్రాన్ని 'తేజీ' అంటారు. తెల్లటి గొరిజ, తోక, జూలు వున్న నల్లగుర్రాన్ని కత్తలాని/కత్తరాని/కత్తళుడు (కర్తలాణం అనే సంస్కృత శబ్దభవాలివి) అని పిలుస్తారు. పారబ్బి, తురికి, కచ్చి, పటాణి అనేవి ఆయా ప్రాంతాల నుంచి తెచ్చిన గుర్రాలకు పేర్లు. పొట్టిగుర్రాన్ని 'తట్టు' అంటారు. పొగరుబోతు గుర్రాన్ని తట్టువం అంటారు. మగ గుర్రాన్ని గుండు అని, ఆడ గుర్రాన్ని గోడిగ అని పిలుస్తారు. సర్వోత్తమం 'పంచకళ్యాణి' అని వాడుక. ఆ మాట నిఘంటువుల కెక్కలేదు!

సంస్కృతంలో "ఘోట(క)ం, వీతి, పీతి, తుర(ం)గ(మ)ం, అశ్వం, వాజి, వాహం, అర్వ, గంధర్వం, హయం, సైంధవం, సప్తి" వగైరా మాటలు గుర్రానికి పేర్లు. వీటిలో అశ్వ శబ్దానికే వాడుక ఎక్కువ. అర్వ శబ్దం వేదాల్లో కనిపిస్తుంది - వడి గలది అనే అర్థంలో తురంగాదులా అర్థంలోనే. హయం అంటే దౌడు తీసేది. యుద్ధాశ్వాన్ని వాజపేయం అంటారు. వాజ శబ్దానికి బలం, శక్తి, వేగం వంటి అర్థాలున్నాయి. సింధు ప్రాంతం నుంచి వచ్చింది సైంధవం. వాహం అంటే బండి గుర్రం. బరువులు మోసేది సప్తి. మేలు జాతిది అజానేయం. బండచాకిరికి పనికి వచ్చేది (పొలందున్నటంతో సహా) వినీతం. అశ్వమేధయాగానికి పనికి వచ్చే గుర్రాన్ని యయువంటారు. యవన(గ్రీకు) దేశం నుంచి తెచ్చిన గుర్రం జవనాశ్వం. అది వేగంగా పరిగెత్తేది. మోపుగుర్రాన్ని సంస్కృతంలో "పృష్ఠ్యం, స్థూరి/స్థోరి" అని పిలుస్తారు - స్థూలంగా ఉంటుందనే అర్థంలో తెల్లగుర్రాన్ని సితం, కర్కం అంటారు. బండికి కట్టేదాన్ని రథ్యమంటారు. ఆడగుర్రాన్ని వామి, బడబ, అశ్వ అని పిలుస్తారు. గుర్రాల్లో "ఇంద్రాయుధం, మల్లికాక్షం, శోణం, శ్రీవృక్షకి, హరితం, హలహలం, హేమం" మొదలైన రకాలున్నాయి. రంగునుబట్టి ఆ పేర్లు వచ్చాయన్నమాట.

పిల్లి అపశకునమని భావించే వాళ్లెందరున్నారో దాన్ని ప్రేమించి పెంచుకునే వాళ్లు అందులో సగంమందయినా ఉన్నారు. మధ్యతరగతి కొంపలకు ఎలుకల బాధను ఎంత సమర్థంగా తగ్గించి సంతోషపెట్టాయో పిల్లులు అంతగానూ విసిగిస్తాయి. పాలుతాగి మన చుట్టూ ఉండే పెంపుడు జంతువుల్లో పిల్లి అంత పరిశుభ్రంగా ఉండేది మరొకటి లేదు. పిల్లి శాపనార్థాలు పెడ్తుంటుందంటారు. దాని సంసారంలోకూడా

రహస్యం లేదు. పైగా జాతర. అందుకే పిల్లి శీలమనే మాట పుట్టింది. పిల్లి అనేదే ఎక్కువ వ్యాప్తిలో ఉన్న తెలుగు మాట. నిఘంటువుల్లో 'ఓతి' అనే మరో మాట కనిపిస్తుంది. దాని కీకాలంలో వాడుక లేదు.

సంస్కృతంలోని "ఓతువు, బిడాలం/విడాలం, మార్జాలం/మార్జారం, వృషదంశకం/వృషదంశకం, ఆఖుభుక్కు" అనేవి పిల్లికి పర్యాయపదాలు. ఓతు శబ్దానికి విశ్వసనీయమైన వ్యుత్పత్తి కనిపించదు. బిడాల శబ్దానికి 'బిడాలకం, బిడారకం; విడాలం' అనేవి రూపాంతరాలు. మార్జాలమనేది దాని గుణాన్ని వర్ణించే మాట. (ఎప్పుడూ శరీరం నాక్కుంటూ) పరిశుభ్రంగా ఉంచుకొనేదని అర్థం. వృషమంటే ఎలుక. దాన్ని కరిచి చంపేది కాబట్టి 'వృషదంశం, వృషదంశకం, వృషదంశం' అనే రూపాంతరాల్తో వర్ణించారు. ఆఖువంటే చిట్టెలుక. వాటిని తింటుంది కాబట్టి ఆఖుభుక్కన్నారు. 'రుద్రాక్షపిల్లి'గా మభ్యపెట్టనూ గలదు – 'చారుతరమూర్తి మార్జాల చక్రవర్తి' అని పద్యాలు రాయించుకోనూ గలదు.

పిల్లుల్లో రకాలున్నాయి. బావురుపిల్లి అనేది పెద్దది. అడవుల్లో ఉండేది. దాన్ని సంస్కృతంలో మహామార్జాల మంటారు. జంగపిల్లి, జంగురుపిల్లి అనేది మరో జాతి. దాన్ని జాంగలబిడాల మంటారు సంస్కృతంలో. ఈ రెండూ ప్రమాదకరమైనవి. 'పూతపిల్లి, బూతపిల్లి, పునుగుపిల్లి' అనే మరోరకం పిల్లి అపానవాయువునుంచి పునుగు అనే సుగంధద్రవ్యం దొరుకుతుంది. సన్నగా చెక్కిన గుంజలకు ఈ పిల్లిని కట్టి దాని విసర్జనలు గట్టిపడ్డ తరవాత గోకి తీసి పునుగని అమ్ముతారు. ఖరీదయిన వస్తువది. ఈ పునుగుకోసం ఈ పిల్లిని కొందరు పెంచుతారు. మరోరకం జవ్వాది పిల్లి. దాన్ని సంస్కృతంలో సంకువంటారు. అది విసర్జించిన పదార్థం సంకుమదం. అంటే జవ్వాది. దానికి రూపాంతరం జవ్వాజి. పునుగు, జవ్వాజులు మలిన వస్తువులయినా అవి గట్టిపడ్డతరువాత సువాసనలిస్తాయి కాబట్టి వాటిని సుగంధద్రవ్యా లంటారు.

వినోదంకోసం, విద్యలు నేర్పి తమ పొట్ట పోషించుకోవటం కోసం కోతులను పెంచేవాళ్లున్నారు. కోతి శబ్దానికి పూర్వరూపం క్రోతి – శబ్దపరంగా. అదే మానవ జాతికి మూలరూపమని జంతుశాస్త్రజ్ఞులంటారు. దాన్ని ముద్దుగా "తిమ్మడు, తిమ్మన్న, తిమ్మరాజు" అని వ్యవహరిస్తారు మామూలు జనులు. 'తిండికి తిమ్మరాజు పనికి పోతరాజు' వంటి సామెతలు పుట్టి తినటానికి తప్ప కోతులింకెందుకూ పనికిరావన్న అప్రతిష్ఠ తెచ్చిపెట్టాయి. కవులేమో 'వెక్కిరింత, కొమ్మ టెంకి మెకం' అనే పేర్లు పెట్టారు పూర్వం. వెక్కిరిస్తుంది కాబట్టి వెక్కిరింత. కొమ్మలే టెంకిగా – అంటే నివాసస్థలంగా – ఉండే జంతువు (మెకం) కాబట్టి ఇంతపొడుగు పేరు పెట్టారు. ఈ మాటలు పుస్తకాల్లోనేగాని జనవ్యవహారంలో వినిపించవు. తిమ్మన్న పేరు పెట్టుకున్న మహాకవులున్నారు మనకు!

కోతి శబ్దానికి పర్యాయపదాలని చెప్పదగిన సంస్కృత శబ్దాలు "కపి, ప్లవగం/ప్లవంగం, శాఖామృగం, వలీముఖం/ బలీముఖం, మర్క(ట)ం, వానరం, కీశం, వనౌకం" అనేవి. ఎప్పుడూ కదలాడుతూ, ఎగురుతూ ఉంటుంది కాబట్టి కపి అన్నారు. చెట్ల కొమ్మలమీద తేలుతూ ఎగురుతూ ఉంటుంది కాబట్టి ప్లవగం/ప్లవంగం అని

పిలిచారు. కొమ్మలమీద బతికే జంతువు కాబట్టి శాఖామృగమన్నారు. ముఖం వలితమై - అంటే ముడతలుపడి - ఉంటుంది కాబట్టి వలీముఖం/బలీముఖం అన్నారు. గాలిలో తేలుతూ ఎగురుతుంటుంది కాబట్టి మర్కమనీ మర్కటమనీ పిలిచారు. వనంలో - తోటలో - తిరుగాడేది కాబట్టి వానరమని కొందరు చెప్తే, నరుడేమో (మనిషేమో) అనిపిస్తుంది కాబట్టి వానరమని మరికొందరు వివరిస్తారు. 'వా' అనే సంస్కృతావ్యయానికి అనుమానార్థంకూడా ఉంది. పాపం! కట్టుగుడ్డలేక దిగంబరంగా తిరుగుతుంది కాబట్టి కీశమన్నారు. వనమే - అడవే - నివాసస్థలం కాబట్టి వనౌకమన్నారు. వేదాల్లో 'వృషాకపి' అనే మాట వినిపిస్తుంది. 'నరవానర'మని దానికర్థం చెప్పవచ్చని ఇటీవలి వాళ్లంటారు. అయితే సంప్రదాయంలో శివ విష్ణువులకేగాక అగ్నికి, ఇంద్రుడికీ, తదితరులకూ ఈ పేరుతో వేదవాఙ్మయంలో సంబంధముంది. మొత్తంమీద కపి శబ్దమే సంస్కృతంలో వ్యాప్తిగల ప్రాచీన శబ్దమని చెప్పవచ్చు.

కోతిని పెంచుకొనే కారణాలతోనే ఎలుగ్గొడ్డును పెంచి ఆడించి బతికే సాహసు లున్నారు. తెలుగులో దానికి 'ఎలుగు' అనేదే మామూలు మాట. బర్రెగొడ్డుకులాగా దానికీ గొడ్డు శబ్దం చేరుస్తుంటాం. దీనికి కవులూ పండితులూ 'పుట్టకూటి మెకం, బొచ్చుమెకం, వెనుచూపు మెకం, వెలినోటి మెకం' అనే పేర్లు పెట్టుకొని మురిసిపోతారేగాని ప్రజావ్యవహారంలో ఈ మాటలకు స్థానం లేదు. తేనెపట్టుల్లో చీమల పుట్టల్లో తిండి సంపాదించుకొనేదని మొదటి పేరు పెట్టారు. రెండో మాటను వివరించనక్కరలేదు - మూడోదాన్ని లాగానే. పెద్ద/తెల్ల నోరున్న జంతువు కాబట్టి చివరి పేరు వచ్చింది. రాయలసీమలో కన్నడ సరిహద్దుల్లో దీన్ని 'కళ్ళేగొడ్డు' అని వ్యవహరిస్తారు. అంటే 'దొంగ' గొడ్డని. దీనికి సంస్కృత పర్యాయపదాలని చెప్పదగ్గవి రెండే పదాలు - వాటికి రూపాంతరాలు చాలా ఉన్నాయి. భల్లం, భల్లకం, భాలూకం, భల్లుకం, భల్లూకం అనే రూపాంతరాలు గల శబ్దానికి శుభస్కరమైనదని అర్థం. మంచి శకునమని పూర్వార్యులు దాన్ని పరిగణించేవాళ్లు - ఇప్పటి రష్యన్లలాగా! ఋక్షం, అచ్ఛ మనేవి లెక్కకు రెండు మాటలనిపిస్తాయి గాని ఒకదానికొకటి రూపాంతరమేనని వాదించే వాళ్లున్నారు. ఆ మాటకు 'ప్రమాదకరమైన, బాధించే' వగైరా అర్థాలున్నాయి. ఋక్ష శబ్దానికి వేదవాఙ్మయంలో ప్రయోగ బాహుళ్యముంటే భల్లుక శబ్దానికి లౌకిక సాహిత్యంలో ఎక్కువ వ్యాప్తి ఉంది. భల్లూక శబ్దానికి 'కుక్క, కోతి' అనే ఇతరార్థాలుకూడా నిఘంటువుల్లో కనిపిస్తాయి.

మహారాజులు పోషించే జంతువుల్లో ఏనుగు గొప్పది. మామూలు మనిషికి కలలో గూడా సాధ్యంకాని పని అది. ఏనుగు అనే అచ్చతెలుగు మాటకు 'ఏనిక' అనే రూపాంతరముంది. దీనికి పర్యాయపదాలని చెప్పదగ్గ అచ్చ తెనుగు కవులూ పండితులూ కల్పించుకున్న మాటలు కొన్ని ఉన్నాయి. "సిబ్బెమేనిమెకం, గబ్బుచెంపమెకం, గొప్పయజ్జమెకం, ఎక్కుడు మెకం, చెయ్యిగల మెకం, రెండు త్రాగుడు, పలుగొమ్ములుడిగిన మెకం, గౌరు, హత్తి" మొదలైనవి. చిట్టచివరి మాట హస్తి అనే సంస్కృతపదానికి వికృతి. గౌరు శబ్దానికి గవురు అనే రూపాంతరముంది. గౌర/గవుర శబ్దాలకు వ్యాపారి అనే అర్థముంది. పెద్దవ్యాపారులకూ ఈ గౌరకూ

సంబంధముందో లేదో ఖచ్చితంగా చెప్పలేం. విశాలమైన శరీరంకలదని సిబ్బైమేసిమెక మనే మాటకర్థం. చెంపలనుంచి మదజలం కారి వాసన కొట్టుందని రెండోమాట వివరిస్తుంది. అజ్ఞ అంటే అడుగు, పాదం. పెద్దపాదాలున్న జంతువనే అర్థంలో గొప్ప యజ్ఞమెకమని పిలిచారు. ఎత్తయినది, ఎక్కాదగింది కాబట్టి ఎక్కుడు మెకమన్నారు. తొండమున్నది కాబట్టి చెయ్యిగలమెక మంటారు. నోటితో తొండంతో రెంటితోనూ (నీరు) తాగుతుంది కాబట్టి రెండు త్రాగుడన్నారు. 'రెంట' త్రాగుడని ఎందుకనలేదో, ఏవ్యాకరణ సూత్రం అడ్డువచ్చిందో తెలీదు. పొడుగుబారిన దంతం విరిగినప్పుడుగాని, ఒకటికి రెండు రకాలుగా ఉన్నపళ్ళున్నదనిగానీ పలుగొమ్ముల మెకమన్నారు. ఇదంతా కవిత్వమేగాని మామూలు మనుషులు వాడే తెలుగుకాదు.

ఏనుగు శబ్దానికి సంస్కృతంలో చాలా పర్యాయపదాలున్నాయి – "దంతి, దంతావళం, కరటి, హస్తి, ద్విరదం, ద్విపం, అనేకంప, మతంగజం, గజం, నాగం, కుంజరం, వారణం, కరి, ఇభం, స్తంబేరమం, పద్మి, మదోత్కటం, మదకలం, ప్రభిన్నం, గర్జితం, మత్తం, ఉద్వాంతం, నిర్మదం, మతంగం" వగైరాలు. వీటిలో తుండం/తొండం గల జంతువని వర్ణించేవి 'దంతి, దంతావళం, కరటి, హస్తి, కరి' అనే మాటలు. నోటితో, తొండంతో – రెంటితో తాగేదనే అర్థంలో కల్పించిన పదాలు 'ద్విపం, అనేకపం' అనేవి. రెండురకాల పలువరసగలది అని చెప్పేమాట 'ద్విరదం'. కొండల్లో తిరిగేది (నగాల్లో) కాబట్టి నాగం అన్నారు. ఈ మాటకనేక ఇతరార్థాలున్నాయి. తన ఇష్టం వచ్చినట్లు తిరుగుతుంది కాబట్టి 'మతంగం, మతంగజం' అని పిలిచారు. పెద్దగా ఘీంకరిస్తుంది (గర్జిస్తుంది) కాబట్టి గజం అన్నారు. ఎత్తయిన/దట్టమయిన గడ్డిపొదల్లో తిరుగాడుతుంది కాబట్టి స్తంబేరమమని పిలిచారు. తొండంమీద, చెవులమీద చుక్కలున్న జంతువు కాబట్టి 'పద్మి' అని పిలిచారు. చెవుల పక్కల నుంచి మదపు రసం కారుతుంటుంది కాబట్టి మదోత్కటమన్నారు – మదకల మనీ అన్నారు. ఘీంకరిస్తుంది కాబట్టి గర్జితమని కూడా పిలిచారు. మదించిన జంతువు కాబట్టి మత్తమన్నారు. తాగిన నీటిని తొండంతో పైకి చిమ్ముతుంది కాబట్టి ఉద్వాంతం (పైకిచిమ్మేది) అన్నారు. మదంలేని ఏనుగును 'నిర్మదం' అని పిలిచారు.

ఏనుగుల గుంపును 'హాస్తికం, గజత' అని పిలుస్తారు. సంస్కృతంలో ఆడతల్లిగా ఉన్న ఏనుగును 'కరిణి, ధేనుక, వశ' అని పిలుస్తారు. కరిణి శబ్దానికి ఆడ ఏనుగని మాత్రమే అర్థం. పిల్ల ఉన్నది ధేనుక. చెప్పినట్లు వినేది, మగ ఏనుగులను బంధించటంలో తోడ్పడేదీ వశ. వృథా అనే అర్థంలో గజస్నానమనే మాట వాడ్తారు. ఆ మాటకు వస్తే స్నానాలు మూడురకాలు. గంటల తరబడి చేసే స్నానం 'మహిషస్నానం' (గేదెలతీరన్నమాట). ఒళ్లు తడిసీ తడవకుండానే స్నానం చేసినట్లు భావించి పరుగులు తీస్తే అది 'కాకస్నానం' (కాకిలాగా ఓ రెక్క తడుపుకొని చాలుననుకోవటం). శుభ్రంగా స్నానంచేసి ఆ తరవాత ఏనుగు తలమీదా ఒంటిమీదా దుమ్ము చల్లుకున్నట్లు మాసినగుడ్డలు కట్టిగాని, మళ్లీ దుమ్ములో తిరిగిగాని చేసిన ప్రయత్నమంతా వృథా పుచ్చుకోవటాన్ని 'గజస్నాన' మంటారు. దండగమారిపని అన్నమాట. ఎన్నాళ్లకూ సంతానం కలక్కపోతే 'గజగర్భం' అని వెక్కిరిస్తారు. ఇంకా ఏనుగుమీద అనేకం. ఇవిచాలు.

ఏనుగులను సాకటం కష్టం. సుకుమారంగా సుందరంగా తోటలో తిరుగుతుంటే చాలునని లేళ్లని పెంచుకొనేవాళ్ళున్నారు. లేడిమాంసముంటే బ్రహ్మాండమని లొట్టలు వేసిన తెలుగు సంస్కృత కవులున్నారు. ఈ తెలుగు మాటకు 'ఇర్రి, లేటి, జింక' అనేవి పర్యాయపదాలంటారు. లేడి, లేటి శబ్దాలు రూపాంతరాలు. ఇర్రి శబ్దానికి ఈ కాలంలో వాడుకలేదు. కవులు దీన్ని 'మలికొమ్ముల మెక' అని వర్ణించారు – మెలి తిరిగిన కొమ్ములున్నాయని. ఈ జంతువును – ముఖ్యంగా నల్లయిర్రిని – సంస్కృతంలో కృష్ణసారమంటారు; కొందరు కృష్ణశారమనే రూపాంతరం వాడ్తారు. నిక్కచ్చిగా చెప్పాలంటే చుక్కలున్న నల్లయిర్రిని ఈ పేరుతో పిలుస్తారు.

లేడిశబ్దానికి సంస్కృతంలో "కురంగ(మ)ం, మృగం, వాతాయువు, హరిణం, అజినయోని, వాతప్రమి, వాతమృగం" వంటి పర్యాయపదాలున్నాయి. పరిగెత్తేది, వేటాడించేదీ కాబట్టి మృగమనే పేరువచ్చింది. ఇదే మామూలు మాట. పొడలలేడిని వాతప్రమి, వాతమృగం అని పిలుస్తారు. జింకపోతును న్యంకువంటారు. తెల్లవెంట్రుకలున్న ఇర్రిని రంకువంటారు. ఎర్ర రంగున్న సన్నకాళ్ల జింకను శంబరమంటారు. నల్లచారలున్న దుప్పిని రురువని పిలుస్తారు. తెల్లకాళ్లున్నదాన్ని తెలుగులో మనుబోతని పిలుస్తారు; సంస్కృతంలో ఋష్యం/ఋశ్యం అంటారు. పెద్ద కళ్ళూ, పొట్టికాళ్ళూ, నల్లచర్మమూ ఉన్న లేడిని ఏణమంటారు. ఇదే మాంసానిక్కూడా ప్రశస్తమైన లేడి. సాధుజంతువుల్లో అన్నిటికన్నా వేగంగా పరిగెత్తగలది ఇదే.

పెంచుకున్నా మానినా కొన్ని జంతువులూ, పక్షులూ, సరీసృపాలూ (జంతుశాస్త్ర పరిభాషలో చల్లటి నెత్తురున్న జంతువులు) మన పరిసరాల్లో తిరుగుతుంటాయి. కొన్ని మనకు ఆహారంగాకూడా పనికి వస్తే మరికొన్ని వాతావరణ పరిరక్షణకూ జీవరాశి సంతులనతను సాధించడానికి పనికివస్తాయి. పనికిరాదన్నమాట తప్ప సృష్టిలో పనికిరాని వస్తువుగాని జీవంగాని లేదంటారు పెద్దలు.

పెంపుడు జంతువుల్లో చెప్పదగ్గవి మరికొన్ని ఉన్నాయి. వాటిలో పెద్దది ఒంటె, చిన్నది కుందేలు, మరీ చిన్నది ముంగిస. ఎడారుల్లో పెరిగి తిరిగే ఒంటె తెలుగు భాషా ప్రాంతంలో సహజమైన జంతువుకాదు. అయినా (తెలుగు) భారతకాలం నుంచీ దాన్ని కవులూ ప్రజలూ స్మరిస్తూనే వచ్చారు. "లొట్టియ, లొట్టె, లొట్టిపిట్ట, లొటిపిట్ట, లొట్టిపిట, లొటిపిట, లొట్టేనుగు, ఒంటియ, ఒంటె," అనేవి పర్యాయ రూపాలంటారు. గిరీశం కన్యాశుల్కంలో లుబ్ధావధానుల పెళ్ళి ఊరేగింపులో ఇవి ఉండాలని ఉత్తరంలో రాశాడు. ఒంటె/ఒంటియ అనే రూపాంతరాలు సంస్కృతంలోని 'ఉష్ట్ర' శబ్దభవాలు. ఉష్ట్రమే హిందీలో ఊంట్ అయింది. తెలుగులో రెండు రూపాలు ధరించింది. లొట్టియ వగైరాలు రూపాంతరాలు. ఆ మాటకు చివర 'పిట్ట' ఎందుకు చేరిందో చెప్పలేం. లొట్ట శబ్దానికున్న విశేషణార్థం స్పష్టంగా తెలిస్తే తప్ప లొట్టేనుగనే పేరెందుకు వచ్చిందో తేలదు. ఉష్ట్ర శబ్దాన్ని శ్రీశ్రీ పక్షివాచకంగా ప్రయోగించాడు. 'ఇసకలోన తలదూర్చిన ఉష్ట్రపక్షి బాపతు' అని. అక్కడ అది ఆష్ట్రిచ్ (ostrich) అనే ఇంగ్లీషు శబ్దభవమని చెప్పాలి. అతడే ఎడారిలో కాళ్లు తెగిన ఒంటరి ఒంటె లాగుంది జాబిల్లి అని చంద్రుణ్ని ప్రస్తావించాడు. పాఠ్యగ్రంథాల్లో

ఒంటెను 'ఎడారి ఓడ' అని వర్ణిస్తుంటారు. ఆంధ్రప్రదేశ్‌లో చాలావరకు ఒంటెల పెంపకం ముస్లిం సంస్కృతిలో భాగంగా కనిపిస్తుంది.

కుందేళ్ళను వినోదంకోసం పెంచేవాళ్ళు-వేటాడి పట్టి. ప్రస్తుతం మాంసం కోసం పెద్దయెత్తున పెంచుతున్నారు. కావ్యభాషలో 'కుందెలు' వంటి రూపాంతరముంది. వాడుకలో 'చెవులపిల్లి, చెవులపోతు' అనే పేర్లున్నాయి. చెవులు పెద్దవి కాబట్టే పేరులో భాగం కావటంలో ఆశ్చర్యంలేదు గాని పరమసాధు జంతువూ శాకాహారీ అయిన కుందేలును సర్వభక్షకమైన పిల్లిగా ఎందుకు భావిస్తున్నామో మనకే తెలీదు. పిరికి జంతువు కాబట్టే దీనికి పిల్లిభయం, కుక్కభయం తప్పదు. అందువల్ల పెంపకంలో చాలా జాగ్రత్తలవసరం. ఒక చిత్రమైన లక్షణముంది దీనికి. చెవులతో పైకి లేపి బొమ్మరిల్లు గోడల్లాంటి చిన్న మట్టిగురుగులో విడిపితే - అంటే కుందేలు చుట్టూ మట్టికట్ట అంగుళమెత్తున పోస్తే-అది అక్కడ మంచి కదలదు. చీపురుపుల్లతో ఆ మట్టికోట(!)లో దారిచేస్తే నిలువెత్తున ఎగిరి పారిపోతుంది! కుందేలును సంస్కృతంలో శశమంటారు. చంద్రుడిలోని మచ్చను కుందేలుగా భావించే వాళ్ళు. చంద్రుణ్ని అందుకే శశి అంటారు. నేలమీది కుందేలు చంద్రమండలందాకా ఎగిరిందన్నమాట. మరీ చిన్న కుందేలును 'శశక' మంటారు.

పంచతంత్రం కథే ముంగిసను పెంచిన బ్రాహ్మణుడి తొందరపాటును వర్ణించింది. పాము లెక్కువగా ఉండే ప్రాంతాల్లో ముంగిసలను పెంచుకుంటారు కొందరు. వాటికి గుడ్డపేలికలు చుట్టబెట్టి, చిరుగజ్జెలు కాళ్ళకు కట్టి ముద్దు చేస్తారు. యజమాని కుటుంబం మీద అది మౌనప్రేమను ప్రదర్శిస్తుంది. అందుకే కళ్ళల్లో భావాలు కనపడుతున్నా మాట్లాడని వాళ్ళని 'ముంగిలాంటి' వాళ్ళని వెక్కిరిస్తుంటారు. ముంగి, ముంగిన శబ్దాలు రూపాంతరాలు అన్యోన్యం. మరో తెలుగు మాట "వెంట్రువ". దీనికి నిత్యవ్యవహారంలో ఆ మాటకు వాడుక లేదు. సంస్కృతంలో ముంగిసకు పర్యాయపదం 'నకులం'.

చాలా కొద్దిమంది వెంటపడి వేటాడి పట్టుకొని సకృత్తుగా పెంచే మరో చిన్న జంతువు ఉడత. ఈ తెలుగు మాటకు 'ఉరుత' అనేది రూపాంతరం. శాకాహారి అయిన ఈ పిరికి జంతువును సర్వభక్షకి అయిన ఎలుకతో పోల్చి సంస్కృతంలో 'తరుమూషిక' మంటారు అన్యాయంగా. ఉడత ఒంటి మీద వెంట్రుకలు చిత్రకారులు వాడే కుంచెలకు ప్రశస్తం. బిరుసుగా, రంగుల చెమ్మకు వాలిపోకుండా ఉంటాయి కాబట్టి ఉడత వెంట్రుకల కుంచె మేలురకం వస్తువు కింద లెక్క. కళాకారులకు సమాజంలో గౌరవంలేని కాలంలోనో, మాంసభక్షణకు మరే జంతువూ దొరక్క కాలే కడుపుకి మండే గంజి అన్న లెక్కన సరిపెట్టుకోవలసిన కష్టకాలంలోనో, ఉడతల వేటను నీచంగా పరిగణించి అప్రయోజకుడైన వ్యక్తిని 'ఉడతలు పట్టేవాడు' అని అపహసించటం జరిగింది.

ఎటూ తరుమూషికాన్నీ, దాని గర్భశత్రువైన పిల్లినీ స్మరించాం కాబట్టి, ఎలుకను గూడా పర్యాలోచించటం న్యాయం. 'ఎలి' అనే అచ్చ తెలుగు మాటకు బహువచనంలో 'కళ్' అనే ప్రత్యయం చేరిందని, కాలక్రమాన 'కళ్' అనేదాని సంగతి మరచిపోయి 'ఎలికళు' అనే రూపంనుంచి 'ఎలిక' అనే ఏకవచన రూపం

పుట్టిందనీ భాషాశాస్త్రజ్ఞులు చెప్తుంటారు. రూపమెలా ఏర్పడ్డా ఈ తెలుగుమాటకు తిరుగులేదు. మరో పర్యాయ పదమున్నట్లు లేదు. కాకపోతే 'చుంచెలుక, చిట్టెలుక, గమిరిడి ఎలుక' వంటి భేదాలు మాత్రమున్నాయి. చిట్టెలుకను సంస్కృతంలో 'గిరిక, బాలమూషిక' అని పిలుస్తారు. చుంచెలుకను 'చుచుందరి, గంధమూషి' అంటారు. గమిరిడిని తెలుగులోనే 'రాళ్ళరాసిగాడు' అని కూడా పిలుస్తారు. మరీ పెద్దదయితే 'కొక్కు, పందికొక్కు.' ఇక్కడ పంది శబ్దానికి 'పెద్ద, బలిసిన' అనే విశేషణార్థాలున్నాయి. దాన్ని సంస్కృతంలో 'దీర్ఘదేహి, మూషిక' అని వ్యవహరిస్తారు. అసలెలుకను సంస్కృతంలో "అధోగంత (అడుగున తిరిగేది), ఖనకం (తవ్వేది), వృకం (ఆకలి ఎక్కువగా ఉన్నది), పుంధ్వజం, ఉందురం/ఉందురువు, మూషకం/మూషికం, ఆఖువు" వంటి మాటల్తో వ్యవహరిస్తారు. వినాయకుడు వాహనంగా పూజలు పొంది, ఇళ్ళు గుల్ల చేసి తిట్లుతిని, పంటలు పాడుచేసి బాధించే ఎలుకను జయించే మార్గాలు మానవులకు పూర్తిగా తెలీలేదు.

## క్రూరజంతువులు

అడవినేలే సింహం కథల్లో మృగరాజుగా అనేక శుభలక్షణాలతో కనిపిస్తుంది. ఇది తెలుగు జంతువు కాదనటానికి పెద్ద నిదర్శనం దానికి తెలుగు పేరే లేకపోవటం. సింగమనేది సింహ శబ్దభవం. సొంతమైన అచ్చ తెలుగు పేరు లేదని కాబోలు తెలుగు కవులూ, అచ్చ తెలుగు నిఘంటుకారులూ వర్ణనాత్మకంగా చాలా పేర్లు కల్పించారు. 'వెడద మోముమెకం (విశాలమైన మొహమున్నది), జడలమెకం (జూలు గలది), ఏనుగుల గొంగ (ఏనుగులను చంపేది), మెకముల కొలము సామి (మృగరాజు), తెల్లడాలు మెకం (తెల్లగా ఉండే జంతువు! సింహం తెల్లగా కనిపించిందన్నమాట పేరు పెట్టిన పండితుడికి), తెరనోటి మెకం (పెద్దనోరు గలది), బొబ్బమెకం (పెద్దగా గర్జించేది), తెరమొగం మెకం (పెద్దముఖం గలది), వెడదనోటి మెకం (విశాలమైన నోరున్నది), గుబ్బలిపట్టి గుర్రం (కొండగారయిన హిమవంతుడి కూతురుగారయిన పార్వతి ఎక్కే వాహనం) మొదలైన మాటలన్నీ కృత్రిమాలే. ఏనాడూ ఈ కవులు తప్ప మరెవ్వరూ వాడనివే!.

సంస్కృతంలో కూడా 'హరి' అనే శబ్దం తప్ప తక్కిన పేర్లన్నీ వర్ణనాత్మకాలే. హరి శబ్దానికి అనేకార్థాలున్నాయి – కోతి నుంచి విష్ణుమూర్తి దాకా! ఇతర పదాలేవంటే మృగేంద్రం (జంతువుల్లో గొప్పది), పంచాస్యం (వెడల్పాటి నోరుగలది), హర్యక్షం (పచ్చకళ్ళది), కేసరి (జూలున్నది), కంఠీరవం (గొంతెత్తి గర్జించేది), గజరిపువు (ఏనుగులకు శత్రువు), పింగదృష్టి (పచ్చకళ్ళున్నది), మృగాధిపం (జంతువుల రాజు) వగైరాలు. ఇది నిజానికి ఆఫ్రికన్ జంతువు. మనం గౌరవించే జంతువు కూడా.

సింహం తరవాత కథల్లో కనిపించే అచ్చతెలుగు జంతువు పులి. ఒక్కమాటే ఉంటే దాని ఘనతకు లోపమని మన కవిపండితులు మరికొన్ని మాటలు సృష్టించారు

పర్యాయపదాలుగా. మెకముల తిండిపోతు (జంతువులను తెగతినేది), చారల మెకం (చారలున్న జంతువు – జిరాఫీలాంటివి మనదేశంలో లేవు కాబట్టి ఈ బిరుదు ఒక్కపులికే సరిపోయింది), ముప్పన్నె మెకం (మూడు రంగులున్నది), పసిదిండి పోతు (అంటే గొడ్లను తినేది), తెరువుగాపరి (దారికాచి పట్టుకొనేది) లాంటివి అలాంటి పర్యాయపదాలు. సంస్కృతంలో దీనికి "వ్యాఘ్రం, ద్వీపి, శార్దూల"మనే పేర్లున్నాయి. చివరి మాటను సింహశబ్దంలాగా శ్రేష్ఠవాచకంగా కూడా వాడుతుంటారు. ద్వీపి శబ్దానికి మచ్చలున్నదని అర్థం. నిజానికది 'చిరతపులి'కి పేరు కావచ్చు. వ్యాఘ్రమంటే బాగా పసిగట్టగలదని అర్థం. ఈలాటి జంతువులకు శార్దూలి తల్లి అనే వేదప్రశంస వుంది. అయితే శార్దూల శబ్దానికి సింహం, చిరత (పులి) అనే ఇతరార్థాలు కూడా వున్నాయి.

సింహ శార్దూలాల్లో ఏది అరణ్యాలను పాలించినా నక్కకు వాటి మంత్రిత్వం తప్పదు. నక్కినక్కి తిరిగేది కాబట్టి నక్క అని కొందరు అర్థం చెప్తారు. ఇది అచ్చ తెలుగు శబ్దం. కవిపండితులు కల్పించిన పర్యాయపదాలు 'పిక్కుమెకం, ఎండ్రిమేతరి, బుద్ధిమెకం' అనేవి. పిక్కు శబ్దానికి 'మోసగించు, పారిపోవు' అనే రెండర్థాలున్నాయి. ఈ రెండు పనులనూ ఏకకాలంలోనే సమర్థంగా చేయగలది కాబట్టి ఈ వర్ణన సరిపోతుంది. ఎండ్రకాయలను ఏరుకొని తింటుంది కాబట్టి ఎండ్రిమేతరి అన్నారు. తెలివి గలది కాబట్టి బుద్ధిమెకం. నక్క శబ్దానికి సంస్కృత పర్యాయపదాలు "శివ(o), భూరిమాయువు/భూరిమాయం, గోమాయువు, మృగధూర్తకం, సృగాలం/శృగాలం, వంచకం, క్రోష్టువు, ఫేరువు/ఫేరవం, జంబుకం" అనేవి. శివశబ్దానికి అనేకానేకమైన అర్థాలున్నాయి. అందులో అదృష్టమనేదొకటి. బహుశా ఈ దృష్టితోనేమో 'నక్కను తొక్కి' రావటం అదృష్టమనే మాటపుట్టింది. శకునాల్లో నక్క శకునం కూడా ఉంది. పూర్వం ఆనందగజపతివారి ఆస్థానంలో నక్క ఎటునుంచి ఎటుపోతే మంచిదో పండితుల మధ్య అభిప్రాయభేదాలకు దారితీస్తుంటే వీణ సంగమేశ్వరశాస్త్రిగారు 'కరవకుండా పోతే మంచి'దని శకునం చెప్పారంటారు! పెద్ద యెత్తున మాయలు పన్ని మోసగించగలది కాబట్టి భూరిమాయం/భూరిమాయువనే పేరు వచ్చింది. ఆవుల నలా మోసగిస్తుంది కాబట్టి గోమాయువన్నారు. జంతువులను ఏడిపిస్తుంది కాబట్టే మృగధూర్తకమన్నారు. ఊళపెట్టేది కాబట్టి క్రోష్టుకం, ఫేరవం అనీ పిలిచారు. నక్కలన్నిటిలో గుంటనక్క మోసంలో మొనగాడంటారు.

వేటలో మొనగాడైన మరో క్రూరజంతువు తోడేలు. ఈ మాట తెలుగుమాట. 'గొరియలసూడు' (గొర్రెలను చంపేది) అనే మారుపేరు కవులు పెట్టారు దానికి. సంస్కృతంలో దీనికి 'కోకం, ఈహామృగం, వృకం' అనేవి పర్యాయపదాలు. కో అని అరుస్తుంది కాబట్టి కోకమన్నారు. హుషారుగా ఉండేది కాబట్టి ఈహామృగమనే పేరువచ్చింది. ఒకరకం రూపకానికి కూడా ఇదే పేరు పెట్టారు– వినోద ప్రధానమైనందువల్ల. వృకమంటే వెంటపడేది, తరిమేది, చీల్చేది అని అర్థం. తోడేలుకు ఆకలిమెండని తిండిపోతులను – ముఖ్యంగా భీముణ్ణి–వృకోదరుడని పిలుస్తారు. ఇతర జంతువుల సంగతి వదిలిపెట్టి పక్షుల్తోబాటు ఎగిరిపోదామా?

# పక్షి సంతతి

'పక్షి'కి పర్యాయపదాలయిన తెలుగుమాటలు "పక్కి, పులుగు, పిట్ట, గువ్వ, పిట్లగువ్వ" అనేవి. మొదటి మాట పక్షి శబ్దభవం. పులుగనేది పుస్తకాల్లోని మాట. పిట్ట వాడుకలోని పదం. గువ్వకు పావురం వంటి ఇతరార్థాలున్నాయి. ముడుచుకొని ఉండేదాన్ని గువ్వ అంటారు. సంస్కృతంలోని ఖగం, విహంగం, విహగం, విహంగమం, విహాయం, శకుంతం, పత్రి, పతంగం, పతత్తు, పత్రరథం, అండజం, నగౌకం, వాజి, విష్కిరం, పతత్రి, నీడోద్భవం, గరుత్మతం, నభసంగమం వంటివి పర్యాయపదాలు. విహగం, విహంగమం, విహాయం అనే రూపాంతరాలకు ఆకాశంలో ఎగిరేవని ఖగశబ్దానికి లాగానే అర్థం. పతంగం అలాంటి అర్థం కలదే. పత్రి, పతత్రి, గరుత్మత శబ్దాలకు 'రెక్కలున్నది' అని అర్థం. అండజం అంటే గుడ్డులో నుంచి వచ్చింది. నగౌకం అంటే కొండల మీద ఉండేదనీ, నీడోద్భవమంటే చెట్లలో పుట్టిందనీ అర్థాలు. వాజి శబ్దానికి వాహనం, గుర్రం వగైరా ఇతరార్థాలున్నాయి. వికిరమంటే ఎగిరేదీ, వ్యాపించేదీ. విష్కిరమన్నా అదే అర్థం.

పెంపుడు పక్షుల్లో సర్వసాధారణమైనది కోడి. కోడిపందేలవంటి వినోదాలకోసం, ఆహారార్థం కోళ్ళను పెంచుతారు. మగకోడిని 'పుంజు', ఆడకోడిని 'పెట్ట' అని మామూలుగా పిలుస్తారు. ఈ మాటలే ఇతర సందర్భాల్లో ఆడ మగ భేదాలు సూచించడానిక్కూడా తెలుగులో వాడుతుంటాం. రెంటా తప్పిన కోడిని 'పెట్టమారి' అని పిలుస్తారు. కోడి తప్ప మరోమాట తెలుగువారి వాడుకలో లేదు. 'అడవిపుంజు, కోనపుంజు, పాడకోడి' అని వ్యవహరించేదాన్ని సంస్కృతంలో వనకుక్కుటం అని పిలుస్తారు. అడవికోడి అని దాన్ని పిలవటం తెలుగు అలవాటు. కొందరు దాన్నే 'కారుకోడి' అనికూడా పిలుస్తారు. 'నీరుకోడి, బొల్లికోడి' అని తెలుగువాళ్ళు చెప్పేజాతిని సంస్కృతంలో 'ప్లవం, సలిలకుక్కుటం' అని వ్యవహరిస్తారు. కోడికి సంస్కృతపర్యాయపదం 'కుక్కుటం'. కుక్‌కుక్ అంటుంటుంది కాబట్టి ఆ మాట పుట్టింది. ఇలాంటి మాటలను ధ్వన్యనుకరణ శబ్దాలంటారు. కుక్కుటశబ్దానికి 'కృకవాకువు, తామ్రచూడం, చరణాయుధం' అనే వర్ణనాత్మక పర్యాయపదాలున్నాయి. తొండ, నెమలి అనే ఇతరార్థాలు కూడా కృకవాకు శబ్దానికి ఉన్నాయి. నెత్తిమీది శిఖను కృకమంటారు. దాన్నే చూడమని కూడా పిలుస్తారు. తామ్రం (రాగి) రంగులోని చూడమున్నది కాబట్టి కోడిని తామ్రచూడమన్నారు. పందేల్లో యుద్ధాల్లో కాళ్ళనే (చరణాలనే) ఆయుధాలుగా వాడుతుంది కాబట్టి చరణాయుధ మన్నారు. కొన్నిరకాల కోళ్ళు – ముఖ్యంగా బెరసకోళ్ళు – పందేలకు సర్వోత్తమం. కోళ్ళున్న కొంపలో తేళ్లబాధ ఉండదు.

కోడినిలాగానే పెంచుకొనే మరోపక్షి పావురం. ఈ మాట సంస్కృతంలోని 'పారావత' శబ్దం నుంచి పుట్టింది. పారావత శబ్దానికి పారవతమనే రూపాంతరం, పావురమనే తద్భవ శబ్దానికి పారువమనే రూపాంతరం వున్నాయి. చాలా దూరాలకు

ఎగరగలదనే అర్థంలో (పరావత్ అనే భావంలో) పారావత శబ్దం పుట్టిందంటారు. ఈ సంస్కృత శబ్దానికి 'కలరవం, కపోతం' అనేవి పర్యాయపదాలు. కువకువమనే కమ్మని చప్పుడు చేస్తుంటుంది కాబట్టి కలరవ మన్నారు. బూడిదరంగులో ఉంటుంది కాబట్టి కపోతమన్నారు. మెడమీద చుక్కలున్న పావురాన్ని వేదకాలంలో అపశకునంగా భావించేవారు. తెలుగులో పావురమనే మాటకు, పావురా, పావురాయి అనే రూపాంతరాలు కూడా ఉన్నాయి. "ఒడ్డీ, కూకీ, పల్లటీ, లకోరీ, నేలపల్లటీ; అంతరపల్లటీ" వంటి దీర్ఘాంతశబ్దాలూ "బకదారి, బట్టి, సురటా, దూరబారు" వంటి ఇతర శబ్దాలూ తెలుగు పర్యాయపదాలకింద లెక్క. ఒడ్డనం అంటే పందెం. పందేలకు పనికివచ్చే పావురాల్ని ఈ పేరుతో పిలుస్తారు. అదేంకాదు. ఉడ్డీనమంటే పైకెగరటం (ఇది సంస్కృతపదం). బాగా పైకెగరగలది కాబట్టి దీన్ని ఒడ్డీ అనీ, ఒడ్డీడనీ తద్భవరూపాల్లో పిలుస్తారని కొందరు వాదిస్తారు. దీర్ఘాంతశబ్దాలు అచ్చతెలుగు వికావనీ, అవన్నీ ఎరువుమాటలనీ కొందరు చెప్తారు. పల్లటీ అనేది ఈనాటి 'పల్టీ' అనే మాటకు పూర్వరూపం. ఆకాశంలో బాగా పల్టీలు కొట్టే పిట్టకాబట్టి ఈ పేరు వచ్చిందంటారు. లకోరి అంటే బాణం. దానిలాగా దూసుకుపోగలదీ వేగం కలదీ కాబట్టి లకోరీ అని పిలిచారు. సుర అంటే సుడిగాలి. సుడిగాలిలా వేగంగా గుండ్రంగా మెలిదిరుగుతూ ఎగిరేదికాబట్టి సురటి అన్నారు. పావురాలు ఉత్తరాలు తీసుకుపోవడానికి పనికివస్తాయి. యుద్ధసమయాల్లో ఈ పని రహస్యంగా చేసేవి పావురాలే. ఇప్పటికీ సైనికులు పావురాలను రహస్యవార్తాహారులుగా వాడుతున్నారు.

ముద్దుకు పెంచుకొనే పిట్టల్లో చిలక ముఖ్యమైనది. ఈ తెలుగుమాటకు చిల్క అనే రూపాంతరమూ, 'చదువుల పులుగు, చిగురువిలుకానితేజీ, తొగరు ముక్కు పులుగు, పచ్చరెక్కల పులుగు, పచ్చవిల్తుని తేజీ, పలుకుల పులుగు' అనే వర్ణనాత్మకపర్యాయపదాలూ తెలుగులో ఉన్నాయి. చిగురువిలుకాడన్నా పచ్చవిల్తుడన్నా మన్మథుడని అర్థం. ఆయనగారు చిలకమీద ఎక్కి ఊరేగుతుంటారని పురాణాల్లో ప్రబంధాల్లో కవులు రాసిపారేశారు. అందువల్ల ఈ పేర్లు వచ్చాయి. మాటలు చెప్తుంది కాబట్టి పలుకుల/చదువుల పులుగన్నారు. ముక్కు ఎర్రగా (తొగరుగా), రెక్కలు పచ్చగా ఉంటాయి కాబట్టి తక్కిన పేర్లు వచ్చాయి. చిలక అనేది తప్ప తక్కినవి పుస్తకాల్లో మాత్రమే ఉన్నమాటలు. రామచిలక, తమ్మచిలక వంటి భేదాలున్నాయి. సంస్కృతంలో చిలకను 'కీరం, శుకం' అనే పేర్లతో పిలుస్తారు. రంగు రంగులుగా ఆకర్షణకరంగా ఉంటుందని శుకమనే పేరుపెట్టారు. (కనీసం యజమానినైనా) పొగుడుతుంది కాబట్టి కీరమన్నారు.

చిలకలాంటిది మరో పెంపుడు పిట్ట ఉంది. దానిని తెలుగులో 'గోరువంక, గోర్వంక, గొరవంక, గోరింక, గోరంక' మొదలైన రూపాంతరాలతోనూ 'బట్టు/బట్టికాడు' అనే పర్యాయపదాల్తోనూ వ్యవహరిస్తారు. దీన్నే హిందీలో (మాటలు నేర్చిన) మైనా అంటారు. చెప్పిన/నేర్పిన మాటలను బట్టీ పట్టి ఒప్పచెప్తుంది కాబట్టి బట్టు/బట్టికాడు అనే రూపాంతరాలతో వ్యవహరిస్తుంటారు. గోరువంక అనే మాట ఎందుకుపుట్టిందో తెలీదు. సంస్కృతంలో దీన్ని 'శారిక/సారిక, శారి' అని పిలుస్తారు. ఈ మాటలు

పరస్పరం రూపాంతరాలు. చుక్కలు చుక్కలుగా, వన్నెలు వన్నెలుగా ఉంటుంది కాబట్టే ఈ పేరు వచ్చింది.

చిలకాగోరింకల్లాగా అన్యోన్యంగా ఉంటారని ముఖ్యంగా దంపతులను ప్రశంసిస్తూ తెలుగు రచయితలు ఎడాపెడా రాసిపారేస్తుంటారు. అవి రెండూ జంట కట్టవు. ఒకేజాతి పక్షులూ కావు. నిజానికి వాటని ఒకే పంజరంలో పెడ్తే కొట్టుకచస్తాయి. అయినాసరే ఈ మాట పుట్టింది! రెంటికీ ఒకటి రెండు మాటలు పలకగల శక్తి మాత్రం సమానం. చిలకపలుకులున్నంత ముద్దుగా గోరింకమాటలుండవు. గోరింకలు నేర్చినన్ని మాటలు చిలకలు నేర్వవు. వాటి 'అన్యోన్యాన్ని' ఎవరైనా చూసిగాని తెలుసుకోలేరు. చెప్పేదు మాటలన్నీ నిజం కాదనటానికి ఈ ప్రసంగం ఒక ఉదాహరణ.

తోటా దొడ్డీ వుండి సరదాకూడా ఉన్నవాళ్ళు పెంచుకొనే మరోపక్షి నెమలి. చుట్టుపక్కల దట్టమైన అడవిగాని, పాముల బెడదగాని ఉంటే నెమలి పెంపకం ఉభయతారకం. నెమలి శబ్దానికి పూర్వభాషలో నమ్మి, నెమ్మి అనే రూపాంతరాలున్నాయి. కవులు విధిగా కల్పించుకొన్న పర్యాయపదాలుగా వారుతప్ప మరిఎవరూ వాడని "నట్టువపిట్ట, జుట్టుపులుగు, కన్నులుగల పులుగు" అనే మాటలున్నాయి. ఇష్టమైన, నచ్చిన, ప్రేమించగలిగిన అనే అర్థాల్లో నెమలి శబ్దం పుట్టింది. నట్టువ అంటే నాట్యం చేసే పిట్టను నట్టువపిట్ట అన్నారు.

నెమలి శబ్దానికి పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృతశబ్దాలు "మయూరం, బర్హిణం, బర్హి, నీలకంఠం, భుజంగభుక్కు, శిఖి, కేకి, మేఘనాదానులాసి" వగైరాలు. మయూర శబ్దం సంస్కృతానికి సొంతంకాదనీ, చాలా పాతకాలంలో ద్రవిడభాషల నుంచి ఎరువుగా తెచ్చుకున్నమాట అనీ కొందరంటారు. బర్హం అంటే పురి. పురికలది కాబట్టే బర్హి/బర్హిణం అనే రూపాంతరాలతో పిలిచారు. మెడ నీలంగా ఉండే పిట్ట కాబట్టే నీలకంఠమన్నారు. భుజంగాలను (పాములను) తినేది కాబట్టే భుజంగభుక్కని పిలిచారు. శిఖ అంటే జుట్టు. చూడ అన్నాఅంతే. ఆ శిఖ (కోడికేలాగా) ఉంది కాబట్టే శిఖి, శిఖావళం అన్నారు. క్రేంకారం చేస్తుంది కాబట్టే కేకి అన్నారు. మేఘనాదానికి – అంటే ఉరుములకు – సంతోషించి నాట్యం చేస్తుంది కాబట్టే మేఘనాదానులాసి అని వర్ణించారు. మయూర నాట్యం నాట్యపద్ధతుల్లో ఒకటి. జంతువుల్లో పక్షుల్లో మొగజాతికే ఆకర్షణ ఎక్కువ. నాట్యం చేసి పెంటిని ఆకర్షించడానికి ప్రయత్నించేవన్నీ పుంజులే. పురివిప్పి నాట్యం చేసేది మగనెమలేగాని ఆడదికాదు. అయినా మనవాళ్లు నిర్లక్ష్యంగా 'నాట్యమయూరి' లాంటి బిరుదులు ప్రసాదిస్తుంటారు! మయూరి అంటే ఆడనెమలేగాని మొగదికాదు. అయినాసరే. ప్రకృతిలోని జంతుపక్షి స్వభావాదులను పరిశీలించి తెలుసుకోగల శక్తి నాగరకత పెరిగేకొద్దీ 'నానాటికి తీసికట్టు నాగంభట్లూ' అన్నట్లు తగ్గిపోతున్నది.

మగనెమలి నెత్తిన ఉన్న జుట్టును తెలుగులో 'సిగ, సిక, కూకటి, చుంచు, జుట్టు' అని పిలుస్తారు. దాన్నే సంస్కృతంలో 'శిఖ, చూడ' అంటారు. నెమలితోకను తెలుగులో 'పురి' అంటారు. సంస్కృతంలో 'శిఖండం, పింఛం, బర్హం' అని పిలుస్తారు. ఆ పురిని బట్టే నెమలికి 'శిఖండి' అనే పేరు వచ్చింది! నెమలిపురిలోని

చిత్రవర్ణాలున్న భాగాన్ని 'కన్ను' అంటారు తెలుగులో; చంద్రకం, మేచకం అని పిలుస్తారు సంస్కృతంలో. చంద్రకాన్ని బట్టి నెమలికి 'చంద్రకి' అనే పేరు కూడా వచ్చింది.

ఎవరూ పెంచుకోని, పుస్తకాల్లో పొగడ్తలందుకొనే గొప్పపక్షి హంస. దీనికి తద్భవ రూపమైన 'అంచ' అచ్చతెలుగుమాటకిందలెక్క. కొందరిది బాతేపొమ్మని అంటారు. కాదులెమ్మని మరికొందరు ఓదారుస్తారు. పురాణాల్లో దీనికి గొప్పపేరుంది. అది బ్రహ్మకు వాహనం. కొన్ని ప్రబంధాల్లో నాయికానాయకుల మధ్య అది రాయబారాలు నడిపింది. మరికొన్నింట నీతికథలూ బూతుకథలూ చెప్పింది. అది ఆకాశగంగానదిలో తేలాడుతుంది. మానససరోవరంలో ఈదులాడుతుంది. పాలూనీరూ వేరుచేస్తుంది. బంగారు తామరతూడులు తింటుంది. బంగారమెలా జీర్ణం చేసుకుంటుందో తెలీదు. అది రాజుల కీర్తిలాగా తెల్లగా వుంటుంది. ఇలా చాలా కథలున్నాయి. తెలుగుకవులు అవసరార్థం "తొలకరి కలుగుపులుగు, నలువతేజీ, పాలునీరును వేరుపరచు పులుగు, తెలిపిట్ట, మదికొలంకుపులుగు, తెల్లనిపిట్ట, పాలునీరును వెలిచేయు పక్కి" లాంటి మాటలు సృష్టించుకున్నారు. తొలకరి వానలొస్తే హంసలకు కోపం వస్తుందట. 'మదికొలంకు' అంటే మానససరోవరం. అదిపుడు చైనాలో భాగమైన టిబెట్టులో ఉంది.

సంస్కృతంలో హంసకు వర్ణనాత్మకంగా 'శ్వేతగరుత్తు, చక్రాంగం, మానసౌకసం' అనే పేర్లు పెట్టారు. తెల్ల రెక్కలున్నది కాబట్టి శ్వేతగరుత్తు. గుండ్రంగా ఉంటుంది కాబట్టి చక్రాంగం. మానససరస్సులో నివసిస్తుంది కాబట్టి మానసౌకసం. ఆడహంసను 'వరట' అంటారు సంస్కృతంలో. ముక్కూకాళ్ళూ ఎర్రగా ఉండి శరీరం తెల్లగా ఉన్న హంసను రాజహంస అంటారు. బూడిదరంగు ముక్కూ తెల్లని ఒళ్ళూ ఉంటే దాన్ని 'మల్లికం, మల్లికాక్షం' అంటారు. ముక్కూకాళ్ళూ బూడిదరంగులో ఉండినట్లయితే "కాదంబం, కలహంసం" అని పిలుస్తారు. ఇలా మన పూర్వకావ్యాల్లో నానా గుణాలున్న హంసలూ, తలకిందులుగా ఎగురుతూ వెన్నెలనో మంచు బిందువుల్నో మాత్రమే తాకి బతికే చాతక పక్షులూ, క్షణవిరహం సహించలేని చక్రవాకాలూ, కొండంత శరీరంతో ఎగిరిపోయే గండభేరుండాలూ ఉన్నాయి. ఉంటాయి.

మామూలు జనం పసిబిడ్డలనుంచి పండు ముసలివాళ్లదాకా అందరూ హర్షించే పిట్ట కోకిల. చూడటానికి నల్లఒళ్ళూ ఎర్రకళ్ళూ అసహ్యంగా ఉన్నా, సామాన్యులనుంచి మాన్యులదాకా అందరినీ ఆకర్షించే పిట్ట కోకిల. ఇది కంటికి కనపడేది. కోకిల అనేది సంస్కృతపదం. దానికి "వనప్రియం, పరభృతం, పికం" అనేవి పర్యాయపదాలు. అడవిలోని ఇష్టమైన జీవం కాబట్టి వనప్రియ మన్నారు. తమగుడ్లను కాకిగూళ్ళలో పెట్టి వాటిచేత పొదిగించుకొని పెరిగేది కాబట్టి పరభృతం. 'కో' అని పాడేది కాబట్టి కోకిల. నిఘంటువులో "పికః కోకిల ఇత్యపి" అని రాస్తే ఒక తెలుగు మహాకవి "ఇత్యపుల్ కూయంగ–" అని పద్యం చెప్పాడు!

కోకిల అనే సంస్కృతపదం నుంచి కోయిల/కోవెల అనే రూపాంతరాలు పుట్టి అచ్చ తెలుగనిపించుకున్నాయి. "కెంపుకనుల పులుగు, తలిరుమేతరి, సొకుడు పులుగు, మావికొమ్మయిలు పులుగు" అనే పేర్లు పెట్టారు– దాని లక్షణాలను వర్ణిస్తూ.

మొగకోకిల సంగీతమే బాగుండేది. "చూతాంకురాస్వాద కషాయకంఠః, పుంస్కోకిలో యన్మధురం చుకూజ" అంటాడు కాళిదాసు. మామిడి చివుర్లు తిని వగరెక్కిన గొంతుతో మగకోకిల తియ్యగా కూసిందంటాడు. తెలుగు కవులింత సూక్ష్మంగా జాగ్రత్తపడి రాయటం అరుదు. ఆడకోకిలనైనా మనవాళ్ళు మెచ్చుకోగలరు!

పక్షులన్నిటిలోకీ తెలివైనది మనం నిత్యం చూసే కాకి. కావుమనే చప్పుడు చేస్తుంది కాబట్టి ధ్వన్యనుకరణశబ్దంగా ఈ మాట పుట్టింది. కవులయితే 'గుమికాడు' అంటారు – ఎప్పుడూ గుంపులు కట్టుందని. ఆ మాట మామూలు వాడుకలో లేదు. కాకాసురులని దుర్మార్గులనూ (ఈ కాలంలో కాకా పట్టి సొంతపనులు చేయించుకొనే సజ్జనులనూ) పిలుస్తారు. కాకి శకునం చూసేవాళ్ళున్నారు. అందుకే అది పంచాంగాల్లో చోటుచేసుకొంది. తనకు కావలసిన వస్తువు దగ్గరకు వీలయినంత దగ్గరిదారిలో పోయే పిట్ట కాకేనని శాస్త్రజ్ఞులు బల్లగుద్ది చెప్తారు. పాశ్చాత్య దేశాల్లో కొందరు (గుడ్లగూబను పెంచుకున్నట్లే) కాకులను గూడా పెంచుకుంటారు. కాకి తింటేతప్ప పితరులకు పెట్టిన పిండాలు అందవుట. సంస్కృతంలోని కాక శబ్దం నుంచి కాకి పుట్టిందంటారు కొందరు. తెలుగు కాకి సంస్కృతానికి వలసపోలేదని ఎలా చెప్పగలమంటారు మరికొందరు. రెండూ ధ్వన్యనుకరణ శబ్దాలే కాబట్టి దేనికదే స్వతంత్రంగా పుట్టి వుండవచ్చు.

కాక శబ్దానికి సంస్కృతంలో "కరటం, కరటకం, అరిష్టం, బలిపుష్టం, సకృత్ప్రజం, ధ్వాంక్షం, ధ్మాంక్షం, ఆత్మఘోషం, పరభృత్తు, బలిభుక్కు, వాయసం, చిరజీవి, ఏకదృష్టి, మౌకలి, మౌకులి, మౌద్గలి, పికవర్ధనం" లాంటి పర్యాయపదాలున్నాయి. కరట, కరటక శబ్దాలు రూపాంతరాలు. నీచమైన పక్షి అనే అర్థంలో ఈ పేరు పెట్టారు. అపశకునం కాబట్టి అరిష్టం అని పిలిచారు. బలిగా పెట్టిన తిండి తిని బలిసేది కాబట్టి బలిపుష్టమన్నారు. సాలుకోసారి మాత్రమే గుడ్లు పెడ్తుంది కాబట్టి సకృత్ప్రజం. ధ్వాంక్షధ్మాంక్ష శబ్దాలు రూపాంతరాలు. ఎంగిలి కాసపడేది కాబట్టి ఈ పేరు పెట్టారు. ఆత్మను – అంటే తన్నుతానే – పిలుచుకుంటుంది కాబట్టి (కాకా అని అరుస్తుంది కాబట్టి) ఆత్మఘోషమన్నారు. ఇతరులను (కోకిల గుడ్లను పొదిగి) పోషిస్తుంది కాబట్టి పరభృత్తు అనే పేరు పెట్టారు. (కోకిలను కూడా ఇదే పేరుతో పిలవటమే చిత్రం!) బల్యన్నం తినేది కాబట్టి బలిభుక్కు అన్నారు. వాయస శబ్దానిక్కూడా అదే అర్థం. బహుకాలం బతుకుతుందని చిరంజీవి అన్నారు. (కాకి చిరకాలమున్ననే కార్యమగును? – అని ఓ తెలుగు కవి ప్రశ్నించాడనుకోండి). ఒంటికంటితో చూస్తుందని ఏకదృష్టి అని పిలిచారు. మౌకలి, మౌకులి, మౌద్గలి అనేవి రూపాంతరాలు. ముదురు బూడిద రంగు పక్షికదా అని అలాంటి పేర్లు పెట్టారన్నమాట. కోకిలలను పెంచుతుందని పికవర్ధనమన్నారు. కాకోలమనీ, ద్రోణకాకమనీ మెడకూడా కారునలుపుగా ఉండే మాలకాకిని పిలుస్తారు సంస్కృతంలో జెముడు/జెమరు కాకిని సంస్కృతంలో అతాపి అంటారు. నీటికాకిని జలకాకమంటారు. 'కాకికేమి తెలుసు సైకోఎనాలిసిస్' అని మహాకవి ఎందుకన్నాడో తెలీదు.

కాకికన్నా మనకు సన్నిహితంగా ఉండేది పిచ్చుక. మరీ కచ్చితంగా చెప్పాలంటే ఊరబిచ్చుక. ఊళ్ళల్లో ఇళ్ళల్లో ఉంటుంది కాబట్టి ఈ పేరు వచ్చింది. దీనికి

పర్యాయపద మనదగిన మరో అచ్చతెలుగు మాట కక్కెర. అది పుస్తకాల్లో మాత్రమే కనిపిస్తుంది. పంటలు పాడు చేసే మరో పిచ్చుకరకాన్ని "మంద పిచ్చుక, కాటుకపిట్ట, రువ్వపులుగు, కవుజు" అనే తెలుగుపేర్లతో, 'ఖంజనం, ఖంజరీటం' అనే సంస్కృత నామాలతో వ్యవహరిస్తారు. చాలా చక్కని గూళ్ళు కట్టి, వాటిలో మిణుగురు పురుగులను సజీవంగా అతికించి ఇంట్లో దీపం పెట్టుకొని సంతోషించే మరోరకం పిచ్చుకను బంగారు పిచ్చుక అంటారు. దాన్నే 'పచ్చపిట్ట, పచ్చపులుగు, గిజిగాడు, గిజ్జిగాడు' అని తెలుగుమాటల్లోనూ, 'హరిత' మనే సంస్కృత పదంతోనూ పిలుస్తారు. చివరి రెండుమాటలూ పరస్పరం రూపాంతరాలు. గిజిగాడు గూళ్ళను పొలం నుంచి తెచ్చి అందులో 'గుజ్జనగూళ్ళు' తినిపించటమనే భోగం ఏ మారుమూల పల్లెలోనయినా ఇంకా మిగిలి ఉండవచ్చు. పట్టణ సంస్కృతిలో ఇలాంటి ముచ్చటలు ఏనాడో అదృశ్యమైనాయి.

కాకికి గర్భశత్రువు గుడ్లగూబ. కొందరు దీనిపేరు పైకి తలుచుకున్నా అమంగళమని విశ్వసిస్తారు. (ఎందుకయినా మంచిది ఈ భాగాన్ని లోలోపల చదువుకోండి). పాశ్చాత్యులు దీన్ని విద్యావిజ్ఞానాలకు చిహ్నంగా భావిస్తారు. కొందరు పెంచుకుంటారు. (వాళ్ళకు మంచిది కాబట్టి మనకు చెడ్డదయిందేమో తెలీదు). మనవాళ్ళు దీన్ని 'పెద్దపక్షి' అని మాత్రం వ్యవహరిస్తారు. మనవాళ్ళలో కూడా ఇది శకునాలు చెప్తుందని నమ్మేవాళ్ళున్నారు. అది చిన్నది. మచ్చలున్నది. దాన్ని సంస్కృతంలో కనకాక్షి అంటారు. తెలుగులో 'గుబ్బలి, గుబ్బలికాడు, పైడికంటి, సకినాలు వెలయించు పక్కి' వగైరా వర్ణనాత్మకమైన పేర్లతో పిలుస్తారు. పెద్దదాన్ని 'కోటడు, గూబ, గుడ్లగూబ, పగటిగుడ్డి' అని తెలుగులో చెప్తారు. "ఉలూకం, వాయసారాతి, పేచకం, దివాంధం, కౌశికం, ఘూకం, దివాభీతం, నిశాటనం" అని పిలుస్తారు. ఉలూక శబ్దంనుంచే హిందీ/ఉర్దూలోని ఉల్లూ వచ్చింది – తిట్టుగా స్థిరపడింది! కాకులకు శత్రువు కాబట్టి (పంచతంత్రంలోని కాకోలూకీయం ఇందుకు దాఖలా) వాయసారాతి అన్నారు. పగలు చూడలేనిదని దివాంధమనీ, దివాభీతమనీ పిలిచారు. 'ఘూ' అనే ధ్వని చేస్తుందని ఘూకం అన్నారు. కుశికం అంటే ఇనుములాగా నల్లటిది. నల్లపక్షి కాబట్టి కౌశికమన్నారు. ముంగిసను కూడా ఈ పేరుతో పిలుస్తారు. ఈ రెంటికీ (అంటే గూబకూ ముంగిసకూ) పాములను పీక్కుతినటం తప్ప మరో సమానలక్షణం లేదు. అయినా పేరొకటే. రాత్రులు తిరిగేది కాబట్టి నిశాటనం అని పిలిచారు.

మనచుట్టూ కనిపించే పక్షుల్లో పాలపిట్ట శుభస్కారమంటారు. దీనికి తెలుగులో మరో పేరున్నట్లులేదు. సంస్కృతంలో 'చాషం/చాసం, కికీదివం/కికీదీవి' అనే పేర్లున్నాయి. దేవలోకాలనుంచి మానవులకు వార్తలు తెచ్చేదని ఋగ్వేదంలోనే దీని ప్రస్తావన ఉంది. 'కికీ' అన్నంతవరకు దాని కూతకు ధ్వన్యనుకరణం కావచ్చు. దివ/దివి– వగైరాలు దాని స్వర్లోకజన్మను స్మరించేవి. చాష శబ్దానికి అర్థమేమో తెలియదు. కికీదివ శబ్దంతో ఏట్రింతను కూడా పిలుస్తారు.

అన్నట్లు పొలాల్లో ఎక్కడపట్టినా కనిపించే పిట్ట ఏట్రింత. దానికి తెలుగులో 'పసులపోలిగాడు, కూకటి మూగ, కూకటి ముప్ప, కాటుక పిట్ట, కూకటి గువ్వ,

పాల, పులుగుల గదుమరి' అనే పేర్లున్నాయి. గొడ్లమీద వాలుతూ పొలం తన సొంతంగా తిరుగుతూ ఉంటుంది కాబట్టి పసుల పోలిగాడని రైతులు ముద్దుగా పేరు పెట్టుకున్నారన్నమాట. పిట్ట తలమీది జుట్టు కూకటి. ఆ కూకటిగల మూగ (మాట్లాడని) పిట్టను కొందరు కూకటిమూగ అంటే మరికొందరు మువ్వ అన్నారు (చిరుగజ్జెలాంటిదని). నల్లటిదయితే కాటుక పిట్ట, తెల్లటిదయితే పాల అంటారు. వానేటిచాళ్ళలో (పులుగుల్లో) తిరిగేది కాబట్టి పులుగుల గదుమరి అని పిలిచారు. ఇవి వర్ణనాత్మకంగా పెట్టిన పేర్లు. ఏట్రింత శబ్దానికి 'ఏటెరింత' అనే రూపాంతరముంది. అదే మామూలు పేరు. తెలుగులో 'ఏనుగకు ఏట్రింత రాయబార'మనే సామెత పుట్టింది. ఎందుచేతనో స్పష్టంగా తెలియదు.

ఏట్రింతను సంస్కృతంలో 'భరద్వాజం, భారయం, వ్యాఘ్రఘాటం/వ్యాఘ్రాటం' అనే పేర్లతోబాటు కికీదివమని కూడా అంటారు. భరద్వాజ శబ్దానికి భరద్వాజకమనే రూపాంతరముంది. భరత్ – వాజం అంటే వేగంగా కదిలే రెక్కలున్నదని అర్థం. భా అంటే ప్రకాశం, వెలుగు, కాంతి. అంత రయంగా (వేగంగా) పోతుందని భారయ మన్నారు. మరి మూడో పేరెందుకు వచ్చిందో స్పష్టంకాదు. ఏట్రింత మంచి శకునమనే నమ్మకం తెలుగువాళ్ళకేకాక గోండులకూ కోయలకూ కూడా ఉంది. కవిత్వంలో కాటుకపిట్ట, మామూలు వాడుకలో ఏట్రింత ఎక్కువ వ్యాప్తి గల మాటలు.

టెలిగ్రాఫ్ తీగల మీద బారులు దీర్చి హుషారుగా పలకరించే చిన్నపిట్టల్లో వానకోయిలలు ప్రధానమైనవి. ఈ తెలుగుమాటకు వానకోకిల, వానకోయిల అనే రూపాంతరాలున్నాయి. వీటినే "కకూ, కోయెల్" అని ఇంగ్లీషులో పిలుస్తారు. దీనికి తెలుగులో మరో పేరున్నట్లులేదు. సంస్కృతంలో కవులు ముఖ్యంగా స్మరించే పర్యాయపదం చాతక మనేది. ఆ శబ్దానికి 'సారంగం/శారంగం, స్తోకకం' అనే పర్యాయపదాలున్నాయి. చాతకవర్ణనలేని కావ్యం కనిపించదు. సారంగశబ్దాన్ని రెండు రకాలుగా వివరిస్తారు. ఒకటేమో స–రంగమని– అంటే రంగురంగులుగా ఉండేదని. మరో తీరు సర్–అంగమని– అంటే చుక్కలు చుక్కలుగా ఉండేదని. సరంగమ్మీదనుంచి తద్ధితరూపంగా పుట్టిన సారంగ శబ్దానికి 'లేడి, నెమలి, హంస' వంటి జంతువులనే అర్థాలు కూడా వున్నాయి. శారంగమనేది ఆ మాటకు రూపాంతరం. స్తోకం అంటే గుంపు, మంద. ఈ పిట్టలు సాధారణంగా గుంపులుకట్టి ఉంటాయి కాబట్టి స్తోకకమనే పేరు వచ్చింది.

నగరాల్లో కాకపోయినా పల్లెటూళ్ళలో తప్పకుండా వినిపించే శబ్దాల్లోది వడ్రంగిపిట్ట చెట్లు తొలుస్తున్నప్పటిచప్పుడు. దాన్ని కొందరు వడ్లంగి అంటారు – కట్టెలు తొలిచేపని (వడ్రంగం) చేస్తుంది కాబట్టి. దానికి తెలుగులో 'మానుగోయిల, బెగ్గురు' అనే పర్యాయపదాలూ, సంస్కృతంలో 'దార్వాఘాటం, కాష్ఠకూటం, శతపత్రకం' అనే సమానార్థకాలూ ఉన్నాయి. చెట్టుమీది కోయిల అన్నట్లు మానుగోయిల అనే పేరు పెట్టారు. బెగ్గురు శబ్దానికి పెగ్గురు అనే రూపాంతరముంది. కొందరు బెగ్గురంటే సారసపక్షి (అంటే కొంగజాతి) గాని వడ్రంగిపిట్ట కాదంటారు. దారువు అంటే కొయ్య. దాన్ని తొలుస్తుంది కాబట్టి దార్వాఘాట మన్నారు. కాష్ఠమంటే

కట్టె. దానితోనే దానికి పని, సంబంధం కాబట్టి కాష్ఠకూట మన్నారు. శతపత్ర శబ్దానికి శతపత్రకమనే రూపాంతరముంది. నూరు రేకులున్నదనే అర్థం దీనికి సామాన్యార్థం. ఆ అర్థంలో దీన్ని తామరపువ్వనే అంటారు. అయినా వడ్రంగి పిట్టనూ, రామచిలుకనూ, నెమలినీ, బెగ్గురుపక్షిని కూడా ఈ పేరుతో ఎందుకు పిలిచేవారో పెరుమాళ్ళకే ఎరుక.

ఇంటి ఆవరణలో విశాలమైన బావి ఉంటే (అది దిగుడు బావే కానక్కరలేదు) తప్పకుండా దర్శనమిచ్చే మరోపక్షి లకుముకిపిట్ట. దానికి 'బుచ్చిగాడు' అనే ముద్దుపేరుతోబాటు 'పొదలిక, మీనవల్లంకి, మీలగొంగ' అనే తెలుగు పర్యాయపదాలున్నాయి. పొదలిక అంటే పెంపు, పెరుగుదల. అయితే ఈ అర్థానికి కేవలం వ్యతిరేక భావంతో చంపేది అనే అర్థంలో పేరుపడ్డది. లకుముకి అనేది చెకుముకిలాగా ఉత్పత్తి చెప్పరాని పదం. అది చేపలను చంపుతుంది. అంటే చేపలకు శత్రువు (=గొంగ) కాబట్టి మీలగొంగ అన్నారు. మీనవల్లంకి శబ్దానికి మీనవల్లకి అనే రూపాంతరముంది. వల్లడి అంటే కొల్ల. చేపలను కొల్లగొట్టేదనే అర్థంలో ఈ మాట పుట్టి ఉంటుంది. నీటిలో చేపను గుర్తించడానికి (తన) రెక్కల చప్పుడు కూడా వినిపించకుండా గాలిలో వేలాడుతూ అకస్మాత్తుగా వాలి చేపలను పట్టడంలో దానికదే సాటి. కొన్ని క్షణాలపాటే కావచ్చుగాక కదలకుండా, ఎగరకుండా, వాలకుండా, జారకుండా గాలిలో నిలవటం దానికి పుట్టుకతో వచ్చిన విద్య. శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో తప్ప మరే తెలుగు కావ్యంలోనూ ఈ అద్భుత దృశ్యవర్ణనలేదంటే మన కవుల ప్రకృతి పరిశీలన స్థాయిని వేరే చెప్పనక్కరలేదుగదా!

లకుముకిని సంస్కృతీకరించి ఎవరో 'లక్కముఖీ' శబ్దం కల్పించారు! దీనికి సంస్కృతంలోని ఏకైక పర్యాయపదం టిట్టిభ మనేది. దానికేమో 'టీటిభం, టిటిభకం, టిట్టిభకం' అనే రూపాంతరాలున్నాయి. క్రీడాభిరామంలో కథానాయకుడు గోవిందమంచనశర్మకు ప్రాణస్నేహితుడి పేరు టిట్టిభసెట్టి. అలాంటి పేర్లీకాలంలో లేవనుకుంటాను.

మనం పరమ పవిత్రంగా భావించే పక్షుల్లో గద్ద ముఖ్యమైనది. అది సాక్షాత్తూ గరుడాళ్వార్‌గారి లౌకికావతారమని మన విశ్వాసం. అది 'కృష్ణా' అని భగవన్నామజపం చేస్తుందని విన్నవారు ఒప్పుకోకతప్పదు. గద్దల్లో చాలా రకాలున్నాయి. తెల్ల గద్దను బొల్లి గద్ద, పీతిరి గద్ద అని కూడా పిలుస్తారు. తేనె గద్ద అనేది మరోజాతి. పాముల గద్ద, నల్లపాముల గద్ద, పిల్లి గద్ద వగైరా భేదాలు లేకపోలేదు. 'బోరువ' అనే తెలుగుమాట గద్ద శబ్దానికి (ఇది సంస్కృతంలోని గృధ్ర శబ్ద భవమంటారు) పర్యాయపదం. బోరు అంటే పెద్ద. పెద్ద 'వ' (అంటే వా = నోరు) ఉన్నగద్దను బోరువ అంటారు. చాలా పెద్ద సైజులో ఉన్న గద్ద రాంబందు/రాబందు. ఈమాట 'రామబంధు' అనే సంస్కృత శబ్దంనుంచి పుట్టిందంటారు. సంపాతి జటాయువులు సీతమ్మ వైనం చెప్పి శ్రీరాముడికి సాయపడి రామబంధువు లయినారు కదా గద్ద చూపు తీవ్ర దృష్టిని, గద్దింపు, గద్దరితనాలు తెంపరితనాన్నీ సూచిస్తాయి. గద్ద అనేది ఇప్పటిమాట. దీని పూర్వరూపం గ్రద్ద. గరుడి, గరుడుడు, గరుటాలమంతుడు వగైరా తద్భవరూపాలు కవుల వాడుకలో వున్నాయి.

సంస్కృతంలో గద్దకు పర్యాయపదం గృధ్రం. నిజానికి అదే మూలపదమని చెప్పాలి. ఆ మాటకు ఆశపోతని అర్థం. మరోపేరు దాక్షాయ్యం. అంటే నేర్పరి అని అర్థం. తెలుగులోని గద్దచూపు వంటి సమాసం సంస్కృతంలో గృధ్రదృష్టి. చాలా తీక్ష్ణమయిన చూపుగలది ఈ పక్షి , ఆకాశంలోని గద్ద నీటిలోని చేపను చూడగలదంటారు. కొందరు గద్దా రాబందూ వేరు వేరు పక్షులంటారు. శరీర పరిమాణంలో భేదంతోబాటు ఆకారంలో కొద్దిపాటి మార్పున్నదేగాని రెండూ ఒకే జాతివేనంటారు శాస్త్రజ్ఞులు. రాబందును రాపులుగని కూడా పిలుస్తారు తెలుగులో – పక్షులకు రాజని. గద్ద నెవరూ పెంచుకుంటారని చెప్పలేం. కాని డేగలను పెంచి వేటలో వాడుకునే వాళ్ళున్నారు.

పావురం వార్తాహరుడిలాగా ఉపయోగపడ్డట్లు డేగ వేటకుక్కలాగా పనికివస్తుంది.. గద్ద చూపును లాగానే డేగచూపునుకూడా మెచ్చుకుంటారు. ఆకాశంలో ఎగురుతున్న చిన్న చిన్న పిట్టలను అక్కడే చంపటంలో డేగతో గద్ద సరితూగదు–పోలదు. డేగ అనే తెలుగుమాటకు 'చెంచడం, జాలియ/జాలె, కురుజు, సాళువ/సాళ్వం, కణుజు, అణుజు/అడుజు, కణసరం/కనిసెరం, గిద్దు/గిడ్డు, వేసడం, ఓరడం, లగుడు, జావడం, జలకట్టియ/జలకట్టె/సెలకట్టె, వారణం, బైరి/బయిరి' వగైరా పర్యాయపదాలున్నాయి. అడవి రామదాసని పిలుస్తారు నల్లరెక్కల డేగను. ఈ మాటల్లో చాలావాటికి వ్యుత్పత్తులు స్పష్టంగా తెలీవు. ఏ పేరెందుకు వచ్చిందో చెప్పలేక పోయినా ఇన్ని పేర్లుండటానికి కారణం సులభంగా చెప్పవచ్చు. తెలుగు వాళ్ళకు పావురాపందేల్లాగానే డేగ వేటమీద కూడా ఎక్కువ మక్కువ ఉండటం వల్ల ప్రాంతీయంగా చాలా పేర్లు వచ్చాయనాలి. మొగడేగను ప్రత్యేకించి 'తోనికాడు' అని పిలుస్తారు తెలుగులో.

డేగకు సంస్కృత పర్యాయపదాలు 'శశాదనం, పత్రి, శ్యేనం' అనేవి. వాటిలో మూడోది మామూలుమాట–తక్కిన రెండూ వర్ణనాత్మకాలు. శ్యేనమంటే తొందరగా, వేగంగా ఎగిరేదని అర్థం. ఋగ్వేదంలో డేగ సోమం తెచ్చి పెట్టేదనే వర్ణనలున్నాయి. ఆకాశంలో చాలా ఎత్తున ఎగిరేపక్షి కాబట్టి ఇలా ఊహించివుంటారు. పత్రమంటే రెక్క. బలమైన రెక్కలు కలది కాబట్టి పత్రి అన్నారు. శశమంటే కుందేలు. కుందేళ్ళను పట్టి తింటుంది కాబట్టే శశాదమన్నారు. ఇలాంటిపేర్లే కపోతారి, ఖగాంతకం అనేవి. కపోతమంటే పావురం. దానికి 'అరి' అంటే శత్రువు. ఎంతో ఎత్తున ఎగిరే పావురాళ్ళను కూడా చంపగలది కాబట్టే ఈ పేరు వచ్చింది. ఖగమంటే పక్షి . వాటికి అంతకమిది. అంటే చంపేది. గద్దచూపు తీవ్రతకు చిహ్నమయితే డేగ చూపు క్రూరత్వానికి కూడా గుర్తే. అరణ్యంలో పులి, సింహం ఎలాంటివో ఆకాశంలో డేగ, గద్ద అలాంటివి, క్రమంగా.

ఆకాశంనుంచి నీటిమట్టానికి దిగేలోగా అటు జంతువూ ఇటు పక్షీ రెండూ అయ్యీ కాని మరోదాన్ని స్మరిద్దాం. అది గబ్బిలం. జంతువులాగా పాలిస్తుంది. పక్షిలాగా ఎగురుతుంది. గుడ్లగూబలాగా రాత్రుళ్ళు విహరిస్తుంది. మనదేశంలో లేవుగాని దక్షిణాఫ్రికా, దక్షిణ అమెరికాల్లో దూడలను తన్నుకపోయి చంపి తినగల గబ్బిలాలున్నాయి. ఇది తలకిందులుగా వేలాడుతుంటం మరో ప్రత్యేకత. గబ్బిలమనే తెలుగుమాటకు 'చీకు(రు)వాయి/చీకురా' అనే రూపాంతరాలు పర్యాయపదాలు.

గబ్బిడా(యి)/గబ్బిలా(యి) అనేవి రూపాంతరాలుమాత్రం. గబ్బి శబ్దానికి 'గర్వం, పెద్దరికం, దుర్మార్గం' వంటి అర్థవిశేషాలున్నాయి. చీకు శబ్దానికి చీకటి అనే అర్థముంది. చీకట్లో తిరిగేది చీకురాయి.

గబ్బిలమనే తెలుగుమాటకు 'జతుక/జతూక, అజినపత్రికం, పరోష్ణి, తైలపాయిక' వంటి సంస్కృత పదాలు పర్యాయపదాలు. వెంట్రుకలున్న శరీరం కలదన్న అర్థంలో అజినపత్రిక మనే పేరువచ్చింది. మాసినరంగు/మడ్డిరంగు పక్షి కాబట్టి పరోష్ణ అన్నారు. మూడోమాట ఎందుకు పుట్టిందో చెప్పలేం.

మన పరిసరాల్లో కనిపించే మరోపక్షి కొంగ. ఈ తెలుగు మాటకు 'కొక్కెర, కొక్కెరాయి, పుల్లిగొరక, గుండగి' మొదలైన పేర్లున్నాయి. 'పెద్ద కొక్కెర, తెల్లకొక్కెర, గుడ్డికొంగ, చీకుకొక్కెర, పక్కు కొంగ, గుడికొంగ, దోసికొంగ, పిసిగలకొంగ, పంకుబుడ్డి కొంగ' వంటి భేదాలున్నాయి. కొంచ అనే తద్భవనామముంది. అది క్రౌంచ/క్రుంచ శబ్దభవం అంటే వంగిన, మెలికలు తిరిగిన (మెడగలది) అనే అర్థంలోవన్నమాట. 'బకం, సారసం, క్రౌంచం, లోహపృష్ఠం' అనే సంస్కృత పదాలు పర్యాయపదాలు. వీటిలో మొదటిదే సాధారణ పదం. సరస్సుల్లో ఉంటుంది కాబట్టి సారసమన్నారు. వంపు మెడగలది కాబట్టి క్రౌంచం. కట్టెల్లాంటి కాళ్ళున్నది కాబట్టి లోహపృష్ఠం. బకమంటే మోసకారి, దొంగ అని విశేషార్థం. 'కొంగజపం' వల్ల ఈమాట పుట్టింది. పెద్దకొక్కెరను బిసకంఠిక, బలాకం అంటారు. కొక్కెరను కృకణం, క్రకరం అంటారు. గుడ్డికొంగను కోయష్టికం అంటారు. పక్కు కొంగను కహ్వా మంటారు, సంస్కృతంలో.

## పురుగులు

మనల్ని బాధించే ఎగిరేపురుగు దోమ; విసిగించేది ఈగ. ఎందుచేతనోగాని దోమకు పర్యాయపదమని చెప్పదగిన మరో తెలుగుమాట ఉన్నట్లు లేదు– 'రొచ్చుపురుగు' అనే వర్ణనాత్మక శబ్దం తప్ప. అలాగే సంస్కృతంలో కూడా మశ(క)ం అన్నమాట ఒక్కటే కనిపిస్తుంది. దానికి జుమ్మని చప్పుడు చేసేదనే అర్థం. ఈ విధంగా దోమ అద్వితీయమని చెప్పవచ్చు, ఉభయభాషల్లోనూ.

విసిగించే ఈగకు తెలుగులో 'ఈవ' అనే రూపాంతరముంది. నిఘంటువుల్లో మాత్రం. అది 'ఈం' అనే ధ్వని చేస్తుంది. కాబట్టి ధ్వన్యనుకరణాత్మకంగా వచ్చిన పేరని చెప్పాలి. తెలుగు ఈగ అద్వితీయమైనా సంస్కృతంలో దానికి పర్యాయపదాలనదగ్గవి కనీసం మూడు మాటలున్నాయి – మక్షిక, వర్వణం, నీల– అని. మక్షికాశబ్దానికి మక్షీకమనే రూపాంతరముంది. ఈ పదం తుమ్మెద వంటి వాటికన్నాడ సమంగా వర్తిస్తుంది. పోగుచేసేది, త్వరగా ఎగిరేది మొదలైన అర్థవిశేషాల్తో ఈ మాట పుట్టింది. వర్వణ శబ్దానికి బర్బణ, చర్మణ/చర్వణ పదాలు రూపాంతరాలు. నమిలేది అనే అర్థంలో ఈ మాటలు వచ్చాయి. నీల అనేమాట దాని వన్నెవల్ల వచ్చిన పేరు.

ఈగల్లో చాలా రకాలున్నాయి. తేనెటీగ, జుంటిఈగ అనే పేర్లున్నదొకరకం. ఈ తెలుగు మాటలకు సరఘ, మధుమక్షిక అనేవి సంస్కృత పర్యాయపదాలు. తెరయీగ, పెరయీగ అనే మరో రకానికి పతంగిక, పుత్తిక అనే సంస్కృత నామాలున్నాయి. మధుమక్షిక అంటే తేనె పోగుచేసేదనీ, పతంగిక అంటే ఎగురుతుండేదని అర్థాలు. కందురీగ/కందిరీగ/కణుదురీగ అనే మరోరకాన్ని కొందరు ఎఱ్ఱతుమ్మెద అని కూడా పిలుస్తారు తెలుగులో. సంస్కృతంలో దాన్ని గండోలి/గంధోలి, వరట అనే పేర్లతో వ్యవహరిస్తారు. నిలిచినచోట నిలవకుండా ఎగురుతూ ఝుమ్మని శబ్దిస్తూ ఉంటుంది. ఈ లక్షణాలున్న వ్యక్తినే తెలుగువాళ్ళు 'గంధోళిగాడు' అని ఆక్షేపిస్తారు. ఇది ఈగో, తుమ్మెదో తేలకపోవటమే విచిత్రం! అలాగే కొందరు అడవి యీగ అనే దాన్ని మరికొందరు అడవిదోమ అంటారు! దీన్ని వనమక్షిక, దంశం అనే పేర్లతో పిలుస్తారు సంస్కృతంలో. దంశమంటే కుట్టేది, కరిచేది. తెలుగులో జోరీగ అనే పెద్ద ఈగను సంస్కృతంలో పశుమక్షిక మంటారు. మనం తెలుగులో ఎప్పుడూ బహువచనంలోనే పిలిచే మరోరకం ఈగలు ఉసిళ్ళు. సంస్కృతంలో వాటిని వల్మీకమక్షికా లంటారు. వల్మీకం అంటే పొద.

ఝుమ్మని మోగుతూ తిరిగే మామూలు పురుగుల్లో తుమ్మెద ఒకటి. సీదాసాదా మనుషులకన్నా కవులకు దీని గొడవ ముఖ్యం. తెలుగులో దీనికున్న మరోపేరు తేటి. ఆ శబ్దం కావ్యాల్లో మాత్రమే కనిపిస్తుంది. వినిపిస్తుంది. ఇక కవులు కేవలం తమకోసం కల్పించుకొన్న వర్ణనాత్మక, కవితాత్మక శబ్దాలు లేకపోలేదు. అవేమంటే – విరితేనె త్రావుడు (పూదేనె తాగేది), మరునల్లె (మన్మథుడి వింటికి అల్లెతాడు), బమిపుర్వు (ఎగిరే– భ్రమించే– పురుగు), ముద్దుగల కాళ్ళ పురుగు – మూడుజతల కాళ్ళ పురుగు – వగైరాలు. వీటిని మామూలు జనం ఎవరూ ఎన్నడూ వాడరు – వాడినట్లు లేదు.

తుమ్మెద శబ్దానికి సంస్కృతంలో చాలా పేర్లున్నాయి. అసలు ఆ భాషా కవుల నుంచే మన కవులను వాటిని గురించిన కల్పనలు పట్టుబడ్డాయి. అవేమంటే– 'మధువ్రతం, మధుకరం, మధులిహం, అలి, ద్విరేఫం, పుష్పలిహం, భృంగం, షట్పదం, భ్రమరం, చంచరీకం, ఇందీవరం, రోలంబం, బంభరం, శిలీముఖం' అనేవి. అల అంటే ముల్లు. అలి అంటే ముల్లులాగా కుట్టేదని అర్థం. శిలీముఖం అంటే పదునైన/చురుక్కుమనిపించే నోరుగలదని అర్థం. షట్పదం అంటే ఆరుకాళ్ళున్నది. బంభరం, భృంగం అనేవి ధ్వన్యనుకరణాత్మకాలు. బంభృం– అని రొదచేసేవని చెప్పాలి. భ్రమరం అంటే (ఎప్పుడూ) తిరుగుతూ ఉండేదని అర్థం. ఇందిందిరం అంటే పెద్దదనిఅర్థం. రోలంబం అంటే నమ్మరానిది అని (అనేక పుష్పాల చుట్టూ తిరుగుతూ ఏ ఒక్కదానికీ నమ్మకం కలిగించదని కవితా రూపంలో) పెట్టిన పేరు. మధువ్రతం అంటే పూతేనె కోసమే తిరిగేది. మధులిహం, పుష్పలిహం అంటే తేనెను, పూవును నాకుతుండేదని అర్థం.

తేనెటీగల్లో తుమ్మెదల్లో (చివరికి చీమల్లో దోమల్లో కూడా) స్త్రీజాతి ఇల్లు కదలదు. కూలి యీగలు (మగవి) మాత్రమే పనిచేస్తాయి. ఆడవి మహారాణుల్లా అంతఃపురంలో ఉండి వంశాభివృద్ధి చేస్తుంటాయి. ఇది ఈ కాలంలో ఆరో తరగతి

పిల్లలకూ్కాడా తెలుసు. ఒకప్పుడు మహాకవులకూ్కాడా తెలిసినట్లు లేదు! మనుచరిత్రలో ప్రవరుణ్ని వర్ణిస్తూ అల్లసాని పెద్దన "వాని చక్కదనము వైరాగ్యమునజేసి కాంక్షసేయు జారకామినులకు భోగబాహ్యమయ్యె పూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకు వోలె" అని సెలవిచ్చాడు. సంపెంగ జోలికి తుమ్మెదలు పోని మాట నిజమేగాని ఇలాంటి వేటల్లో 'అంగనలకు' సంబంధం లేదనేది కవిగారు మరచిన విషయం! కవులు తేనెటీగల తిరుగుబోతుతనానికే ముగ్ధులైనట్లు లేదు. భగవద్గీత చెప్పిన కర్మకూ మనమనుకొనే కర్మకూ ఉన్న సంబంధమే ఈ కవివర్ణనలకూ వాస్తవాలకూ ఉన్నదనాలి!

చిన్నాపెద్దాచూసి ఆనందించే రంగురంగుల పురుగులు సీతాకోక చిలుకలు. తెలుగులో వీటికి మరోపేరున్నట్లు తెలీదు. వాటి రెక్కలను 'కోక' (చీర)లన్నారుగాని 'సీత' నూ 'చిలుక'నూ ఎందుకు కలిపిచెప్పారో అంతకన్నా తెలీదు. సంస్కృతంలో కూడా చిత్రపతంగ మన్న మాటొక్కటే ఉన్నట్లుంది. దోమల అద్వితీయత వీటికీ ఉన్నందుకు సంతోషించాలి – ఇవి నిర్బాధకాలు కాబట్టి!

చల్లని వెలుతురిస్తూ ఎగిరే మరో ఆకర్షణీయమైన పురుగు మిణుగురు. ఈ తెలుగు మాటకు మిణుంగురు, మిడుంగురు, మిడుంగు వగైరా రూపాంతరాలున్నాయి. కొందరు వీటిని మిణుగురు బూచి/పురుగు అని కూడా పిలుస్తారు. ఎగిరేటప్పుడు మిణుకు/మినుకుమని ప్రకాశిస్తుంది కాబట్టి ఇలా పిలుస్తారు. సంస్కృతంలో ఖద్యోతం, ప్రభాకీటం, జ్యోతిరింగణ మనిపిలుస్తారు. ఈ మాటలన్నిటికీ వెలిగేది అన్నదే అర్థం. వీటిని పట్టుకొని గూడులో మైనంతో అతికించి, రెక్కలల్లార్చినప్పుడు అవి యిచ్చే వెలుగును దీపంగా వాడుకునే గిజిగాడులు అద్భుతపక్షులు. 'చల్లని కాంతి'ని ఇవి ఎలా సృష్టిస్తున్నాయో నేటికీ మన శాస్త్రజ్ఞులకు తెలలేదు!

ఎగిరే పురుగుల్లో మనకు జాలి పుట్టించేవి మిడతలూ గొల్లభాములూ. మన వస్తువులను ముఖ్యంగా గుడ్డలను ధ్వంసం చేసేవి చిమటలు; అసహ్యం పుట్టించేవి బొద్దింకలు. మిడతలు దీపాలమీద వాలి రాలిపోవటం సర్వసాధారణం. మిడత అనే తెలుగు మాటకు మిడుత అనేది పూర్వరూపం. మిడియు అనే క్రియకు "ఎగురు" అని అర్థం. మిడిసిపడు, మిడిసిపాటు అనే మాటలకూ ఈ శబ్దానికీ దగ్గరి చుట్టరికముంది. మిడతల్లో రకాలున్నాయి. ఆకుమిడత, జెట్టిమిడత, వెదురుమిడత వగైరాలు. పచ్చగా ఉండేది ఆకుమిడత. ఎండిన కట్టెలాగా ఉండేది వెదురు మిడత. బలంగా ఉండేది జెట్టిమిడత. జెట్టి అంటే వస్తాదు. ఈ మిడతలతో పందేలు పెట్టి కుస్తీ పట్టించేవాళ్ళున్నారు. 'మిడతం భొట్లు శకునం' అనేది మన విశ్వాసాలకు అద్దం పట్టేమాట. చాలా పెద్దదిగా ఉండే మిడతను 'గొల్లభామ, గొల్లమిడత' అని తెలుగులో పిలుస్తారు. మిడతలదండు పంటలకు ప్రమాదకరమైనది.

మిడతకు సమానార్థకాలయిన సంస్కృతపదాలు 'ఖద్యోతం, పతంగం, శలభం' అనేవి. ఖద్యోత శబ్దానికి మిణుగురు పురుగనే అర్థమే సరయింది. ఎందుకంటే 'ఖ' (ఆకాశం)లో ద్యోతం (ద్యుతి = ప్రకాశం) అయ్యేది కాబట్టే మిణుగురుకే ఆ

మాట సరిపోతుంది. అయినా మిడతను కూడా అదే పేరుతో పిలుస్తారు. పతంగం అంటే ఎగిరేది, వాలేది. పక్షులనూ బాణాలనూ కూడా ఆ పేరుతోనే పిలుస్తారు. శలభశబ్దానికి శరభమనే రూపాంతరముంది. దానికి గొల్లభామ, సింహాల్ని చంపే ఎనిమిది కాళ్ళజంతువు వగైరా ఇతరార్థాలున్నాయి.

శలభ శబ్దానికి చిమట అనే అర్థం కూడా ఉంది. ఆ అర్థంలో చిమ్మట, చిమ్మెట, చిమ్కిట అనే తెలుగు రూపాంతరాలూ 'ఇలకోడి/ఈలకోడి, ఈలపురుగు, కీచురాయి' అనే పర్యాయపదాలున్నాయి తెలుగులో. కీచురాయీ చిమటా ఒకటికాదనేవాళ్ళున్నారు. ఒకటేననేవాళ్ళున్నారు. ఒకేజాతికి చెంది కొద్ది భేదంగల పురుగు లనేవాళ్ళున్నారు. అటు నిఘంటువుల్లోనూ ఇటు నిత్యజీవితంలోనూ ఈ పురుగులను గురించి స్పష్టమయిన అవగాహన ఉన్నట్లులేదు. కీటకశాస్త్రం గుర్తించే భేదాలను సామాన్య మానవులూ నిఘంటువులూ సమంగా గుర్తించటంలేదు. 'కీచురాయి' అనే అర్థంలో 'ఝిల్లిక, ఝీరుక, చీరి, ఝింఝీ, ఝల్లరి, ఝుల్లిక, ఝిల్లి(క), చీరుక, చీలిక, చీరవాక' వగైరా మాటలను రూపాంతరాలుగానూ, భృంగారి అనే శబ్దాన్ని పర్యాయపదంగానూ పరిగణించవచ్చు. ఎగిరేటప్పుడు అవి చేసే ధ్వనులను అనుకరిస్తూ ఈ మాటలు పుట్టివుంటాయి.

## ఇంటి పురుగులు

అసహ్యం కలిగించే పురుగుల్లో బొద్దింకలకే ప్రథమస్థానం. ఆధునిక శాస్త్రజ్ఞులు లక్షల సంవత్సరాలుగా రకరకాల వాతావరణ పరిస్థితులకు తట్టుకుంటూ బతుకుతున్న అత్యంత పురాతనజీవు లివేనంటారు. అణు విధ్వంసం జరిగినా ఇవి మొండిగా బతగ్గలవని అంచనా వేశారు. ఇవి ఇళ్ళలో సర్వాంతర్యాములు. అత్యంతోష్ణదేశాల్లోనూ హిమాలయ శీతలస్థలాల్లోనూ సమంగా బతికే ఈ ప్రాణివల్ల ప్రమాదంకన్నా అసహ్యమెక్కువ. బొద్దింక, బొజ్జింక అనే తెలుగు మాటలు రూపాంతరాలు. బొద్దుగా (లావుగా, మొద్దుగా) ఉండే 'ఈగ' అని ఈ మాటకర్థం. ఈగకు పూర్వరూపం ఈక/ఇంక. కొందరు దీన్ని బరిడ/బరణి/బరినె – పురుగని పిలుస్తారు. మరికొందరు పరిట పురుగంటారు తెలుగులోనే. అయితే బరిణ పురుగు వీపు పెంకు నీలంరంగులో ఉంటే బొద్దింకపెంకు గోధుమ రంగులో ఉంటుంది. రూపభేదమేగాని జాతిభేదం లేదు వీటికి.

బొద్దింకకు సమానమైన సంస్కృతపదాలు "ఖలాధార, తైలచౌరిక, పరోష్ణి/పరోష్టి, చారక/చారిక, పాయిక" అనేవి. నూనె వేసిన ప్రమిదల్లో తిరుగుతుంటాయి కాబట్టి తైలచౌరిక (నూనెను దొంగిలించేది) అన్నారు. అలాగే పాయిక అని కూడా (నూనె తాగుతుందనే నమ్మకంతో). అలా కాదు. పాయికా శబ్దానికి పాయ్య శబ్దానికి సంబంధముంది. అసహ్యకరమైన, నీచమైన, దుర్మార్గమైన పురుగు కాబట్టి ఈ పేరువచ్చిందంటారు కొందరు. ఇళ్ళల్లో ఎక్కడబడితే అక్కడ – ముఖ్యంగా చీకటిగా

చెమ్మగా ఉండే తావుల్లో – చరిస్తుంది (తిరుగుతుంది) కాబట్టి చారక/చారిక అనే రూపాంతరాలతో వ్యవహరిస్తారు.

ఎగరకపోయినా పాకుతూ ఇంటి కప్పులనూ మూలలనూ అంటిపెట్టుకొని ఉండే పురుగు సాలీడు. దాన్ని తెలుగులో సాలెపురుగు అనే రూపాంతరంతోనూ, 'పాదట్టు/పాదొట్టు పురుగు, సన్నపిల్లి' అనే పర్యాయపదాల్తోనూ పిలుస్తారు. పాదట్టు అంటే బూజు. దాన్ని సృష్టించేది కాబట్టి పాదట్టుపురుగన్నారు. సాలె శబ్దానికి 'సాలియ' అనేది పూర్వరూపం. ఆ మాటకు అల్లిక, అల్లకం, నేత అని అర్థం. సన్న దారాలతో గూడు అల్లుతుంది కాబట్టి సాలెపురుగు అన్నారు. సాలి+ఈడు అనే భాగాలు కలిసి ఏర్పడ్డమాట సాలీడు. ఈడు అనే ప్రత్యయం దొర, నేర్పరి, సొంతదారు వగైరా అర్థాల్లో వచ్చే తెలుగు ప్రత్యయం: ఉదాహరణకు బవినీడు, రామినీడు మొదలైన శబ్దాలు పేర్కొనవచ్చు. మునపటి తెలుగులో అల్లిక, నేతతయారీ మొదలైన నైపుణ్యాలను 'సాలె/సాలి(య)' అనే మాటలద్వారా సూచించేవాళ్ళు. అందువల్లనే నైపుణ్యం గల కులవృత్తులకు పెట్టిన పేర్లలో 'అగసాలె, కమ్మసాలి/కంసాలి, పట్టుసాలి, పద్మసాలి' వగైరా ఉన్నాయి. పూర్వం నగలను ఆకులతోనే (కమ్మలతోనే – ఈ అర్థంలో ఈ మాట కళింగ ప్రాంతంలో నేటికీ వాడుకలో ఉంది: ఉదా. కమ్మఇల్లు, తాటికమ్మ) చేసేవారు. కమ్మలతో నేర్పుగా పనిచేసినవారని కమ్మ/కం–సాలి అని పిలిచారు. తరవాతి కాలంలో వెండి, బంగారం వంటి ఖరీదైన లోహాలతో నగానట్రా చేసినా పాతపేరే నిలిచింది – నిన్నమొన్నటిదాకా. ఇప్పుడది చాలా తెలుగుమాటల్లాగానే గౌరవప్రదం కాదనిపిస్తున్నది కొందరికి! సన్నపిల్లి అనే మాటలో 'పిల్లి' లేదనే నమ్మాలి. సన్నపు– అనే విశేషణం మీద 'ఇలి' చేరి సన్నపిలి అనే రూపం ఏర్పడితే చివరిది పిల్లిలాంటిదని భ్రమించారన్నమాట!

ఇలాంటి భ్రమప్రమలు మనకు చాలా ఉన్నాయి. మచ్చుకు 'పనిలేని మంగలి పిల్లి తల గొరిగాడ'ని సామెత! అక్కడ నిజానికి పిల్లిగాని మరేజంతువుగాని లేదు. 'పిలి' అంటే 'పిలిచి'. పిలుచు ధాతువుకు పూర్వరూపం పిలు. ఇప్పటి కింకా ఆ మాట విధ్యర్థంలో వాడుకలోనే ఉంది. పిలు+ఇ=పిలి. 'ఇ' అనేది క్త్వార్థక ప్రత్యయం. అంటే 'చేసి, విని, తిని' వంటి మాటల్లో క్రియ మొదలై పూర్తికాలేదని సూచించే 'ఇ'కార ప్రత్యయమే ఇక్కడా వుంది. సన్నపని (సన్నదారాల అల్లిక) చేసేది కాబట్టి సన్నపిలి అన్నారు. కాలక్రమాన అదే సన్నపిల్లి అయిపోయింది!

సాలీడుకు సంస్కృతంలో 'లూత, తంతువాయం, తంతునాభం, తంత్రవాసం, ఊర్ణనాభం, కోశ/కోష–కారం, అష్టాపదం, జాలికం, మర్కట(క)ం' అనే పర్యాయపదాలున్నాయి. తంతువంటే తీగ. ఊర్ణం అంటే వెంట్రుక, ఉన్ని. సన్నదారాలవంటివి చేస్తుంది కాబట్టి తంతువాయ, తంతునాభ, ఊర్ణనాభ శబ్దాలు పుట్టాయి. తంత్రమంటే నేర్పు, అల్లిక. అందువల్ల తంత్రవాస శబ్దం వచ్చింది. కోశం అంటే బుట్ట, గూడు. దారాలతో గూడు కట్టుతుంది కాబట్టి కోశకారం/కోషకారం అన్నారు. అష్టాపదం అంటే ఎనిమిది కాళ్ళున్నది. జాలికం అంటే జాలం (వల) అల్లేది. మర్కటకం అంటే తిరిగేది, కదిలేది. ఇవన్నీ వర్ణనాత్మకంగా పెట్టిన పేర్లు. లూత అన్న చిన్నమాటే సంస్కృతం వ్యవహారభాషగా ఉన్నప్పటి వాడుకమాట. లూ ధాతువుకు

విభజించే, భాగాలు చేసే అనే అర్థాలున్నాయంటారు. గదులుగదులుగా విభజించి గూడు అల్లుతుంది కాబట్టి ఈ పేరు వచ్చింది. ఓపికకూ, పట్టుదలకూ, నేర్పుకూ, సాలీడు చిహ్నం.

మనకంటికి కనిపించేవాటిలో చీమే చాలా చిన్నపురుగు. అందుకే 'చీమలు దూరని చిట్టడవి, చీమంత, చీమతలకాయంత, పారే చీమను వింటాడు' వంటి మాటలు పుట్టాయి. సంస్కృతంలో కూడా 'పిపీలికాది పరబ్రహ్మపర్యంతం' మొదలైన వాక్యాల్లో చీమే చిన్నది–దేవుడే పెద్ద. చీమ అన్న తెలుగుమాటకు సరైన పర్యాయపదమున్నట్లు లేదు. 'సన్నగాడు' అనే వర్ణనాత్మకపద ముందని కొందరంటారు – చాలాచిన్నది, సన్నది అనే అర్థంలో. చీమల్లో కొండచీమ, చలిచీమ, రెక్కలచీమ, ఎర్రచీమ, నల్లచీమ వగైరా రకాలున్నాయి. గండు/గండ్రచీమ అనేది మగచీమ. చీమ చిటుక్కుమనటం మనం వాడే, ఊహించే అల్పాల్పధ్వనికి నిదర్శనం.

చీమ శబ్దానికి పర్యాయపదాలని చెప్పదగ్గవి సంస్కృతంలో చాలా ఉన్నాయి. సాధారణ శబ్దం పిపీలి(క). తక్కినవి 'కపిశ, కపింజిక, ఘృతేలిక, ఉద్దీపకం, ఉలంకలం, హీర, బ్రాహ్మి, వమ్రక/వమ్రిక' అనేవి. ఎర్రచీమలను కపిశ, కపింజిక అని పిలుస్తారు. ఉద్దీపకం అంటే మంటపుట్టించేదని అర్థం. ఉలంకలమన్నా అంతే. వమ్రక, వమ్రిక అనే రూపాంతరాలకు చిన్నది అనే అర్థం. ఘృతేలిక అనేమాటకు బొద్దింక అనే అర్థాంతరముంది. దీన్ని బ్రాహ్మి అని ఎందుకన్నారో చెప్పలేం.

చీమలపుట్టను సంస్కృతంలో 'వామలూరువు, కూలకం, వమ్రీకూటం, వల్మీకం' అనే పేర్లతో పిలుస్తారు. వాల్మీకి, వామలూరు తనయుడనే మాటలు ఆ మహర్షి చుట్టూ తపస్సమయంలో చీమలుపుట్టలు పెట్టినందువల్ల వచ్చినవి. తెల్లచీమలను చెదలంటారు. ఆ తెలుగుమాటకు 'చెదపురుగు, ఎద' అనేవి ప్రత్యామ్నాయాలు. చిగురు – ఇగురుల్లాగా చెద, ఎద అనేవి రూపాంతరాలు. లేడిచెద, గొర్రెచెదవంటి భేదాలున్నాయి.

మనతలనెక్కే పేను సంగతికి వస్తే అది అచ్చతెలుగుమాటే. 'నీ తల్లో జేజి నెరుగుదును, నీతల్లో పేను తెలుసు' లాంటి మాటల తలకూ పేనుకూ ఉన్న అన్యోన్యసంబంధాన్ని తెలియజేస్తాయి. భారతంలో ధర్మరాజు సంజయుడితో 'నీతలపేనెరుంగుదున్' అంటాడు. అంటే నీ తల్లోపేను, నీతలపు (ఆలోచన – నేను/నీను) అనే రెండర్థాలు వచ్చేట్లు చెప్పాడన్నమాట. పేనుకు మరో తెలుగు పర్యాయపదమున్నట్లు తెలీదుగాని 'ఈరు, ఈపి' అనే మాటలు పేను పెట్టే గుడ్లుకు, లేదా పేను పిల్లకు పేరని చెప్పాలి. ఈరు శబ్దానికి చిన్న, నీచమైన, మృదువైన వగైరా అర్థవిశేషాలున్నాయి. గుంపుగాఉన్న పేను గుడ్లను అంట్లు అనే బహువచనశబ్దంతో వ్యవహరిస్తాడు. ఈపికి 'పిడుదు/పిడుజు, బిడుజు/బిణుజు/బిడుదు' అనే రూపాంతరాలు పర్యాయపదాలంటారు గాని, నిజానికి అవి 'గోమారి'కి పర్యాయపదాలు. కొందరేమో చెక్కపిడుజు, చెక్కకొణుజు అనే పిడుదు భేదమే గోమారి అని చెప్తారు. గోవులను, అంటే పశువులను, పట్టే 'మారి' వంటి పురుగ్గాబట్టి గోమారి అనేపేరు వచ్చిందని కొందరు వివరిస్తారు. మనుష్యులను పీడించేది పేను – పశువుల నేడ్పించేది గోమారి అని కొందరు స్పష్టీకరిస్తారు.

పేనుకు సంస్కృతంలో చాలా పర్యాయపదాలున్నాయి. 'ఇంద్రలుప్త(క)ం, ఉత్కుణం, ఓకణం/ఓకణీ, ఓకోదని/ఒక్కాణి, కటిభం, కేశకీటం, పాళి, యూకం, వారకీరం, రోమవిధ్వంసకం, లిక్ష' వగైరాలు. లిక్షా శబ్దానికి 'లీక్ష, లీక్షిక' అనే రూపాంతరాలున్నాయి. ఈ మాటకు పేనుగుడ్డనే అర్థం. ఈ గుడ్ల సమూహాన్ని లిక్షానం అంటారు. ఇంద్రుడికీ జుట్టుకూ సంబంధమేమోగాని ఇంద్రలుప్తక శబ్దానికి జుట్టుపోగొట్టేది, బట్టతల తెచ్చిపెట్టేది అని అర్థం. ఓకణం, ఓకణీ, ఓకోదని/ఒక్కాణి శబ్దాలకు ఇంట్లోపుట్టి పెరిగేదని అర్థమని నిఘంటుకారులు చెప్తారు! రోమవిధ్వంసక మనేది ఇంద్రలుప్త(క)ం వంటి మాటే. తలలో వుంటుంది కాబట్టి కేశకీటమన్నారు. మిగతామాటల వ్యుత్పత్తి అస్పష్టం. తెల్లగా వుండే పేనుకు చీరపిట్ట, చీరపేను, చీరపోతు అనే పేర్లున్నాయి. పేనుగుడ్లు గుంపుగా ఉంటే 'ఈపికట్టు' అని పిలుస్తారు. పేను శబ్దంలోని 'ను' ఏకవచనప్రత్యయం. అందుకే 'పేలు' అనే బహువచన రూపమేర్పడ్డప్పుడు 'ను' లోపిస్తుంది.

నల్లి అనే తెలుగు మాటకూ నల్ల(-రక్తం) అనే మరో తెలుగుమాటకూ చాలా దగ్గరి సంబంధముంది - అది నెత్తురుతాగుతుంది కాబట్టే. దాన్ని కొందరు 'గోడపురుగు' అంటారు పుస్తకాల్లో. మంచం పురుగు, కుర్చీపురుగు వంటి పేర్లెందుకు పెట్టలేదో చెప్పలేం. మరికొందరు మొగటి/మొగిటి పురుగంటారు. మొగుడు అనే విశేషణానికి 'మొండి' అని అర్థం. మొండి పురుగనే అర్థంలో ఈ పేరు పెట్టారన్నమాట. నల్లికున్న హిందీపేరు (ఖట్మల్) ఈ కాలానికి 'పోలీసు' పర్యాయపదమయింది.

నల్లికి మత్కుణమనే సంస్కృత శబ్దం సమానార్థకం. దానికి 'ఉత్కుణం, ఉద్దంశం, కిటిభం, రక్తాంగం' అనేవి పర్యాయపదాలు. ఉద్దంశమనే మాట అటునల్లికీ, ఇటు దోమకూ వర్తిస్తుంది. ఎర్రటి శరీరం కలదికాబట్టే రక్తాంగమన్నారు. కుట్టిలేపేది కాబట్టే ఉత్కుణం. నల్లిని చంపడానికి వేన్నీళ్ళు, విభూతివంటి సులభసాధనా లున్నాయన్న నమ్మకంతో కాబోలు 'నల్లిని నలిపినట్లు నలుపుతా'ననే ప్రగల్భం పుట్టింది!

నల్లి భూమ్మీద నెత్తురు తాగి బాధించేదయితే జలగ నీట్లో ఆపనేచేసి ఏడిపిస్తుంది. తెలుగు మాట జలగ ఒక్కటేగాని కొందరు దానికి సంస్కృత వ్యుత్పత్తి చెప్పి (జలం అంటే నీరు, అందులో 'గ' తిరిగేది కాబట్టే జలగ) చివరికా మాట కూడా తెలుగుకాదు పొమ్మంటారు. కొన్ని సందర్భాల్లో వైద్యానికి అద్భుతంగా పనికివచ్చే జలగకూడా తెలుగువాళ్ళకు లేకపోతే మనభాషాగౌరవం పాడయి ఓడయిపోతుందని దానికి మన కవి పండితులు 'నల్లత్రాగుడు' (నల్ల = నెత్తురు) అనే పేరు పెట్టి చేతులు కడుక్కున్నట్లుంది.

జలగకు పర్యాయపదాలుగా సంస్కృతంలో "అలగర్దం, అస్రపం, జలజంతుక, జలమక్షిక, జలసూచి, జలసర్పిణి, జలూక, జలౌకసం, జలాదని, జలాయుక, జలాసుక, జలిక, జలోరగం, రక్తసం, రక్తసందంశిక, రక్తపాయినీ" వగైరా పదాలున్నాయి. అస్రం, రక్తం అనేవి నెత్తురుకు పర్యాయపదాలు. అది తాగేది కాబట్టే అస్రప, రక్తప, రక్తపాయిని వగైరా పేర్లు వచ్చాయి. నీటిలో ఉండేదికాబట్టే జలూక, జలౌకసం, జలాయుక, జలాసుక, జలిక అనే పేర్లు పుట్టాయి. నీటిలో ఉండే జంతువుల్లో

అదొకటికాబట్టి జలజంతుక అన్నారు. అది నీటిలో ఉండి తుమ్మెదలాగా కుడ్తుంది కాబట్టి జలమక్షిక అన్నారు. అది నీటిలో ఉండి సూదిలాగా (= సూచి) గిచ్చుతుంది కాబట్టి జలసూచి అన్నారు. అది కొందరికి నీట్లో పాములాగా కనిపించి జలోరగమనే పేరుతెచ్చుకొంది (జల+ఉరగం). ఇవన్నీ వర్ణనాత్మకంగా వచ్చినపేర్లే.

## ఉభయచరాలు

ఎటూ భూమ్మీద నల్లినీ, నీటిలోని జలగనూ స్మరించాం కాబట్టి ఈ రెంటిలోనూ తిరిగేకప్పను తలచుకోవటంలో తప్పులేదు. కప్ప అనే అచ్చ తెలుగుమాటకు 'దాటరి, చలికాపు' అనే వర్ణనాత్మక నామాలు పెట్టారు కవిపండితులు. దాటుతూ (ఎగురుతూ) ఉండేది కాబట్టి దాటరి అన్నారు. చల్లని నీటిలో ఉంటుంది కాబట్టి చలికాపు అన్నారు. గోదురు/గోండ్రు కప్పవంటి రకాలున్నాయి కప్పల్లో. కప్పను పూజిస్తే వానపడుతుందనే నమ్మకం ఇంకా ఉంది తెలుగువాళ్ళకి.

కప్పకు సంస్కృత పర్యాయపదాలు 'భేకం, మండూకం, ప్లవగం, ప్లవం(గమం), దర్దురం, శాలూరం/సాలూరం, వర్షాభువు, వర్షాఘోషం, సారంగం' అనేవి. బెకబెక మనేది కాబట్టి భేకం. ఎగిరేది కాబట్టి ప్లవగం/ప్లవం(గమం) అన్నారు (కోతిని వర్ణించినట్లే!). గుర్రుమంటుంది కాబట్టి దర్దురం. వానరాకడ సూచిస్తుంది కాబట్టి వర్షాఘోషం. వానకాలంలో పుడ్తుంది కాబట్టి వర్షాభువు. తక్కినవి విచిత్రనామాలు.

మనకు బాగా పరిచయమైన కప్పలాంటి ఉభయచరాలు మరికొన్ని ఉన్నాయి. ఎండ్రకాయ, తాబేలు, మొసలి లాంటివి. వీటిలో మొదటి రెండూ మానవుల కాహారంగానూ, మూడోది కొన్ని రకాల వైద్యాలకూ పనికివస్తున్నాయి. ఎండ్రకాయకు పర్యాయపదాలనదగ్గ తెలుగు మాటలు "ఎండ్రి, ఎండ్రక, ఎండ్రుక, పీత, గుడిజెల్ల" అనేవి. "ఆరువు, కుళిరం, కుళీరం, పీతం, జలబిల్వం, కులీరం, కర్కటకం, కర్కం, కర్కటం" అనేవి సంస్కృత పర్యాయపదాలు.

ఎండ్రి, ఎండ్రక, ఎండ్రుక, ఎండ్రకాయ అనేవి పరస్పర రూపాంతరాలు. ఆంధ్రప్రదేశ్ దక్షిణప్రాంతంలో ఈ రూపాలకూ, పీత శబ్దానికి ఉత్తర ప్రాంతంలోనూ వా[illegible] ఎక్కువ. సంస్కృతంలోని పీత శబ్దానికి ఇది వైకృతరూపమో ఇదే వారికి ఆధారభూతమో చెప్పటం కష్టం. గుండ్రంగా ఉండే ఒకరకం చేప అనే అర్థంలో 'గుడిజెల్ల' అనే పేరు వచ్చింది. గుడి, గుడును, గుడిసె, గుండ్రం మొదలైన మాటలు ఇంచుమించు సమానార్థకాలు. వంకరటింకరగా కదులుతూ కదలికలో బాధపడుతున్నట్లు కనిపిస్తుంది కాబట్టేమో "సీత బాధలు సీతవి, పీతబాధలు పీతవి" అనే మాట పుట్టింది. దీన్ని భారతీయుల్లో చాలా కొద్దిమంది మాత్రం ఆహారంగా స్వీకరిస్తారు గాని పాశ్చాత్యదేశాల్లో ఇది రుచికరమైన ఆహారం కింద లెక్క. 'ఎండ్రకాయపట్టు' అని దీని గిట్టల పట్టుకో ప్రత్యేకత కూడా వుంది.

అరువనే సంస్కృత పదం బాధించేది, కరిచేది, కుట్టేది అనే అర్థంలో వచ్చిన మాట. కుళిరం, కుళీరం, కులీరం అనేవి రూపాంతరాలు. కుళీ, కుళీరకం అనే రూపాలు కూడా ఉన్నాయి. (కూలం) ఒడ్డున తిరిగేది కాబట్టి ఈ పేరు వచ్చిందంటారు. కర్కం, కర్కటం(కం) అనేవి రూపాంతరాలు. గాయపరిచేది, విషప్రాయమైనది అనే అర్థంలో ఈ మాటలు పుట్టాయి. జల (నీటి) బిలాల్లో (బొరియల్లో) నివసిస్తుందికాబట్టి జలబిల్వ మన్నారు. పీత శబ్దం దాని వన్నెవల్ల వచ్చిందని కొందరు, తెలుగు మాటను యథాతథంగా ఎరువు తెచ్చుకొన్నందువల్ల వచ్చిందని మరికొందరూ వాదిస్తారు. పిల్లలు పొట్ట చించుకుని (తేలులాగా) బయటికి వస్తాయంటారు. "అలీకులీ వృశ్చికవేణురంభా, వినాశకాలే ఫలముద్భవంతి" అని చెప్పారు. అంటే తుమ్మెద, ఎండ్రకాయ, తేలు, వెదురు, అరటి అనే వాటికి సంతాన/ఫల ప్రాప్తితో చావు తప్పదని అర్థం. నిజమా?

తాబేలు, తాంబేలు, తామేలు అనే తెలుగుమాటలు పరస్పరం రూపాంతరాలు. చివరి రూపానికి పుస్తకాల్లోనే ప్రయోగం కనిపిస్తుంది. తాంబేలు శబ్దానికి ఉత్తరాంధ్రలో వాడుక ఎక్కువ. దీనికి కవులో పండితులో పెట్టుకున్న పేరు 'మొగపిరికి' అని! ఇది పిరికివాడైన మగవాడితో పోలిక కాదు. మొగం (ముఖం) చూపడానికి మొహమాటపడే పిరికి జంతువు కాబట్టి ఇలా పేరు పెట్టి కావ్యాల్లో నిఘంటువుల్లో దాచిపెట్టారేగాని ఈ పేరు ప్రజల వాడుకకెక్కలేదు. మెట్టతాబేలు, నీటి తాబేలు అని ఇవి రెండు రకాలు ప్రధానంగా. మొదటిది భూమిమీదనే కనిపించేది. రెండోది ఉభయచరం. అంటే నీటా, భూమ్మీదా తిరిగేది. ఇవి దీర్ఘజీవులు. వెయ్యేళ్ళు బతుకుతాయంటారు. సముద్రపు తాబేళ్ళు చిన్న కొండల్లాంటివి వున్నాయిట.

తాబేలుకు పర్యాయపదాలని చెప్పే సంస్కృత శబ్దాలు "కమఠం, కచ్ఛపం, కూర్మం, అకూపారం, ధులి/ధులి, గుహ్యాం" అనేవి. కమఠమనేది చిన్నది. మెట్టతాబేలు. జాడీలాంటి (ముఖం కల)ది కాబట్టి ఈ పేరు వచ్చిందని చెప్తారు. కచ్ఛం అంటే నీటి ఒడ్డు, నదీ/సముద్ర తీరం. ఆ ప్రాంతాల్లో తిరిగే ఉభయచరాన్ని కచ్ఛపమని పిలుస్తారు. (గుజరాత్ ఉత్తరాన ఉన్న కచ్, ఈ కచ్ఛ శబ్దం నుంచే పుట్టింది. చిత్తడినేల కాబట్టి ఆ పేరు వచ్చింది). కూర్మమనేది సముద్రపు తాబేలు. చాలా పెద్దది. విష్ణుమూర్తి ద్వితీయావతారం. భూభారం మోసింది పురాణాల ప్రకారం. అకూపార శబ్దానికి సముద్రమనే అర్థం కూడా వుంది. అందులో పుట్టిపెరిగే తాబేలును కూడా అదే పేరుతో పిలిచారు. ధులి/ధులి అంటే ఆడతాబేలని తెలుగు నిఘంటువులు చెప్తాయి. గుహ్యాం అంటే రహస్యమని కూడా అర్థం. తలను చిప్పలో దాచుకుంటుంది కాబట్టి వర్ణనాత్మకంగా ఆ పేరు పెట్టారు.

## జలచరాలు

మొసలి అనే ఒక్క మాట తప్ప మరో తెలుగు పేరున్నట్లు లేదు. సంస్కృతంలో చాలా పర్యాయపదాలున్నాయి. "అవహారం, కుంభి, కుంభీర(కం), గ్రాహం, ఝుషం,

వక్రం, మకరం, అంబుగజం, అంబుమర్కటం, అసిదంష్ట్రం, క్షీరశుక్లం, గిలగ్రాహం, జలకపి, జలకంటకం, జలసూకరం, జలజిహ్వం, ఝషాశనం, ప్రోదగ్రహం" మొదలైనవి. వీటిలో గ్రాహం, వక్రం, మకరం అనేవి ఎక్కువ వ్యాప్తిగల శబ్దాలు. తక్కినవి చాలామటుకు వర్ణనాత్మకాలు. అన్నట్లు అచ్చతెలుగు నిఘంటువులు 'కడలిరాతత్తడి, మరువిడాలు' వంటి వర్ణనాత్మక సమాసాలను పర్యాయపదాలుగా పేర్కొంటాయి. కడలి అంటే సముద్రం. దానికి రాజు సముద్రుడు. అతడి వాహనం (తత్తడి) మొసలి–ట. మరుడంటే మన్మథుడు. ఆయనగారికి ఆత్మరక్షణకు మరేమీ దొరక్క మొసలినే డాలుగా వాడ్తారని మన పూర్వకవులు చూసినట్లు చెప్పి ఈ పేరు పెట్టారు!

అవహార శబ్దానికి దొంగతనం, దొంగ అనే అర్థాంతరాలున్నాయి. నీటిలో మునిగిన వాళ్ళను గుట్టుచప్పుడుగా ఈడ్చుకపోయి తింటుందికాబట్టి ఈ పేరు పెట్టారన్నమాట. వక్ర శబ్దాన్ని వ+క్ర అని పాణిని విరగ్గొట్టమన్నాడు. అర్థవిశేషం మాత్రం అస్పష్టంగానే ఉంది. కుంభి, కుంభిర(కం) అనేవి పరస్పర రూపాంతరాలు. ఈ మాటలక్కూడా దొంగ అనే అర్థమేగాక 'జాడీ లాగా ఉన్న పొడుగుముక్కున్న, నరకప్రాయమైన' అనే విశేషార్థాలు లేకపోలేదు. ఈ జాతి మొసళ్ళు గంగానదిలో ఉంటాయని కోశకారులు వివరిస్తున్నారు. గ్రాహం అంటే మింగేది. కబళించేది. ఝష శబ్దానికి చేప అనేదే సామాన్యార్థం. అదేగాక మొసలికి ఝషాశనం (చేపలను తినేది) అనే మరో పేరు ఉండనేఉంది. అలాంటప్పుడు మొసలికి ఝషమనే పర్యాయపదముందని కొన్ని నిఘంటువు లెలా చెప్తున్నాయో అర్థం కాదు. గిలమన్నా గిలగిలమన్నా మింగటమనే అర్థముంది. గిలగ్రాహం అనే ఒక అర్థంగల రెండు మాటలతో దానికెందుకు పేరు పెట్టారో బోధపడదు. క్షీరం అంటే పాలు, పాలలాగా తెల్లగా ఉండే వీర్యం (నెత్తురయినా కాదు!) కలదని క్షీరశుక్లమనే పేరు వచ్చిందంటారు. చూసిన వారికే తెలియవలసిన విషయమది.

మొసలి పర్యాయపదాల్లో మకరమనేది విశిష్టమయినది. దాని వ్యుత్పత్తిని నిష్కర్షగా చెప్పలేం. కానీ దానికి దేవతలతో, మంత్రతంత్ర శాస్త్రాలతో చాలా సంబంధముంది. మకరలగ్నం, మకరసంక్రాంతి వంటివి ఖగోళ విజ్ఞానానికీ మొసలి రూపంలో కనిపించే చుక్కలకూ (నక్షత్రాలకూ) సంబంధించిన పదాలు. పాండిత్యానికి చిహ్నంగా చెవులకు తగిలించుకునే మకరకుండలా లుండనే ఉన్నాయి. మన ప్రబంధ సుందరీ మణులు చెంపలమీద మకరికాపత్రాలు అలంకరించుకొనే వాళ్ళు. అంటే మొసలిరూపంలో రంగు బొమ్మలు అద్దించుకునేవాళ్ళు. సముద్రానికి మకరాలయం (మొసళ్ళకు ఆటపట్టు) అనే పేరు పెట్టారు. అన్నిటికన్నా ముఖ్యం మన్మథుడంటారే ఆ మహాత్ముడే తన జెండామీద మొసలిబొమ్మ గీయించుకున్నాట్ట. అందుకే ఆయన్ని మకరధ్వజుడంటారు. మకర శబ్దంతో తయారైన కొన్ని సమాసాలకు చెప్పరాని అర్థాలు కూడా ఉన్నాయి. అసి అంటే కత్తి. దానిలా పదునైన కోరలున్నది కాబట్టి అసిదంష్ట్రమనే పేరువచ్చింది.

నీటిలోని మొసలి ఒక్కొక్కరికి ఒక్కోరకంగా కనిపించివుంటుంది. లేదా దాన్ని చూసినప్పుడు పుట్టిన భయంతో తడవ కోరకంగా ఉందనే భ్రాంతి కలిగయినా

ఉంటుంది. ఈ భావాలను జలం, అంబువు— రెంటికీ నీరనే అర్థం— అని మాటలతో జోడించి రకరకాల పేర్లు పెట్టారు. అది ఏనుగులాగా (గజం), కోతిలాగా (మర్కటం, కపి), ముల్లులాగా (కంటకం), పందిలాగా (సూకరం), చాచిన నాలుకలాగా (జిహ్వా), పెద్ద దెయ్యంలాగా (గ్రహం) కవిపించిందన్నమాట. హ్రదం అంటే సరస్సు. పెద్ద చెరువు. చెరువుల్లో మొసళ్ళుంటాయని మరిచి వర్ణించిన పెద్దకవులే ఉన్నారు. సంతాన సాగరమనే చెరువులో తిమింగలాలు కూడా ఉన్నాయని వర్ణించిన శ్రీనాథుడు పాపం మొసలిని వదిలేశాడు! అదొక్కటే మొసలికి జరిగిన అమర్యాద.

జలచరాల్లో ఆహారపదార్థంగా ఉపయోగపడే సాధారణ ప్రాణి చేప. చేపల్లో వేల రకాలున్నాయి. చేప అనే సాధారణాంధ్రపదానికి 'మీను, మచ్చెం, తెరగంటి' అనేవి పర్యాయపదాలంటారు. మీను శబ్దం సంస్కృతంలోని మీన పదభవమని సంప్రదాయ పండితులు చెప్తారు. ఆ మాటకు సంస్కృతంలోగాని, దాని సోదరార్యభాషల్లో గాని సరైన వ్యుత్పత్తి లేదనీ అది మీను అనే ద్రవిడ శబ్దానికి సంస్కృతీకరణమనీ ఆధునికుల వాదన. మిన్ను, మినుకు మొదలైన అచ్చతెలుగు మాటల్లోనూ మీను శబ్దంలోనూ ఒకే ధాతు వుందనేది మరో ఉపపత్తి. మచ్చెం అనేది మాత్రం నిస్సందేహంగా సంస్కృతంలోని మత్స్య శబ్దభవమే. చేప అనేదే సాధారణపదం. మీను కావ్యభాషలో అధికవ్యాప్తిగలమాట. తెరగంటి అంటే మూయని కన్నున్నదని అర్థం. ఇది కవులు కల్పించిన మాట. దీనికి దేవత అనే అర్థవిశేషముంది. ఆ అర్థంలోనే — కళ్ళు మూతపడని వాళ్ళనే అర్థంలోనే — ఈ పదానికి అత్యధిక వ్యాప్తి కావ్యభాషలో కనిపిస్తుంది. లోక వ్యవహారంలో దానికి ప్రయోగమున్నట్లే లేదు.

చేపకు పర్యాయపదా లనదగ్గ సంస్కృత పదాలు "పృథురోమం, ఝషం, మత్స్యం, మీనం, చపలం, విసారం, వైసారిణం, అండజం, శకులి" వంటివి. పృథు అంటే పెద్ద. రోమం అంటే వెంట్రుక. ముళ్ళ చేపలను మాత్రమే ఈ పేరుతో పిలుస్తారు. ఝష శబ్దం చేప అనే అర్థంలోనే ఎక్కువ వ్యాప్తిగలది. ఝషాశనమయిన మొసలికిది పర్యాయపదమనటం అసంగతం. మత్స్యశబ్దానికి మచ్చ అనే రూపాంతరముంది. అది ప్రాకృత రూపమని చెప్తారు. మత్స్యం అంటే హుషారయినదని అర్థం. అనుక్షణం ఈదుతూ కదులుతూ ఉంటుంది కాబట్టి ఈ పేరు వచ్చింది. ఇది నిజానికి చాలా పెద్ద చేప. విష్ణుమూర్తి ప్రథమావతారమిదే. పాఠ్యగ్రంథాల్లో ఝకారాన్ని పరిచయం చేయడానికి వాడినందువల్ల ఝషశబ్దమూ, అదో పరిశ్రమకు నేటి పేరుగా నిలిచినందున మత్స్య శబ్దమూ ఇప్పటి వాడుకలో నిలిచాయని చెప్పాలి. ద్రవిడ భాషల నుంచి అత్యంత ప్రాచీన కాలంలో మీన శబ్దాన్ని ఎరువుమాటగా తెచ్చుకున్న సంస్కృతం దాన్ని స్వాయత్తం చేసుకుంది. అందుకే మీనాక్షి వంటి అనేక సమాసాలు ఆ భాషలో సహజమైపోయాయి. ఎప్పుడూ కదలాడుతుంటుంది కాబట్టి చపలమన్నారు. విపరీతంగా కదులుతుంది కాబట్టి విసారం అన్నారు. దానిమీది తద్ధితరూపమే వైసారిణం. చేప గుడ్డు నుంచి పుడ్తుంది కాబట్టి అండజమన్నారు. అండమంటే గుడ్డు. ఈ మాట పక్షి సాధారణానికి కూడా అన్వయిస్తుంది. శకులి అనే పేరు మెరిసే తలగల చేపలకు చెల్లుతుంది.

'పిల్లమీను, జెల్లమీను' అనే తెలుగు మాటలకు సమానార్థకంగా 'గండకం,

శకులార్భక'మనే సంస్కృతపదా లున్నాయి. తెలుగులో 'కొర్రమీను' అనేదాన్ని సంస్కృతంలో 'పాఠీన'మంటారు. దానికే సహస్రదంష్ట్రం (వేయి కోరలున్నది) అనే మరో పేరుంది. అలాగే 'ఉలసమీను' అనే తెలుగుమాటకు 'ఉలూపి, శిశుకం' అనే పేర్లు సంస్కృతంలో ఉన్నాయి. అర్జునుణ్ని తీర్థయాత్రా సమయంలో పెండ్లాడిన ఉలూచిని కొందరు ఉలూప/ఉలూపి అని కూడా వ్యవహరించారు. ఎందుకో! బేడిస చేపను సంస్కృతంలో శకులం అంటారు. మిట్ట అనే పదాన్ని 'శఫరి, ప్రోష్ఠి' అని పిలుస్తారు సంస్కృతంలో. శఫరి అంటే ఆడబేడిస అని కొందరి వ్యాఖ్యానం. శిశుక శబ్దానికి పిల్ల చేప అనే అర్థాంతరముంది. శఫరీ శబ్దానికి 'శఫ, సఫర' అనే రూపాంతరాలున్నాయి. మిలమిల్లాడేది, చిన్నది అనే అర్థవిశేషాలున్నాయి. నీటి అట్టడుగున జీవించేది ప్రోష్ఠి. ఇలా ఎన్నో భేదాలున్నాయి.

# క్రిమికీటకాలు

ఇళ్ళలో బాధాకరమైన కీటకాల్లో తేలొకటి. కోళ్ళు పెంచేవాళ్ళకు దీనివల్ల ప్రమాదం తక్కువ. బల్లులు కూడా తింటాయి వీటిని. తేలనేది తెలుగులోని సాధారణ పదం. పుస్తకాల్లో దీనికి 'ములుపురువు, మంటితిండి' అనే కల్పిత నామాలున్నాయి. ముల్లుగల పురుగనే అర్థంలో మొదటి మాటను, మట్టి మాత్రమే తిని బతుకుతుందని రెండోమాటను పుట్టించారు! రెండోమాట మన కవి పండితుల అజ్ఞానాన్నో అమాయకత్వాన్నో లోకజ్ఞానలోపాన్నో స్పష్టీకరిస్తుంది. పెద్ద సైజు తేలును 'మండ్ర, గబ్బ, మండ్రగబ్బ, పొట్టియు, వలపురుగు' అనే తెలుగు పేర్లతో పిలుస్తారుగాని మండ్రగబ్బ అనేదే అత్యంత వ్యాప్తిగల పదం. వల శబ్దం వలమనేదానికి సమాసంలో కనిపించే రూపాంతరం. లావుపాటిదని అర్థం. నల్ల తేలు, ఎర్రతేలు అనేవి ప్రధాన భేదాలు. నల్లతేలును 'ఎనుపతేలు (ఎనుము అన్నట్లు), నల్లకాలు' అని కూడా వ్యవహరిస్తారు.

తేలుకు 'వృశ్చికం, శూకకీటం, అలి/ఆలి, ద్రుణం/ద్రూణం/ద్రోణం, కర్కోటకం, కాలిక, ఖర్జూరం, విషపుచ్ఛం, పృదోకువు, షడ్బిందువు' అనే సంస్కృత పదాలు సమానార్థకాలు. వీటిలోని మొదటి రెండు మాటలూ ఎర్ర తేలునూ, అలినుంచి కాలిక దాకా ఉన్నమాటలు నల్లతేలునూ సూచిస్తాయి. వీటిలో వృశ్చిక శబ్దం రెండురకాల తేళ్ళకూ వర్తిస్తుందని కొందరంటారు. ఒక నక్షత్రరాశి, ఒక లగ్నం అనే సందర్భంలో ఈ మాటనే జ్యోతిషులు వాడుతారు. 'కుట్టు, పడగొట్టు' అనే అర్థాల్లో ఈ మాట పుట్టింది. శూకమంటే ముల్లు. అదిగల పురుగు శూకకీటం. అల్ అంటే 'ముల్లుకొండి'. అది ఉన్నది అలి/ఆలి. అలీ/అళీ శబ్దం తుమ్మెద అనే అర్థంలో ఎక్కువ వాడుకలో ఉన్నమాట. కాలిక అంటే నల్లగా (కాలవర్ణంలో) ఉన్నదని. కాళీ/కాళికా శబ్దం నల్లని దేవత అనే అర్థంలోనే అత్యంత వ్యాప్తిలో ఉంది.

కర్కమంటే విషం. విషప్పరుగు కాబట్టి కర్కోటకమన్నారు. అయితే ఈ పేరు పాము అనే అర్థంలోనే వ్యవహారంలో నిలిచింది. ఖర్జూర శబ్దానికి ఒకరకం ఎండుపండనే అర్థంలోనే వాడుక చాలా ఎక్కువ. కఠినమైనదనే అర్థంలో ఆ మాట పుట్టింది. తోకలో (పుచ్ఛం) విషముంటుంది కాబట్టి విషపుచ్ఛమన్నారు. ఆరుకాళ్లకు సరిపొయ్యే విషముంటుందని లెక్కించిన ఏ వైద్యుడో దానికి షడ్బిందువనే పేరు పెట్టాడు. (షట్ = ఆరు+బిందువు = చుక్కలు గలది – షడ్బిందువు). తడవకొక చుక్క మాత్రమే విషం వదలకపోతే లెక్క తప్పిపోతుంది. మండ్రగబ్బను సంస్కృతంలో పృథువృశ్చికమంటారు. పృథువంటే పెద్ద. చాలా పెద్దదనే అర్థంలోనే భూమికి పృథ్వి అనే పేరు వచ్చిందనేవాళ్ళున్నారు.

తేళ్ళను తినే బల్లిని స్మరించడం మంచిది. అంతేగాదు. బల్లిపాటునుబట్టి, అదిచేసే చప్పుడునుబట్టి (ఈ చప్పుడును గౌళి పలుకని చెప్తారు) శకునాలు చెప్పేవాళ్లున్నారు. కర్మసిద్ధాంతం మీద నమ్మకం తగ్గినప్పుడు శకునాలమీద అదే పాళ్ళలో విశ్వాసం పెరుగుతుంది. ఇళ్లలో తిరిగే రకరకాల పురుగులను భక్షించి ఇల్లు శుభ్రంచేస్తూ అడపాదడపా శకునాలు చెప్పి మనల్ని హెచ్చరించే మహామేధావి అన్నమాట బల్లి. ఈ తెలుగు బల్లికి గౌళి అనే మరో తెలుగుమాటే పర్యాయపదం. గౌళి శబ్దం జ్యోతిషార్థంలోనే ఎక్కువ వ్యాప్తిగల మాట.

బల్లికి పర్యాయమైన సంస్కృతపదాలు 'ముసలి/ముశలి, గృహోలి(క)/గృహోలికి, గృహగోలకం, జ్యేష్ఠ, గోధ/గోధిక' అనేవి. (కాటకాలను) ధ్వంసం చేసేదనే అర్థంలో ముసలి/ముశలి అనే పేరు వచ్చింది. దురదృష్టం తెచ్చేదనే అర్థంలో జ్యేష్ఠ (= పెద్దమ్మ) అనే మాట పుట్టింది. తెలుగు బల్లి మేలుచేస్తే సంస్కృతబల్లి అపశకునంగా ఉండేదేమో చెప్పలేం. బల్లి చాలా ప్రమాదకరమైన విషకీటకమనే విశ్వాసం చాలామందిలో ఉంది. అయితే శాస్త్రజ్ఞులు మాత్రం విభేదిస్తారు. ఇంట్లో తిరిగేదనే అర్థంలో గృహోలిక వగైరా పేర్లు వచ్చాయి. గోధ/గోధిక అనే మాట బల్లి జాతికే చెందిన 'ఉడుము' అనే జంతువుకే ఎక్కువగా అన్వయిస్తుంది. అర్థస్పష్టత కోసం ఇంటిబల్లిని కొందరు గృహగోధ/గృహగోధిక అని పిలుస్తారు. బల్లుల పోరును రాజకీయనాయకుల పోరాటంతో పోలుస్తారు. కొట్లాడే బల్లులు ఒకదాని తోకను మరొకటి నమిలివేస్తాయి. తలలుమాత్రం క్షేమంగా ఉంటాయి. పోయిన తోకలు కొంతకాలానికి మళ్ళీ మొలుస్తాయి – పార్టీల కార్యకర్తలు మారినట్లు, లేదా కొత్త కార్యకర్తలు ఏర్పడ్డట్లు. అయితే బల్లులు బోధించే ఈ నీతిని మాత్రం సామాన్యమానవులెవరూ గ్రహించిన దాఖలా కనిపించదు. అందుకే నేతలు మన తలరాతల్లాగా, బల్లుల తలల్లాగా పార్టీలు ఫిరాయిస్తూ సుఖంగా ఉంటున్నారు.

బల్లికీ, పాముకూ మధ్యలో ఉండే మరో సాధారణ సరీసృపం తొండ. అది ముదిరితే ఊసరవెల్లి అవుతుందని సామెత. తెలుగులో తొండ, ఊసరవెల్లి అనే మాటలు తప్ప మరికొన్ని పర్యాయపదాలు లేవు. సంస్కృతంలో అనేకమున్నాయి.

తొండకు సంస్కృతంలో చాలా పేర్లున్నాయనుకున్నాం. అవేమంటే "సరట(ం)/ సరటువు, కృకలాసం, క్కకూలాసం, ప్రతిసూర్య(క)ం, అండజం, కంటకాగారం,

కులాహకం, కృకవాకువు, క్రకచపదం, గాత్రసంకోచి, జాహకం, దురాలోహం, శరండం, కామరూపి, (చిత్ర)బింబం" మొదలైనవి. సరట, కృకలాసం అనేవి మాత్రమే అధిక వ్యాప్తి గలవి. కృకం అంటే గొంతు, స్వరపేటిక. ఎప్పుడూ కదలాడుతుండే గొంతుకలది కాబట్టి కృకలాస, కృకూలాస, కృకవాకు శబ్దాలు వర్ణనాత్మకంగా కల్పించారు. కృకవాకు శబ్దానికి కోడిపెట్ట, నెమలి వంటి ఇతరార్థాలున్నాయి. క్రకచమంటే రంపం. దానిలా కక్కులు కక్కులుగా ఉండే కాళ్ళున్నది కాబట్టి క్రకచపదమన్నారు. జాహశబ్దానికి "బొడిపె, దద్దురు, పొడుచుకొని వచ్చిన ఎముక" మొదలైన అర్థవిశేషాలున్నాయి. దాని కాళ్ళ లక్షణ మలా ఉంటుంది కాబట్టి జాహకమన్నారు. శరండ శబ్దానికి సరండమనే రూపాంతరముంది. దానికి 'దొంగ, మోసగాడు' వగైరా అర్థాలున్నాయి. రంగులు మార్చి దొంగ వేషాలు వేస్తుంది కాబట్టి ఆ పేరు పెట్టారు. దురాలోహం అంటే చక్కని ప్రకాశవంతమైన, ఆకర్షకమైన అనే అర్థాలు. దాని బింబం (రూపం) చిత్రంగా మారుతుంటుంది కాబట్టి ఆ పేరు వచ్చింది. రంగులు మార్చే రాజకీయవాదులను అందుకే ఊసరవెల్లులంటారు.

## పాముజాతి

మానవజాతికి అటు భయం, ఇటు భక్తిభావం కల్పించే సరీసృపం పాము. పామనే తెలుగు మాటకు గురికి బెత్తెడెడంగా ఉండే సమానార్థకపదాలు సహజమైనవీ కవిపండితులు సృష్టించినవీ చాలా ఉన్నాయి. అవి అచ్చ తెలుగులో "కరువలి మేతరి, కంటివిన్కరి, పుట్టకాపరి, బుసపురువు, చుట్టుపురుగు, త్రాచు, సప్పం, నిడుపడు, పడగదారి, గాలిమేతరి, విసదారి, కానరాని కాళ్ళయది, చిలువ/చిల్వ, వీనులకంటి, పుట్టపెట్టెపట్టు" వగైరాలు. సంస్కృత సమానార్థకాల సంఖ్య తక్కువేమీకాదు. అవి "సర్పం, పృదాకువు, భుజ(ం)గ(మ)ం, అహి, ఆశీవిషం, విషధరం, చక్రి, వ్యాలం, సరీసృపం, కుండలి, గూఢపాత్తు, చక్షుశ్శ్రవం, కాకోదరం, ఫణి, ఫణభృత్తు, దర్వీకరం, దీర్ఘపృష్ఠం, దందశూకం, బిలేశయం, పన్నగం, భోగి, భోగధరం, జిహ్మగం, పవనాశనం, లేలిహానం, ద్విరసనం, కుంభీనసం, ద్విజిహ్వం, హరి" వగైరాలు.

నిర్మాణ సామ్యాన్ని బట్టి తెలుగు సంస్కృత పదాలను ఒకేతీరున వివరించవచ్చు. పాములు గాలినిమేసి బతుకుంటాయనే (మూఢ)విశ్వాసంతో (అవి కప్పలనూ, ఎలుకలనూ ఇంకా అనేక జీవాలను తింటాయి) పెట్టిన తెలుగు పేర్లు 'కరువలిమేతరి, గాలిమేతరి' అనేవి; సంస్కృతపదాలు 'పవనాశన' మనేది (పవనం=గాలి, అశనం=తిండి). అది చుట్టుచుట్టుకొని పడివుంటుందనే అర్థంలో వచ్చిన వాటిలో 'చుట్టుపురుగు' అనే తెలుగు మాటలాగే 'చక్రి, కుండలి' అనే సంస్కృత పదాలు వచ్చాయి. పడగగలది అనే అర్థంలో 'పడగదారి' అనే తెలుగుమాట, ఫణి/ఫణభృత్తు, 'భోగి, భోగధరం', అనే సంస్కృత శబ్దాలూ పుట్టాయి. దాని నాలిక రెండుగా చీలి వుంటుందనే భావంతో తెలుగులో 'చిలువ/చిల్వ', సంస్కృతంలో 'జిహ్మగం, ద్విరసనం, ద్విజిహ్వం' అనే మాటలు వచ్చాయి. దానికి విషముంటుంది కాబట్టి 'విసదారి' అనే తెలుగు మాట, 'ఆశీవిషం, కాకోదరం, విషధరం, కుంభీసనం' అనే సంస్కృత పదాలూ పుట్టాయి.

ఇది చెవులతోనే చూస్తుందనీ, కళ్ళతో వింటుందనీ కొందరి నమ్మకం. అదృష్టితో తెలుగులో 'వీనుల కంటి, కంటివిన్కరి' అన్నారు. సంస్కృతంలో 'చక్షుశ్శ్రవం' అన్నారు. 'పాము కాళ్ళు పాముకే తెలుసు' అనే సామెత పుట్టింది. దానికాళ్ళు కనిపించవనీ, రొమ్ముతో దేకుతుందనీ నమ్మి తెలుగులో 'కానరాని కాళ్ళయది' అనే పేరు సృష్టించారు. సంస్కృతంలో 'భుజ(ంగ(మ)ం), ఉర(ం)గ(మ)ం, గూఢపాత్తు, పన్నగం' అనే మాటలు వచ్చాయి.

చీమలు పెట్టిన పుట్టల్లోనూ బొరియల్లోనూ పొదల్లోనూ పాములుంటాయి కాబట్టి ఈ లక్షణాన్నిబట్టి దానికి మరికొన్ని పేర్లు వచ్చాయి. అవి తెలుగులో "పుట్టకాపరి, పుట్టపెట్టిపట్టు" అనేవి; సంస్కృతంలో 'దర్వీకరం, బిలేశయం' అనేవి. పాము బుసకొడ్తుంది. కాబట్టి దాన్ని 'బుసపురు'వన్నారు తెలుగులో. అది నాలుకలు చాస్తుంటుంది కాబట్టి 'లేలిహాన' మన్నారు సంస్కృతంలో. పొడుగ్గాఉంటుందని "నిడుపడు" అని తెలుగులోనూ దీర్ఘపృష్ఠమని సంస్కృతంలోనూ పిలిచారు. సరసరపాకుతుందని 'సర్ప' మన్నారు. నీళ్ళలోనూ ఉండగలదు కాబట్టి అహి. ప్రమాదకరమైన శూకం (కోర) కలది కాబట్టి 'దందశూకం'. విషం కక్కేది కాబట్టి వ్యాలం/వ్యాళం. ఒకప్పుడు పాముకు మాత్రమే పరిమితమైన సరీసృపశబ్దం ఇప్పటి శాస్త్ర గ్రంథాల్లో ఆజాతి జంతుజాలమంతటికీ పేరయిపోయింది. ఇక హరి అనే శబ్దానికి అనేకార్థాలున్నాయి. అందులో పామనేది ఒకటి. అలాంటిదే నాగ శబ్దం కూడా. ఈమాట మీద 'నాగమయ్య, నాగయ్య, నాగమ్మ' లాంటి అర్ధ సంస్కృత శబ్దాలుద్భవించాయి తెలుగులో.

నీటిపామును సంస్కృతంలో అలగర్ద, అలిగర్ద, అజగర్ద శబ్దాలతో పిలుస్తారు. గర్దమంటే ఆకలి. కాకిలాగా పాము ఎప్పుడూ ఆకలితో ఉంటుందనే నమ్మకంతోనే కాకోదరమని పిలిచారని కొందరివాదం. కొండచిలువను సంస్కృతంలో 'గోనసం, తిలిత్సం' అని పిలుస్తారు. తిలిత్స శబ్దానికి రూపాంతరాలో పర్యాయపదాలో తేల్చరాని తిల్పింజ, తిల్పితిక, తిల్వితిక శబ్దాలవంటివి కూడా కొండచిలవకు పేర్లే. అంతకన్నా శరీర పరిమాణంలో చిన్నదయిన చిలవను సంస్కృతంలో 'అజగరం, శయువు, వాహనం' అనే పేర్లతో పిలుస్తారు. అజ శబ్దానికి మేక వగైరా అర్థాలున్నాయి. గరం అంటే విషం. చిన్నజంతువులను మింగుతుంది కాబట్టి ఈ మాటలు పుట్టాయి. కొందరేమో వాహనం అనేది కొండచిలువకే పేరంటారు. మరికొందరు పూజలందుకొనే పామునే ఆపేరుతో పిలవాలంటారు. శయువంటే మందకొడిగా పడివుండేదని అర్థం. కొన్ని నిఘంటువులు అజగర్దాది నామధేయాలు నీటి పాముకే గాని ఇతరాలకు చెందవంటాయి. నీటిపామును తెలుగులో 'నీరు కట్టుపాము' అని కూడా పిలుస్తారు.

విషంలేని రెండు తలల పామును తెలుగువాళ్ళు 'శిఖండి, ఇరుదలలశిఖండి' అని పిలుస్తారు. అయితే శిఖండి అనే సంస్కృత శబ్దానికి ఆ అర్థం కనిపించదు. దాన్ని సంస్కృతంలో 'రాజిలం' అని పిలుస్తారనే విషయంలో భేదాభిప్రాయం లేదుగాని 'డుండుభ' మనేది దానికి పర్యాయపదమా కాదా అన్నది వివాదగ్రస్తమే. కొందరు దయ్యం బల్లిని (పెద్దబల్లి) డుండుభ మనాలని వాదిస్తారు.

# వాహనాలు

కొంత మార్పుకోసం విషయాంతరానికి వెళ్దాం. మానవులను మోసే జంతువులకూ, వస్తువులకూ సరిపోయే మాటలున్నాయి. వాటిలో వాహనమనేది ఎక్కువ వాడుకలో ఉన్న సంస్కృతపదం. "వాహం, యానం, యుగ్యం, పత్రం, ధోరణం, ప్రవహణం, శకటం/శకటి(క)" మొదలైనవి దానికి పర్యాయపదాలంటారు. వహించేది అంటే మోసేది వాహనం. వాహమనేది దానికి రూపాంతరం. అది జంతువయినా కావచ్చు; బండి అయినా కావచ్చు. మన పురాణాల్లో నరుణ్నే వాహనంగా వాడుకునే కుబేరుడనే దిక్పాలకుడున్నాడు. నరవాహనదత్తుడనే విద్యాధరుడైన మహారాజా ఉన్నాడు. గుర్రాన్నీ వాహనమంటాం; బండినీ, పడవనూ అలాగే పిలుస్తాం. యాన శబ్దం విడిగా కన్నా ప్రయాణ శబ్దంలో భాగంగా ఎక్కువ వ్యాప్తిలో ఉంది. దానికర్థాలు కదిలేది, నడిచేది, పోయేది వగైరాలు. పత్రమనే పేరెందుకు వచ్చిందో గాని చక్రాల మీద నడిచే ఏ బండికయినా అది సరిపోతుందని నిఘంటువులు చెప్తాయి. అయితే ఆ మాటకు కావ్యప్రయోగాలున్నట్లులేదు. తక్కిన మాటలు సాధారణపదాలు కావు.

యుగ్యం అంటే కాడి (యుగం)కి కట్టిన జంతువులున్న వాహనం. ధోరణం అంటే బరువులు మోసే, కాడికట్టిన జంతువులులాగే వాహనం. దీనికి దూర్వుజమనే రూపాంతర ముందంటారు. ప్రవహణ శబ్దానికి స్త్రీలను తీసుకపోయే బండి అనే అర్థం కొందరు చెప్తే, మరికొందరు 'తలుపులున్న బండి' అంటారు. ఆ అర్థంలో సంస్కృతంలో 'డయనం, పల్యంకికా' అనే మాటలున్నాయి. పల్యంకిక అనేది మన పల్లకీ అన్నమాట. ఇప్పుడెక్కడైనా వాడుకలో ఉన్నవో లేదో తెలియదుగాని 'మేనా'లుండేవి పూర్వం. వాటికి చెక్కతలుపులుండేవి. పల్లకీకి తలుపులుండవు. అదే భేదం. శకట శబ్దానికి స్పష్టమైన వ్యుత్పత్తిలే దంటాడు మోనియర్ విలియమ్స్. (మోయడానికి) సమర్థమైనది అనే అర్థంలో ఆ మాట పుట్టిందంటారు కొందరు. శకటి(క) అనేది 'బొమ్మబండి' అని అతడు విస్తరిస్తాడు–మృచ్ఛకటిక (మృత్=మట్టి+శకటిక=చిన్నబండి) ఉదాహరించి. 'అనం' అనేది బండి అనే అర్థంగల సంస్కృతపదమని కొన్ని నిఘంటువులే చెప్తాయి.

తెలుగులో 'మోసేది' అనే సాధారణార్థంలో ప్రత్యేక పదమున్నట్లులేదు. 'తేజీ, బాబా' వగైరా గుర్రం మొదలైనవాటి పర్యాయపదాలనే వాహనసామాన్య శబ్దాలుగా వాడటం తెలుగులో పరిపాటి. 'ఎక్కుడు' వంటి మాటల్లేకపోలేదు. కాని వాటి వాడుక కావ్యాల్లోనేగాని నిత్యవ్యవహారంలో చాలా తక్కువ. శకట శబ్దానికి సమానమైన తెలుగుమాట బండి. అది చాలా చక్కనిమాట. భూమ్మీదకదిలే అన్నిరకాల వాహనాలనూ బండి అనే వ్యవహరిస్తుంటాం. ఈ తెలుగుమాట ద్రావిడ శబ్దం. తమిళం మలయాళం వంటి సోదరభాషల్లో దీని రూపాంతరాలు 'పండి, వండి' వంటివి వినిపిస్తాయి. కన్నడంలోని బండి శబ్దం సమానార్థకం. ఆ భాషలో ఆ మాటకు 'చక్రం' అనే అర్థం కూడా ఉంది. ఈ పదం సంస్కృత

ప్రాకృతాల్లోకేగాక ఇంగ్లీషులోకి కూడా వ్యాపించింది. సంస్కృతంలో దీని రూపం 'భండి'. ప్రాకృతంలో 'భండి, భండియా' అనే రూపాలున్నాయి. ఇంగ్లీషులో bandy అనే రూపంలో నిఘంటువులకెక్కింది. గడ్డిబండిని తెలుగులో 'ఈడిక, సరపడి, కట్లంచు, కట్లమంచం' వగైరా పేర్లతో పిలుస్తారు.

బండి శబ్దానికి కావ్యభాషలో 'బడి' అనే విచిత్ర రూపముంది. 'సారథి ఛాందసుండు, బడిసాగదు, పాతగుఱాల జంట' అనే తెనాలి రామకృష్ణకవి ప్రయోగ ముంది. మరెవ్వరూ ఈ రూపం వాడినట్లులేదు. పూర్వం జూదమాడించటానికి బళ్ళమీద ఊరూరూ తిరిగేవారు. ఆ బండిని–పావులు వగైరా తీసుకపోయేదాన్ని–'సగటు' అనే వాళ్ళు. మాటను చూసిచూడగానే అది సంస్కృతంలోని శకట శబ్దభవ మనిపిస్తుంది. పైన కంబళికప్పిన ఎడ్లబండిని 'గంత్రి' అనే వాళ్ళు. అది బహుశా సంస్కృత శబ్దమే కావచ్చు– గమనం/కదలిక సూచించే 'గం' ధాతురూపం కనిపిస్తుంది కాబట్టి.

తెలంగాణా వ్యవహారంలో 'కచడం/కచరం' అనే మాట వినిపిస్తుంది. అది సాధారణంగా చిన్నచక్రాలున్న ఒంటెద్దు బండి. శకట శబ్దం 'చకటం'గానూ, వర్ణ వికారం వల్ల తరవాత 'కచడం'గానూ మారివుంటుందని కొందరి అనుమానం. తెలుగు నిఘంటువుల్లోనయితే 'కంచరం' అనే మాట వినిపిస్తుంది. అది కంచర గాడిదలు గట్టిన బండి ఒకప్పుడు. శ్రీకృష్ణుడు నిర్యాణానికి ముందు దారుకుణ్ని పిలిచి కంచరగాడిదలు కట్టిన చిన్నచక్రాల తేరులో హస్తినకుపోయి అర్జునుణ్ని తీసుకరమ్మంటాడు. చిన్నచక్రాలు వేగవర్ధకాలు. కంచరగాడిద అంతదూర ప్రయాణభారం తట్టుకోగల జంతువు. ఇప్పటి సైన్యం కూడా ప్రయాసతో కూడిన ప్రయాణాలకూ బరువులు మోయగలగటానికీ తొందరలేని సమయంలో కంచరగాడిదలనే వాడుతుండటం విశేషం. ఆ బండికే కప్పుంటే 'కర్ణీరథం' అనే పెద్ద పేరుండేది – సంస్కృతంలో. ఆ భాషలో వాహన శబ్దానికి 'అనం' అనే పర్యాయపదముందంటారుగాని దాని వ్యుత్పత్తి స్పష్టంకాదు.

యుద్ధానికి తీసుకపోయే బండిని తెలుగులో 'తేరు, అరదం' అని పిలుస్తారు. రెండో మాట సంస్కృతంలోని రథ శబ్దం నుంచి పుట్టింది. తొలితరం రథాలకు ఎడ్లనే కట్టేవాళ్ళు. నాగరకత పెరిగిన తర్వాత గుర్రాలు కట్టడం మొదలయింది. తేరు తప్ప అచ్చ తెలుగులో మరో మాటలేదు. సంస్కృతంలో 'శతాంగం, స్యందనం, నేత్రం' వంటి సమానార్థక శబ్దాలున్నాయి. శతమంటే నూరు. నూరు అంగాలు (భాగాలు) ఉన్న పెద్దబండి శతాంగం. కేవలం యుద్ధంలో వాడే తేరును స్యందనం అంటారు. అంటే త్వరగా కదిలేదని అర్థం. నేత్రమనే పేరెందుకు వచ్చిందో చెప్పలేం.

రథాల్లో రకాలున్నాయి. ఉపయోగభేదాన్ని బట్టి పేర్లు పెట్టారు. 'పుష్పరథం, పుష్యరథం' అనే పేరుగల రథం విహారం కోసం ఉద్దేశించింది. పులితోలు కప్పిన రథాన్ని 'వైయాఘ్రం, ద్వైపం' అనేవాళ్ళు. వ్యాఘ్రశబ్దం నుంచి పుట్టిన తద్ధితరూపం వైయాఘ్రం. తెల్లకంబళి కప్పగా ఉన్నరథాన్ని 'పాండుకంబళి' అనే వాళ్ళు. గుడ్డకప్పున్న రథానికి 'వాస్త్రం, కంబలం' అని పేరు. ఈ రకం బండిని తెలుగులో "కొల్లార్ బండి, పాటబండి, పొయలబండి"అని ఆయా ప్రాంతాల్లో పిలుస్తారు. ఇలా అనేకం.

# ఆయుధాలు

వాహనమనే అర్థంలో ప్రత్యేక శబ్దం వాడుకలో లేనట్లే ఆయుధమన్నదాని విషయంలో కూడా తెలుగులో ప్రత్యేక సామాన్య శబ్దమున్నట్లు లేదు. కత్తి అనే అర్థమిచ్చే మాటలనే వాడటం మనఅలవాటు. సంస్కృతంలో ఆయుధ శబ్దానికి కొట్లాటకు పనికివచ్చే వస్తువనే అర్థం. దానికి పర్యాయపదాలని చెప్పదగ్గవి 'ప్రహరణం, శస్త్రం, అస్త్రం' అనేవి. ప్రహారమంటే దెబ్బ. దెబ్బకొట్టడానికి పనికివచ్చేది ప్రహరణం. శస్త్రం అనేది చేత్తో పట్టుకొని వాడేది. అస్త్రం విసరివేసేది. ఆయుధాలన్నిటిలోనూ ఎక్కువ వాడుకలో ఉన్నది కత్తి.

కత్తి శబ్దానికి పర్యాయపదాలని అచ్చతెలుగు నిఘంటువులు చెప్పే మాటల్లో మరికొన్ని కలిపివున్నాయి. అవి "కైదువ, వాలు, కరవాలు, మేల్కత్తి, తరవళి, నరాజి, పిరంగి, అడిదం" అనేవి. చేతిలో ధరించేది కైదువ. వాలుగా వీలుగా ఉపయోగపడేది వాలు. కరవాలు అనేది 'చేకత్తి'. చిన్నదన్నమాట. మేల్కత్తి కూడా సమానమే. మేలు అంటే మంచి, పదునైన అని అర్థం. తరవళి అన్న పేరెందుకువచ్చిందో తెలియదు. నరాజి ఉర్దూపదం, అచ్చతెలుగుకాదు. పిరంగి అనేది ఫిరంగి అనే పారశీకపదరూపం. అడిదం అనేది అచ్చతెలుగుమాట. అడి అంటే కొట్టు, నరుకు. అందుకుపయోగించేది కాబట్టి అడిదమన్నారు. కత్తి సాధారణపదం; అత్యధిక వ్యాప్తి కలది. అయితే ఇది కూడా కృత్తనం (నరకటం) చేసేదనే అర్థంలో సంస్కృతభవమని వాదించే వారు లేకపోలేదు.

కత్తుల్లో రకాలున్నాయి. "ఈలి, కరవాలిక/కరపాలిక, తులువకత్తి" అనే పేర్లుగలది చిన్నకత్తి. "చురకత్తి/చూరకత్తి, సురియ" అనేది మరీ చిన్నది. "వాయిదారు" అనేది వంకకత్తి. పాతతెలుగు కావ్యాల్లో "దోదుమ్మి, సైబు, గిరుసు, సురె, సురియ, చూరి" వగైరా కత్తుల్లోని రకాలు కనిపిస్తాయి. మన నిఘంటువుల ప్రస్తుత స్థితిలో వాటి వివరణ కష్టం. సురవరం ప్రతాపరెడ్డిగారు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో ఈ భేదాలను స్పష్టీకరించడానికి ప్రయత్నించారు.

కత్తికి పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృతపదాలు "ఖడ్గం, నిస్త్రింశం, చంద్రహాసం, అసి, రిష్టి, కౌక్షేయకం, మండలాగ్రం, కరవాలం/కలపాలం, కృపాణ" మనేవి ఎక్కువ వ్యాప్తిగలమాటలు. అసి అనేది పలచని కత్తి. వేదకాలంలో జంతు బలికర్మకు వాడేవాళ్ళు. ఖడ్గమంటే ఖండించేది, ముక్కలు చేసేది, నరికేది అని అర్థం. కృపాణమనేది క్రతువుల్లో వాడే చిన్నకత్తి. నిస్త్రింశ శబ్దానికి 'క్రూరమైన, నిర్దాక్షిణ్యమైన' మొదలైన అర్థవిశేషాలున్నాయి. త్రింశ శబ్దానికి ముప్పై అనే అర్థముంది. చాలా అంచులున్న కత్తి అని అర్థం చెప్పవచ్చు. చంద్రహాసం అంటే తెల్లగా ఉండేది. బాగా పదునున్నది అని అర్థం. రిష్ట శబ్దానికి 'బాధించే, గాయపరిచే' లాంటి అర్థవిశేషాలున్నాయి. గాయపరిచేదికాబట్టి రిష్టి అనే పేరు పెట్టారు. కుక్షి అంటే కడుపు. కౌక్షేయక మనేది పొట్ట చీల్చి పేగులు బయటికి లాగడానికి

ఉపయోగించేదని అర్థం. మండలాగ్రమంటే గుండ్రటి అంచుగలదని అర్థం. కరపాలం అంటే చేతిని రక్షించేది. చేతికి బదులుగా దాన్ని వాడి చేతిని కాపాడుకోడానికి వీలుపడేదని అర్థం. కరవాలం ఈ మాటకు రూపాంతరం. ఈ మాటలన్నిటినీ జాగ్రత్తగా పరిశీలిస్తే వేదకాలపు ఆర్యసమాజం యజ్ఞయాగాది క్రతువుల్లో, జంతుబలి సందర్భాల్లో, ఆయాపనులకోసం ప్రత్యేకంగా వాడి పేర్లు పెట్టుకొన్న ఆయుధాలని తెలుస్తుంది. తరవాతి కాలంలో అవే సాధారణార్థంలో కత్తిగా చెలామణీ అయ్యాయని చెప్పవచ్చు. చురకత్తికి సమానార్థకాలని చెప్పదగ్గ సంస్కృతపదాలకు 'శస్త్రీ, అసిపుత్రిక, ఛురిక, అసిధేనుక' వగైరా పేర్లున్నాయి.

కత్తితో బాటు ఆత్మరక్షణకు వాడుకునే సాధనం డాలు. ఈ తెలుగుమాటకు 'అరిగ, కేడెం' అనే పర్యాయపదాలున్నాయి. చివరిమాట భారతాదుల్లో కనిపిస్తుంది. డాలు అత్యధిక వ్యాప్తిగల శబ్దం. దీనికి సంస్కృతపర్యాయపదా లనదగ్గవి "ఫలం, ఫలకం, చర్మ" అనేవి. మొదటి రెండూ ఒకదానికొకటి రూపాంతరాలు. ఫలక శబ్దం నుంచి 'పలక' అనే తెలుగుమాట పుట్టింది. తిక్కన డాలనే అర్థంలో ఈ మాటనే ఎక్కువగా ప్రయోగించాడు. చర్మ శబ్దానికి మామూలర్థమే. ఒకప్పుడు ఖడ్గమృగం చర్మాన్నిగాని, అది దొరకనప్పుడు మొసలి, ఉడుము వంటి జంతువుల చర్మాలనుగాని కత్తిదెబ్బకాచుకోవడానికి వాడేవారు. అలనాటి మాటలే అర్థం మారినా కవులవాడుకలో మిగిలిపోయాయి. నిజానికి ఫలకాదులు కఱ్ఱతో, లోహంతో చేసినవైతే చర్మం తోలుతో చేసింది. దాన్ని కవచంగా చెప్పటం మంచిది.

అన్నట్లు కవచమనేది సంస్కృతశబ్దం. దానికి ఆ భాషలో "తనుత్రాణం, తనుత్రం, వర్మ, దంశనం/దంసనం, ఉరశ్ఛదం, కంకటకం, జాగరం, కంచుకం, బాణవారం" వంటి పర్యాయపదాలున్నాయి. తనువును, శరీరాన్ని కాపాడేది కాబట్టి తనుత్రాణ, తనుత్రశబ్దాలు పుట్టాయి. వ్రణం/గాయం నుంచి రక్షిస్తుంది కాబట్టే వర్మమన్నారు. దెబ్బలుకాచేదికాబట్టి దంశనం/దంసనం. ఉరస్సును-గుండెను-కప్పివుంటుంది కాబట్టి ఉరశ్ఛదమన్నారు. జాగ్రతను సూచించేది కాబట్టి జాగరమనే పేరుపెట్టారు. ఇనపరింగులవంటి వాటితో చేసింది కాబట్టి కంకటక మన్నారు. చొక్కాలాగా తొడుక్కునేది కాబట్టి కంచుకమన్నారు. బాణాలదెబ్బలనుంచి కాపాడుతుంది కాబట్టి-ఆ దెబ్బలను తప్పిస్తుంది కాబట్టి బాణవారం అన్నారు. ఈ మాటకు వారబాణమనే రూపాంతరం కూడా ఉంది. ఉడుము చర్మంతో ఈ కంచుకాలను తయారు చేసేవారు. కత్తిపిడి ఒరపిడినిగాని, అల్లెతాటికోతనుగాని తగ్గించడానికి వేళ్ళకు కూడా ఉడుము చర్మపుతొడుగులు తగిలించేవాళ్ళు. అందుకే దానికి అంగుళిత్రాణ మనే పేరు వచ్చింది-వేళ్ళను కాపాడేది అనే అర్థంలో. కావ్యభాషలో గోధాంగుళిత్రాణం ధరించేవాళ్ళు విలుకాళ్ళు. గోధ అంటే ఉడుము.

కవచ శబ్దానికి సమానార్థకాలయిన తెలుగుమాటల్లో కొన్ని అన్యదేశ్యాలున్నాయిగాని వాటిని కూడా మన నిఘంటుకారులు అచ్చ తెలుగు కిందే లెక్కించేవాళ్ళు. తెలుగు పర్యాయపదాలు "కత్తళం, జోడు, జిరా, దుప్పటం, బొందళం, చిలుకత్తు, బందు, మై మరుపు/మర్వు, కమరు, దగలా, జిరాయి" వగైరాలు. వీటిలోని జిరా, దగలాలాంటి దీర్ఘాంతాలేగాక, 'కమరు, బందు, జోడు' అనేవి కూడా అన్యదేశ్యాలే. దుప్పటం

అంటే రెండు ముడతల గుడ్డ. ఒకప్పుడు ఒత్తుగా చుట్టుకొన్న దుప్పటినే కవచంగా వాడేవారన్నమాట. మై – శరీరాన్ని – దాచివుంచేది కాబట్టి మైమరు వన్నారు. కత్తళం, బొందళం అనేవాటికి కావ్యాల్లో వ్యాప్తి ఎక్కువ.

దూరాన వున్న వస్తువును, జంతువును, శత్రువును దండించడానికి పనికివచ్చే ఆయుధం విల్లు. దాన్ని కనిపెట్టిన తరువాత యుద్ధ స్వరూపం మారిపోయింది. కాకతీయ చక్రవర్తి దగ్గర తొమ్మిదిలక్షల మంది విలుకాళ్ళుండేవారని ప్రతాపరుద్రీయం వర్ణించింది. తుపాకులు రాకముందు వింటిదే రాజ్యం. రాముడు, అర్జునుడు జగదేకధనుర్ధరులు కాబట్టే శత్రువులను జయించగలిగారు. విల్లు తెలుగుమాట. దీనికి పర్యాయపదాలని సింగిణి/సింగాణి అనే రూపాంతరాలను పేర్కొంటారు. ఒక నిఘంటువయితే దాన్ని 'శృంగారధనువు' అని వర్ణించింది. దసరా పండగలప్పుడు పిల్లలు ధరించేదానివంటి దన్నమాట. అది యుద్ధానికి పనికిరాదు. ధూర్జటి శ్రీకాళహస్తిమహాత్మ్యంలో రకరకాల విల్లులను వివరించాడు. 'తడ' కర్రను వాడి, దానికి 'పాగ'నారను అల్లెతాడుగా కట్టిన విల్లు చాలా దూరాన ఉన్న లక్ష్యాలను ఛేదించడానికి పనికి వస్తుందన్నాడు. రామార్జునులు 'షడరత్ని ధనుర్ధరు' లంటారు. అంటే ఆరుమూళ్ళ పొడవున్న పెద్దవిల్లు పట్టుకొనేవాళ్ళుట. అది అందరికీ సాధ్యంకాని పని కాబట్టే వాళ్ళకు అంతపేరు వచ్చింది. ఇప్పుడు మనం 'ఆర్చి, కమాను' అనే వాటిని పూర్వం విల్లనే పిలిచేవాళ్ళు. అయితే ఆ మాట ఆ అర్థంలో వాడుకనుంచి తొలగిపోయింది. విల్లుకు రూపాంతరం విలు(ముఖ్యంగా సమాసాల్లో).

ఈ తెలుగుమాటకు సమానార్థకాలని చెప్పదగ్గ సంస్కృతపదాలు "ఇష్వాసం, కార్ముకం, కోదండం, చాపం, ధనువు/ధనుస్సు, శరాసనం" అనేవి. నిజాని కవన్నీ ఒకేరకానికి చెందినవికావు; అర్థచ్ఛాయాభేదం లేనివీకావు. ఇషువంటే బాణం. దీనికి ఆధారంగా ఉండేది కాబట్టి ఇష్వాసమనే వర్ణనాత్మకనామం వచ్చింది. కార్ముక మంటే క్రముకవృక్షం. అంటే పోకచెట్టు– కర్రతో చేసిన విల్లు. ఇది మంచి ఊతమిచ్చే చేవగల కర్ర. అదిగాక మరే కర్రతో చేసిన విల్లునయినా కోదండమంటారు. చాప్ ధాతువునుంచి వచ్చిన శబ్దం చాపం. కొట్టేది, బాధించేది అనే అర్థంలో ఈ మాట పుట్టింది. ఇదే పదాన్ని 'ఆర్చి, కమాను' అనే అర్థంలో వాడుతుండేవాళ్ళు. ధన్‌మనే చప్పుడుతో బాణం వదిలిపెట్టుంది కాబట్టి ధనుస్సు అన్నారు. దీనికి రూపాంతరం ధనువు (తెలుగువారి వాడుకలో). చాలామంది 'ధనస్సు' అనే తప్పురూపం వాడుతుంటారు. ధన్వ శబ్దం కూడా దీనికి రూపాంతరమే. శరం అంటే బాణం. దానికి ఆధారమైనది కాబట్టి శరాస(న) మన్నారు.

వింటితో బాణం వదలి యుద్ధం చేస్తారు; వేటాడుతారు. బాణానికి సమానార్థ కాలయిన తెలుగుమాటలు "అమ్ము, తీరు, లకోరీ, తూపు, కోల, ములికి, సరం, చిలుకు" అనేవి. అమ్మునే తప్పుగా అంబు వంటుంటారు. 'విల్లంబులు' అని వాడటం పరిపాటయిపోయింది. లకోరీ అనే దీర్ఘాంత శబ్దం ప్రాకృతంనుంచి వచ్చి అచ్చ తెలుగు కింద లెక్కకెక్కిన మాట. తూగుతూ, ఊగుతూ, ఊపుగా పోయేది కాబట్టి తూపు అన్నారు. కోల అంటే కర్ర. (కోలాటంలో ఈమాట మిగిలివుంది. కోలతో ఆడే ఆట అన్నమాట.) ఇది చిన్న, పొడుగు తక్కువ బాణం. చివరి

లోహపు ముక్కున్న బాణం ములికి. సూటిగా పోతుంది కాబట్టి తీరు అనే పేరు వచ్చింది. బాణానికి ఒకవైపు రెక్కలు/ఈకలు కడ్తారు. దాన్ని 'గరి' అంటారు. అలాంటి గరిలేని బాణాన్ని 'సరుదు' అంటారు. ఆమాటకు రూపాంతరమే సరం. సర్రున పోయేదనే భావంతో బహుశా ధ్వన్యనుకరణరూపంలో ఈ మాట పుట్టి వుంటుంది. ఇనపబాణాన్ని తెలుగులో నారసం అంటారు. అది సంస్కృతంలోని నారాచశబ్దభవం.

సంస్కృతంలో అమ్ముకు పర్యాయ వాచకాలయిన మాటలు "బాణం, పృషత్కం, విశిఖం, అజిహ్మగం, ఖగం, అశుగం, కలంబం, మార్గణం, శరం/సరం, పత్రి, రోపం, ఇషువు" వగైరాలు. వీటిలో బాణ, శర, విశిఖ శబ్దాలకు వాడుక ఎక్కువ. బాణ శబ్దానికి వాణమనే రూపాంతరముంది. రెక్కలున్న తూపునే ఈపేరుతో పిలుస్తారు. అదిన్నీ కర్రతో చేసిందయితే. పృషత్కం అంటే రంగురంగులు, చుక్కలు చుక్కలుగా ఉన్నదనిగాని, త్వరగా పోయేదనిగాని చెప్పవచ్చు. లేడిలా పోయేదని కొందరు కోశకారులు వివరించారు. రాజులూ పెద్ద సేనాపతులూ తమ పేర్లు చెక్కించి రంగులద్ది అలంకరించిన బాణాలు వాడేవారు. వాటికీ పేరు వర్తిస్తుంది. విశిఖమంటే 'మొనలేని, మొద్దంచుగల' అని అర్థం. అర్ధచంద్రబాణం వంటి కొన్ని రకాల బాణాలను ఈ పేరుతో పిలుస్తారు. జిహ్మ శబ్దానికి వంకర అని అర్థం. అజిహ్మం అంటే 'వంకరలేని, సూటిగా' అని అర్థం. అలా సూటిగా పోయే(-గ) బాణాన్ని అజిహ్మగమంటారు. ఖగం అంటే ఆకాశంలో పోయేది. పక్షులను, గ్రహతారకలను ఇలాగే పిలుస్తారు.

ఆశువు అంటే తొందర. తొందరగా పోయేది కాబట్టి ఆశుగమన్నారు. కలంబమంటే కాడ. కర్రతో చేసిన బాణం కలంబం. మార్గణం అంటే వెతుక్కుంటూ పోయి తగిలేదన్నమాట. ఇది దాని స్వభావవర్ణన ఫలితంగా వచ్చిన పేరు. శరం, సరం అన్నవి పరస్పరం రూపాంతరాలు. శౄధాతువుకు నశింపజేసేది, ధ్వంసం చేసేది అని అర్థం. అందువల్ల ఈ మాటలు పుట్టాయంటారు కొందరు. మరి తెలుగులోని 'సరం, సరుదు' అనే మాటల్లాగానే ఇవిగూడా ధ్వన్యనుకరణాత్మకాలేమో చెప్పలేం. అనుమానమయితే రావచ్చు. పత్రం అంటే రెక్క. అది ఉన్నది పత్రం. చివర ఈకలున్న బాణాన్ని కూడా ఈపేరుతో పిలుస్తారు. పక్షినీ ఇదేపేరున వ్యవహరిస్తారు. మొక్క అకస్మాత్తుగా మొలిచినట్లు చడీచప్పుడు లేకుండా వచ్చిపడే ఆయుధం కాబట్టి దీన్ని రోపమని కూడా పిలిచారు. ఇషువనేది వేదకాలం నాటి ఆయుధం. అది బాణంలాంటిదేగాని చిన్నది. దాన్ని వింటినుంచి మాత్రమే విసరనక్కరలేదు. చేత్తో విసిరే, ఎగిరే సాధనం ఇషువు.

బాణాల చివర రకరకాల లోహ రూపాలను బిగించి వాడేవాళ్ళు. బాణం తగిలినప్పటికన్నా శరీరంలోంచి దాన్ని బయటికి లాగినప్పుడే నరాలు బయటికి వచ్చి ఎక్కువ ప్రమాదకరంగా పరిణమిస్తుంది. కొన్ని పెద్ద జంతువులను– ఏనుగులాంటి వాటిని – వేటాడేటప్పుడూ, కవచంలో నుంచి దూసుకొని పోయి ప్రాణం తీయవలసిన అవసరమున్నప్పుడూ మొత్తం (ములికే కాకుండా మొత్తం) బాణాన్ని ఇనుముతో చేసేవాళ్ళు. దానికి 'పుక్ష్వేడనం' అనే మరో పేరుంది. కొన్ని సందర్భాల్లో బాణం

మొనకు విషం పట్టించేవాళ్ళు; చంపటంకన్నా బంధించటమో మత్తెక్కించటమో ప్రధానమనుకొన్న సందర్భాల్లో ఈ విషబాణాలను వాడేవారు. వాటికి 'దిగ్ధం, లిప్తకం' అనే పేర్లున్నాయి. దిగ్ధమంటే (విషం) నిండినది. లిప్తకం అంటే విషం పూసినది. బాణానికి కట్టే రెక్కలనూ ఈకలనూ తెలుగులో 'గరు'లంటారు. సంస్కృతంలో 'పక్షం, వాజం' అని చెప్తారు.

విల్లును గురించి ప్రస్తావించినప్పుడు వింటినారిని, కొప్పును, అమ్ములపొదిని (అంబులపొది – కాదు) చెప్పాలి. తెలుగులో 'అరి, అల్లె (తాడు), గొనయం' అనేవి. నారికి సంబంధముందనుకొన్నందువల్ల పిల్లలు నక్కనరంతో వింటినారిని చేస్తారనుకొనేవాళ్ళు. నారవంటిది కాబట్టి నారి అన్నారు. అల్లి తయారుచేసిన తాడును అల్లె, అల్లెతాడు అని పిలిచారు. గొనయమనేది సంస్కృత గుణ శబ్దభవమని కొందరి విశ్వాసం. రకరకాల నారలతో వింటికి నారిని సిద్ధం చేసేవాళ్ళు. వాటన్నింటిలోకి 'సాగ'నార బలిష్ఠమైనదీ సాగనిదిన్నీ. సాగతీగను సంస్కృతంలో మూర్వ అంటారు. తెలుగులో మూరట అనికూడా పిలుస్తారు. అల్లెతాడుగా ఈ నార సర్వశ్రేష్ఠమనీ, తడకర్రకు సాగనారను తగిలించి చేసిన విల్లు ఎంతో బలవంతులకుగాని వంగదని, అందువల్ల అటువంటి వింటినుంచి వదలిన బాణం ఎంతో వేగంగా బలంగా తగులుతుందని ధూర్జటి వర్ణిస్తాడు. 'మూర్వ' నారతో తయారయిందాన్నే సంస్కృతంలో 'మౌర్వి' అని పిలుస్తారు. ఈ మౌర్వినే నడికట్టుగా కూడా యోధులు వాడేవారు.

నారికి సంస్కృతంలోని 'మౌర్వి, జ్యా, శింజిని, గుణం' అనేవి సమానార్థకాలు. జ్యా శబ్దానికి 'బయటికి నెట్టేది/విసిరేది' అని అర్థం. నారిని లాగి వదిలినప్పుడు (బాణంతో సహా) టంకారం చేస్తుంది – అంటే మోగుతుంది. ఆ చప్పుడును శింజానమంటారు; అలా మోగేది కాబట్టి అల్లెతాటిని శింజిని అన్నారు. నార తీగ ఒక్కటి మాత్రమే అయితే ఆ నారిని గుణమనేవాళ్ళు. వింటికి రెండు చివర్లలోనూ ఈ నారిని బద్దకు బిగిస్తారు. ఆ చివరను తెలుగులో 'కొప్పు' అంటారు. సంస్కృతంలో సమానార్థకాలని 'కోటి, అటని, అన్య' మాటలను చెప్తారు. కోటి శబ్దం తొలుత ద్రవిడ భాషాపదమనీ, అది కాలక్రమాన సంస్కృతంలోకి వర్ణవికారంతో చేరిందనీ కొందరి వాదం. అందుకు కారణం, సంస్కృతానికి సోదర భాషల్లో దానికి సరైన వ్యుత్పత్తి లేదని, ద్రవిడ భాషల్లోని 'కోడు' శబ్ద పూర్వరూపం ధనుష్కోటి, కోజిక్కోడ్ వంటి మాటల్లోని చివరిభాగంలో ఉందనీ, అదే సంస్కృతంలోకి మార్పుతో పోయిందనీ మరికొందరి వాదన. ఈ ద్రవిడ పదాల చివరి డకారానికి పూర్వ రూపాన్ని అడ్డు గీతలేని బండిరాలాగా రాసేవాళ్ళు పూర్వం. అది 13వ శతాబ్దం నాటికి తెలుగులో వ్యవహారదూరమయింది. అటని అంటే 'కదిలేది, తిరిగేది' అని అర్థం. విల్లు మధ్య భాగాన్ని తెలుగులో పిడికిటికట్టు అనీ, సంస్కృతంలో లస్తకమనీ పిలుస్తారు. లస్త శబ్దానికి పట్టుకోవటం అనే అర్థముంది.

బాణాలను పెట్టుకొనే 'పొది' తెలుగు మాట. పొదవు అనే క్రియకు 'కౌగలించుకొను, చుట్టుకొను' అనే అర్థాలున్నాయి. దానికి సంబంధించిందే ఈ

పొది అనేపదం. పొదికి పర్యాయపదాలని చెప్పదగ్గ తెలుగుమాటలు 'దొన, తరసకం, బత్తళిక, పాణివడం' అనేవి. వీటిలో పొది తరవాత ఎక్కువ వ్యాప్తిగల పదం 'దొన' అనేది. తక్కిన వాటిలో చివరిరెండూ ఎరువు మాటలనిపిస్తాయి గాని వాటి వ్యుత్పత్తి ఒక పట్టాన తేలేది కాదు. ఈ పదాలకు సమానార్థకాలైన సంస్కృత శబ్దాలు "తూణం, తూణీరం, ఇషుధి, నిషంగం, ఉపాసంగం" అనేవి. తూణ శబ్దానికి 'తూణి, తూణిక, తూణీరం' అనేవి రూపాంతరాలు. 'మోసేది, దాచేది' అనే అర్థాల్లో ఆ మాటలు పుట్టాయి. ఇషువంటే బాణం. దాన్ని ధరించేది/దాచేది ఇషుధి. నిషంగం, ఉపాసంగం అనే మాటలకు విలుకాడి శరీరానికి 'తగిలించినది, కట్టినది' అని అర్థం. లేదా బాణాలనే కట్టగా దాచేది అనే అర్థం కావచ్చు.

మన పూర్వులు వాడిన ఆయుధాల్లో గద ముఖ్యమైనది. ఆ మాట సంస్కృతపదం. దానికి సమానమైన తెలుగుమాటలు "గుది(యు), గుదె, దుడ్డు గునపం, కుడువ" అనేవి. గుది, గుదియ, గుదె–అనేవి పరస్పరం రూపాంతరాలు. 'గుదిబండ' వంటి సమాసాల్లో గుది శబ్దం నేటికీ వినిపిస్తుంది. 'బరువైన, వేలాడే' అనే అర్థాలున్నాయి ఆ మాటకు. అది గునపం వంటిదేగాని దుడ్డుగా (= లావుగా) ఉంటుందని దుడ్డు గునపమనే వర్ణనాత్మక సమాసం సృష్టించారు కవులు. అంటే ఆరకం గదకు చివర మొనదేలిన ఇనపముక్కకూడా ఉండేదన్నమాట. కుడుప శబ్దం ముద్గరమనే సంస్కృతపదానికి సరైన తెలుగుమాట అని నిఘంటువులు చెప్తున్నాయి. కుడుములాగా గుండ్రగా, ముద్దగా ఉండే ఆయుధం కాబట్టి ఆపేరు వచ్చింది.

గదా శబ్దమేగాక సంస్కృతంలో ఉన్న సమానార్థకాలు "ద్రుఘణం, ముద్గరం, ఘనం" అనేవి. కొందరు 'భిందిపాలం, సృగం' అనేవి కూడా పర్యాయపదాలంటే, మరికొందరు "పరిఘ, పరిఘాతనం" అనేవీ అలాంటివేనంటున్నారు. ఇంకా కొందరు "దండం, యష్టి, వేత్రం, లగుడం, ముసలం" అనేవి అలాంటివేనంటున్నారు. ఈ ఆయుధం పురాణకాలం నాటిది కాబట్టి, ఇప్పుడు (నాటకాల్లో పౌరాణిక సినిమాల్లో తప్ప) వాడుకలో లేనిది కాబట్టి కొంత గందరగోళం తప్పదు. తెలిసినంతలో ఆయాపదాలు ఏయే రకానికి పేర్లో గుర్తించడానికి ప్రయత్నిద్దాం.

ద్రుఘణమనేది కొయ్యతో చేసిన గద. కొయ్యగొడ్డలిని కూడా ఒకప్పుడదే పేరుతో పిలిచేవాళ్ళు. ముద్గర శబ్దానికి 'ముద్గరక'మనే రూపాంతరముంది. ఇది సుత్తిలాంటిది – ఆకారంలో. ఘనశబ్దం 'చంపేది, గట్టిది' అనే అర్థాల్లో హన్‌ధాతువునుండి ఏర్పడ్డపదం. భిందిపాల శబ్దానికి 'భిందిమాల, భిందమాల, భిందుమాల, భిండివాల' అనే రూపాంతరాలున్నాయి. కొందరామాటకు పొట్టి బాణం/బల్లెం అనే అర్థాలు చెప్తారు. కొందరేమో తాటికిగట్టి విసరివేసే బండరాయి అని అర్థం చెప్తారు. మరికొందరు అది రాళ్ళు విసిరే పెద్ద సైజు వడిసెల లాంటిదంటారు. సృగ శబ్దానికి సృకమనే రూపాంతరముంది. అది చివర మొనదేలిన గద. పరిఘా శబ్దం 'బాగా చంపేది, చావచితకగొట్టేది' అనే అర్థంలో 'పరి' అనే ఉపసర్గ చేరిన హన్‌ధాతువు నుంచి ఏర్పడ్డమాట. అది సాధారణంగా ఇనుము/లోహంతో చేసిన గద. ఇదే అర్థంలో పుట్టిన మరో మాట పరిఘాత(న)ం.

దండం అంటే కర్ర/కట్టె అనే అర్థం కూడా ఉంది. దండించేది అనే అర్థమూ ఉంది. యష్టి శబ్దం 'ఇష్టి' (యజ్ఞం)లో వాడే గద. బలిపశువును మర్దించడానికి వాడేది. వేత్రమనేది వెదురుతో చేసినగద. అంటే పట్టుకొనే కామ/పిడి వెదురుదన్నమాట. లగుడ శబ్దానికి లకుటమనే రూపాంతరముంది. దానికి కర్ర, బరిసె అనే అర్థాలు కూడా నిఘంటువుల్లో కనిపిస్తాయి. ముసలం/ముషలం అనే దానికి సాధారణార్థం తెలుగువాళ్ళ వ్యవహారంలో రోకలి. ఇది కొయ్యతో చేసిందేగాని లోహాయుధం కాదు. కొన్ని నిఘంటువులు భిండివాలం అంటే తెలుగులో 'చిల్లకోల' అని, పరిఘ అంటే 'బరిసె, బడిత'అనీ అర్థాలు చెప్తున్నాయి. ఇందులో ఏది ఎప్పటి అర్థమో, ఏది ఎంతవరకు సరిగ్గా చెప్తున్నదో తేల్చటం కష్టం.

గ్రామాల్లో వ్యవసాయ కార్యాల నుంచి కొట్లాటల దాకా వాడే పరికరం బరిసె. బరిశ, బరిస అనే రూపాంతరాలున్నాయి దానికి. ఇనుప ములికి ఉన్న కొయ్యగడ అది. అది తెలుగు మాటే. "ఈటె, నేజ, బల్లెం" అనేవి దానికి సమానార్థకాలు. బలిచి అనే రూపాంతరం కూడా నిఘంటువుల్లో కనిపిస్తుంది. చిన్నదిగా పొట్టిగా ఉండే బరిసను 'కొరకు/గొరకు' అనేవాళ్ళు. ఆ మాటకు కావ్యప్రయోగమేగాని నిత్యవ్యవహారబల మున్నట్లులేదు. ఈటె పొడుగాటిది. లోహంతో చేసిన మొన, పిడివంటి వున్నది. అదే యుద్ధ సాధనం. బల్లెమనేది సంస్కృతంలోని భల్ల శబ్ద భవ మంటారు. వీటిని దూరానికి విసిరి గాయపరుస్తారు. చంపుతారు.

తెలుగు బరిసెకు సమానార్థకాలనిపించే సంస్కృత పదాలు 'ప్రాసం, కుంతం, తోమరం, శక్తి, శూలం' అనేవి. మొదటిమాటకు కావ్య ప్రయోగాలధికం. అది ప్రాస్ అనే ధాతువునుంచి పుట్టిన నామపదం. దానికి విసురు అని అర్థం. ప్రాసం మామూలు బల్లెంకాదు. దానికి ఇనుపము ళ్ళుంటాయి. అది విసిరి దెబ్బ తీసినప్పటికన్నా గుచ్చుకున్న ప్రాంతం నుంచి బయటికి లాగినప్పుడే బాణంలాగా ఎక్కువ ప్రమాదకరమైంది. ప్రాసం చివర గాలం ముళ్ళలాంటివి అమర్చేవాళ్ళు. కుంతం అనేది కేవలం ఈటె. తోమరం బరువైన ఈటె. శూలం బాధాకరమైనదని అర్థం. ఇది సాధారణంగా ఇనుముతో చేసిన ఆయుధం. శివుడు త్రిశూలం మూడు మొనలున్న లోహాయుధం. భల్ ధాతువుకు 'పీడించే, గాయపరిచే' అనే అర్థాలున్నాయి. దానినుంచి పుట్టిన భల్లశబ్దానికి కొందరు ఈటె అనే అర్థం చెప్తే మరికొందరు ఒక రకం బాణమని చెప్తున్నారు. శక్తి అనే మాట విషయంలో భిన్నార్థాలు చెప్పేవాళ్ళున్నారు. దానికి నిఘంటువుల్లో 'కత్తి, బాణం, ఈటె'వంటి అర్థాలు కనిపిస్తాయి. కుమారస్వామి ఆయుధమిదే. శక్తిగల, సమర్థమైన ఆయుధమనే అర్థంలో ఈ మాట పుట్టింది.

గొడ్డలి సర్వసాధారణ వస్తువు. చొప్పవంటి దుర్బల వస్తువులను నరకడానికి వాడేది చొప్పగొడ్డలి. దాన్ని కొందరు 'చేగొడ్డలి' (చేతిలో ఇమిడే చిన్న గొడ్డలి అనే భావంతో) అని కూడా పిలుస్తారు. రెండు వైపులా పలచని పదునైన రేకులున్నది గండ్రగొడ్డలి. గొడ్డలి అచ్చతెలుగుమాట (ద్రావిడపదం) కాదనీ 'కుద్దాల'మనే సంస్కృత శబ్దభవమనీ కొందరి నమ్మిక. కుద్దాల శబ్దభవమైనది 'గుద్దలి' అనే మాట. దానికి 'పెళ్ళగించేది, తవ్వేది' అనే అర్థం. నిజానికది గునపమేగాని గొడ్డలికాదు. పారలాగా

వాడే చిన్న గొడ్డళ్ళు కూడా వున్నాయి. వాటిని దోకుడు పార లంటారు. దాన్నే చేగొడ్డలిగా కూడా వాడ్తారు. ఎటొచ్చీ ఇనపరేకును బిగించే తీరుసుబట్టి మాత్రమే పేరు మారుతుంది.

గొడ్డలి సంస్కృతంలోని కుఠార శబ్దభవమని మరికొందరు చెప్తారు. దానికి ఆ భాషలో సమానార్థకాలని చెప్పదగ్గ మాటలు "స్వధితి, పరశువు, టంకం, పరశ్వధం" అనేవి. చిన్నగొడ్డలిని – చేగొడ్డలిని – కుఠార మంటారు. స్వధితికి శ్వధితి అనే రూపాంతరముంది. అది సర్వసాధారణంగా వెదురు కర్రతో తయారయిన ఆయుధం. కొమ్మల వంటివాటిని నరకటానికి వాడే పరికరమది. దాన్ని విసరివేసి దెబ్బతీసేవాళ్ళు. పరశువు అనేది యుద్ధసాధనం. రెండువైపులా పదునున్న గొడ్డలిని పరశ్వధమంటారు. గండ్రగొడ్డలికది సమానార్థకం. దాన్ని వాడేవాడనే అర్థంలో శివుణ్నే ఖండపరశువని పిలుస్తారు.

## కలహాలు: యుద్ధాలు

పైన పేర్కొన్న ప్రధానాయుధాలతో యుద్ధం చేసేవాళ్ళు. యుద్ధార్థాన్నిచ్చే తెలుగు మాటలు చాలావున్నాయి. "పోరు, పోరాట(ం), పోట్లాట, కయ్యం, చివ్వ, కంగారు, కంగిస, కలను, దురం, ఆలం, గొడవ, బవరం, జగడం" అనేవి. పోరునే ఆటగా చేయటం (సులభంగా చేయటం) పోరాటం. పోరు తీవ్రమయిందీ కావచ్చు – కేవలం ఎడతెగని సణుగుడూ కావచ్చు. 'ఇంటిలోని పోరు' అనే చోట అది రక్తపాతానికి దారితీసే యుద్ధం కానక్కరలేదు. పోటు అంటే పొడవటం. కత్తి, ఈటెవంటి సాధనాలతో పోట్లు పొడిచినప్పుడే అది పోట్లాట అవుతుంది. అయితే నిత్యకృత్యంలో గట్టిగా తిట్టుకున్నా పోట్లాట అనే వ్యవహరిస్తుంటాం. కయ్యం అనేది చేతులు కలిపి చేసే యుద్ధం. కై అంటే చేయి. కాబట్టి కయ్యం కుస్తీ, గుద్దులాట వంటిదన్నమాట. చివ్వ స్వచ్ఛమైన తెలుగుమాట. శ్రీనాథుడు ఆ మాటను వాడి చక్కని నీతి చెప్తాడు కాశీఖండంలో: ఎవ్వరితో నెప్పాటను, చివ్వకు చేసాపవలదు చేసాచినచో, ఇవ్వల నవ్వల నెవ్వరు, నవ్వకయుండంగ పగసనం దీర్చదగున్" అని. సందర్భాన్ని బట్టి ఈ మాటకు 'తగాదా' అనే అర్థం చెప్పాలి. తగాదా (= జగడం) అనేది 'తకాయిదా' అనే ఉర్దూ పదం నుంచి పుట్టినమాట. కంగారు గాభరా మాత్రమే గాని యుద్ధంకాదు. కలను ప్రాచీన కావ్యాల్లో కనిపించే యుద్ధార్థక శబ్దం. దురం కూడా అలాంటిదే. ఆలమనేది కూకలతో కేకలతో కూడిన అరుపులకేగాని యుద్ధానికి పేరుకాదు. బవరం అంటే యుద్ధమే. జగడం అనేది పేచీ, తగవులాట అనే అర్థాలున్నమాట. అచ్చ తెలుగు నిఘంటువులు ఈ మాటలన్నిటినీ పర్యాయపదాలని వర్ణించటమే విడ్డూరం.

తెలుగుమాటలు ఈలాంటి అర్థాలున్నవి చాలా ఉన్నాయిగాని నిఘంటువులెందుకో వాటిని పర్యాయపదాల్లో చేర్చలేదు. 'కొట్లాట, తగవులాట, జుట్టుపట్లు, సిగపట్లు,

తిట్లాట, తన్నులాట, గుద్దులాట, కొట్టుకోవటం, తన్నుకోవడం, చంపుకోవటం, చంపటం, నెత్తురు కళ్ళజూడటం, నరకటం, తెగనరకటం, నరికి కుప్పలు వేయటం, తల పగలగొట్టడం/బద్దలు కొట్టడం, దెబ్బలాటవంటివి ఎన్నో. అయితే ఇందులో మన ప్రత్యేకతలు లేకపోలేదు. ఒక్క దెబ్బయినా ఎవరికీ తగలకపోయినా కొట్లాడుతున్నారంటాం. ఊరికే నోరుపారేసుకున్నా తగవులాడుకున్నారంటాం. నిజానికి తగవు(= ధర్మం) కోసం వాదులాడుకోవటమే తగవులాట. నిజంగా జుట్టుపీక్కోకపోయినా జుట్టుపట్లు, సిగపట్లు పట్టుకున్నారంటాం. తన్నులు (కాలితో), గుద్దులు (చేతులతో) లేకపోయినా మన ప్రాణానికవి తన్నులాటల్లాగా, గుద్దు లాటల్లాగా అనిపిస్తాయి! ఇవిగాక రక్కటం, పీకటం, గిచ్చటం, గిల్లటం, మెడలు విరవటం, నరాలు తోడటం, పేగులు బయటికిలాగి (అంతటితో ఆగకుండా) వాటిని మెళ్ళో వేసుకోవటం, కాళ్ళూ చేతులూ నడుమూ విరగ్గొట్టడం, పుచ్చె/పుర్రె/బుర్ర బద్దలు కొట్టడంలాంటివన్నీ రకరకాల యుద్ధదశలేనని చెప్పాలి. కేవలం తిట్టుకున్నా, బూతులుదోసినా (కూసినా) కూడా మనమది దెబ్బలాటకిందే పరిగణిస్తాం. ఇదంతా తెలుగుదనం కిందా, తెలుగువాళ్ళ ప్రత్యేకతకిందా లెక్క!

యుద్ధ శబ్ద పర్యాయపదాలుగా సంస్కృతంలో కూడా చాలా పదాలున్నాయి. "అనీకం, అభిసంపాతం, అభ్యాగమం, అభ్యామర్దం, ఆయోధనం, ఆస్కందనం, ఆహవం, ఆజి, కలహం, కలి, జన్యం, ప్రధనం, ప్రవిదారణం, రణం, కదనం, మృధం, విగ్రహం, సంఖ్యం, సమితి, సమీకం, సమాఘాతం, సంగ్రామం, సమరం, సంప్రహారం, సంయుగం, సంస్ఫోటం, సంయత్తు, సాంపరాయకం, సముదాయం" వగైరాలు. వీటన్నిటిలోనూ ఆజి, కలహం, కదనం, సమరం, రణం అనే మాటలు తెలుగు కవుల వాడుకలో అత్యంత వ్యాప్తి గలవి. తక్కినవి అవసరార్థం వాడే మారుమూల మాటలు.

అజి అంటే జయం కోరి చేసే పోరాటం. కలహం తగాదా వంటి చిల్లరపోరు. బాధించు, గాయపరచు, చంపు అనే అర్థాలున్న కదనశబ్దం పెద్దయెత్తు పోరు. సమరమనేది చావు తప్పని పోరు; లేదా చంపుడు యుద్ధం. రణ శబ్దమే చిత్రమయింది. సంతోషంకోసం (వేటలాగా) చేసే పోరు రణం. ఇది ఆనందార్థకమైన 'రం' ధాతువు నుంచి పుట్టిందంటారు – రమణీయం లాంటి పదాల్లాగా. అందుకేనేమో తిక్కన యుద్ధరంగం రమణీయ భయానకంగా ఉందని వర్ణించాడు. సేనాపతుల దృష్టిలో రమణీయం; మామూలు చావులో భయానకం. లెవ్ తాల్‌స్తాయ్ తన 'యుద్ధం–శాంతి' అనే పెద్ద నవల్లో నెపోలియన్ సేనలు 'గ్రేప్‌షాట్' పేరిట తడవకు తన సేనలోని వందమందిని ఒకేసారి మట్టు పెడ్తుంటే రష్యన్ సేనాని 'ఎంత చక్కటి దెబ్బ' అని మెచ్చుకున్నట్లు రాస్తాడు. దృష్టిభేధం వల్ల యుద్ధం కూడా చక్కని పనితనమని భాసించిందన్నమాట! యుద్ధమనేది సాధారణ పదం. దానికి పోరు అని మాత్రమే అర్థం.

అనీక శబ్దానికి సేన అర్థం కూడా ఉంది. ఎప్పుడూ కదులుతుండేది, ముందుకు సాగుతుండేది ఆ మాటకర్థం. పాత మంటే పాటు. సంపాతమంటే పెద్దపాటు. అభిసంపాతమంటే యుద్ధం – పెద్దయెత్తున పడటం జరుగుతుంది కాబట్టి. ఆగమం

అంటే రావటం. అభ్యాగమం అంటే దగ్గరికి రావటం. యుద్ధంలో సైనికులు ఒకరి దగ్గరికి మరొకరు చేరి ద్వంద్వంగా యుద్ధం చేయటాన్ని ఈ అభ్యాగమశబ్దం వివరిస్తుంది. ఇలాంటిదాన్ని 'సంకులసమర'మని కూడా పిలుస్తారు. మరీతీవ్రంగా జరిగే సమరం అభ్యాగమం. బాహాబాహి (చేతుల్తో), ముష్టీముష్టి (పిడిగుద్దుల్తో), కచాకచి (జుట్టూజుట్టూ పట్టుకొని)గా చేసే యుద్ధమన్నమాట. మర్దమంటే చావటమ్మకోవటం. తిక్కన ఇలాంటి సందర్భాల్లో 'పచ్చడిగొట్టు'లాంటి క్రియాపదాలను వాడ్తాడు తెలుగులో. అయోధన శబ్దానికి చంపటమనే అర్థమేకాక యుద్ధరంగమనే అర్థం కూడా ఉంది. అస్కందనం అంటే ఎగిరెగిరి తన్నటం. 'స్కంద్' అనే ధాతువుకు 'కుప్పించు, ఎగురు, దూకు' మొదలయిన అర్థాలున్నాయి. శ్రీకృష్ణుడు భారత యుద్ధంలో భీష్ముడి మీదికి అస్కందనంలో దూకాడు – అందుకే పోతన "కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గండ భాగద్యుతి గడలుకొనగ" ఇత్యాదిగా వర్ణించాడు. ఆహవశబ్దం తొలుత యజ్ఞసంబంధంగా పుట్టింది. 'బలి ఇచ్చు/పెట్టు' అనే అర్థం క్రమంగా యుద్ధార్థకంగా పరిణమించింది.

కలహమనేది చిన్న తిట్లాట, తగాదా వంటిది. కలి శబ్దానికి 'రెచ్చగొట్టు, అభిప్రాయంలో విభేదించు' అనేవే తొలి అర్థాలు. తరవాత దానికి యుద్ధమనే అర్థం వచ్చినా అది మారుమూల ప్రయోగాల్లో మాత్రమే కనిపిస్తుంది. జన్యమనేది (అకారణంగా) పుట్టిన కలహం. తరవాత దానికి కొట్లాట అనే అర్థం వచ్చింది. ప్రధనశబ్దం మొదట యుద్ధంలో గెలిచినవాళ్ళు 'పోగుచేసుకున్న మూట/సొమ్ము' అనే అర్థంలో ఉండేది. దరిమిలా దానికి అర్థవ్యాకోచం వల్ల యుద్ధమనే అర్థం వచ్చిపడింది. విదారణం అంటే చీల్చటం. ప్రవిదారణం అంటే క్రూరంగా చీల్చి చెండాడటం. భీకర యుద్ధంలో ఇది సాధ్యం. మృధశబ్దానిక్కూడా పోరాటంలాంటి అర్థమేకాక రణరంగమనే అర్థ విశేషం కూడా ఉంది. సమాఘాతమనేది పిడిగుద్దుల యుద్ధం – తీవ్రమయింది. సంగ్రామ శబ్దానికి యుద్ధమనే గాక సైన్యమనే అర్థం కూడా ఉంది. గిల్లికజ్జాపెట్టుకున్నా యుద్ధం చేసినా దాన్ని సంయత్తు అని చెప్పవచ్చు. చాలామంది గుమికూడి చేసే పోరును సమితి, సముదాయం అని పిలుస్తారు. సమితి శబ్దానికి సంఘం, సముదాయ శబ్దానికి 'గుంపు' అనే అర్థాలు ఇప్పుడు రూఢమైనాయి. గ్రహం అంటే పట్టు. విగ్రహ మనేది పట్టుకొని కొట్టుకోవటం అనే అర్థంలో ఉండేది తొలుత. ఆ మీదట దానికి యుద్ధమనే అర్థం వచ్చింది.

భారతకాలం నాటి యుద్ధాల్లో చతురంగ బలాలు పాల్గొనేవి. గజ, రథ, తురగ, పదాతిదళా లన్నమాట. అప్పటి లెక్కన ప్రతి సేనా విభాగంలోనూ ఈ నాలుగు రకాల సేనలూ ఉండేవి. భారత యుద్ధంలో 18 అక్షౌహిణుల సైన్యం పాల్గొని నిర్మూలమై పోయిందంటారు. అన్నిటికన్నా పెద్ద సేనా విభాగం ఆనాడు అదే. (ఇప్పుడు Army అంటారు.) అన్నిటికన్నా చిన్న విభాగం అప్పట్లో 'గుల్మ' మనేది. ఆ మాటకు పొద అనే అర్థం కూడా ఉంది. ఒక్కో గుల్మంలో '9 రథాలు, 9 ఏనుగులు, 27 గుర్రాలు, 45 మంది పదాతులు ఉండాలి. మూడు గుల్మాలు ఒక గణం. అంటే అందులో 27 రథాలు, 27 ఏనుగులు, 81 గుర్రాలుకాక 135 మంది పదాతులుండేవారన్నమాట. అలాంటి మూడు గణాలు కలిస్తే ఒక 'వాహిని'

అవుతుంది. అటువంటి మూడు వాహినులున్నది ఒక్క 'పృతన'. మూడేసి పృతనలు ఒక్క 'చమువు' కింద లెక్క. అలాంటి చమువులు మూడుంటే ఒక 'అనీకిని' అవుతుంది. కొంచెం ఇంచుమించుగా ఈనాటి 'డివిజన్'తో ఇది సమానం. అక్కడితో మూడురెట్ల లెక్క ఆగిపోతుంది. ఒక్క అక్షౌహిణిలో పది అనీకినులుంటాయి. అంటే లక్షా తొమ్మిదివేల మూడు వందల యాభైమంది సైనికులే ఉంటారన్నమాట. ఇది ఇప్పటి 'కోర్' (Corps)తో పోల్చదగిందని చెప్పాలి. మరి అంత పాతకాలంలో అన్ని లక్షల మంది సైనికులుండి పోరాడి చస్తే ఇంకా జనం మిగిలారంటే (ఆడవాళ్ళు, పసిపిల్లలు, యుద్ధవిద్య నేర్వని వాళ్ళు కలిసి) అప్పటి జనసంఖ్య ఎంత? అనే ప్రశ్న వేసుకొని కొందరీలెక్కంతా అతిశయోక్తి అని కొట్టేస్తారు. కొందరేమో పోగా మిగిలిన కొద్దిమందీ కలికాలంలో దోసపాదులా, తామరతంపరగా, దోమలమందగా పెరిగి, కలికాలం ఆవిర్భవించడానికి తోడ్పడ్డారంటారు. లెక్కల సంఖ్య ఎలావున్నా భయంకర జననష్టం, వాహన నష్టం జరిగిందనటానికి అభ్యంతరమక్కరలేదు.

## సేనలు: సైనికులు

సేన అనే సంస్కృత పదానికి "ధ్వజిని, వాహిని, పృతన, అనీకిని, చమువు, వరూథిని, బలం, సైన్యం, చక్రం, అనీకం" అనే సమానార్థక శబ్దాలున్నాయి. సేన, సైన్యం అనేవి రూపాంతరాలని చెప్పవచ్చు. వాహిని, అనీకిని, చమువు అనేవి అటు సేనా విభాగాలుగానూ ఇటు సైన్యమని అర్థమిచ్చే సాధారణ శబ్దాలుగానూ ఉన్నాయి. ధ్వజం అంటే జెండా. రాజుకో దేశానికో చెందిన జెండాను చేతబట్టి యుద్ధరంగానికి బయలుదేరేది ధ్వజిని. వాహినీ శబ్దానికి నది అనే అర్థం కూడా. నది ప్రవహించినట్లు వేగంగా కదలిపోయే సేనను వాహిని అంటారు. పృత్ అనే శబ్దానికి 'పోటీ, ఘర్షణ, యుద్ధం' అనే అర్థాలున్నాయి. వాటిని నిర్వహించేది కాబట్టి పృతన అన్నారు. అన్ ధాతువుకు 'కదలు, పోవు' అనే అర్థాలున్నవి కాబట్టే దాని నుంచి పుట్టిన అనీకం, అనీకిని అనే రూపాంతరాలకు సేన అనే అర్థం వచ్చింది – వాహిని విషయంలోలాగా. అనీకిని సేనా విభాగమనే అర్థంలో ఎక్కువ వాడుకలో ఉంది. చమూ శబ్దానికి వేదకాలంలో సోమరసం పోసే పాత్ర అనే అర్థవిశేషం కూడా ఉంది. వరూథినీ శబ్దానికి ఆయుధబలమనే అర్థముంది. (ప్రవరుణ్నే ప్రేమించిన వరూధినికీ ఈ శబ్దానికీ భేదముంది. ఈ మాటలో ఉన్నది తవర్గ ద్వితీయవర్ణం). శక్తిమంతమైనది కాబట్టే బలమన్నారు. రథం వంటి శకటం మీద బయలుదేరే సేనను గాని, వృత్తాకారంలో మొనకట్టిన సేనను గాని చక్రమంటారు.

సేనకు తెలుగు పర్యాయపదాలని చెప్పదగ్గవి "మొన, వాగు, ఒడ్డు, చేరువ, మొత్తం, బారు, తుటుము, దండు, పరి, గమి, కూటువ, పిండు, దాటు, మూక, దళం, ఫౌజు" వగైరాలు. ముందుకు నడిచే సేనకు మొన అని పేరు. నిర్ణీత వ్యూహంలో ముందుకు పోవటాన్ని మొనయు, మొనకట్టు అనే క్రియారూపాల్తో

వర్ణిస్తారు. వాగు అంటే ఏరు, ప్రవాహం అనే అర్థాలకే ఎక్కువ వ్యాప్తి ఉంది. చప్పుడు చేస్తూ ప్రవహించే ఏరును వాగు అని పిలిచినట్లే, కోలాహలంగా బయలుదేరే సేనను కూడా వాగు అని పిలుస్తారు. ఒడ్డనం అనే మాటకు వ్యూహం, ఎత్తు(గడ) అని అర్థాలు. ఒక ఎత్తుగడ ప్రకారం కదిలే సేనను అందుకే ఒడ్డు అంటారు. చేరులు చేరులుగా అంటే వరసలుగా, బారులు దీర్చిబయలుదేరే భటులుంటారు కాబట్టి చేరువ అనే పేరు సేనకు వచ్చింది. ఎక్కువ సంఖ్యలో బయలుదేరిన పేన మొత్తం, వరసలు దీర్చి వడిచేది కాబట్టి బారు అన్నారు. తుటుము, దండు, పిండు, పరి, గమి అనే మాటలకు గుంపు అనే విశేషార్థం ఉంది. అలా గుంపుగట్టిన సైనికులున్నది కాబట్టి సేన వాపేర్లతో పిలిచారు. ఎగురుతూ దూకుతూ ముందుకు వడుస్తుంది. కాబట్టి దాటు అన్నారు. పెద్దగుంపు కాబట్టి మూక అనే పేరు వచ్చింది. దళమనేది 'రేకు' అనే అర్థంగల మాట. వ్యూహంలో ఏ చక్రాకారంగానో కదలాడే సేనను దళమంటారు. వీటిలో చివరిది – ఫౌజు అనేది ఉర్దూ పదం. బలగమనే మాట కూడా సేనాసాధారణానికి వర్తిస్తుంది. ఈ మాటల్లోని దండు, దళం, బలగం, మూక అనే వాటికి వాడుక ఎక్కువ.

చేతికేది దొరికితే అదే ఆయుధంగా పట్టుకొని యుద్ధానికి వచ్చే సేనను ఎలగోలమూక అనేవాళ్ళు. వీళ్ళు శిక్షణ పొందిన సైనికులుకారు గాని అప్పటప్పటికి యుద్ధానికి సిద్ధమయ్యేవాళ్ళు. సైన్యంలో యుద్ధానికి తలపడే చాలా చిన్నవాడు బంటు. ఈ మాట సంస్కృత శబ్దమైన భటనుంచి పుట్టింది. దానికి పర్యాయపదాలు 'లెంక, జోదు' అనేవి. జోదు కూడా యోధ శబ్ద భవమే. లెంక అచ్చ తెలుగుమాట. యుద్ధం చేయని భటుణ్ని జీతగాడు, కొల్చు(డు)కాడు అనే వాళ్ళు. ధైర్యంగా పోరాడే బంటును 'చురుకరి, తెంపరి' అనేవాళ్ళు. ఎందరితోనైనా ఒక్కడుగా కయ్యానికి దిగే బంటును 'ఒంటరి, ఒంటరీడు, ఒంట్రింపు, ఒక్కటీడు' అని చెప్పేవాళ్ళు. ఈ రకం వీరుణ్ని సంస్కృతంలో 'ఏకభటు' డని, 'ఏకాంగవీరు'డని వ్యవహరించేవాళ్ళు. బాలచంద్రుడి వంటివాళ్ళను ఈ పేరున పొగిడేవారు. 'దినకూలీ' తీసుకొని యుద్ధానికి వచ్చే వ్యక్తిని 'కైజీతగాడు' అనేవాళ్ళు. ఈ బాపతు జనం ఎవరు ఎక్కువ సొమ్మిస్తే వాళ్ళతరఫున పోరాడేవాళ్ళు. యుద్ధపరిణామం ఇలాంటి వ్యక్తులున్న ఎలగోలు మూకల మీద ఆధారపడి వుండేది. ఇప్పటి ఇంగ్లీషులో irregular forces, mercineries అని చెప్పదగ్గ సైనికులన్నమాట.

చిన్నచిన్న సేనాదళాలను నడిపే నాయకుణ్ని "జంగిలి, గమికాడు" అని పిలిచేవాళ్లు. మొత్తం సేనాబలానికి ఆధిపత్యం వహించిన వ్యక్తిని "మొనకాడు (ఈ మాట నుంచే మొనగాడు అనేది పుట్టింది), పడవాలు/పడాలు, దణే, దళవాయి" అనే పేర్లతో పిలుస్తారు. దళానికి – సేనకు – వాయిలాంటి వ్యక్తి – ముఖంలాంటి వ్యక్తి – అంటే ముందుండే వీరుడు – దళవాయి. ఇదో మిశ్రరూపం. దళపతి, దళాధిపతి వంటివి సంస్కృత సమాసాలు. అలాఉద్దీన్ ఖిల్జీ మొట్టమొదటిసారిగా ప్రతి సేనా విభాగానికీ ఇద్దరేసి సేనాపతులను నియమించాడంటారు. ఆ విధానాన్ని అనుసరించిన విజయనగర చక్రవర్తులు సేనకు ముందు నడిచి, దాన్ని నడిపించే నాయకుణ్ని మాత్రమే దళవాయి అనేవాళ్లు. ఇప్పటి భాషలో field commander

అని చెప్పవచ్చు. నడిచే సేనకు వెనుకభాగాన మరింత నమ్మదగిన వ్యక్తిని సేనాపతిగా నియమించేవాళ్లు. అతగాణ్ని 'దుముదారుదొర' అనేవాళ్లు. పారిపోయే సైనికులను పట్టి ముందుకు నెట్టడం, ముందున్న సైన్యంలో శత్రువుతో రాజీపడి దొంగయుద్ధం చేసేవాళ్లను ముట్టుపెట్టడం వంటి వీ సేనాపతి విధులు! తరవాత ఇంగ్లీషువాళ్లు ఇలా రెండురకాల సేనాపతులుండే విధానాన్ని స్వాయత్తం చేసుకున్నారు! మూలం ఖిల్జీది!

సేన ఎటునడవాలో సూచించేవాణ్ని 'కవణకాడు' అని పిలిచేవాళ్ళు. సేనలో చేరి తమతోబాటు పోరాడే అన్యజాతీయుణ్ని 'అణుకువాడు' అనేవాళ్లు. పిడిగుద్దుల యుద్ధం చేసే బంటు 'దనువంది'. కుస్తీలు పట్టేవాడు 'జెట్టి'. ముందుకు నడిపేవాడు 'పెంతకారి'. కాలినడకన పోయేవాడు 'కాల్బంటు'. గుర్రమెక్కినవాడు 'రవుతు'. ఇలా మధ్యయుగాల యుద్ధ సన్నాహాలకు సంబంధించిన భేదాలెన్నో ఉన్నాయి.

## జయాపజయాలు

సేనలూ యుద్ధమూ ఉన్నప్పుడు జయాపజయాలు తప్పవు. జయశబ్దం సంస్కృతపదం. దానికి విజయమన్నదొక్కటే పర్యాయపదమంటారు! తెలుగు పరిస్థితి అంతకన్నా కొంతమేలు; 'గెలుపు/గెల్పు, గెలుపం, గెలివిడి' అనే నాలుగు రూపాంతరాలయినా ఉన్నాయి. జయంకన్నా పరాజయం ఎక్కువసార్లు అనుభవంలోకి వస్తుందని కాబోలు ఆ సంస్కృతపదానికి 'అపజయం, అభిభవం, పరిభవం, భంగం' అనేవి ఇంచుమించు సమానార్థకాలు. జయంలేకపోవటం అపజయం కావచ్చు; పరాజయం కావచ్చు. పరిభవ శబ్దానికి 'అవమాన'మనే అర్థం కూడా ఉంది – పరాభవానికి లాగా. భంగం అంటే విరిగిపోవటం, అవమానానికి గురికావటం. గెలుపు శబ్దానికి వ్యతిరేకంగా 'ఓటమి' అనే తెలుగుమాట ఉంది. దానికి పర్యాయపదాలని నిఘంటువులు 'ఓడటం, ఓల చెంగనాలు, బన్నం, విరుగు, విరుగుడు' అనే మాటలను పేర్కొంటాయి. ఓడు అనే క్రియాపదం మీద 'అ' అనే వ్యతిరేకార్థక ప్రత్యయం,దాని మీద 'మి' అనే భావార్థక ప్రత్యయం చేరి ఓటమి ఏర్పడింది. ఓల శబ్ద విషయం సందేహాస్పదం. ఈ మాటను స్నానార్థంలో, తేలటమనే అర్థంలో కూడా వాడ్తారు. 'ఓలలాడు, ఓలోలంచు' నీళ్ల మీద తేలాడు అనే ప్రయోగాలున్నాయి. చెంగనాలు శబ్దానికి ఎగరటం, గెంతటం అనేవే సామాన్యార్థాలు. దూడలు చెంగనాలు పెడ్తున్నాయంటాం. కట్టుకొయ్యనుంచి విడిపించినప్పుడు బంధనం నుంచి పారిపోవడమనే అర్థంలోనో, తప్పించుకపోవటమనే అర్థంలోనో ఈ మాట పుట్టివుండాలి – అర్థవికారంతో. చెంగున ఎగరటమనేది తెలుగు జాతీయం. బన్న మన్నమాటకు కష్టం, ప్రమాదం అనే విశేషార్థాలున్నాయి. విరుగు, విరుగుడు రూపాంతరాలు. వీటికి 'చెడిపోవు (పాలువిరగడం), పారిపోవు' మొదలైన అర్థాంతరాలేకపోలేదు.

పారిపోవు అనే అర్థంలో ఆ తెలుగు మాటకు అచ్చ తెలుగు నిఘంటువులు సూచించే పర్యాయపదాలు 'అయిదు పదిచేయు, వెనుకముందగు, వెనుకంజవేయు,

వెన్నిచ్చు, వీపుచూపు, కాలికి బుద్ధిచెప్పు, వీగు, జడుగు/జాఱుగు, ఓహటించు' వగైరాలు. ఒక చేతికి అయిదు చొప్పున ఉన్న వేళ్లను రెండు చేతులూకలిపి (అంటే దణ్ణం పెట్టి) పదిచేయడమనే డొంక తిరుగుడు మాటకు 'నమస్కరించు' అనికాక 'పారిపోవు' అనే అర్థం ఎందుకువచ్చిందో కోశకారులే చెప్పాలి. వెన్నుగాని వీపుగాని చూపితే పారిపోయినట్లే లెక్కన్నమాట! దెబ్బతప్పకోడానికి అలా చేసినా పారిపోయినట్లేలెక్కేమో అచ్చతెలుగు అభిమానుల భావంలో! వెనకవైపునే ముందుగా బావిస్తే – అంటే వీపో వెన్నో చూపితే – పారిపోయినట్లే లెక్క. వీగు అన్నదే సరైనమాట. రూపాంతరాలైన జడుగు, జాఱుగులకు 'వెనక్కుతగ్గు' అనే అర్థం. ఇప్పటి వాడుకలో 'వీగిపోవు' అనే సమస్త క్రియారూపమే వాడ్తాం. దానికి 'ఓడిపోవు' అనే అర్థంలో ప్రయోగముంది. ఉదాహరణకు శాసనసభలో ఫలానా తీర్మానం వీగిపోయిందంటాం. ఓహటించు అనే మాటకు కావ్యాల్లోనే ప్రయోగం. దానిక్కూడా **'ఓడిపోవు, భయపడు, భంగపడు'** అనే అర్థాలున్నాయి. కాలికి బలపమెందుకు కట్టుకుంటామో బుద్ధిని కూడా అందుకే చెప్తున్నామని సరిపెట్టుకోవాలి. ఇలాంటి నుడికారాలకు తాత్పర్యార్థాలేగాని విడివిడిమాటలు అర్థం చేసుకోవటం అన్యదేశీయులు మాత్రమే చేసేపని. బలపం కట్టుకుంటే తెగతిరిగినట్లు లెక్క; బుద్ధి చెప్తే పారిపోయినట్లు లెక్క. అవే అచ్చమైన తెలుగు పలుకుబడులు.

పారిపోవు అన్న తెలుగు మాటకు దీటైన సంస్కృత పదసంబంధం 'పలాయనం చెప్పు' అనేది. పలాయన శబ్దానికి 'అపయానం, అపక్రమం, ఉద్రావం, ద్రవం, విద్రవం, ప్రద్రావం, సంద్రవం, సంద్రావం' అనే సంస్కృతపదాలు ఇంచుమించు సమానార్థకాలు. పలాయన, అపయాన శబ్దాల్లోని 'అయన, యానా'లనే భాగాలు 'ప్రయాణం' లోని 'యాణం'తో సమానార్థకాలు. ఆ భాగానికి 'కదలిక' అనే అర్థం. వెనక్కుపోతే పలాయనం. మరెటయినా పోతే ప్రయాణం. అడ్డగోలుగా (పారి)పోతే అపయానం. దాన్నే 'క్రమం' – అంటే యుద్ధక్రమం – తప్పి (పారి) పోవటమనే భావంతో అపక్రమమని కూడా వ్యవహరిస్తారు, పుస్తకాల్లో మాత్రం. క్రమం తప్పటాన్ని అపక్రమమంటారు మామూలు వ్యవహారంలో. మిగిలిన మాటలన్నిటిలోనూ 'ద్రవ' శబ్దముంది (ఉత్, ప్ర, సం – అనే ఉపసర్గలను మినహాయిస్తే). 'ద్రు' అనే ధాతువుకు 'కారు, పారు, కదలు, ప్రవహించు' వగైరా అర్థాలున్నాయి. ద్రవ, ద్రావ శబ్దాలు ఆ ధాతువు నుంచి పుట్టినవి. అయితే పలాయన శబ్దానికున్న వ్యాప్తి సంస్కృతంలో తదితర పర్యాయపదాలకు లేదు.

యుద్ధంలో పారిపోయిన వ్యక్తినీ భయపడ్డ వ్యక్తినీ తెలుగులో "పిరికి(పంద), కోచ, పారుబోతు" అనే మాటల్తో పిలుస్తాం. పిరికి అన్నా పంద అన్నా ఒకటేగాని, ఆ రెంటినీ కలిపి పిరికిపంద అంటేనేగాని మనకు తృప్తికలగదు. పిరికి శబ్దాన్ని సంప్రదాయ పండితులు సంస్కృతంలోని భీరు శబ్దం నుంచి సాధిస్తారు. కోచశబ్దానికి కావ్యాల్లో తప్ప ప్రయోగమున్నట్లు లేదు వాడుకలో. సంస్కృతంలో 'భీరుడు, భీతుడు, కాతరుడు, కాపురుషుడు, అశూరుడు, నిర్వీర్యుడు, క్లీబుడు' వగైరా పేర్లతో పిరికివాణ్ని పిలుస్తారని కోశకారులు చెప్తారుగాని భీరుడు, భీతుడు అనేవి మాత్రమే సాధారణపదాలు. భీ శబ్దానికి భయమని అర్థం. భయపడేవాణ్నే

ఈ పేర్లతో పిలుస్తారు. కాతర శబ్దానికి 'చికాకు, తికమక, గందరగోళం' వంటి అర్థవిశేషాలున్నాయి. భయపడ్డా పడకపోయినా ఏంచేయాలో తోచని స్థితిలో ఉన్న వ్యక్తిని ఈ మాటతో నిర్దేశించవచ్చు. క్లీబుడంటే నపుంసకుడు. అంతమాత్రాన పిరికివాడనటం ఎంత న్యాయమో పరిశీలించాలి. బృహన్నల సాహసం, యుద్ధాలు చేసిన రుద్రమలూ ఝాన్సీలూ ఉన్న దేశంలో ఈ మాటకు 'పిరికి' అనే అర్థం ఎలా నప్పుతుందో నిఘంటుకర్తలకే తెలియాలి. కాపురుషుడంటే దుర్మార్గుడేగాని పిరికికాడు. నిర్వీర్యుడంటే శక్తిలేనివాడు – బలహీనుడు.

పిరికితనం లేని వ్యక్తిని తెలుగులో 'దిట్ట, గండడు, ఉక్కుతునియ' అంటారు. మొదటి మాటే సరయింది. గండ శబ్దానికి వీరుడని అర్థం. గండు శబ్దానికి 'ధైర్య'మని. 'పెద్ద' అనీ అర్థాలు. (కొజ్జా అర్థంలో వచ్చిన 'గండా' అనేది ఉర్దూపదం). ఇలాంటి వ్యక్తిని సంస్కృతంలో 'వీరుడు, శూరుడు, ధీరుడు, సాహసికుడు' వగైరాపదాల్తో చెప్తారు. ఇవే అర్థాలను సూచించే పదబంధాలూ వర్ణనాత్మక పదాలూ మరికొన్ని లేకపోలేదు.

## చావుబతుకులు

మానవజాతికి చావుబతుకులకన్నా ప్రధానమైన విషయాల్లేవు. దువ్వూరి రామిరెడ్డిగారు కాబోలు "మరణభయమ్ము నాకు నణుమాత్రములేదు; మదీయ జీవసంభరణ భయమ్మె మిక్కుటము" అని రాశారు. బతికిచచ్చేకన్నా చచ్చిబతకటం మేలు కాబట్టి, మొదట చావుసంగతి తలుచుకొని తరువాత బతుకు విషయం ఆలోచిద్దాం.

చావుకు సమానార్థకాలయిన సంస్కృత శబ్దాలు "పంచత/పంచత్వం, కాలధర్మం, దిష్టాంతం, అంతం, అత్యయం, ప్రలయం, నాశం, మృతి, మృత్యువు, మరణం, నిధనం" వగైరాలు. మానవశరీరం 'భూమి, ఆకాశం, నీరు, నిప్పు, గాలి' అనే పంచభూతాల కలయికవల్ల ఏర్పడ్డదని, అది మళ్లీ ఆ అయిదింట్లో కలిసిపోతుందనీ పూర్వులు విశ్వసించేవారు. 'పంచ' అంటే అయిదు. ఈ అయిదింటిలో కలిసిపోవటమే చావు కాబట్టి దానికి పంచత/పంచత్వమనే పేరు వచ్చింది. కొంతకాలం – వందేళ్లూ దాటినాసరే – గడిచిన తరవాత తప్పనిది కాబట్టి కాలధర్మమన్నారు. దిష్టమంటే నిశ్చితమయింది; ఏర్పాటయింది. ఆ ఏర్పాటు ప్రకారం పొందవలసిన 'అంతం' కాబట్టి అంతమూ అన్నారు – దిష్టాంతమూ అన్నారు. అత్యయశబ్దానికి 'ప్రమాదం, చెరువు, (కాలం) గడచిపోవటం' అనే ఇతరార్థాలు కూడా ఉన్నాయి. చివరి అర్థంలో చావుకు పర్యాయపదముంది. 'ప్రమాదకర సమయ'మనే అర్థంలో అత్యయశబ్దం మీద నుంచి పుట్టిన 'ఆత్యయిక (పరిస్థితి)'ని ఇటీవల కొందరు పాత్రికేయులు 'ఎమర్జెన్సీ' అనే అర్థంలో వాడారు. లయమంటే ధ్వంసంకావటం. దానికి 'ప్ర' అనే ఉపసర్గ చేర్చి చావనే అర్థం కల్పించారు. అయితే ఈ మాటకు చాలా మందికి, సృష్టికి

ఒక్కసారిగా వచ్చే చావు అనే అర్థమే ఎక్కువ వ్యాప్తిలో ఉంది. మృతి, మృత్యువు, మరణం అనేవి సాధారణపదాలు. మృతి తప్పనివాళ్లను మర్త్యులని, చావని వాళ్లని అమర్త్యులు (=దేవతలు) అని భావించారు. మృత్యువును చావనే గాక, చావుకు అధిష్ఠాన దేవతగా కూడా పూర్వులు ఊహించారు. నిధన శబ్దానికి 'ముగింపు' అనే అర్థముంది. జీవితం ముగిసే స్థితి కాబట్టి చావుకు 'నిధన'మనే పేరు వచ్చింది.

పై మాటకు సమానార్థకంగా తెలుగులోని చచ్చుధాతువు పర్యాయపదాల నుంచి పుట్టిన భావార్థకరూపాలు చాలా ఉన్నాయి. అవిగాక తక్కినవి "మిత్తి, పెన్నిదుర, తుది, చావు" అనే శబ్దాలు. మిత్తి అనేది మృత్యుశబ్దభవం. 'పెన్-నిదుర' అనేది మామూలు వాడుకలో ఉన్న 'పెద్దనిద్ర'కు రూపాంతరం. అది సంస్కృతంలోని 'దీర్ఘనిద్ర'కు అనువాదమోకాదో తేల్చడం కష్టం. తుది, తుద అనే రూపాంతరాలు 'చివర' అనే అర్థం కలవి. చావొక్కటే స్వచ్ఛమైన తెలుగుచావు. దానికి కావ్యాల్లో సమాసాల్లో 'చా' అనే ఏకాక్షర రూపాంతరముంది. ఇక భావార్థక రూపాలు 'సమయటం, ఈల్గటం/నీల్గటం, చక్కడగటం, కుంగటం, తుంగటం, కూలటం, త్రెళ్లటం, మడియటం, తెగటం, డీల్పడటం, మొదలచెడటం, అడగటం, పొలియటం' మొదలైనవి. సమయు అనేది చచ్చుకు పర్యాయపదం. ఈల్గు పుస్తకాల్లో నీలుగు వాడుకలో నిలిచిన మాటలు. 'తెగ నీలుగుతున్నావేం?' లాంటి ఆక్షేపణల్లో నిజానికి 'చచ్చు' అనే అర్థంకన్నా బాధపడు, విర్రవీగు లాంటి అర్థాలే ఉన్నాయనిపిస్తుంది. చాలా పదబంధాల్లో, నుడికారాల్లో చచ్చుకు బాధపడటమనే అర్థమే పర్యాప్తంగా ఉన్నట్లుంది. ఉదాహరణకు – "ఈ పని చేయలేక చస్తున్నాను; వచ్చాడా చచ్చాడా?; వింటాడా చస్తాడా? చచ్చిన చావుగాకుండా ఉంది; ఎలాగో పూర్తిచేసి చచ్చాడులే!" వంటివాటిని చిత్తగించండి. చక్కడగు అంటే 'ముక్కలగు' అని అర్థం. తుంగటం అనేది త్రుంగు అనే ప్రాచీన క్రియాపదం నుంచి పుట్టిన భావార్థకం. దీనికి కావ్యప్రయోగమే గతి. మడియు అంటే చచ్చు. పొలియు అంటే 'పొలి' (అంటే బలి) కావటం. డీల్పడు అనే పూర్వకాల ప్రక్రియాపదానికీ నేటి 'డీలాపడు' అనేదానికీ సంబంధంలేదు. ఈ డీలా హిందీ నుంచి ఎరువుగా వచ్చిన మాట. త్రెళ్లు పాత తెలుగు క్రియ. నేటి వాడుకలో ఈ మాటలేదు.

చంపు అనే క్రియకయితే ఇంకా చాలా పర్యాయపదాలున్నాయి తెలుగులో – "త్రుంచు, చిదుము, తెగటార్చు, పరిమార్చు, పొరిగొను, పెల్లుమార్చు, తునుము/దునుము, చక్కడచు, కూల్చు, తెగు, మడుపు, మన్నిగొను, రూపుమాపు, కీటడ(గిం)చు, మడియించు, తూలించు, మలుపు, నలుచు, వెంపరలాడు, నుగ్గాడు, జక్కాడు, పగదెంచు, చెండు, చెండాడు, సదమదమొనరించు, చదుపు, పీచమడచు, నలుము, చాగరలాడు, పిలుకు మార్చు, ముగియించు, నురుము చేయు, అడచు, సమయించు, పొరిగొను" వగైరాలు. వీటిలో అత్యధిక సంఖ్యాకాలు పాత తెలుగు కావ్యాల్లో చంపు అనే అర్థంలో కనిపిస్తాయి. వెంపరలాడు అంటే ఇప్పటి అర్థం 'తాపత్రయపడు, గాభరాపడు' అని మాత్రం. తెగు అంటే ఇప్పటి అర్థం 'తెగిపోవు' అనేగాని చంపనికాదు. ఇలాంటి భేదాలను చెప్పటం గ్రంథవిస్తృతికి దారితీస్తుంది.

'చంపు(డు)' అనే అర్థంగల సంస్కృత పదాలు కూడా బోలెడున్నాయి – చేయు

వంటి సహాయ క్రియలు చేర్చివాడదగిన నామవాచక రూపాల్లో. "హత్య, వధ, హననం, ఘాతం, నిషూదనం, హింస(నం), ఆలంభం, విశసనం, వ్యాపాదనం, ప్రమాపణం, నిబర్హణం, నికారణం, విశారణం, ప్రవాసనం, పరాసనం, సంజ్ఞపనం, నిర్గ్రంథనం, నిస్తరణం, క్షణనం, పరివర్జనం, నిర్వాపణం, ప్రమథనం, క్రథనం, ఉజ్జాసనం, పింజం, విశరం, ఉన్మాథం, నాశం" వంటివి. వీటిలో "విశసనం, ప్రమాపణం, విశారణం, క్షణనం" వగైరాలు యజ్ఞసమయంలో జంతుబలియిచ్చేటప్పుడు బలిపశువును చంపడంలో వాడ్తారు. నిర్వాపణంలాంటి మాటలకు 'ఆర్పివేయటం' వంటి అర్థాలున్నాయి. పరివర్జనం అంటే వదిలిపెట్టడం (దానధారల్లో). ప్రమథనమంటే బాగా చిలకటమని కూడా అర్థం చెప్పవచ్చు.

బతుకు/బదుకు (పూర్వరూపాలు బ్రతుకు, బ్రదుకు) శబ్దానికి పర్యాయపదాలు లేనట్లే. ఉన్నవి రూపాంతరాలు మాత్రమే తెలుగులో. సంస్కృతంలో "ఆజీవ(న)ం, జీవిత, జీవితం, జీవ(న)ం, వర్తనం, వృత్తి, వార్త, సత్వం, చేతన/చైతన్యం, అనుభరణం, ప్రాణధారణ" లాంటివి వున్నాయి. జీవన శబ్దానికి నీరనే అర్థాంతరముంది. పాత తెలుగులో జీవిత శబ్దానికి ఇప్పటి 'జీత'మనే అర్థం ఉండేది. వర్తనం 'ప్రవర్తన, నడవడి' అనే ఇతరార్థా లున్నమాట. వృత్తి సరేసరి. పూర్వం "కృషి వాణిజ్యౌ వార్తా" అనే వివరణ ఉండేది. అంటే వార్తా శబ్దానికి 'వ్యవసాయ వ్యాపారాలు రెండూ'ననే అర్థవిశేషం ఉండేది. 'పుకారు, సమాచారం' అనే అర్థాలు కూడా ఉండేవి. వీటిలో రెండో అర్థంలోనే నేటి 'వార్తలు, వార్తాపత్రిక' మొదలైనచోట్ల ఈ మాట వాడుకలో ఉంది. అసువులంటే ప్రాణాలు. వాటిని నిలుపుకోవటం అనుభరణం. ప్రాణాలను (ఉగ్గబట్టి) ఉంచటం ప్రాణధారణం.

## నవ్వులూ ఏడ్పులూ

మానవ గుణస్వభావాలను గురించి ప్రస్తావించేటప్పుడు 'నవ్వు'తో మొదలుపెడ్తే హాయిగా ఉంటుంది. నవ్వు, నగవు అనేవి చారిత్రకంగా రూపాంతరాలు. అచ్చతెలుగు మాటలు. 'అలరింత' అనేది నవ్వుకు పర్యాయపదమని కొన్ని నిఘంటువులు చెప్తాయిగాని దానికి 'సంతోషపెట్టడం' అనే అర్థమే నేటి వాడుకలో పర్యాప్తం. 'అలరింపు' అనే రూపాంతరం దానికుంది. స్త్రీపురుషులు అన్యోన్యం పొగడటం, హుషారు చేయటం కూడా అలరింపే. 'నవ్వు నాలుగందాల చేటు' వంటి సామెత లనేకం పుట్టాయి. అందులో చాలా రకాలున్నాయి. చిరునవ్వు, వెకిలినవ్వు, వెర్రినవ్వు, బొబ్బనవ్వు – వగైరాలు. పళ్లు కనపడకుండా నవ్వేది చిరునవ్వు. పాతకాలపు కావ్యాల్లో దాన్ని అలతినవ్వు (=కొద్దిపాటి నవ్వు) అనేవాళ్లు. సమయ సందర్భాల్లేకుండా విరగబడి నవ్వితే అది వెకిలినవ్వు. అమాయకంగా నవ్వితే అది వెర్రినవ్వు. ఆపులేకుండా పగలబడి నవ్వితే పిచ్చినవ్వు. అపుకోలేకుండా పగలబడి పెద్దచప్పుడు చేస్తూ నవ్వితే అది బొబ్బనవ్వు. ఇలా అనేకం.

నవ్వుకు పర్యాయార్థకాలని చెప్పదగ్గ సంస్కృతపదాలు "హాసం, హాసం, హసనం, హసితం, స్మితం, విహసితం, విహసనం, అతి హాసం, అట్టహాసం, సోత్ప్రాసం, ఆచ్ఛురితకం, ఉపహసితం" మొదలైనవి. వీటిలో హసం, హాసం పరస్పర రూపాంతరాలు. అలాగే హసనం, హసితం అనేవీ, విహసితం, విహసనం అనేవీ. స్మిత శబ్దానికి చిరునవ్వని అర్థం. కోపంతో కూడిన పెద్దనవ్వు అతిహాసం. బొబ్బనవ్వుకు సమానార్థకం అట్టహాసం. ఈ కాలానికి ఈ మాటకు కొంత అర్థం మారింది. "వాళ్లింట్లో పెళ్లి అట్టహాసంగా జరిగింది" వంటి వాక్యాల్లో ఆ మాటకు 'జబర్దస్తీగా, ఆడంబరంగా' అని అర్థం. అతిహాసానికి ఉచ్చైర్హాసమనే మరో పేరుంది. ఉచ్చైః అంటే పెద్దగా. అలా నవ్వటం అతిహాసం. ఎత్తిపొడుపుగా నవ్వితే దాన్ని అచ్ఛురితకం అంటారు. సోత్ప్రాసమనీ అంటారు. ఉత్ప్రాస అంటే ఎత్తిపొడుపు. విహసితం, విహసనం అనేవాటికి పరిపాటి నవ్వు అని అర్థం చెప్పవచ్చు. అంటే అటు చిరునవ్వూ కాక, ఇటు పెద్ద నవ్వూ కాక మధ్యరకంగా ఉండే నవ్వని అర్థం. చిరునవ్వనే అర్థంలో స్మిత శబ్దంకన్నా ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట 'దరహాసం'. దరం అంటే సగం. నవ్వీ నవ్వనట్లుండేది దరహాసం. కొందరు 'దరస్మితం' అనికూడా ప్రయోగించారు కవులు.

నవ్వుకు విరుగుడు ఏడ్పు. ఏడ్పుకేమో నవ్వే వ్యతిరేకం. ఏడుచు/ఏడ్చు అనే ధాతురూపం మీదినుండి ఏర్పడ్డ నామశబ్దం ఏడ్పు. దీనికి 'అరపు, మొరలిడుట, వాచరచటం, వాపోవటం' అనేవి పర్యాయార్థకాలని తెలుగు నిఘంటువులు పేర్కొంటాయి. అరచు అనే క్రియా పదంనుంచి అరపు పుట్టింది. దానికి 'కేకలు వేయటం, పెద్దగా మాట్లాడటం, గొంతు చించుకోవటం' మొదలైనవి ఈనాటి అర్థాలు. పెద్దగా ఏడ్చినప్పుడు ఈ మాటను ప్రయోగిస్తారు. దుర్యోధనుడి చావు విన్న ధృతరాష్ట్రుడు 'అవరచిన ట్లరచెన్' అని భారతంలో కనిపిస్తుంది. 'అంబా' అని అరచినట్లు దీనంగా ఏడ్చినప్పుడు ఈ మాట పుట్టినట్లుంది. మొర అంటే ప్రార్థన. మొర్రోమనటం ఈ మొరనుంచే పుట్టింది. ఏదో చెప్పుకుంటూ ఏడ్వటానికి ఈ పేరు. పోతన భాగవతంలో ఈలాంటి ప్రయోగాలు కనిపిస్తాయి – 'కుయ్యో! కవియోగివంద్య' మొదలైనవి. వా అంటే నోరు. వాచరచటం అంటే నోరు కొట్టుకుంటూ ఏడవడం. 'వాడు నెత్తీనోరూ మొత్తుకున్నాడు' లాంటి నుడికారాలున్నాయి తెలుగులో. 'అవ్వవ్వా' అంటూ ఏడుస్తూ నోరు కొట్టుకోవట మన్నమాట. వాపోవు అంటే దుఃఖించు. 'నోరు పారేసుకోవట'మంటారే అలాగే గొంతెత్తి ఏడ్వటానికి వాపోవటమని పేరు. ఒక ఆధునిక మహాకవి విచిత్ర ప్రయోగం చేశాడు: "ఏనిర్భాగ్య నిరర్థ నీరవగళం బెళ్లెత్తి వాపోవునో!" అని. ఆ గళం (=గొంతు) నీరవం (నిర్+రవం=చప్పుడు లేనిది). అంటే వినిపించనిది. ఆ గళమెత్తి ఏడవటం చాలక పూడిపోయిన ఆ గొంతును మరోసారి ఎళ్లెత్తి (ఎలుగు=గొంతు) – అంటే గొంతెత్తి – ఏడ్చాడని వర్ణన! అదేమి ఏడ్పో, ఎలా ఏడ్చారో, దానికి ఒక్కమాటలో ఏంపేరో రాసినాయనకే తెలియాలి. ఏమయితేనేం? వాపోవటం అంటే గొంతెత్తి ఏడవటం. ఈ పాతకాలపు మాట ఈనాటి పత్రికా భాషలో నిలదొక్కుకుంది! "ఆ నాయకుడు వాపోయా"డని రాస్తుంటే, "మేం ఏడుస్తున్నామా?" అని కోపగించుకున్న నేత ఒక్కడూ లేడు! అదే విచిత్రం!

ఏడ్పుకు పర్యాయార్థకాలని "మన్యువు, శోకం, క్రందనం, క్రందితం, ఆక్రంద(న)ం, రుదితం, రోదనం, క్రుష్టం, కృష్టం" వగైరా మాటలను చెప్పవచ్చు – సంస్కృతంలో. అయితే దుఃఖమన్న పదానికే తెలుగులో వాడుక ఎక్కువ. కోపంతో ఏడ్చే ఏడ్పును మన్యువంటారు. ఒకానొక ప్రబంధసుందరి 'వెక్కసమగు మన్యు వేగమున కాటుక కన్నులు నీరు ధారలై'పోగా ఏడ్చిందని శ్రీనాథుడు వర్ణించాడు. శోకమనేది సాధారణ పదం. వాల్మీకి మహర్షి శోకమే శ్లోకమయిందని చెప్తారు. రాగాలు తీస్తూ ఏడవటాన్ని శోకమంటారేమో తెలీదు. క్రందనం, క్రందితం, ఆక్రందం, ఆక్రందనం – అనేవి పరస్పరం రూపాంతరాలు. గొల్లుమని ఏడవటానికి ఈ పేర్లు సమానార్థకాలు. క్రుష్ట, కృష్ట శబ్దా లొకదానికొకటి రూపాంతరాలు. తెరలు తెరలుగా వచ్చే ఏడ్పుకు, బొడ్డు దగ్గర్నుంచి వచ్చే ఏడ్పుకూ ఇది సరైన పర్యాయార్థకాలు. కుమిలి కుమిలి ఏడిస్తే ఆ ఏడ్పును క్రుష్టమనాలి. రోదనం అంటే ప్రత్యేకమైన ఏడ్పో కాదోగాని ఎవరో చెప్పిన సూక్తి ఉంది – "బాలానాం రోదనం బలం" అని. పసిపిల్లలు ఏడిస్తే మంచిదనీ, బలం పెరుగుతుందనీ వాళ్ల విశ్వాసం. ఇదొకవిధంగా విపరీతార్థ కల్పనం. ఇక్కడ బాల శబ్దం కాక బాలా శబ్దముందనుకొంటే "ఆడవాళ్లకు ఏడ్పే ఆయుధ"మన్న మాటతో సరిపోతుంది! ఒకే మాటను పెద్దలెన్ని విధాలుగా మలుచుకొని అర్థాలు చెప్తారో ఇలాంటి సందర్భాలు తెలుస్తాయి. ఈ సూక్తి పసిబిడ్డల కన్వయిస్తుందనుకొనేవాళ్లు వాళ్లను ఏడ్పించి తాము సంతోషిస్తుంటారు!

చచ్చు అనే తెలుగు మాటను ఎన్నిరకాలు వాడుతుంటామో – ప్రాణం పోగొట్టుకొను అనే సహజార్థం తప్పించి – తెలుగు వాళ్లం 'ఏడ్చు' అనేదానికూడా అన్ని విశేషార్థాల్లో ఊతంకోసం, గట్టిగా చెప్పటంకోసం వాడుతుంటాం. "వాడు చెప్పిచచ్చాడులే: వాడు చెప్పేడ్చాడులే" అనే రెండురకాల వాక్యాలూ వాడుతుంటాం. "ఆ పనిచేసి ఏడు, ఏడిసినట్లే వుంది నీవన్నమాట, ఏడవగలిగితే ఎగసాయం (ఇక్కడ 'చేయగలశక్తి ఉంటే' అన్న అర్థం స్థానంలో 'నష్టాలు భరించగలిగితే, నష్టం వచ్చిందని ఏడ్చి సరిపెట్టుకొనే ఓపిక ఉంటే'), వాడికెప్పుడూ ఏడుపాలోచనే, వాళ్లిద్దరూ ఎలా ఏడిస్తే వీడికేం?" వగైరా వాక్యాలను పరిశీలించండి. ఈ మాటకు 'సంభోగం, బలాత్కారం, దుఃఖం, అసహ్యం, అర్థరహితం, శక్తి' వగైరా పరస్పర విరుద్ధార్థాలు తెలుగు నుడికారంలో వున్నాయి. ఈ ప్రయోగ విశేషాలను పరికించిన తర్వాత నవ్వూ, ఏడ్పూ అన్యోన్యం వ్యతిరేక పదాలని (అన్ని సందర్భాల్లోనూ) చెప్పటం కుదరదు – నిఘంటువు లేమని ఏడ్చినా!

## మానవస్వభావాలు

సిగ్గు మానవస్వభావాల్లో మరో లక్షణం. ఈ తెలుగుమాటకు "నాన, సిబ్బితి, బొనుకు, వుయిలోట" అనేవి తెలుగు పర్యాయపదాలు. వీటిలోని మొదటి రెండు మాటలూ ప్రాచీన కావ్యాల్లో తరుచుగా కనిపిస్తాయి. వుయిలోడు అనే క్రియాపదం

నుంచి ఏర్పడ్డమాట పుయిలోట అనే నామవాచకం. 'వెనుకాడు, జంకు' అనే విశేషార్థాలుకూడా ఈ మాటకున్నాయి. బొమకుమాత్రం మారుమూల పదమే. ఇప్పటి వ్యవహారంలో 'సిగ్గూ బిడియం, సిగ్గూలజ్జ' అనే జంట మాటలకు వాడుక ఎక్కువ. 'బిడియ' అనే కన్నడపదం తెలుగులో బిడియంగా మారింది. ఒకే అర్థంగల రెండు మాటలను వాడటం నొక్కిచెప్పటంకోసం.

సిగ్గుకు సమానార్థకాలైన సంస్కృతపదాలు "లజ్జ, త్రప, వ్రీడ, హ్రీ, మందాక్షం, అపత్రప, పుచ్ఛటిక, పుచ్ఛడి" అనేవి. లజ్జాశబ్దానికి లజ్యా అనే రూపాంతరం కూడా ఉంది. మహాభారతంలో ధర్మానికి లజ్జ భార్య అనీ, వినయానికి తల్లి అనీ ఒక ప్రస్తావనలో వస్తుంది. 'అత్తపత్తి' చెట్టును కూడా లజ్జాశబ్దంతో వ్యవహరిస్తారు – తాకితేదాని ఆకులు సిగ్గుపడ్డట్లు ముడుచుకుపోతాయి కాబట్టి. త్రపాశబ్దానికి 'మాన్పడు, విస్తుపోవు' అనే అర్థాంతరముంది. వ్రీడాశబ్దానికి 'వ్రీళ' అనే రూపాంతరముంది. వ్రీడనం అంటే 'తలవంచటం'. అంటే సిగ్గుపడటం. సమాసాల్లో మాత్రమే హ్రీ శబ్దానికి తెలుగు కావ్యాల్లో ప్రయోగమెక్కువ. దక్షుడి కుమార్తె అనీ, ధర్మానికి భార్య అనీ హ్రీకి పురాణాల్లో రూపకల్పన చేశారు. హ్రీతి అన్నా సిగ్గే. అదో రూపాంతరమన్నమాట. మందాక్షమంటే మందంగా ఉన్న అక్షులు (కళ్లు) ఉన్న స్థితి అన్నమాట. సిగ్గుతో కళ్లు వాల్చటం మందాక్షం. అపత్రపం అంటే (సిగ్గుతో) తల తిప్పుకోవటం, మొఖం తప్పించటం. తక్కిన రెండు మాటలూ కేవలం నిఘంటువుల్లో మాత్రం కనిపించేవి.

భయ శబ్దానికి పర్యాయపదాలైన సంస్కృతం మాటలు "దరం, త్రాసం, భీతి, ఉద్వేగం, సాధ్వసం" అనేవి. 'విరుగు, చీలు' మొదలైన అర్థాల్లో దర శబ్దం వాడ్తారు. గుండెదడ, వణుకు వంటి లక్షణాలున్నది కాబట్టి త్రాసమన్నారు. 'భీతి'కి 'భీ' అనే రూపాంతరముంది. అది 'భీకర' వంటి శబ్దాల్లో భాగంగా వినిపిస్తుంది. ఆరాటపడటం ఉద్వేగం. లేని ప్రమాదాన్ని ఊహించుకొని భయపడటం, ఆకస్మికంగా జడుసుకోవటం, గందరగోళపడటం అనే అర్థాల్లో సాధ్వస శబ్దం వాడ్తారు. వీటన్నిటిలో భయ శబ్దానికి నిత్యవ్యవహారాలలోను, సాధ్వస శబ్దానికి నాటక సాహిత్యంలోనూ ఎక్కువ వ్యాప్తి ఉంది. సిగ్గు లజ్జ అనే ఒకే అర్థంగల రెండు మాటలను వాడినట్లే భయభీతులనే మాటలను కూడా వాడుతుంటాం. ఎటొచ్చీ భయం, భీతి అనే రెండూ సంస్కృత పదాలు కావటమే. విశేషం.

భయ శబ్దానికి సమానార్థకాలయిన తెలుగుమాటలు "వెర, వెరపు, అళుకు, అదరు, అడరు, బెదరు, దడుపు, జడుపు, ఓజ" వగైరాలు. వెర–వెరపులూ, అందరు–అడరులూ, దడుపు–జడుపులూ పరస్పరం రూపాంతరాలు. వెర శబ్దాన్ని ఉపాయమనే అర్థంలో కూడా ప్రయోగిస్తారు. అళుకు కావ్యాల్లో కనిపించేమాట. అదరూబెదరూ అనే జంటమాటలు వాడుకలో ఉన్నాయి – ఒకే అర్థం బోధిస్తూ – భయభీతుల్లా. ఓజశబ్ద విషయం సందేహాస్పదం. కొన్ని నిఘంటువులు 'దిగులు' శబ్దాన్ని భయపర్యాయమని పేర్కొంటున్నాయిగాని నేటి వాడుకలో అది 'బెంగ'కే తుల్యార్థకంగా వినిపిస్తుంది.

మానవ స్వభావాల్లో గర్వమొకటి సర్వసాధారణం – అనేక కష్టాలు తెచ్చేది కూడా. అచ్చ తెలుగులో "ఆము, గరువం, డంబు, మురిపం, మురువు, త్రుళ్లు" అనేవి గర్వ శబ్దానికి పర్యాయపదా లంటారు. ఆము సంస్కృతంలోని 'అహం' నుంచి 'హాము' అనే మధ్యరూపం నుంచి పుట్టిందంటారు. అలాగే గరువం గర్వ శబ్దభవం. డంబు అనేమాట కావ్యాల్లో ఎక్కువ వ్యాప్తిగలది. దానికి గర్వమనేకాక 'ఆర్భాటం, ఆడంబరం' అనే అర్థాలుకూడా ఉన్నాయి. మురిపం అనేదానికి 'మురిపెం' అనే రూపాంతరముంది. 'ముద్దూమురిపెం' వంటి ప్రయోగాల్లో ఈ మాటకు గర్వమనే అర్థమే లేదిప్పుడు. త్రుళ్లు అనేది పాతమాట. "ఎందుకంత తుళ్లిపడతావ్?/మిట్టిపడతావ్?" అనే సందర్భాల్లో 'ఎగిరిపడటం' అనే అర్థమే మిగిలింది. గంతులకు తుళ్లింతలు అనే అర్థముంది. గర్వంలేకపోతే మిడిసిపడటం లేకపోవచ్చుకాబట్టి తుళ్లు, మిడిసిపాటు అనేవి గర్వఫలితాలని చెప్పాలి.

గర్వపర్యాయాలు సంస్కృతంలో చాలా ఉన్నాయి. "అభిమానం, అహంకారం, అహంమతి, అహంమానం, అపలేపం, అవలేపం, ఆటోపం, అవష్టంభం, అమందోన్నతి, ఆరంభం, దర్పం, స్మయం, చిత్తోద్రేకం, మందం, ఉద్ధతి, ఉత్సవం, ఔద్ధత్యం, కాండం, ఖరువు, గంధం, ధ్వజం, ధృష్టత, ప్రాగల్భ్యం, మాదం, ఉత్సేకం" వగైరాలు. వీటిలో కొద్దిపాటి అర్థభేదాలతో 'గర్వం, మదం, దర్పం' అనే మాటలు ఎక్కువ వాడుకలో ఉన్నవి. 'మానం' అంటే పొగరు, ఆత్మగౌరవం. అవి ఎక్కువగా ఉండటం అభిమానం. దుర్యోధనుణ్ణి అభిమానధనుడనేది ఆ అర్థాల్లోనే. అహం అంటే నేను. నేనే ముఖ్యం, నాకన్నా మరొకటి/మరొకరు ఎక్కువకాదనే భావాన్ని – అంటే దురభిమానాన్ని – వ్యక్తం చేసే మాటలు 'అహంకారం, అహంమానం, అహంమతి' అనేవి. అపలేపం, అవలేపం అనేవి రూపాంతరాలు – మదం, మాదం – లాగా; ఉద్ధతి – ఔద్ధత్యంలాగా. ఆటోపమనే దానికి ఆర్భాటమనే అర్థాంతరముంది. అవష్టంభ మనేదానికి తెలుగు 'మిడిసిపాటు' అనేది సరైన సమానార్థకం. ఆరంభ శబ్దానికిప్పుడు 'మొదలు' అనే అర్థమే వాడుకలో మిగిలింది. అలాగే గంధ శబ్దానికి 'వాసన; ప్రాగల్భ్య శబ్దానికి (ప్రగల్భం నుంచి ఏర్పడ్డ తద్ధిత రూపం) వాచాలత, మాటకారితనం; కాండశబ్దానికి చెట్టుమొదలు; ధ్వజ శబ్దానికి జెండా; ఉత్సేక శబ్దానికి తొందరపాటు' అనేవి మంచి వ్యాప్తిగల సాధారణార్థాలు ఈ కాలంలో. 'ధ్వజభంగం' వంటి పదబంధాల్లో తప్ప ధ్వజశబ్దానికి గర్వమనే అర్థం ఈనాడు లేదు. ధృష్టత అనేదానికి 'మొండితనం, పట్టుదల' మొదలైన అర్థాలు నిలిచాయి. చిత్తంలో – అంటే మనసులో – పుట్టిన ఉద్రేకానికి ఫలితంకాబట్టి చిత్తోద్రేకమనే వర్ణనాత్మక పదం కల్పించారు. స్మయ శబ్దానికి కావ్యాల్లో ప్రయోగం ఎక్కువ. అమందం అంటే తక్కువ కానిదని అర్థం. తన ఉన్నతి – అంటే 'ఎక్కువతనం/ఆధిక్యం' – ఎవరి లక్షణాలకన్నా తక్కువదికాదనే భావాన్ని అమందోన్నతి అనే వర్ణనాత్మక శబ్దం ద్వారా ప్రకటిస్తారు. గర్వం, మదం ఒక్కటేనని ఒప్పుకోవటం కష్టం. దర్పం అంటే డంబమని చెప్తారుగాని అది గర్వమో గర్వప్రదర్శనమో తేల్చిచెప్పలేం.

ఓర్పు మానవ స్వభావాల్లో మంచి లక్షణం. ఈ తెలుగుమాటకు 'ఓరిమి, ఓర్మి' అనే రూపాంతరాలూ, 'నిమ్మళం, సైరణ, తాలిమి, తాళిక' వంటి పర్యాయపదాలూ

ఉన్నాయి. నిమ్మళమనే మాటకు మాండలికంగా 'మెల్లన, తాపీ' వగైరా అర్థ విశేషాలున్నాయి. సైరించు అనే క్రియా పదానికి సంబంధించిన నామవాచకపదం సైరణ. తాలిమికి తాల్మి అనే రూపాంతరముంది. తాళు అను క్రియకు దగ్గర చుట్టం తాళిక అనేమాట. సైరణ, తాలిమి శబ్దాలకు కావ్యప్రయోగాలెక్కువ. తాళిక మారుమూల మాట.

ఓర్పుకు పర్యాయార్థకాలైన సంస్కృత పదాలు 'క్షమ, క్షాంతి, సహనం, తితిక్ష' అనేవి. క్షమా శబ్దానికి తెలుగు కావ్యాల్లోనూ సహన శబ్దానికి నిత్య వ్యవహారంలోనూ వాడుక ఎక్కువ. క్షమాక్షాంతులు పరస్పర సంబంధమున్న రూపభేదాలే (భ్రమ–భ్రాంతి, ప్రమ–ప్రాంతి అన్నట్లు). తితిక్షా శబ్దానికి తితిక్ష అనే రూపాంతరముంది. భాగవత పురాణం ప్రకారం క్షేమానికి తల్లీ, ధర్మానికి భార్యా అయిన దక్షప్రజాపతి కుమార్తెకు తితిక్ష అని పేరు.

ఓర్పు లేనప్పుడు పుట్టేది ఓర్వమి. ఈ పదం ఓర్చు(కొను) అనే ధాతువునుంచి పుట్టిన తద్ధిత రూపం. ఈ తెలుగుమాటకు 'ఈసు, ఈరసం' అనేవి పర్యాయపదాలు. ఈసు సంస్కృతంలోని ఈర్ష్యా శబ్ద భవమంటారు. ఈర్ష్యకు పర్యాయార్థకాలయిన సంస్కృత పదాలు 'అసూయ, మత్సరం, రాగం, హంస' అనేవి. అసూయ తెలుగులోకూడా ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట. మత్సర శబ్దానికి మచ్చరమనేది తద్భవరూపం. రాగ శబ్దానికి అనేకార్థాలున్నాయి. విరాగి అనే మాటకు అసూయలేనివాడని అర్థమేమో తెలియదు. హంసకూడా అనేకార్థభేదాలున్న మాటే. సువిశాలమైన దేశంలో భిన్న కాలాల్లోగాని, భిన్న ప్రాంతాల్లోగాని ప్రత్యేక మాండలికార్థాల్లో ఉన్న మాటలు నిఘంటువుల కెక్కేసరికి నానార్థాలు వస్తాయి. సామాన్య రచయితలూ ద్వ్యర్థికావ్యాలూ, శ్లేషరచనలూ చేసే పండితులూ ఈ నానార్థాలను ఒక వరసగాని, వావిగాని లేకుండా వాడి సాహిత్యమంటే పాఠకులు భయపడే దుస్థితి కల్పిస్తుంటారు!

మానవ స్వభావాల్లో అనర్థకరమైనా జితించిపోయినవాటిల్లో కోపమొకటి. అది సంస్కృతపదం. దానికాభాషలో "క్రోధం, అమర్ష, రోషం, ప్రతిఘ, రుట్టు, రుష, ఉత్సవం, మత్సరం, భౌమం, మన్యువు" వగైరాలు పర్యాయపదాలని నిఘంటువులు చెప్తాయి. వీటిలో 'రుట్టు, రుష, రోష'మనేవి రూపాంతరాలు. అమర్ష అంటే అనాలోచితంగా వచ్చేదని అర్థం. అందుకే కోపం రాగానే పది అంకెలు లెక్కపెట్టమనేలాంటి ఉపాయాలు చెప్తారు పెద్దలు. ఆ గడువులోగా ఆలోచించే వ్యక్తికి వచ్చిన కోపం మాయంకాక తప్పదు. ఉత్సవ శబ్దాని కీకాలానికి 'వేడుక, పండగ, ఊరేగింపు, జాతర' మొదలైన అర్థాలు వచ్చాయి. ఉత్సవం, వేడుకా రెండూ ఒకటేనని గుర్తించని విద్వాంసులు 'ఉత్సవ వేడుక'ల వంటి దుస్సమాసాలు వాడుతుంటారు. ఉత్సవమంటే నిజానికి పొంగివచ్చిన భావమని అర్థం. మత్సరాన్ని అసూయక్కూడా నిఘంటువులు పర్యాయపదంగా పేర్కొంటున్నాయి. ఇలాంటి సందర్భాల్లో నిజానికి ఒక మాటకు మరోమాట అన్ని సందర్భాల్లోనూ పర్యాయపదం కానేకాదనీ, వాస్తవంలో ఏ కొంచెం అర్థ భేదమూలేని పర్యాయపదాలంటూ ఏ భాషలోనూ ఉండవనీ, ఒకే భాషలో ఏకభావానికి భిన్నపదా లుండటమన్నది భ్రాంతిమూలకమేగాని వాస్తవం కాదనీ నిరూపిస్తాయి. సన్నిహిత భావాలను వ్యక్తీకరించటంలో ఏది పూర్తిగా సరైన

మాటో తేలక, తేల్చుకోలేక గురికిబెత్తెడెడంగా వాడే పదాలనే పర్యాయపదాలని భావిస్తుంటాం. మన్యు శబ్దానికి యుద్ధమనే అర్థంకూడా ఉంది. కోపం రాకపోతే యుద్ధం చేయమనో, యుద్ధం కోపం వస్తేనే చేసేదనో సంబంధకల్పన చేసుకొని ఈ మాటను ఇటు కోపానికీ అటు యుద్ధానికీ పర్యాయపదమంటారు. భామ శబ్దానికి పెద్దదని అర్థం. అందుకే చాలా పెద్దదికాబట్టి భూమి అనే పేరువచ్చింది. బహుశా పెద్ద అపకారమే చేయగలదు కాబట్టి కోపాన్ని భామమన్నారేమో తెలియదు. ఏమైనా ఈ అర్థంలో అది మారుమూల మాటే.

కోప శబ్దానికి దీటైన తెలుగుమాటలు "అలక, అల్క, కినుక, కిన్క, కనలు, మోడి" అనేవి. అలక వ్యవహారంలోనూ, కినుక కావ్యాల్లోనూ ఎక్కువ వాడుకలో ఉన్న మాటలు. కనలుకూడా కావ్య భాషా శబ్దమే. ప్రణయ కోపమనే అర్థంలో 'పొలఅలక' అనే తెలుగు సమాసం వాడుకలో ఉంది.

కోప కారణాలు అనేకం. అందులో మోసం ముఖ్యమయింది. మోసానికి పర్యాయపదాలని చెప్పదగ్గ అచ్చ తెలుగు మాటలు "కికురింత, కుచ్చితం, రవళి, రక్కు, పొర, దగా" మొదలైనవని నిఘంటువులు చెప్తాయి. కికురించు అనే క్రియా రూపంనుంచి ఏర్పడ్డ కికురింత ఒక కృదంత రూపం. దానికి కావ్యాల్లోనే ప్రయోగం. ప్రజా వ్యవహారంలో మోసం తరువాత ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట 'దగా' దీర్ఘాంత శబ్దాలు తెలుగు మాటలు కావనేది కొండ గుర్తు. ఇది ఉర్దూనుంచి వచ్చినమాట. కుత్సితమనే సంస్కృత శబ్ద భవం కుచ్చితం. మోసంకన్నా తీవ్రమయిందిది. రవళి, రక్కు అనే రకారాది పదాలు రెండూ ప్రాకృత భాషనుంచి తెలుగులోకి వచ్చినవని కొందరి వాదన. రక్కు అనేది టక్కు అనే తెలుగుమాటను నొక్కి పలికిన రూపమని మరికొందరు. 'టక్కుటమారగోకర్ణ గజకర్ణ ఇంద్రజాల మహేంద్రజాలాది విద్య'ల ప్రస్తావన కాశీమజిలీల వంటి పుస్తకాల్లో చాలాసార్లు కనిపిస్తాయి. పొర అనేది అచ్చ తెలుగు మాట. కనుకట్టు కట్టడం, కంటికి తెరగట్టినట్లు, ఉన్నది లేనట్టూ, లేనిది ఉన్నట్టూ చూపడం పొర.

మోసానికి సంస్కృతంలో "కపటం, దంభం, వ్యాజం, ఉపధి, ఛద్మ, కైతవం, కుసృతి, నికృతి, శాఠ్యం, ప్రతారణం, వంచన, అపదేశం, కృత్రిమం, అతి సంధానం, అభిసంధానం, మాయ, భ్రమ, మోహం, ద్రోహం" వంటివి పర్యాయార్థకాలంటారు. దంభ మంటే డంబం. వ్యాజం అంటే వంక. ఛద్మ అంటే మారురూపం. కైతవమంటే కితవుడు (జూదగాడు) చేసే మోసం. శాఠ్యం అంటే మొండితనం. ప్రతారణ అటే పెద్ద మోసం. కృత్రిమం అనేది కల్పించి చెప్పింది కావచ్చు; చేసింది కావచ్చు; 'యామా సా మాయా' అని 'ఏదిలేదో అదే మాయ' అని య,మ-లు తిరగబడి ఏర్పడ్డ మాటగా దీన్ని కొందరు వివరిస్తారు. ఒకదాన్ని చూసి మరొకటనుకోవటం భ్రమ. దీన్నించి భ్రాంతి అనే మాట పుట్టింది. (అసలే లేనిది ఉన్నదనుకోవటం ప్రమ. దీన్నించి 'ప్రాంతి' అనే మాట పుట్టి వేదాంతుల వాడుకలో మిగిలిపోయింది). మోహం అంటే దేనిమీదనైనా విపరీతమైన కోరిక పుట్టించడం. అదీ ఒకరకమైన మోసం కిందే లెక్క. ద్రోహం నమ్మించి మోసగించటం. లేనిదాన్ని కల్పించటం అభిసంధానం.

# గృహోపకరణాలు

గృహోపకరణాలనగానే మొట్టమొదట వంటసామగ్రి గుర్తుకు వస్తుంది. వంటకు ముఖ్యం కుండ. ఇది తెలుగు మాట. ఇది సాధారణంగా మట్టితో చేసిన వస్తువు. దీనికి 'కడవ' అనే మరో తెలుగుమాట పర్యాయపదం. తయారీలో వాడిన వస్తువుబట్టి పేర్లు మారుతాయి. రేకుతో చేసినవాటిని 'బుంగ/బుంగి, పంటి, బుడ్డి, బూజా' వంటి పేర్లతో భిన్న ప్రాంతాల్లో పిలుస్తారు. వెదురు మొదలైన వాటితో అల్లి తయారు చేసిన వాటిని 'గంప, తట్ట(ం)/తట్టి, అంచ, కొల్లాం, పుటిక, గుట్ట, గుల్ల, జొల్ల, బావె, మాని, బుట్ట' మొదలైన పేర్లతో ఆయా ప్రాంతాల్లో వ్యవహరిస్తారు. ఆకులతో చేసిన పాత్రను 'కమ్మ' అంటారు. ఇదే అత్యంత ప్రాచీనమయింది. మానవ నాగరకత తొలిదశలో ఆకులే పాత్రలుగా వాడారు. తరవాత మట్టివి, లోహంతో చేసినవి, గాజుతో పింగాణీతో చేసినవీ వాడుకలోకి వచ్చాయి.

కుండ శబ్దానికి పర్యాయార్థకాలుగా సంస్కృతంలో చాలా పదాలున్నాయి. "ఘటం, కలశం, కుంభం, పాత్రం, భాజనం, భాండం" వగైరాలు. ఘటమనేది మట్టితో చేసిన పెద్దకుండ. ఈ మాటకు 'తల, శిరస్సు' అనే అర్థాలు కూడా వచ్చాయి. కలశ శబ్దానికి 'కలసి, కలశి, కలసం' వంటి రూపాంతరాలున్నాయి. వ్యుత్పత్తి స్పష్టం కాదు. కుంభమనేది మట్టిపాత్రకే పేరు. 'కు' అంటే భూమి. భూమి మీది మట్టితో చేసింది కుంభం. పాత్ర అనేదే ప్రాచీనతమం. అది పత్ర శబ్దభవం. పత్రం అంటే ఆకు. ఈ మాటే వస్తుస్వభావం మారినా నేటికీ సాధారణ పదంగా వాడుకలో నిలిచింది. దోనె/దొప్పలాగా ఉన్నా, ఆకు లాగా వాడినా, కుండలాగా వండటానికి ఉపయోగపడ్డా, దాని రూపంతో, మూలవస్తువుతో నిమిత్తం లేకుండా 'భాజన'మనవచ్చు. 'భోజన భాజనా'లని సాధారణ వ్యవహారంలో కూడా ఈ మాట నిలిచింది. భాండం అనేది ఏ పాత్రకయినా సరిపోయే మాట. అది చిన్నదయితే 'భాండక'మనేవాళ్ళు. 'గ్రంథభాండాగారం' వంటి సమాసాల్లో ఇది వస్తువులను 'దాచే' షెల్ఫులాంటి వస్తువనే అర్థంలో వాడుకలో ఉంది.

కేవలం వంటకు వాడే కుండలకు సంస్కృతంలో మరికొన్ని పేర్లున్నాయి. 'స్థాలి, ఉఖా, పిష్టపచనం, ఋజీషం, పిఠరం' వగైరా. స్థాలీ శబ్దాన్ని నేటికీ వివాహ సమయంలో 'స్థాలీపాకం' నిమిత్తం వాడుతున్నాం. ఉఖా శబ్దం వైదిక సంస్కృతంలోది. నీళ్లు కాచే పాత్రను ఈ పేరుతో పిలిచేవాళ్లు. పిష్టపచనమనేది వర్ణనాత్మక శబ్దం. పిష్టం అంటే పిండి. పిండి వంట చేసే పాత్రను ఈ పేరుతో వ్యవహరించేవాళ్ళు. ఋజీష శబ్దానికి ఋజీషమనే రూపాంతరముంది. ఇది వేదకాలంలో వేపుడుకు వాడిన పాత్రకు పేరు. దాన్నే జల్లెడలాగా కూడా వాడేవారు. బోలుగా ఉండే పాత్రను పిఠర మనేవాళ్లు. దానికి పిఠరకమనే రూపాంతరముంది. పచ్చికుండను

అమకుంభమని పిలిచారు. చిల్లులున్న కుండకు ఛిద్రకుంభమని పేరు. కేవలం నీళ్లు నిలవ చేయడానికి వాడితే దాన్ని జలకుంభ మనేవాళ్లు.

అన్నం తినడానికిగాని, వడ్డించటానికిగాని వాడే వస్తువును తెలుగులో పళ్ళెమంటాం. దానికి 'పళ్యం, పళ్ళెరం' అనేవి పూర్వరూపాలు. మామూలు వాడుకలో ఉన్నమాట 'కంచం'. ఇది కంచుతో చేసింది కాబట్టి ఈ పేరు వచ్చిందని కొందరంటారు. 'కందును, తబుకు' అనే మరి రెండు తెలుగుమాటలు పర్యాయపదాలుగా వాడుకలో ఉన్నాయి. వెదురుతోగాని పేముతోగాని అల్లిన పళ్ళెన్నే కొందరు తబుకంటారు. ఈ తెలుగు మాటలకు పర్యాయార్థకాలుగా సంస్కృతంలో 'పత్రం/పాత్రం, పట్టం/పట్టిక, భాజనం, కోశం/కోషం, ఫలకం, పుటకం, శరావం/శరావకం, శాలాజిరం, వైతలం' మొదలైన శబ్దాలున్నాయి.

పత్రం, పాత్రం, భాజనం – అనే మాటలు అటుకుండకూ, ఇటు ఆకుకూ/విస్తరికీ పర్యాయపదాలుగా ఉన్నాయని గమనించాలి. చదునుగా వెడల్పుగా ఉన్నవాటిని పట్ట/పట్టికా శబ్దాలతో వ్యవహరిస్తారు. కోశ/కోష నామం గలవి మొగ్గలాగా/గుంటగా ఉండేపళ్ళేలు. ఫలకం అంటే అంచులులేని పళ్లెం – పలకవంటిది. పుటక శబ్దానికి పుటమనే రూపాంతరముంది. సాధారణంగా ఇది రాగి పాత్ర. లేదా ఆకులతోనో తీగెలతోనో అల్లిన వస్తువు. ఒకటి రెండు పొరలున్నదిగాని, మడతలున్నవి కాని కావచ్చు కూడా. శరావం/శరావకం అనేది మట్టితో చేసిన పాత్రగాని, మూకుడుగాని, మూతగాని కావచ్చు. లోతు తక్కువగా ఉంటే శాలాజిరమని, ఎక్కువగా ఉంటే వైతలమని వ్యవహరించేవాళ్లు.

'చెంబు, ముంత, చేముంత, తంబుగ, సగ్గెడ' అనేవి తెలుగు మాటలు – భిన్నప్రాంతాల్లో వాడుకలో ఉన్నవి. చెంబు అనేది మొదట రాగితో చేసినదానికే పేరు. మట్టిదయితే ముంత. చేతిముంత చిన్నది. చివరి రెండు మాటలు కావ్యప్రయోగాల్లో కనిపించేవే. సంస్కృతంలో వీటికి సమానార్థకాలుగా 'కలాయసం, సూత్రాయణం, కాచపాత్రం, గుడ్డుకం, శుల్బం' అనే పదాలున్నాయి. కలాయసం సాధారణ పదం. సూత్రం (తాడు) కట్టి వాడేది సూత్రాయణం. దీనికి యజ్ఞయాగాది క్రతువుల్లో వాడుక. కాచమంటే గాజు. అది గాజుతో చేసింది కాబట్టి కాచ పాత్రమన్నారు. మధ్యయుగాల్లోనే దీని వాడుక – అతి ప్రాచీనకాలంలో అదిలేదు. గడ్డుక శబ్దానికి 'గడ్డూకం, గడు(కం)' అనే రూపాంతరాలున్నాయి. మామూలుగా నీళ్లు తీసుకోవడానికి వాడే చెంబును ఈ పేరుతో పిలిచేవాళ్ళు. శుల్బమనేది రాగిచెంబు. దీనికి 'శుల్వం' అనే రూపాంతరముండేది. దీన్ని కొలతకు వాడేవాళ్లు. కంచు చెంబయితే శుల్బజమని పిలిచేవాళ్లు.

వస్తువులను దాచుకొనే పెట్టె అంటాం. (దాచి) పెట్టుకోడానికి పనికి వచ్చేది కాబట్టి పెట్టె అన్నారు. తెలుగులో దీనికి పర్యాయపదమని చెప్పదగ్గ మరో తెలుగుమాట ఉన్నట్లు లేదు. సంస్కృతంలో 'పేటి(క), సముద్రం, సంపుటం, పిటకం, మంజూష' వగైరా మాటలున్నాయి. తెలుగు మాట నుంచే (పెట్టెనుంచే) పేటికా శబ్దం ఏర్పడ్డదనేవాళ్లున్నారు. సోమరసాన్ని నింపే పెద్దపాత్రను వేదకాలంలో 'సముద్ర'మని పిలిచేవాళ్ళు. (ఉద్రశబ్దానికి నీళ్ళు అనే అర్థముంది). అది కొంచెం

చిన్నదయితే సముద్రక మనేవాళ్లు. గుండ్రంగాగాని, అర్ధచంద్రాకారంగా గాని ఉంటే ఆ పెట్టెను సంపుటమనేవాళ్లు. నగలపెట్టెను సంపుటిక అని పిలిచేవాళ్ళు. అది పెట్టె అయినా, బుట్ట అయినా, గాదె అయినా దాన్ని పిటకమనేవాళ్లు. దానికి 'పెటకం, పెటాకం, పేట్టాలం, పేట్టాలకం' అనే రూపాంతరాలున్నాయి. మంజూషా శబ్దానికి 'మంజుష' అనే రూపాంతరముంది. అది కొయ్యది కావచ్చు, లోహవస్తువు కావచ్చు, బుట్టకావచ్చు.

గృహోపకరణాల్లో అత్యవసర వస్తువులని చెప్పదగ్గవి వంటాపెట్టాకు పనికివచ్చేవి. చేట వాటిలో ఒకటి. చెరుగు ధాతువు పూర్వరూపం నుంచి చేట శబ్దమేర్పడిందని ద్రవిడ భాషావాదులంటారు. చేటకు పర్యాయపదమని చెప్పదగ్గ మరో తెలుగుమాట ఉన్నట్లు లేదు. సంస్కృతంలోనూ 'శూర్పం/సూర్పం, ప్రస్ఫోటనం' అనే రెండే సమానార్థకాలున్నాయి. శూర్పశబ్దం అటు చెరగడానికి వాడే సాధనంగానూ ఇటు కొలతకు పనికివచ్చే పరికరంగానూ వాడుకలో ఉంది. తాలూతబుకూ నుంచి మంచిగింజలను స్ఫుటంగా (స్పష్టంగా) వేరుపరిచేది కాబట్టి ప్రస్ఫోటన మన్నారు. పెద్దవి అనే అర్థంలో శూర్పణఖ, శూర్పకర్ణం అనే పేర్లు గోళ్లకూ చెవులకూ అన్వయించి ఏర్పడ్డవే. 'చేటెడు బియ్యం' వంటి మాటల్లో చేట కొలపాత్ర అనే అర్థంలో వాడుకలో ఉంది.

జల్లించడానికి వాడే ఉపకరణం జల్లెడ. ఈ తెలుగుమాటక్కూడా మరో తెలుగు పర్యాయపదనున్నట్లు లేదు. సంస్కృతంలో 'చాలని, పాటీరం, తితఉవు' అనే మాటలున్నాయి. చలనం (కదలిక) ద్వారా జల్లిస్తుంది కాబట్టి చాలని అన్నారు. మూడో మాటకు తెలుగు కావ్యాల్లో ప్రయోగమే లేదు. పాటీర శబ్దానికి ఇతరార్థాలు చాలా ఉన్నాయి. చాలని అన్నదే సంస్కృతంలో మౌలిక పదం.

చెరిగిన, జల్లించిన వస్తువులను దాచి పొల్లును తొలగించడానికి వాడే వస్తువు చీపురు. అది చీపురు/చీకురు పుల్లల్తో చేసింది. పుల్లపేరే వస్తువుకు వచ్చింది. కొన్ని ప్రాంతాల్లో దానికి 'శృంగారకట్ట' అనే మిశ్రనామముంది. స్త్రీలు వాడ్తారు కాబట్టి శృంగారం తప్పలేదన్నమాట – చీపురు తిరగేసినా సరే! దీనికి 'పొరక(కట్ట), చీపురుకట్ట' అనేవి తెలుగు పర్యాయపదాలు. పొరక అంటే పుల్ల. వాడిన పుల్లలను ఈనెలను పురస్కరించుకొని 'కొబ్బరి చీపురు, ఈత చీపురు' వగైరాలేర్పడ్డాయి. సంస్కృతంలో దీనికి పర్యాయపదాలనదగ్గవి 'శోధని, సంమార్జని' అనేవి. 'తుడిచేది, శుద్ధం చేసేది' అనే అర్థాల్లో శోధని అనే పేరు వచ్చింది. మార్జనం అన్నా శుద్ధి చేయటమే. అలా చేసేదికాబట్టి సంమార్జని అన్నారు. మొదటిమాటే ఎక్కువ వ్యాప్తి గలది.

రోలూ రోకలీ ఇప్పటికీ వాడుకలో ఉన్న సాధనాలు. ఆ రెండూ తెలుగు మాటలే. 'రోలు' శబ్దానికి కొన్ని ప్రాంతాల్లో 'బిడి' అనే పర్యాయపదముంది – ముఖ్యంగా కన్నడ ప్రభావమున్న ప్రదేశాల్లో. మరోమాట ఉన్నట్లు తెలియదు. సంస్కృతంలో దీనికి పర్యాయపద మనదగ్గది 'ఉలూఖలం' అనే పదం. దానికి 'ఉదూఖల'మనే రూపాంతరముంది. ఇది కొయ్యతో చేసిన రోలుకే పేరని కొన్ని

నిఘంటువులు చెప్తాయి. తెలుగులోనయితే 'కాయ్యరోలు, రాతిరోలు' అనే వాడ్తారు. రోకలికి మరో తెలుగు పేరున్నట్లు లేదు. సంస్కృతంలో 'అయోగ్రం, అయోమలం, గోకిలం/గోకీలం, పేశలం, ముసలం' అనే మాటలు పర్యాయార్థంలో ఉన్నాయి. అయశ్శబ్దానికి ఇనుమని అర్థం. ఇనప పొన్ను వేసిన రోకలిని అయోగ్రం అనే వాళ్లు. అయోమలం అలాంటిదే. గోకిలమనేది చేరోకలి, చిన్నది, పొన్నులేనిది. చెక్కడపు పనిచేసిన రోకలిని పేశలమనేవాళ్లు. పేశ శబ్దానికి వడ్రంగి అనే పేరున్నది. చక్కగా చెక్కిన రోకలిని పేశలమంటారు. దాన్ని యజ్ఞయాగాదుల్లో వాడేవారు. ముసల శబ్దానికి 'ముశలం, ముషలం' అనే రూపాంతరాలున్నాయి. దీన్నే ఆయుధంగావాడే బలరాముణ్ని ముసలాయుధుడంటారు. అది చిన్నదైతే 'ముషలక' మంటారు. Piston అనే మాటకు సమానార్థకంగా ముషలక శబ్దాన్నిప్పుడు శాస్త్రగ్రంథాల్లో వాడుతున్నారు.

తిరగలి తెలుగుమాట. తిరిగే కలు (=రాయి) కలది కాబట్టి తిరుగలి/తిరగలి అనే పేరు వచ్చింది. కొన్ని ప్రాంతాల్లో దీనికి 'విసురురాయి' అనే మరో పేరుంది. తిరగలి శబ్దంలోని చివరి భాగానికి 'రాయి' అనే అర్థమున్నదన్న విషయం మరపువచ్చినందువల్ల 'కాయ్యతిరగలి' వంటి మాటలు పుట్టాయి. దీనికి సంస్కృతంలోని 'చక్రం, పేషణి' అనే పేర్లు సమానార్థకాలు. గుండ్రంగా ఉంటుంది కాబట్టి, ముక్కలు చేస్తుంది కాబట్టి చక్రమన్నారు గాని పేషణి అనేదే మామూలు వ్యవహారంలోని మాట. పేషణం అంటే పిండిగొట్టడం. కొందరు దీన్ని పేషణయంత్రమని నిఘంటువులకెక్కించారు.

కవ్వం మరో ముఖ్య గృహోపకరణం. గ్రైండర్లు వచ్చిన తరవాత వీటి గిరాకీ పడిపోతున్నా నేటికీ మీగడ తీయడానికి ఇదే ప్రధాన సాధనం పల్లెటూళ్ళలో ఈ మాటకు మరో తెలుగు పదమేదీ పర్యాయపదంగా కనిపించదు. సంస్కృతంలోనయితే 'వైశాఖం, మంథం' అనేవి ముఖ్య పర్యాయపదాలు. మంథశబ్దానికి 'మంథానం, మథ, మథి' అనే రూపాంతరాలున్నాయి. మంథదండమని కూడా వ్యవహారం ఉండేది. మంథర పర్వతమనే మాట రావటానికి దాన్ని దేవతలూ రాక్షసులూ సముద్రం చిలకడానికి వాడటమే కారణం. కవ్వం దగ్గిరి పాలకుండనుగాని, పెరుగుకుండనుగాని కవ్వంకుండ అంటాం తెలుగులో. సంస్కృతంలో దానికి 'మంథని, గర్గరి' అనే రెండు పేర్లున్నాయి.

దంచడానికి వాడేది రోలయితే నూరడానికి వాడేది రుబ్బురోలు. దంచడానికి రోకలివాడితే నూరడానికి సాన(రాయి) వాడ్తాం. సాన శబ్దం నిజానికి సంస్కృతంలోని శాణ శబ్దభవం. చిన్నదయితే 'కరసాన' అంటారు. అందులోని కర శబ్దం 'చేయి' అనే అర్థంగల సంస్కృతపదమే. సరైన అచ్చతెలుగుమాట 'ఒరగల్లు'. ఈ మాట గ్రంథాల్లో కనిపిస్తుంది. వాడుకలో అంతగా వినిపించదు. ఒర శబ్దం ఒరు (=ఒకటి) అనే మాటకు రూపాంతరం. గల్లు అనేది కల్లు (=రాయి) అనే మాటకు సంధిలో వచ్చిన రూపాంతరం. 'ఒంటిరాయి' అనే అర్థంలో ఒరగల్లనే మాట పుట్టింది. దీనికి సంస్కృతంలో "కటీక, కషం, నికషోపలం, టీకం, నికషం, శాణం, శాణి, శాణాశ్మం" వగైరా పర్యాయపదాలున్నాయి. కషం అంటె కోసేది, ఒరసేది. ఉపలం, అశ్మం అనేవి రాయి అనే మాటకు పర్యాయపదాలు. కత్తి వగైరాలకు పదునుపెట్టే రాతినీ, బంగారంవంటివాటిమీద గీసి వన్నె గుర్తించే రాతిని నికషోపలం, శాణాశ్మం వంటి

మాటలతో వ్యవహరిస్తారు. నికషం అంటే బాగా రాపిడి పెట్టేది. టీకం అంటే (రాచి) చిన్నది చేసేది.

నిత్యకృత్యంలో మరికొన్ని సాధనాలను వాడక తప్పదు. ఇల్లన్న తర్వాత అవి ఉండకపోతే వెలితి.

## నిత్యావసర సాధనాలు

చిన్నదైనా అవసరవస్తువు సూది. ఇదికూడా తెలుగుమాట కాదనీ, సంస్కృతం లోని సూచీ శబ్దం నుంచి పుట్టిందేననీ ఆర్యభాషావాదులు వాదిస్తారు. పూర్వం మనకు దబ్బనం తప్ప మరేదీ లేదేమో చెప్పలేం. పెద్దసూదిని దబ్బనమంటాం. దానికి 'దబ్బడం, దబ్బళం' అనే రూపాంతరాలున్నాయి. 'ఆరె, కంటాణి' వంటివి సూదిచేసే పనులు కొన్ని చేసేవి తెలుగులో లేకపోలేదు. కంటాణి శబ్దానికి 'కంట్రాణి, కంటాళం, కంటా' అనే రూపాలున్నాయి. అది ముల్లు (కంటకం) వంటిదనే అర్థంలో ఆర్యభాష నుంచి వచ్చినమాటేగాని అచ్చతెలుగు పదం కాదు. ఆరె తెలుగుమాట. దానికి సరైన సంస్కృత పదం కనిపించదు – 'చర్మభేదిక' అని నిఘంటువులు చెప్పే వర్ణనాత్మక పదం తప్ప. సంస్కృతంలోని 'సూచి, సేవని' అనే మాటలు పర్యాయార్థకాలు. సేవని అనేదికూడా 'ఉపయోగపడేది' అనే అర్థంగల వర్ణనాత్మక పదమే. మన దబ్బనాన్ని 'బృహత్‌సూచి' (పెద్దసూది) అనాలని నిఘంటువులు చెప్తాయి! 'దర్జీ, టైలర్' అనే మాటలు తెలుగువాళ్ళ వాడుకలోకి రాకముందు 'కుట్రపువాడు' అనే మాట – అచ్చతెలుగు పదం – వాడుకలో ఉండేది. అప్పుడు తెలుగు సూది లేకుండా దేనితో 'కుట్రపుపని' చేసేవాళ్లో తెలీదు. కుట్టు – అనే క్రియాపదం నుంచి పుట్టినమాట 'కుట్రం'.

సూది ఉన్నప్పుడు దారం అవసరం. మరో తెలుగు పర్యాయపదం దానికి కనిపించదు. సంస్కృతంలోని 'సూత్రం, రజ్జువు, గుణం, తంత్రి, తంతువు' అనేవి పర్యాయపదాలంటారు. 'సూ' అనే ధాతువుకు 'కుట్టు' అని అర్థం. కుట్టుపనికి పనికివచ్చేది సూత్రం. రజ్జువు అనేది 'తాడు'కే సరైన పర్యాయపదం. 'రజ్జు సర్పభ్రాంతి' దారంతో కలగదుకదా. గుణమనేది విల్లుకుకట్టే అల్లెతాడుకేగాని కేవలం దారానికి పర్యాయార్థకం కాదు. తంత్రీ శబ్దం 'తీగ'కు ఎక్కువగా అన్వయిస్తుంది, దారానికన్నా. కొన్ని నిఘంటువులు 'జ్యా, మౌర్వి, శింజిని' అనే సంస్కృతపదాలుకూడా పర్యాయపదాలంటాయిగాని అవన్నీ అల్లెతాడుకే పర్యాయపదాలుగా కావ్యప్రయోగాల్లో కనిపిస్తాయి. తంతువన్నదే దారానికి సరైన పర్యాయపదం. సాలీడుకూ, సాలెపని వారికీ పర్యాయపదమైన 'తంతువాయ' శబ్దానికీ దానికీ ఉన్న సన్నిహితసంబంధాన్ని పురస్కరించుకొని అదే సంస్కృతంలోని సరైన సమానార్థకమని చెప్పాలి. మరికొన్ని నిఘంటువులు 'దామం, శుల్బం' అనే మాటలు కూడా పర్యాయార్థకాలంటాయి కానీ దండ గుచ్చడానికి వాడేదారానికీ, దండకూ 'దామ' శబ్దం ఒక్కటే పేరని

అంగీకరించటం కష్టం. శుల్బ శబ్దానికి 'తీగ' అనే అర్థంలోనే ప్రయోగాధిక్యముంది – అదిన్నీ 'రాగితీగ' అనే అర్థంలో.

తాడు తెలుగుమాట. దాని పూర్వరూపం త్రాడు. కళింగప్రాంతంలో ముఖ్యంగా పశువులను కట్టే 'పలుపు' అనే అర్థంలో 'కన్నె' అన్నమాట వినిపిస్తుంది పర్యాయార్థకంగా. 'మోకు' వంటివి పెద్దతాడుకు పర్యాయార్థకం. తాడు పేనింది; దారం పేననిది; మోకు బలమయింది. ఈ తెలుగు మాటలకు పర్యాయార్థకాలని 'రజ్జువు, గుణం, దామం, శుల్బం, పరాటకం, సందానం, వటం, సూత్రం' అనే సంస్కృతపదాలను నిఘంటువులు పేర్కొంటాయి. రజ్జు శబ్దమొక్కటే సరయిన సమానార్థకం. పర్యాయపదాలను గుర్తించటంలో నిఘంటువులు అర్థచ్ఛాయలను సరిగా గమనించవనడానికి ఈ పట్టికే నిదర్శనం. దీన్నిబట్టే నిజానికి ఏ ఒక్కమాటకూ మరేమాటయినాసరే సర్వకాల సర్వావస్థల్లోనూ సంపూర్ణ పర్యాయపదంకాదనీ, భాషల్లో పర్యాయోపయోగముంటే ఉండవచ్చుగాని పర్యాయపదాలుండవనీ భాషాశాస్త్రజ్ఞులు వాదిస్తారు.

కఱ్ఱ, కట్టె – అనే తెలుగుమాటలు భిన్నప్రాంతాల్లో వాడుకలో ఉన్న తెలుగుమాటలు. రెండోది ముఖ్యంగా తెలంగాణా వాడుకలో బహుళవ్యాప్తికలది. కట్టెశబ్దం సంస్కృత కాష్ఠశబ్దభవమని చెప్తారు. సంస్కృతంలోని 'దండం, యష్టి, కాష్ఠం, లగుడం, వేత్రం' అనేవి పర్యాయార్థకాలంటారు. దండమనేది 'చేతికఱ్ఱ'కు సమానార్థకం. యష్టి ఎండుకట్టె. వేత్రమనేది పేముకఱ్ఱ. దాన్ని వేత్రయష్టి అని కూడా పిలుస్తారు. లగుడమనేది చెక్కినకఱ్ఱ – పెద్దది. దాన్ని ఆయుధంగా కూడా (యుద్ధాల్లో) వాడ్తారు.

ఇల్లన్నతరువాత ముఖ్యంగా ఉండవలసిన వస్తువుల్లో కత్తెర మరొకటి. కత్తివంటి తెరకలదికాబట్టి కత్తెర అన్నారు. అయినా ఈ మాట సంస్కృతంలోని కర్తరీ శబ్దభవమని కొందరి భావన. సంస్కృతంలోని 'ఛేదని, కృపాణి, కర్తరిక, ఖండధార' అనేవి పర్యాయార్థకాలని కోశకర్తలంటారు. కృపాణి అంటే చిన్నకత్తేగాని కత్తెరకాదు. ఛేదించేది కాబట్టి ఛేదని అన్నారు. అదే నిజానికి సంస్కృతంలో వ్యాప్తిగల సహజ శబ్దం, కత్తెర అన్నమాటేగాక 'కత్తిరింపు, పత్తిరింపు/పత్రింపు' వంటి రూపాంతరాలు తెలుగులో ఉండగా (ద్రవిడ భాషా విలక్షణమైన క–ప–ల మారుపాటుతో) కత్తెరకూడా సంస్కృతభవ మనటం న్యాయమని తోచదు. అయితే అది దేవభాష అని, 'అన్ని' భాషలూ అందులోనుంచే పుట్టాయనీ 'నమ్మే'వాళ్లు అలా ఒప్పుకోరు. ఖండధార అనేది వర్ణనాత్మక పదం. ఖండంగా (కొంతవరకు మాత్రమే) ధార (పదును) గలదికాబట్టే ఆ పేరు పెట్టారు. కర్తరిక అనేది చిన్నకత్తెర అనే అర్థంలోని కర్తరి రూపాంతరం. తెలుగులోని 'అడకత్తెర, గండ్రగత్తెర, పోకకత్తెర' అనేవాటికి సంస్కృతంలోని పర్యాయార్థకాలేవో తెలీదు. అడకత్తెర, పోకకత్తెర ఒకటే – భిన్నప్రాంతాల్లో భిన్న పదాలు వాడుకలో ఉంటాయి. వీరశైవులు బాసతప్పినప్పుడు తమగొంతు తామే నరుక్కోవటానికి తయారుచేసుకొన్న సాధనం గండ్రగత్తెర. గండు అంటే పెద్ద. గండ్ర అనేది దాని విశేషణరూపం (గండుచీమ, గండ్రయిసక – వంటి సమాసాల్లో పోల్చినప్పుడు ఈ అర్థవిశేషం బోధపడుతుంది).

మరో ప్రధానసాధనం కొడవలి. అది తెలుగుమాట. దానికి పర్యాయపదాలు సంస్కృతంలో 'దాత్రం, లవిత్రం, శస్యకర్తని' అనేవి. దాత్రమంటే చీల్చేది. లవిత్రమంటే లవంగా (ముక్కలుగా) కోసేదని అర్థం. శస్యకర్తని అనే వర్ణనాత్మక పదం 'గడ్డిగాదం కోసేది' అనే అర్థంలో పుట్టిన మాట.

మరో అవసరవస్తువు గాలం. దానికి గాలాం అనే రూపాంతరముంది. ఇది తెలుగుమాట. దీనికి పర్యాయార్థకాలయిన సంస్కృతపదాలు 'గ్రహణి, అకర్షణి, ధరణి' అనేవి. గ్రహించేది (లాగేది) కాబట్టి గ్రహణి అన్నారు. ఇదో రోగానిక్కూడా పేరయినమాట. ఆకర్షణ అంటే దగ్గరకు లాక్కోవటం – ఆ పని చేస్తుంది కాబట్టి 'అకర్షణి' అన్నారు. పట్టుకొని ఉండేదికాబట్టి ధరణి (ధరించేది అనే అర్థంలో). చేపలుపట్టేగాలాన్ని సంస్కృతంలో 'బాడిశ(ం)/బాడిశి' అని పిలుస్తారు. తెలుగులో చేపలుపట్టేవ్యక్తిని పూర్వం 'గాలగాడు' అనేవాళ్లు.

కొన్ని ఇళ్లలో 'తక్కెడ' ఉండవచ్చు. దానికి 'తాసు, త్రాసు, తరాజు' అనే పర్యాయపదాలున్నాయిగాని అవి పర్షియన్ పదాలంటారు. సంస్కృతంలో "తౌళి, ధటం, వీష, తుల, వీషణి(క), నారాచి" అనేవి పర్యాయపదాలు. వాటిలో 'తుల' అనేదే మామూలు మాట.

సర్వసాధారణంగా గృహావసరాలకు పనికివచ్చే వస్తువులు మరికొన్ని ఉన్నాయి. చిన్నదయినా అవసరమైన వస్తువుల్లో మేకొకటి. ఈ తెలుగుమాటకు 'మొల, చీల/సీల, గసిక, కొర్రు, ముల్లు, గూటం' అనేవి పర్యాయపదాలంటారు. మేకు కోస్తాలో, మొల తెలంగాణాలో ఎక్కువ వ్యాప్తిలో ఉన్న మాటలు. సీకు అనే మరోమాట కూడా తెలంగాణా వ్యవహారంలో వినిపిస్తుంది గాని అది అచ్చతెలుగు పదం కాదు. చీల అనేరూపం గ్రంథాల్లో, దాని రూపాంతరమయిన 'సీల' వాగ్వ్యవహారంలో ఎక్కువగా కనిపిస్తాయి. గసిక కొయ్యమేకు – పెద్దది. 'ముల్లు తీసి కొర్రడిచినట్లు' వగైరా ప్రయోగాలు ముల్లు చిన్నదనీ, కొర్రు పెద్దదనీ సూచిస్తాయి. ముల్లనేదే మొదటి మాట. దాని ప్రయోజనం, రూపం గ్రహించిన మీదట కొయ్యతోగాని, లోహంతోగాని తయారుచేసిన వస్తువులు తక్కినవి. ముల్లు సహజం–తక్కినవి కృత్రిమాలు – అంటే తయారుచేసిన వస్తువులు. గూటం అనేది మరీ పెద్దది – గసికకన్నా పెద్దది. సాధారణంగా అది కట్టెతో చేసిందే–అయినా 'కొయ్యగూటం' వంటి పదబంధాల్లో దాన్ని సుత్తెతో సమానంగా భావించి వాడుతున్నారు.

మేకుకు సమానార్థకాలయిన సంస్కృత పదాలు 'కీల(క)ం, శూలం, శంకువు' అనేవి. కీలక శబ్దానికి 'ముఖ్యమైనది, సారభూతమయింది' వగైరా అర్థాలు వాడుకలోకి వచ్చాయి. కీలం అనే రూపాంతరానికి కావ్యాల్లోనే ప్రయోగమెక్కువ. శూలం చాలా పెద్దది; సాధారణంగా ఏదో లోహంతో చేసిన వస్తువు. అది ఆయుధంగానే ఎక్కువ వ్యాప్తిలో ఉన్నమాట. శంకువు సాధారణంగా కొయ్యతో చేసిన వస్తువు. అదిన్నీ రూపంలో పెద్దదే. ఇల్లు కట్టేటప్పుడు తొలిగా నేలలో పాతే వస్తువు శంకువు. అందువల్ల 'శంకుస్థాపన' అనే మాటే సరియైన పదం. అయితే లోక వ్యవహారంలో (తప్పుగా) 'శంఖుస్థాపన' అనే మాట మిగిలింది –

'శాఖాహారం' లాగా (శాకం అంటే కూర, కూరాకు. దాన్ని ఆహారంగా తీసుకోవటం శాకాహారం. శాఖ అంటే కొమ్మ. కొమ్మల్ని ఎవరూ తినరు. అయినా లోకంలో 'శాఖాహారం' అనే మాటకే వాడుక ఎక్కువ). కీల శబ్దానికి కొయ్యతో చేసిందనే అర్థమే మొదట ఉండివుంటుంది. అందుకే సంస్కృతంలో ఇనుము వగైరాతో చేసిన వాటిని 'లోహకీలం' అని పిలుస్తారు.

సుత్తె అన్న తెలుగుమాట ఒక్కటే 'సుత్తియ' అనే పూర్వరూపంతో గ్రంథాల్లోనూ, 'సుత్తి' అనే రూపాంతరంతో నేటి వాడుకలోనూ ఉంది. సినిమాల పుణ్యమా అని 'సుత్తి' శబ్దానికి 'చెప్పిందే చెప్పి విసుగెత్తించటం, బోరు కొట్టించటం' వంటి కొత్త అర్థం విశేషం ఇటీవల వాడుకలోకి వచ్చింది. సుత్తెల్లో అనేక రకాలున్నాయి, రూపాన్నిబట్టి సైజును బట్టి. సంస్కృతంలో దానికి పర్యాయార్థక శబ్దాలు 'ముద్గరం, ఘనం, అయోధనం, ద్రుఘణం/ద్రుఘనం' అనేవి. ముద్గరమనేది చాలా పెద్దది. అది సాధారణంగా యుద్ధాల్లో ఆయుధంగా వాడుకలో ఉండేది. ఘన శబ్దానికి 'గట్టిది' అని అర్థం. ద్రు – అంటే చెట్టు. ద్రుఘనం, ద్రుఘణం అనే రూపాంతరాలు అది 'కొయ్యసుత్తి' అనే అర్థాలను సూచిస్తాయి. అయ శ్శబ్దానికి ఇనుమని అర్థం. ఇనప సుత్తెను మాత్రమే అయోధనమని వ్యవహరించాలి.

ఇంటిపనికీ తోటపనికీ పనికివచ్చే మరో ప్రధాన సాధనం నిచ్చెన. ఈ శబ్దం తెలుగుమాట కాదనీ, సంస్కృతంలోని 'నిశ్రేణి' అనే శబ్దంనుంచి ఇది పుట్టిందనీ ఒక వాదముంది. తెలుగువారి వాడుకలో మాత్రం ఈమాటకే వాడుక ఎక్కువ – 'ఇచ్చెన, విర్చెన, మిచ్చెన, నిచ్చెన' అనే రూపాంతరాలతో. ఇందులో రకాలున్నాయి – కాళ్ల నిచ్చెన, డబ్బనిచ్చెన, తోట నిచ్చెన, తాటి నిచ్చెన, మడత నిచ్చెన – వగయిరా పేర్లతో దీనికి పర్యాయపదాలని 'చిడి, దాపుకఱ్ఱ, తాప, పరుడు' అనే శబ్దాలను పేర్కొంటారు. చిడి అనేది హిందీ – ఉర్దూ పదం. దానికి 'చీడీ' వంటి రూపాంతరాలున్నాయి. దాపుకఱ్ఱ అనేది సమాసం. అసలది 'తాపకఱ్ఱ'. మెట్లుగా వాడే కఱ్ఱలున్న వస్తువని వర్ణనాత్మకంగా వచ్చిన పేరది. తాప అనే పర్యాయపదం ఎక్కువగా రాయలసీమలో వినిపిస్తుంది. మెట్లను కూడా తాపలనే పిలుస్తారు. మెట్టు అనే మరో పర్యాయపదం అచ్చతెలుగు మాటే. పరుడు అనేదే విచిత్రమయిన మాట. అది సంస్కృతపదం కాదు. ఉర్దూ మాట కానేకాదు. తెలుగు మాటేననటానికి వ్యుత్పత్తి తెలియదు.

నిచ్చెనకు పర్యాయార్థకాలయిన సంస్కృతపదాలు 'నిశ్రేణి, అధిరోహిణి, సోపాన పథం, ఆరోహణం' అనేవి. నిశ్రేణీ శబ్దానికి 'నిశ్రయణి, నిశ్రయిణి, నిశ్రయి' అనే రూపాంతరాలున్నాయి. ఈ మాటకు ఆ భాషలో నిచ్చెన అనే అర్థమేగాక (తెలుగులో లాగా) 'మెట్టు' అనే అర్థం కూడా ఉంది. 'దగ్గరకు చేర్చేది' అనే మూలార్థంతో ఈ మాట ఏర్పడింది. అధిరోహిణి అంటే పైకెక్కడానికి ఉపయోగపడేది అని అర్థం. ఆరోహణమనే మాటక్కూడా అదే అర్థం. అదే వస్తువు కిందికి దిగడానిక్కూడా పనికివస్తుంది కాబట్టి 'అవరోహిణి, అవరోహణం' అనే పేర్లెందుకు రాలేదో చెప్పలేం. సోపానం అంటే మెట్టు. పథ శబ్దానికి దారి అని అర్థం. ఈ రెండు మాటలూ కలిసి

ఏర్పడ్డ సోపానపథ శబ్దానికి అటు నిచ్చెన అనీ, ఇటు మెట్లదారి అనీ రెండర్థాలూ ఉన్నాయి.

మరో ముఖ్య సాధనం గొడుగు. ఈ తెలుగు మాటకు 'ఎల్లి, చుట్టువు, కావారి' అనే విడిమాటలూ, 'ఎండచాటు పుట్టువు, ఎండమరువు' అనే వర్ణనాత్మక పదాలూ పర్యాయపదాలంటారు. ఎల్లి శబ్దం నేటి వాడుకలోలేదు. గుండ్రంగా ఉంటుందని చుట్టువు అనే పేరు వచ్చింది. (ఎండ) వేడిని తగ్గించేది కాబట్టి 'కావారి' అన్నారు. వాన తాకిడికి వాడే గొడుగును 'గిడుగు' అంటారు. అది పెద్దంచులున్న టోపీ లాంటిది. మరోరకం 'గూడ'. ఇది రెండువైపులా తెరుచుకొని ఉన్న రెండుపారల ఆకుగొడుగు; ముఖ్యంగా పొలాల్లో పనిచేసేవాళ్లు వాడుకునేది. తొలి దశలో ఆకులతో, మలిదశలో అల్లిన ఆకులతో, చివరకు గుడ్డలతో తయారైన సాధనమిది.

గొడుగుకు సంస్కృతంలోని పర్యాయార్థకాలు 'ఛత్రం, ఆతపత్రం, జలత్రం, ఆతపవారణం, ఘర్మవారణం, ఉత్క్షాటం, ఖర్పరం, గోత్రం, చక్రాంగం, ఛాయామిత్రం, జలత్రాణం, మూర్ధఖోలం, వస్త్రకుట్టిమం' వగైరాలు. మొదటిదే మామూలు మాట. ఆతపత్రం, ఆతపవారణం అనేవి ఆతపం (వేడి) నుంచి కాపాడేవనే అర్థంలో వచ్చాయి. జలత్రం, జలత్రాణమనేది వాననుంచి రక్షించేవనే అర్థంలో వచ్చాయి. గుండ్రంగా ఉంటుంది కాబట్టి చక్రాంగ మన్నారు. ఉడుకు తగ్గిస్తుంది కాబట్టి ఘర్మవారణం. పైకి లేస్తుంది కాబట్టి ఉత్క్షాటం. పుర్రెలా, పళ్లెంలా ఉంటుంది కనక ఖర్పరం. తలకు టోపీగా, శిరస్త్రాణంలా ఉంటుంది కాబట్టి మూర్ధఖోలం. గుడ్డతో చేసింది కాబట్టి వస్త్రకుట్టిమం. ఇలా పేర్లు పెట్టుకున్నా ఛత్ర శబ్దమొక్కటే నాటికీ నేటికీ వాడుకలో నిలిచిన మాట.

పరమోపయోగకరమైన వస్తువుల్లో చెప్పులను చెప్పాలి. 'చెప్పుకాళ్ల వాళ్లు' అని ధనవంతులనూ, ఆడపిల్ల పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నవాళ్లనూ పిలుస్తాం. 'చర్మం తీసి చెప్పులు కుట్టిస్తా'ననటం పరమదైన్యానికీ, కృతజ్ఞతకూ సమానంగా నిదర్శనమైన పలుకుబడి. ఈ తెలుగుమాటను కూడా సంస్కృతం నుంచి పుట్టించని విద్వాంసులకు కృతజ్ఞత చెప్పుకోవాలి. చెప్పుతప్ప మరో మాట తెలుగులో ఉన్నట్లులేదు – ఆకు చెప్పులు, కిర్రుచెప్పులు వగైరా భేదాలున్నాయిగాని. ఒకప్పుడు ప్రతిష్ఠాచిహ్నంగా అనేకాలంకరణలతో తయారవుతుండే కిర్రుచెప్పులు ఈకాలానికి కలికానికి తప్ప కానరావటంలేదు. 'పావుకోళ్లు' అనే కొయ్యచెప్పులిప్పటికీ వివాహతంత్రాదుల్లో, సన్యాసివేషధారణలో నిలిచాయి. పావు అనేది సంస్కృత పాదశబ్దభవం. కోడు తెలుగుమాట.

చెప్పుకు సంస్కృత పర్యాయార్థకాలు 'పాదరక్ష, పాదుక, పాదత్రం, ఉపానహం' అనేవి. పాదుకా శబ్దం నేటికీ తెలుగువాళ్ల వాడుకలో నిలిచింది. దానికి 'పాదువు' అనే రూపాంతరముంది గాని అది పుస్తకాల్లో మాత్రమే కనిపిస్తుంది. పాదాలకు తొడుగులాంటిది కాబట్టి పాదత్రమనే పేరు పెట్టారుగాని అది కూడా మారుమూల మాటకిందే లెక్క. పాదరక్ష ఇప్పటికీ బహుళవ్యాప్తిలో ఉన్నమాట. ఉపానహం అంటే

చెప్పకాదు; పావుకోడు కావచ్చు. శతపథ బ్రాహ్మణకాలం నుంచీ వాడుకలో ఉన్న ప్రాచీన శబ్దమది. కానీ కావ్యప్రయోగాలు చాలా తక్కువ.

రైతుల ఇళ్లలో తప్పక కనిపించే మరో సాధనం నాగలి. ఈ మాటకు 'నాగలి, నాంగలి, నాగేలు, నాగెలు' అనే రూపాంతరాలూ, 'మడక, దుక్కివాలు' అనే పర్యాయపదాలూ ఉన్నవంటారు. ఇది దేశ్య శబ్దమేననే వాళ్లున్నారు. కన్నడంవంటి సాహిత్య భాషల్లో, గదబ, గోండీ, కొండ, ఫర్జీ, కుఇ, కువి వంటి మధ్యద్రావిడ గిరిజన భాషల్లో ఈమాట కనిపిస్తుంది కాబట్టి దేశ్యమని కొందరు భావిస్తే, సంస్కృతంలోని 'లాంగల' శబ్దం నుంచి ఇది పుట్టిందికాబట్టి ఇది అచ్చతెలుగు మాటకాదని కొందరు వాదిస్తారు. పాళీభాషల్లో 'నాంగల' శబ్దముంది. అయితే సంస్కృత వ్యాకరణం 'శకంధ్వాదు'లని చెప్పేమాటల్లో ఈ మాట ఉంది కాబట్టి, ఆ మాటలకు సంస్కృతంలో సరయిన వ్యుత్పత్తులు లేవు కాబట్టి, లాంగల శబ్దం కొలేరియన్ ముండారియన్ భాషల నుంచి సంస్కృతాదిభాషల్లోకి ఎరువుగా వచ్చివుంటుందనీ, ఆర్యులు మొదట వ్యావసాయకులు కారుకాబట్టి తమకన్నా ముందే భారతదేశంలో ఉన్న ఇతర భాషలవారి పదాలెన్నో ఎరువు తెచ్చుకొన్నట్లు దీన్ని స్వాయత్తం చేసుకున్నారనీ ఇంకా కొందరి వాదన. సంస్కృతంలోని 'హల' శబ్దమే చాలా ప్రాచీనకాలంలో 'ఫల'గా ఉండేదనీ, అదే ఆ భాషలోని సహజశబ్దమనీ చెప్తూ, అందుకు నిదర్శనగా ఈనాటికీ వాడుకలో వున్న ఇంగ్లీషుమాట 'Plough'ను నిదర్శనగా చూపుతారు మరికొందరు.

మడక మాత్రం నిస్సంశయంగా తెలుగుమాటేగాని దానికి రాయలసీమలోనే వాడుక ఎక్కువ. ఇతర ప్రాంతాల్లో నాగలి శబ్దమే బహురూపాల్తో వినిపిస్తుంది. 'దుక్కివాలు' అనేది వర్ణనాత్మక రూపమేగాని సహజశబ్దం కాదు. మడకకు సమానార్థకాలని చెప్పదగ్గ సంస్కృత పదాలు 'హలం, లాంగలం, కుంతలం, గోకిలం, సీరం/శీరం, గోదారణం' అనేవి. కుంతల శబ్దానికి బల్లెమనే అర్థాంతరముంది. గోకిలం, గోదారణమనేవి 'అరకకు కట్టేది' అనే విస్తృతార్థంలో పుట్టినమాటలు. తెలుగులోని మడకక్కూడా ఇలాంటి అర్థమే ఉందని కొన్ని నిఘంటువులు చెప్తాయి. సీర/శీరశబ్దం కూడా ప్రాంతీయంగానయినా హలమంత ప్రచారంగల మాట. బలరాముణ్నే హలాయుధ, సీరపాణి శబ్దాలతో వ్యవహరిస్తారు.

అలంకారార్థం ప్రతిగృహంలోనూ వాడే వస్తువులు అద్దం, దువ్వెన – అనేవి. అద్దం అచ్చ తెలుగు మాటకాదని, సంస్కృతంలోని ఆదర్శ శబ్దభవమని వాదించేవాళ్లు లేకపోలేదు. అదితప్ప మరోమాట తెలుగులో ఉన్నట్లు లేకపోలేదు. సంస్కృతంలోనైతే 'దర్పణం, ముకురం, దర్శనం, కర్కం, ఆత్మదర్శం' వగైరా సమానార్థకాలున్నాయి. దర్శనం, ఆత్మదర్శమనేవి నీడచూసుకోడానికి పనికివచ్చేదనే అర్థంలో వర్ణనాత్మకంగా వచ్చినపేర్లు. కర్కశబ్దానికి 'తెల్లటిది, నీటికుండ' మొదలయిన అర్థవిశేషాలున్నాయి. బహుశా నీటిలో నీడచూసుకొనే రోజుల్లో ఈ మాట పుట్టివుండవచ్చు. 'దృప్' ధాతువునుంచి ఏర్పడ్డమాట దర్పణం. దానికి అహంతను, గర్వాన్ని చూపేదనే అర్థంచెప్పారు – అద్దంలో ప్రతివ్యక్తీ తనంతవాడు లేరనుకోవచ్చు కాబట్టి. ఇది కూడా

వర్ణనాత్మక పదమే. ముకుర శబ్దానికి మకురమనే రూపాంతరముందిగాని దానికి వాడుక తక్కువ. వేశ్యలకు కన్నెరికానికి ముందు అద్దంచూపే 'ముకురదీక్షా' విధానమొకటి వుండేదని క్రీడాభిరామం చెప్తున్నది.

దువ్వెన తప్ప తెలుగులో మరోమాట ఉన్నట్లు లేదు. దువ్వుధాతువుకు 'ఎన' అనే భావార్థకప్రత్యయం చేరి ఈ మాట ఏర్పడ్డది. సంస్కృతంలో దీనికి పర్యాయార్థకాలని చెప్పదగ్గవి 'కంకతం/కంకతిక, ప్రసాధని, మార్జని, కేశమార్జకం' అనేవి. మొదటిమాటే సహజ శబ్దమనాలి. తక్కినవన్నీ వర్ణనాత్మకాలు. ప్రసాధనం అంటే అలంకారం. అలంకరణలో వాడేది కాబట్టి ఆపేరు వచ్చింది. మార్జనం కూడా అలాంటి అర్థం కలదే. అందువల్ల తక్కిన రెండు మాటలూ పుట్టాయి.

ఇంటికి వెలుగిచ్చే ముఖ్యసాధనం దీపం. తెలుగు నిఘంటువులు 'దివియ, దివ్వె, దివ్వ, దివె, దివ్వియ, దివ్యం, దిబ్బె, దీబె' అనే రూపాంతరాలిచ్చిన ఈ మాట సంస్కృతభవం. బకారంగల మాటలు నిజానికి ప్రాకృతభవాలని చెప్పదగ్గవి. 'దివియ, దీవె, దివ్వియ, దివ్య, దివ్యం' అనేవి ప్రాచీనరూపాలు. 'దివిటీ, జోతి, తిర్లిక, పంజు, కాగడా, పరాయి' అనే పర్యాయపదాలు కూడా తెలుగులో ఉన్నాయంటారుగాని దివిటీ కూడా అచ్చతెలుగుకాదు. జోతి అనేది సంస్కృతంలోవి జ్యోతిశ్శబ్దభవం. తిర్లిక అనే మాటకు 'తిల్లిక, తిత్లిక' అనే రూపాంతరాలున్నాయి. కాగడా పెద్దది; దివిటీలాగా ఇంటిబయట వెలిగించేదేగాని మామూలుగా ఇంట్లో వెలిగించేది కాదు. తిల్లికను కొందరు 'ప్రమిద' అనే అర్థంలో నేటికీ వాడుతున్నారు. మిగతా మాటల విషయం అస్పష్టం. దీపమే తెలుగువారి వాడుకలో అత్యధిక ప్రచారంగల మాట.

దీప శబ్దానికి 'దీపిక, స్నేహాలం, గృహమణి, కజ్జలధ్వజం, దోషాతిలకం, దోషాస్యం, తిర్విశక, దీపయష్టిక, దశాకర్షం' వగైరాలు పర్యాయపదాలంటారు గాని నిజానికి అవన్నీ అలాంటివికావు. దీపిక – చిన్నదీపం. స్నేహం అంటే నూనె. నూనె తాగి వెలిగేది కాబట్టి స్నేహాలం. ఇంట్లో మణిలాగా వెలుగుతుంది కాబట్టి గృహమణి. కాటుకలా నల్లటి పొగ వదులుతుంది కాబట్టి కజ్జలధ్వజ మన్నారు. చుట్టూ నల్లని నీడ ఇస్తుంది కాబట్టి దోషాస్యం, దోషాతిలకం అన్నారు. దీపయష్టిక అంటే దీపం 'కాడ'. అన్ని సమయాల్లో ఆకర్షణకరం కాబట్టి దశాకర్షం. కాళిదాసు దీపశిఖావర్ణన చదివితే ఈ మాట పచ్చినిజ మనిపిస్తుంది.

## వృత్తులూ పనులూ

మన వృత్తుల్లో అన్నింటికన్నా ముఖ్యమయింది వ్యవసాయం. ఈ మాటేమో సంస్కృతపదం. వాడుకలో దీన్ని 'ఎగసాయ' మంటారు. సేద్యమనేది తెలుగుమాట. వ్యవసాయవృత్తిలోని భిన్నభాగాలకు అచ్చతెలుగు మాటలున్నాయిగాని మొత్తం వృత్తికి ఇదొక్కటే మాట. ఈ వృత్తి చేసేవాడు 'సేద్యగాడు'. ఈ మాట ఇప్పటికీ వినిపిస్తుంది గాని రానురాను దీనికి వాడుక తగ్గిపోతున్నది. 'రైతు' అనే

అన్యదేశ్యపదం దీని స్థానమాక్రమించింది. 'రైతన్న' రాజకీయవాదుల ఇటీవలి సృష్టి. 'రైతాంగం' అనే మాటను ఎప్పుడెవరు కల్పించారోగాని అది పత్రికల ద్వారా రాజకీయోపన్యాసాల ద్వారా 'రైతులు' అనే బహువచన రూపానికి బదులుగా సామూహికార్థంలో స్థిరపడిపోతున్నది. దాని చివరి 'అంగ' శబ్దానికీ అర్థానికీ పొంతన కనిపించదు. ఇలాంటి మరో సంకరపదం 'వ్యవసాయదారు' అనేది. మొదటి భాగం సంస్కృతం. చివరి ప్రత్యయం హిందీ/ఉర్దూ ప్రసాదం. ఈ రెండు మాటలే బహుళ వ్యాప్తిలో ఉన్నాయి. అయితే వ్యవసాయ శబ్దం సంస్కృతంలో చాలా విస్తృతార్థం కలమాట. వీరకం పరిశ్రమనైనా వ్యవసాయమనవచ్చు. నిజానికి సంస్కృత నిఘంటువులు దీన్ని సేద్యశబ్ద సమానార్థకంగా ఉదాహరించవు.

సేద్యానికి తుల్యమైన సంస్కృతపదాలు 'కృషి, కర్షణం' అనేవి. కృషికి శ్రమ అనేది సామాన్యార్థం. కర్షణం అంటే లాగటం. ఆకర్షణ వికర్షణ వంటి శబ్దాల్లో ఈ మాట ఉంది. నాగలితో లాగటమనే అర్థంలో మొదట కర్షణ శబ్దం వాడుకలోకి వచ్చివుంటుంది. ఆర్యులు మొదట వ్యవసాయం చేసిన వాళ్లు కారు. అందువల్ల వాళ్ల భాష అయిన సంస్కృతంలోని ప్రాథమిక శబ్దజాలంలో సేద్యంతో సమానార్థకమైన మాటలేదు. తరవాత కల్పించుకున్నారు. వ్యవసాయభూమిని క్షేత్రమనేవాళ్లు. మళ్లీ ఆ మాటకు భార్యవంటి ఇతరార్థాలు కూడా ఉన్నాయి. సేద్యంచేసే వ్యక్తిని సంస్కృతంలో 'క్షేత్రపతి, క్షేత్రపాలుడు, క్షేత్రికుడు, క్షేత్రి, క్షేత్రాజీవుడు' అని మొదట పిలిచేవాళ్లు. పొలానికి యజమాని అనే అర్థంలో క్షేత్రపతి అనేమాట పుట్టించి, పొలాన్ని నిర్వహించే/కాపాడే వ్యక్తిని క్షేత్రపాలుడన్నారు. క్షేత్రం మీద బతికేవాడు క్షేత్రాజీవుడు. పొలమున్నవాడు క్షేత్రి, క్షేత్రికుడు.

ఆర్యసమాజం తొలిదశలో – వేదకాలంలో – వ్యవసాయం వైశ్యుల వృత్తి. ఆ పనిచేసేవాళ్ళను 'విశ, విశాయువత' అనేవాళ్లు. వాళ్లే వ్యవసాయోత్పత్తులను అమ్ముకునేవాళ్లు. అందుకే వాణిజ్యం కూడా వాళ్ల కులవృత్తి అయింది. 'కృషి వాణిజ్యో వార్తా' అని వ్యవసాయం, వాణిజ్యం ఈ రెంటినీ కలిపి వార్త అని పిలిచేవాళ్లు. తరవాతికాలంలో ఇతర వర్ణాలవాళ్లు, ప్రముఖంగా శూద్రులు ఈ వృత్తిని చేపట్టారు. అప్పట్లో సేద్యానికి కొత్త పేర్లు పుట్టాయి: కృషిలాంటివి. ఆ పనిచేసేవాళ్ళకు ఆ మాట మీదనుంచే "కృషికుడు, కృషీవలుడు, కర్షకుడు, కార్షకుడు"లాంటి పేర్లు వచ్చాయి. కృషి శబ్దం తద్ధితరూపాలతో ఏర్పడ్డ మాటలు కర్షకుడు/కార్షకుడు అనేవి. కృషిచేసేవాడు కృషీవలుడు – అదే వృత్తిగా కలవాడు.

వైశ్యేతర వర్ణాలవారు – ముఖ్యంగా శూద్రులు – క్షేత్రపతులై, కృషీవలులైనప్పుడు వాళ్లకు పొలంపనుల్లో సాయం చేయడానికి ఆర్యేతర సమాజాలవాళ్లను – యుద్ధంలో జయించి బందీలుగా పట్టుకొన్నవాళ్ళను – నిర్బంధంగానయినా నియమించారు. వెట్టి అమల్లోకి వచ్చింది. వాళ్లకు రకరకాల పేర్లు పర్యాయార్థకాలుగా వాడుకలోకి వచ్చాయి. కూలిపనికీ, సేవకుడుగా ఉండటానికీ, వెట్టిచాకిరీ చేయడానికి పెద్దభేదం చూపలేదప్పటి ఆర్య సమాజం. ఇప్పుడు ఎంతో వ్యాప్తిలో ఉన్న 'కూలీ' అనే మాట తెలుగూ కాదు – సంస్కృతమూ కాదు. ఉత్తరాది భాషల్లో తరవాతి కాలంలో ఎరువు మాటగా వచ్చి చివరికి ఇంగ్లీషులో కూడా చేరిపోయిందా మాట. ఇంట్లోగాని, పొలంలోగాని,

అధికారుల కార్యాలయాల్లో గాని సేవలందించే వాళ్లకు రకరకాల పేర్లు వచ్చాయి: "భృత్యుడు, సేవకుడు, కింకరుడు, అనుజీవి, ఉపజీవి, పరిజనుడు, పరిచారకుడు, నియోజ్యుడు, భుజిష్యుడు, శుశ్రూషకుడు, ఉపాసకుడు, సేవాజీవి, వైతనికుడు, భృతిభుక్కు, భరణ్యభుక్కు, కర్మకుడు, కర్మకారుడు, దాసుడు, ప్రేష్యుడు, చేటుడు, దాసేయుడు, గర్భదాసుడు, గృహదాసుడు, కార్మికుడు, శ్రామికుడు" వగైరాలు.

భృతి అంటే జీతం. జీతం తీసుకొని చాకిరీ చేసేవాణ్ని "భృత్యుడు, భృతిభుక్కు, వైతనికుడు" అని పిలిచేవాళ్లు. వేతనమన్నా జీతమే. సేవలు చేసేవాడు (జీతం తీసుకున్నా లేకపోయినా) సేవకుడు, సేవాజీవి. ఏమి చెప్పినా చేయవలసినవాడు కింకరుడు (కిం – అంటే ఏమిటి; కరుడు – అంటే చేసేవాడు). అనుసరించుకొని బతికేవాడు అనుజీవి. ఆధారపడి బతికేవాడు ఉపజీవి. తన ఇంట్లోనే తిరుగుతూ పనిచేసేవాడు పరిజనుడు, పరిచారకుడు (అన్ని కులాల, వర్ణాల సేవకులను అందరూ ఇంట్లోకి రానీరు కాబట్టి ఈ భేదం వచ్చింది). ఏదో పనిచేయమని పురమాయించి పంపినవాడు నియోజ్యుడు. శుశ్రూష అంటే వినాలనే కోరిక. ఆ మాటకు కాలాంతరంలో సేవ అనే అర్థం వచ్చింది. చెప్పినట్లు (విని) చేసేవాడు శుశ్రూషకుడు. బౌద్ధారామాదుల్లో పీఠాధిపతులకు సేవలు చేసేవాడు ఉపాసకుడు. ఇంతపడేస్తే ఇచ్చినంత తిని పనిచేసేవాడు భరణ్యభుక్కు. నిపుణ సేవకులను కర్మకుడు, కర్మకారుడు అనిపిలిచేవాళ్లు.

దాసుడు, దాసేయుడు, దాసేరుడు అనేవాళ్లు బానిసలు. దస్యుజాతిని జయించిన ఆర్యులు వాళ్ళను కట్టు బానిసలుగా వాడుకునేవాళ్లు. గృహదాసుడు ఇంటిపని ఊరకే చేసే వెట్టివాడైతే, గర్భదాసుడు (తన పూర్వుల బాకీ పడ్డందువల్ల పుట్టినప్పటినుంచీ అప్పనంగా సేవలుచేసే) కట్టుబానిస. కార్మికుడు, శ్రామికుడూ అనేమాటలు ఇటీవల సృష్టించిన సంస్కృత పదాలు. కర్మ–పని–చేసేవాడు కార్మికుడు. శ్రమపడేవాడు శ్రామికుడు. సంస్కృత నాటకాల్లో దాసీపుత్రుడనే మాట దాసీదాని(కి భర్తవల్ల పుట్టిన) కొడుకనే అర్థంలోనూ, 'దాస్యాఃపుత్రు'డనే మాట దాసీదానికి వ్యభిచారంవల్ల పుట్టినవాడనే అర్థంలోనూ కనిపిస్తాయి.

తెలుగులో పాలేరు అనేది మామూలు మాట. ఇప్పటి భాషలో 'వ్యవసాయ కూలీ' అన్నమాట. జీతం తీసుకొనేవాడు జీతగాడు. సంబళం అంటే జీతం; కొన్ని ప్రాంతాల్లో తిండి. ఇంత తిండి పెడ్తే చాకిరి చేసేవాడు సంబళకాడు. జీతనాతాలు లేకుండా సేవచేసేవాడు బానిస. తన తండ్రి కట్టుబడి వున్నందువల్ల తాను పుట్టినప్పటినుంచీ ఊరకే సేవలందించవలసినవాడు కట్టుబానిస. ప్రతిఫలం లేకుండా చేసే సేవ 'వెట్టి'; అలా చాకిరీచేసేవాడు 'వెట్టి(వాడు)'. ఇవి తెలుగుమాటలు.

'పని'ని తెలుగులో 'చెయ్దం, చెయ్వు, చెయిది, ఒంజలి, చేత' అనేవాళ్లు. ఒంజలి మినహా మిగిలిన మాటలన్నీ చేత్తో చేసే పనులనే సామాన్యార్థం కలవి. మొదటి మూడు మాటలకూ కావ్యప్రయోగాలేగాని వ్యవహారంలో వాడుకలేదనే చెప్పాలి. ఒంజలి వ్యుత్పత్తి తెలియదు. వీటికి సంస్కృతంలోని సమానార్థకాలు 'అప్నజం, కరజం, కర్మ, కార్యం, కృత్యం, క్రియ, వ్యాపారం' అనేవి. వీటిలోనుంచి 'కర్మ, క్రియ, వ్యాపార'మనేవి వ్యాకరణశాస్త్రంలో ప్రత్యేకార్థాల్లో చేరాయి. క్రియ అంటే

పని అని ఇప్పటివాళ్ళూ ఒప్పుకొంటారు గాని 'కర్మ'ను క్రియతో సమానార్థకంగా వేదాంతులు తప్ప అంగీకరించలేదు. కృత్యమంటే 'చేసింది, (చేసిన)పని'.

పని చేయటానికి ప్రతిఫలంగా తీసుకొనేది తెలుగులో 'జీతం, సంబళం'. కొందరు జీతంకూడా సంస్కృతంలోని జీవిత శబ్దభవమంటారు. పాతకాలపు తెలుగు శాసనాల్లో కూడా జీతంకన్నా జీవితశబ్దానికే వాడుక ఎక్కువ. 'జీతనాతాలు' అనే వాడుక వుంది. జీతమనేది రొక్కంగా తీసుకొనేదనీ, నాతం వస్తురూపంలో తీసుకొనేదనీ కొందరు వివరిస్తారు. ఈ మాటలకు పర్యాయార్థకాలని చెప్పే సంస్కృతపదాలు "కర్మణ్యం, భృత్యం, భృతి, విధం, భర్మ, వేతనం, భరణం, భరణ్యం, మూల్యం, పణం, నిర్వేశం" అనేవి. ఏదో రూపంలో ఇచ్చేది విధం. చేసిన పనికిచ్చేది కర్మణ్యం. రొక్కరూపంలో ఇచ్చేది భర్మ. నెలకో వారానికో రోజుకో ఇంత అని ఇచ్చేవి 'భృత్యం, భృతి, వేతనం' అనేవి. పందెంగాగాని, సరసానికిగాని ఇచ్చేది పణం. వెలకట్టి ఇచ్చేది మూల్యం. భరణమనే మాటకు మొదట బతకడానికిచ్చేదని అర్థమేగాని, రానురాను తమ మీద ఆధారపడ్డవాళ్లకు మాత్రమే బతుకుతెరువుగా ఇచ్చేదనే అర్థం వచ్చింది – అటు న్యాయశాస్త్రంలోనూ ఇటు నిత్యవ్యవహారంలోనూ. భరణం స్త్రీకేగాని పురుషుడి కిచ్చేదికాదు. పురుషుడికి 'భరణం హక్కు' లేదు.

సేవక శబ్దానికి పర్యాయార్థకాలన్నిటికీ స్త్రీ వాచకాలయినప్పుడు 'సేవకురాలు, దాసి' వంటి రూపాలున్నాయి సంస్కృతంలో. అయితే 'ధాత్రి' అనేమాటకు పుంలింగరూపమేమో తెలియదు. ఆ మాటకు తెలుగురూపం 'దాది'. ధాత్రీ శబ్దానికి 'భూమి, పాలిచ్చే దాసి' అనే విశేషార్థాలున్నాయి. తెలుగులో 'తొత్తు, బానిస/బానిసె, వరవుడు, సాకుడు, బోనకత్తె' వంటి పేర్లున్నాయి. పాలిచ్చేదానిని సాకుడు అంటారు. వంటచేసే దాసిని బోనకత్తె అంటారు. వరవుడు అనే తెలుగుమాటకు మూలార్థం తెలియదు. ద్రౌపది భారతంలో 'నేవరవుడు నౌదునో' అంటుంది ఒక సందర్భంలో. ఈ మాట నిత్యవ్యవహారంలో వినిపించదు.

పను లనేకవిధాలు. వాటిలో నైపుణ్యం చూపేవాడు పనివాడు, పనిమంతుడు. ఈ రెండోమాటలోని మొదటిభాగం అచ్చతెలుగు. మంతుడనేది సంస్కృతంలోని మతుప్ప్రత్యయం చేరిన రూపం. పొలం పనుల్లో నేర్పు చూపేవాడు పారగాడు (పారతో పనిచేస్తాడని). నేటి భాషలో నేర్పులేనివాడు పనివాణ్నే 'లేబరి, నేబరి' అంటున్నారు. ఇది ఇంగ్లీషులోని Labour(er) అనే మాట నుంచి పుట్టిన రూపం. నకారంతో మొదలయ్యే మాట కళింగప్రాంతంలో వినిపిస్తుంది. కూలివాడనేది నేటి సాధారణపదం. 'దినకూలీ' (ఇది దినవెచ్చం – లాంటి మిశ్రసమాసం) తీసుకొనే వ్యక్తిని రాయలసీమలో 'కైకలోడు' అంటారు. కైకలం అంటే 'దినబత్తెం'. బత్తెం అనేది 'భత్య' శబ్దభవం. మగకూలీని తెలంగాణాలో 'పాలిగాడు' అంటారు.

పనుల్లో ఉన్న భేదాలనుబట్టి వృత్తులేర్పడ్డాయి. ఒకప్పుడవి కులవృత్తులు. ఇప్పుడవి వృత్తులు మాత్రం. ఏ కులంవారయినా తమకు నచ్చిన పనిచేసుకోవచ్చు. మధ్యయుగాల గ్రామీణ వ్యవస్థలోనూ ఇప్పటికీ అమల్లోవున్న కొన్ని ప్రధానవృత్తుల విషయం చూద్దాం. వ్యవసాయం తరవాత ఎక్కువమంది చేసే వృత్తి నేతపని. నేతలు

అనేకరకాలు. ఉదాహరణకు కప్పనేత. గుడ్డలు నేయటం ముందు ప్రస్తావిద్దాం. ఆ పని చేసే వ్యక్తిని 'నేతగాడు' అంటారు తెలుగులో. యంత్రాలను వదిలేస్తే ఇప్పటికీ గొంగళినేత కులవృత్తిగానే ఉంది; 'కురమ, కురవ, కురువ' వగైరా పేర్లుగల కులంలో. గుడ్డలనేత 'తొగట, దేవాంగ, కట్టుసాలీ, పట్టుసాలి, సేనాపతి, కరిణె భక్తులు' అనే కులాలవాళ్లు ప్రధానంగానూ ఇతరులు మరికొందరూ చేస్తున్న నిపుణకార్యం. దేవాంగులను దేవబ్రాహ్మణులని వ్యవహరించాలి. పద్మశాలి అనాలి పద్మసాలి అనేవారిని. కొన్ని ప్రాంతాల్లో నేత పనిచేసేవారిని 'సాలెబత్తు'లంటారు. 'సాలి, సాలియ, సాలె' అనె రూపాంతరాలున్న అచ్చ తెలుగు మాటకు 'నేర్పుగల' అనే అర్థం.

సంస్కృతంలో నేతపనిని 'వాయం, వాపం, తంతుతంత్రం, తంతువ్యూహం, ఊతి, వ్యూతి, పటకర్మ, పటనిర్మాణం' అని పిలుస్తారు. తంతువంటే తీగ/దారం. వాటితో చేసే నేర్పయిన పని కాబట్టే తంతుతంత్రం, తంతువ్యూహమనే వర్ణనాత్మకపదాలు పుట్టాయి. పటం అంటే గుడ్డ. వాటి తయారీ పట కర్మ/నిర్మాణం. వాయం, వాపం అనేవీ ఊతివ్యూతులూ పరస్పరం రూపాంతరాలు. ఈ పని చేసేవాళ్లను ఆభాషలో 'తంతువాయుడు, తంతువాపుడు, కువిందుడు, పటకారుడు' అని పిలిచేవాళ్లు. దారాలతో పనిచేస్తారు కాబట్టి మొదటి రెండుమాటలూ, గుడ్డలు తయారుచేస్తారు కాబట్టి చివరి మాటా పుట్టాయి. కువింద శబ్దానికి ఉణాది సూత్రాల్లో పేర్కొన్న కుపింద శబ్దం రూపాంతరం. దాని వ్యుత్పత్తి అంత స్పష్టంకాదు. ఇప్పటి భాషలో నేతపని 'చేనేత' పనిగాను, ఆ పనిచేసేవాళ్లు 'చేనేత కార్మికులు' గానూ మారారు; వస్త్రకారులనే నూతన సమాసం పుట్టింది.

నేత తరవాత ఎక్కువమంది చేసే పని చేపలు పట్టడం. 'బెస్త, జాలరి' అనే మాటలకుమాత్రం తెలుగులో వాడుక ఎక్కువ. అయితే జాలం (అంటే వల) అన్నది మాత్రం సంస్కృత పదమే. బెస్తపనికి మరో తెలుగు పర్యాయపదమున్నట్లులేదు. సంస్కృతంలో బెస్తవారిని 'ధీవరుడు, కైవర్తుడు, దాసుడు/దాశుడు, జాలికుడు, మత్స్యజీవుడు, మత్స్యోపజీవి, మాత్స్యికుడు, నిషాదుడు' వగైరా పేర్లతో పిలిచేవాళ్లు. వీటిలో దాశుడు అనేదే సాధారణరూపం. భారతంలో దాశరాజు కుమార్తె సత్యవతి వృత్తాంతం ఉంది. దాసుడనేది రూపాంతరం. ధీవరుడంటే తెలివైనవాడని అర్థం. వలపన్నేవాడు కాబట్టి జాలికుడన్నారు. మత్స్యమంటే చేప. వాటిని పట్టి బతికేవాడు మత్స్యజీవాది నామాలున్నవాడు. నిషాదుడు నిజానికి చేపలు పట్టేవాడే కానక్కరలేదు. ఆర్యులు ఉత్తర హిందూస్థానమాక్రమించేనాటికి ఆ ప్రాంతాల్లో విస్తరించివున్న కొలేరియన్ భాషలవారిని (సంతాలీలు మొదలైనవాళ్లను) నిషాదులని పిలిచారు. బహుశా గంగాయమునా పరివాహ ప్రాంతంలో వాళ్లు చేపలు పడ్తుండటం చూసి యావజ్జాతీ అదే వృత్తిలో ఉన్నదనుకొన్నవాళ్లు ఈ పేరు పెట్టివుంటారు. ఆర్యులకు వ్యవసాయ విద్యనేర్పినవాళ్లు నిషాదులంటారు చరిత్రకారులు. వాళ్లపని 'ధీవరకర్మ, మత్స్యబంధనం, మత్స్యగ్రహణం'.

★ ★ ★

# నిర్మాతలు

గ్రామజీవితంలో మరో పెద్ద పరిశ్రమ గృహనిర్మాణం. అదిన్నీ ముఖ్యంగా ప్రాముఖ్య క్రమంలో పూరిగుడిసెల, పెంకుటిళ్ళ, మిద్దెల నిర్మాణం. పూరిళ్ళు నిర్మించే వ్యక్తిని 'నేతకాడు' అంటారు. తెలుగులో పెంకు కప్పే వ్యక్తిని ఆయా ప్రాంతాల్లో 'కప్పడుగాడు, పేర్పుగాడు' అని పిలుస్తారు. సీమపెంకు కప్పేవాడు 'నిమ్మగాడు'. వాసకట్టు బిగించే వ్యక్తి 'కట్టుగాడు'. కేవలం రాళ్ళు మోసేవాడు 'మోటుగాడు' (ముఖ్యంగా రాయలసీమలో). నేర్పుగా పునాదులు వగైరా తవ్వేవాడు 'పారగాడు'. కేవలం మట్టిగుంటలు తవ్వి, మట్టి ఎత్తిపోసేవాడు 'ఉప్పరి/ఉప్పర'. వీళ్లనే మరికొన్ని ప్రాంతాల్లో 'వడ్డె, వడ్డెర, వడ్డి, వడ్ర, వడ్రీ, వడ్డుర, ఓడ్డెర, వడ్డెరాయన' మొదలైన రూపాంతరాలతో వ్యవహరిస్తారు. ఇటిక తయారు చేసేవాళ్లను 'సూతరికాడు, అచ్చువాడు, అచ్చుమేస్త్రి, సాంచెకాడు, సాంచెమేటి/మేటి సాంచె, తీతవాడు, సాంచె మనిషి, సాంచెతడు' వగైరా పేర్లతో ఆయా ప్రాంతాల్లో పిలుస్తారు.

మేస్త్రి శబ్దం నిపుణ కార్మికుడు (=మేటి) అనే అర్థంలో వచ్చింది. ఇది 'meastro' అనే ఇండో జెర్మానిక్ భాషా పదం. సాంచె ఉర్దూ పదం; దానికి సరైన తెలుగుమాట 'అచ్చు'. రాతికట్టడాలు కట్టే వ్యక్తిని ప్రముఖంగా రాయలసీమలో 'గడేకారి' అంటారు. 'బేలుదారి/బేల్దారి, గౌండా, సుతారి' అనేవి గృహనిర్మాతలకు భిన్న ప్రాంతాల్లో ఉన్న పేర్లు. వీటిలో మొదటి రెండు మాటలూ హిందీ/ఉర్దూల నుంచి వచ్చాయి. మూడోది అచ్చ తెలుగు. సుతారం అనే విశేషణానికి 'సున్నితం, సులభం' మొదలైన అర్థాలున్నాయి. తాపీ శబ్దానికి 'టాపీ' అనే రూపాంతరముంది. 'తాపీమేస్త్రి' అనే మాట బహుళ వ్యాప్తిగల శబ్దం. అది తెలుగుమాట కాదు. దీర్ఘాంత శబ్దాలు అచ్చ తెలుగు మాటలు కావనేది ఒక కొండ గుర్తు.

ఇళ్ళు కట్టే వ్యక్తిని సంస్కృతంలో 'లేపకుడు, లేపకారుడు, సుధాజీవి, పలగండుడు' వగైరా పేర్లతో పిలుస్తారు. లేపనం అంటే పూత. సున్నంపూసిగాని, మట్టి మేదిగాని (మెత్తిగాని) ఇళ్ళు కట్టేవాడని ఈ మాటల కర్థం. సుధాశబ్దానికి సున్నమనే అర్థముంది. గృహనిర్మాణం అనే అర్థంలో 'ఇష్టకా రచన/నిర్మాణం' అనే మాటలు పుట్టాయి. ఇష్టక/ఇష్టిక అనే దానికి ఇటిక/ఇటుక అని అర్థం: యజ్ఞకుండాల నిర్మాణంలోనే ఆర్యులు ఇటుకలను వాడేరు మొదట. తరవాత అది గృహనిర్మాణ ద్రవ్యం కూడా అయింది.

అటు వ్యవసాయానికీ ఇటు గృహనిర్మాణానికీ ఉపయోగపడే మరో ప్రధాన వృత్తి వడ్రంగం. నాగలి, బండి మొదలుకొని ఇళ్ళు కట్టడందాకా ఈ వృత్తివిద్య పనికి వస్తుంది. వడ్రంగి శబ్దానికి 'వడ్ల, వడ్లంగి' మొదలైన రూపాంతరాలున్నాయి. పాతకాలపు తెలుగు శాసనాల్లో 'వడ్డచి' అనే మాట కనిపిస్తుంది. అది ప్రాకృతం నుంచి వచ్చిందంటారు. వడ్రంగిని సంస్కృతంలో 'తక్షకుడు, సూత్రధారుడు,

స్థకారుడు, స్థపతి, త్వష్ట, తక్షుడు, రథకారుడు, వర్ధకి' అని పిలుస్తారు. తక్షుడు, తక్షకుడు రూపాంతరాలు. తక్షణం అంటే చెక్కడం పని (వెంటనే అనే అర్థంలో తత్క్షణం అనేది సరయిన రూపం). సూత్రమంటే దారం. కొలతలకూ నమూనా గీయడానికి దారం వాడ్తాడు కాబట్టి సూత్రధారుడన్నారు. స్థ అంటే 'ఉన్నది, గట్టిది'. స్థకారుడు, స్థపతి అనే మాటలు చెక్కడం పనిచేసేవాడనే అర్థంలో వచ్చింది. ఈ రెండు పేర్లూ రాళ్ళు చెక్కే శిల్పులకు కూడా వర్తిస్తాయి. త్వష్ట అన్నది 'సృష్టికర్త' అన్న అర్థంలో వచ్చింది – కొత్త వస్తువులను ముడి సరుకు నుంచి పుట్టిస్తాడు కాబట్టి. అదో ప్రజాపతి పేరు కూడా. బండ్లనూ రథాలనూ తయారు చేస్తాడు కాబట్టి రథకారుడన్నారు. వర్ధకి అనేదే మామూలు పేరు. ఆ పేరు నుంచే ప్రాకృతం ద్వారా తెలుగులోకి వచ్చిన మాట 'వడ్లచి' అనే ప్రాచీనాంధ్రపదం.

వడ్రంగాన్ని సంస్కృతంలో 'దారుకర్మ, తక్షణశిల్పం, తక్షణం, తక్షక్రియ' అని పిలిచేవాళ్ళు. దారు వంటే చెక్క/కొయ్య. కొయ్యతో చేసే పని కాబట్టి దారుకర్మ అన్నారు. తొలిదశలో కొయ్య మేకులే వాడేవారు. లోహపు మేకులు నాగరకతాభివృద్ధిలో మలిదశ. క్రియ, శిల్పం అనే మాటలను నేర్పుగా చేసే పని అనే అర్థంలో వాడారు. లోహ వస్తువులు మొదట ఇనుము, తరువాత తక్కిన మిశ్రలోహాలు, వెండి బంగారాలు కనిపెట్టిన తరవాత కమ్మరం, కంచరం అనే వృత్తులు ఏర్పడ్డాయి. కమ్మరం పని చేసే వ్యక్తి కమ్మరి. మరో తెలుగు మాట సమానార్థకంగా ఉన్నట్లు లేదు దీనికి. 'కర్మారి' అనే సంస్కృత శబ్దం నుంచి ఇది పుట్టిందంటారుగాని ఆ మాటకు సంస్కృతంలో వాడుకలేదు. ఆ భాషలో 'కర్మకారుడు, లోహకారుడు, అయస్కారుడు' అనేవే నిఘంటువులు చెప్పే సమానార్థకాలు. కర్మ శబ్దానికి లోహమనే అర్థం ఎప్పుడు ఎలా వచ్చిందో తెలియదు. లోహ శబ్దానికీ అయశ్శబ్దానికీ ఇనుమనే అర్థం. తరవాతి కాలంలో ఇతర ధాతువులతో నిపుణంగా వస్తువులు చేయటం వీలువడింది. ఆయా పనులు ఇతర వృత్తులయినాయి.

పనికి కంచరమనీ, ఆ పని చేసే వ్యక్తికి కంచరి అని పేర్లు వచ్చాయి – కంచు తయారు చేసిన తరువాత. కంచు సంస్కృతంలో 'కాంస్య' శబ్దభవమంటారు. ఇది మిశ్ర ధాతువు. కంచరిని సంస్కృతంలో 'కాంస్యకారుడు, కామంధమి' అని పిలిచే వాళ్ళు. కామంధమికి 'కారంధమి' అనే రూపాంతరముంది. కార శబ్దానికి లోహ మిశ్రమనీ, చివరి భాగానికి 'ఊదే, తిత్తివేయు' అనే అర్థాలున్నాయి. కొలిమితిత్తి ఊదుతూ పనిచేసేవాడికి ఈ పేర్లు పెట్టారు. ధ్మాత్రి అంటే కొలిమితిత్తి; తిత్తివేసేవాడు అనే అర్థాలు రెండూ ఉన్నాయి. 'పాణింధమ'మని కూడా కొలిమితిత్తిని పిలిచేవారు. పాణి అంటే చేయి. చేత్తో ఆడించే తిత్తి పాణింధమం. ఎందుచేతనో శ్రీనాథుడికి ఈ మాట చాలా ఇష్టం. సరస్వతీదేవిని 'వీణాపాణింధమపాణి' అన్నాడు – చేత్తో వీణమీటేది అనే అర్థంలో.

ప్రత్యేకించి రాగివంటి ఏదో ఒక ధాతువుతో పనిచేసేవాళ్ళకు వేరు వేరు పేర్లున్నట్లు కనిపించదుగాని వెండి, బంగారం వంటి విలువగల ధాతువులతో రకరకాల (అలంకరణ) వస్తువులను చేసేవారికి వేరే పేరుంది.

వెండి బంగారాలవంటి విలువైన ధాతువులతో అలంకరణ సామగ్రిని తయారు

చేసే వారిని పూర్వం 'కంసాలి/కమ్మసాలి, అగసాలి/అవసాలి, సొన్నారి' అని తెలుగుమాటల్లో వ్యవహరించేవారు. సాలి/సాలియ/సాలె అనే రూపాంతరాలకు సున్నితమైన, సుతారమైన, నేర్పయిన పనిచేసే వాళ్లనేదే అసలర్థం. అందులోనూ అయా ధాతువుల తీగలతో చేసేపని ప్రధానం. ఒకప్పుడు - శాతవాహనుల కాలంలో నేటి నల్గొండ, గుంటూరు, ప్రకాశం జిల్లా ప్రాంతాన్ని కర్మ రాష్ట్రమని సంస్కృతంలోనూ, 'కమ్మరాఠ'మని ప్రాకృతంలోనూ పిలిచేవారు. అనంతర కాలంలో కృష్ణానదీ పరివాహ ప్రాంతాన్ని 'కమ్మ' దేశమనేవాళ్లు. ఆ ప్రాంతాల్లో నివసించే ఇతర వర్ణాల/కులాల వారిని కూడా 'కమ్మ' శబ్దం ముందుచేర్చి 'కమ్మబ్రాహ్మణ, కమ్మకోమటి' మొదలుగా పిలిచే వాళ్లనడానికి ప్రాచీనాంధ్రశాసనాలు సాక్ష్యం. ఈ ఇరవయ్యో శతాబ్దంలో రాజకీయ సామాజిక కారణాలవల్ల ఇప్పటికీ పల్లెటూళ్ల వ్యవహారంలో ఉన్న 'కంసాలి' శబ్దం ప్రయోగించటం తప్పని ప్రభుత్వాలు ఉత్తరువులు జారీ చేశాక మార్పు వచ్చింది. కంసాలి/కమ్మసాలి అనే మాటకు కోస్తాలోను, అగసాలి శబ్దానికి రాయలసీమలోనూ ప్రాచుర్యమెక్కువ. కొన్ని ప్రాంతాల్లో బత్తుడనే మాట ఉంది. (బహుశా అది 'భక్త' శబ్దంకావచ్చని కొందరి వివరణ). అవుసలి, ఔసలి, ఔసలాయన వగైరా రూపాంతరాలున్నాయి. కావ్యభాషలో 'సొన్నారి' అనేమాట కనిపిస్తుంది పర్యాయార్థకంగా. సొన్న అన్నంతవరకు 'స్వర్ణ' శబ్దభవం. చివరి 'అరి' కంచరి, కమ్మరి, మేదరి వగైరా శబ్దాల చివరి భావార్థక ప్రత్యయం. ఇప్పుడు సర్కారు పరిభాషలో 'విశ్వబ్రాహ్మణ, స్వర్ణకార' వంటి సంస్కృత శబ్దాలేగాని అచ్చతెలుగు మాటలు లేవు.

సంస్కృతంలో "స్వర్ణకారుడు/సువర్ణకారుడు, నాడింధముడు, రుక్మకారకుడు, కళాదుడు" అనేవి పైవృత్తి చేసేవాళ్లకు పేర్లు. సువర్ణ, స్వర్ణ శబ్దాలు రూపాంతరాలు; బంగారానికి పేర్లు. రుక్మ శబ్దానికీ అదే అర్థం. వాటితో నగలవంటివి చేసే వాళ్లు కాబట్టి ఆ పేరు వచ్చింది. నాడి అంటే గొట్టం. గొట్టంతో కొలిమిని ఊదేవాడనే అర్థంలో నాడింధముడన్నారు. కొన్ని నిఘంటువులు నాడీ శబ్దానికే స్వర్ణకారుడనే అర్థముందంటున్నాయి. కళాద శబ్దం సొన్నారి వంటిది. 'సొన్న - అరి' అని విడదీసి బంగారం హరించేవాడనే దురర్థంలో 'స్వర్ణారి' అనే సంస్కృత శబ్దం నుంచి ఏర్పడిందని, 'అరి' అనేది భావార్థక ప్రత్యయమే అయితే 'సొన్నరి' అని రూపమేర్పడి ఉండేదనీ వాదిస్తారు. ఇలాగే పూజారి/పూజరి అనే శబ్దవిషయంలోనూ చెప్పారు. అదే ధోరణిలో 'కలా' శబ్దానికి 'చిన్నతునక, ఏ వస్తువులోనైనా పదహారోవంతు' అనే అర్థాలు చెప్పి (ఇతరుల బంగారం నుంచి) ఏ కొంచెమో సంగ్రహిస్తాడు/తింటాడు (అద్ - ధాతువుకు 'తిను' అనే అర్థముంది) కాబట్టి 'కలాదుడు/కళాదుడు' అనే మాట పుట్టిందంటారు. వాస్తవంలో 'కలా/కళా' (అంటే నేర్పును) 'ద=ప్రదర్శించే వాడు, నిపుణుడు, పనితనం గలవాడు' అనే అర్థంలో ఆ మాట పుట్టింది. సువర్ణంతోగాక వెండితోగూడా పనిచేసే వృత్తియిది.

కొయ్యతో రాతితో లోహాలతో వస్తునిర్మాణం చేయటమనేది నాగరకదశలో అభివృద్ధి సూచకంగా వచ్చిన నైపుణ్యాలు. ఆదిమానవుడు కనిపెట్టిన ఉపకరణాల్లో కుండలూ మూకుళ్లూ వంటి మట్టిపాత్రలే మొదటివి. అంటే కుమ్మరమనేది

అనాది నైపుణ్యం. ఆ కారణంచేతనే శుభాశుభకర్మలు రెంటి విషయంలోనూ కుమ్మరికి గ్రామీణ జీవితంలో గౌరవముండేది. ఆ పని చేసే వ్యక్తిని కుమ్మరి అంటారు. ఇది కూడా అచ్చతెలుగు మాటకాదనీ, సంస్కృతంలోని 'కుంభకార' శబ్దం నుంచి ప్రాకృతం ద్వారా తెలుగులోకి వచ్చినమాట అంటారు చాలామంది. కావచ్చు. తెలుగులో మరో మాట ఉన్నట్లులేదు. కుమ్మరి శబ్దానికి 'కుమ్మర, కుంబరి' అనే రూపాంతరాలున్నాయి వాడుకలో. 'కుమ్మరి సెట్టి, కుండ బ్రహ్మ' అనే పదబంధాలున్నాయి. అలాగే ఆ వృత్తిపనికి 'కుమ్మరం, కుమ్మరి/కుంబరి పని, కుండలపని, కుమ్మరాటకం' అనే మాటలు భిన్నప్రాంతాల వ్యవహారంలో.

కుమ్మరికి సమానార్థకాలయిన సంస్కృత పదాలు 'కుంభి, కుంభకారుడు, ఘటకారుడు, చక్రి, కులాలుడు' వగైరాలు. కుంభమన్నా ఘటమన్నా కుండే. వాటిని తయారు చేసేవాడు కాబట్టి మొదటి మూడు పేర్లు పుట్టాయి. చక్రమని కుమ్మరి 'సారె'కు గూడా పేరుంది. ఆ సారెను – ఆ చక్రాన్ని – తిప్పేవాడు కాబట్టి చక్రి అన్నారు. 'కుల్' అనే సంస్కృతధాతువుకు 'చేర్చు, సమకూర్చు, ఒనగూర్చు' అనే అర్థాలున్నాయి. మట్టి ముద్దల నుంచి కుండలను సమకూర్చే వ్యక్తికాబట్టి కులాలుడన్నారు. కుమ్మరం అనే పనిని ఆ భాషలో 'కౌలాలం, మూర్తికం' అంటారు. కులాలుడు చేసే పని కౌలాలమనే తద్ధితరూపంలో పుట్టింది. మూర్తి అంటే 'ఆకారం, బొమ్మ' వగైరాలు. మట్టిముద్దకొక రూపమిచ్చేపని కాబట్టి మూర్తికమన్నారు. తొలిదశలో దేవతావిగ్రహాలు మట్టితోనే తయారయ్యేవి కాబట్టి వాటిని కూడా మూర్తులనే పిలిచేవాళ్లు.

మధ్యయుగాలనాటి గ్రామీణార్థిక వ్యవస్థకు అయిదు వృత్తులగారు పట్టుగొమ్మలుగా ఉండేవారు. వారు 'కమ్మరి, కుమ్మరి, కంచరి, వడ్రంగి, కాసె(=తాపీపనివారు)' వారనీ, వారిని 'పంచాదు'లనీ 'పంచహాణమువా' రనీ పిలిచేవారనీ శాసనశబ్దకోశం చెప్తుంది. పంచహాణశబ్దం శాసనాల్లో తప్ప నిఘంటువుల్లో కనిపించదు. పంచ అనే సంస్కృత సర్వనామానికి అయిదని అర్థం. కానీ హాణమేమో తెలియదు. పంచాణులనే రూపాన్ని కూడా కొన్ని నిఘంటువులిచ్చాయి. వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, కంచరి, కంసాలి, కాసె (ఇళ్లు కట్టే)వారు పంచాణం వారని ఒక నిఘంటువు. అలాగయితే ఆరుగురవుతారు కాని అయిదుగురు కారు. బ్రౌను లెక్కన కుమ్మర్లులేరు. ఆయన ప్రకారం పంచాణులంటే 'పనివాళ్లు, యంత్రసాధనాలు చేసే, నడిపేవాళ్లు (mechanics), లేదా చేతిపనులవాళ్లు (handicrafts men).' కానీ చేనేత వాళ్లను ఆయనా పంచాణంలో చేర్చలేదు. ఇతర నిఘంటువులూ చేర్చలేదు. పంచాణమంటే శిల్పమంటుంది సూర్యరాయాంధ్ర నిఘంటువు.

మరికొన్ని ప్రధాన వృత్తులు లేకపోలేదు. చాకలిపని ముఖ్యవృత్తే. 'మడివాలు' అనే మరో తెలుగుమాట పర్యాయార్థంలో వాడుకలో ఉండేది. చాకలి పనిని 'చాకిరం' అనేవాళ్లు తెలుగులో. దానికి సంస్కృత సమానార్థకాలు "ధావనం, ప్రక్షాళనం, మార్జనం, అవసేకం, నిర్ణేక"మనేవి. వీటన్నిటికీ 'శుభ్రపరచటం, కడగటం, తడపట'మనే అర్థాలున్నాయి. చాకలిని ఆ భాషలో 'రజకుడు, ధావకుడు, నిర్ణేజకుడు' అని పిలుస్తారు. వీటిలో మొదటిదే నేటికీ ప్రచారంలో ఉన్నమాట.

కుండల తరువాత అవసరపడే వస్తువు బుట్టలు. చేట, జల్లెడ దగ్గర నుంచి పెద్ద గాదెలదాకా అల్లేవాడు మేదరి. ఈ తెలుగుమాటకు 'మేదర, మాదరి' అనే రూపాంతరాలున్నాయి. అందులో రెండోదానికి శాసనభాషలో ప్రయోగాలున్నాయి. మరో తెలుగుమాట పర్యాయార్థకంగా వినిపించదు. సంస్కృతంలో 'వైణవుడు, వైదలకారుడు' అనే మాటలున్నాయి. వేణువంటే వెదురు(బొంగు). దాన్ని చీల్చి బుట్టలల్లేవాడు వైణవుడు. విదలంచేసి అంటే చీల్చి అల్లేవాడు వైదలకారుడు. ఆకులతో, తీగలతో కూడా అల్లినా వెదురుబద్దలతో అల్లడానికే ప్రాముఖ్యమిచ్చి ఈ మాట పుట్టింది. ఈ పనిని తెలుగులో మేదరమనీ, సంస్కృతంలో వైదలమనీ పిలుస్తారు.

కుండలూ బుట్టలూ ఉన్నా శుభాశుభకర్మల్లో ఉపయోగపడక తప్పని మరో వృత్తి మంగలిపని. తెలంగాణాలోని కొన్ని ప్రాంతాల్లో దీన్ని 'కత్తెర పని' అని పిలుస్తారు. ఆ పనిచేసే వ్యక్తి మంగలి. ఈ శబ్దం తెలుగుమాట. మరో మాట లేదు. అయినా కొందరు 'మంగళం' (మంచి, మేలు, శుభం) అనే సంస్కృతపదం నుంచే పుట్టిందంటారు. సంస్కృతంలో దీనికి సమానార్థకం 'నాపిత్యం'. నాపితుడంటే మంగలి. అతడి పని నాపిత్యం. ఆ భాషలో 'నాపిశాల, నాపిగృహం, నాపిలిక' అనే పేర్లతో ఇప్పటి మన 'క్షౌరశాల'లున్నట్లు తెలుస్తుంది నిఘంటువుల ద్వారా. క్షౌరశాల ఇటీవల మనవాళ్లు కల్పించిన సంస్కృతపదబంధం – 'క్షురకర్మ' లాగానే.

మంగలికున్న సంస్కృతనామధేయాలనూ తెలుగువాళ్లు కల్పించిన సంస్కృత సమాసాన్నీ గమనిస్తే ఆ వృత్తి చేపట్టిన వారి స్థితిగతులు ఆయా కాలాల్లో తలకిందులుగా మార్పులు పొందాయని తెలుస్తుంది. భిన్నకాలాల్లో భిన్నప్రాంతాల్లో భారతీయసమాజం ఆ కులవృత్తివారిని భిన్న విధాలుగా మానావమానాల పాలుచేసిందని చెప్పవచ్చు – మాటలనుబట్టి. అవేమంటే "నాపితుడు, క్షౌరికుడు, క్షురి, గ్రామాణి, అంతావసాయి, దివాకీర్తి, ముండి, అంబష్ఠకుడు" వగైరాలు. మొదటి మాట కేవలం చేసే పనిని మాత్రమే చెప్తుంది – క్షురి, క్షౌరికుడు అనే వాటిలాగానే. 'క్షురకుడు' అనేది ఇటీవల వచ్చినమాట. గ్రామాణీ శబ్దానికి 'గ్రామపెద్ద, సేనాధిపతి, గ్రామాధికారి, పెళ్లికొడుకు' లాంటి ఇతరార్థాలనేక మున్నాయి. ఇది ఆ వృత్తి కొకప్పుడున్న సుస్థితిని నిరూపిస్తే 'అంతావసాయి' అందుకు విరుద్ధమైన 'దుస్థితి'ని బయటపెడ్తుంది. ఈ మాటకు 'అంతావశాయి' అనే రూపాంతరముంది. ఈ మాటకు 'ఊరి చివర నివసించేవాడు, తక్కువ కులంవాడు' అనే అర్థాలున్నాయి. దివాకీర్తి అంటే పగలు మాత్రమే కనిపించేవాడని అర్థం. ఆ మాటకు 'అంత్యజుడు, గుడ్లగూబ' అనే అర్థాలున్నాయి. ముండనం అంటే గొరగటం. ఆ పని చేసే వ్యక్తి ముండి. ఒకప్పుడు 'ముండనం మండనం పుంసాం' అని మొగవాళ్లకు బోడితలలే అలంకారమనే మాట వాడుకలో ఉండేది. అంబష్ఠ(క) శబ్దానికి విరుద్ధార్థాలన్నీ ఉన్నాయి: 'ఏనుగులను తోలేవాడు, ఒక దేశాధిపతి, వైద్యుడు, బ్రాహ్మణపురుషుడికీ వైశ్యస్త్రీకి పుట్టిన సంకరుడు' వగైరాలు.

సమాజంలో విలువలు ఎప్పుడెన్నివిధాల మారుతుంటాయో నిరూపించటానికి పైమాటలే ప్రత్యక్ష నిదర్శనాలు. కవి ప్రయోగాలను, శాసన ప్రసంగాలనూ సంపాదించి, వాటికి సాధ్యమైనంతలో కాలనిర్ణయం చేసి, ఆయా రచయితల కాలాలను

నివాస ప్రదేశాలను గుర్తించి, వారు వాడిన పదాల కప్పట్లో ఉన్న అర్థచ్ఛాయలను క్రోడీకరిస్తే కొంతలో కొంతగా సాంఘికచరిత్ర నిర్మాణం సాధ్యమవుతుంది. అయితే ఈ కష్టసాధ్యమయిన పనిమీద ఎవరికి శ్రద్ధాసక్తులుంటాయి? మధ్యయుగాలనుంచి గత శతాబ్దందాకా (ఈ శతాబ్దిలో రెండు మూడు దశాబ్దాల క్రితం వరకూ) మంగలిని తెలుగువాళ్లు 'గ్రామవార్తాపత్రిక' అని సంస్కృతంలో పరామర్శించేవాళ్లు! క్షౌరం అమంగళమనిగాక 'క్షౌరకల్యాణ'మనిపిలిచేవారు. నేటికీ క్షురకర్మ జరిగే తిరుమలమీద 'కల్యాణకట్ట'లున్నాయి.

మరో విశేషం నిన్నమొన్నటిదాకా, ఇంకా మారుమూల గ్రామాల్లోనూ ఆయుర్వేదం, శల్యపరీక్ష అనేవి మంగలివారే పరిరక్షించిన సంప్రదాయవిద్యలు. వాద్యసంగీతం నేటికీ వంశాచారంగా వారిలోనే నిలిచింది. అన్నట్లు డోలు, సన్నాయి, మద్దెల వాయించటం మంచికీ చెడుకూ తప్పనిసరి. వాటి సమూహాన్ని మేళమంటాం. ఇది సంస్కృతపదమే. 'కలయిక' అన్న అర్థం గల మాట. 'తూరి, తూర్యం, వాద్రితం' అనే సంస్కృతపదాలు పర్యాయార్థకాలు. తెలంగాణాలో 'చప్పుడు చేయ'మంటారు; కోస్తాలో 'బాజాలు వాయించ'మంటారు. చిన్నపిల్లలు 'తూతూ వాయించట' మంటారు. వాదించు అనే తత్సమక్రియకు 'వాయించు' అనేది తద్భవరూపం.

'మేళం చేయు, మేళం కట్టు' అనే మాటలున్నాయి. వాటిని సాధారణంగా నాట్యవిషయంలో వాడ్తారు. 'మేళం వాయించటం' మాత్రం మేళగాడిపని. వీళ్లను 'భజంత్రీలు' అంటారు. ఇది తెలుగు మాటకాదు; సంస్కృత నిఘంటువుల్లో కనిపించదు. ఆ భాషలో 'తూర్యత్రికుడు, వాదకుడు, తూర్యవాదకుడు, ఉద్ఘోషకుడు' మొదలైన మాటలున్నాయి. చివరిది మద్దెలవంటివి వాయించేవాడికి పేరు.

మరో ముఖ్యమైన వృత్తి గుడ్డలు కుట్టడం. యంత్రాలు వచ్చేదాకా అది కేవలం చేతిపని. ఆ పనిచేసే వ్యక్తిని పూర్వం 'కుట్రపువాడు' అనేవాళ్లు. ఇప్పుడు 'దర్జీ' అనే ఉర్దూ పదాన్నో, 'టెయిలర్' అనే ఇంగ్లీషుమాటనో వాడ్తున్నాంగాని తెలుగుమాటను ఏనాడో మరిచిపోయాం. దర్జీపనిని సంస్కృతంలో 'సూచీకర్మ' అనేవాళ్లు. సూచి అంటే సూది; కర్మ అంటే పని. బస్తాలు కుట్టడాన్ని ఇలా పిలవరుకాబట్టి నేర్పుగా చేస సున్నితప్పనికే ఈ పేరు వచ్చిందనాలి. ఈ పనిచేసే వ్యక్తిని ఆ భాషలో 'సౌచికుడు, సూచికుడు, తున్నవాయుడు' అనేవాళ్లు. మొదటిరెండు మాటలూ అన్యోన్యం రూపాంతరాలు; సూదిపనిచేసేవాడనే అర్థంలో వచ్చినవే. తున్న శబ్దానికి 'చీలిక, పేలిక' అనేవి అర్థాలు. పెద్దగుడ్డలను చించి కుట్టేవాడు కాబట్టి ఆ పేరువచ్చింది.

★ ★ ★

# శాస్త్రాలూ కళలూ

అవసరంకోసంగాని, వినోదవిజ్ఞానాలకోసంగాని సభ్యసమాజం గుర్తించిన నైపుణ్యాలు మరికొన్ని ఉన్నాయి. వాటిలో మొదటిది వైద్యం. వైద్యానికి 'ఉపచారం, భేషజం' అనేవి సంస్కృతంలో పర్యాయార్థకాలు. మొదటిమాటకు సేవ అనీ, రెండోదానికి భిషక్కు (=వైద్యుడు) చేసే పని అనీ అర్థం. అచ్చతెలుగులో ఏమనాలో తెలియదు. వైద్యం చేసేవాడు వైద్యుడు. ఆ మాటకు 'తెలిసినవాడు' అని అర్థం. ఈ మాటకు ఆ భాషలో 'భిషక్కు, చికిత్సకుడు, అగదంకారుడు, జీవదుడు, రోగహారి, గురువు, శిక్షకుడు, ఆచార్యుడు' వగైరా పేర్లో బిరుదులో ఉన్నాయి. అగదం అంటే మందు. అది చేసేవాడు అగదంకారుడు. అంటే నేటి 'pharmacist' వంటివాడన్నమాట. జీవం అంటే ప్రాణం. ప్రాణమిచ్చేవాడనే అర్థంలో జీవదుడన్నారు. కొందరు ఒళ్లుమండి "వైద్యరాజ! నమస్తుభ్యం, యమరాజసహోదర! యమస్తు ప్రాణాన్‌హరతి, వైద్యః ప్రాణధనానిచ" అని ప్రాణం, ధనం రెండు 'తీసుకొనేవా' డన్నారు కూడా. అచ్చతెలుగులో 'వెజ్జు, మందరి' అనేవి పర్యాయపదాలంటారు గాని మొదటిది వైద్య శబ్దభవం; రెండోది అగదంకారుడనే మాటకే సమానార్థకం.

భయభక్తులు రెండూ అపేక్షించే మరో వృత్తి జ్యోతిషం. జ్యోతి అంటే 'వెలుగు, నక్షత్రం' వగైరా. దీనికి 'నక్షత్రవిద్య, దైవజ్ఞవిద్య, జ్యోతిర్విద్య' అనే ఇతర సంస్కృతపదాలు పర్యాయార్థకాలు. నిజానికి మొదటిదాన్ని ఖగోళశాస్త్ర జ్ఞానమని చెప్పాలి. జ్యోతిషం (జ్యోతిష్యం కాదు) చెప్పేవారిని తెలుగువాళ్ళు జోస్యులంటారు. అది జ్యోతిష – శబ్దభవమేగాని అచ్చతెలుగు కాదు. సంస్కృతంలో దానికి పర్యాయార్థకాలు 'గణకుడు, దైవజ్ఞుడు, జ్యోతిషికుడు, కార్తాంతికుడు, మౌహూర్తికుడు, సాంవత్సరికుడు, దైవచింతకుడు' లాంటివి. గణన అంటే లెక్క. లెక్కించి చెప్తాడు కాబట్టి గణకుడన్నారు. దైవం మన మొహానరాసిన విషయాలు తెలుసుకొని చెప్పేవాడు కాబట్టి దైవజ్ఞుడు. నక్షత్రాలు గణించి చెప్తాడు కాబట్టి జ్యోతిషికుడు. కృతాన్నీ (జరిగినదాన్నీ), అంతాన్నీ (చివరిదాకా జరిగేదాన్ని) చెప్పేవాడు కాబట్టి కార్తాంతికుడు అన్నారు. ముహూర్తాలు చెప్తాడు, పెట్టాడు కాబట్టి మౌహూర్తికుడు. సంవత్సర ఫలితాలు చెప్తాడు కాబట్టి సాంవత్సరికుడు. ఒకప్పుడు చంకన తాటాకుల కట్టలు పెట్టుకొని తిరిగేవాళ్లు రెండురకాలవాళ్లే ఉండేవాళ్లు – వైద్యులూ, జోస్యులూ. ఈ విషయమాధారంగా చెప్పిన సరదాకథలూ చాటువులూ సంస్కృతంలో దొరుకుతాయి.

వృత్తివిద్యలెన్నివున్నా 'లలితకళ'లనే పేరిట ఆరింటిని సమాజం ఆదరించింది – గౌరవిస్తున్నది. అవి 'శిల్పం, చిత్రలేఖనం, నాట్యం, సంగీతం, కవిత్వం' అనేవి. వీటిని తెలుగువాళ్లు సంస్కృతం ద్వారా నేర్చుకున్నారు కాబట్టేమో గాని తెలుగు మాటలు వీటికి సంబంధించినవి అట్టే కనిపించవు – వినిపించవు. ఏదో ఒక వరసలో వాటిసంగతి చూద్దాం. మొదట సంగీతం.

పాట అనేది మాత్రం అచ్చతెలుగు మాట. పాట పాడేవాడు 'పాటగాడు'. ఒకానొక మహాకవి 'తన గీతి తమిళజాతిని పాటకులనుగా దిద్ది వర్ధిల్లిన తెలుగువాణి' అని ప్రస్తుతిస్తూ 'పాటక' శబ్దం వాడేడుగాని 'పాటకులు, పాటకజనం' అనే మాటలు అడుక్కుతినేవాళ్ళకు మాత్రమే అన్వయిస్తాయి. పాటకు సంస్కృతంలో రెండురకాల సమానార్థకాలున్నాయి: పక్షుల పాటయితే 'రుతం, రవం, రావం, కూజితం' అనీ, మానవులు పాడితే 'గీతం, గీతి, గేయం, గానం' అనీ అంటారు. రవం – రావం, గీతం – గీతి – అనేవి పరస్పర రూపాంతరాలు. ఈ మాటలన్నీ నేటి రచనల్లో కనిపించేవే. పాటగాడు శబ్దానికి పర్యాయపదాలని చెప్పదగ్గ సంస్కృతపదాలు 'గాయకుడు, గాయనుడు, గాత' అనేవి. మొదటి మాట సుప్రసిద్ధం. రెండోది కావ్యాల్లో కనిపించేది. మూడోది (సామ)వేదంగాని, మంత్రాలుగాని శ్రావ్యంగా, స్వరపూర్వకంగా చదివే/పాడే వారికి వర్తిస్తుంది. గాత్రసంగీతానికి తోడుగా 'వాయించే' వ్యక్తిని వాదకుడంటారు.

సంగీతం తరవాత చెప్పదగ్గది నాట్యం. నాటకం, నాట్యం అనేవి కలగాపులగంగా ఉండే 'సమాహారకళ'లు. అంటే సంగీతంతో, భరతంతో (=అడుగు వేయటం వగైరాలతో), నటనతో (హావభావ విన్యాసాలతో) ముడిపడ్డ నైపుణ్యాలు. వీటికి సమానార్థకాలైన అచ్చం తెలుగుమాటలున్నట్లు లేదు. కేవలం అడుగులు వేస్తూ, చేతులూ, కళ్ళూ తిప్పుతూ భావప్రదర్శన చేసేవాళ్లని నర్తకులంటారు. వాళ్ళనే 'కుశీలవుడు, శైలూషుడు, నటుడు' అని కూడా పిలుస్తారు. లవకుశులు కుశీలవులై రామాయణ కథను ఆడుతూ, పాడుతూ వినిపించారంటారు. మరికొందరు 'నాగరకుడు, భారతుడు, శైలాలి' అని కూడా పిలుస్తారు. నగరాల్లో ప్రదర్శిస్తారు కాబట్టి నాగరకులన్నారు. భరతమహర్షి పద్ధతిలో ఆడుతారు కాబట్టి భారతులన్నారు. ఈ ఆడటానికి 'లాస్యం, నృత్తం, నృత్యం, తాండవం, పాదన్యాసం, నాట్యం, నటనం' వంటి పర్యాయార్థకాలున్నాయి. కాని 'శాస్త్రం'లో అవి భిన్నాలు. తాళం, లయ మాత్రమే పాటించి పాటలేని ఆట ఆడితే అది నృత్తం. తీవ్రమయింది, వేగంగా చేసేది తాండవం (శివతాండవ మంటారు గాని ఇతరపదాలను వాడరు). స్త్రీలు చేసే సుకుమారమైనది లాస్యం (ఇటీవల కొందరు శివలాస్య మంటున్నారు!). పాటతో కూడింది నృత్యం. కాళ్ల కదలికలు మాత్రమే ఉంటే పాదన్యాసం. హావభావాలను ప్రదర్శించటం నటన. నాట్యమనేది 'నాటకం'తోబాటు పేరుపంచుకున్న మొత్తం కళ. తెలుగులో ఆడేవాళ్లని 'నట్టువుడు/నట్టుకుడు, నట్టు(వ)కాడు, నట్టువాడు' అంటారు. ఈ మాటలు ద్రవిడపదాలేనని కొందరు, సంస్కృతభవాలని కొందరు వాదప్రతివాదాలు చేస్తున్నారు. అది తేలే విషయంగా కనిపించదు.

నాటకం (శాస్త్రప్రకారం 'రూపక'మనాలి. దశవిధ (పదిరకాల) రూపకాలూ ఉపరూపకాలూ శాస్త్రం పేర్కొంటుంది) అనేదానికి 'ఆట' అన్నదే తెలుగు మాట. 'తైతక్క'లనేది తెలుగువాళ్లు పెట్టుకొన్న వెక్కిరింత పేరు. దీన్నికూడా నాట్యమనవచ్చు. నాటకాలు వేసేవాళ్లను కూడా 'శైలూషుడు, నర్తకుడు, కుశీలవుడు' అనవచ్చు సంస్కృతంలో. 'అభినేత, నటుడు' అనీ అనవచ్చు. అభినేత శబ్ద స్త్రీలింగరూపానికే ఇప్పుడు వాడుక ఎక్కువ – అభినేత్రి అని. ఎంత నటుణ్నే

'అభినేత' అని మనవాళ్లనరు. అనకపోగా అది పొగడ్తో తెగడ్తో తేలని 'నటకుడు' అనే బిరుదిచ్చి 'సత్కారిస్తుంటారు'. ఆడవేషం కట్టిన మగవాణ్ని సంస్కృతంలో 'భ్రుకుంసుడు' అంటారు. 'నటి, నర్తకి, అభినేత్రి' అనేవి నటించే స్త్రీలకు మాత్రం వర్తిస్తాయి. అచ్చతెలుగులో 'చిందులు, బొమ్మలాటలు' మొదలైనవి చాలా వున్నాయి. మొహానికి రంగులద్దటం, వేషం కట్టడం నాటకాలు వేసేవారి పని. గజ్జె కట్టడం నాట్యం చేసేవారి ప్రవృత్తి. ఇలాంటి పదబంధాలూ నుడికారాలూ చాలావున్నాయి తెలుగులో.

శిల్పం లలితకళల్లో ఒకటి. తెలుగులో దానికి 'చెక్కడప్పని' అన్నదే సమానార్థకం. రాళ్లు చెక్కినా, కొయ్య చెక్కినా అది చెక్కడమే. సంస్కృతంలో కూడా వడ్రంగానికీ రాళ్లు చెక్కడానికీ సమానపదాల వాడుక కనిపిస్తుంది: తక్షణం, ప్రతిమాకరణం, మూర్తికరణం అనేవి. తక్షణానికి త్వక్షణమనే రూపాంతరముంది. శిల్ప శబ్దం సాధారణపదం. నేర్పుతో చేసే ఏ పనయినా శిల్పమే. అయితే శిలా శబ్దానికీ శిల్ప శబ్దానికీ ధ్వన్యర్థ సంబంధముంది కాబట్టి రాతిచెక్కడానికి శిల్పమనే రూఢ్యర్థం, రూఢరూపం వచ్చాయి. ప్రతిమ, మూర్తి, విగ్రహం మొదలైనవి 'బొమ్మ'కు సంస్కృతంలో సమానార్థకాలు. శిల్పిని 'త్వష్ట, తక్షుడు, తక్షకుడు' అని కూడా పిలుస్తారు – వడ్రంగినిలాగానే.

బొమ్మలు గీయటం/వేయటం, వాటికి రంగులద్దటం అనే నైపుణ్యానికి 'చిత్రకర్మ, చిత్రక్రియ, చిత్రవిద్య, ఆలేఖ్యం' అనే పేర్లున్నాయి సంస్కృతంలో. ఆలేఖ్యమనేది బొమ్మలు గీయటానికి వర్తిస్తుంది. ప్రాచీన భారతదేశంలో అంతఃపురాంగనలకూ నర్తకులకూ ముఖంమీద రకరకాలుగా రంగులద్దటం అలంకరణగా ఉండేది – ముఖ్యంగా ఇప్పటి కథాకళి పాత్రలకులాగా. అలా శరీరానికి అద్దిన రంగులను "పత్రరేఖ, పత్రరచన, పత్రావళి" అనేవాళ్ళు. చిత్రరచన చేసే వ్యక్తిని 'చిత్రకారుడు, చిత్రకుడు, చిత్రలేఖకుడు, చిత్రకృత్తు, ఆలేఖకుడు, రంజకుడు, తౌలికుడు' వగైరా పేర్లతో పిలిచేవారు. చిత్రంగా – ఆశ్చర్యకరంగా – ఈ పని చేస్తారు కాబట్టి చిత్ర శబ్దంతో చేరిన రూపాలేర్పడ్డాయి. రంగుబొమ్మలు గీసేవాడు చిత్రలేఖకుడైతే, మామూలు బొమ్మలు గీసే వ్యక్తి ఆలేఖకుడు. రంజకుడు కేవలం రంగులద్దే, రంగులు వేసే వ్యక్తి. తూల అంటే కుంచె. కుంచెను వాడే వ్యక్తి కాబట్టి తౌలికుడనే పేరు వచ్చింది.

ఇక మిగిలిన ఆరో లలితకళ కవిత/కవిత్వం అనేది. ఇది సంస్కృతపదం. (మాటలో పాటలో) అల్లేవాడు అనిమాత్రమే తెలుగులో చెప్పగలం కవిని. ఆ శబ్దం మంచి పుట్టిన తద్భవరూపం కయిత అనేది. అది రాసే కవిని అచ్చతెలుగు కవులు 'కయి' అనేవాళ్లు. 'ఏమి తిని సెపితివి కపితము' అనే రామలింగడి ఆక్షేపణలో పకారమధ్యరూపం వినిపిస్తుంది. ఇది కూడా వైకృతపదమే.

★ ★ ★

# ఉపసంహారం

ఈ విధంగా పదాలనూ వాటి సమానార్థకాలనూ చెప్తూపోతే ఏళ్లూ పూళ్లూ చాలవు. చెట్ల, తీగల, పొదల పేళ్లూ, పశుపక్ష్యాదుల పేళ్లూ, ఇతర ఆహారపదార్థాల పేర్లూ, అన్నిటికన్నా దేవీదేవతల సహస్రనామాలూ రాసుకుంటూపోతే ఇసకపాతర తవ్వినట్లే అవుతుంది. పైగా సమాసపదాల్లో విభిన్న దేవతలను వర్ణించడం కవులకు పరిపాటి. నిఘంటువుల్లో ఒకేమాటకు చాలామంది దేవతల పేర్లు భిన్నార్థాల్లో కనిపిస్తాయి. అమూర్త వస్తువుల, భావాల విషయంలో దీనికిది సమానార్థకమనీ, పర్యాయపదమనీ విస్పష్టంగా తేల్చిచెప్పడం దుష్కరం. అన్ని మాటలకూ వ్యుత్పత్తి నిర్దేశం సాధ్యం కాదు. నిఘంటువుల మధ్య, భిన్నదృక్పథాలున్న వ్యాకరణాలమధ్య ఏకాభిప్రాయం సర్వత్రా కనిపించదు. ఒకే విషయాన్ని తమతమ అనుభవాలనుబట్టి, సంస్కారాన్నిబట్టి, కొన్ని సమయాల్లో అభిరుచులనుబట్టి ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా వ్యాఖ్యానిస్తారు. ఎవరికివారు తాము చెప్పిందే వేదమనుకుంటారు. ఇతరాభిప్రాయాలు అజ్ఞానమయాలంటారు. కొన్ని సందర్భాల్లో సరదాకో, నలుగురికీ నచ్చేట్లు చెప్పాలనో కొన్ని జానపద వ్యుత్పత్తులను సృష్టిస్తారు – ఉదాహరణకు 'ఆడది' అంటే పెళ్లయిన తరువాత, 'ఆడ'కు – అంటే అత్తగారింటికి – చేరేది అని చెప్పినవాళ్ళున్నారు. ప్రాచీన ద్రావిడంలో ఆళ్/అణ్ అనే రూపాంతరాలున్న ఒక్కమాట స్త్రీపురుష సమానవాచకంగా ఉండేదనీ, పెరుమాళ్/పెరుమాళ్ళు వంటి శబ్దాల్లో చివర ఉన్న 'ఆళ్' అలాంటిదేననీ, ఆడది అనే శబ్దం 'అఁడుది, అణ్డుది' అనే పూర్వపూర్వరూపాల నుంచి ఏర్పడ్డదనీ అంటే అదంతా కల్పితమని కొట్టివేసేవారూ ఉన్నారు. ప్రాచీన తెలుగు శాసనాల్లో 'దేవాండి, భూమాండి, పెరుమాండి' వగైరా వ్యక్తినామాలు కనిపిస్తాయనీ, వాక్యంలోని క్రియారూపాన్నిబట్టి ఆ పేర్లు ఒకసారి స్త్రీవాచకాలుగా మరోసారి పురుషవాచకాలుగా ఉండేవని తెలుస్తుంది. అయితే బహుగ్రంథ పరిచయంతోబాటు, ప్రాచీన శాసనాలనూ, భిన్నభాషల్లో భిన్న లక్షణాలతో వచ్చిన నిఘంటువులనూ, తులనాత్మకాధ్యయనంవంటి ఇటీవలి శాస్త్ర పద్ధతులనూ తెలుసుకొని, అలవరచుకొనే తీరికా ఓపికా చాలా కొద్దిమందికే ఉంటాయి. వారు మాత్రమే ఈ యావద్వ్యవహారంలోని కష్టసుఖాలను గుర్తించగలరు. ఏదోఒక విశ్వాసానికో పద్ధతికో కట్టుబడ్డవారికి భాషకున్న సమగ్ర స్వరూపంగాని, దాని ప్రయోజనంగాని తేటపడవు; భాషాదురభిమానం పోదు; భాషాభిమానం నిలవదు.

సహస్రాబ్దాల చరిత్రగతిలో భాషలో రక్తంలో సాంకర్యమేర్పడితీరుతుంది. వాణిజ్య వ్యాపారాల వల్ల, ఆదాన ప్రదానాలవల్ల, సాంస్కృతిక సంబంధాలవల్ల భిన్నభాషల పదాలు మొదట సంసృష్టమై తరవాత సంకరమైపోతాయి. సుదూర భావికాలంలో

ఆ సాంకర్యం ఎంతగహనమయిందో తెలుసుకోవటం ఒక్కోసారి సాధ్యమూకాదు. లిఖితసాహిత్యాన్ని జాతిశత్రువులు ధ్వంసం చేసినా, కాలప్రభావంవల్ల అనేక సాంస్కృతిక చిహ్నాలు మరుగుపడినా, భాషలో పూర్వస్మృతులు ఎక్కడో అక్కడ నిలిచిపోతాయి. భాషాధ్యయనం శాస్త్రీయంగా సాగితే పూర్వసంస్కృతిని పునరుద్ధరించటం సాధ్యమవుతుంది. గత భాషాసమాజం ఎన్నెన్నివిధాల తన ఆచారవ్యవహారాలను మార్చుకొని ఇప్పటికేరీతిలో వ్యవహరిస్తున్నదో తెలుస్తుంది. అంటే మాటలకున్న పరస్పర సంబంధాలు, మాటలకూ అర్థాలకూ మధ్యనున్న అన్యోన్యం, ఏమాట ఏ అర్థచ్ఛాయను స్పష్టంగా తెలియజేస్తుందన్న విశేషం, నిజంగా పర్యాయపదాలుండవన్న వాస్తవం, మాటలకు వ్యుత్పత్తులనేవి వ్యాకరణకర్తలు కల్పించినవేగాని సహజసిద్ధం కావన్న సత్యం, మహామేధావులూ కవులూ ఆచి తూచి ఏ మాటను ఏ విస్పష్టార్థంలో వాడేరో తెలియటం ఇవి మాత్రమే భాషాధ్యయనానికి గమ్యాలు కావు. సాంఘికచరిత్రనూ గత సంస్కృతినీ పునర్నిర్మించటం కూడా సాధ్యమే. ఈ వ్యాసపరంపరవల్ల కొందరిలోనయినా ఇన్నివిధాలుగా భాషాధ్యయనం చేయవచ్చున్న విశ్వాసం, అందుకు ప్రేరణా కలిగితే అదే పదివేలు. సెలవు.

* * *